# సాహిత్యోపన్యాసములు




ప్రచురణ.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము - హైద్రాబాదు - 4

# సాహిత్యోపన్యాసములు

౽




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము - హైదరాబాదు - 4

కాశీనాధుని నాగేశ్వరరావు

# పరోపకార పారీణత

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

## I

"డబ్బుకంటే ముందు ఖర్చు, ఖర్చుకంటే ముందు సంపాదన, అన్నిటికంటే ముందు భావాలూ, ఆ ప్రకారము వారి జీవితము యావత్తూ విశ్రాంతిలేని పరుగూ, విరామము లేని జీవయాత్రా. తనకు మాత్రము ఎట్టి సౌకర్యమూ కోరని స్వార్థ రాహిత్యంతో ఉండే వారు - ఎప్పుడూ అప్పులకూ, వడ్డీకీ భయపడే వారుకారు 'అంతా రాముడే చూచు కొంటాడు.' అనే వారు అంత రామ భక్తి!"

ఈ విధంగా శ్రీ నాగేశ్వరులను గూర్చి పలికినది ఆంధ్రనాయకాగ్రేసరులలో మేధా సంపత్తికి అసమానుడని యావద్భారత ఖ్యాతి పొందిన శ్రీ పట్టాభి సీతారామయ్యగారు పట్టాభిగారు శ్రీ నాగేశ్వరులకు ఎన్నో సారులు అప్పు పెట్టినవారు కనుక ఆ విషయాలు వారికి బాగా తెలిసి ఉండవలె. ఆ మేధావి మాటలే మరి కొన్ని వినండి.

"తన కింది ఉద్యోగులు తప్పు చేసినట్లు ఎవరేమి చెప్పినా శిక్షించే వారు కాదెవరినీ. 'అదంతా నా కర్మ' అనే వారు జీవితంలోనే కాక వర్తకంలో కూడా నిజాయితీ అవసరమని పాటించే వారు - నాగేశ్వరరావుగారు అమృతాంజన నిర్మాతలుగా కంటే, ఆంధ్రపత్రికాధిపతులుగా కంటే, పరోపకార నిరతికీ మానవ సేవాభిలాషకూ, దయార్ద్ర హృదయమునకూ, నిష్కల్మష వర్తనమునకూ ఎక్కువగా స్మరింప దగిన వారు! అటువంటి పరోపకార పారీణుని శత వార్షిక జయంతి మనము జరుపుకొంటూ ఉన్నాము

బోధింపము యథాశక్తిగా వారి ఉన్నతాశయాలకు ప్రోదిచేయడానికి ఉత్సుకల మౌతాము. ఈ రోజున ఈ మూడు విధములైన పుణ్య శుభాలూ నాకూ, శ్రోతలైన మీకూ ప్రాప్తించే అవకాశమిచ్చినందుకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి కృతజ్ఞత తెలుపుతున్నాను

శ్రీ నాగేశ్వరరావులు విశ్వదాత అని జగత్ప్రసిద్ధి పొందినారు. వారి దానాలలో ప్రధానము ప్రస్తావితమైనది వారు స్థాపించి ఉండగా వారివల్ల నేను స్వయముగా, గాని కూడా, వారితో పరిచయము పొందిన వాణ్ణి కాను. కాని వారి పత్రికలూ వస్త్రాల వల్ల ఆంధ్రలోకమంతటి వలెనే నేనూ వారి విజ్ఞాన దాన మనుభవించిన వాణ్ణే. వంది మాగధ వర్గములోని వాణ్ణి కాను

ఇప్పుడు మీరంతా ఎదుట కూర్చుని ఉన్నంత ప్రత్యక్షంగానే స్వర్గ సుఖమనుభవిస్తున్న నాగేశ్వరరావులు కూడా, వారి మిత్రులైన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి వంటి ఆప్తులతో కలిసి ఎదుట కూర్చుని ఆలకిస్తూ, పరస్పరము గుసగుసలాడుతూ చిరునవ్వులు చిందిస్తున్నట్లే భావిస్తున్నాను. అది భావనా మాత్రమే కాదు. అనుభవమంటే నమ్మండి. ఆ అనుభవంతో వారి జీవితాన్ని, వారు చేసిన పరోపకారాన్ని మీ ఎదుట ఉన్నదున్నట్లు దీక్షామాత్రంగా ప్రస్తావించడానికి ఉపక్రమిస్తున్నాను.

## II

శ్రీ నాగేశ్వరరావులు జన్మించినది 1-5-1867 ప్రభవ చైత్ర ద్వాదశి. ఎలకుర్రు అనే అగ్రహారంలో, కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా.

ఆలోచించగా గత శతాబ్దము ఉత్తరార్థంలో భరత దేశంలో జన్మించినంత మంది మహా పురుషులు, ధీరోదాత్తులూ, పరోపకార పారీణులూ మరే అర్ధ శతాబ్దంలోనూ అవతరించినట్లు తోచదు. ఇప్పుడు మనం దేశమంతటా శతవార్షిక జయంత్యుత్సవాలు జరుపుకొంటున్న మహా మహులే కాక వారికి అండగా నిల్చిన ఎందరో మహా వీరులు విస్మృతులైన వారు కూడా జన్మించి

నారు రాత్రివేళలలో నిర్మలాకాశము వంక దృష్టి సారించేవారు మధ్య మధ్య గుంపులు గుంపులుగా నక్షత్రాలు నేలమీద రాలడం చూచే ఉంటారు. దివ్య లోకాలలో నుంచి మన లోకాన్ని ఉద్ధరించడానికి అవతరించే పుణ్యమూర్తుల జ్యోతి స్వరూపాలవి. భారతీయ ప్రజ చరిత్రలో ఎన్నడూ ఎరగని సంతతి క్రూర పరిపాలనము అనుభవిస్తూ ఆక్రోశించగా ఆ ఆర్తనాదము స్వర్గ భూములలోనికి చొచ్చి కరుణా పూర్ణ హృదయులైన దివ్యమూర్తులను గత శతాబ్దపు ఉత్తరార్ధములో ఆ రూపంగా అవతరింప చేసింది.

బ్రిటిష్ వారికి పూర్వము మన దేశము మీదికి విదేశీయులు ఎందరెందరో దండయాత్ర చేశారు వారంతా మన దేశమే స్థిరనివాసము చేసికొని కాల క్రమాన మన లోనే కలిసిపోయి మన ధర్మానికీ సంస్కృతికీ బలము చేకూర్చినారు. శకులు వచ్చి శక సంవత్సర మానమూ, బహుళః లిపి మనకిచ్చినారు స్కిథియనులు కలసి, సుక్షత్రియులై రాజపుత్ర స్థాన నివాసులై ముసల్మానులను ప్రతిఘటించినారు. ముసల్మానులు కూడా మన దేశమే నివాసము చేసికొని మనతో కలసిపోతూ ఉన్నారు. అది మొగలాయీల కాలంలో బలపడుతూ వచ్చింది ఆగ్రాలో షాజహాన్ కాలంలో రాజ దర్శనము కానిది భోజనము చేయమనే దీక్ష కల ఒకజాతి హిందువులుండే వారని తెలియని వారు ఉండ వచ్చును. వంగదేశము, పంజాబు వరకూ కూడా వ్యాపించిన మహారాష్ట్ర రాజ్యబలము ఢిల్లీ సుల్తానును రక్షించుటకే పోయి అహమ్మద్‌షాను ఎదుర్కొని, మూడవ పానిపట్టు యుద్ధములో పొందిన అపజయము వల్లనే పెద్ద దెబ్బతిన్నదని మనము గుర్తుంచుకోవలెను. మళ్లీ 1857 వ సంవత్సరము స్వాతంత్ర్య సంగ్రామము నడిపించిన వారు భారత ప్రభువుగా ప్రకటించినది మొగలు వంశస్థులే అని మనము గుర్తుంచుకోవలెను. ఆ సంగ్రామములో అగ్రగాములు మహారాష్ట్రులు, అయోధ్య హిందువులు, కొద్ది మంది ముసల్మానులు. ఇట్లా కలిసిపోతున్న మహమ్మదీయులను కలవకుండా చేసినది బ్రిటిష్ వారి కూట నీతియే

ఇందరూ మనలో కలసిపోయినా చివరకు వచ్చిన బ్రిటిషువారు కొన్ని వేలమైళ్ల దూరంలో ఉండి పరిపాలన చేస్తూ ఉన్నందువల్ల మనలో కలియ లేదు. వారిశక్తి ప్రచండమైనది. యుక్తి అఖండమైనది. మనలను దోచు కుంటూ అది మన మంచికే అనిపించినారు. మనలను నిర్వీర్యులను చేస్తూ శాంతి నెలకొల్పినా మన్నారు. మనకు బ్రిటిష్ ప్రభుత్వమువల్ల కల్గిన దారి ద్ర్యము మరే ప్రభుత్వ కాలములోనూ కలుగలేదు. ఇప్పటికి కూడా విజృం భిస్తున్న కుల, మత, భాషా రాష్ట్రాది విద్వేషాలన్నిటికీ వాళ్లు నాటిపోయిన కూట నీతి బీజాలే మూలకారణమని మన మింకా గ్రహించ వలసి యున్నది.

మనకే తెలియని బానిసత్వములో నుండి బయటికి లాగి దేశానికి స్వాతంత్ర్యము సంపాదించే దెట్లాగు ? అధోగతిలోనున్న భారతజాతిని, సంస్కృతిని ఉద్ధరించే దెట్లాగు ? ఈ ఉత్కంఠతోనే మహాదీక్ష వహించిన పుణ్య పురుషులు స్వాతంత్ర్య సంగ్రామానికి కొంచెము ముందు వెనుకలుగా ఉదయించారు.

బ్రిటిష్ మిలిటరీ బలాన్ని ఎదిరించే శక్తి మనకు లేదు. కొందరు బ్రిటిష్ వారితో మంచిగా ఉండి వారి బుద్ధిని మార్చడానికి ప్రయత్నించారు. మరి కొందరు ప్రజలలో సర్వతోముఖమైన ప్రబోధము కలిగించి, బ్రిటిష్ తంత్ర స్వరూపము ప్రదర్శించినారు. కొద్ది మంది హత్యలు, తిరుగుబాట్లు చేసి ప్రాణాలర్పించారు. ఈ మహా ప్రబోధాన్ని ప్రపంచ చరిత్రలో మును పెన్నడూ కనీ వినీ ఎరుగని సత్యాగ్రహ సమరంగా రూపొందించడం మహా త్ముని వంటి అపార బుద్ధిశాలికే సాధ్యమైనది. కాలము కూడా కలసి వచ్చి నది రెండు మహాసంగ్రామాలతో బ్రిటిష్‌వారి ప్రభ అణగినది. ఇక మనకు స్వాతంత్ర్య మీయడమే తమకు క్షేమమని నిశ్చయించి విధి లేక ఇచ్చి వెళ్లి నారు. వెళుతూ కూడా రెండు ముక్కలుచేసి, ప్రతి ముక్కలోనూ కొన్ని వందల అల్‌స్టర్లు సృష్టించి వెళ్లినారు

నూరేళ్ళనాటి భారతదేశం కాదు నేటిభారత భూమి ఈ 20 ఏళ్ళ స్వాతంత్ర్యముతో ప్రపంచములోని మొదటి ఏ పది పన్నెండు దేశాలలోనో శక్తిలో స్థానము సంపాదించుకొన్నాము. కాని ఇది చాలదు ఇంకా సహస్ర గుణంగా విజృంభించి ప్రపంచమంతా ప్రతిఘటిస్తున్నా, ప్రథమ స్థానము బలవంతంగానైనా ఆక్రమించి, ఈ లోకాన్నంతటినీ శాంతి సంపదలకు ఉన్ముఖము చేయవలెనని మాబోటి వృద్ధుల ఆకాంక్ష ఏ దీక్షతో గత శతాబ్దము ఉత్తరార్ధంలో పుట్టిన మహానుభావులు మనకీపాటి వికాసమూ, విజ్ఞానమూ, స్వాతంత్ర్యమూ ప్రసాదించి మనలను నలుగురిలో తలఎత్తుకొని నిలిచేట్లు చేసినారో, అటువంటి దీక్షతోనే ఈ అర్ధశతాబ్దంలో పుట్టినవాళ్ళు, పుట్టేవాళ్ళు ఉపక్రమించి మేము కంటున్న కలలు ప్రత్యక్షం చేస్తారని ఆశిస్తున్నాము. ఇటువంటి శత జయంత్యుత్సవాలు ఆ ఆదర్శంతోనే చేస్తున్నామనుకొందాం ముఖ్యంగా ఈ శతాబ్దం ప్రథమ సంగ్రామానంతరము ప్రథమార్ధంలో జన్మించినవారిలో ఆ ఆదర్శబుద్ధి మా బోంట్లకు అంతగా కనబడటంలేదు అందుకు వారిని నిందించము అది ప్రకృతి తీసుకొనే విశ్రాంతి. తండ్రి సంపాదించిపెట్టిన ఆస్తిని సుఖంగా అనుభవిద్దామనే వారి అలసత. మళ్ళీ ఇప్పుడు లోకమంతా రాక్షసబలము సర్వతోముఖంగా విజృంభించి సర్వనాశనము చేసేందుకు సిద్ధముగా ఉన్నది దానితో మనమూ, మన సంస్కృతి మసియై పోతుంది మానవజాతే నశించే ప్రమాదం ఉన్నది గత శతాబ్దము ఉత్తరార్ధంలో పుట్టిన మహాపురుషులు భారతదేశాన్ని, ధర్మాన్నీ ఉద్ధరించినట్లే, ఈ అర్ధ శతాబ్దంలో పుట్టుచున్న వారు ఇంకా మహత్తరులై లోకాన్నంతటినీ ఉద్ధరిస్తారు గాక !

## III

ఈ విధంగా గత శతాబ్దం ఉత్తరార్ధంలో మన ఆంధ్రదేశంలోకూడా ఉత్తమ సంస్కర్తలు, కవులు, కళాకారులూ, గాయకులూ, విజ్ఞానవేత్తలూ వీరులూ, త్యాగమూర్తులూ, పరోపకార పరాయణులూ జన్మించి, ఈ భూమిని

వికస్వరముచేసినారు. కాని వారందరిలో ఆంధ్రులకు వివిధ రంగాలలో నిరుపమానమైన సేవచేసినవారిలో అగ్రగణ్యుడు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు. ఆయన ఆంధ్ర కేసరివలె గర్జింపడు దేశభక్తునివలె ముందుకు ఉరకడు. ఆంధ్ర రత్నమువలె సర్వజనాకర్షణ చేయడు. మన శరీరాలలో ప్రాణ వాయువు 21,600 పర్యాయాలు చరిస్తుందని యోగులు లెక్కలేస్తున్నారు. మనము మేలుకొనిఉన్నా నిద్రపోతున్నా అది సాగుతునే ఉంటుంది కాని దాన్ని మనము గమనించము. శ్రీ నాగేశ్వరులు ఆంధ్రజాతికి ఆ ప్రాణ వాయువు వంటివారై ముప్పైసంవత్సరాలు నిరంతరాయంగా సర్వాంగాలకూ ప్రాణంపోసి నిలబెట్టినారు

శ్రీ నాగేశ్వరులు జన్మతః ఆరాధ్యులైనా వారి ఇష్టదైవము శ్రీరామ చంద్రుడు. పైన ఉదహరించిన శ్రీ పట్టాభిగారి మాటలలో వారికిగల రామ భక్తి విన్నాము. తమ రచనలలో వారు తరుచుగా శ్రీరామ స్మరణచేస్తారు. 'ఆంధ్రుల కుపాస్య దైవమైన శ్రీరాముడు కర్మయోగి జ్ఞానయోగి. రెండు యోగములను సమన్వయము చేయుటయే విశ్వకల్యాణమునకును, ఆంధ్రాభ్యుదయమునకును సాధనములు', అని వా రొకచోట వ్రాసినారు

నల సంవత్సరాది సంచిక(1916)కు ముఖచిత్రముగా శ్రీ సీతారాములది ప్రచురించి దానినిగూర్చి ప్రస్తావనలో ఇట్లా వ్రాసినారు.

ఆ పదామపహర్తారం దాతారం సర్వ సంపదామ్
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్.

శ్రీ సీతారాములు పురాణదంపతులు, లోకకల్యాణకరులు, దివ్యమంగళ స్వరూపులు, అవతారమూర్తులు, ఆరాధనయోగ్యులు... శ్రీరాముడు మహాపురుషుడు, ధీరోత్తముడు, ధర్మ ప్రవర్తకుడు, నిగ్రహానుగ్రహ సమర్థుడు, దుష్ట సంహారకుడు, శిష్ట సంరక్షకుడు. ఆపదలను గడువంబెట్టి శుభంబుల నొడగూర్చెడి శ్రీ సీతారాముల మూర్తులు ముఖ పటమునందు ముద్రితములు.

"సీతారాముల పూతచరిత్రము ధర్మారాధనమునకు పరమ ప్రమాణము, ధర్మజ్ఞాన మతిదుర్లభము, ధర్మారాధనముదురారాధ్యము ధర్మమతిసూక్ష్మము, విశాలము. మానవ వికాసమునకు ధర్మము సాధనము, ప్రాణము... శ్రీరాముని సర్వావస్థలయందు త్యాగము పరిస్ఫుటము... జాతీయ జీవనము నందు ధర్మ ప్రాబల్యము నుపపాదించుటకై మంగళకరులైన శ్రీ సీతా రాముల చిత్రపటము ముఖపటముగా ముద్రింపబడినది"

శ్రీరామ భక్తుడైన నాగేశ్వరులలో శ్రీరామ భక్తాగ్రేసరుడైన జగత్ప్రాణ నందనుని లక్షణాలు ఎన్నో ఉన్నవి. ఏ పనికీ తానని ముందుకు రాడు. అందరినీ ప్రోత్సహిస్తాడు అందరూ తన్నికోరితే తానేపోయి ఆ పని సర్వం కషంగా నిర్వహిస్తాడు. ఆయన కోతికాడు, కాంచనాద్రి కమనీయ విగ్రహుడు, శ్రీ నాగేశ్వరులూ, ఆంధ్రకేసరీ యౌవనములో స్త్రీ పాత్రలు ధరించి ప్రేక్షకులను రంజింప చేసేవారు, ఆంజనేయధ్యానములో,

'మనోజవం మారుత తుల్య వేగమ్
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథ ముఖ్యమ్
శ్రీరామ దూతం శిరసా నమామి.'

అంటున్నాము. ఆ లక్షణాలు మానవమాత్రులకు ఎంతవరకు సంక్రమించగలవో అంతవరకూ శ్రీ నాగేశ్వరులకు సంక్రమించినవి.

ఆంజనేయుడు శివ వీర్య సముద్భూతుడు కనుక శివావతారుడే. కాబట్టే శ్రీ నాగేశ్వరులు శివోపాసకులైన ఆరాధ్యకుటుంబంలో జన్మించారు.

## IV

శ్రీ నాగేశ్వరులు విశ్వదాతయేకాని నిరుపేద కుటుంబంలో పుట్టినారు. తండ్రిగారికి ఉన్న 30 ఎకరాల భూమిలో సంవత్సరానికి వచ్చే నికరాదాయము

30 రూపాయలు మాత్రమేనట! వారు బందరులో చదువుతుండగా ఒకనాడు కాని ఇచ్చి మార్కెట్టుకు పంపగా అది పోయినది. ఆ కానీ పోయినందుకు వారానాడు పడ్డ యమబాధనుగూర్చి ప్రస్తావిస్తూ 'ఆ రోజు నాకొక కానీ దొరికితే కలిగే ఆనందము ఈనాడు పదివేలు లభించినా కలుగదు' అనేవారట. దీనినిబట్టి వారు చిన్నతనములో దారిద్ర్యమువల్ల ఎన్నెన్ని బాధలు అనుభవించి ఉంటారో ఊహించుకోవచ్చును.

ఇటువంటి దారిద్ర్యానికి చాలామంది క్రుంగిపోతారు. నాగేశ్వరులో, తీవ్ర తపస్సుచేసి ధనము వెల్లి కొల్లలుగా సంపాదించి దానితో దారిద్ర్యముతో బాధపడుతున్నవారిని ఎన్నెన్ని విధాలనో ఉద్ధరించారు. తాను పడ్డ దారిద్ర్య బాధ ఇతరులు పడకూడదని వారి ఆకాంక్ష. దారిద్ర్యము సామాన్యులను పిసినగొట్టులను చేస్తుంది: ధీరులైన నాగేశ్వరులను విశ్వదాతను చేసింది.

ఆయన దేశోద్ధారకుడే కాని పుట్టిన కుటుంబము పూర్వాచారాల పట్టుదలలకు ఆట పట్టైన ఆరాధ్యులది. తండ్రి బుచ్చయ్య అయ్యవార్లంగారు పండితుడు, షట్కాల శివపూజా దురంధరుడు. కోపంవస్తే కఠినంగా శిక్షించే వాడు. ఒకసారి చిన్నతప్పుకే నాగేశ్వరులను స్తంభానికి అంటగట్టి బాదినారట. ఆయనకు ఇంగ్లీషు చదువు చదివించటమే ఇష్టములేదు నాటకాలలో వేషము వేయటం అసలు ఇష్టములేదు. వారు పెట్టినపేరు నాగలింగం

ఆయన కళాప్రపూర్ణుడే, బహుకళా ప్రపూర్ణుడు కూడాను ఆయన చదువు ప్రారంభించినది ఎలకుర్రులో నిడుమోలు కాంతయ్యగారి వీధిబడిలో. సంస్కృతము, ఆంధ్రమూ తల్లి ప్రోద్బలమువలన ఇంగ్లీషు చదివినా చివరకు బి. ఏ పరీక్షకూడా పూర్తిచేయలేక పోయినారు చిన్నప్పుడు పఠించిన శతకాల ప్రభావము జీవితాంతమూ ఉన్నది. అందువల్లనే శతక సంపుట పీఠికలో ఇట్లా అన్నారు. "కొంతకాలమునకు బూర్వము శ్రావ్యమైన శతక సంకీర్తన మాంధ్రగృహములందు జరుగుచు నాంధ్రహృదయ వికాసమునకు

దోడ్పడుచుండెడిది. ఇప్పుడాస్థితి అంతయును మారినది. విద్యాలయము లందును గృహములందును శతక పఠన మపురూపమైనది ఆరంభ విద్యాభ్యాసమునందు కాకి, పిల్లి కథలు ప్రబలినవి ఆంధ్ర హృదయములందు, భక్తిరస ప్రభావము శుష్కించుచున్నది."

వంశ పారంపర్యా వచ్చిన ధోరణిలో ఆయన జీవితము జరిగి ఉంటే నాగలింగం అయ్యవార్లంగారుగా జీవితము పూర్తిచేసి ఉండేవారు. అప్పుడూ పుణ్య జీవితము గడిపి ఉండేవారే దాని దారిన అదీ గొప్పదే. కాని కళా ప్రపూర్ణుడని మనమీనాడు స్మరించే వాళ్ళముకాదు.

మరి మార్పు ఎట్లా వచ్చినది ? అసలు మొదటిది స్వతస్సిద్ధముగా మహాపురుషులలో పట్టినా ఆగకుండా ఉద్బుద్ధమయ్యే ఆవేదన రెండవది వారి తల్లిగారి ప్రోద్బలమువల్ల ఆంగ్ల పాఠశాలలో చేరటము మూడవది వారి బాల్య, యౌవన మిత్రుడైన శ్రీ వారణాసి రామబ్రహ్మముగారి ద్వారా లభించిన శ్రీ కందుకూరి వీరేశలింగంగారి వివేకవర్ధినీ పత్రికాదుల పఠనం

వారికి ఆదర్శ జీవనము గడపటానికి ఎక్కువ ప్రభావము చూపిన మహనీయులు ముఖ్యముగా ముగ్గురు లేక నలుగురు. ప్రథమ యౌవనములో వీరేశలింగం పంతులుగారూ వారి వివేకవర్ధనీ, ప్రౌఢదశలో శ్రీ బాల గంగాధరతిలక్ వారి కేసరీ, పరిపూర్ణ దశలో మహాత్మాగాంధీ, వారి జీవితమూ – ఈ ముగ్గురికీ తోడు కొంత శ్రీ రెంటాల సుబ్బారావుగారి ప్రభావము కూడా ఉండీ ఉంటుంది వారప్పుడు చెన్నపట్టణములో హైకోర్టు వకీలు, మందుల వ్యాపారి, పత్రికా సంపాదకుడు, గ్రంథకర్తా గ్రంథ ప్రకటనకర్తా. పింతో ఉపజ్ఞ కల మేధావి వారి మేనగోడలైన రామాయమ్మగారినే తల్లి ఇష్టము లేకుండా కూడా వివాహ మాడినారు. ఆ వివాహానికి వెళ్ళిన పెళ్ళి పెద్దలు నాగేశ్వరుల మిత్రులైన శ్రీ కొండా వెంకటప్పయ్య – ఇత్యాదులు మాత్రమే. ఆమె ఆరువేల నియోగుల కుటుంబములో పుట్టినది. జీవితాంతము [illegible] చేయలేదు కొద్ది రోజులు మాత్రము రెంటాలవారి ఇంట్లో

నాగేశ్వరులు ఉండిరికాని త్వరలోనే వదలినారు. ఐనా మందుల వ్యాపారము చేయవలెననే సంకల్పము సుబ్బారావుగారి వలననే కలిగి ఉంటుంది

నాకు సందేహము మన పౌరాణికులు చెప్పే దానిని బట్టి రాబోయే మన్వంతరములో బహ్మ కాబోయేది హనుమంతుడే. శ్రీరామ ధర్మానికి కార్యనిర్వాహకుడు (Executive head) హనుమంతుడే: రామ కార్యానికి అధినేత. ఆయనకు సహస్రముఖాలైనా ప్రసిద్ధమైనవి పంచముఖాలు. పూర్వముఖము వానర రూపము మంత్రవేత్తల కది కోటిసూర్యసమ ప్రభము. దక్షిణముఖము నారసింహము దుష్ట శిక్షణము, శిష్ట రక్షణమూ చేసేది పశ్చిమము విషహరమై సంజీవిని ప్రసాదించే గారుడ ముఖము ఉత్తరము భూమి నుద్ధరించే వారాహ ముఖము ఊర్ధ్వము జ్ఞానప్రదమైన హయ ముఖము హనుమానునకున్న అన్నిముఖాలుగాను నాగేశ్వరుల సేవకూడా వ్యాపించినది

## VI

ఆంధ్ర వారపత్రిక బొంబాయినుంచి ప్రతి వారమూ వచ్చేది గులాబిరంగు కాగితాలు, ఎనిమిది పేజీలు. సంవత్సర చందా రెండు రూపాయలు, పోస్టేజీతో సహా, 52 వారాలకు పోస్టేజీ 13 అణాలు. అదిపోతే అన్ని ఖర్చులకూ మిగిలేది 1 రూపాయి మూడణాలు. అందులో మొదటి సంపాదకీయములో ఈ మాటలున్నవి.

"ప్రజలకు విద్యాభివృద్ధియు, ప్రపంచ జ్ఞానాభివృద్ధియు గావించుటయే మాముఖ్యాభిప్రాయము. ప్రజల యోగక్షేమాభివృద్ధికి దేశాభిమానము, స్వామి భక్తియు మిగుల సహకారులని మేముద్ఘోషించు చుందుము...... ఆంగ్లేయ ప్రభుత్వమునకు లోబడిన ఇతర రాజ్యము లందు వలె స్వకీయ పరిపాలనమును కాలక్రమమున బొందుటయే మా స్వరాజ్యాదర్శము."

ఇందులో విద్యాభివృద్ధి, ప్రపంచజ్ఞానాభివృద్ధి గమనించ దగిన మాటలు. పత్రికలు ప్రారంభించేటప్పుడు వ్రాసే స్వవిషయాలు ఎలెక్షన్ మానిఫెస్టోలవలె జనాకర్షణము చేసి తరువాత పూర్తిగా మరచి పోయే వని మనకిపుడు పూర్తిగా తెలుసున్నా కాని ఆంధ్ర వార పత్రిక సంపాదకీయము

లోని మాటలు అక్షరాలా నిజము. నాగేశ్వరులు వ్యాపారంలో కూడా నిజాయితీ పాటించేవారని పట్టాభిగారు కూడా అన్నారుకదా ! ఆంధ్రవార పత్రిక వారు ఆంధ్రులకు చేసిన మొదటి ద్విముఖ దానము '

నాగేశ్వరులు అమృతాంజనము జగద్వ్యాప్తము చేయటములో చూపిన ప్రతిభ వర్తక ప్రపంచములో అపూర్వమైనది ప్రకటన విషయములో వారు మహాకవీశ్వరులు. ప్రకటన మాహాత్మ్యము తెలిసిన పాశ్చాత్య వర్తకులే ప్రకటనల మెళుకువలు శ్రీ నాగేశ్వరుల వద్ద నేర్చుకొన్నారట ' అమృత శబ్దము పేరే చూడండి ! ఎంత ఆకర్షకమైనదో ! మన పురాణ కధలన్నిటిలో అత్యద్భుతమైనది అమృత మధనము ఆ తరువాత గరుడుడు అమృతాహరణము చేసిన కథ అమృత శబ్దము మన ఇంటింటా వాడుక చేసేపదము రుచికీ, దాహశాంతికీ, స్వర్గ సుఖానికీ మోక్షానికీ అదేమాట అమృతాంజన మనే పేరు పెట్టటంలోనే నాగేశ్వరుల ప్రకటన సామర్థ్యము కనబడుతున్నది

ఇంత ప్రచార సామర్థ్యము ఉన్నవారు గనుకనే ఆంధ్రులకు విజ్ఞాన ప్రచారము చేయడానికి కూడా నాగేశ్వరులు పూనుకొన్నారు అందులో కూడా సఫలులైనారు దానిలోనే వారి గొప్పదనమున్నది. సంపాదనమునకు అమృతాంజనమూ, లోకోపకారానికి ఆంధ్ర పత్రికాదికము నాగేశ్వరుల ప్రణాలిక. వారు తలచుకొంటే ఆంధ్ర పత్రికను కూడా లాభసాటి చేయ కలిగే వారే కాని తాను సాధింప తలచిన పరోపకార సాధనగా మాత్రమే దానిని నడిపినారు. వారు పరమపదించేదాకా ఆంధ్ర పత్రిక నష్టము మీదనే నడుస్తూ వచ్చింది.

వారు పరమపదించిన వెంటనేనో కొంచెము ముందో పట్టాభిగారు ఆంధ్ర పత్రిక వ్యవహారాలు పరిశీలించి లెక్కలువేసి అప్పటికి పత్రిక 800 మందికి ఉచితంగా పంపుచున్నారనీ, అదీ చాలిస్తే ఆంధ్ర పత్రికకు నష్ట

ముండదని తేల్చినారు. నెలచందా రు 2. అనుకుంటే పోస్టేజితో సహా లెక్క వేయగా, నాకు సంవత్సరానికి 23, 575 రూపాయలు వాటి వల్ల నష్టమని తేలింది ఆర్థిక వ్యవహారాలలో నాగేశ్వరులు అమాయకులు కారు అంత మాత్రము తెలియక కాదు ఆ ఉచిత పత్రికలు ఎక్కువభాగము గ్రంథాలయాలకు వెళ్ళేవి వాటివల్ల అధమ పక్షము 16000 మందికి విజ్ఞాన ప్రదానము జరిగేది దానికోసం నాగేశ్వరులు సంవత్సరానికి రు 23,575 నష్టపడడానికి ఒప్పుకొన్నారన్న మాట

ఎవరైనా మంచిపని చేశారంటే, దానికేదో దురుద్దేశం కల్పించే దుర్జనులుంటారు. "ఆఁ, నాగేశ్వరరావు వ్యాపారస్తుడు అమృతాంజన ప్రచారము కోసము ఆంధ్ర పత్రిక పెట్టినాడు , అన్నవారు లేకపోలేదు కాని అమృతాంజనము ప్రపంచ వ్యాప్తమైన మందు దాని ప్రకటనకోసము ఆంధ్ర పత్రిక పెడ్తే ఎన్నెన్ని భాషలలో వారు పత్రికను పెట్టవలసి వచ్చేదో ' అమృతాంజనానికి ఆంధ్ర దేశంలో వ్యాప్తి తక్కువను కొంటాను, నన్ను ప్రమాణంగా తీసుకొంటే 1899 లో పుట్టిన అమృతాంజనము సీసాలు ఇంతవరకు నేను కొన్నవి అరడజను కూడా ఉన్నట్లు గుర్తులేదు కాని నేను బహుకాలము నుంచీ ఆంధ్ర పత్రిక చందాదారుడనే పూర్వకాలపు పండితులైన మా తండ్రిగారు కూడా బొంబాయిలో ఆంధ్ర పత్రిక ఉండగానే ఆంధ్ర పత్రిక చందా దారుగా ఉండేవారు. వారు తెప్పించిన సంవత్సరాది సంచికల అవశిష్టాలు ఇంకా కొన్ని నావద్ద ఉన్నాయి అమృతాంజనము ప్రకటనకైతే ఆంగ్ల పత్రిక ఎక్కువ అనుకూలించేది ఆనాటికేకాక బహుశః చివరవరకూకూడా వారికి ఆంధ్ర భాషలోకంటే ఆంగ్ల భాషలోనే ఎక్కువ సౌలభ్యముండేదని తోస్తుంది. పైన ఉదాహరించిన బావగారికి వ్రాసిన ఉత్తరమే కాక 11-7-1930న తిరుచినాపల్లి జైలునుంచి ఆంధ్ర పత్రిక మేనేజరు గారికి తనపేరుకు ముందు దేశోద్ధారక, విశ్వదాత పదములు వాడవద్దని వ్రాసిన ఉత్తరము కూడా ఇంగ్లీషులోనే ఉన్నది

ఆంధ్ర వారపత్రిక ప్రారంభించడానికి పూర్వము వారు బొంబాయిలో ఆంధ్రుల నందరినీ ఏక ముఖము చేయడానికి సమావేశాలు ఏర్పాటు చేసేవారు వాటి ఫలమే పత్రిక ఆవిర్భావము

వారపత్రికతో వారు పడ్డ బాధను గూర్చి 1912 పరీధావి సంవత్సరాది సంచికలో వారి మాటలే విందాము

"దేశభాషా పత్రికా నిర్వహణ మత్యంత కష్టసాధ్యము ఆంధ్రేతర రాష్ట్ర మధ్యను నాంధ్ర పత్రికానిర్వహణము దుస్సాధ్యము సామాన్యముగా దేశీయ వార్తాపత్రికల నిర్వాహకులకు లాభము పూజ్యము గౌరవము శూన్యము భారమధికము. విషమావస్థల వలని విషాదము జనించుట సహజము నిరుత్సాహము కలుగుట నిశ్చయము విషాద. నిరుత్సాహములు రక్షింపవు ప్రజ్ఞావాదములు నిరుపయోగములు రంధ్రాన్వేషణము సుకరము గుణగ్రహణము దుష్కరణము చేసినది కొంచెము చేయగలిగినది విస్తారము తప్పు లెక్కువ. ఒప్పులు తక్కువ ......... ఇతర భాషలందు 2,000 చందా దారులుగల వార్తా పత్రికలును, దైనిక పత్రికలును ఉండగా, నాంధ్ర భాష యందు మంచి వ్యాపకముగల వార్తాపత్రిక లేకుండుట శోచనీయము. ఇదియే ఢిల్లీదర్బారునందాంధ్రి పత్రికల పరాభవమునకు ముఖ్యకారణము. ఈ కొరతనుదీర్చి పత్రికా వ్యాపనమును జేయుటకు ప్రార్థితులు."

## VII

నాగేశ్వరుల కృషిలో పత్రిక ఒక ఎత్తూ, వారి సంవత్సరాది సంచికలు ఒకఎత్తూ. వార్షిక సంచిక ప్రచురించడమే ఆంధ్రములో వారి స్వతంత్రసృష్టి

ఆ రోజులలో సంవత్సరాది సంచికలు ఇళ్ళలోనూ, గ్రంథాలయాల లోనూ సంవత్సరము పొడుగునా చదివేవారు. మొదటిదైన సాధారణ సంవత్సరాది సంచికలో ఆంధ్రదేశములోనూ, ఇతర ప్రపంచములోనూ ప్రసిద్ధులైనవారిని ఫోటోలతో సహా ఆంధ్రులకు పరిచయము చేసినారు అందులో

వాఙ్మయ, మత, సాంఘిక వ్యాసాలు ప్రధానము. తరువాతి విరోధి సంచికలో సాంఘిక మత విషయాలు ముఖ్యము పరీధావి (1912) ఢిల్లీలో జార్జి పట్టాభిషేక సంచిక ప్రమాదీచ (1912) రాజ్యాంగ వ్యాసాలు ఎక్కువ ఆనంద (1914)లో భాషావిషయాలూ మహాపురుషుల చరిత్రలూ రాక్షస సంచికలో (1915) ప్రపంచయుద్ధానికి సంబంధించిన వివరాలన్నీ మారణాయుధాలతో సహా ఉన్నవి వానితో పాటు ఆంధ్రోద్యమం సంగతి కూడా విపులముగా ఉన్నది. ఇక 1916 నల సంచికనాటికి వారికి కొంత తృప్తి కలిగి ఇట్లా వ్రాశారు :

"లోక వ్యాప్తమైన నూతనోత్సాహ మాంధ్ర ప్రపంచమును నైత మావరించినది. విద్యావంతులు, సామాన్యులు నూతనోత్సాహ సమన్వితులు ఆంధ్ర దేశాభిమానము, ఆంధ్ర భాషాభిమానము, ప్రజాభిమానము నావరించినవి ......... ఆంధ్రదేశాభ్యుదయ సూచకములైన బీజాంకురములు గోచరములు."

ఆంధ్ర వార పత్రిక ప్రారంభించిన నాటి స్థితిగతులను గూర్చి మొదటి ఆంధ్ర దిన పత్రికలోని మాటలివి :

"బొంబాయి జననస్థానము ముహూర్త స్థానమును జూచి గుణించిన జ్యోతిష్కు లిష్టఫలమును దెలిపిరి తెలుగు పత్రిక మహారాష్ట్ర దేశమునందు బ్రచురణము కాలము కల్లోలమయము హైందవ నాయకుల అంతః కలహములు ప్రజలకు స్వదేశ, స్వరాజ్య ఆందోళనము. పాలకులకు భయ విషాదములు విదేశము నందిట్టి సందిగ్ధ సమయమునందు బుట్టిన యాంధ్ర పత్రికకు మంచి ఫలమును జెప్పుటకు ఎవరు సాహసింపగలరు? అదృష్టము దైవాధీనము దైవానుగ్రహము సకలాభీష్ట సిద్ధికి సాధనము. మొదటి సంవత్సరాది సంచికలో విజయాఖ్య సార్ధకనామధారియైన యర్జుననకు నైతము యుద్ధాంతారంభములందు విషాదాభిమానములు గలిగినవి." అన్నారు 1916 నాటికి ఆ విషాదస్థితి తొలగినది

సంవత్సరాది సంచికలు నాగేశ్వరుల పరోపకార పారీణతకు నిదర్శనములు. వానిలోని వ్యాసములు చిత్రపటములు, ఫోటోలు విశిష్ట మైనవి. కాని అన్నిటికంటే నాగేశ్వరులు వ్రాసే ప్రస్తావనలు ఉత్తమ మైనవి అందులోవారు గడిచిన సంవత్సరములోని ప్రపంచ చరిత్రను భారతీయ చరిత్రను, ప్రత్యేకముగా ఆంధ్ర చరిత్రను సమగ్రముగా సమీక్ష చేసేవి అవి వారి పరిపూర్ణ శక్తిని ప్రదర్శించేవి వారి ప్రస్తావనలు స్థాయిని అందుకొన్న సంవత్సర సమీక్షలు ఇంతవరకూ మళ్ళీ ఎక్కడా వెలువడలేదు.

ఇంత సంచికా ఖరీదు మొదట అర్ధరూపాయి : పైగా రెండు రూపాయలు చందా చెల్లించే ఆంధ్ర పత్రిక చందాదారుల కది ఉచితము.

## VIII

బొంబాయిలో వార పత్రికగా 1908 లో ఆరంభించిన ఆంధ్ర పత్రిక కార్యస్థానము చెన్నపట్టణమునకు 1914 లో మార్చి దిన పత్రికగా చేసినారు సరిగా ఆ ప్రాంతములోనే మొదటి ప్రపంచ సంగ్రామము రావడముతో పత్రిక ప్రచారము పెరిగినది. ఆంధ్ర పత్రిక సంపాదకీయాలు నిగ్రహానికీ, నిర్భయతకూ క్షుణ్ణమైన విషయ పరిశీలనకూ అప్పుడేకాక ఇప్పుడూ ప్రసిద్ధి పొందినవి. వార్తా ప్రచురణములో కూడా నిగ్రహమున్నది. జనాకర్షణ కోసము సందేహమైన వార్తలు ప్రచురించరు. ఈ సంప్రదాయము నాగేశ్వరుల వల్ల సంక్రమించినదే.

ఇక ఆంధ్ర దిన పత్రికలకు అనుబంధంగా ప్రతి ఆదివారమూ ప్రచురించే సారస్వతానుబంధము విశిష్ట మైనది. అది ఆంధ్ర కవులకూ, వ్యాసకర్తలకూ, కధకులకు, వాదోప వాదములకు ప్రయోగ రంగమైనది. దానిలో ప్రచురణకు మహోన్నత స్థాయి అక్కరలేదు. అందువల్ల ఎంతెంత మందినో చూడ గల్గే వారము ఐతే సాక్షివంటి అపూర్వ వ్యాసాలూ వేయి పడగలు వంటి ప్రసిద్ధి నవలా, ఆ సారస్వతానుబంధములోనే ప్రచురింపబడినవని గుర్తుంచు కోవలె.

# IX

ఆంధ్రుల సాహిత్య సంస్కారాలు పరిణతి పొందినవని ధైర్యము కల్గిన తరువాత వారు భారతి (1924 లో) ప్రారంభించారు. ఆంధ్ర పత్రిక ఆంధ్రులది. భారతి యావద్భారత దేశానిది అది మొదటి నుంచీ భారతీయ భాషలలో ఉత్తమ మాస పత్రికలలో తల ఎత్తుకొని నిలుస్తున్నది నాగేశ్వరులు అంతకు ముందే తీర్థయాత్రలు చేసి శ్రీశైలములో శ్రీ శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధి పతులైన జగద్గురు శ్రీ బోధానంద భారతీ మహా స్వాముల వారివద్ద శ్రీ విద్యాపూర్ణ దీక్ష గ్రహించిన పిమ్మటనే భారతి ప్రారభించినారు. భారతీ సంప్రదాయ యతులే జగద్గురు సంప్రదాయము వారు. అందువల్లనే భారతీ యతయ స్సర్వే గురుణాం గురువః స్మృతాః" అంటారు. గురు మంత్ర దేవతాత్మలకు అభేదము కనుక భారతి నాగేశ్వరుల గురుదేవులు, వారు ఉపాసించిన మంత్రము, ఆ మంత్రాధి దేవతా, ఆ రూపము పొందిన నాగేశ్వరులే.

భారతి 160 పేజీలు, గట్టి గ్లేజు కాగితము, మూడు త్రివర్ణ చిత్రాలు, లెక్కలేనన్ని ఇతర చిత్రాలు, ఖరీదు అర్ధరూపాయి భారతిని ప్రారంభిస్తూ మొదటి సంచికలో వారు వ్రాసిన మాటలు కొన్ని :

"భారతి నుద్ధరించి శుభస్థితి కల్పింప వలెనను సంకల్పము భారత హృదయమందు కల్గినది. భారతి దేశభాషా రీతుల ననుసరించి ఎల్లెడల వెలయుచున్నది. ఆంధ్ర భారతియును, వంగ భారతియు, కర్ణాట భారతియు భారతీయ స్వరూపములు. శ్రీకాకుళము నుండి నాసిక వరకు మహావైభవ విలాసములతో పూర్వ మానందముగా నాంధ్రవనియందు విహరించిన భారతి ఇప్పుడు పరాధీనయై దైన్యము ననుభవించు చున్నది. ఆంధ్ర యువజన హృదయ ముత్సాహపూరితమైన వర్తమాన సమయమునందు భావకర్మరంగము లందు నిర్మాణమార్గ మవలంభించుటకు పరితపించుచున్నది ............ ఆ యవసరములందు సఫలము చేయుటకు ఆంధ్ర ప్రపంచము పూర్వాపర

సంస్కారములను సమన్వయము చేయుటకు పూనుకొను చున్నది. ఆంధ్ర భారతియును ఆంధ్ర ప్రవృత్తి వ్యక్తము చేయుట కవతరించినది. ...... విషయావగాహనమునకు సాధనములైన ప్రాచీన మందిరములు బౌద్ధ స్థూపములు తామ్ర శిలా శాసనములు, తాళ పత్ర గ్రంథములు, కళా విచిత్ర ములు వాఙ్మయ స్వరూపములు నిగూఢములై ప్రకాశము నపేక్షించుచున్నవి. ఆంధ్ర వ్యక్తిత్వ ద్యోతకములైన అమరావతి సాంచి మొదలగు వస్తు రూపముల వైభవము అజ్ఞాతముగా నున్నది. శాసన పరిశోధనాలయములందు వందల కొలది శాసనములు తుప్పు పట్టి పోవుచున్నవి. ప్రాచ్య లిఖిత భాండా గారమునందు, తంజావూరు పుస్తక భాండాగారమునందు వ్రాత ప్రతులు శిథిలము లగుచున్నవి అజంతా యందలి చిత్రములు ప్రకాశమును గోరు చున్నవి రసవంతమైన వాఙ్మయము పరిశీలనము కోరు చున్నది ''

ఈ ఆశయాల సిద్ధికి నాగేశ్వరులు భారతిని ఆంధ్ర జనోపకారము నిమిత్తమే సమర్ధతతో నడిపినారు

## X

లోకోపకారార్థము వారు కావించిన గ్రంధ ప్రచురణముల సంగతి క్లుప్తముగా ప్రస్తావిస్తాను.

మొదటిది, వారి ఆంధ్ర గ్రంథమాలలోని ప్రచురణలు వాటి ద్వారా ఎంతో విజ్ఞానము వెదజల్లినారు. నాగేశ్వరులు రచించిన భగవద్గీతా వ్యాఖ్య వానిలో ఎక్కువ ప్రచారము పొందినది బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర అపూర్వ గ్రంధాలు కాని ఆ గ్రంధమాలలోని 11వ పుష్పమైన ఆంధ్ర వాఙ్మయ సూచిక విలువకట్టడము సాధ్యము కాదు. దానిలో నాగేశ్వరులు వ్రాసిన పీఠిక ఆంధ్ర వాఙ్మయ చరిత్రయే. అందులో ఆంధ్ర ములో ముద్రిత గ్రంథములు 12, 256, అముద్రిత గ్రంధములు 1,672, గ్రంధకర్తలు రమారమి 6,000 మందీ–వీటి వివరాలు ఇచ్చారు. డెమ్మీ. 1/4

సైజు, పీఠిక 108 పేజీలు కాక గ్రంథము 506 పేజీలు వెల 2రూపాయలు ఎంత మందిని ఎన్ని గ్రంథాలయాలకు ఎంత ఖర్చుతో పంపి విషయ సేకరణ చేయించారో మన మూహించు కోవలె ఇది కాక భారతిలో కొన్నాళ్లు అముద్రిత గ్రంథాల విషయ సంగ్రహాలు ప్రచురించేవారు ఈ గ్రంథమాలలో ప్రచురించిన గ్రంథాలు కాక సహాయముచేసి గ్రంథకర్తల చేత ప్రచురింప చేసిన గ్రంథాలకు లెక్కలేదు. ప్రసిద్ధ సంగీత విద్వాంసులైన శ్రీ అరిపిరాల సత్యనారాయణ మూర్తి గారి మాటలు వినండి.

"నాజీవితానికి పునాదులు వేసిన వారు పంతులు గారు ఒక ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు రచించిన సంగీతశిక్షణ గ్రంథాన్ని ప్రచురించడమే కాక శ్రీ సి. ఆర్ శ్రీనివాస అయ్యంగారివంటి మహా సంగీత విద్వాంసులు విమర్శ కాగ్రేసరుల చేత ప్రశంసల నందజేసిన మహానుభావుడు. రాష్ట్రేతర ప్రాంతాలలోనే గాక ఖండాంతరాలలో కూడా ఆ గ్రంథం గడించిన ఖ్యాతి, వ్యాప్తి నాచేత మరి మూడు గ్రంథాలు రచింప జేయడమేకాక సంగీత నిఘంటువును కూడా రచించడానికి ప్రోత్సాహం కలుగ చేసింది"

ఏ విద్యలో ఉత్సాహమున్న వారికైనా వారు సర్వవిధాలా ప్రోత్సాహ మిచ్చి పైకితేచ్చేవారు

వారి మిత్రులు, విజ్ఞానవేత్తలు ఐన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు ప్రారంభించి అసంపూర్ణంగా వదలి పోయిన విజ్ఞాన సర్వస్వము రెండు సంపుటాలలో పునర్ముద్రణ చేయించి రెండింటి ఖరీదు 20రూ. పెట్టినారు ఆ సంపుటాల కాగితాలు, అచ్చు, చిత్ర పటములూ, బైండింగూ అందుకున్న ఉన్నత స్థాయిని ఇంతవరకూ ఏ ఇతర ఆంధ్ర గ్రంథమూ లందుకో లేదు. అది విశ్వ విజ్ఞానమూర్తికిని, ఆంధ్ర విజ్ఞాన ప్రపంచమునకును సమర్పితము. దాని మొటో "నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ దృశ్యతే." ప్రపంచ జ్ఞానము లేని ఆంధ్రులకు విజ్ఞాన వికాసములు పంచి పెట్ట వలెనని వారెంత తహ తహ పడినారో మనమందులో దర్శిస్తాము.

స్వాతంత్ర్య సమరము ముమ్మరము కాకముందు ఆంధ్రములో ముందు వ్యాపించి్ గ్రంథాలయోద్యమము దానికి పునాదులు వేసినది బెజవాడలో శ్రీ సూరి నరసింహశాస్త్రిగారూ, అయ్యంకి వెంకటరమణయ్యగారూను. ఆ ఉద్యమంలో భారతదేశంలో ఆంధ్రులే అగ్రగాములు. అది ప్రారంభిం చినదే తడవుగా దానిని ఆదుకొని తమ పత్రికలు, గ్రంథాలు ఉచితంగానో అర్థచందాకో ఇచ్చి వేరే విరాళాలు కూడా సమర్పించేవారు. ఎన్ని గ్రంథాలయ సభలకు అగ్రాసనాధిపత్యము వహించినారో చెప్పలేము. గ్రంథాలయోద్య మము పల్లెటూరి ప్రజలను కూడా అన్ని సంస్కరణలకూ స్వాతంత్ర్య సమరానికీ తయారు చేసింది. ఆ ఉద్యమంద్వారా వారాంధ్రులకు చేసిన ఉపకారము వర్ణింప లేము

నాగేశ్వరులు పదే పదే ఉద్ఘాటించినది ఒకటే విషయము. ఆంధ్ర రాష్ట్రము రావలె; దానితో భారతదేశము బలపడవలె; భారత దేశానికి స్వాతంత్ర్యము రావలె; దానితో ప్రపంచము శాంతితో వర్ధిల్లవలె!

# XI

ఇంత విజ్ఞాన ఖనీ కొన్ని విషయాలలో చాలా పూర్వాచార పరాయ ణుడు ఆయన మాటి మాటికీ మనజీవయాత్రను దేహయాత్రను చేయక, దేవయాత్రనూ కైలాసయాత్రనూ ఆత్మయాత్రనూ చేయవలెనని పరి పరి విధాల ఉద్బోధించేవారు ప్రమాణాలు ఉపనిషత్తులలోనుంచి భగవద్గీత లోనుంచి ఇచ్చేవారు. కాని పాశ్చాత్యుల గ్రంథాలలోనుంచి. ఇచ్చేవారు కాదు పాశ్చాత్య సాహిత్యాలూ రాజకీయార్థిక సిద్ధాంతాలూ ఆధునిక విజ్ఞాన పరిశోధనలూ ఎప్పటికప్పుడు వారు క్షుణ్ణంగాపరించి జీర్ణించుకొని, వాటిని మన సంప్రదాయాలకు అనుగుణంగా అన్వయించి ప్రవర్తింపజేసి ఆచరించేవారు.

వారు కరుణాపూర్ణహృదయులు. అన్ని విధాలా ఎక్కువ అధోగతిలో ఉన్నవారు పంచములు. మహాత్ముని హరిజనోద్యమానికి పూర్వము వాళ్ళ

సంగతి సరిగా పట్టించుకున్నవాళ్ళే లేరు. అంతకు ముందే ఎప్పుడో నాగేశ్వరులు వారి స్వగ్రామమైన ఎలకుర్రులో రెండుయకరాల భూమిలో నాలుగుదూలాల ఇళ్ళు తమ స్వంత ఖర్చుతో నలభై కట్టించి వారికి ఉచితంగా ఇచ్చారు వారు స్థాపించిన శ్యామలాంబా పాఠశాలలో హరిజన విద్యార్థులకు ప్రవేశము వారే ముందు కల్పించినారు. ఎంత మంది హరిజన విద్యార్థులకో వారు ద్రవ్యసహాయము చేసినారు. హరిజన వసతిగృహాలూ గ్రంథాలయాలూ ఏర్పరిచారు బెజవాడలో హరిజన సభలేవి జరిగినా వారి దుర్గాకళా మందిర మిచ్చి అన్ని ఏర్పాట్లూ చేసేవారు. ఎన్ని దేవాలయాలలోనో హరిజన ప్రవేశాన్ని ముందుండి నడిపించారు. అస్పృశ్యతా నిర్మూలనము ప్రచారము చేసే "నిరుద్ధభారతము" అనే మంగిపూడి వెంకట శర్మగారి గ్రంథాన్ని తామే ప్రచురించి పరిచయవాక్యము వ్రాశారు అందులో ఇట్లా అన్నారు: "ఆత్మోపలబ్ధికి సకల జనులును జాతి మత కుల భేదములు లేక సమానాధికారులు హిందూమత పరమార్థమైన 'తత్త్వమసి' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇత్యాది మహావాక్యార్థాలు విస్మరించి''తిమి "ప్రవృత్తి యందు సంచలనము జీవధర్మము, నిశ్చేష్టత విలయ మరణ చిహ్నము!" 1932 లో ఆంధ్రరాష్ట్ర హరిజన సేవా సంఘము స్థాపింపబడినప్పుడు వారే మొదటి అధ్యక్షులైనారు. ఎన్ని వేలు హరిజనోద్యమానికి వారిచ్చారో చెప్పలేము.

## XII

రాజకీయాలలో నాగేశ్వరులు మొదట మితవాది కాని గాంధీజీ రాజకీయరంగంలో అవతరించడంతో, వారి కాయన సర్వాత్మనా అంకితులైనారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 60 ఏళ్ళు దాటిన తర్వాత రెండు సార్లు జెయిలుకు వెళ్ళినారు. ఖద్దరు ఉద్యమానికి వేలు ఖర్చు చేశారు. ఆంధ్రరాష్ట్ర ఖద్దరు బోర్డుకు అధ్యక్షులుగా ఉండగా, ఆంధ్ర ఖద్దరు భారత దేశ మంతటా వ్యాప్తి చెందినది. భారతజాతి ఐక్యతకు హిందీ అవసరమని హిందీ ఉద్యమానికి వారెంతో సహాయంచేశారు

ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము రావడానికి మూలసంధి ఐన శ్రీ భాగ్‌పాక్టు వారు సాధించినదే చెన్నపట్టణములో ఆంధ్రసభకు పెద్ద అండగా ఉంది ఆంధ్రులకు స్థానబలము సంపాదించారు. ఆంధ్ర రాజకీయ రంగంలో అంతః కలహాలు పైకి పొక్కకుండా మరిచిపోయేట్లు చేసినది వారి ప్రభావమే.

వారికి మొదటినుంచీ ఆంధ్రదేశ మంటే నిజాము రాష్ట్రములో అప్పుడుండిన భాగాలతోనే వారిచ్చే లెక్కలలో ఎప్పుడూ చెన్నరాష్ట్రంలో రెండు కోట్లమందీ, నిజామురాష్ట్రంలో 50 లక్షలమంది ఆంధ్రులున్నారని గుర్తు చేసేవారు

అంతేకాదు. ఎక్కడెక్కడ ఎంతమంది ఇతరచోట్ల ఉన్నారో ఆంధ్రుల లెక్క లిచ్చేవారు వారు రంగూను వెళ్ళినప్పుడు చేసిన ఉపన్యాసము వారికి ఆంధ్రు లంటే ఎంత అభిమానమో, ఎక్క డెక్కడ ఎంత మంది ఉన్నారో ఎంత క్షుణ్ణంగా తెలుసునో విశదము చేస్తుంది

## XIII

వారు కరుణాపూర్ణహృదయులు కనుకనే విశ్వదాత అని మహాత్మునివల్లనే ప్రశంస పొందినారు. బాగా తెలిసిన శ్రీ అవటపల్లి నారాయణరావు గారి మాటలు ఉదాహరిస్తాను

"ఆంధ్రపత్రిక, భారతి, విజ్ఞానసర్వస్వము. ఆంధ్ర గ్రంథమాల, ఆంధ్ర వాఙ్మయసూచిక, - వీటిమూలంగా వారు చేసిన అఖండ మయిన సేవను ఒక ఎత్తుగానూ, దాతలుగా అన్నదాతలుగా చేసిన సేవను ఒక ఎత్తుగానూ భావింప వలసి ఉంటుంది.

''పంతులుగారి దాతృత్వ స్వరూపాన్ని గ్రహించాలంటే మన దృష్టిని కాస్త బెజవాడలోని శ్రీ దుర్గావిలాసంమీదకు, చెన్నపట్టణములోని ఆంధ్రపత్రికా కార్యాలయము మీదకును తిప్పవలసి ఉంటుంది. బెజవాడలో ప్రొద్దునపూటను, చెన్నపట్నంలో సాయంత్రంపూటను, పంతులుగారి దగ్గర

నిలుచుంటేసరి, శాలువలు కప్పుకొని కొందరు, ఖద్దరు టోపీలు పెట్టుకొని కొందరు, లాగూలు వేసికొని కొందరూ, పుస్తకాలు చేత బట్టుకొని కొందరు, కన్నీరు కారుస్తూ కొందరును, ఇళ్ళు కట్టు కుంటున్నామనీ, పెండ్లి చేసికొంటున్నామనీ, పుస్తకాలు అచ్చువేసుకోవటానికి డబ్బు లేదనీ, శరణాలయాలకనీ, విద్యాలయాలకనీ, సంతర్పణలకనీ, విదేశప్రయాణాలకనీ, పుణ్యక్షేత్రాలకనీ, స్కూలు జీతాలకనీ ఈ విధంగా మరి ఎందరోనున్నూ లోకంలో ఎన్ని తరగతుల అవసరాలు కష్టాలు, దుఃఖాలు, సుఖాలు ఉన్నవో అన్ని తరగతుల మనుషులునూ కనబడేవారు. ఎవరో అదృష్ట హీనులు తప్ప ప్రతిమనిషీ, అప్పుడే పంతులుగారి ఖజానాలో ఉండే నిల్వను బట్టి, పదులు వందలు పట్టుకొని పోనివారు లేరు. ఇవ్వటం అంటేను, భోజనం పెట్టడం అంటేను, పంతులు గారికి ఒక విధమైన సంతోషము. ఆ ఇవ్వడంలో ఒక హద్దు లేదు. ఒక నిర్ణయము లేదు. తిడుము కోవడము లేదు. సందేహించడము లేదు. ఆ రావడము, ఆ ఇవ్వడము అంతా ఒక మహాప్రవాహము ।''

వారే ఒక చిత్రమైన అనుభవము చెప్పినారు. పంతులుగారు ఇంటికి వెళ్ళుతుంటే ఒక ఖద్దరువాలా వచ్చి కుర్చీలో కూర్చుండి వారిని నిలవవేసి డబ్బు అడుగగా రేపు రమ్మన్నారుట. ''రేపు ఎవరు వస్తారయ్యా, నాకు ఇదే పనా, ఆ ఇచ్చేదేదో ఇప్పుడే పారవెయ్యరాదూ పోతాను'' అని ధాష్టీకం చేస్తే, వారు ఇంటి ఖర్చుకు తీసుకొని పోతున్న డబ్బు ఇస్తూ, ''క్షమించండి !'' అని మరి మాటాడక వెళ్ళిపోయినారట. ఇది తలచుకొన్నప్పుడు రోమ హర్షము కలుగుతుంది.

వారి కుమార్తె వివాహ సందర్భంలో పెద్దలకు వెండి కొబ్బరి కాయలు, గుప్పెళ్ళతో రూపాయలు ఇచ్చినారట. అప్పుడు వారు వాడిన ఖద్దరుతో ఆంధ్రదేశంలో ఉన్న ఖాదీ భాండాగారాలలో ఉన్న ఖద్దరంతా ఖర్చయి పోయిందట

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు, ఇన్ని చిల్లర దానాలు చేసేకంటే ఏదో ఒకదానిని చేస్తే శాశ్వతంగా ఉంటుందని సూచించగా పంతులుగారిచ్చిన జవాబిది

వారినిగూర్చి మిత్రులు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు వ్రాసిన రెండు పద్యాలతో ముగిస్తాను.

"శ్రీశైలేశ్వర పాదపంకజ రజోరింఖోళి వాగ్దేవతా
రాశీభూత మృదూక్తి మాధురులు చంద్ర స్వచ్ఛ పాదామృత
ప్రాశస్త్యమ్మును గూర్చి పద్మజుడు నిన్ బాగొప్ప సృష్టించెనో
దేశోద్ధారక భక్తపుంగవునిగా ధీమూర్తిగా దాతగా"

"అమరులు పోయి వేడుకొన నస్థి యొసంగె దధీచి, మూడు పా
దముల ధరిత్రి యిచ్చె బలి దానవ వైరికి, నీవొ యర్థి సా
ర్థమునకు వాంఛితాభ్యధిక దాన పరంపర చూర యిచ్చి య
త్యమలము విశ్వదాతృ బిరుదమ్ము వహించితి సార్థకమ్ముగన్ !

కాశీనాదుని నాగేశ్వరరావు

# దే శ సే వ

శ్రీ క్రొవ్విడి లింగరాజు

## I

ప్రసిద్ధ దేశభక్తుడు, భారత స్వాతంత్ర్య సమర సేనానులలో అగ్రగణ్యుడు, సాహిత్యోపాసకుడు, సాహితీ పోషకుడు, విశ్వదాత శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి శతజయంత్యుత్సవంలో పాల్గొన గలిగిన భాగ్యానికి నే నెంతో ఆనంద పడుచున్నాను పంతులుగారి పేరు స్మరించుకునే టప్పటికి నే నెరిగిన ఏభై సంవత్సరాల ఆంధ్ర ప్రజాహిత జీవితంలోని విశిష్ట ఘట్టాలెన్నో కండ్లకు కట్టినట్లు కనబడతాయి వెండితెరమీద చూస్తున్నట్లు వాటిని చూస్తుంటే ఆనాటి ఆంధ్రనాయ కాగ్రేసరులైన మహామహులందరిలోనూ తెల్లని ఖద్దరు దుస్తులతో ఖద్దరు టోపీని ధరించి, అనేక సద్గుణముల భారంతో వంగివంగని నడుములో, స్ఫురద్రూపియైన నాగేశ్వరరావు పంతులు మూర్తి స్ఫుటంగా తేజోవంతంగా అనుతుంది ప్రక్క బొత్తాములు గల కంటిమెడలాల్చీ, కోసుగా ఉండే గాంధీటోపీ, ముందు నడకను సూచించే కుచ్చెళ్ళతో తెల్లని పంచె మెడమీద సన్న గోరంచు ఖండువా, ఆ మూర్తిలోని స్వచ్ఛతకు చిహ్నంగా ఉండేవి ఆయనతోపాటు ఆంధ్రోద్యమంలోనూ, జాతీయోద్యమాల్లోనూ, సాహిత్య రంగంలోనూ పత్రికా రంగంలోనూ కృషిచేసిన తేజోమూర్తులైన మహా పురుష లెందరో కనబడతారు వారిలో చాలామంది కొన్ని రంగాల్లో మాత్రమే ఆంధ్రకు సేవచేసినవారు. నాగేశ్వరరావుగారు మాత్రం వారందరితో అన్ని రంగాల్లోనూ, అగ్రశ్రేణిలోనుండి కృషిచేసినవారు కనుక, ఆంధ్రాభ్యుదయాన్ని సాధించిన అన్ని రంగాలలోనూ ఉద్యమాల్లోనూ వారి పాత్ర ప్రధానంగానే కనబడుతుంది. ఆంధ్రులలో జాతీయ భావాలను వెదజల్లిన వందేమాతరం ఉద్యమంలోనూ, ఆంధ్ర జాతీయతకు రూపకల్పన చేసిన ఆంధ్రోద్యమంలో

# III

ఆనాటి ఆంధ్ర రాజకీయాల్లో నాగేశ్వరరావు పంతులుగారి పాత్ర నాయకులందరినీ సమన్వయపరచడం. ఆయన సాక్షాత్తూ అజాత శత్రువు నాయకులలో అభిప్రాయ భేదాలు తీవ్రత దాల్చినపుడు ఆయనొక్కడే సర్దుబాటు చేయగలిగేవారు. పంతులుగారి మూర్తికి తగినట్లుగానే రాజకీయ సిద్ధాంతాలలో ఆయన నిదానమైన బాటనే అనుసరించాలనేవాడు కాని అవసర మొచ్చినపుడు సాహసానికి వెనుతీయలేదు. పల్నాడులో పోలీసుల దురంతాలు మితిమీరినపుడు, వాటిని గురించి విచారించడానికి నాగేశ్వరరావు గారున్నూ, ప్రకాశంగారున్నూ మోటారుసైకిలు సైడు కారులో రాత్రివేళ ప్రమాదకరమైన ప్రయాణం చేసినట్లు ప్రకాశంగారే చెప్పేరు స్వాతంత్ర్య సంపాదనకు తీవ్రమైన చర్యలు జరుపాలనే యువకులు ఉరకలేస్తుంటే వారికి శాంతాన్ని బోధించేవారుకాని వారు తొందరపడి ఒడుదుడుకుల్లో పడితే వారి కవసరమైన సహాయాన్ని అందిచ్చేవారు. ఈ సందర్భంలో ప్రథమ సంగ్రామ కాలంలో ఆయన బొంబాయిలో ఉండేటప్పుడు జరిగిన విషయాన్ని మనవి చేస్తాను. బెంగాల్ విప్లవ వాదులతో సంబంధమున్నదనే కారణంచేత తెలుగు దేశంలోని కొందరు యువకులను మండపేట వాసియైన యర్రమిల్లి జగ్గన్న శాస్త్రిగా రొకరు బొంబాయి తీసుకుపోయి అక్కడ బాధలు పెట్టారు అప్పట్లో వారికి జామీను ఇచ్చేవా రెవ్వరూలేని సమయంలో పంతులుగారు ఆదుకుని విడుదల చేయించారు. అందుకే ఆయన వివిధ రాజకీయ పక్షాలకు చెందిన వ్యక్తులందరి గౌరవాన్నీ పొందగలిగేవారు అంతేకాకుండా పంతులుగారి దగ్గరకు చిన్నవాళ్ళు సహితం పోయి తమ కష్టసుఖాలను చెప్పుకోగలిగేవారు కాంగ్రెస్‌లోనూ, గాంధీజీ నిర్మాణ కార్యక్రమాల్లోనూ పనిచేస్తుండేవా రెవ్వరైనా చనువుగా ఆయనతో మంచి చెడ్డలు చెప్పుకుంటే సానుభూతితోనూ ఆప్యాయతతోనూ విని వీలైనంత సహాయం చేసేవారు. ఆలాటి మహానుభావ్యక్తి సాంబమూర్తిగారే. ప్రకాశం పట్టాభిగార్లు కాంగ్రెస్ సేవకులంటే ప్రేమతో చూచినా వారి దగ్గర కెళ్ళడానికే కొంత తటపటాయించవలసొచ్చేది. ఇది వారి వారి మూర్తి విశేషమని చెప్పాలికాని కారణమేమీ లేదు.

మా సీతానగరం సత్యాగ్రహాశ్రమం స్థాపించబడినపుడు, 'కాంగ్రెస్' పత్రికను కూడా పల్లెటూరుకు మార్చవలెనని సంకల్పించాము ఆ విషయమై శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి సహాయాన్ని అపేక్షించాం. మేము కోరినది కొంత సహాయమే కాని పంతులుగారు ట్రెడిల్, టైపులతోసహా పూర్తిగా ముద్రణాలయాన్నంతనూ ఇచ్చేశారు నెల రోజులలో మా పత్రికకు ముద్రణాలయాన్ని అమర్చి పెట్టేరు పంతులుగారిని గురించి ఇంతటి కృతజ్ఞతతో చెప్పుకోవలసినవారు ఆంధ్ర దేశంలో ఎంతోమంది ఉన్నారు. ఆంధ్ర దేశంలో ప్రజా శ్రేయస్సుకోసం పాటుబడే ఏ సంస్థలోనైనా పంతులుగారి ద్రవ్యం అంతో ఇంతో పడకుండా లేదంటే అతిశయోక్తి కాదు. వానలో తడవకుండా ఉండనివాడు లేనట్లే, పంతులుగారి సహాయాన్ని కోరి విఫలుడైనవాడు లేడని చెప్పాలి. అందుకే మహాత్ముడాయన కిచ్చిన విశ్వదాత బిరుదు సార్ధకమైంది కాకినాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్రి మహాసభలోనో మరే సందర్భంలోనో నా కంతా బాగా జ్ఞాపకం లేదుకాని చాలామంది ప్రముఖులు సమావేశమై సామాన్య ప్రజల కాకర్షణీయంగా ఉండే ఒక బిరుదాన్ని పంతులుగారి కివ్వాలని, దేశ బంధు, దేశ ప్రియ, ఇత్యాది పేర్లను చర్చించి, చివరకు దేశోద్ధారక అనే బిరుదాన్ని ప్రసాదించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వా రాయనకు కళా ప్రపూర్ణ బిరుదాన్నిచ్చినా, గాంధీగారు విశ్వదాత బిరుదాన్నిచ్చినా, అవి ఆయనపట్ల ఎంతగా ఒప్పినా, ఆంధ్ర ప్రజల హృదయాలలో నిలిచిన బిరుదం దేశోద్ధారకయే. ఈనాటికీ తెలుగు దేశానికి సంబంధించినంతవరకు దేశోద్ధారకుడంటే నాగేశ్వరరావు పంతులుగారే దేశభక్త అంటే వెంకటప్పయ్య పంతులు, ఆంధ్ర కేసరి అంటే ప్రకాశం, ఆంధ్ర రత్న అంటే గోపాలకృష్ణయ్య పర్యాయ పదాలైనట్లే 1925 సం॥ ప్రాంతంలో బెజవాడ దుర్గాభవనాన్ని కళామందిరాన్ని నిర్మాణం చేశాక ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సమావేశాలు చాలవరకు బెజవాడలోనే జరుగు

తుండేవి. దుర్గాభవనంలో సమావేశంతోపాటు సభ్యుల భోజనాది వసతులన్నీ అక్కడ అమారుగా ఉండేవి సభ్యులు ఆ భవనాన్ని స్వంత ఇల్లులా వాడుకోవడం ఒక్కొకసారి పంతులుగారికే తావు లేకపోవడం కూడా జరిగింది.

## IV

ఆంధ్ర కాంగ్రెస్ రాజకీయాలలో అధ్యక్ష పదవికి పోటీలు సంభవించినపుడు, ఏకగ్రీవంగా అందరి కిష్టుడైన అభ్యర్థిగా ఎన్నుకోబడ గలిగినవాడు శ్రీ నాగేశ్వరరావు పంతులుగారే దానికి కారణం ఆయన ఆ పదవిని కాంక్షించక పోవడమే పదవులు ఆయనను వరించాయికాని, ఆయన పదవుల వెంటపడలేదు. అందుచేతనే ఆయనపట్ల అజాత శత్రువనే మాట చెల్లుబడైంది.

1930 సంవత్సరంలో గాంధీజీ ఉప్పు సత్యాగ్రహోద్యమాన్ని సాగించి నపుడు నాగేశ్వరరావు పంతులుగారు ఆ సంరంభంలో ముందుకుదూకి ఆరునెలల శిక్షకు పాల్పడ్డారు వెల్లూరు జైలులో ఆయనతోపాటు నివసించినవారంద రికీ నిత్యం పండుగగానే ఉండేది. పంతులుగారు స్వంత సొమ్ముతో భోజన పదార్థాలను తెప్పించడమే కాకుండా పాకశాలలో స్వయంగా, ఎటువంటి యరమరకలు లేకుండా పనిచేస్తుండేవారు ఆయన వెల్లూరు జైలులో ఉన్నంత కాలం అచటి రాజకీయ ఖైదీలకు లోపమనేది ఉండేదికాదు. 1930 నవరాత్రు లకు పంతులుగారు విడుదలై బయటి కొచ్చారు. ఆరు నెలలు మాత్రం శిక్ష పడ్డా అస్మదాదులం నవంబరు నాటికి విడుదలైనాము. అప్పటికి ఉద్యమం యొక్క ఉధృతం తగ్గింది. జైళ్ళల్లో ఉన్న నాయకులు ఉద్యమాన్ని ఏ విధంగా నైనా భారీ ఎత్తున సాగించమని అస్మదాదులను ఆదేశించారు. అప్పట్లో గోదావరి జిల్లాల్లో శిక్షలకన్న లాఠీ ప్రయోగం చాలా జోరైపోయింది లాఠీలవల్ల జిల్లాల్లో మందగించిన ఉద్యమాన్ని ఏదో విధంగా మద్రాసులో నైనా సాగించమని పెద్దల కోరిక. అందుచేత సర్కారు జిల్లాల్లోనుంచి

మేము కొందరమున్నూ, దక్షిణాది జిల్లాల్లోనుంచి కొందరమున్నూ మద్రాసు నగరంలో విదేశ వస్త్రాల పికెటింగ్ ప్రారంభించాం. మాకు పెద్దలు నాగేశ్వరరావు పంతులుగారు. స్వర్గీయ జస్టిస్ శ్రీ బచ్చు జగన్నాథదాస్‌గారొక అండ గోదావరి జిల్లాలనుండి, మధుర జిల్లానుండి స్వచ్ఛంద సేవకులను రావించి, వారికి భోజనాది సౌకర్యాలన్నీ కల్పించి సాయంకాలం 4 గంటలకు వారిని యజ్ఞ పశువులనుచేసి చైనా బజారులో బట్టల దుకాణములను పికెటింగు పంపడం మా పని. పోలీసులు బెత్తాలతో వాళ్ళని కొట్టి ఈడ్చేయడం జరుగుతుండేది. ఈ భాగవతాన్ని చూడడానికి, అనేకమంది విదేశీయులు కూడా వస్తూ ఉండేవారు. కొందరు స్వచ్ఛంద సేవకులు స్పృహతప్పిపోయే వరకూ ముఖ్యంగా తెలుగువాళ్ళు దెబ్బలు తినేవారు.

## V

కొందరు వీపుచూపేవారు. హిందూపత్రిక స్వచ్ఛంద సేవకులు తరిమివేయబడ్డారు అని మాత్రం వ్రాసేది. (Chased away) స్వరాజ్యల్లోనూ ఆంధ్ర పత్రికలోనూ వివరాలు ప్రకటితమయేవి. ఏరోజుకారోజు ఆ వార్తల వివరాలు చెపుతుంటే విని పంతులుగారు కన్నీరు కారుస్తూండేవారు. సంక్రాంతి పండుగలయేవరకూ మేము స్వయంగా యజ్ఞపశువులు కాకూడదనీ, ఆ తర్వాత తాను కూడా అందుకు సిద్ధమవుతాననీ చెప్పేరు. ఒకనాడు టి. ఆర్. వెంకట్రామ శాస్త్రి, పిన్సిపల్ హాగ్ మొదలైన శాంతికాములు సివిల్ లిబర్టీస్ ఉద్యమ నాయకులు పికెటింగ్‌ను పరిశీలించడానికి వచ్చారు. కొన్ని కారణాలచేత ఆనాడు అనుకోకుండానే నేనూ నా మిత్రుడు వెంకటప్పా రంగంలోకి దూకవలసి వచ్చింది. ఆ రోజున చిత్తూరు పోలీసులు డ్యూటీలో ఉన్నారు. వారెందుచేతనో మమ్మల్ని కొట్టవలసినంత జోరుగా కొట్టలేదు. ఈడ్చేసి చెన్నపట్నం పరువంతా మీ నెత్తినుందయ్యా ?' అని తిట్టేసి వదిలేశారు. మరునాడు మేము మరల రంగంలోకి దూకేం. అప్పుడు మలబారు పోలీసులు

బెత్తాలతో రక్తాలు కారేలాగున కొట్టి ఐలండు గ్రౌండ్సుదాకా ఈడ్చేశారు. వళ్ళంతా దానిమ్మ పండ్లు పగిలినట్లుంది ఆ స్థితిలో మమ్మల్ని కాంగ్రెస్‌లోని ఆస్పత్రిలో పడేశారు. ఈ కబురు తెలిసిన వెంటనే నాగేశ్వరరావుగారు మమ్మల్ని చూడడాని కొచ్చారు అంతకుముందొక క్షణం క్రిందట ఫ్రెంచి దేశస్థులను వెంటబెట్టుకుని టి. ఆర్ వెంకట్రామశాస్త్రిగారొచ్చారు ఆస్ప త్రిలో నర్సులు చికిత్స చేస్తున్నారు వళ్ళు మాత్రం మండుతోంది ఆ స్థితిలో దొరలు చూడడానికొస్తే, దొరల ముఖాలన్నీ ఒకలాగే ఉంటాయి కనుక అతి చిరాకుతో వాళ్ళ నేవో కఠినమైన మాటలన్నట్లు జ్ఞాపకం ఒకళ్ళు కొడతారు ఇంకొకళ్లు పరామర్శ కొస్తారన్న భావాన్ని కొంచెం మోటుగా వ్యక్త పరచినట్లు జ్ఞాపకం ఇంతలో కండ్లుమూసుకొని తెరిచేసరికి గాయాలను చూస్తూ కండ్ల నీరు కారుస్తున్న పంతులుగా రగుపించారు మంట తాత్కాలి కంగా తగ్గిపోయింది ఆయన మమ్మల్ని ప్రత్యక్షంగా సత్యాగ్రహం చేయ వద్దన్నమాట స్ఫురణకొచ్చి సమాధానం చెప్పబోతుంటే ఆయన వారించాడు. ఆయన ముఖంమీద ద్యోతకమైన బాధ చూస్తుంటే దెబ్బలుతిన్నది మేమా ఆయనా అని సంశయపడ వలసివచ్చింది పంతులుగారినెన్నోమార్లు పలు విధాలైన పనులు చేస్తుండగా చూచినా, ఆనాటి దృశ్యంమాత్రం మరపు రాని ఘట్టం

1934 సం. రం. నవంబరులోనో డిసెంబరులోనో సెంట్రల్ అసెం బ్లీకి ఎన్నికలు జరిగేయి. గోదావరి కృష్ణాజిల్లాల నియోజక వర్గానికి బల వంతంగా పంతులుగారిని భూలాభాయి దేశాయి వగైరా పెద్దలు అభ్యర్థిగా నిలబెట్టేరు. పంతులుగారిమీద పోటీపెట్టడానికి రాజకీయవ్యక్తులెవరూ ముందుకు రాలేదు. చివరకు సనాతనధర్మాసక్తులు కొందరు వేమూరి సుబ్రహ్మణ్యం గారనే ఆయనను పోటీపెట్టేరు. పోటి పెట్టేక ఎన్నిక తతంగం నడవవల సినదేకదా ! ఏ ప్రాంతాల వారా ప్రాంతంలోనే శ్రీ పంతులుగారికోసం పని చేశారు. మీరు రానక్కరలేదని కబుర్లు పంపేరు. అయినప్పటికీ పంతులుగారు కొన్ని ముఖ్యపట్టణాలను మాత్రం చూచారు. అంతవరకు శాసనసభా కార్య

క్రమాలపట్ల విముఖులుగా నుండిన డాక్టర్ సుబ్రహ్మణ్యం గారివంటి వారు కూడ పంతులుగారికోసం నడుములు బిగించారు ప్రత్యర్థికొక్కవోటుకూడ పడకుండా చేయాలని ఆయన పూనిన సంకల్పం సీతానగరం పోలింగు స్టేషనులో ఒకవోటరు అమాయకత్వంవలన విఫలమైంది. పోలింగు ఉద్యోగి నీ వోటెవరికి అని అడిగినప్పుడు ఆ వోటరు తనవోటును డాక్టర్ సుబ్రహ్మణ్యం గారు చెప్పిన వ్యక్తికివ్వాలని సుబ్రహ్మణ్యంగారికి అన్నాడు. అందుచేత ఒక్కవోటు పొరబాటున వేమూరి సుబ్రహ్మణంగారికి పడింది. సెంట్రల్ అసెంబ్లీలో పంతులు గారెంతోకాలం ఉండలేదు కొద్ది మాసాల అనంతరమే ఆయన అనారోగ్య స్థితిలో పడ్డారు తమ సభ్యత్వానికి రాజీనామా నిచ్చారు చాలామంది మిత్రులు ఆయనను 37 సం రం. రాష్ట్రశాసనసభా ఎన్నికలో చల్లపల్లి రాజాగారిమీద పోటీచేయమని ప్రోత్సాహించారు కాని ఆయన అంగీకరించలేదు ఆ కాలంలోనే ఆయన నివాసమైన శ్రీ బాగ్‌లో రాయలసీమ కోస్తాజిల్లాకూ ఒడంబడిక జరిగింది కాంగ్రెస్ మద్రాసు రాష్ట్ర ప్రభుత్వాన్ని చేపట్టేక ఆయన ఎంతోకాలం జీవించలేదు. పంతులుగారు మరణించి అప్పుడే ముప్పదియేళ్ళయింది కాని ఆయనను స్వయంగాచూచి ఆయన ప్రేమకు పాత్రులైన వారికిమాత్రం ఆయనింకా జీవించి యున్నట్లే కనిపిస్తుంది ఆయన నెలకొల్పిన దినపత్రిక, వారపత్రిక భారతి ఎన్నో మార్పులను చెందినాయి. వాటికన్న బహుళ ప్రచారంగల రకరకాల పత్రికలు వెలువడ్డాయి. కాని ఆ కాలపువారికి మాత్రం అవి నాగేశ్వరరావు పంతులుగారు వెలిగించిన జ్ఞాన జ్యోతులుగానే మాననీయంగా ఉన్నాయి.

## VI

నాగేశ్వరరావుపంతులుగారు తమపత్రికల ద్వారా స్థూలంగా ఆంధ్రాభ్యుదయానికి చేసిన సేవ మహత్తరమని చెప్పాలి. రాజకీయంగా కన్న ఆంధ్ర సారస్వతానికి ఆయన చేసినసేవ అద్వితీయమే. మహామేధావులు పండితులు, శాస్త్రవేత్తలు ఎంతో కృషిచేసి మహత్తరమైన గ్రంథాలను రచించి యుండ

వచ్చును. వాటిని వెలుగులోకి తెచ్చిన ప్రతిభ పంతులుగారిదే ఆంధ్ర సారస్వతంలో ఆయన ప్రోత్సహించని మార్గంలేదు ఆంధ్రాభ్యుదయానికి దోహదంచేసిన ఏ ఉద్యమమైనా ఆయన ధనం, ఆశీర్వాదంలేకుండా జరిగినది లేదు. ఆంధ్ర రాజకీయాలలో పనిచేసిన ఏ వ్యక్తికైన అవసరమైనప్పుడు ఆయన సహాయం లభ్యం కాకుండా పోలేదు పండితుడు, పండిత పోషకుడు, కళాభిమాని కళాపోషకుడు, అయిన శ్రీ నాగేశ్వరరావు పంతులుగారిని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు కళాప్రపూర్ణ బిరుదాన్నిచ్చారంటే ఆశ్చర్యమేముంది ?

హిమాలయ పర్వతంలాంటి నాగేశ్వరరావు పంతులుగారి కొక చెప్పుకోదగిన స్మృతిచిహ్నం లేదని చాలామంది ఆంధ్రులు బాధపడడం సహజం. నిజానికి నేటి ఆంధ్ర విజ్ఞానము రాజకీయవికాసమూ ఆయనకు స్మృతి చిహ్నాలని చెప్పుకోవాలి ఆయన ప్రప్రథమంగా స్థాపించిన ఆంధ్రపత్రిక, దాని అనుబంధ పత్రికలు ఆయనను జ్ఞప్తికి తెస్తూనేఉంటాయి వాటి నావిధంగా ఆంధ్రజాతి అంతా భావించుకునే స్థితిలో వాటిని రాణింపచేసే బాధ్యత ప్రధానంగా ఆ పత్రికల కధిపతులైన వారిది కాకపోతే నేటి పడికట్లననుసరించి ఆ మహానుభావునికొక కంచు విగ్రహమైనా లేదా అని సామాన్యులు అనుకోవడం సహజం. ఏనాడో ఆంధ్రదేశానికి విజయవాడ పత్రికాకేంద్రం కాగలదని పంతుగారు ఊహించకలిగేరు ఆ విజయవాడ పౌరులు ఆ కొరత తీర్చగలరని ఆశిద్దాం. నేటి ఆంధ్రపత్రిక నివాసానికెదురుగా పంతులుగారి విగ్రహాన్ని బెజవాడ పౌరులు ప్రతిష్ఠించుకోవాలి ఆలాగే హైదరాబాదులోకూడా ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో పంతులుగారి విగ్రహం ప్రతిష్టాపితం కావాలి. అవైనా ముందుతరాల వారికే. ఆయన సమకాలికులకు ఆయన నెరిగిన వారికి ఆయన విగ్రహం కనబడుతూనే ఉంటుంది. అధికార పదవులవల్ల గొప్పవారైన వ్యక్తులకు వారిభక్తులు ఏదోవిధంగా విగ్రహాలను ప్రతిష్టించడం ఉభయతారకమైన మామూలు. కాని ఏ అధికారం లేకుండా

ప్రజాహృదయంలో స్థానాన్నిపొందిన దేశోద్ధారకునికి, కాంశ్య విగ్రహాలు, చలువరాతి విగ్రహాలు లెక్కలోనివి కావు. అయినా వారి చరిత్రను కృతజ్ఞతతో తెలుసుకునే ముందుతరాలవారి కోసమైనా ఈ విగ్రహం ప్రభుత్వమే ప్రతిష్ఠించవచ్చును.

పంతులుగారి జీవితచరిత్ర ఆంధ్రయువకులకు పాఠ్య గ్రంథమై, దేశంకోసం మహత్తర కార్యసాధన చేసే ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని ప్రసాదించును గాక!

---

కాశీనాధుని నాగేశ్వరరావు

# సాహిత్య సేవ

శ్రీ ఆరుద్ర

ఆంధ్ర సారస్వతలోకం శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు గారికి ఏమీ ఋణపడలేదు అనే వాక్యంతో ఈ ప్రసంగాన్ని ప్రారంభిస్తే ఇది అవిధేయ తగా మాత్రం భావించవద్దని ప్రార్ధన పంతులుగారి పట్ల నాకున్న భక్తి శ్రద్ధలు ఇతరుల కన్నా ఒక డిగ్రీ ఎక్కువేగాని అరవీసమైన తక్కువకాదు అయినా ఆయనకు ఆంధ్ర సాహిత్యలోకం ఋణపడలేదనే నా నమ్మకం దాతకు ఎవరూ ఋణపడరు కృతజ్ఞులై ఉంటారు దానంగా ఇచ్చిన వారికి ఋణపడ్డా మనుకోడం గొడ్రాలి కడుపున పుట్టా మనుకొనడమే పంతులు గారు సాహిత్యంలోకూడా నెరదాతలు. ఆయన ఇచ్చినంత సాహిత్య సంపద ఇంకెవరూ అయాచింతగా ఇవ్వలేదు.

పంతులుగారి సాహిత్య దానాలు అరవై ఏళ్ళ క్రిందట మొదలైనాయి [1]ఏ శుభముహూర్తంలో ఆయన ఆంధ్ర వార పత్రికను బొంబాయిలో ప్రారంభించారో గాని నాటి నుండి ముప్పయి సంవత్సరాల పాటు ఎడతెగకుండా పంతులుగారు ఆంధ్ర వాఙ్మయాన్ని శ్రీమంతం చేశారు. కొన్ని వందలమంది ప్రముఖుల రచనలు ఆంధ్ర దేశానికి ఆయన తమ పత్రికల ద్వారా సమర్పించారు గురజాడ, గిడుగు, కొమర్రాజు, చిలకమర్తి, పానుగంటి మొదలైన కాకలుతీరిన జ్ఞానవృద్ధుల రచనలు మొదలుకొని శ్రీశ్రీ, కొడవగంటిలాంటి కొమ్ములు తిరుగుతున్న కోడె రచయితల చెంగనాల దాకా మూడు తరాల సృజనాత్మక నిర్మాణాలు పంతులుగారు స్థాపించిన పత్రికల వల్లనే అశేష ప్రజానీకానికీ అందుబాటులోనికి వచ్చాయి. మధ్యతరంలోని మహా కవులు ఇప్పటికీ సజీవులు చాలామంది ఉన్నారు ఎప్పటికీ సజీవంగా ఉండే కావ్యాలు

1 1908 సెప్టెంబరు 9 వ తేదీన ఆంధ్ర వార పత్రిక ప్రారంభించారు

కొందరు వ్రాశారు. పంతులుగారు పెట్టిన పత్రికలలో వ్రాసిన వాళ్ళ పేర్లు రిజిస్టరు వేసినా అది ఆధునిక ఆంధ్ర వాఙ్మయ సూచిక అవుతుంది. ఆధునిక వాఙ్మయ చరిత్ర వ్రాసేవాళ్ళు పంతులుగారి పత్రికలను చూడకపోతే వాఙ్మయాన్నే చూడలేదు అనాలి నంగూరి బసవరాజు, బాపిరాజు, కృష్ణ శాస్త్రి, విశ్వనాథ, నాయని, కొడాలి, రాయప్రోలు, జాషువా, నోరి, వేదుల, వేలూరి శివరామశాస్త్రిగారు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యం ఒకరేమిటి చేవగల రచయితలందరూ పంతులు గారు నెలకొలిపిన ఏదో ఒక ద్వారం గుండా సాహిత్య భవనం లోనికి ప్రవేశించినవారే

శంఖంలో పోస్తే తీర్థం అవుతుందో లేదో గాని ఒకనాడు భారతిలో రచన అచ్చు పడడం నిజంగా పట్టాభిషేకమే. తెలుగు నాడులో చెళ్ళపిళ్ళ శిష్యుణ్ణని చెప్పుకొనడం సాహిత్య ఫేషన్. అయితే భారతిలో వ్రాశారని రొమ్ము విరుచుకొని విర్ర వీగడం కొండెక్కినంత గొప్ప. భారతి సాహిత్య శిఖరం. చాలా కాలందాకా తంబుచెట్టి వీధిలోని ఏదో నెంబరు ఇల్లు ఆంధ్ర సాహిత్యానికి రాజధాని, పెట్టనికోట పంతులుగారు మకుటంలేని మహారాజు మరో రాజరాజు, ఇంకో కృష్ణరాయలు. రాజరాజు నన్నయ్యగారితో 'ఇవి యేనున్ సతతంబు నాయెడ కరంబిష్టంబులై యుండు' అంటూ అయిదు విషయాలు చెప్పుకొన్నాడు. పంతులుగారికీ సంతత దానశీలత, శశ్వత్సాధు సాంగత్యమూ లోకం చెప్పుకొనేటంత కరంబిష్టాలు.

కృష్ణరాయలవారు 'దేశ భాషలందు తెలుగులెస్స' అనే శ్రీనాధుని నినాదం ప్రచారం చేశారు. పంతులుగారు ఆ సంగతిని ముప్పయి సంవత్సరాల పాటు నిరూపిస్తూ వచ్చారు. ఒక రకంగా చూస్తే రాజరాజుకన్నా రాయల వారికన్నా కొన్నింతల సాహిత్యసేవ పంతులుగారే చేశారనిపిస్తుంది వాళ్ళిద్దరూ స్వంతకీర్తి కోసం వాఙ్మయ పోషణ చేస్తే పంతులుగారు ప్రజల కోసం, దేశం కోసం, విజ్ఞానాన్ని వ్యాపింప జేశారు. కర్మాచరణంలో ఉన్న అధికారంపై నమ్మకమే గాని ఆయనకు ఫలాపేక్ష ఏనాడూ లేదు.

పంతులుగారు ప్రజల కోసమే పత్రికలు పెట్టారు. ప్రజల కోసమే నడిపారు అరవై సంవత్సరాల క్రిందట ఆంధ్రవార పత్రికను ప్రారంభిస్తూ సంపాదకీయంలో ఆయన చేసిన మొట్టమొదటి ప్రకటన చూస్తే ఈ సంగతి తేటతెల్ల మవుతుంది. "ప్రజలకు విద్యాభివృద్ధియు, ప్రపంచ జ్ఞానాభివృద్ధియు గావించుటయే మా ముఖ్యాభిప్రాయము. ప్రజల యోగక్షేమాభివృద్ధికి దేశాభిమానమును స్వామి భక్తియును మిగుల సహకారులని మే ముద్ఘోషించుచుందుము" అని ఆయన ఎలుగెత్తారు[1] ప్రజాశక్తిని గుర్తించిన మొదటి జర్నలిస్టు ఆయనే! ఆ పదాన్ని సృష్టించి విరివిగా వాడిన మొదటి రచయిత వారేనేమో! 'దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్' అనే అభ్యుదయ నినాదం పంతులుగారి రచనలలో స్పష్టంగా మారుమోగుతూ ఉంటుంది 'వర్తమాన యుగమునందు ప్రజలు వాఙ్మయ పోషకులు'[2] 'శ్రీమంతుల సహాయముకంటెను వర్తమాన యుగమునందు ప్రజాదరణము వాఙ్మయాభివృద్ధికి సాధనముగ నున్నది' అని పంతులుగారు మొదటనే చాటి చెప్పారు[3]

ఆయన ఉద్దేశంలో తెలుగు ప్రజలంటే పత్రికలు చదివే ఏ కొద్దిపాటి అక్షరాస్యులో మాత్రమేకాదు. 'రామేశ్వరమునకును కాశీ పురమునకును రంగూనుకును క్వెట్టాకును నడుమనున్న' ముఖ్య పట్టణాలలో ఉండే తెలుగు వాళ్ళందరినీ ఆయన దృష్టిలో పెట్టుకొన్నారు "వీరల నందర నేకీభావులుగ జేయుట కాంధ్రభాషకు శక్తి సామర్థ్యములు గలవు. భిన్న దేశములందుండు తెలుగువారి నేక జాతీయులనుగ జేయుటకు మాతృభాషయే తగిన బంధన సాధనము" అని పంతులుగారు తలపెట్టారు[4] తెలుగు వాళ్ళందరినీ ఒక్క తాటిమీద నిలబెట్టారు.

---

1 9-9-1908 ఆంధ్ర వార పత్రిక, 2. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర (ప్లవంగ సంవత్సరాది సంచికలో పునర్ముద్రితం పుట 76) 3 అదే గ్రంథంలో అదే పుట 4. సాధారణ సంవత్సరాది సంచిక (1910) ప్రస్తావన

వాఙ్మయ వికాసానికి ప్రజా హృదయమే సుక్షేత్రమని వారికి తెలుసు. ప్రజలకు అందని విజ్ఞానం ఎంత గొప్పదైనా అడవి కాచిన వెన్నెలే. ప్రజల వృద్ధిక్షయాలలో వాఙ్మయ వృద్ధిక్షయాలు ప్రతిబింబిస్తాయి. 'ప్రజల విజయములు ప్రజాభివృద్ధి ప్రజా వ్యాపనము వాఙ్మయాభివృద్ధికిని, ప్రజాక్షయము, ప్రజా దౌర్బల్యము వాఙ్మయ స్తంభనమునకును గారణము లగుచుండును' అని ఆయన ఎప్పుడో గుర్తించారు [1] ఆదిమ యుగాలలో 'బ్రాహ్మణాధీనంబైన నిత్య కర్మానుష్ఠానము ప్రాణకళ గోల్పోయి ప్రజల నిత్య జీవన యాత్రకు నిరర్థకమైనదని' ఆయన స్పష్టపరిచారు [2] ప్రజలకు వారికి పరిచితమైన భాషలందు ధర్మోపదేశాలు చేసిన బౌద్ధ, జైన మతాల విలువను ఆయన అంచనా కట్టారు. శంకరాచార్యులు జైన బౌద్ధ మతాలను నిర్మూలం చేసినా ప్రజా సామాన్యంలో ఆ మతాలు వ్యాప్తిని పొందినివనీ, శైవులు బౌద్ధంలోని మంచి గుణాలు తనలో జీర్ణించుకొని ప్రజలను ఆకట్టుకొందని పంతులుగారు స్పష్ట పరిచారు.[3] పురాణ యుగంలో పండితులు "సహజమైన సచేతనమైన దేశీయభాషా సంప్రదాయములను ప్రజా వాంఛలను ననుసరించుటకు బదులు పురాతనమైన చిరకాల ప్రతిష్ఠితమైన సంస్కృత వాఙ్మయము ననుసరించుచు నిర్మాణ కౌశలమునకు భంగం గలుగజేసిరి" అని పంతులుగారు నేరారోపణ చేశారు [4] నన్నయగారి కాలం వచ్చేసరికి పండితులకును ప్రభువులకును ప్రజా సంకల్పమును అపుట దుష్కరమైనదని గుర్తించారు. "ప్రజాహితార్థము కాకపోయినను తమ కీర్తికొరకైనను దేశీయ వాఙ్మయ నిర్మాణమునకు బూనుకొనవలసిన యవసరము కలిగినది" అని పంతులుగారు తీర్పు చెప్పారు [5]

పండితాశ్రయమైన వాఙ్మయం ప్రజాపరమైనప్పుడు పంతులుగారు పరవశిస్తారు. "ప్రజా హృదయమునందు విజ్ఞానము లేక వికాసము సాధ్యము

1 ఆంధ్ర వాఙ్మయ చరిత్ర. (ప్లవంగ సంవత్సరాది సంచిక (1967-68) లో పునర్ముద్రితం అందులో 70 వ పుట). 2 బసవ పురాణం పీఠిక, 3 అందులోనే. 4 ఆంధ్ర వాఙ్మయ చరిత్ర (సంస్కృత వాఙ్మయ విభాగంలో) ప్లవంగ సంవత్సరాది సంచిక (1967-68) పుట 81. 5 అదే సంవత్సరాది సంచిక - అదే పుటలో.

కాదని'' ఆయనకు తెలుసు[1] ప్రజాశక్తిని సకల రంగాలలో వికసింపచేసే ఆంధ్ర సాహిత్య మహోదయం ఆయన కాంక్షించారు. ప్రజల హృదయాన్ని గ్రహించడంలో ఆయన ప్రతిభావంతులు ''ఆంధ్ర హృదయశీల మధి వ్యాప్తకముగాని వ్యావర్తకముకాదు ఉదారముగాని సంకుచితము కాదు సరళముగాని వక్రముకాదు'' అని ఉద్బోధించారు[2] ''దేశము విశాలము, భాష మధురము, జను లుత్సాహ సంపన్నులు, ఆంధ్ర భాషయందు పత్రికా పాఠకులు (ఇరవై ఆరు) వేలమంది గలరు వ్యాసలేఖకు లనేకులు గలరు విచారణీయంబులైన విషయంబు లనేకములు గలవు. జనాభిప్రాయముల కనుకూలముగా విషయ విమర్శనము'' చేసే పత్రికలు కావాలని ఆయన సంకల్పించారు[3] అందుకే ఒకటి కాదు నాలుగు పత్రికలు క్రమేణా పెట్టారు జర్నలిజానికి జనకు లయ్యారు స్వర్ణ యుగానికి నాంది పలికారు

జర్నలిజం హడావుడిలో వ్రాసిన సాహిత్యం అని ఒక నిర్వచన ముంది పంతులుగారు జర్నలిస్టులేగాని తొందరపాటు తొట్రుపాటు లేని సాహిత్యవేత్తలుకూడా. నిశ్చలమైన విశ్వాసాలు, నిర్దుష్టమైన తాత్త్వికచింతనా ఉన్నవారు. ప్రత్యేక దార్శనిక దృక్పథం లేనివాళ్ళు యుగపురుషులుకాలేరు కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు ఎప్పుడో చెప్పినట్టు ఆంధ్రదేశ చరిత్రలో వీరేశలింగముగారికి తరువాతది నాగేశ్వరరావు యుగమే[4] సంకల్ప బలము, కార్యదీక్ష, త్యాగమూ యుగపురుష లిద్దరికీ సమానమే అని కోలవెన్ను వారు అన్నారు వీరేశలింగంగారిదీ నాగేశలింగం గారిదీ విద్యాకుటుంబాలే (పంతులుగారికి తల్లి దండ్రులు పెట్టిన పేరు నాగలింగం) కందుకూరివారి లోనూ కాశీనాథునివారిలోనూ కృతిభర్తలూ, కృతికర్తలూ ఉన్నారు అయితే ఈ యిద్దరూ పాతకీర్తిని చాటుకోలేదు. చెట్టు పేరు చెప్పి కాయలమ్ముకొనే గతి వాళ్ళకు పట్టదు వాళ్లే మహావృక్షాలు కదా.

---

1 విభవ సంవత్సరాది సంచిక (1928) ప్రస్తావనలో. 2. భారతి జనవరి 1924. తొలి స్వవిషయంలో, 3 ఆంధ్ర దిన పత్రిక తొలి సంపాదకీయంలో (1-4-1914). 4 భారతి మే 1938

వీరేశలింగంగారి ఉద్యమాల సత్ఫలంలోని బీజమే నాగేశ్వరరావు గారిలో మొలకెత్తి వేళ్ళూని విస్తరించింది. వీరేశలింగంగారిలో మూడు సుగుణాలను పంతులుగారు చూశారు.[1] స్వయం సహాయం, సత్య ప్రియత్వం నిరంతర వ్యవసాయ పరాయణత్వం అనే ఆ మూడింటినీ తమ స్వంతం చేసుకొన్నారు జీవితంలో సాధించవలసినవి ఎన్నో ఉన్నాయని గ్రహించారు. పైకి రావాలనే అంతులేని అపారమైన ఆశ, ఆకాంక్ష ఆయనకు తొలినుంచీ ఉండేవి [2] అక్షరజ్ఞానంలేని సంకుచిత బుద్ధులైన జనులమధ్య అభివృద్ధి చెందడం కష్టం అని ఆయన పరసీమలకు వెళ్ళిపోయారు [3] వ్యక్తి సేవ చేయడం ఇష్టంలేదు [4] స్వయం సహాయంతో నిరంతర వ్యవసాయ పరాయణత్వంలో ఆయన అమృతాంజనం పేరిటి కల్పవృక్షాన్ని భూమికి దింపారు. దాన్ని ఆంధ్రుల పెరటి కల్పాకాన్ని చేయడంలోనే ఆయన ఔదార్యం కనబడుతుంది

రెండు చేతులా ఆర్జిస్తున్నకొద్దీ పంతులుగారిలోని మహాపురుష లక్షణాలు మొగ్గ తొడగడం ప్రారంభించాయి స్వార్థం పోయి పరమార్థం పెరిగింది అక్షరజ్ఞానంలేని సంకుచిత బుద్ధులైన జనులమధ్య అభివృద్ధి చెందడం కష్టమని ఆదిలో అనుకొన్నారు తాము అభివృద్ధి చెందడం మొదలు పెట్టాక ఆ అక్షరజ్ఞానం లేనివాళ్ళూ, ఆ సంకుచిత బుద్ధులూకూడా అభివృద్ధి చెందాలనే తహతహ పంతులుగారిలో ఇనుమడించింది. విజ్ఞాన వ్యాప్తిని ఉద్యమంగా చేపట్టారు వాఙ్మయ విస్తరణ చేసారు సాహిత్యాభ్యుదయం చూశారు సారస్వత పతాకం ఎగర వేశారు

ఇవాళ వాఙ్మయం సాహిత్యం, సారస్వతం అనే మాటల్ని పర్యాయ పదాలుగా మనం వాడుతున్నాం. అయితే పంతులుగారి ఉద్దేశంలో సాహిత్యం, సారస్వతం అనేవి రెండు విభిన్న పరాలు ఇవాళ మనం సంస్కృతి అనే

1 విరోధికృత్తు సంవత్సరాది సంచిక (1911) ప్రస్తావనలో. 2 పంతులుగారు తమ బావగారికి వ్రాసిన ఉత్తరం (గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారి 'దేశోద్ధారక చరిత్ర' పుట 42) 3. అందులోనే. 4 అందులోనే

మాటను ఏ అర్థంలో వాడుతున్నామో ఆ అర్థంలో సాహిత్యం అనే పదాన్ని పంతులుగారు వాడేవారనిపిస్తుంది ఒక పీఠికలో ఆయన 'సాహిత్యమునకు సారస్వతము మకుటము' అన్నారు.[1] లలితకళలు, నృత్య గీత వాద్యాదులు సాహిత్యాంగాలని చెప్పారు ఇవి సాహిత్య నిర్మాణ వికాసాలకు సాధనాలైనా భావ ప్రకాశానికి భాషే మూలాధారమని చెప్పారు. సాహిత్యతత్త్వానికి తత్త్వ విచారానికి ఇదే సాధనమని చెప్పారు. మరొక వ్యాసంలో చిత్రకళను సాహిత్యంలో చేర్చారు భావ ప్రదర్శనంలోనూ రూప నిర్మాణంలోనూ భారతీయ సంస్కారం లేని చిత్ర రచనలు సాహిత్యాభ్యుదయమునకు నిరుపయోగం అన్నారు[2] ఈమాటలవల్ల సంస్కృతిని పంతులుగారు సాహిత్య పదంతో నిర్దేశించారని వూహిస్తున్నాను

పంతులుగారు తమ రచనలలో ఎక్కడా సంస్కృతి అనే మాటను వాడినట్టు కనబడదు సంస్కారం అనే పదం ఆ ఉద్దేశంలో వాడేవారు ప్రాచ్య పాశ్చాత్య సంస్కారాలు రెండింటినీ ఆయన ఆకళింపు చేసుకొన్నారు ఆర్ష విజ్ఞానాన్నీ, ఆధునిక శాస్త్ర పరిజ్ఞానాన్నీ ఆయన సమన్వయం చేశారు ఒక ప్రత్యేక దర్శనాన్ని ఆయన ప్రతిపాదించకుండానే ప్రచారం చేసారు. పంతులుగారి విశ్వాసాలనీ, ప్రవచనాలనీ క్రోడీకరించి నాగేశ్వర దర్శనం ఏమిటో పరిశీలించకపోతే వారి సాహిత్య దృక్పథం అర్థంకాదు

ప్రపంచంలోని ప్రతి తత్త్వవేత్తా సాహిత్య నిర్వచనాలు చేశారు. దార్శనిక పరిజ్ఞానంతోనే ఆలంకారికులు, రస స్వరూపాన్నీ కావ్య ప్రయోజనాన్ని నిర్దేశిస్తారు. కాశ్మీర శైవంవల్ల ప్రభావితులైన ఆనందవర్ధనుడు, అభినవ గుప్తుడూ, భారతీయ లక్షణ గ్రంథాలను పరిపుష్టం చేశారు. ఆ ధ్వని

1. సాహిత్య తత్త్వ విచారము – సమీక్ష – జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి రచన (ప్లవంగ ఉగాది సంచిక పుట 209). 2 అజంతా విహారములు వ్యాసం (ప్లవంగ ఉగాది సంచిక – పుట 133)

సిద్ధాంతాన్నే సర్వులూ ఆమోదించారు. నాగేశ్వరరావు పంతులుగారు ఈ దృక్పథంతోకాక స్వయంగా ఒక సాహిత్య దర్శనం రూపొందించుకొన్నారు

ఆయన పుట్టింది శైవులయింట. పారాయణ చేసినది భగవద్గీత. దీక్ష పుచ్చుకొన్నది శ్రీ విద్య. పరిశీలించినవి అనేక తత్త్వాలు. వీటన్నిటినీ మేళవించారు ఈ సమన్వయంవల్ల ఒక నూతన సిద్ధాంతం ఏర్పడుతుంది ఇది పంతులుగారి ప్రతి చర్యలోనూ ప్రతి రచనలోనూ కనబడుతుంది. ఈ సిద్ధాంతాన్ని అర్థం చేసుకొంటేనేగాని పంతులుగారి వ్యక్తిత్వం మనకు బోధపడదు నాగేశ్వర దర్శనాన్ని సంగ్రహంగా వివరిస్తాను

జగత్తు శక్తిమయం శక్తి మూడు రకాలు అవి ఇచ్ఛాజ్ఞాన క్రియా శక్తులు ఈ శక్తి క్రియ రూపంవల్లనే జగత్తు ఏర్పడుతూంది [1] చిచ్ఛక్తి సర్వ వ్యాపకం. (భారతీయ తత్త్వ పరిభాషలోవాడే చిచ్ఛక్తికి ఆధునికంగా రేడియో యాక్టివిటీ అనే అర్థాన్ని పంతులుగారు చెప్పారు [2] అహతశబ్ద రూపమైన జగత్తు అనాహత శబ్దరూపమైన శక్తిమూలంగా వశమగుతుంది [3] పరిమితమైన శక్తినీ అపరిమితముచేసి, సర్వాత్మత్వమును పరిస్ఫుటం చేయడమే సకల యోగాలకు పరమార్థం [4] ఆత్మను బాహ్య విషయారాధనం నుండి అంతర్ముఖం చేయడమే యోగం [5] యమ నియమ త్యాగాది యోగాంగాలు పదిహేను ఉన్నాయి ఈ అంగాలతో కూడిన రాజయోగమే పూర్ణ యోగం అదే మోక్షానికి సాధనం [6]

మానవులు కర్మలను పరహితార్థం చేస్తేనే మోక్షం స్వకామ్యార్థం చేస్తే బంధమే లభిస్తుంది.[7] మోక్షం పురుషార్థాలలో ప్రధానమైంది.[8] చతుర్విధ

1 ఈ దర్శనం పంతులుగారి వివిధ రచనలనుండి క్రోడీకరించాను. అవి ప్లవంగ సంవత్సరాది సంచిక (1967-68)లో సంకలనమయ్యాయి అన్యథా పేర్కొనకపోతే ఈ అధోజ్ఞాపికలలోని పుటలసంఖ్య ఆ సంచిక పేజీలనే సూచిస్తాయి 2 పుట 135 3. పుట 40. 4 పుట 52. 5 పుట 16. 6 పుట 219. 7 పుట 82 8 పుట 43.

పురుషార్థాలకూ ధర్మం కీలకం అర్థకామాలు ధర్మాధీనాలు, ధర్మం అర్థకామాలకు అతీతం[1] ధర్మానికి అర్థం నీతి. ఆత్మదృష్టితో ఏ నీతి పాలింపదగినదో అదే ధర్మం[2] నీతే జ్ఞాన యాత్రకు సాధనం పురుషార్థానికి ఫలం[3]

జీవయాత్రకు పరమార్థం సుఖప్రాప్తి దుఃఖనివృత్తి.[4] జీవయాత్రలో వ్యక్తావ్యక్తాల పరిజ్ఞానమే మతాలకూ, ధర్మాలకూ, కర్మలకూ, సాహిత్యానికి కళలకు, శాస్త్రాలకూ పరమ ఫలం. అవ్యక్తమైన పరమాత్మకూ వ్యక్తమైన విశ్వానికీ వ్యక్తావ్యక్తమైన జీవుడిలోనే ధర్మప్రతిష్ఠ కలుగుతోంది.[5] స్వర్వ వ్యాపకమైన చిచ్ఛక్తి బ్రహ్మాండంలో ఉన్నట్లే పిండాండంలోకూడా ఉంటుంది[6] దానిని అనుభవేద్యం చేయడమే యోగాశాస్త్రాలకు మంత్రతంత్రాలకూ కావ్య కళలకు ప్రయోజనం[7]

విశ్వవ్యాప్తమైన రేడియోశక్తిని యంత్ర సాధనాలతో శబ్దరూపాన ప్రత్యక్షం చేసుకొనేటట్లు బ్రహ్మాండవ్యాప్తమైన చైతన్యశక్తిని మంత్ర రూపంతో దేహంలో ప్రత్యక్షం చేసుకోవాలి.[8] సాధకులకు సకల సాధనాలు ధర్మక్షేత్రమైన శరీరంలోనే ప్రత్యక్షంగా ఉన్నాయి[9] అఖండమైన విశ్వ వ్యాప్తమైన చైతన్యశక్తిని ఆత్మయందు ఆవాహనచేసి శక్తి నేకముఖం చేయడమే యోగం[10] కుండలినీయోగమే ఆనందరసాన్ని కలుగచేస్తుంది[11]

మంత్రతంత్ర యోగశాస్త్రాలు శ్రీవిద్యారూపంలో ఈ పరమార్థాన్ని సాధించుటకు వినియోగ పడుతున్నాయి.[12] జలయంత్రాలు, వాయు యంత్రాలు, ఆవిరి యంత్రాలు, విద్యుద్యంత్రాలు మొదనైనవి లలితాస్తోత్ర ప్రతిపాదితమైన మహాశక్తి మానవ ధర్మాభ్యుదయానికి వినియోగపడే విధాన్ని విశదం చేస్తున్నాయి[13] ఆది కాలంలో భయభ్రాంతులకు మూలమైన ప్రకృతిశక్తులు కాల క్రమాన వశవర్తినులై మానవ ధర్మాభ్యుదయానికి వినియోగపడుతున్నాయి.[14]

1 పుట 27, 2 పుట 230, 3 పుట 194 4 పుట 4 5 పుట 60, 6. పుట 40, 7 పుట 42, 8. అదేపేజీలో. 9 పుట 62, 10 పుట 30, 11. అదే పుటలో. 12 పుట 42, 13 పుట 138 14 పుట 42,

మానవాభ్యుదయానికి మానవ విజ్ఞానం మూలధనం సకల శాస్త్రాల విజ్ఞానమూ మానవాభ్యుదయానికి విశ్వకల్యాణానికి వినియోగించుటే విజ్ఞానానికి పరమార్థం [1] విజ్ఞానం పశుప్రవృత్తిని మానవ ప్రవృత్తికిని, మానవ ప్రకృతిని దైవ ప్రకృతికిని, దైవ ప్రవృత్తిని బ్రహ్మ ప్రవృత్తికిని మరల్చడానికి వినియోగ పడుతుంది [2] దుర్లభమైన బ్రహ్మాధికారం విజ్ఞాన సంపన్నులకు సాధ్యము [3]

బ్రహ్మవిద్యకు సాహిత్యాలూ, కళలూకూడా సాధనాలు [4] చిరకాలానుగతాలైన కావ్య సంప్రదాయ సంకేతాలు విశ్వసాహిత్య రచనకూ సందర్శనానికీ రసానందానికీ ప్రతిబంధకాలైనాయి [5] కావ్యాలు కవుల సంకల్ప సంస్కారాను రూపాలు [6] విశ్వనిర్మాణంలోలాగే కావ్యరచనకూడా ఇచ్ఛాశక్తి బీజం. జ్ఞానశక్తి శక్తి, క్రియాశక్తి కీలకం,[7] సాహిత్యం అవ్యక్తానికి సువ్యక్తమైన పురుషార్థం [8] సాపేక్షమైన సాహిత్య రసానందానుభవం నిరపేక్షమైన ఆత్మానందానుభవంలో ఐక్యం పొందుతూంది [9] భావశబ్దార్థకళల యోగానుభవమే సాహిత్యం [10]

సారస్వతాభ్యుదయానికి సహజమైన భావాలలాగే సహజమైన భాష మూలాధారం [11] అవ్యక్తమైన శక్తికి నాదము ప్రధమ వ్యక్తి స్వరూపం, నాదం శబ్దరూపంలో బ్రహ్మాండావృతమై భాషాధారంతో బ్రహ్మాండాన్ని గ్రాహ్యం చేస్తున్నది,[12] జీవజాలల ఆత్మోపలబ్ధికి అణువు మొదలు మహత్తు వరకు వ్యాప్తమైన ప్రకృతి అంతా సాధనభూతముగా ఉంది.[13] విశ్వసాహిత్యమంతా ఈ పరమ ప్రయోజనాన్ని విజ్ఞానరూపంలో సమకూర్చుతోంది [14]

అనంతమైన విశ్వవిజ్ఞాన సామ్రాజ్యానుభవం సకల మానవులకును సాధ్యము. సకల జనులూ సాధకులే. అర్హులే, అధికారులే [15] జాతిమతాది

---

1 పుట 4, 2 పుట 188, 3 పుట 140, 4 పుట 6, 5 పుట 28, 6 పుట 27, 7 పుట 28 8 పుట 207, 9 పుట 208 10, అదేపుటలో 11 పుట 200 12 పుట40 13 పుట 137 14 అదే పుటలో 15 పుట 140

బేధాలు, వర్ణాశ్రమ బేధాలు, అనిత్యాలూ, సాపేక్షలేగాని శాశ్వతాలు నిర పేక్షలు కావు ఆత్మోన్నతికి సకల మానవులూ సమానాధికారులు [1] అవ యవాభివృద్ధిలో తప్ప స్త్రీలు పురుషుని కేగుణమందూ తీసిపోరు [2]

స్త్రీ పుంసయోగం విశ్వప్రవృత్తికి విశ్వకల్యాణానికి మూలం [3] శృంగా రము సృష్టి స్థితుల కాధారము ప్రేమ మూలము హృదయవిర్భూతం. విశ్వాత్మకం, ఆనందకరం, కార్యసాధనం రసరాజం నీరంలేని శృంగారం జడప్రాయం శాంతములేని శృంగారం కామపరాయణం శాంత శృంగారము రసానందపరాయణం [4]

రసానందం విషయాసక్తంకాక విషయాతీతంగా ఉండడమే విశ్వ శ్రేయస్సుకు సాధనం [5] ప్రపంచంలో శుద్ధసత్త్వము కాని శుద్ధచెడుగానీలేదు. వాటి మిశ్రమాన్నే మనం చూస్తాం. ప్రపంచమే మిశ్రమం శ్రేయస్సు కవి సంకల్పంలో ఉంది.[6]

ఇదీ పంతులుగారి ఫిలాసఫీ. దీన్నే ఆయన ముప్ఫయి సంవత్సరాల పాటు ఆచరణలో పెట్టారు. చెయ్యకుండా ప్రచారం చేశారు ఈ దృష్టితోనే పాత సాహిత్యాన్ని పరిశీలించారు కొత్త సాహిత్యాన్ని ప్రోత్సహించారు రేపుకోసం ఎదురు చూడ్డం మంచిదేగాని నిన్నలో బతక్కూడదు అందుకే పంతులుగారు ఎప్పుడూ వర్తమానం సంగతి తెలుగువాళ్లకు జ్ఞాపకంచేస్తూ ఉంటారు. ప్రాచీనతను అర్థంచేసుకొని ఆధునికంగా జీవించాలని ఆయన ఆశయం. ఆ ఆశయసిద్ధికోసమే ఆయన భారతిని స్థాపించారు. అప్పటికి మూడు పత్రికలు వారికున్నాయి వారపత్రిక, ఉగాది సంచిక, దినపత్రికా ఉన్నా మాసపత్రికను స్థాపించడంలో ఒక కారణంఉంది. "ప్రజాదృష్టిని నవజీవన ప్రవృత్తియందు లగ్నము చేయవలసిన యవసరము గలిగినది. ఆ యవసరము సఫలముచేయుట కాంధ్ర ప్రపంచము పూర్వాపర సంస్కారము

---

1 పుట 238. 2 పుట 220. 3 పుట 114. 4 పుట 34. 5 పుట 91. 6 పుట 220

లను సమన్వయము చేయుటకు పూనుకొనుచున్నది" అని పంతులుగారు భారతి మొట్టమొదటి సంచికలోని స్వవిషయంలో చెప్పారు[1]

నవజీవన ప్రవృత్తిని మనసారా ఆశించడంవల్లనే పంతులుగారు యువజనులను ఉత్తేజపరిచారు ఒక ప్రస్తావనలో ఇలా వ్రాశారు. "నిరంకుశాధికారులకు రాజకీయ స్వాతంత్ర్యము గిట్టదు. సనాతనులకు సాంఘిక సంస్కరణము పనికిరాదు మతాచార్యులకు మతసంస్కారము పాప భూయిష్టము ధనస్వాములకు ప్రజాస్వాతంత్ర్యము భయంకరము. సాహిత్య కళాభిమానులకు నవీన మార్గము లుపద్రవకరములు. స్వాతంత్ర ప్రియులైన వీరులు, ధీరులు, కవులు, గాయకులు, కళాభిజ్ఞులు స్వాతంత్ర్య యుగస్థాపనమునకు వారి శక్తి సామర్థ్యములను వినియోగించవలసిన యవసరము గలిగినది ఆంధ్రదేశ భాగ్యోదయము స్వాతంత్ర్య ప్రియులైన యువజనుల మీద యాధారపడి యున్నది."[2]

పంతులుగారు తమ ముప్ఫయి సంవత్సరాల సాహిత్యసేవలో ఎప్పటి కప్పుడు ఆయాతరాలలో యువకులను ప్రోత్సాహిస్తూనే వచ్చారు రాయప్రోలు సుబ్బారావుగారు కొత్త రీతులలో కవిత్వం వ్రాస్తున్నప్పుడు 1914లో ఆనంద ఉగాది సంచిక ప్రస్తావనలో పంతులుగారు ఇలా వ్రాశారు "నూతన భావములు వికసించుచున్నవి నూతన భావపూరితములైన గీతములను కథలును రచింపబడుచున్నవి. నూతన శైలి సంక్షిప్తము. నూతన భావములు గంభీరములు. నూతన సంప్రదాయము లపరిచితములు నూతనాదర్శములు సదాశాభరితములు. శైలియు భావములను సంప్రదాయమును విపరీతాభిప్రాయమును గలిగించుట సహజము. కాలక్రమమున నివి పరిపాటియై భాషకు నూతనాలంకారముల సమకూర్చగలవు. రాయప్రోలు సుబ్బారావుగారు రచించిన తృణకంకణము కష్టకమల మొదలగు రాగగీతములు రసభరితములు"

---

1 సంపుటి 1 సంచిక 1 జనవరి 1924 2 శ్రీముఖ సంవత్సరాది సంచిక (1933-34) ప్రస్తావన

ఇరవై సంవత్సరాల తరువాత శ్రీశ్రీ క్రొత్త క్రొత్త ప్రయోగాలు ప్రారంభిస్తున్నప్పుడు భావకవులను అందరూ ఎత్తిపొడుస్తున్నప్పుడు, అక్కిరాజు, ఉమాకాంతంగారు నవ్యసాహిత్యంపై విరుచుకుపడ్డప్పుడు పంతులుగారు ఒక ఉగాది సంచిక ప్రస్తావనలో ఇలా వ్రాశారు

"గతించిన పదేండ్లయందును సారస్వతమునందు వెలసిన నవీన సాహిత్య నిర్మాణములు ఖండనమండనములకు పాత్రమైనను క్రమవికాసమును పొందుచు విద్యావంతుల హృదయము నాకర్షించుచున్నవి దేశమంతయు రాజకీయ సాంఘిక మతాది విషయములందు స్వాతంత్ర్యప్రాప్తికై పరితపించుచున్నప్పుడు సారస్వతమునందీ పరితాపము ప్రతిబింబించుచుండును యువ జనులు నవజీవన నిర్మాణమునకై మహాత్యాగము చేయుచున్నపుడు సాహిత్యరచనలందు వారి త్యాగము సహజముగ ప్రతిబింబించు చుండును సకల నిర్మాణములకును స్వాతంత్ర్యము మూలాంకురము స్వాతంత్ర్య విలసితములైన రచనలు ప్రాచీన నవీన భేదమును సంస్కృతాంధ్ర భేదమును లేక ప్రజాదరణమును బడయుచున్నవి "[1]

ఒక ప్రముఖ సాహిత్య పత్రికా, దాని అధిపతీ సాహిత్యంలో స్వాతంత్ర్యాన్ని ఇంతగా ప్రోత్సహించబట్టే మన ఆధునిక సాహిత్యం చైతన్యవంతమైంది. పంతులుగారి స్వాతంత్ర్యాభిమానం యతిప్రాసలు అక్కర్లేదని అంగీకరించేటంతవరకు వెళ్ళింది. ప్రమోదూత ఉగాది సంచికలో సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు యతిప్రాసల విషయమై ఒక వ్యాసం వ్రాశారు దానిని తమ ప్రస్తావనలో పేర్కొంటూ పంతులుగారు ఇలా అన్నారు "కవిత్వమునకు హృదయము భావమైనప్పుడు మాటల ప్రతిబంధకమును తొలగించుటవలనను కావ్యములందు రసానందమున కభ్యంతరములు గలుగజాలవు."[2] ఆధునికులను పంతులుగారు ఇలా వెనకేసుకురావడం కొండంత

---

1 శ్రీముఖ సంవత్సరాది సంచిక (1933-34). 2 ప్రమోదూత సంవత్సరాది సంచిక (1930)

బలాన్ని ఇచ్చింది. ఎంకి పాటల గాలిదుమారంలో 'ఆ పాటలలో భావసంపద యుండుట వలననే భారతిలో వానిని ప్రకటించితిమి... శ్రీ సుబ్బారావుగారి ప్రయత్నము శ్లాఘ్యము ... విమర్శనాపాత్ర మైన పాటలో అసభ్యతగాని యనౌచిత్యము లేదని మా విశ్వాసము ... పారకులయొక్క రుచి బేధములను ప్రదర్శించునను నూహతో మాత్రమే అనుకూల ప్రతికూల విమర్శనలు రెండింటిని బ్రకటించితిమి'' అని పంతులు గారు భారతిలో ప్రకటించారు.[1]

పారకుల రుచినీ జనాభిప్రాయాన్నీ పంతులుగారు ఎప్పుడూ కనిపెడుతూనే ఉంటారు సాధారణంగా పత్రికలు తమ సిద్ధాంతాలను ప్రజలమీద రుద్దడానికి ప్రయత్నిస్తాయి పంతులుగారు దానికి వ్యతిరేకులు పెట్టుబడిదారీ సమాజంలోని పత్రికల స్వభావాన్ని ఆయన ఇలా ఖండించారు "సర్వత్ర ధనము రాజ్యము చేయుచున్నది శ్రీమంతులు ముద్రణాలయములను బెట్టి వారి వాదములను విశ్వవ్యాప్తము చేయుట సులభసాధ్యమై యున్నది డైలీ మెయిల్, లండన్ టైమ్సు మొదలగు పత్రికలు స్వపక్షవాదమును దినదినము లక్షలకొలది ప్రజల చిత్రములందు ప్రతిబింబింప చేయుచున్నవి. పండితులు పామరులు పత్రికాభిప్రాయములను విమర్శ లేకయే తమ అభిప్రాయములను గ్రహించుచున్నారు శ్రీమంతులు పూనిన మార్గమును సామాన్యులును నవలంబించుచున్నారు. ముద్రణాలయమును స్థాపించుట పత్రికలను ప్రచురించుట స్వాభిప్రాయములను వ్యాపింపచేయుట సులభమైనది అన్నశాలలందు సిద్ధాన్నము వలె వార్తాపత్రికలందు సిద్ధభావములు సులభగ్రాహ్యములైనవి. ఏ విషయముగాని శ్రద్ధతో చదువుటకును చదివినదానిని ధ్యానమననాదులుచేసి విజ్ఞానమును బడయుటకును అవకాశములు చాలకున్నవి "[2]

పంతులుగారు 1927 లో వ్రాసిన ఈ మాటలు నలభై సంవత్సరాల తరువాత కూడా ఈనాటిస్థితిని వర్ణిస్తున్నాయి. ఆయన సిద్ధభావాలను సులభంగా

---

1 భారతి సంపుటి 1 సంచిక 6 (జూన్ 1924) పుట 138 2 సాభిప్రాయ విశేషములు భారతి ఆగస్టు 1927

గ్రహించే వారుకారు. ఏ విషయమైనా శ్రద్ధగా చదివేవారు చదివినదానిని ధ్యానమననాదులు చేసేవారు ఈ సంగతి ఆయన రచించిన ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో స్ఫుటంగా కనబడుతుంది.

ఆ గ్రంథంలో చివర ఆయన "ఇందు క్రొత్తవిషయములు లేవు. ఇంతవరకు నితర పరిశోధకులు వ్యాఖ్యాతలు తెలిపిన భావములే మరల తెలుపబడినవి" అని వినయానికి వ్రాసినా అంతవరకు లేని క్రొత్త దృక్పథంతో ఆయన ఆంధ్ర వాఙ్మయానికి భాష్యం వ్రాశారు[1] లేకపోతే పింగళి సూరన రాజుగారి కళాపూర్ణోదయాన్ని శ్రీవిద్యా పరంగా వ్యాఖ్యానం చేయడం ఎలా సంభవిస్తుంది ?

పంతులుగారికి ఆంధ్ర సాహిత్యంలో ఇద్దరే ప్రాచీన కవులు సదారాధ్యులు వాళ్ళు తిక్కనగారూ, పింగళి సూరనరాజుగారును. "తిక్కనకు మించిన కవి సార్వభౌముడు ఆంధ్రదేశంబున బుట్టంబోడు" అని 1911 ఉగాది సంచికలోనే స్పష్టంగా చెప్పారు "ఆంధ్ర సాహిత్యమును పరిస్ఫుటము చేసిన కవులందు సూరనార్యుడు పరంజ్యోతివలె ప్రకాశించుచున్నాడు" అని ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో చాటి చెప్పారు[2] గ్రామ్య గ్రాంధిక భాషా వివాదాలలో ఈ ఇద్దరి కవులనుంచే గుణపాఠం నేర్చుకోవాలని పంతులుగారు సూచించారు "తిక్కయజ్వ సూరనార్యుల రచనలందు దేశీయ పదములు కుప్పలు తెప్పలుగ వాడబడినవి విద్వజ్జనాదరణీయము గాంచినవి. ఆ దేశీయభాష యిపుడు గ్రాంధిక భాషగా నెంచబడుచున్నది." అని జ్ఞాపకం చేసారు[3] కల్పనాదశలకు భాషాప్రతిబంధక మసంభవం అని వారి నమ్మకం

అందుకే ఏ భాషలో వ్రాసినదైనా ఆయన తొలినుంచీ భావ సంపద ఉంటే ప్రచురించేవారు. మొదటి కొద్దిరోజులలో "ఎప్పటికైనను గ్రంథ రచనలకు

1. ప్లవంగ సంవత్సరాది సంచిక - పుట 115, 2 అదే సంచిక - పుట 102.
3 విరోధికృతి సంవత్సరాది సంచిక (1911) ప్రస్తావన.

గ్రాంధిక భాషయే శరణ్యము''[1] అని భావించేటప్పుడు కూడా గిడుగువారి వ్యాసాలు గురజాడరచనలు పంతులుగారు సగౌరవంగా ప్రచురించారు. గురజాడ అప్పారావుగారికి సలహాలు ఇచ్చారు. ఆయనవద్ద నుండి సూచనలు వాంఛించారు గురజాడ వారికి తోచిన అభిరుచివున్న ఆసక్తివున్న విషయం మీద గ్రంధంవ్రాసి పంపితే కృతజ్ఞుడనని ఉత్తరం వ్రాసారు.[2] గిడుగువారు మద్రాసు వచ్చినప్పుడల్లా సభ పెట్టించడం జరిగేదట. పండితారాధ్యచరిత్రను పరిష్కరించమని పంతులుగారు గిడుగు రామూర్తి పంతులుగారిని ప్రార్థించారు భాషాయుద్ధాలతోనే రామూర్తి పంతులుగారికి సరిపోయేది గ్రంధపరిష్కరణమునకు తీరిక లేకపోయింది భావాన్ని శిష్యులమీద పెట్టారు. పండితారాధ్య చరిత్ర పూర్తిగా అచ్చుపడలేదన్న విచారం పంతులుగారికి మిగిలిపోయింది దానిని చూడకుండానే వారు పోయారు.

పండితారాధ్య చరిత్ర ఆంధ్ర గ్రంధమాలలో 30వ కుసుమం. ఈ ప్రచురణశాఖను పంతులుగారు అన్నిటికన్నా ఆలస్యంగా స్థాపించారు అయితే గ్రంధప్రచురణ చేయాలన్న సంకల్పం వారికి సంవత్సరాది సంచికలు తెస్తున్నప్పటినుంచీ ఉంది. ప్రజలకు అందుబాటులో ఉండాలని అర్ధణాకో పుస్తకం అమ్మాలని ప్రణాళిక వేసుకొన్నారు. పెద్దదయితే బేడ అంతకుమించిన ధర ఉండ కూడదనుకొన్నారు[3] ఇతర వ్యాపకాలవల్ల ఈ గ్రంధ ప్రచురణ ఉద్యమం సాగలేదుకాబోలు సాగితే ఎన్ని గ్రంధాలు వచ్చివుండేవో.

"పంతులు గారికి ఇతరుల గ్రంధాలు ప్రచురించే శ్రద్ధేగాని స్వంతంగా రచనలు చేదామనే ఉబలాటం ఎప్పుడూలేదు. చేతకాకకాదు. అవసరమైతే ఎన్నయినా వ్రాయగలరు. 1912వ సంవత్సరంలో, పరీధావి ఉగాది సంచికలో 40 వ్యాసాలు అచ్చుబడ్డాయి. రాజ్యాంగ వ్యవహారాల గురించి ఎవ్వరూ వ్యాసాలు వ్రాసిపంపలేదు పంతులుగారు కలం పట్టుకొని 5 వ్యాసాలు వ్రాశారు. 66 పేజీల మేటరు తయారు చేశారు ఇంపీరియల్ గెజిటీరు, ఢిల్లీ చరిత్ర

1. విరోధికృత సంవత్సరాది సంచిక (1911) ప్రస్తావనలో, 2 గురజాడ రచనలు, సంపుటి 5 లేఖలు పుట 172, 3 పై పుస్తకం - అదే పేజీ

మొదలైన ఇంగ్లీషు చరిత్ర గ్రంథాల ఆధారంతో వ్రాసిన ప్రామాణిక వ్యాసాలవి అవి పంతులుగారి పేరుమీదుగానే అచ్చుపడ్డాయి

సాధారణంగా ఉగాది సంచికలలోనూ, భారతి సంపుటాలలోనూ వ్యాస కర్తల పేర్లలో 'కా నాగేశ్వరరావు' అనే పేరు కనబడదు ఉగాది సంచికల్లో ప్రస్తావన, భారతిలో ఏడాది మొదట స్వవిషయం, ప్రతి నెలా సాభిప్రాయ విశేషాలు ఆయన వ్రాసేవారు. వీటిలో ఆయనకున్న బహుముఖ ప్రజ్ఞ కనబడుతుంది సాహిత్యం గురించి అప్పుడప్పుడు వ్రాసేవారు ఆయన తన సేవను కేవలం సృజనాత్మక సాహిత్యానికే మీదు కట్టలేదు వారికి కావలసినది సర్వతోముఖ వికాసం అందుకే ఉగాది సంచికలలో పన్నెండు విభాగాలు ఉండేవి రాజకీయం, సారస్వతం, కథలు, చరిత్ర, చిత్రకళ, సాంఘికం, వైద్యం, జ్యోతిష్యం, వేదాంతం, సంగీతం, ప్రకీర్ణం అనేక పద కొండూకాక రసతరంగాలనే పద్య వ్యాసాలుకూడా ఉండేవి ఈ రచన లన్నింటినీ పంతులుగారు అచ్చుపడకముందూ చదివేవారు. అవసరమైతే తమ ప్రస్తావనలో పేర్కొనేవారు. పనిపడితే మెత్తగా విమర్శించేవారు

'కాకిపిల్ల కాకికి ముద్దు' అనే సామెత పంతులుగారిపట్ల వర్తించదు. తన సంపాదకత్వంలో వచ్చిన ప్రతి సంచికా గొప్పగా ఉందని సాధారణ వ్యక్తులైతే మురిసిపోవచ్చును. పంతులుగారు అలాకాదు "సంచికయందు ప్రచురించిన వ్యాసములు సంఖ్యయందును విషయ విభాగమునందును బహుళముగా నున్నను విషయ గ్రహణమునందు సామాన్యముగా నున్నవి" అని ప్రస్తావనలో చెప్పడం పంతులుగారికే చెల్లింది [1] ఒక ఉగాది సంచికలో ఆయన ఒక ఆవేదన వ్యక్తంచేశారు "ప్రజా హృదయమునందు వ్యాస రచనాభిలాష వృద్ధిపొందినట్లు జిజ్ఞాసాభిలాష వృద్ధిని పొందకుండుట శోచనీయము ప్రజల చిత్తవృత్తి స్వల్ప విషయములందు లగ్నమగుచున్నటుల మహద్విషయములందు లగ్నము కానున్నవి" అని పంతులుగారు బాధ

1 శుక్ల సంవత్సరాది సంచిక (1929-30) ప్రస్తావన.

పడ్డారు[1]. బహుశా మన వాఙ్మయంలో ఈ లోటు తీర్చడానికే ఆయన జిజ్ఞాసాభిలాషతో కూడిన వ్యాసాల పీరికలు స్వయంగా వ్రాసి అటు మొగ్గారు. భావ వికాసానికి తోడ్పడే రచనలు ప్రోత్సహించేవారు.

భారతి నెలకొల్పడంలోకూడా ఈ ఆశయం కనబడుతుంది మానవులకు భావదాస్య విమోచనం కలగందే బాహ్యదాస్య విమోచనం కలగదని వారి విశ్వాసం. అందుకే భావదాస్య విమోచనానికి భారతిని స్థాపించారు. భాష, వాఙ్మయం శాస్త్రిలు, కళలు మొదలైనవి సాదర భావంతో చర్చించడానికి అవకాశాలు కల్పిస్తామని తొలి సంచికలో ప్రకటించారు. వాఙ్మయ నిర్మాణానికి అప్పుడు చేస్తున్న ప్రయత్నాలను పరిస్ఫుటం చేస్తామన్నారు. శిల్పమునకు చిత్ర లేఖనకి శాసనాలకు సంబంధించిన విషయాలను చిత్రాలతో ప్రచురిస్తామన్నారు. అన్నీ అన్నట్టే పదిహేనేళ్ళపాటు చేశాను. నెలకో విజ్ఞాన సర్వస్వం ప్రచురించినట్టే ఆ సంపుటాలు కనబడతాయి

కొమర్రాజువారు తలపెట్టిన విజ్ఞాన సర్వస్వాన్నికూడా పంతులుగారే చూడ ముచ్చటగా అందంగా అచ్చువేశారు. కొమర్రాజు వారి సాహచర్యం పంతులుగారిని ఎంతో ఉత్తేజ పరిచింది. మొదటి ఉగాది సంచికనుండీ వ్యాసాలు వ్రాయడం, ఛాయాచిత్రాలు అందచేయడం మాత్రమేకాక కార్యోపక్రమణాన్నికూడా కొమర్రాజు వారు నిరూపించేరట భారతి నెలకొల్పాలనే సంకల్పం కలగ్గానే పంతులుగారు కొమర్రాజువారితో సంప్రతించారు ప్రయత్నాలు చేశారు కొమర్రాజువారు ఆ భారాన్ని పూనుకొనడానికి అంగీకరించారు అయితే ఆ విజ్ఞాన సంపన్నుడికి నూరేళ్ళు నిండాయి. రెండేళ్ళపాటు పంతులుగారు తమ సంకల్పాన్ని రిక్త మనోరథంగానే ఉంచుకోవలసి వచ్చింది. ఈ విషయాలను భారతి తొలిసంచికలో ఎంతో కృతజ్ఞతా సూచకంగా పంతులుగారు చెప్పారు

---

1 శుక్ల సంవత్సరాది సంచిక (1929-30) ప్రస్థావన

తమకుగాని సాహిత్యానికిగాని ఎవరైనా మేలుచేస్తే అది పంతులుగారు మరచిపోరు. పేరుపేరునా ప్రశంసిస్తారు ఆదిలో అందరూ ఎద్దేవా చేసినా దేనిలోనైనా చేవవుంటే పంతులుగారు దానిని ప్రోత్సహిస్తారు. ప్రతి కొత్త ప్రయత్నాన్నీ ప్రజలు వింతగా చూస్తారు. ఒకప్పుడు భయపడతారు, పరిహసిస్తారు పద్దెనిమిది సంవత్సరాలపాటు ఉగాది సంచికలు నడిపి 'ఆరంభమునందు వింతగా దోచిన యత్న మిప్పుడు సర్వసాధారణముగ నున్నది పేరుగల పత్రిక లన్నియును సంవత్సరాది సంచికలను ప్రచురించుచు' కాలస్వభావమును ప్రతిబింబిస్తున్నాయి అని పంతులుగారు వ్రాశారు[1] అలాగే మరోసారి 'పరిహాస పాత్రమైన స్వరాజ్యాదర్శమును రాజనీతిజ్ఞు లంగీకరించిరి' అని చెప్పారు[2] ఇంకోసారి 'ముప్పదేండ్లకు పూర్వము పరిహాస పాత్రములైన అప్పారావుగారి ముత్యాల సరములు నేడు ప్రజాదరణమునకు పాత్రము లగుచున్నవి' అని చాటి చెప్పారు[3]

ఆదిలో పరిహాస పాత్రాలైనవి క్రమేణా పరిపాటి కావచ్చును అలాగే ప్రారంభంలో ప్రశంసలను అందుకొన్నవి ఉత్తరోత్తరా నవ్వులపాలు కావచ్చును అటువంటి సందర్భాలు వచ్చినప్పుడు పంతులుగారు విమర్శించక మానలేరు ఆంధ్ర సాహిత్య పరిషత్తు 1912 లో స్థాపించినప్పుడు పంతులుగారు గొప్ప కొరత తీరిందని సంతోషించారు 'భాషాభ్యుదయమునకై ఈ పరిషత్తు మహోపకారము చేయగలదు' అని విశ్వసించారు[4] ఒక పుష్కరం గడిచాక ప్రజలకూ పరిషత్తుకూ దూరం పెరిగిందని పంతులుగారు గుర్తించారు. నిఘంటు నిర్మాణ భారాన్ని పిఠాపురం మహారాజువారు వహిస్తున్నా "మహాజనుల తోడ్పాటులేకను పని నెమ్మదిగా జరుగుతున్నది" అని సున్నితంగా మందలించారు.[5] నిఘంటు నిర్మాణము అస్థి సంచయ సమీకరణమని కొందరు ఆక్షేపించారట. "శూన్యావస్థయందు అస్థి సమీకరణము సయితము

1 ప్రభవ సంవత్సరాది సంచిక (1927) ప్రస్తావన. 2 3. బహుధాన్య సంవత్సరాది సంచిక (1938) ప్రస్తావన. 4 పరీధావి సంవత్సరాది సంచిక (1912) ప్రసావన. 5 సాహి ప్రాయ విశేషములు భారతి జూన్ 1924

కార్యసిద్ధికి ప్రయోజనకరమగుచున్నది" అని పంతులుగారు మెత్తగా చీవాట్లు పెట్టారు[1] 'నిఘంటు నిర్మాణముకు త్వరితగతిని జేయించుటకు మహాజనులు తోడ్పడాలని' పంతులుగారు 1924 లో ఆశించారు. పరమేశ్వరుణ్ణి ప్రార్థించారు ప్రజలను దూరం చేసుకొన్న పరిషత్తుకు నిఘంటు నిర్మాణం నలభై నాలుగు సంవత్సరాలు పట్టింది ఇంతకూ ఆఖరి సంపుటం బయట పడనే లేదు పంతులుగారి సూచన పాటించితే బాగుండేది

పంతులుగారిలాంటి వ్యక్తులు తమ సంపూర్ణ శక్తులు సాహిత్యానికే వినియోగిస్తే ఆంధ్ర భాషకు ఏనాడో నిర్దుష్టమైన నిఘంటువూ, సమగ్రమైన వ్యాకరణం లభించేవి "ప్రజానాయకులు వారి లక్ష్యాలను తాత్కాలికమైన రాజ్యాంగ వ్యవస్థలందు మాత్రమే లగ్నంచేయక నిత్యమైన సాహిత్య కళాంగములందు సయితము లగ్నము చేయుట ప్రయోజనకరముగ నున్నది '' అని ఒకసారి సాభిప్రాయ విశేషాలలో వారు వ్రాశారు[2] ఇది 1927 లో అయితే దీనిని ఆయనే పాటించలేకపోయారు. రాజకీయాలు వారి కాలాన్ని ఆక్రమించాయి ఆయన రాజకీయ సభలకు వెళ్ళినంతగా సాహిత్య సభలకు వెళ్ళినట్టు కనబడదు.

అయినా సాహిత్యసభలు సాధించిన దేమిటుంది కనుక ? 1924 నాటికే సాహిత్య సభలంటే ఆయనకు మొఖం మొత్తింది. ఆ సంవత్సరం భారతిలో సాభిప్రాయ విశేషాలు వ్రాస్తూ ఆయన ఇలా చెప్పారు. "ఏడవ యాంధ్ర సారస్వత మహాసభ వైశాఖ బహుళమునందు కోపూరునందు గూడినది. మూడునాళ్ళ ముచ్చట ముగిసినది. జ్యేష్ఠ బహుళమునందు తణుకునందు సాహిత్య పరిషత్తు మహాసభ గూడనున్నది. మూడునాళ్ళ ముచ్చట తీరగలదు సన్మాన సంఘాధ్యక్షులు, సభాధ్యక్షులు మహాసభలయందు గంభీరోపన్యాసములను చదువగలరు. పండితులు, పరిశోధకులు, కవీశ్వరులు భావభరితములైన వ్యాసములను చదువుదురు. మహాసభ తీర్మానములను జేయును.

---

1 భారతి జూన్ 1924 2. భారతి ఏప్రిలు 1927

ఉపసంఘము లేర్పడును ఈ భాగవత మేచేటను జరుగుచుండును. ఈ మహాసభలయందు జరిగిన భాగవతమే యితర సభలయందును ఏదో విధము నను నడుచుచుండును. పని మాత్రము గనబడదు.''[1]

నలభై నాలుగు సంవత్సరాల క్రిందట పంతులుగారు వ్రాసిన ఈ మాటలు నేటికీ మన సాహిత్య సభలపట్ల వర్తిస్తాయి. ఆయన క్రియాశూన్యమైన ఉద్ఘోషలను హర్షించలేదు మన సాహిత్యాభివృద్ధికి నిర్దుష్టమైన నిఘంటువు, సమగ్రమైన వ్యాకరణం అవసరమని ఆయన గుర్తించారు. పరిషత్తు వారు నిఘంటువు నిర్మిస్తామన్నారు సారస్వత మహాసభవారు సమగ్రమైన వ్యాకరణాన్ని నిర్మించాలని ఆరేళ్ళకు పూర్వమే, అంటే 1918 లోనే తీర్మానించారట అది ఆచరణలో పెట్టడానికి పని జరగలేదు. నిఘంటు నిర్మాణానికయ్యే వ్యయభారాన్ని ఒక మహారాజు భరిస్తానన్నాడు. వ్యాకరణ రచనకు ఎవరూ కనబడలేదు ఈ సంగతులు చెప్తూ పంతులుగారు ''ప్రజలీ భారమును నిర్వహించుటకు దగిన ప్రయత్నములను జేసి సారస్వతాభిమానమును సార్థకము చేయుదురుగాక'' అని ఆశించారు[2] 'నిఘంటు వ్యాకరణముల నిర్మాణములవలెను ఆంధ్ర వాఙ్మయమంతయును సహాయము నపేక్షించుచున్నది' అని పంతులుగారు ఆనాడే గుర్తించారు.

అలాగ గుర్తించాక అయిదేళ్ళపాటు కష్టపడి ఆంధ్ర వాఙ్మయ సూచికను తయారు చేయించారు విపులమైన పీఠికను వ్రాశారు ఈ గ్రంథంలో కవిత్వతత్వ విచారణకు అవకాశం లేదంటూనే గొప్ప తత్త్వ విచారం చేశారు ఆంధ్ర సాహిత్యంలో ఇక్ష్వాకుల కాలంనుంచి ఇప్పటిదాకా వచ్చిన పరిణామాలను మౌలికంగా గుర్తించారు. పండితాధీనము నందున్న సాహిత్యం ఎలా ప్రజాధీనం కావాలో సూచించారు 'ప్రజా సామాన్యమునకు బరిచితమైన సాహిత్యమునకు పండితులు చూపిన నిరాదరణ, నిరసనభావాలు ఆంధ్ర వాఙ్మయ వికాసమున కభ్యంతరములుగా' ఏర్పడిన విధాలు ఆంధ్ర సాహిత్య

---

1 భారతి – జూన్ 1924, సంపుటి 1, సంచిక 6, 2 అదే భారతిలో

చరిత్ర ఎలావిశదం చేస్తుందో వివరించారు. సాధారణ వాఙ్మయ చరిత్ర కారులు మనుచరిత్ర చూసి మనసు పడతారు. వసుచరిత్ర మోజులో పడి పోతారు పంతులుగారు రోటీను సిద్ధాంతాలను ఆమోదించలేదు వసుచరిత్ర కావ్యమును పరమార్థమైన ఆత్మానందాన్ని సంకుచితం చేసిందని నిర్భయంగా చెప్పారు.[1] తిక్కన పోతనాదులలాగ పెద్దన కావ్య నిర్మాణానికి పరమార్థాన్ని సంకల్పించలేదని చెప్పారు[2] భట్టుమూర్తి మీద ఒకటింపావు పేజీ మాత్రమే వ్రాశారు పెద్దన్నగారిమీద మరొక్క పేజీ అదనంగా వ్రాశారు పింగళి సూరపరాజుగారి మీద మాత్రం అయిదున్నర పేజీలు వ్రాశారంటే పంతులు గారి రసైకదృష్టి వ్యక్తమవుతుంది

పంతులుగారిదృష్టి ఎప్పుడూ అభ్యుదయం పైనే ఉంటుంది ఆయనకు పాతవాసనలు గిట్టవు తమ పత్రికలలో ఛాందసులు వ్రాసే వ్యాసాలను ఆయన వాళ్లపై గౌరవంకొద్దీ ప్రకటించినా విమర్శించక మానలేదు "వ్యాసములు పాతవాసలను వ్యక్తము చేయునటుల నవీనాశయములను వ్యక్తము చేయుటలేదు స్వాతంత్ర్య జవ సత్వములులేని ప్రజలు కైలాసశిఖర సందర్శనమునుగాని, పాతాళలోక సందర్శనమునుగాని చేయజాలరు" అని నిక్కచ్చిగా చెప్పారు[3] స్వేచ్ఛ లేనివాడు అధఃపతనానికి కూడా నోచుకోడు?

పంతులుగారు ఆంధ్రసాహిత్యాన్ని కైలాసగిరి సానువులంత ఉన్నత ప్రదేశాలకు తీసుకెళ్ళడానికి ఎంతగా కృషిచేశారో చెప్పాలంటే ఒక చిన్న ఉపన్యాసం చాలదు చెరువుని చేదపెట్టి తోడలేం. ఏటి కేతా మెత్తాలేం. ఆయన తలపెట్టిన కృషి ఫలించిందా లేదా అని రేఖామాత్రంగా సమీక్షించాలి.

పంతులుగారు అడపాదడపా ఆత్మ విమర్శనం చేసుకుంటూ ఉంటారు నిరాశాజనకంగా ఉంటే అది బయట పెట్టకుండా ఊరుకోరు. భారతి పెట్టిన

---

1 ఆంధ్ర వాఙ్మయ చరిత్ర – (ప్లవంగ సంవత్సరాది సంచిక పుట 102), 2 అందులోనే పుట – 100, 3. ప్రమోదూత సంవత్సరాది సంచిక (1930–31) ప్రస్తావన

పదేళ్ళకు ఆయన ఏం సాధించాం అని వెనుక తిరిగి చూసుకొన్నారు "భారతికి పదవయేడు ప్రారంభమైనను ప్రత్యభిజ్ఞానము దుర్లభమైనది' అని బాధ పడ్డారు[1] "సాహిత్యోపాసకులకు కళారాధకులకు ప్రాణరహితమైన సనాతన సంస్కారము, స్వానుభవరహితమైన పరసంస్కారము ఆత్మయోగానుభవ సిద్ధమైన పరసంస్కారము ఆత్మయోగానుభవ సిద్ధమైన నిర్మాణశక్తిని దుర్ఘటము చేసినవి. నిర్మాణము దుర్ఘటమై అనుకరణము శరణ్యమైనది ప్రథమ సంచిక యందలి సంకల్పము వర్తమాన సమయమునందు ప్రపంచా నృత్తమైన మహాప్రబోధ సమయమునందు క్రియారూపమును బడయక సంకల్ప మాత్రముగనే యున్నది'' అని విచారించారు.[2]

ఈ స్వవిషయం వ్రాస్తూ మొదట ఆయన భర్తృహరి సుభాషితాన్ని "తెలివి యొకింత లేనియెడ దృప్తుడనై కరిభంగి'' అనేది ఉదహరించారు. పంతులుగారు తమ సాభిప్రాయ విశేషాల ప్రారంభంలోనూ స్వవిషయాల మొదటా కొన్ని పద్యాలను సమయోచితంగా కోట్ చేస్తారు అందులోనే వారి విశాలానుభవం ద్యోతకమవుతుంది.

నిరాశాపూరితమైన పదో స్వవిషంయంలో అంత నీరసంగా ఆయన వ్రాయడానికి నిజంగా భారతి ఏమీ సాధించలేదని అర్థం చెప్పుకోకూడదు. ఆంధ్రు లేం సాధించలేక పోయారనే వాఖ్యానించుకోవాలి "ఆంధ్ర హృదయము నధిష్టించిన ఇచ్ఛాశక్తి జ్ఞానయోగ విలసితమై క్రియారూపమును బడయవలసిన యవసరమును సాహిత్య కళారచనలు విశదము చేయుచున్నవి" అని అదే స్వవిషయంలో ఆయన చెప్పారు, ఆంధ్రదేశానికి పండుగైతే ఆయన చెప్పారు ఆంధ్రదేశానికి పండుగైతే ఆయన పండుగు చేసుకొంటారు. పొంగిపోతారు. ఆంధ్రదేశం కుంగిపోతే ఆయన కుంగిపోతారు.

---

1 భారతి జనవరి 1933 స్వవిషయం, 2 అదే భారతి స్వవిషయంలో.

ఆంధ్రసాహిత్యానికి అనుకొన్నంత సేవ చేయలేదనే చింత ఆయనకు లేకపోలేదు మరణించడానికి ముందు ఆయన విచారంగాఉంటే డాక్టర్లు హితబోధ చేశారు "ఇటీవల నేను జబ్బుతో నుండగా డాక్టరు నంజప్పగారు నన్ను చూచి ఇట్లనిరి 'నీవు విచారగ్రస్తుడవుగా కనబడుచున్నావు నీవును ఇతరులును ఏ స్వరాజ్య సంపాదనమునకై శ్రమపడితిరో ఆ సుదినము సంప్రాప్తమైనది సత్యాగ్రహము ధర్మవిజయమును బడసినది ఇద్దరు టోపి, త్రివర్ణ పతాకము వందేమాతరం గీతం విజయమును పొందినవి ఇది నీవు ఆనందింపవలసిన సమయం' నంజప్పగారి గంభీరభావములు స్వధర్మ నిర్మాణమునందలి పరమార్థమును విశదము చేసినవి విశ్వపరిణామమునందు వ్యక్తుల ప్రాజాపత్యము నిమిత్తమాత్రము" అని సహజ ధోరణిలో పంతులుగారు ఏమాత్రం ఘనతా అంగీకరించలేదు [1]

అయితే అయిదేళ్లకు ముందు ప్రకటించిన నిరాశమాత్రం పోయింది. "ప్రధమ సంచికయందు సంకల్పించిన సంకల్పములు సకల రంగములందును సఫలమగుచున్నవి" అనే తృప్తిని ప్రకటించారు [2] "రాజకీయ, సాంఘిక, సాహిత్య, కళావైజ్ఞానికాభి విషయములందు కలిగిన స్వాతంత్ర్యభావ ప్రవర్తనతో మానవ స్వాతంత్ర్య ప్రియులకు పరమానందమును కలుగచేయగలదు" అని పొంగిపోయారు. "ఈ మహోదయమునకు భారతియును యధాశక్తి జ్ఞానాంజలులను సమర్పించినది" అని కైమోడ్చారు.[3]

ఆంధ్రజాతీయ మహోదయానికి వీరేశలింగముగారు వేగుచుక్క అయితే నాగేశ్వరరావు పంతులుగారు బాలభాస్కరుడు వారి తేజః పుంజాలు ఉగాది సంచికలలోనూ, భారతి సంపుటాలలోనూ, ప్రకీర్ణక రచనలలోనూ నిత్యంప్రకాశిస్తూ ఉంటాయి. నట్టింట చిన్నదీపం పెట్టినవాడి పేరే నిత్యం చెప్పుకొనేజాతి చిమ్మచీకట్లో ఇంత వెలుగుతెచ్చిపెట్టిన వారికి, ఇచ్చిపోయే వారికి జ్ఞానాంజలి ఘటించడం తప్ప ఇంకేం చేయగలదు.

---

1 భారతి, జనవరి 1938 స్వవిషయంలో, 2 డిటో 3. అందులోనే

# సాహిత్యోపన్యాసములు

౧




ప్రచురణ:

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

తిలక్ రోడ్ : : హైదరాబాదు.

## ప్రకాశకుల విజ్ఞప్తి

1961 జూన్ నెలలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఆవరణయందు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి జనరల్ కౌన్సిల్ సమావేశాలు జరిగినవి ఆ సందర్భమున రెండు రోజులు సాహిత్య కార్యక్రమాలు నిర్వహించనైనది ఈ కార్యక్రమాలలో చేసిన ప్రసంగాలు యీ పుస్తకరూపమున ఆంధ్ర మహాజనులకు అందించుచున్నాము ప్రతి పర్యాయము సాహిత్య అకాడమి సభల సందర్భమున చేయు సారస్వతోపన్యాసాలను యీ విధముగా అచ్చువేయ వలెనని అకాడమి నిశ్చయించినది. ఈ ఉద్దేశముతో ప్రకటించిన ప్రథమ సంపుటము యిది

తిరుపతిలో జరిగిన సభల సందర్భమున అకాడమి ప్రచురణలైన నన్నయ పదప్రయోగకోశము, పదబంధ పారిజాతము (ద్వితీయ సంపుటము) ఆవిష్కృతములైనవి. ఈ ఆవిష్కరణ సభలలో యీ రెండు సంపుటాలకు సంబంధించిన ప్రత్యేక ఉపన్యాసాలు యేర్పాటు చేయబడినవి. ఆ ఉపన్యాసాలు యీ సంపుటములో ప్రచురితమైనవి. ఆనాటి సభలకు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించగా, అప్పటి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్యగారు సంపుటాలను ఆవిష్కరించి యుండిరి. మేము కోరిన వెంటనే మా ఆహ్వానమును అంగీకరించి యీ ప్రసంగాలను గావించిన పండితులు శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి, శ్రీ భూపతి లక్ష్మీనారాయణ, శ్రీ గిడుగు సీతాపతి, శ్రీ తాపీ ధర్మారావుగార్లకు కృతజ్ఞతాపూర్వక వందనములు.

హైదరాబాదు
26-3-1962

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

# విషయ సూచిక

# నన్నయ భాష

—శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రి

ఆంధ్రభాషా స్రవంతికి ఆనకట్టయై నిలిచి, పంచమవేద మనఁబరఁగిన మహాభారతమును ఆంధ్రవాణీరూపమున నవతరింపఁజేసి, తెనుఁగుల పాలిటి పుణ్యమూర్తియై నన్నయ భట్టారకుఁడు ఆదికవియై పండించిన 'ఆది దొడంగి మూఁడు కృతులును' సుమారు వేయి వసంతములనుండి ఆంధ్రుల నిరంతర పఠనపాఠనములఁ బ్రవర్తిల్లుచు అక్షరాస్యులకెల్ల నానందము గొలుపుచు, అసాధారణముగ వన్నెకెక్కినవి.

ఆ మహనీయుని సంకల్పబలమో - అతనిఁ బ్రోత్సహించిన రాజేంద్రుని ప్రేరణశక్తియో - ఆ కాలపుఁబ్రజల యామోదవిలసనమో - ఆంధ్రుల శాశ్వతిక భాగ్యవిలాసమో - లేక యీ యన్నింటి సమాహారఫలమో యిది యని చెప్పలేముగాని, ఆ మహామహుఁడు ఆ రమణీయ కృతికి ఆకృతి యొసంగినదాది నేఁటిదాఁక నమ్మహాగ్రంథము ఆంధ్రమున నద్వితీయమై యలరారు చున్నది.

అది యితిహాసము నగును - పురాణమును గావచ్చును. కావ్యము నయినది - ప్రబంధత్వమును బొందినది - తుదికి లక్షణ గ్రంథము నయినది. అది యిది యననేల ! ఆ గ్రంథము సకల విషయ సంభరితమై యానాఁటి యాంధ్ర సంస్కృతినంతను అక్షరరూపమున సంతరించుకొని పదునొకొండవ శతాబ్దిని రూపొందిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' అని చెప్పికొన్నను అత్యుక్తికి పాల్పడము.—

కావుననే ఆ విద్యాయితుని రచన యందలి కవితాపదార్థమున కంగభూతములగు నక్షరరమ్యత - అర్థప్రసన్నత - కథాకథన కుశలత - పాత్ర చిత్రణ నిపుణత, మున్నగు విషయములను గూర్చి - అంతర్వాణు లనేకులు

బహుముఖములఁ దమదమ యభిప్రాయములను వ్యాసరూపమునను గ్రంథ రూపమునను వెలార్చియుండిరి. వెలార్చుచు నున్నారు.

ఇఁక దాని శాబ్దిక రూపమును గూర్చియు దాని యంగోపాంగములగు ప్రయోగ విశేషముల నుద్దేశించియుఁ, గొంత పరిశోధన మింతదనుక జరిగి నందులకు సంతసమేగాని యింకను వానిని గూర్చి జరుగవలసిన పరిశీలన మెంతయేని గలదు.

ఆ కొఱంత వారింపఁ బూని ప్రభుతావలంబనమును ప్రజాసక్తిని ఊఁతగాఁగొని 'ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడెమీ'వారు 'నన్నయ పదప్రయోగ కోశము'ను భాషాప్రియుల బహుముఖ పరిశ్రమచే రచింపఁజేసి తదావిష్కరణ సందర్భమున 'నన్నయ భాష'ను గూర్చి సంక్షిప్తముగాఁ బ్రసంగించునట్లు నన్నాదేశించిరి.

అత్యావశ్యక విపుల విషయములను అల్పకాలమునకు సంక్షేపించుట లోని భారము నెఱుంగకకాదు. ఇప్పటికి నాకుఁ దెలిసిన యంశములకన్న తెలియనివే పెక్కులని యెఱుంగకయుఁగాదు. మఱి, ఆదికవియగు నన్నయ భట్టారకు నందలి భక్తియు ఆదిమ గ్రంథమగు ఆంధ్ర మహాభారతము నందలి యభిమానమును, భాషా ప్రసంగము లందలి ఆసక్తియు, ప్రేరకములుకాఁగా, ఉత్సాహ మాత్రము నూఁతగాఁగొని యీ పనికిఁ బూనుకొంటిని. ఈ సాహస మునకు పెద్దలు దయతో నన్ను మన్నింతురు గాక.

నన్నయ భాషనుగూర్చి ప్రసంగించుటకు ముందు రెండు మాటలు - మొదటిది; భారత భాషా స్వరూపమును గూర్చి ఇదమిత్థమని సులభముగఁ జూపి చెప్పుటకుఁ దగిన యాధారము లేవియు నింతవఱకు బయలు వెడలి యుండలేదు.

రెండవది:- నేఁడు మన కుపలభ్యమానమగు ముద్రిత గ్రంథములు, ఏ యొండురెండు తాళపత్ర ప్రతులనో యాధారము చేసికొని వెలువడిన వగుటచే అవి నిర్దుష్టములు, నిష్కృష్టములును గాకున్నవి.

కాఁగా దేశమునందలి తాళపత్ర ప్రతులన్నిటిని నేకరించి వాని సంవాదమున సమగ్రమును నిష్కృష్టమును నగు ఒక భారత రూపమును వెలువరించినంగాని నన్నయ భాష యిది యని నిర్ధారణచేసి చెప్పుటకు వలను పడదు.

ఆ కార్యభారమును భవిష్యత్కాలమునకును, భావిభాషాప్రణయులకును విడిచివైచి ఇప్పటి కుపలబ్ధములగు ముద్రిత ప్రతుల యాధారముతో కొంతలోఁ గొంత నన్నయ భాషా స్వరూపమును గూర్చి స్థాలీపులాకముగాఁ బ్రసంగింతును.

వేయి వత్సరముల ముందు శాసనములందును జనవ్యవహారమందును, పాటలందును, పదములందును, ప్రవేశము నందియున్న యాంధ్రవాణిని గ్రంధోపయుక్తముగా సంస్కరించుకొని నన్నయ తన భారత భాగమును సంతరించినట్లు పరిశోధకు లెల్లరును నామోదించిన విషయమే.

ఆ సంస్కార రూపమే ఆంధ్రశబ్ద చింతామణి యను లక్షణ గ్రంధము. దానికి లక్ష్యప్రాయమే యీ భారతము. అని పెద్దలు పలువుర యభిప్రాయము.

అనాఁటి శాసనము లందలి భాషను ముందిడికొని లక్షణమగు నాంధ్ర శబ్ద చింతామణిని, లక్ష్యమగు నాంధ్రభారతమును జాగరూకతతో నిదానముగాఁ బరిశీలించినచో అస్తవ్యస్తముగా నుండిన యానాఁటి భాషను గ్రంధరచనోపయుక్తముగాఁ జేయుటకు నన్నయ యెంత పరిశ్రమ చేసెనో ! అని యచ్చెరువు గలుగక మానదు.

ఆ లక్ష్య లక్షణముల స్వరూప స్వభావములను సాకల్యముగ నిరూపించుటకు - ఇది సమయము కాదు.

ఇపుడు నన్నయభాష యందలి కొలఁది విశేషములను మాత్రము దిక్సూచిగా నిర్దేశింతును.

తత్సమ ప్రక్రియ:—

భట్టారకుని ప్రధానదృష్టి తత్సమ పదప్రకియా నిర్వహణము—

ఆ నాఁడును, అంతకుముందును శాసనములందు నుపయోగింపఁబడిన సంస్కృత పదములను కర్ణాటక వాఙ్మయమున మణిప్రవాళముగఁ గూర్పఁబడిన పదజాలమును తెనుఁగునందు నుపయోగింపనెంచి యతఁడా పదములను గ్రంథానుకూలములు గావించుకొని తన భారతమున బహుళముగాఁ బ్రయోగించినాఁడు.

కావుననే చింతామణి చాలవఱకు తత్సమప్రక్రియా ప్రధానమగుటయు, ఆతని భారత భాగమునందు సంస్కృత పదజాలము అధికముగాఁ జూపట్టుటయు సంభవించినది.

బహుళముగా తత్సమ శబ్దములను మాత్రము ప్రయోగించుటయ కాదు. కృతహస్తులు, కృతాంజలులు - కృతబుద్ధులు - కృతాస్త్రులు - మున్నగు కూర్పులలోని సంస్కృతపు నుడికారమును గూడ తెలుఁగు పలుకుబడితో మేళవింపఁ జేసినాఁడు.

అంతియగాక

"అభిమన్యుఁడు ధౌమ్యుతో వేదమంగయుతంబుగాఁ జదివె"

"అభిమన్యుఁడు ధనంజయుతో ధనుర్వేద మభ్యసించె"

మున్నగు వాక్యములలో సంస్కృత కారకచ్ఛాయలను సయితము ఆశ్రయించినాఁడు.

ఇఁక దీర్ఘసంస్కృత సమాసముల మాట చెప్పనక్కఱయ లేదు

మొత్తముపయిని క్లుప్తముగాఁ జెప్పవలయునన్నచో నన్నయ భారత భాగమున, తత్సమ పదజాలము మిక్కిలిగా కుదురుకొని నదనుట

ఆ తత్సమములు, ఎంతవఱకు, ఏయే విధముల, నుపయోగింపఁబడినవి ? వాని స్వరూప విశేషము లెట్టివి ? మున్నగు వానింగూర్చి ప్రత్యేక పరిశోధనము జరుగవలసియున్నది.

దానికిని ఈ పరిషత్కార్యాలయమే ప్రధాన రంగమగుగాక.

ప్రస్తుతము తెనుఁగు పదము వాని ప్రియోగ విశిష్టత - మున్నగు వానిం గూర్చియు, నన్నయ భాషకును, నేఁటి మన భాషకును గల సంవాద విసంవాదములను గూర్చియు, ఇంచుక పరిశీలించుకొందము.

1. విభక్తులు; 2. సమాసములు, 3. అవ్యయములు; 4. క్రియా పదములు; 5 పలుకుబడులు; 6 విశేష్య విశేషణములు మున్నగువాని నుపయోగించుటలో నన్నయ భాషకును నేఁటి కవుల భాషకును కొంత వైలక్షణ్యము గోచరించును. ఆయా తావులందు ఆ ప్రయోగముల ప్రత్యేకతయు పొడగట్టుచుండును.

వానిలో మొదటిది ——

I. విభక్తి ప్రయోగ విలక్షణత:——

ఇంచుమించు సంస్కృతమునందు వలెనే తెనుఁగునను విభక్తి సప్తక విభాగమును తదర్థ నిర్దేశమును గావింపఁబడినవి. ఇందుఁ గొన్ని యెడల ఒక విభక్తికి వేఱొక విభక్తి వచ్చుటయు నచ్చుటచ్చుటఁ గాననగును. అది నన్నయ రచనమున, ఏయే రీతుల నున్నదో కొంత పరికింతము.

1. సుఖముతో నుండిరి. అనుటకు - సుఖంబుండిరి.

2. వేఁటకై వచ్చి - అనుటకు - వేఁటవచ్చి.

3 వనంబునం గ్రుమ్మరి యెడికాలంబునం దొక్క బ్రాహ్మణ మిథు నంబు అనుటకు వనంబునం గ్రమ్మరి యెడి కాలం బొక్క బ్రాహ్మణ మిథునంబు——

ఇత్యాదిగా తృతీయా చతుర్థీ సప్తములకు ప్రథమ గానంబడును.

1. విలువిద్య కలిమిచే హీనుఁడయ్యెను. అనుటకు విలువిద్య కలిమిని హీనుఁడయ్యెను.

2. దవ్వులనుండి చూచి - అనుటకు - దవ్వులం జూచి.

3. నీకుఁ గలపుడును - అనుటకు - నిన్నుఁ గలపుడును.

4. రాజ్యంబునందు ధర్మజుఁ బూన్పక - అనుటకు - రాజ్యంబును ధర్మజుఁ బూన్పక అని యీ రీతిని తృతీయాద్యర్థములలో ద్వితీయ కానవగును.

1. రత్నతతులు వానిచేతఁ గొనియె.

2. హరుచేత వరము వడసె.

ఇత్యాదులందు పంచమ్యర్థమున తృతీయ గోచరించును.

వలనన్ - అనునది పంచమీ ప్రత్యయముగనే గాక - 'ఆ దిక్కున' అను నర్థముగల వలను శబ్ద సప్తమ్యంత రూపముగను పెక్కు తావులఁ జూపట్టును.

షష్ఠీవిభక్తి సకల విభక్త్యర్థములందును ఉపయోగింపఁ బడినటులే ప్రయోగములు విశదము చేయును.

1. (1) నీ నమ్మినవారు. (2) వార్త నిర్వహింపవలయుఁ బతికి. (ప్రథమార్థకము).

2. (1) మరణ జీవితములకు విషాదతోష వృత్తులుడిగి. (2) మహేశ్వరునకుఁ దపం బొనరించె. (ద్వితీయార్థకము)

3. నీకు నారాధ్యను. (తృతీయార్థకము)

4. నాకు నియమించి తెచ్చిన కూఁతును. (చతుర్థ్యర్థకము)

5. విలువిద్య నొరులు నీ కగ్గలముగ లేకుండ. (పంచమ్యర్థకము)

6. (1) నాకుంగరుణించి; (2) పాముల కేల యల్గితివి. (సప్తమ్యర్థకము) ఇత్యాదులు పెక్కులు గలవు.

నన్నయ ప్రయోగములలో ద్వితీయార్థమున 'గుఱిచి' అనునదియు తృతీయార్థమున - మెయి - మయి-అనునవియు, చతుర్థ్యర్థమున - పొంటెన్- అనునదియు, ప్రత్యయములుగాఁ జూపట్టును.

ధర్మనందును గుఱిచి - బలిమిమెయిన్, బలిమిమైన్ - వంశవృద్ధి పొంటె - ఇత్యాదులు.

II. సమాస విశేషములు:—

కామరాగంబున యతిరేకమున - ఎలజవ్వనంబున విలసనంబు - ఇత్యాదులందు షష్ఠీ తత్పురుషమున నకారము ఆగమమగుటయు, పురంబున వారు, వారణావతమున వారు.

మున్నగు చోటులందు సప్తమీనవర్ణకము సమాసమున లోపింపక నిలుచుటయుఁ గానంబడును.

III. అవ్యయములు:—

(1) నన్నయ 'ను' శబ్దమును గొన్ని యెడల సముచ్చయార్థమునందును, కొన్ని చోటులందు, అప్యర్థమునను - కొన్నిపట్ల ఊఁత పదముగ మాత్రమును నుపయోగించినట్లు చూపట్టును.

పాండవులు ద్రౌపదియును—

భీష్ముండు విదురుండును— ఇట; సముచ్చయార్థము.

నీకు నానయు లేదే (సిగ్గయిన లేదా) ఇట; అప్యర్థము. (అపి)

శివుఁడు ప్రత్యక్షమయ్యె వేఁడుము వరమన్న.

ఇదియు మొదలుగా.

అందఱకును జెఱువేయునేసి - ఇత్యాదులందు - ఊఁతపదము.

(2) 'ఏని' - అను నవ్యయము నన్నయ భారతమున అనేకార్థములందు నుపయోగింపఁ బడినది.

ఈ ప్రయోగములు తిలకింపుఁడు.

1. 'పగఱఁగని సైఁపి రేనియు మృగకులంబుగని సహింపరు రాజులు' శత్రువులనయిన సహింతురుగాని మృగములను జూచి సహింపరు. అని యర్థము

2. ఎటయేనిఁ బోయె = ఎక్కడికో పోయెను.

3. ఎందేని నుండి = ఎక్కడ నుండియో.

4. కచుండు నేనియు రాఁడు = కచుఁడేమో రాఁడాయెను.

మఱియు

1. ఎందేని సర్వభూతేశుండు సృజియించె - ఎచ్చట సృజించెనో అచట.

2. ఎవ్వరేని వత్తురు వారు నిర్దగ్ధులై - ఎవరు వత్తురో వారు...

3. ఎయ్యేని నొక్క వేల్పు నారాధించి తవ్వేల్పు - ఏ వేల్పు నారాధింతువో ఆ వేల్పు.

మున్నగు తావులందు 'ఏని' అనునది యత్తదర్థక శబ్దముల సమన్వయమునకు మాత్రము ద్యోతకమై యుపయోగింపఁ బడుట సుస్పష్టము.

ఈ వాడుకలు నేఁటి వాక్యరచనా మార్గములకు దూరములు.

(3) 'కోలె', నాఁడు మొదలు, అది మొదలు, - అని మన మనుచోట నాఁడు గోలె - అది 'కోలె' అను నవ్యయము ప్రభృత్యర్థమునఁ బ్రయుక్తమగుచుండును.

(4) 'కా' - అను నవ్యయము అనేకార్థకము—

(1) అప్పులుకులు నిక్కవంబ కా వగచి = నిక్కవమని తలఁచి

నైన్యాపరాధంబున నయ్యెఁగావగచి = అయ్యెనని తలంచి—

తనకమ్మనుజేశ్వరుండు అపాయంబు నేయుంగావగచి = చేయునని తలంచి మున్నగు చోట్ల ఇత్యర్థకము. (ఇతి)

ఏమొగాని; - ఈ యర్థమున దీనికిఁ బరముగా వగచు ధాతువునే నియతముగాఁ బ్రయోగించినట్లు కానంబడును.

వరుణుండ కా వగచి

ఎప్పటియట్ల కా వగచి

అతిభక్తులై యతియ కా వగచి—

దగ్ధుండయ్యెన కా వగచి

బలియ కా వగచి

స్థలంబుగా వగచి - జలాశయంబుగా వగచి
వివృతంబుగా వగచి - సంవృతంబుగా వగచి—
ఇత్యాదులు పెక్కులు - కాలక్రమమున ఈ వాడుక మాఱినది.

(2) దీనికి 'కదా' అను నింకొక యర్థము గలదు.

1. పాండవులు సమయాతి క్రమము సేయ సమకట్టరుగా = సమకట్టరు గదా ? ఇట 'సమకట్టరు' అను నిశ్చయార్థము కాదు. ప్రశ్నార్థము

(2) చోరులు రక్షింపరుగా వారలచే ధనముగొని భవద్భృత్యవరుల్ రక్షింపరుగదా ? ఇటఁ గూడ 'రక్షింపరు' అను నిశ్చయార్థము కాదు. ప్రశ్నార్థము.

ఆ రక్షించుట మున్నగు క్రియలు అనభిమతము లయినపుడే యిట్టి ప్రశ్నార్థకముల కూర్పు ఏర్పడును.

రానురాను భిన్నభిన్న సన్నివేశములందు 'కదా' అను నర్థమున 'కా' శబ్దము ప్రయుక్తమయినది.

వినవుగా ! కలయొక్కటి గంటి వేఁకువన్
పిలిచినను కోపముచే పలుకవుగా
నా తండ్రిగా - నా బంగారుగా
తలుపు తెఱచి చూతునుగా (అం దావస్తు వగపడదు).

ఇట్టి సన్నివేశములు నన్నయ భాగమున నున్నట్లు తోఁపదు. అన్వేషింప వలయును.

(5) 'కాక' = కాని.

'కన్నులు లేవనుటంతె గాక యుత్తముఁడు గాఁడె'.

ఇట్టి యెడ 'కాని' అనియే మన ప్రయోగము.

## IV. క్రియాపద విశేషములు:—

(1) ఉండునే - చనునే - దొరకొనునే - అని నేఁడు మనము వ్యవహరించు క్రియా రూపములు, - ఉన్నే - చన్నే - దొరకొన్నే అనురీతిని నన్నయ భాషలోఁ జూపట్టును.

"పరిపూర్ణములై కరమొప్పు చున్నె చెఱువులు"
"మునీంద్ర నీకుఁ జన్నే నలినాక్షులందు మదినిల్పఁగ"
అహితముఁ భయముఁ దొరకొన్నె నాకు నా పుత్రులకుఁ—

(2) విధ్యర్థక క్రియలు తచ్ఛబ్దాంతములయి తఱచు ప్రయుక్తములగును.
ప్రీతి సేయునది = చేయవలయును
తడుపుచుండునది = తడపుచుండవలయును. ఇత్యాదులు.

(3) కొన్ని ధాతువుల ప్రయోగమున విలక్షణత గలదు.
పయనమగు - అనుటకు - పయనము వోవు - అని యున్నది.

(4) రెండు ధాతువుల కొక్కచే పద్వానుబంధము చూపట్టును.
వినఁబడవు, చూడఁబడవు - అనుటకు
"వినఁగఁ జూడఁబడ వెవ్వరికిన్."

(5) అనుధాతు వ్యతిరేకములగు అనక, అనరు - అను వానికి మాఱుగా
నాక - నారు - అను రూపములు తఱచు ప్రయుక్తములయినవి.
ఉదా:—"కొడుకు పల్కు విని కూడదు నాక
"బంధు జనులేమి నారె"

(6) నా యజ్ఞానంబు క్షమియింప వలయును - అనుటకు
'నా యజ్ఞానము సహింపవలయును.'
ఏల మేల్కొలిపితయ్య - అనుటకు - 'ఏల బోధించితయ్య',
ఫలము లనుభవించి - అనుటకు - 'పలములు భోగించి' మున్నగు
రీతిని ధాతువుల వాడుకలో నించుక భేదము గోచరించును.

ఇంతియగాక నన్నయ వ్యవహరించిన 'చూవె', అట్టెఁడు - అట్టిరు - తొట్టి - మున్నగు కొన్ని శబ్ద రూపములు నేఁటి వ్యవహారమునకు దూరము లయినవి.

మఱియు, రేపు = ప్రాతఃకాలము

విచారించు = ఆలోచించు

మర్యాద = హద్దు - ఈ యర్థములు కాలక్రమమున మార్పునంది, మఱునాఁడు దుఃఖించు, గౌరవము అను నర్థములందు పయిశబ్దములు రూఢములైనవి.

V. నన్నయ నాఁటి కొన్ని పలుకుబడులు:—

పదముల శక్తి అనంతము - అపూర్వమును.

వాని పరస్పర సంయోజనమును, అర్థస్ఫూర్తియు దేశకాలములను బట్టి భిన్నభిన్నములగు చుండును.

నిన్నటి పలుకుబడి నేఁటికిని - నేఁటిది రేపటికిని వినూత్నమై కవుల వ్యవహారమున వేర్వేఱు రూపములలో అర్థపరిణామమును బొందుచుండును కాఁగా సుమారు వేయి వత్సరములకుఁ బూర్వము నన్నయ భాషలోని పలుకు బడికిని నేఁటి మన పలుకుబడికిని వ్యత్యాసముండుట వింతగాదు మచ్చునకు,—

కన్నువాంచి - అనఁగా నిద్రించి —

అదియ తక్కియున్నది - అనఁగా - అదే మిగిలియున్నది.

మేయాడక నిద్రవోయె - అనఁగా - ఒడలు తెలియక నిద్రవోయె

పాయ మొగమిడి - అనఁగా - ప్రక్కకు మొగము త్రిప్పుకొని.

చక్కనయ్యెను - అనఁగా - సిద్ధమయ్యెను.

పెద్దకాలము, పెద్దయుం ప్రొద్దు - అనఁగా - చాల కాలము.

శాపదినంబులు వోవుదెంచె - అనఁగా - గతించెను.

ఓడ నల్లుచు - అనగా - ఓడనడపుచు - మున్నగునవి

VI. విశేష్య విశేషణములు:-

సంస్కృత వాఙ్మయమున, అందును వ్యాస వాల్మీకుల రచనలయందు విశేష్య విశేషణముల ప్రయోగసరణి వివిధమయి వింతగొలుపు చుండును.

నన్నయ ఆ గ్రంథములు పలుమాఱు తిలకించి యందలి ప్రయోగ రీతులను జీర్ణించుకొనిన వాఁడగుటచేఁ గాఁబోలును, ఈతని రచనమునను ఆ వైవిధ్యము గోచరించును

ముందు విశేషణములను, పిమ్మట విశేష్యమును ప్రయోగించుట మన యిప్పటి వాడుక - నన్నయ రచనలో ఆ విధముగనేగాక మఱికొన్ని రీతు లుండును.

(1) ముందు విశేష్యము - ఆ వెనుక నొక్క విశేషణము
"నిషాదులన్ పురుషాదుల......"

(2) ఇంకొకరీతి - మొదట నొక్క విశేష్యము - వెనువెంట రెండు మూఁడు విశేషణములు.

"గాదిలి కూఁతులఁగవలవారలఁ గాంతిమతుల .. . "
"తనయుని నభినవ యౌవను, ననుపము, నభిషిక్తుఁజేసి''

(3) మఱొక పద్ధతి,-మధ్యవిశేష్యము, ముందువెనుకల విశేషణములు :
"అలఘుఁడు, ధృతరాష్ట్రుఁడు, కులతిలకుఁడు, -
వీరుఁడు, పాండుమహీపతి, భూరిభుజుఁడు,"

4. వేఱొక మార్గము -

విశేషణముతో మొదలిడి, పిదప విశేష్యమును బ్రయోగించియు, మరల నితర పదవ్యవధానముతో మఱికొన్ని విశేషణములు కూర్చుట.

"సద్వినుత చరిత్రుండు భరద్వాజుఁడన్ మునీశ్వరప్రవరుఁడు
గంగాద్వారమునఁ దపంబు జగద్వంద్యుఁడు సేయుచుండె"

విశేష్య విశేషణ పౌర్వాపర్యమున నిట్టి వైవిధ్యము కాననగును - ఈ సందర్భమున, ఒక్కమాట;-

నన్నయార్యుని మార్గములు చిన్నయసూరి తలలో ఎంత షణ్ణము ౦యినవోగాని యీతఁడును తన సూత్రములలో___

"అమహన్నపుంసకములకు అదంతములకు మువర్ణకంబగు"
"ఆకారంబునకు ఆమ్రేడితంబునకుఁ దదర్థకంబునకు
అయి ఆయి యను శబ్దంబులు విభాషనగు"

మున్నగు తావులందు వాగనుశాసనుల వచన రచనారీతి ననుకరించుటకు ముచ్చట పడినట్లు తోఁచుచుండును.

పరిశీలించిన కొలఁది నిట్టి విశేషములు విలక్షణములు నింకను నెన్నియో నన్నయ రచనయందుఁ జూపట్టును. వాని నన్నిటిని సమగ్రముగఁ బరిశీలించి నన్నయ భాషా స్వరూపమును గూర్చి విపులమును సంపూర్ణమును నగు నొక గ్రంథమును భాషావిదులు సంతరించుట మిక్కిలి యావశ్యకము; అభిలషణీయము.

అట్టి పరిశోధనములకు, ఇచట, ఈనాఁడావిష్కరింపఁ బడుచున్న యీ "నన్నయ పదప్రయోగ కోశము" మిక్కిలి యుపకరించు ననుటలో ఇంచుకయు సందియము లేదు.

నన్నయార్యుఁడు మొత్తమేపాటి పదజాలమును గూర్చుకొని భారత రచనము సాగించెను?

ఏ యే శబ్దములను నెన్నెన్ని రూపములతో నే యే తావులఁ బ్రయోగించెను ?

ఏ శబ్దమునకు, ఆనాఁడెంతటి ప్రచారము గలదు?

ఆనాఁటి కొన్ని శబ్దములకు నేఁడు రూపమునందును అర్థము నందును నెట్టి మార్పులు గలిగినవి ?

ఆ మార్పులకు హేతువు లేమయియుండును?

ఆనాఁడు ప్రసిద్ధములయ్యు నేఁటికి మఱుఁగుపడిన శబ్దము లెవ్వి ?

ఏల మఱుఁగు పడినవో,

మున్నగు శంకలు భాషాస్వరూప జిజ్ఞాసువులకు నేఁడు కలుగవలసినవి కలుగుచున్నవియు ననేకములు గలవు.

'అక్క' ఒక్కచో మాత్రము చూపట్టును అదియును సహోదరి కాదు. సవతి.

"ఏ కన్నులన్ జూచితే ' యక్క ' యెక్కడిదినల్ల".
అని వినత కలుపుగోలుదనముతో సవతియగు కద్రువను సంబోధించినది

(5) ఈనాఁడు మనమెల్లరము బహుళముగా నుపయోగించు 'ఊరక' అను శబ్దమును నన్నయ యెక్కచో నయినఁ బ్రయోగింపలేదు

ఈ యర్థమును బోధించుటకు 'మిన్నక' అను శబ్దమునే యెల్లయెడల అనఁగాఁ బదునాఱు తావులఁ బ్రయోగించెను.

(6) 'కంపు' అను శబ్దమును నేఁడు ప్రయోగించితిమేని భరింపరాని దుర్గంధము బయలు వెడలును.

అతని కరతలద్వయామర్దితంబులై
కందియును మహా సుగంధ కుసుమ
తతులు తొంటియట్లు తమ కంపు విడువక
యుండు నతని తేజమున్నతంబు. (3-2-197)

అని, ఆ 'కంపు' శబ్దమే భట్టారక ప్రయుక్తమై పరిమళమును వెదఁజల్లినది.

అరయు కొలఁది నిట్టివింతలు విశేషములుగల ప్రయోగము లెన్నిటినో యీ 'నన్నయ పదప్రయోగ కోశము' వలన అశ్రమముగా గ్రహింపననువు పడును.

భాషాప్రియుల పరిశ్రమచే పరిషద్ద్వారమున వెలువడిన యీ పద కోశమును బునాదిగా నుపయోగించుకొనుచు, అవసరము వెంబడిని మార్పులు చేర్పులు చేసికొనుచు, ఇది యాధారముగా భాషావినోదులు నూతన సౌధముల నిర్మింతురు గాక ఆ కృషికిని ఈ పరిషత్తువారే యాలంబ మొసంగి ప్రోత్స హింతురుగాక.

# నన్నయ కవిత్వము

— భూపతి లక్ష్మీనారాయణరావు

కవితా స్వరూప స్వభావాదులను గూర్చి పండిత విమర్శకు లనేకులు వివరించియున్నారు. భారతీయులునూ, పాశ్చాత్యులునూ ప్రతిపాదించిన నిర్వచనములనూ, వానిపై తరువాతి కాలమున రచితములైన వ్యాఖ్యానములనూ పరిశీలింపగా, - కవిత ఉదాత్తమూ, హృద్యమూ, ఇంద్రియోత్తేజకమూ అని మూడు వర్గములుగా నేర్పడుచున్నట్లు తెలియుచున్నది High poetry, Lyrical poetry, Sensuous poetry అనెడి విభాగముకూడా పై విభజనతో సమన్వయ మగుచున్నది

భామహుని నిర్వచనము మొదలుగా జగన్నాథ పండితుడు ప్రతిపాదించిన నిర్వచనము వరకూ, ఆలంకారికులు నిర్వచించి వివరించుచూ వచ్చిన కావ్యలక్షణము లన్నియూ చాలవరకు హృద్యమనెడి కవితావిభాగమునకే ఎక్కువగా వర్తించుచున్న వని చెప్పవచ్చును రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము కావ్యమనెడి జగన్నాథుని నిర్వచనము. ఈ హృద్యకవిత వివిధ నిర్వచనములకునూ సారభూతమైనదిగా గోచరించుచున్నది. ఉదాత్తమైన కవిత్వము సర్వత్రా హృద్యమైనదిగా నుండక పోవచ్చును. హృద్యమైనదంతయూ ఉదాత్తముగా నుండనవసరమునూ లేదు. ఐనను ఉదాత్తమైన కవిత హృద్యమైనది కూడా కావచ్చును వాల్మీకి రామాయణ కవిత్వముతో పోల్చి చూచి నపుడు భారత కవిత్వము హృద్యమైనదిగా తోపకపోవచ్చును. అంతమాత్రమున భారతకవిత్వ ముదాత్తమైనది కాకపోదుగదా ' Keats, Shelly, కవుల రచనలందు కాననగు హృద్యత Ilıad, Divine Comedy, Paradise Lost వంటి మహాకావ్యములలో గోచరింపక పోవచ్చును ఐనను ఈ యుద్గ్రంథముల యుదాత్తతకు భంగము రాదుకదా '

ఈ దృష్టితో పరిశీలించి చూడగా, కావ్యమునకు ఉదాత్తత నాపాదించెడి లక్షణములు - విశిష్టమైనవి - ఏవియో కలవనియూ, వానిని బట్టియే కావ్యమున కౌన్నత్య మేర్పడుచున్నదనియూ నిర్ణయమగుచున్నది. ఈ లక్షణములను పాశ్చాత్యులు Epic Poetry లక్షణములుగా పరిగణించినారు. Epic Poetry లక్షణములను నిర్ణయించుటలో చాలవరకు ఇతివృత్తమునకే ఎక్కువ ప్రాధాన్య మేర్పడినది ఇతివృత్తముయొక్క విస్తృతినీ, వైశిష్ట్యమునూ, అది నిర్వహింపబడిన విధానమునూ బట్టి, - ఈ యుదాత్తత - సిద్ధించునని విమర్శకుల అభిప్రాయము. మానవుని బాహ్యాంతర జీవితములకు ప్రతిబింబ మగుచుండుటయే కాక ధ్వని ప్రధానమైన వ్యాఖ్యానమగుచూ, సంఘజీవిత సర్వస్వమునకునూ ప్రతికృతియగుచూ, మానవుని జీవితప్రవృత్తికి మార్గదర్శక మగుచూ, భావి మానవజాతి కుపాదేయమయిన సంస్కృతిగా నిలిచి, విశ్వశ్రేయమును పరమధ్యేయముగా నిడికొన్న రచన ఉదాత్తకావ్యమని చెప్పవచ్చును. ఈ లక్షణము లన్నియు మన భారత రామాయణములకు సమగ్రముగ వర్తించుచున్నవి

ఇట్టి ఉదాత్త కావ్యసృష్టి జరుగుటకు కవిజీవితము కూడ ఉదాత్తమై యుండుట వసరము. సామాన్యమైన జీవితావధులను దాటని వ్యక్తికి ఇట్టి కావ్యరచన సాధ్యముకాదు. మానవజీవిత మందలి బాహ్య సంఘటనలను మాత్రమే చూడగలిగిన కవి అలంకార శోభితమైన, హృద్యమైన, ఇంద్రియోత్తేజకమైన వర్ణనలను, సన్నివేశములను చిత్రింప సమర్థుడు కావచ్చును. పరితలకు నొక విధమగు చిత్తవికాసమును కలిగింపవచ్చును కాని, ఆ సంఘటనలకును, సన్నివేశములకును హేతుభూతములై నిగూఢములై యున్న, బాహ్యేంద్రియముల కగోచరములై యున్న ప్రకృతితత్త్వములను గ్రహింపనివాడు, మానవ జీవిత తత్త్వమును చిత్రింపనూలేడు, వ్యాఖ్యానింపనూలేడు. కావున, ప్రకృతికి భాష్యప్రణేత కావలసిన కవి పుట్టుకచేతను, శిక్షణ చేతను, ధ్యేయము చేతను, సంస్కారము చేతను కూడ అసాధరణ వ్యక్తియై యుండవలెను. కనుకనే, - "నానృషిః కురుతే కావ్యం" అని ప్రాచీను లభిప్రాయ

పడియున్నారు. ఆత్మసంయమనము ప్రధాన లక్షణముగా, బాహ్యేంద్రియాంత రేంద్రియములను స్వాధీనమునం దుంచుకొని, ద్వంద్వముల కతీతుడై విశ్వ శ్రేయమును పరమధ్యేయముగా నిడికొన్న ఋషితుల్యులు మాత్రమే ప్రకృతికి భాష్యకారులు కాగలరు. అయినను, ఋషు లెల్లరును కావ్యకర్తలు కాలేదనెడి విషయము కూడ గమనింపదగినది. కాగా, ఋషికి గల లక్షణములతోబాటు, కావ్యదృష్టియూ, రచనాశక్తియూ కూడ అవసరములు. వీనినే మన అలం కారికులు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము – ఇత్యాదిగా కవిలక్షణములను పేర్కొనియున్నారు. తొలుత పేర్కొన్న ఋషిలక్షణములునూ, ఆలంకా రికులు వివరించిన కవిలక్షణములును కూడ నొక వ్యక్తిలో నెలకొన్ననాడు ఉదాత్త కావ్యసృష్టి సాధ్యమగును. వ్యాస వాల్మీకులు ఇట్టి మహాకవులు. వారి ననుసరించినవారే కవిత్రియమువారు.

నన్నయాదుల జీవితములు, భారతమును రచించుటయందు వారికి గల ఆశయములు, భారతేతి వృత్తముపై వారికి గల గౌరవాదరములు – వీనిని బట్టి చూడగా ఉదాత్త కావ్యరచనకు వీ రెట్లు సమర్థులో, వ్యక్తము కాగలదు. భారతభారతీ శుభగభస్తిచయంబులచే ఘోరసంసార వికార సంతమసజాలము యొక్క విజృంభణమును తొలగించి, సూరి చేతోరుచిరాబ్జ బోధనరతుడైన పరాశరాత్మ జాంభోరుహ మిత్రుడు కవిత్రయము వారికి భారత రచనయందు గురుడైనాడు. ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, ఇతిహాసము, పురా ణము ఇత్యాదిగా ప్రశంసింపబడుచున్న భారతామ్నాయమును విశ్వజనీన ముగా రచించుట వీరి ఆశయము. భారత రచనచే వ్యాసుడుద్దేశించిన లక్ష్యమే కవిత్రియము వారికిని లక్ష్యమైనది

అమితాఖ్యానక శాఖలతో, వేదార్థామలచ్ఛాయతో నొప్పుచు, సుమహా వర్గచతుష్క పుష్పవితతితో శోభిల్లుచు, కృష్ణార్జునోత్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమగుచు, ధాత్రీసురప్రార్థ్యమగుచు, భారతపారిజాతము ద్వైపాయనోద్యాన జాతమై యొప్పినది. వివిధాఖ్యానములు, వేదార్థములు కలవు గనుకనే తద్గ్రం థము ధాత్రీసుర ప్రార్థ్యమై విలసిల్లినది. ఐన, ధాత్రీసురప్రార్థ్యమెద్ది?

త్రిలోక రక్షకులైనవారు సురులు మానవలోక కల్యాణము నుద్దేశించు వారు ధాత్రీసురులు. 'గో బ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యమ్, లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు' - అనునది వీరిధ్యేయము ఇందు, 'గో' శబ్దమునకును 'బ్రాహ్మణ' శబ్దమునకును అర్థము సరియగు విధమున వివరించుకొన వలసియున్నది. మానవుని ప్రాపంచిక జీవయాత్రకు ఆధారభూతమయిన భౌతిక సంపద యంతయు గోశబ్దముచేతను, ఆధ్యాత్మిక జీవిత సర్వస్వమును 'బ్రాహ్మణ' శబ్దము చేతను ఇందువ్యక్తము చేయబడియున్నవి గోశబ్దమునకు భూమి యనియు, బ్రహ్మ శబ్దమునకు పరతత్త్వ మనియు నర్థములు భౌతిక జీవితమున కంతకును ఆధారమైన భూమియు, పారమార్థిక జీవితమునకు ఆధారమైన బ్రాహ్మణతత్త్వములు రక్షితము లయినచో, సర్వప్రజా శ్రేయస్సు సిద్ధించు నని ఈ వాక్యద్వయముయొక్క భావమైయున్నది మానవజీవితము లోకకల్యాణ ప్రదమై ఫలించుటకు భౌతిక సంపదయు, ఆధ్యాత్మిక జ్ఞానమును కూడ నవసరములు అదియే జీవితము తరించుట ఈ భావమునే "అవిద్యయా మృత్యుం తీర్త్వా, విద్యయా అమృత మశ్నుతే" అనియు వివరించినారు. అట్టి సమగ్రమైన జ్ఞానమునకు, విజ్ఞానమునకు ఆకరమై యుండుటచే భారతమున కంతటి గౌరవము కల్గినది వ్యాసునియొక్కయు, తదనుయాయుల యొక్కయు హస్తములలో ఉదాత్తేతిహాసముగ విజ్ఞానభాండారముగ సిద్ధించిన మహాభారతము ఆంధ్రమున కవిత్రయమువారి హస్తములలో మహాకావ్య స్వరూపమును గైకొన్నది.

వ్యాసుడు ప్రధానముగ ఇతిహాస రచయిత. రసవంతమగు కావ్యరచన అతని యుద్దేశము కాదు. సత్యధర్మములకు ఆపద కలిగి సంఘము పాపావిష్టమైయున్న సందర్భమున సారస్వతము ద్వారా సత్యధర్మములను పునరుద్ధరించి సంఘమునకు స్వస్థత చేకూర్పదలచినవాడు వ్యాసుడు. కావున, వ్యాసుడు సంఘమునకు గురుస్థానమున నిలిచియున్నాడు. పాండవ కౌరవుల వంశ చరిత్రయే ప్రధానమైన ఆధారముగ, లోకవృత్తము నంతటిని ప్రజలకు వివరించి, పాపపుణ్యముల స్వరూపమును వారికి అర్థమగునట్లు జేసి వారిని సత్య

ధర్మోన్ముఖులుగ నొనర్చుట వ్యాసుని ఆశయము. కావున, ఇతిహాస మార్గమున కథను నడిపించుటయే యతడు ధ్యేయముగా నిడికొన్నాడు. భారత రచనా విషయమున కవిత్రియమువారి ధ్యేయమును వ్యాసుని ధ్యేయమును నొక్కటే. అయినను, రచనావిధానమున వీ రవలంబించిన మార్గములు వేరు. భారతకథను ఆకర్షణీయముగ రసవంతమయిన విధమున కావ్యముగా తీర్చిదిద్ది ప్రజల మనస్సులను చూరగొనుట వీరి యాశయము. కేవలము పురాణ విధానము కవిత్రయము వారికి నచ్చలేదు. కావున వ్యాసుని రచనకు కావ్యత్వము నాపాదింపజేసిన వారు తెలుగు కవులు,

ఇమ్ముగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశుబిం
బమ్మున నుద్భవం బయిన భారతవాగమృతంబు కర్ణరం
ధ్ర మ్మను నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోకవం
ద్యు మ్మని నప్పరాశరసుతుం బ్రణమిల్లి కరమ్ము భక్తితోన్

అని నన్నయ భారతము వ్యాసుని వాగమృత మనియు దానిని లోకులు కర్ణరంధ్రమ్మను నంజలిం దవిలి త్రావుదు రనియు వర్ణించినాడు. ఈభావమునే తిక్కన 'భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావలి మోదముం బొరయునట్లుగ,' తాను భారతము రచింతు నన్నాడు. భారత విషయమున నన్నయ తిక్కన లిరువురకును ఇట్లు భావైక్యము కలదు భారతమును వర్ణించుచు వీరు వాడిన యమృతశబ్దము గుర్తింపదగినది అమృతశబ్దముచే బోధ్యమైనది ఆత్మ సాక్షాత్కారమునకు సాధనమైన విద్య ఉపనిషత్తుల యందును, ఉత్తర మీమాంసయందును బోధింపబడిన ఈ విశిష్ట విద్యయే అమృతత్వము నొసంగునది. అట్టి విద్యను బోధించునది గనుకనే భారతము అమృత మని పేర్కొనబడినది. అట్టి భారతార్థమును లోకులు ఆసక్తితో కర్ణపుటంబుల నారగ్రోలి యానందమును బొందుదు రనుటలో ఆంధ్ర భారత రచన లోకులనాకర్షించునట్టి కమనీయ విధమున నడచినదని స్ఫురించుచున్నది.

ఇట్టి కావ్యరచనా విధానమున కవిత్రయమునకు ఒరవడి యయినవాడు వాల్మీకి. భారత రామాయణములు రెండును ఇతిహాసములు, మహాకావ్యములు

అయినను, రచనా విధానమున నీ రెంటికిని భేద మెంతయో కలదు. వశ్య వాక్కగు వ్యాసుని రచన ప్రకృతి సిద్ధముగా స్వేచ్ఛగా, అర్థ భావములను అనుసరించి సిద్ధించినది. కావున స్వేచ్ఛగా ప్రకృతియందు పెరిగి అనేక ముఖముల వ్యాపించి గంభీర స్వరూపమును గైకొన్న మహారణ్యమువలె భారత రచన గోచరించుచున్నది. ఇందలి గాంభీర్యము, గౌరవము నిసర్గమగు ప్రకృతి సౌందర్యము భగవత్సృష్టివలె అద్భుతావహమైనది. కావుననే, "బుద్ధి బాహు విక్రమమున దుర్గమార్థ జలగౌరవ భారత భారతీ సముద్రము దరియంగఁ నీ దను విధాతృనకైనను నేరబోలునే"— అని నన్నయ చెప్పియున్నాడు. వాల్మీకి రామాయణ రచనా విధానము వేరు. వ్యాసుని రచన ప్రకృతియందలి మహారణ్యమును పోలుచుండ, వాల్మీకి రచన తీర్చిదిద్దిన మహోద్యానము వంటిదిగా గనబడుచున్నది. శబ్దముల కూర్పు, అర్థములను ప్రసన్నముగ వ్యక్తము చేయుట, భావములను మనోహరమగు విధమున గూర్చుట, వర్ణనలచే సన్నివేశములను రమణీయముగ నొనర్చుట మున్నగు ప్రధానకావ్య లక్షణములు వాల్మీకి రామాయణమునందు కాననగు విధమున వ్యాస భారత రచనయందు గోచరించుటలేదు. ఇందులకు ఈ మహర్షుల భిన్న దృక్పథములే హేతువులు. వాల్మీకియందలి యీ కావ్యవిధానమే తెలుగు కవిత్రయము వారికి ఒరవడి యయినది.

'దుర్భర తపోవిభవాధికుఁ గురుపద్య విద్యకు నాద్యు నం
బురుహగర్భవిభుఁ బ్రచేతసుపుత్రు భక్తి దలంచుచుఁ'—

అని నన్నయ వాల్మీకిని మొదట ప్రశంసించి తరువాతి పద్యమున వ్యాసుని తలచియుండుట గమనింపదగినది. అందును, గురుపద్య విద్యకు నాద్యుడు వాల్మీకియట. చారిత్రక దృష్ట్యా భారత రచనకు తరువాతనే రామాయణ రచన జరిగినదని యభిప్రాయము కలదు కదా! అట్లుండ గురుపద్య విద్యకు వాల్మీకి ఆద్యుడని నన్నయ నుడువుటలో నభిప్రాయ మేమైయుండును? భారతమందలి కవితయందు కంటెను, రామాయణ రచనలో విశిష్టమైన రామణీయకత నన్నయకు గోచరించియుండుటచే పద్య విద్యయందు వాల్మీకియే

ప్రథముడు. అనగా, మొదట పేర్కొనదగిన వాడు అని యభిప్రాయపడి యుండునని యూహింపవలసియుండును. కావుననే వాల్మీకి రచనను ఒరవడిగా పెట్టుకొని నన్నయ తన పద్యరచనను సాగించినా డని చెప్పవచ్చును. ఈ 'పద్యవిద్య' యను ప్రయోగమును బట్టి చూడ నన్నయ నాటికే పద్యరచన ఒక కళగా సిద్ధించియుండె నని తలంపవలసి యున్నది.

అలంకార గ్రంథములు కావ్య ప్రస్థానములు అప్పటికే ప్రచారమునకు వచ్చినవి కావున 'కావ్య సౌందర్యము'ను పోషించు నాసక్తి కలిగినది.

మరియు ప్రసన్నకథా కలితార్థయుక్తి. అక్షరరమ్యత, నానా రుచిరార్థసూక్తి, మున్నగు కావ్యరచనా విశిష్ట లక్షణములను నన్నయ పేర్కొని యుండుట కూడ ఈ యభిప్రాయమును బలపరచుచున్నది. కావున నన్నయ నాటికే పద్య విద్య తెనుగున బాగుగ నభివృద్ధిగాంచి యుండినదని యంగీకరింపక తప్పదు. అట్టి పద్య విద్యకు భారత రచనచే స్థిరత్వము కల్పించి, దాని నొక కళగా తీర్చిదిద్ది ఆదికవి యను గౌరవమును పొందినాడు. భారత రచన నన్నయ యొక్క మొదటి కావ్యమని కూడ నంగీకరింప వీలులేదు – చూడుడు.

విపరీత ప్రతి భాష లేమిటికి నుర్వీనాథ యీ పుత్రగా
త్రపరిష్వంగ సుఖంబు నేకొనుము ముక్తాహార కర్పూర సాం
ద్రపరాగ ప్రసరంబు చందనము చంద్రజ్యోత్స్నయున్ పుత్రగా
త్ర పరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడుఁ శీతమే !

అని మాధుర్య ప్రసాదములు ప్రధానములుగా శయ్యా సౌభాగ్యముచే నొప్పుచు, రమణీయార్థమును లలితములగు పలుకులచే ప్రతిపాదించుచు, నైసర్గికములు నర్థపోషకములు నగు నలంకారములచే శోభిల్లుచు నుండెడి యిట్టి పద్యరచన నన్నయ ప్రథమ ప్రయత్నమని తలంచుట యెట్లు? ప్రాక్తనజన్మవిద్య యంతయు నన్నయ కీ జన్మమున సిద్ధించి యుండవచ్చును. అయినను అభ్యాసము లేనిదే యెట్టి విద్యయు పరిణతస్థితిని అందుకొన

దనుటలో విప్రతిపత్తి యుండదు భారత రచనారంభమునకు పూర్వమే నన్నయ పద్య విద్యను సాధించిన వాడనియు, మహాకావ్యములు కాకున్నను ఏవో కొన్ని కావ్యములనైన రచియించి యుండుననియు నా నమ్మకము.

"మానిషాద ప్రతిష్ఠాంత్వమగమ శ్శాశ్వతీ స్సమాః"

అను విధముగ వాల్మీకి నోటినుండి వెలువడిన సరస్వతివలెనే నన్నయ నోటి నుండి ఒక్కసారిగా ఇట్టి భారతరచన ఊడి పడిన దనువారితో నేను వాదింప జాలను. నా యభిప్రాయ మిదియని చెప్పి నమస్కరించుటయే నేను చేయ గలిగిన పని.

పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజవారి జోత్కరరుచిరములు సకలగమ్యసుతీర్థములు మహామనోహర సుచరిత్ర పావనపయః పరి పూర్ణములు నయిన సత్సభాంతర సరసీవనములను ముదం బొనర కొనియాడిన వాడు నన్నయ ఈ సభాంతర సరసీవనములలో శాస్త్ర చర్చలే కాని కావ్యా లాపములు కావ్యపఠనములు ఉండలేదని యూహించుట యెట్లు? ఉభయ భాషా కావ్యరచనాభి శోభితుడు సత్ప్రతిభాభియోగ్యుడు అని నన్నయను రాజనరేంద్రుడు నిరాధారముగ ప్రశంసించినాడని యెట్లు చెప్పగలము. మరియు తనకు సహాధ్యాయుడయిన నారాయణభట్టు వాఙ్మయదురంధరుడు అనియు సంస్కృత కర్ణాట ప్రాకృ తాంధ్రభాషలలో కవిరాజశేఖరు డనియు వర్ణింప బడుట కేవలము లాంఛనమని చెప్పలేము కదా! వీని నన్నిటినిబట్టి చూడగా భారతరచనా కాలమునకే నన్నయ సంస్కృతాంధ్ర కవితా రచనయందు సిద్ధహస్తుడయి యుండెననియు, ఆ ఆత్మ విశ్వాసమును ఆధారముగ గొనియే మహాభారత సముద్రమును దరియంగ నీదుటకు పూనుకొనెననియు విశ్వసింపక తప్పదు.

అదికాక, తారకాసముదయములను లెక్కించుట, సర్వవేద శాస్త్రముల యశేషపారమును బొందుటయు నెట్టివో భారత రచన గావించుట యట్టిదని చెప్పికొనిన నన్నయ దానికి వలయు శక్తిసామర్థ్యములు అర్హతలు శిక్షణా

భ్యాసములు లేనిదే త న్మహాకార్యమునకు పూనునట్టివాడు కాడు. అవిరళ జపహోమతత్పరుడు, సద్వినుతావదాతచరితుడు, నిత్య సత్యవచనుడు— అను విశేషణములు కూడ గమనింపదగినవి. పంచమవేద మని గౌరవింపబడు చున్న మహాభారతమును స్పృశించుటకు మాత్రమే కాక అనువదించుటకు పూనుకొనవలసిన వ్యక్తి యెట్టి యోగ్యతలు కలవాడై యుండవలెనో యిందు వ్యక్తము చేయుచున్నాడు. అవిరళజపహోమతత్పరుడు కనుక ప్రాపంచిక విషయములయందును ధనకనకపదవీ వ్యామోహములందును ఆసక్తి యేర్పడ లేదనుట గమ్యమాన మగుచున్నది. అట్టి ప్రాపంచిక విషయాతీతుడయి నప్పుడే భారత ప్రోక్తములగు వేదాంతార్థాదులను ధర్మసూక్ష్మములను తాను దర్శించి యితరులకు బోధింపగలడు. అట్లే తద్వ్యక్తి యొక్క జీవితచరిత్రయు నిష్కళంకము, లోకహితమును కాంక్షించునదియు కూడ నయియుండవలెను. లేనినాడు వ్యాసు డుద్దేశించిన విశ్వశ్రేయమును తన రచన వలన సిద్ధింపజేయ లేడు. అందుననే సద్వినుతావదాతచరితుడని తన జీవితచరిత్రి యెట్టిదో, భారత రచనకు తనకు గల యర్హత యెట్టిదో సూచించినాడు. అట్లే తాను నిత్య సత్యవచనుడనియు చెప్పకొనవలసినది భారతామ్నాయముపై లోకము నకు అందును పండితులకు నా డుండిన గౌరవమట్టిది. అట్టి పంచమవేదమును అనువదింప బూనుకొన్న వ్యక్తి విషయమున పెదవి విరుపులు, సందేహములు పండితులలో కలుగకపోవు. కావుననే నన్నయ తన యర్హతలను కొంతకు కొంత ముందుగా నివేదించుకొనవలసి వచ్చినది.

ఈ విధముగా ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములకు అకళంకము, నుదాత్తము నగు జీవితము తోడగుచుండ భారత రచనచే విశ్వశ్రేయమునకు పూనుకొన్నవాడు నన్నయ. భారతము నాంధ్రీకరించుటలో నన్నయ యవలంబించిన విధానమును స్వతంత్రమైనదే వ్యాసుని కథాప్రణాళికకు ఏ మాత్రమును భంగము కలుగనీయక తత్తత్కథాంగములను కావ్యోచిత మగు రీతిగా చిత్రించుచు, కథార్థమును పాఠకునకు ప్రసన్నమగునట్లు చేయుట నన్నయ యవలంబించిన పద్ధతి. మూలమున విస్తృతముగ తనకు తోచిన

భాగములను కథా సౌష్ఠవమునకు అనుకూలించునట్లుగా కుదించుట మూలమున వర్ణనీయమైన సన్నివేశము ఈ షత్స్పృష్టము మాత్రమే అయియున్నచో దానిని పెంచి వర్ణించుట, తన కాలపు రూఢినిబట్టియు సాంఘిక వ్యవస్థను బట్టియు అనుచితములని తోచిన వానిని తొలగించియో లేక ఔచిత్యాను గుణముగ మార్చియో కథను నడిపించుట ఇతడవలంబించిన విధానములలో కొన్ని.

సత్యవతీ పరాశర సమాగమమును వర్ణించు ఘట్టమును పరికింతము. యమునయందు ఓడ నడపుచున్న మత్స్యగంధిని తీర్థ యాత్రాపరుడగు పరాశరమహర్షి గాంచినాడు.

"అతీవ రూపసంపన్నామ్, సిద్ధానా మపి కాంక్షితామ్,
చారుహాసినీమ్, రంభోరూమ్, దివ్యామ్, తామ్
వాసవీమ్ కన్యామ్."—

తొలి చూపుననే మహర్షి కామించినాడు.

"సంగమమ్ మమ కళ్యాణి కురుష్వే త్యభ్యభాషత"

పరాశరుడు మహర్షి, తపోధనుడు, లౌకిక వ్యాపారాదులను లక్షింపని వాడు, తాత్కాలికముగ విధిప్రాబల్యమున కామమునకులోనై "కళ్యాణి, మమ సంగమమ్ కురుష్వ" అని సూటిగా, ఏ మాత్రమును వక్రోక్త్యాదుల కవకాశము లేక, జంకు బిడియము భయము అనువాని పరిసక్తి లేక, దప్పిగొన్నవాడు జలము నర్థించినట్లు, ఇంద్రియతృప్తి నాశించినాడు ఇది ఆ మహర్షి జీవిత మునకును ఆ ప్రకృతి సన్నివేశమునకును సరిపోయిన వర్ణన ఏమి చెప్పుట కును నోరాడని సత్యవతి స్త్రీ ప్రకృతికిని ప్రవృత్తికిని సహజమైన విధమున—

"సా బ్రవీత్ పశ్య భగవన్ పారావారే స్థితాన్ ఋషీన్
ఆవయోర్దృష్టయో రేభిః కథంతు స్యాత్ సమాగమః"

అని ప్రశ్నించి తప్పించుకొన జూచినది. మహర్షియయిన వానిని అధిక్షేపించు టకుగాని, నిరసించుటకుగాని ఇష్టపడక క్లిష్టపరిస్థితినుండి చల్లగా తప్పించు

కొను స్త్రీప్రయత్న మందు వ్యక్తమయియున్నది. సత్యవతికిగల ఆత్మవిశ్వాసము కూడ ప్రకటితమే. కాని, మహర్షి తన తపఃప్రభావముచే సకలదృష్టిరోధకమైన నీహారతిమిరమును తక్షణమే కల్పింపజేసినాడు. తద్భ్రాభావదర్శనముచే సత్యవతి విస్మితురాలైనది.

"విస్మితా సా భవత్ కన్యా వ్రీడితా చ తపస్వినీ''

సిగ్గును, విస్మయమును ఆమెను లోగొన్నవి. పాపము. అయినను ఆత్మప్రత్యయమును గోల్పోక -

"విద్ధి మామ్ భగవన్ కన్యామ్ సదా పితృవశానుగామ్
త్వత్సంయోగాచ్చ దుష్యేత కన్యాభావో మమానఘ
కన్యాత్వే దూషితేవాపి కథమ్ శక్ష్యే ద్విజోత్తమ
గృహమ్ గన్తుమ్ ఋషే చాహమ్ధీమన్ నస్థాతుముత్సహే
ఏతత్సంచిన్త్య భగవన్ విధత్స్వయదనన్తరమ్''

అని పలికినది. తాను కన్య, తండ్రి యధీనమునం దుండునది, తన కన్యాత్వము దూషితము కాగలదు. అట్లగుచో తా నెట్లు నిలువగలదు - అను విషయముల నేకరువుపెట్టి, ఇవన్నియు బాగుగ యోచింపుము ద్విజోత్తమా అని హెచ్చరించినది. ఈ పలుకులచే మహర్షికి ప్రీతి జనింప, తన సంగమముచే నామెకు కన్యాత్వము దూషితము కాదని చెప్పి, యోజనగంధిత్వాది వరము లిచ్చి, ఆమె జన్మవృత్తాంతమును తెలిపి, తన తపశ్శక్తిచే నామె యెదురాడకుండునట్లు చేసినాడు ఋషి. అట్లు లబ్ధవరయు, ప్రీతయు, స్త్రీభావ గుణభూషితయు అయిన యామె మహాద్భుత కర్మలను ప్రదర్శించిన ఋషి సంసర్గమును పొందినది. ఇది మూలమందలి కథన విధానము.

పరాశరుని గూర్చిన వర్ణన యే మాత్రమును మూలమునందులేదు. కాని నన్నయ—

గతమదమత్సరుండు త్రిజగద్వినుతుండు వసిష్ఠపౌత్రుడు
న్నతమతి శక్తిపుత్రు డఘనాశన ఘోరతపోధనుండు సు

వ్రతుడయి తీర్థయాత్ర చనువాడు పరాశరుడ న్మునీంద్రు డ
య్యతివ తలోదరిఁ గనియె న య్యమునానది యోడరేవునఁ.

అని యొక పద్యమున నీ సన్నివేశమునకు ఆరంభముగా పరాశర మహర్షిని వర్ణించినాడు. తపోధనుడై, ఋషియైయుండిన పరాశరుడు ఇంద్రియవిజేత యగుటకు బదులుగ ఇంద్రియములకులోనై సత్యవతియందు ప్రవర్తించినాడు. ఈ కార్యమును సమర్థించుకొనుటకు పరాశరుని వర్ణన అవసరమైయున్నది. మదమత్సరములను జయించినవాడు. త్రిజగద్వినుతుడు. ఇక్ష్వాకుల కులగురు వగు వసిష్ఠుని మనుమడు. ఇంతియకాక పాపమును నశింపజేయునట్టి ఘోర తపోధనుండు – అట్టివాడు సువ్రతుడయి తీర్థయాత్ర చనుచు కర్మపరిపాక ముచే ఇంద్రియవశంవదు డయినాడు. ఈ పరాశర సత్యవతీ సమాగమ వృత్తాంతము సామాన్య కాముక వృత్తాంతము కాదనియు లోకాతీతమైన విషయమనియు తెలుపుట నన్నయ యుద్దేశము కావుననే పరాశరు డెట్టి మహర్షియో, ఎట్టి అఘనాశన ఘోరతపోధనుడో వివరింపవలసి వచ్చినది అతని విషయమున ఇది పాపమును కాదు; అతని నిది స్పృశింపను స్పృశింపదు. ఇట్టి మహర్షుల ప్రవృత్తిలో తాత్కాలికముగ నైనను జరిగిన యిట్టి సంఘటనలు తామరపాకు నంటని నీటి బిందువులవంటివని సూచించుట నన్నయ యుద్దేశము. లోకాతీతులగు మహాపురుషులయెడ భక్తి విశ్వాసము లుండిన వ్యాసుని కాలమున ఇట్టి వివరణ కవసరము లేకపోయినది కావున వ్యాసుడు "తీర్థయాత్రాం పరిక్రామన్ అపశ్యత్ వై పరాశర.–'' అని ఒక వాక్యమున సామాన్యముగ చెప్పి విడిచిన దానికి నన్నయ కాలమున వివరణ కావలసివచ్చినది. మరియు "మునివరుండు తన యభిప్రాయం బక్కన్యక కెరిగించిన నదియును దీనికొడంబడనినాడు నా కలిగి యి మ్ముని శాపంబిచ్చునో యని వెఱచి యిట్లనియె :

తరల॥ "తనువు మీన్పొలవల్చు జాలరిదాన నట్లును గాక యే
నసఘ కన్యకఁ గన్యకావ్రత మంతరించిన నెట్లు మ

జ్జనకు నింటికిఁ బోవనేర్తుఁ బ్రసాదబుద్ధి యొనర్పు స
న్మునిగణోత్తమ నాకు దోషవిముక్తి యెట్లగు నట్లుగాఁ."

అని పలికినది చేపవాసనతోడి తనువు గలదాన ననియు, జాలరిదాన ననియు వర్ణనలు నన్నయవి. వీనిచే పరాశరునకు జుగుప్స కలిగించి అతనిని విషయ విముఖునిగ నొనరించుట సత్యవతి ప్రయత్నము. అతడు ద్విజోత్తముడు, తాను జాలరిది – అనియు పేర్కొన్నది. పరాశరుని కాలమున వర్ణవిషయక మగు నిర్బంధములు తక్కువ కావున వ్యాసు డా ప్రసక్తిని తేలేదు. నన్నయ నా డది ప్రధానమయిన విషయము కావున తాను జాలరిదాన ననిచెప్పియు సత్యవతి అతనిని మరల్ప జూచినది. అయినను సత్యవతి కన్యాత్వము దూషితము కా దనియు ఆమె వసురాజ సంతతి యనియు నచ్చజెప్పి యోజనగంధిత్వమును సిద్ధింపజేసి ఋషి యామె నొడంబడునట్లు చేయజూచినాడు. అప్పటికిని వెనుదీయుచున్న సత్యవతి –

"ఎల్లవారును జూడంగ నిట్టి బయల నెట్లగు సమాగమం" బని మరియొక యడ్డు చెప్పినది మూలమునందువలెనే యిందును స్త్రీ స్వభావోచిత మగు ప్రవృత్తియు వయోనురూప మగు ముగ్ధత్వమును చక్కగ ప్రదర్శితము లయి యున్నవి. పైన చెప్పిన విధమున పరాశర మహాముని వర్ణనను చేర్చుటచే ప్రకరణమున కౌచిత్యము సిద్ధించినది సత్యవతికి సిద్ధించిన యోజన గంధిత్వమును గూర్చి పెంపుడు తండ్రి యగు దాశరాజు ప్రశ్నించినట్లును, పరాశరముని దయవలన కలిగినదని యామె బదులుచెప్ప నెల్లవారును హర్షించినట్లును మూలమున గలదు. తండ్రి కూతుల మధ్య జరిగిన ఈ సంఘ టన – కావ్యదృష్ట్యా అనుచితమని కాబోలు నన్నయ విసర్జించినాడు. ఇది నన్నయ పాటించిన విధానము అనువాదమున గల యీ క్రింది పద్యమును గూర్చి యొకమాట చెప్పవలసియున్నది.

"ఇ ట్లేకతంబ యేక వస్త్రమయి యోడ నెక్కవచ్చువారి నిరీక్షించు చున్న సత్యవతిం జూచి యా మునివరుఁడు దానియందు మదనపరవశుఁ డై

దాని జన్మంబు తన దివ్యాజ్ఞానంబున నెఱిగి యయ్యోడ యెక్కి దానితో నొక్కటఁ జని చని—

చపలాక్షి చూపులచాడ్పున కెడమెచ్చుఁ
జిక్కని చనుఁగవఁ జిఱుఁగోరు
నన్నువ కౌఁదీగ యందంబు మది నిల్పు
జఘనచక్రంబుపైఁ జలుపు దృష్టి
యభిలాష మేర్పడు నట్లుండగాఁ బల్కు
వేడ్కతో మఱుమాట వినఁగఁ దివురు
నతిఘనలజ్జావనత యగు న క్కన్య
పైబడిఁ లజ్జయుఁ బాపఁగడఁగు
నెంత శాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁ గడు వివిక్తమయినచోట
సతుల గోష్ఠిఁ జిత్తచలన మొందుదు రెందుఁ
గాముశక్తి నోర్వఁగలరె జనులు."

ఈ వర్ణన మూలమున నెందును లేదు నన్నయ వ్రాయను లే దని నా దృఢవిశ్వాసము. ఈ సీసపద్యమున వర్ణితమయినది చిరకాలాభ్యస్త మయిన కాముక చిత్తవృత్తి జీవితమున మొదటిసారిగా, బలవద్విధికారణ ముగా - మహర్షికి గలిగిన ఇంద్రియేచ్ఛకాదు అఘనాశన ఘోరతపోధనుడు, త్రిజగద్వినుతుడు నైన పరాశరుని వంటి మహర్షియొక్క తాత్కాలిక చిత్త వికృతి యొక్క వర్ణన కా దిది. ఈ వర్ణన కొంతవరకు కీచకుని విషయ మున అన్వయించునేమో కాని, లోకాతీతు లగు మహర్షులవిషయమున నన్వ యింపదు. కామప్రవృత్తికి లోనుగానివాడు పరాశరమహర్షి. అట్టి అనుభవ శూన్యుడైనవాని యింద్రియవికారము, ప్రవృత్తియు, క్షణికమును, బాహ్యేం ద్రియ ప్రచోదితము, మానసిక ప్రవృత్తిరహితము నయియుండునే కాని యిందు వర్ణితమైనట్లు కాముకభావనాప్రాబల్యమునకు లోనైనదికాదు. కీచకుని పరివృత్తిని వర్ణించుపట్ల తిక్కనయు నిట్టి జుగుప్సావహములగు వర్ణనలు

గావింపలేదు. కవిత్రయమువారు పాటించిన ఔచిత్యము, సంయమనము నట్టివి. కావున ఈ పద్యము తర్వాతికాలమున మహానుభావు లెవ్వరో చేర్చియుందు రని నమ్ముచున్నాను. భాషావిషయమున నీ పద్యమును పరిశీలించినను నా యూహయే బలపడునట్లున్నది. మరియు దేశమందున్న వ్రాతప్రతులలో కొన్నింట నీ పద్యము కానరాకుండుటయు గమనింతురని నా ఆశ.

మరియొక సందర్భమును గమనింపుడు. పాండురాజునకు మునిశాపము కలుగ, కుంతి భర్తృప్రాణ రక్షణార్థమై నిరంతరమును జాగరూకత వహించి యుండినది. కాని విధి బలీయమైనది. వసంతఋతు విజృంభణసమయము, కుంతి బ్రాహ్మణభోజనమున నిమగ్నయై మాద్రీరక్షణంబునం దేమరియున్నది. యువతి, లావణ్యవతి, యగు మాద్రితో పాండురాజు వనమున క్రుమ్మరుచుండి, మనసిజరాగమత్తుడై, శాపభయమునుకూడ విస్మరించి, మాద్రి వారించు చున్నను మానక – అనర్థమునకు గురియైనాడు. కావ్యదృష్ట్యా గమనించుచో ప్రధానములైన యంశములు – మాద్రీదేవి తారుణ్య లావణ్యసంపద, రాగో ద్దీపక మగు వసంతవిజృంభణము, మాద్రీ పాండురాజుల యేకాంతమునకు నవకాశము. ఇందులో మూడవది మూలమునను, ననువాదమునకుకూడ సమానమే. మాద్రి సౌందర్యము మూలమున వర్ణితమైనవిధము——

"తాం. వయః స్థాం, తనువాససామ్, రాజీవలోచనామ్ –
దృష్ట్వా కామవశీకృతః సః తం కామం నియంతుం న శశాక
కామపరీతాత్మా సః మాద్రీం మైథునధర్మేణ బలాద్
అన్వగచ్ఛత్."

'వయః స్థాం, తనువాససామ్ రాజీవలోచనామ్' అను మూడు విశేష ణములును సాభిప్రాయగర్భితములు, గంభీరములు–ఇతిహాస దృష్ట్యా మానవ ప్రకృతిదృష్ట్యా చాలు. కాని, కావ్యదృష్ట్యా–చాలినవికావు కావున. నన్నయ –

"చారుసువర్ణహాసి నవచంపకభూషయు సిందువారము
క్తారమణీయయుఁ బకుళదామవతంసయునై యపూర్వశృం

గారవిలాసలీల యెసఁగం దన ముందట నున్న మాద్రి నం
భోరుహనేత్రఁ జూచి కురుపుంగవుఁ డంగజరాగమత్తుడై ".

అని మాద్రి శృంగారమూర్తిని చిత్రించినాడు. పాండురాజు అంగజ రాగమత్తు డగుట కిట్టి అపూర్వసౌందర్యమూర్తిని, అందును నతని ప్రియ పత్నిని, వసంతావిర్భావముచే వికసించియున్న ప్రకృతిమధ్యమున - ప్రత్యక్ష ముగ నిలుపవలసివచ్చినది. ఈ పద్యమందలి,— "తన ముందట నున్న" అను ప్రయోగమును, "కురుపుంగవుడు" అను ప్రయోగమును గమనింపుడు. వీనిచే గమ్యమానమగు అప్రకృతవిషయము సహృదయైక వేద్యము. ఈ ప్రయోగములు ప్రయత్నసిద్ధములు కావు. అప్రయత్నముగ వచ్చిపడినవి - యని యెవరైన నాక్షేపించుచో - నింకను మంచిది. Unconscious art లో రామణీయక మెక్కువ.

ఇక - మూలమందలి వసంతవర్ణన -
"సుపుష్పితవనేకాలే కదాచి న్మధుమాధవే
భూతసమ్మోహనే రాజా సభార్యో వ్యచరద్ వనమ్,
పలాశై స్తిలకై శ్చూతై శ్చంపకైః పారిభద్రకైః
అన్యైశ్చ బహుభిర్వృక్షైః ఫలపుష్పసమృద్ధిభిః
జలస్థానైశ్చవివిధైః పద్మినీభిశ్చ శోభితమ్
పాండోర్వనం తత్ సంప్రేక్ష్య ప్రజజ్ఞే హృది మన్మథః
ఈ వస్తువునే నన్నయ చిత్రించిన విధము—
"కమ్మని లతాంతములకు మ్మొనసివచ్చు మధు -
పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధిముకు
ళమ్ములను నానుచు ముద మ్మొనర వాచా
లమ్ము లగు కోకిలకులమ్ముల రవమ్ము మధు
ర మ్మగుచు విన్చె ననిశమ్ము సుమనోభా

రమ్ములు నశోకనికరమ్ములును జంపకచ
యమ్ములును గింశుక వనమ్ములును నొప్పెన్."
"చందన తమాల తరులందు నగరుద్రుమము
లందుఁ గదళీవనము లందు లవలీమా
కందతరుషండములయందు ననిమీలదర
విందసరసీవనములందు వనరాజీ
కందళిత పుష్పమకరంద రసముం దగులు
చుం దనువు సౌరభము నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందములలందురఁగ
మందమలయానిల మ మందగతి వీచెన్."

వస్తుభావములు రెండింటను సమానమే కాని, మూలమందలి రచన భావగర్భితము, మితపదపరిమితము, గంభీరము. అనువాద మందలి రచన భావోద్దీపకము మధురశబ్దవిన్యాసపోషితము, రమణీయార్థస్ఫోరకమునై రసిక చిత్తస్పందకమై యున్నది. కావుననే రచనకు కావ్యత్వ మబ్బినది.

"It is not what is said but how it is said — that matters in Poetry" అని యొక విమర్శకుడు. అనగా - రచనకు కావ్యత్వమును సిద్ధింప జేయునది "చెప్పెడితీరు"-అని భావము. ఈ భావచిత్రణముయొక్క- తీరునే - దండి 'మార్గ' మని పేర్కొని యున్నాడు. దీనినే వామనుడు-కొంత మెరుగుపెట్టి 'రీతి' యని వ్యవహరించినాడు. కావ్యలక్షణములుగా దండికి గోచరించినవి. ఓజో ప్రసాద మాధుర్యాదిగుణములు - పది.

[శ్లేష —ప్రసాద - సమత - మాధుర్య - సుకుమారత - అర్థవ్యక్తి- ఉదారత్వ - ఓజస్సు - కాంతి - సమాధి]

దండి కావ్యాదర్శ ప్రథమ పరిచ్ఛేదమున నెక్కువభాగము - వైదర్భి గౌడీ మార్గముల విభేదమును ప్రతిపాదించుటకే వినియుక్తమైనది. అందును వైదర్భమార్గమునందే దండికి అధికాదరము, శ్లేష, ప్రసాదాది దశగుణములే

వైదర్భీ మార్గముయొక్క ప్రాణము. గౌడ మార్గమున నివి విపర్యయములై కనిపించును.

"ఇతి వైదర్భ మార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః
తేషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని."

దండి గుణముల కీ విధమున నిచ్చిన స్థానమును వామనుడింకను దృఢముగ నొనర్చినాడు.

'కావ్యశోభాయాః కర్తారో ధర్మాగుణాః
త దతిశయహేతవస్తు అలంకారాః పూర్వే నిత్యాః'

కావ్యసౌందర్య హేతువులైన ధర్మములు గుణములు. సౌందర్యమున కతిశయము కలిగించునవి మాత్రము అలంకారములు. గుణములు కావ్యమున తప్పక ఉండదగినవి యని నుడివి - ఆ దశగుణముల నొక్కొక్కదానినీ శబ్దమునకూ , అర్థమునకూ వేర్వేరుగా అన్వయించుచూ, వివరించినాడు. ఈ ఇరువది విధములైన గుణము లన్నియూ కలిగి యొప్పునది వైదర్భీరీతి. దీనిని మాత్రమే వామను డంగీకరించి - యిదియే కావ్యమునకు ' ఆత్మ' - యని నిర్ణయించినాడు.

"రీతి రాత్మా కావ్యస్య"

ఇట్లు కావ్యత్వసిద్ధి కత్యావశ్యకమైన గుణమునందే రసమునకును వామను డవకాశమును, ఉన్నత స్థానమును కల్పించి, "దీప్త రసత్వం కాంతిః" అని వివరించినాడు. వివిధము లగు గుణములతో కూడిన శబ్దార్థముల సంయోగము 'రీతి' - యను భావమును, - Grace అను ఆంగ్లపద భావముతో సరిపోల్చవచ్చును. ఈ 'Grace' లేక 'రీతి' - యనునది చిత్తవికాసహేతు వైన దనుటలో విప్రతిపత్తి లేదు. ఈ రీతియే నన్నయ రచనయందు ప్రధానముగ భాసించునది.

రీతికి ప్రాధాన్య మేర్పడినంతనే - శబ్దార్థముల పొందిక, నాద విన్యాసము, నడక, శయ్య - అనునవి తప్పనిసరి యగుచున్నవి. వీనిలో నేది

లోపించినను 'రీతి' సిద్ధింపదు. ఒక పంక్తిలో Grace ఉన్న దనినంతనే - అం గాంగ భావసౌష్ఠవ సామరస్యములు, లావణ్య తారళ్యములు, కాంతివిలాస ములు, చిత్తహేతు వగు భావ మాధుర్యము - ఉండక తప్పవు. కవిత్వము నకు నట్టే రీతికిని, తద్ధేతువు లగు పైజెప్పిన గుణములకును సమవాయ సం బంధము కలదు ఆ రీతియే నన్నయ సాధించినాడు. మచ్చున కొకటి రెండు పద్యముల నుదహరించి విరమింతును

1. వివిధోత్తుంగ తరంగ ఘట్టనచల ద్వేలావనై లావలీ
లవలీలుంగ లవంగ సంగతలతాలస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం ద త్తీర దేశంబునం
దవదాతంబుజ ఫేనపుంజనిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్, మాధుర్యము

2. నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జగున్నత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రు డోపు నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మరింపగన్,
పసాదగుణము.

3. నరచాప ప్రవిముక్తదారుణ బృహన్నారాచధారల్ భయం
కరదైతేయని కాయ కాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ బం
ధురధాత్రీధరతుంగ శృంగతటసందోహంబుపైఁ గప్పు దు
ర్ధర ధారాధరముక్త సంతతపయో ధారావళిం బోలుచున్. ఓజోగుణము.

4. పలుకుల ముద్దునుగలికి క్రాల్గన్నుల తెలివును వలఁదచన్నుల బెడంగు
నలఘు కాంచీపద స్థలముల యొప్పును లలితాననేందు మండలము రుచియు
నళినీలకుటిల కుంతలముల కాంతియు నెలజవ్వనంబున విలసనమును
నలసభావంబునఁ బొలుపును మెలుపునుగలుగు నగ్గిరికన్య తలఁచి
తలచి, అక్షర రమ్యత

---

# తెలుగు నుడికారము

—డా. గిడుగు వెంకట సీతాపతి.

పాశ్చాత్యదేశము లందలి బాషలలో ఇటాలియన్ భాష ఎంత మధురముగా ఉంటుందో అంత మధురంగా ఉంటుంది తెలుగు బాష. తూర్పు దేశము లందలి భాషలలో అనే అర్థములో Telugu is the Italian of the East అని అనేక భాషలు విన్న పాశ్చాత్య పండితులు మన తెలుగు వాషా మాధుర్యమును కొనియాడినారు. ఆ మాధుర్యము బాషిస్తూ ఉన్నప్పుడు వారు వీనులవిందుగా విని గ్రహించినదే కాని పుస్తకములలో నున్నది చదివి తెలుసుకున్నది కాదు ఆడిన మాటలకు అర్థము తెలిసినా తెలియకపోయినా అవి చెవిని పడినంతనే అందులోగల మాదుర్యము గోచరిస్తుంది. అనగా ఆ మాటల ఉచ్చారణలోనే సహజ సిద్ధమైన తీయందనమున్న దన్నమాట. ఈ విషయమునే కృష్ణదేవరాయలు రచించిన ఆముక్తమాల్యదలో నున్నది. ఆ రాజకవికి ఆంధ్ర విష్ణువు కలలో కనబడి ఒక ప్రబంధము తెలుగు భాషలో కూర్చవలసినదని కోరుతూ అన్నమాటలు :—

"తెలుఁగదేల యన్న దేశంబు దెలుఁగేను
దెలుఁగు వల్లభుండఁ దెలుఁగొకంద
యెల్ల నృపులు గొల్వ నెఱుఁగవే బాసాడి
దేశబాషలందు దెలుఁగు లెస్స"

ఇక్కడ కంద అనగా పులకండ. పులకండ వలెనే తీయనిదని భావము.

ప్రసంగిస్తూ ఉన్నట్లు చేమకూరి వేంకటకవి విజయవిలాసములో అచ్చ తెలుగున రచించిన పద్యము చూడండి ఎంత హృద్యముగాను, శ్రావ్యముగాను ఉన్నదో !

"చిలుకల కొలికిది నాతోఁ బలుకంగాఁ గొంతసిగ్గు పడియెడు ముంజే
చిలుకా నీతోనైనను బలుకంగారాదెః పలుకు బంగారటవేః"

ద్విపదగా రచితమయిన నలచరిత్రలో దమయంతి నలునకై పరితపించు నప్పుడు :

"కటకట ' యని లేచుఁ గన్నీరు నించు
చలిగాలి విసరినఁ జాలవడంకు
ఒకచోట గోరి వేఱొకచోటఁ జేరు
ఒక చెలిపేర వేఱొక చెలిఁ బిలుచు
ఒక పని కనుచు వేఱొక పనిఁ దలచు
ఒక మాటయాడి వేఱొకమాట యాడు
ఒక పరిఁ దెగడు వేఱొక పరి బెగడు
ఒక పరి వెఱగందు నొకపరిఁ గుందు"

అని యామె దుస్థితిని తెలియజేయు మాటలు ఎంత పొందికగలవో ! ఇవి కూడా యింపైన తెలుగులోనే ఉన్నవి. ఇట్లనుటచేత సంస్కృత పదములు కలిసిన యెడల తెలుగు మాధుర్యము తగ్గుతుందని నా యభిప్రాయము కాదు. సారంగధర ద్విపదలో సారంగధరుని తల్లి అతని పాటునకు దుఃఖిస్తూ ఉన్నప్పుడు ఆమె నోదార్చుతూ పలికిన మాటలలో సంస్కృత శబ్దాలున్నా రచన శ్రావ్యముగానే నడచినది చూడండి.

"భావింప సుఖదుఃఖ పలములు రెండు
కావటి కుండలు కావచే తల్లి !
వినుమమ్మ చీకటి వెన్నెల సమము
ఓడలు బండ్ల బండ్లోడల వచ్చు
వేడుక కొన్నాళ్లు వెతలు కొన్నాళ్లు"

ప్రభావతీ ప్రద్యుమ్నంలో ప్రభావతి తన లజ్జ పెంపున తన విరహబాధ పైకి తెలియజేయకుండా ఉన్నప్పుడు, ఆమె సఖి రాగవల్లరి –

"ఏ రీతిం బెనఁగిన నె, వ్వారెఱుంగరు నీదు గుట్టు వనితామణిరో
శ్లా రోకళ్లం బాడిన, కూరులిపుడెంత దాఁచుకొన్న నడఁగునే ?"

అని ఎంత ముద్దుగా తెలుగు నుడికారపు సొంపులతో పలికినదో చూచారా ?

అయితే, తెలుగు పదములలోగల లాలిత్యమునే నెక్కువగా కాని యాడతాను. రాజశేఖర కవి కర్పూర మంజరిలో —

పరుషాః సంస్కృత గుంఫాః
ప్రాకృత గుంపస్తు భవితి సుకుమారః
పురుష మహిళానాం యావ
దిహాంతరం తేషు తావత్

(ఇది ఛాయ)

ప్రాకృత పదములకంటెను సుకుమారము లయినవి తెలుగు పలుకులు.

ఏ భాష అయినా రెండు విధములుగా పెరుగుతూ ఉంటుంది. 1. సహజముగా దానికిగల శక్తిని బట్టిన్నీ. 2. ఇతర భాషల ప్రభావము, సంపర్కమును బట్టిన్నీ. సహజశక్తి అనగా క్రొత్త భావములను వ్యక్తము చేయుటకు అదివరకున్న మాటలకు ప్రత్యయములనుగాని అనుబంధములను గాని చేర్చుకోగల శక్తి. అది అణుమాత్ర మయిన విత్తనము అంకురించి పెద్ద వృక్షము కాగలశక్తి వంటిది.

"అణుమాత్రంబగు మఱ్ఱి విత్తనము మొలెక్కలేమ ఏపారు చ
క్కని చెట్టైననలెత్తి కాచు నురుశాఖల్సాము నందుండి నే
లను దాఁకన్ బడు నూడలన్ విడుచు; వేళ్లన్ జాచు; అట్లేకదా
తనరున్ భాషయుఁ బ్రాణమున్న వరకు దప్పేమియో భారతీ!

అన్నాను

ఇతర భాషల సంపర్కము వల్లను గాని ప్రభావము వల్లను గాని భాషాభివృద్ధి ఎట్లు కలుగునంటే - చిన్నజెలగా పుట్టిన ఊటగడ్డ మహానదిగా

ప్రవహించుటకు శాఖానదులు తోడ్పడును. అట్లే విదేశీయ పదములు భాషాభి వృద్ధికి తోడ్పడుతవి.

"జలధులై పుట్టి స్రవించి వర్షములకుఁ జెన్నొంది శాఖానదుల్
కలియఁ బెంపును బొంది, పుష్కల తరంగ శ్రేణి నృత్యంబుతో
నలరెఁ బాఱెడు నమ్మహానదుల సామ్యంబొంది భాషానదుల్
విలసిల్లుఁ భువి నెల్లకాలమును నిర్విఘ్నంబుగా భారతీ! అన్నాను.

భాషా ఏ విధముగా పెరుగుట కయినా ముందుగా భావనాభివృద్ధి ఆ భాష మాతృభాషగా నున్నవారికి కలుగవలెను. సంస్కృతి లేక కూపస్థ మండూకముల వలె నున్నవారికి క్రొత్త భావనలు కలుగవు. కొ్రత్త మాటలు పుట్టవు. సంస్కృతి ఎక్కువగుతున్న కొలదిని క్రొత్త భావనలున్ను వాటితో క్రొత్త పదముల అక్కరయున్ను కలుగుతూ ఉంటవి. ఈ యక్కర తీర్చుకొనుటకే పైని చెప్పిన రెండు శక్తి సాధనములున్ను వినియుక్తములగుతూ ఉంటవి. తెలుగు వారికి యీ రెండును అలవడినవి. అందులో ఆర్యసంపర్కము వలన సంస్కృత ప్రాకృత భాషా పదములు - తత్సమములు గానో తద్భవములు గానో తెలుగు భాష లోనికి ప్రవేశించినవి. తెలుగుభాష పుట్టుక వలన ద్రావిడ భాషాకుటుంబము లోనిదే అయినను ఈ తత్సమ తద్భవములు వేలకొలదిగా చేరుటవలన ఈ తెలుగుభాష ఆర్యభాషా కుటుంబములోని దేమో యను భ్రమ పుట్టించినది. కాని తెలుగువారు తమ భాషానైజమును గోల్పోలేదు. పండితులు అయిన వారికంటె పాండిత్యము లేని జానపదులే తెలుగు నుడికారమును తెలుగు తీయందనమును ఎక్కువగా నిలబెట్టుకొన్నారు. పండితుల ప్రభావము వల ననే కొన్ని తెలుగుమాటలకు క్షైణ్యము కలిగినది. ఆ మాటల స్థానములో సంస్కృత పదములకు గౌరవము హెచ్చినది. ఉదాహరణములు: 'పెద్దచెట్టు' అని ఉచ్చారణములో ఎంత నొక్కిచెప్పినా 'మహావృక్షము' అన్నప్పుడు కలిగిన తృప్తి కలుగుటలేదు. ఆ విధముగానే 'పెద్దకొండ' 'పెద్దనది' 'పెద్దప్రోలు' అనుటకు మారుగా 'మహాపర్వతము' 'మహానది' 'మహా

నగరము' అన్నప్పుడు ఎక్కువ ఆనందము కలుగుతున్నది. "ముక్కంటి కంటి వెచ్చకు మన్మదుడు కాలిపోయెను" అన్నప్పుడు 'వెచ్చ'కు గల తీవ్రత అణగారి పోయినది. సముద్రమనే అర్థములో నుండిన 'కడలి' శబ్దము చిన్న కోనేరు వంటిదిగా మనదృష్టి కిప్పుడు కనబడుతున్నదేమో! 'పదబందవారి జాతము'నకున్న గొప్పతనము 'నుడికడలి'కి కలుగదు. మా యింటికి దేవతార్చనకు దయచేయండి, భోజనానికి దయచేయండి అంటే గౌరవముగా ఉంటుంది. 'మా యింటికి తిండికి రండి, కూడు కుదువడానికి రండి' అంటే పేలవముగాను, అంతేకాదు అసభ్యముగాను ఉంటుంది. సంస్కృత పదములలో కూడా తెలుగువారు సభ్యాసభ్యతలు పాటిస్తారు. అన్న ప్రాశనములో అశనమన్న పదమున్నా మా యింటికి అశనమునకు రండంటే అవమానకరంగా ఉంటుంది. పోరు, కయ్యము, జగడము అని అంటే సవతుల దెబ్బలాట లాగున జరిగేది కాబోలు అనిపిస్తుంది. ఇప్పుడు ఆంగ్లభాషలో 'battle' కున్ను 'war' కున్ను గల వ్యత్యాసము వ్యక్తపరచవలెనంటే battle కు యుద్ధ మనిన్ని war కు సంగ్రామమనిన్ని great world war కు ప్రపంచ వ్యాప్తమైన మహా సంగ్రామమనిన్ని చెప్పవలెను.

సంయోగాది సాధనముల వలన ఒకేమాట ఎన్నెన్ని అర్థములలో వాడుకలోనికి వచ్చినదో చూడండి. అందుకు 'మాట' అనే మాటనే ఉదాహరణముగా ఎత్తుకొని మాటలకు గల శక్తి తెలిసికొందాము.

కాస్త దూరముగా ఉన్న మిత్రుణ్ని చూచి 'మాట' అనగానే అతడు మన వద్దకు వస్తాడు. అదేదో అంత బిగ్గరగా అరచి చెప్పవలసినది కాదనిన్ని కాస్తయినా రహస్యంగా చెప్పవలసినదనిన్ని గ్రహించి మనం చెప్ప దలచినది వినడానికి సిద్ధపడతాడు. "వెయ్యి మాటలేల? ఒక్క మాటలోచెప్తాను" అంటే అధిక ప్రసంగం చేయకుండా చెప్పవలసినదంతా సంగ్రహించి చెప్తానన్నమాట ఊరకే అదే ధోరణిలో మాటలాడే వాణ్ణి 'మాటల పోగంటాము. మాటలు పట్టుకుంటే మరి వదల డంటాము. మాటలకు లోటులేదు. అంటే మాటలాడుతాడే కాని పనిచేయడని అర్థము. ఇటువంటి అర్థంలోనే "మాటలు

కోటలు దాటుతాయి కాలు గడప దాటదు" అంటాము. మాటలు తీయగా ఉంటవే కాని మనసు మంచిదికాదు. అంటే పెదవుల తీపి ఎదలో విషము అని అర్థమవుతుంది. చమత్కారంగా మాటలాడే వానిని "బలేమాటకారి" అంటాము. ఆ మాటలు విసువు పుట్టిస్తే మాటలమారి అంటాము. మా పాపాయికి యిప్పుడిప్పుడే మాటలు వస్తున్నదంటే మాటలాడే శక్తి వస్తున్న దన్నమాట. గుమస్తా మూలంగా మా ఆయనకు 'మాట' వచ్చిందండీ అంటే ఏదో అవమానం కలిగింది; అపనింద వచ్చిందన్నమాట. మాటపడడం కష్టమన్నా ఆ అర్థాన్నే సూచిస్తుంది. అతని మాటకు అడ్డులేదు అంటే అందరూ వినవలసిందే తిరుగు చెప్పడానికి వీలులేదు అన్నమాట. అతడి మాటకు చెలామణీ సాగుతున్నదంటే అందరూ అతడు చెప్పింది వింటున్నారు, అతని పలుకుబడి ఎక్కువగా ఉన్నదన్నమాట. "నా మాట విను నాయనా" అని తల్లి అనునయనంతో అంటుంది. "నా మాట వినకపోతే జాగ్రత్త" అని తండ్రి కోపంతో అంటాడు. ఇప్పుడతని మాట సాగడం లేదంటే పలుకుబడి పోయిందన్నమాట. వాడికీ నాకూ మాటలు లేవంటే మేము విరోధులమైనాము మాటలాడుకోవడం కూడా మానివేశామని అర్థము. ఒక మాట అన్నామంటే సరా? పది మాటలు పడాలి. అనడ మెందుకు పడడ మెందుకు అని హెచ్చరిక చేసుకుంటాము. తుది మాట చెప్పండి, యిస్తారా? యివ్వరా? అని ఏమీ తేల్చకుండా గొడవలు పలికే వారిని చూచి అంటాము. పాపం! ఆ మూగదాని మాట తల్చుకుంటే దుఃఖం వస్తుందంటే, దాని విషయం అన్నమాట అంతే కాని మూగది పలికినది కాజాలదుగదా? ఆ మాటకు వస్తే నేనసలేరాను, అంటే అట్టి విషమ స్థితి సంభవిస్తే రానని అర్థము చిన్న పిల్లడి మాట పట్టుకుని మీరు అలుగడం బాగుగా లేదండీ అంటే వాడు చిన్నవాడు గనుక వాడన్న మాటలు పాటించకూడదని అర్థం. నీ పెండ్లి మాట నిశ్చయమైనదా? నీ అన్నయ్యకు పెండ్లి అయిన దన్నమాట నాకు తెలియదు. ఏమిటి నీ సంగతి? రేపు నీ వుండే మాటో వెళ్లే మాటో నిశ్చయంగా చెప్పు. అన్నప్పుడు నోటి మాట ప్రసక్తిలేదు. ఆడిన మాట తప్పకూడదు సుమా? తప్పితే, పద్యం

విన్నావా? నాకు తెలుసును ఆడిన మాటం దప్పిన గాడిదకొడుకంచు దిట్టగా(విని అయ్యో పీడా నా కొడుకని యొక గాడిద యేడ్చెను గదన్న కవి చోడప్పా" ఈ పద్యం జ్ఞప్తికి తెచ్చినందుకు క్షమించు. ఎంత మాట! మనం స్నేహితులంగదా? సరేకాని మరొక్క మాట. మనలో మాటగా చెప్తున్నాను. "రామారావు పరీక్ష పోయింది. ముందుగా ఎవరితోను చెప్పకు. రెండు రోజులలో అదే వెల్లడవుతుంది."

ఈ యువకుల మాటలలో మాట అనేమాట ఎన్ని విధాలుగా ప్రయుక్తమైనదో చూచినారుగదా. కొన్ని సామెతలలోగూడ ఈ మాట నుడికారపు సొంపులతో ప్రయుక్త మవుతుంది. కొన్ని ఉదాహరణములు —

"వేటుకు వేటు, మాటకు మాట. (a blow for a blow, a word for a word).

మనిషికొక మాట గొడ్డుకొక దెబ్బ.

నమ్మకే వాడన్న మాట అది నీటిపై వ్రాత నీళ్ళ మూట.

మాటకు మాట తెగులు నీటికి నాచు తెగులు (words and weeds choke speech and streams).

మాటకు మల్లి పనికి యెల్లి (Miss Bud never becomes Miss Blossom)

ఎవరి కూడు తింటే వారి మాట ఆడాలి (He who pays the piper calls the tune).

## కన్ను

కంటికి సంబంధించిన నుడికారా లెట్లున్నవో చూడండి. నెమలిపురి కన్ను, గవ్వలాటలో కన్ను, శీతకన్ను, క్రీగన్ను, వాలుగన్ను (వాల్గంటి) కన్నులు పొడచుకున్నా నిద్రరాదు. కన్నుకొట్టు, కన్నువేయు, కన్నుపెట్టి చూడు. కన్నులు నెత్తికెక్కినవి. కన్నులు తేలవేశాడు. ఒడలెల్లా కన్నులు

చేసుకొని నీ కోసం చూస్తున్నాడు. ముసిలిది కొడుకును చూచినదాకా చావదు. కన్నులలో ప్రాణాలు నిల్పుకొన్నది.

గంగ కనుఁగొంటి, కన్నుల కరవుతీర; కంజాక్షు జూచితి కన్నులార. ఇంకా కన్నూ ముఖమూ ఏర్పడలేదు. కన్నుల ముత్యాలరాలు నీలాలు కారు, నీరు కారు. కన్నులువేయి దాల్పవలె గౌతము నింటను కోడిగావలెఁ. వేయి కన్నుల వేల్పు కన్నుల నద్దుకొని స్వీకరిస్తాను. కన్నియ కన్నెఱుంగి కన్నుండగనే కనుపాప తీయగల నేర్పు. నీ కన్ను కుట్టిందా? ఎందుకీ కన్నెఱ్ఱ? కంటిచలువ. నోటి మాటలేదు, కంట చూపులేదు. కన్నూమిన్నూ తెలియకుండా ఉన్నావు. ఈ కంటికి రెప్ప దూరమా? కంటికి రెప్పా నోటికి చేయీ దూరమయినాయి. కంటికి, మంటికి ఒకటే ధారగా ఏడ్చాడు. కన్నీరు మున్నీరై పాఱఁగనేడ్చె, కనుబ్రాంతి. కన్నులార్చు, ఇంత కనువేదురు చెల్లునటమ్మ యింతికిఁ. కనుపండుగ, కనువిందు, నాకీ కథ కనువిప్పయినది. కనుచూపుమేర నా కెవరూ కనబడలేదు. నన్ను కని పెంచినవారు గతించినారు. తాతను కనిపెట్టుకుని ఉండు. కానని వాని నూతఁగొని కానిని వాడు, (the blind leading the blind) తోడికోడలి సంపద చూచి అది కంట్లో నిప్పులు పోసుకుంటున్నది. నా కంట్లో కారం జల్లి నా భర్తతో తిరుగుచున్నది. నీ తూపులని కదా నెత్తమ్మిత్తి ఱేకుల గారవమ్మునఁ గండ్లఁ గప్పికొందు, నేటికిని నీ రూపు కన్నులఁ గట్టినట్టు తోఁచు. నీ రాకకు ఎదురు చూచి, చూచి, నా కన్నులు ఉబ్బినవి, కాయలు కాచినవి, వాచినవి. కనుసన్న మెలగు, లేని కన్ను కన్న మెల్లకన్ను మేలు. రాజును చూచిన కన్నులను మొగుణ్ణిచూస్తే మొత్తబుద్ధి.

## నోరు

నోరు అనే మాటతో ఎన్నెన్ని పలుకుబడు లేర్పడినవో చూడండి.—

నోరు చేయకు, నోరు పారేసుకోకు, వాడు నోరుపెట్టుకొని బ్రదుకుతున్నాడు, వాడి నోటిలో నోరుపెట్టుకొని నేను వాదించలేను. వాడు నోటికి

వచ్చినట్టు ప్రేలుతున్నాడు. వీడికి నోట మాటలేదు. నోరార పలికి మురిసిపోయింది. వాడి నోటికి అద్దూ పద్దూ లేదు. వీడి నోరు పెగలదు. నోరు మూసుకుని పనిచెయ్యి. తల పరువు నోరు చెడుపుతుంది. నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుంది. నోటిలో నాలుక లేదూ? మాటాడ వేమి?

అనుబంధ క్రియలతో ఎట్లు పలుకుబడులు ఏర్పడుతవో చూడండి :

కొను అంటే purchase అన్నమాట. కొనుబడి అంటే cost price అని అర్థము. కొనుక్కొను అన్నప్పుడు రెండవ కొను సహాయక్రియగా ఉన్న అనుబంధము. వాడు తనకు దుస్తులు లేకపోయినా సరే కాని పుస్తకాలు కొనుక్కుంటే చాలు ననుకొన్నాడు. ఇంగ్లీషులో సులువుగా he dneied himself clothes to buy books అంటారు అమ్మబోతే అడవి, కొనబోతే కొరవి రెండు విధాలా నష్టమే అని సూచించే నానుడి అనుబంధ క్రియ స్వార్థమందు వాడువారు. ఇల్లు కట్టిరి - ఇల్లు కట్టుకొన్నారు వంకాయలు అంగడిలో కొని తీసుకొని రా (తీసుకు రా). నా కిది కొనిపెట్టు. నీకు కావలసినది నీవు కొనుక్కో. దొంగలు దోచుకొన్నారు తద్దినం కొని తెచ్చుకొన్నట్టయినది. ఇతరుల వ్యవహారాలు చూస్తాడు, తన వ్యవహారం చూచుకోడు. హత్యచేసినాడు. హత్యచేసుకొన్నాడు. వాడు తన మేనమామ కూతుర్ని చేసుకొన్నాడు. మేనరికము చేసుకొన్నాడు. పని మానుకొన్నది. దాచుకో. తలకు దెబ్బ తగిలించుకోడానికా గుమ్మం పొట్టిగా కట్టించుకున్నావు? I understand a man knocking his head against a wall by an accident but I can never understand a man building a wall for that purpose అన్నట్టుంటుంది. పెళ్లికొడుకు తాళి కట్టినాడు. పెళ్ళికూతురు సంతోషముతో కట్టించుకొన్నది స్వార్థమందే కాక - జాలికొను, అంటుకొను, పనిగొను, ఆఁకొను ఆకలిగొను, ఊరకొను మొదలయిన నుడికారాలలో కూడా ఈ అనుబంధ క్రియ కనబడుతుంది

కొట్టు కంపుకొట్టు, దిష్టికొట్టింది దెయ్యంకొట్టిన కొబ్బరికాయ, చెడగొట్టు, తెగగొట్టు (తెగ్గొట్టు), దిగగొట్టు (దిగ్గొట్టు), భోజనము ముందుగా

చేసి లేచిన అబ్బాయి నీ మీద కొండ కొట్టానంటాడు. కన్నుకొట్టు, గుండె కొట్టుకుంటున్నవి. కడగొట్టు బిడ్డ. పిసినిగొట్టు, వాపిరిగొట్టు.

కట్టు: వాకట్టు, తాకట్టు, ఆటకట్టు, మొలకట్టు, చనుకట్టు పయిఞాబడనేల యేడ్చెదో? మీసకట్టు కందికట్టు, కనికట్టు, వాడికోసం ఆకట్టు (set apart) వెండికట్టు పొడుంకాయ. కట్టుచారు (చేరు), జాతికట్టు, కులకట్టు, సమ్మెకట్టు, కట్టుకట్టు, రాతికట్టు గోడ, తలకట్టు, ఆనకట్టు, నడికట్టు, ఒడికట్టు, మణికటు, వలకట్టు. ఇంటి ముందరి కట్టు బాగున్నది గాని వెనుకటి కట్టు బాగుగా లేదు. దీనికి వెలకట్టు, ధరకట్టు, పద్యముకట్టు, పదంకట్టు, కడుపుకట్టుకొనియైనా దివాణానికి కట్టవలసిన కట్టుబడి చెల్లించాలి. నోరుకట్టుకో, చేతికట్టు, అంటుకట్టు. ఆ నాటి దృశ్యము ఈ నాటికికూడా కన్నులకు కట్టినట్టున్నది భామా వేషం కట్టినాడు గడ్డ కట్టుకొన్నది. మబ్బు కట్టింది వాన పడేటట్టున్నది. రొట్టె పెచ్చుకట్టింది. మామిడి టెంక పీచు కట్టింది. నా ఉసురు నీకు కట్టికుడుపక మానదు దెబ్బ తగిలినచోట నెత్తురు గూడు కట్టినది. కట్టుబాటుచేయి. కట్టు తప్పినపిల్ల. ధర్మానికి కట్టుపడ్డాడు కట్టుబట్టతో పరుగెత్తుకొని వచ్చాడు కట్టుమ్రాను. మడి కట్టుకొన్నాడు. ముట్టుకోకు, లెక్కకట్టు.

పట్టు: ఆయువుపట్టు. పట్టుపట్టుకొని కూర్చున్నాడు. మంకుపట్టు, మొండిపట్టు, పట్టినపట్టు విడవడు. కథ మంచిపట్టులో ఉన్నది ఉనికిపట్టు. గ్రహణం పట్టినది. పట్టుస్నానం. విడుపుస్నానం పట్టు విడుపులు రెండూ ఉండాలి. (give and take) కూతపట్టు దూరము. పట్టుదల. చుట్టుపట్ల తిరగక ఇంటిపట్టున ఉండు. పట్టుమని పది దినాలయినా ఉండలేదు. పట్టుకొమ్మ. నా జీతంలో పది రూపాయలు పట్టుకున్నారు. నాకు నీ వేషాలు పట్టవు. ఈ కాయలు నీ కాబడితే తీసుకో ఊపిరి బిగపట్టు. దమ్ముపట్టు, చేబట్టు, చెట్టబట్టు (marry) నే చెప్పినది వంట (ఒంట) పట్టించుకో. రావలసినది రాబట్టుకోవాలి. ఈ మాటలు వాడు చెవిని పట్టించుకోడు. ఈ సమాసాలు వాడికి నోటబట్టవు.

తలోదారి పట్టినారు, కాళ్లుపట్టు. అతని కాళ్లు పట్టుకో, నీకేం పిచ్చి పట్టినదా? ఈ కత్తి సానపట్టు. వరిగింజలు నేతులు పట్టినవి. పిట్టకుకూత పట్టింది. నాకేం పట్టింది వాడిని సాకడానికి. ఏదుం పట్టే గంప. దీనికెంత పడుతుంది? నా చొక్కాకు ఎన్ని గజాల గుడ్డ పడుతుంది? పట్టి పట్టి మాటలాడతాడు. వాడు పట్టినదెల్ల బంగారము, వీడికింకా యోగం పట్టలేదు ఈ కత్తి తుప్పు పట్టినది. గోడలకు కరిదూపం బూజులు పట్టినది బల్లకు చెద పట్టినవి. వాడికేం కొవ్వు పట్టిందిరా? చలి జ్వరం, చలి కుదుపు పట్టుకొన్నది. ముసురు పట్టినది. నాకు నిద్రపట్టకుండా ఉన్నది. నా నోటికి కారం పట్టదు. పట్టెడు మెతుకులు పెట్టవమ్మా.

ఈ విధముగా అనేక పదములకు అనుబంధములయిన ఉప పదముల వల్లను, ప్రత్యయముల వల్లను శబ్దపల్లవాలు, క్రొత్త కొత్త అర్థాలతో నుడికారాలు, పలుకుబళ్ళు ఏర్పడుతవి. సంస్కృత భాషలలో ఒక్కొక్క ప్రధాన పదానికి ఉపసర్గల వల్లను, అనుబంధాల వల్లను, వందల కొలదిగా నూతన పదములు వేర్వేరు అర్థములలో కొద్ది కొద్దిగా మార్పు చెందిన అర్థ విశేషాలతో ఏర్పడుతూ ఉంటవి. అలాగుననే Prefixes, suffixes, (affixes) వల్లను, నూతన పదజాలం వృద్ధి పొందుతుంది కొన్ని భాషలలో infixes అంటూ ఉన్నది. అవి పదమధ్యమందు దూరి అర్థ విశేషములను కలిగిస్తూ ఉంటవి. నూతన భావార్థకములుగా ఉంటవి తెలుగులో కాని, సంస్కృతములోగాని, ఇంగ్లిషులోకాని లేని infixing ఆదివాసులయిన సవర ముండారీ, సంతాలీ భాషలలో ఉన్నవి. ఉదాహరణములు – సవర భాషలో తిడ్ అనే క్రియకు కొట్టుట అని అర్థము జేన్ అమన్ తిడ్తమ్ అంటే నేను నిన్ను కొడతాను అని అర్థం. ఈ పదంలో తకారమునకు ఇడ్కున్న నడుమనం అన్ అనే infix (ప్రత్యయము) దూర్చితే తనిడ్ అవుతుంది దాని చివరను నామవాచక ప్రత్యయము అన్ కలిపితే తనిడన్ అవుతుంది. అది కొట్టుట అనే భావార్థక రూపమవుతుంది. దెబ్బ అనిన్ని అర్థము. గిజ్ అంటే చూచు గనిజన్ అంటే చూచుట, దృశ్యము అని అర్థము. అడ్ అనే infix

ఆ క్రియా కార్యమునకు కావలసిన సాధనమును వ్యక్తపరుస్తుంది. తరిడ్ అంటే కొట్టుటకు సాధనమైన, కొట్టుటకు కావలసిన అని అర్థము కొట్టుటకు ఉపకరించే కర్రకు తరిడ్-డాంగన్ అంటారు. ఆ ఉపకరించేది తోలుతో చేసిన కొరడా అయితే తరిడ్-సాలన్ అంటారు పేపరు బెత్తుగాని, వెదురు బద్దగాని అయితే తరిడ్-ఉరఙ అంటారు ఇటువంటి సాధనాలతో క్రొత్త వస్తువులు చూచి నప్పుడును క్రొత్త భావనలు పుట్టినపుడును ఉన్నమాటల తోనే భాషాభివృద్ధి చేసుకుంటారు సాధ్యమయినంతవరకు విదేశీయ శబ్దము లను స్వీకరింపరు స్వీకరింపక తప్పదన్నప్పుడు తమ భాషాలక్షణమునకు అనుకూలముగా ఆ శబ్దమును కొద్దిగానైనా మార్చివాడుకుంటారు అవి కూడా నుడికారపు సొంపులే.

మనతెలుగు భాషలో యిటువంటి చిత్రాలు కనబడతవి. ఉదాహరణము రూళ్ళకర్ర అన్నది విదేశీయ శబ్దమని ఇప్పటి పిల్లలకు తోచనే తోచదు. ఇంగ్లీషులో rule, rules, ruler అనే శబ్దాలున్నవి గదా? నేను లోపలికి రాకూడదన్న rule ఎక్కడున్నది? అంటాము. ఇంగ్లీషు బహువచన ప్రత్య యమే ఉంచి "నీకు రూల్సు మహా తెలిసినట్లు మాట్లాడుతున్నా వంటాము. మన తెలుగు బహువచన ప్రత్యయము చేర్చి నీవు వంకర టింకరలు లేకుండా తిన్నగా రూళ్ళు గీయగలవా? అంటాము. ఆ అర్థములో యీమాట యీ అర్థములో ఆ మాట ప్రయోగించము ఒక్కొక్కప్పుడు విదేశీయ బాషలోగల శబ్దాల తుదనున్న వర్ణము బహువచన ప్రత్యయమనుకొని పొరపాట్లు కూడా చేస్తూ ఉంటాము. ఇంగ్లీషు శబ్దాలలో కొన్నిటను చివర నున్న s చూచి అవి బహువచన రూపాలనుకొని తప్పుగా ప్రయోగిస్తాము. Summons ఏకవచనము. దీనికి బహువచన రూపము Summonses. Summons బహువచన రూపమనుకొని సమ్మను వచ్చిందా? సమ్మనులు అందినవా? అంటారు కొందరు. News అనే పదము ఇంగ్లీషులో వాస్తవ ముగా బహువచన రూపమే కాని, యిప్పుడు ఏకవచనముగా వాడుకొంటారు.

It is bad news అంటారు. రేడియోలో తెలుగు న్యూజ్ తిన్నగా వినబడవు అంటారు.

ఆయా భాషల నుడికారాలు అవి **మాతృభాషగా** గలవారికి చక్కగా బోధపడతవి. మన తెలుగు భాషను గూర్చి చెప్పినప్పుడు ఆ విషయము నేటి వ్యావహారిక భాషకే వర్తిస్తుందిగాని వాడుకలోనుండి తప్పిపోయిన కావ్య భాషకు వర్తించదు సుమండీ. ఒక ఉదాహరణము ఓ హరి నా హరి అంటే తండోప తండములు అని కీ శే. మధురకవి నాళము కృష్ణారావుగారు తాము ప్రకటించిన తెలుగు జాతీయములు (A Dictionary of Telugu Idioms) అనే తెలుగు గ్రంథమందు తెలియ జేసినారు. మన ఆంధ్రప్రదేశ్ **సాహిత్య** అకాడమీ వారు ప్రకటించిన పదబంధ పారిజాతములో ఓహరి నాహరిగా అంటే హోరాహోరీగా అని వ్యాఖ్యానము చేసినారు ఈ గ్రంథ సంపాదకులు రెండింటను 'ఓహరి నాహరి నుయ్యాల చేరుగా వెనుకొంచు దెరలుచుఁ బెనఁగు నెడలు' అనే ప్రయోగము బార విరా. III 165 లోనిది కనబరచినారు దానినిబట్టి తండోప తండములుగా అని కాని హోరాహోరిగా అని కాని అర్థము చెప్పుటకు ఆధారము కనబడదు. బౌర్విణ్యములో నున్నట్లు వెనుకకు ముందుకు అనే అర్థమే పొసగుతుంది. Pursuing and being routed or seattered or dying హోరాహోరీగా యుద్ధము జరిగినప్పుడే, తండోప తండములుగా సైనికు లున్నప్పుడే ఈ పనులు జరుగుతవని సమర్థించుకో వచ్చునుగాని ఓహరి నాహరి పదములకు ఈ సంపాదకులు చెప్పిన అర్థము లేదు. ఈ పదములు సంస్కృత పదకోశము లందు కనబడవు అచ్చ తెలుగు పదములు కాజాలవు ఈ విషయమును గూర్చి యిక్కడ ఎక్కువగా చర్చించుటకు అవకాశము లేదు

*ఊడనిబాడు* : అర్ధానుస్వారములు పాటించేవారు ఊడనిఁబాడు అని వ్రాస్తారు. అప్పుడు చివరి శబ్దము పాడు వీనికి పాఴు అని అర్థమున్నది. వాస్తవముగా పాఴు, పాడు రూపాంతరాలు. ఈ శబ్దమువల్లనే పాటిపోవు

అను అర్థము విశదమగుతూ ఉండగా ఊడనిఁబాడు అంటే పాటిపోవు అని అర్థము వ్రాస్తే ద్రుతాంతముగా ఉన్న 'ఊడనిఁ'కి నిరర్థకమా ఊచ్ (ఊఅ్, హూత్) ధ్వన్యనుకరణ శబ్దాలు అప్పుడు అని 'అను' క్రియకు క్త్వార్థక రూపమవుతుంది. అది ద్రుతాంతము కాదు. ఊడనఁ (ౝ) అయి ఉండవలెను. మేము చూచిన తాళపత్ర గ్రంథములలో ఊడనఁబాడు, ఊడనఁబాఱు అను పాఠములు కనబడినవి.

కట్టుపకానులు : శబ్దరత్నాకరములో ఉన్న ఈ పదమును చూచుకొని శూరులు అనే అర్థము వ్రాసి పదబంధ పారిజాతములోని కెక్కించుకొనుట ప్రమాదకరము. ఈ శబ్ద స్వరూపములోను, అర్థములోను అభిప్రాయ భేదము లనేకముగా ఉన్నవి. మేము చూచిన తాళపత్ర గ్రంథములతో "గట్టువ కాసులై"—కారులై కనబడుతున్నవి. బ్రౌణ్యములో 'గట్టువకాడు, గట్టువ కాసు అనే రూపములు గ్రహింపబడినవి. దీనికి అర్థము మాత్రము శూరుడు అని ఉన్నది. అయినా ఆ పట్టులోనే గట్టువనేతలు అనగా కపట కృత్రిమం బులు అని అర్థము చూపించినారు. వేదం వేంకటరాయ శాస్త్రిగారు తాము సంప్రతించిన శృంగార నైషధములో గట్టువకారు అనే పాఠము కలదని సూచించినారు. గట్టువకాఁడు అనే పదమునకు గట్టువకారు బహువచన రూపము కాబోలు? ఇతమిత్థమని చెప్పుటకు తగిన ఆధారములు లేవు.

ఇట్టిదే 'బాడుదల' శబ్దము. శబ్దరత్నాకరములో (బాడు తలఁగించుట) అవమానించుట అని అర్థము కలదు. కాని యిది తప్పు. భారతము కర్ణ పర్వములో బాడుదల నొందెఁ బట్టుము పాండుతనయ ముఖ్యు అనిన్ని శల్య పర్వములో 'సంజయ బాడుదల వట్టికొనిదెచ్చి' అనిన్ని భారత ప్రయోగాలు. సంస్కృత భారతములో 'జీవగ్రాహమానయ' అని ఉన్నది. చంపకుండా ప్రాణాములతోనే పట్టుకొని తెమ్మని అర్థము. తెలుగులో యీ నుడికారము పోయినది. 'బాయిదలై' తమిళములో కూడా ఉన్నది. మనుదలై వంటిది. ఇంతకంటె ఎక్కువగా యీ విషయమును గూర్చి చర్చించుట కిక్కడ

యిప్పుడవకాశము లేదు. ఈ మాత్రమైనా ఎందుకు చెప్తున్నానంటే ఇటువంటి పదాలు పదబంధ పారిజాతములోనికి ఎక్కిస్తున్నారు. ఆంగ్లపదకోశములలో origin uncertain అని హెచ్చరిక ప్రదర్శిస్తున్నారు. మనము నిశ్చయించి తేల్చినట్టుగా అర్థవివరణము వ్రాయడము సాహసమని నా మనవి.

నుడికారము వాడుకలో ఉన్నదే పిల్లలకైనా అలవడుతుంది.

తలలో నాలుక మాతృ భాష అది
పలవరించినా తప్పులు కలుగవు
తలక్రిందుల పడి తాపము చేసినా
తప్పులు తప్పవు తెలియని వ్రాతకు.

'తెంచు' అనే అనుబంధ క్రియ నన్నయాది ప్రాచీన కవుల కాలంలో ఉండేది. "ఏనేఁడులగు దెంచె నర్జునుండేఁగి ఇంతకేతెంచు". (భారతం) అంటే అయిదేండ్లు కావచ్చినది అర్జునుడు వెడలి ఇంతలో వస్తాడు అని అర్థము. ఏఁగు, ఏఁగుదెంచు, ఏతెంచు, అరుగు, అరుగుదెంచె, గాలి వీచినది, వీతెంచినది అంటే మనవైపు వస్తున్నది అని అర్థము పఞలెగనె-భీముడు నీరిలోన నుండి నెగయఁదెంచె మన level కు వచ్చెను. పుచ్చిరి, పంపించిరి, పుత్తెంచిరి, మన వద్దకు పంపించిరి నే వచ్చిన పని అయిపోయినదా? అయిపోవచ్చినది. ఈ రూపమేమి? అగుట పోవుట వచ్చుట సెబాస్ అన్నట్టు ఇప్పుడు మనలో కొందరికైనా తోస్తుంది గదా? నన్నయ వాడుకలో నున్నది చూడండి "తక్షక విషాగ్నిచేఁ బరీక్షితుడు దగ్ధుడు కాబోయే సమయమందు మునిశాప దినంబులు పోయినవా? అంటే అయిపోయినవా? అన్న మాట. పూర్తిగా గడచిపోయినట్లే కదా? అన్న ప్రశ్నకు ప్రత్యుత్తరముగా పూర్తిగాపోలేదు "పోవుదెంచె" అని ప్రయుక్తమయినది. ఈ నుడికారమును లెస్సగా గుర్తింపఁ బహుజన పల్లి సీతారామాచార్యులవారు - తెంచు స్వార్థమందు వచ్చు అనుబంధక్రియగా గ్రహించిరి. శబ్దరత్నాకరమందు చెప్పిన దానినిబట్టి తక్కిన పండితులును సూర్యరాయాంధ్ర నిఘంటు పండితులున్ను

అట్లే గ్రహించినారు. నేటి వాడుకలో ఈ "తెంచు" వినబడదు. దాని స్థానే "వచ్చు" వచ్చినది. చూడండి ఎట్లు వాడుకొంటున్నామో. అధ్యక్షులవారు వచ్చే మాసము మన ఊరు వస్తారట 10వ తేదీని బయలుదేరి ఆ రాత్రి కలకత్తాకు వస్తారు. 11వ తేదీని షిల్లాంగు వెళ్ళి ఆ మరునాటికే కలకత్తాకు వచ్చి అక్కడనుండి కటక్ వస్తారట అక్కడనుండి భువనేశ్వరం వెళ్ళి ఆ మరునాడే అనగా 13వ తేదీకి ఖుర్దాకు 14వ తేదీకి బరంపురం వస్తారు. అక్కడనుండి రసూల్‌కొండ వెళ్లి 15వ తేదీని బరంపురం చేరుకొని అక్కడ 16వ తేదీని బయలుదేరి తిన్నగా విశాఖపట్టణం వస్తారు. అక్కడ రెండు దినాలు ఆగి 18వ తేదీని బయలుదేరి విజయవాడకు వస్తారు వచ్చిననెంటనే బందరు వెళ్ళి ఆ మరునాడే విజయవాడ చేరుకుంటారు. అక్కడ రెండు దినాలాగి 20వ తేదీకి మన వూరికి వస్తారు. చూచినారా? మనకు చేరువవుతూ ఉన్నప్పుడు వస్తారని అంటాము. చిన్న పిల్లలయినా ఎప్పుడు వచ్చు అనాలో ఎప్పుడు వెళ్లు అనాలో నుడికారం తప్పకుండా ఎప్పుడు ఏది ప్రయోగించాలో గ్రహించగలరు. నాన్నా' నాన్నా' రాత్రి నాటకానికి వెళ్తున్నారా? నేను రావద్దూ? రా! అమ్మనుకూడా రమ్మను, ఇద్దరిని తీసుకువెళ్తాను. 'అమ్మ యీ రాత్రి రాదుట. రేపు వెళ్తుందిట. అయితే నేను అమ్మతో రేపు వెళ్తాను. నీవుకూడా రేపు మాతోనే రారాదూ? నీ వొక్కడవే ఈ రాత్రి వెళ్ళడమెందుకు?' అంటాడు బాలుడు

'ఏమే వంట అయినదా? అని భర్తంటే 'కా వచ్చింది' అంటుంది భార్య ఆఫీసుకు వెళ్ళడానికి వేళ కా వచ్చింది అంటాడు భర్త. వచ్చిన స్నేహితులు వెళ్ళిపోతూ 'వెళ్ళి వస్తాము' అని గాని, 'వేళయింది వస్తాం' అని గాని అంటారు పోతామంటే శుభం కాదని.

మీ యింటికొస్తే ఏమిస్తావు? మా యింటికొస్తే ఏం తెస్తావు? అని ఎప్పుడూ స్వలాభం కోరే వాళ్లనుగూర్చి అంటారు. మా అన్నయ్య రమ్మని వ్రాస్తున్నాడు, వెళ్లాలి. కొద్దిరోజులలో వస్తున్నానని వ్రాశాను. ఇదే ఇంగ్లీషులో

I wrote that I would go there in a few days. తెలుగు నుడికారము నను సరించి, When shall I come there అంటే తప్పు ఎవరయినా పెద్దవారు మన యింటికి వస్తే దయచేయండని ఆదరిస్తాము. ఇందులో దయలేదు, చేయడము లేదూ. మాటకు మాటగా ఇంగ్లీషు లోనికి అనువదిస్తే Make kindness అవుతుంది. అది ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో చూచారా ? We shook hands అంటే కరచాలనముచేశాము అంటున్నారు కొందరు. చేలాగు ఇచ్చేనా? ఆదరించేనా ? అన్నాడు క్షేత్రయ్య మువ్వగోపాల పదాలలో. He gave me a cold reception. ఇంగ్లీషువారి దేశము శీతలప్రదేశము కనుక cold reception మంచిది కాదు. మన దేశము ఉష్ణమండలము గనుక నీ కడుపు చల్లగా అన్నా, చల్లని మాట చెప్పవమ్మా అంటే మంచిదే చావు కబురు చల్లగా చెప్పావురా అన్నపుడు. దుఃఖంతో చెప్పవలసిన మాట సంతోషవార్త లాగున చల్లగా చెప్పావేమిరా అని నిందిస్తాము ఒకభాషలో ఉన్నమాటలు మరియొక భాషలోనికి అనువదించినప్పుడు, ఆ మాటలలోగల భావము తీసికొని రావాలి. జాగర్తిలోకోజ్వలతి ప్రదీపః, సఖీజనం పశ్యతి కౌతుకేన ముహూర్త మాత్రం కురుకాంత ధైర్యం బుభుక్షుకః కిం ద్వికరేణ భుఙ్క్తే ఇందులో ధైర్యం కురు అంటే ధైర్యంచేయి అంటే అనువాదం తప్పవుతుంది. ధీరత్వం చూపుమని అర్థం.

మరియొక విషయం

పదమునకు గల అర్థమును నిర్ణయించుటకు సంయోగాది సాధనములు 15 కలవని భర్తృహరి వివరించి చెప్పినాడు. వాటిలో స్వరముకూడా పేర్కొన్నాడు. అయితే ఆంధ్ర ప్రతాపరుద్రీయశోభూషణ కర్తలయిన శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారు "ఉదాత్తానుదాత్త స్వరములు వేదములోనే అర్థనిర్ణయసాధనములు. లౌకికవాక్యములలో లేవు, అని వ్రాసినారు కాని లౌకిక భాషలన్నిటను ఉంటవి. మన తెలుగులో ఎట్లు ఉన్నవో చూడండి :—

ఎంత పెద్ద చెట్టు ! ఎంత పెద్ద చెట్టు ? (అబ్బే) ఎంత పెద్ద చెట్టు.
What a big tree ! అడియార్లో ఉన్న మఱ్ఱిచెట్టు నీవు చూడలేదు

కాబోలు దాని ముందర ఇది ఎంత ? ఒక్క 'రా' అన్న ఏకాక్షర పదము స్వరభేదముల వల్ల అర్థభేదములను పొందుతుంది. నీవు వస్తే యిస్తాను రాకపోతే ఏలాగివ్వగలను ? ఇటువంటి మాటలకున్ను వాక్యాలకున్ను అర్థ. భేదం సూచిస్తూ ఆంగ్లభాషావేత్తలు into nation curves చూపిస్తున్నారు ఈ విషయంలో మన వారు కృషిచేయడం లేదు.

శ్లేష మన కవులు చక్కగా అభ్యసించారు, ఒక భాషాలోగల శ్లిష్టపదములను మరియొక భాషాలోకి అనువదించలేము. An ambassador is one that lies in a foreign country to lie for his country అని lie అనే పదము రెండర్థములు కలదిగా ప్రయుక్తమయినది. దీనిని మరియొక భాషలోనికి యధాతధంగా అనువదించలేము. కవలయావళి నాటకములో 'వసంతం మాధవం' అనే పదములను శ్లిష్టపదములుగా సింగభూపాలుడు ప్రయోగించినాడు. అందులో వసంతం అంటే వసంతుణ్ని అనే అర్థమున్ను ఉన్నవానిని అనే అర్థమున్ను కలవు. ఈ రెండర్థములను తెలుగులోనికి ఎట్లు తేగలము ? మన తెలుగులోగల శ్లిష్టపదానికి ఒక ఉదాహరణము చూడండి - వదినె తన ఆభరణములను వరాహరోమములుగల కుంచెతో శుభ్రం చేసుకొంటున్నది. మరది వచ్చి, "వదినా ! వదినా ! పందివా ?" అన్నాడు. అనగా యీ కుంచెలోగల రోమములు పంది తాలూకువా ? అనే అర్థములో అన్నానని సమర్థించుకోవచ్చునన్న ధైర్యముతో 'నీవు పందివా ?' అనే అర్థము ధ్వనించేటట్టు చమత్కారంగా అన్నాడు అది ఆమె గ్రహించి, "అవును మరదీ, ఊరుబందివో, అడవిబందివో తెలియదు గాని పందివేను" అన్నది. ఆ మరది తాను తీసుకున్న గోతిలో తానే పడ్డాడు కీ. శే చిలకమర్తి నరసింహంగారు.

భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగయఁగట్టి

అన్నారు. తెల్లవారు+అను the whites అనగా ఇంగ్లీషువారు అనే అర్థము ధ్వనింపజేస్తూ తెల్లవాఱను, తెల్లవాఱుచున్నప్పుడు అనే అర్ధమునందు ప్రయోగించినారు. అప్పకవి వంటి లాక్షణికులు రేఫసాంకర్యము కలిగినదని ఆక్షేపించవచ్చును గాని ఈ సాంకర్యమునకు అలవాటుపడిన మన చెవులకు బాధ కలుగదు.

"కియన్మాత్రం జలం విప్ర ?" అంటే ఒక పేద బ్రాహ్మణుడు జానుదఘ్నం నరాధిప' అన్నాడు. ఎంతలోతు అన్న ఉద్దేశంతో రాజు ప్రశ్నించాడు. కియన్మాత్రం అనుటవల్ల నీటి పరిమాణాన్ని అడిగినట్లు ఉంటుంది. ఆ బ్రాహ్మణుడు చదువుకొన్న పండితుడు గనుక రాజుగారి ఉద్దేశం గ్రహించి మోకాలులోతు అని అర్థమిచ్చే జానుదఘ్నం అనే సరియైన మాటలలో చెప్పాడు. రాజు తన భావమునకు ఉచితమైన మాటలు అనగా సరియైన నుడికారం ప్రయోగించలేదని గ్రహించాడు మరియొక రాజు పల్లకిమోస్తూ ఉన్న ఒకరిని చూచి "త్వాం బాధతి కిం?" అన్నాడట. అప్పుడతడు "నత్వియం వాహనాత్ పీడా యథా బాధతి బాధతే" బాధతి ఆత్మనే పదంలో బాధతే అని ఉండాలి. ఈ చమత్కారాలు ఎట్లు అనువదించగలము?

నుడికారపు సొంపునుబట్టిన్ని స్వరమునుబట్టిన్ని ఎవరు ఎవరితో మాట్లాడుతున్నారో వారిని చూడకుండానే చెప్పగలము "ఏమే వంటయినదా" అన్న మాటలు వినబడగానే భర్త భార్యను ప్రశ్నిస్తున్నాడని వెంటనే గ్రహించగలము. "ఏడవకు ఆం కావాలా? బువ్వపెడుతానుండు" అన్న మాటలవల్ల తల్లి పాపాయితో మాటలాడు తున్నాదని గ్రహించగలము. "అమ్మా' మాధవ కబళం" అన్న మాటలు చెవిని బడగానే అడుక్కొని తినేవాడు వచ్చాడని చెప్పగలము.

పరియాచకముగా "వదినా' వదినా' (అప్పడం) నీవు కాల్చుకు తింటావా? వేపుకు తింటావా? (అన్నయ్య తెచ్చిన మామిడిపండు ఇదిగో)

పీల్చుకు తింటావా? కోసుకు తింటావా? అంటుంది మరదలు. ఇటువంటివి మరియొక భాషలోనికి అనువదించలేము

ఈ చమత్కారపు నుడికారమంతా జీవద్భాలకే చెల్లుతుంది. ప్రాతబడ్డ మాటలు వాడుక చేస్తే వ్యవహార హాని కలుగుతుంది ఎప్పుడు వచ్చావన్నప్పుడు "రేపు వచ్చాను" అంటే మన కిప్పుడు అర్థము కాదు రేపు అంటే ప్రాచీన భాషలో ఉదయమని అర్థము. ఇప్పుడు ఎల్లి tomorrow అని అర్థము ఒక్కొక్కప్పుడు ప్రాచీనకాల మందలి అర్థములో "ఓహో ఈ మల్లిపువ్వు ఎంతని చక్కని కంపు కొడుతున్నది!" అన్నా "కొలువు కూటమందు పెద్దలందరు తలకు చీరెలు కట్టుకుని కూర్చున్నారు" అన్నా హాస్యాస్పదంగా ఉంటుంది.

కొన్ని కొన్ని మాటలలో చరిత్రాంశములు గోచరిస్తూ ఉంటవి. "ఈ చదువులు కట్టిపెట్టు" తాళపత్ర గ్రంథాలు చదువుకొంటూ ఉండిన కాలములో పుట్టిన పలుకుబడి. వీడు వాడి కోసం ఎగయ దోస్తున్నాడు ప్రమిదలో ఆముదము పోసి వత్తి పెట్టి దీపం వెలిగించే రోజులలో పుట్టినమాట అప్పుడప్పుడు ఆ వత్తి ఎగయదోస్తూ ఉండాలి. ఇప్పుడు భాగ్యవంతుల భార్యలు చెవులకు ఆభరణములుగా వేయి రూపాయలు ఖరీదుచేసే కమ్మలు ధరిస్తారు. ఈ కమ్మ శబ్దం ఈ ఆభరణానికి ఎట్లు వచ్చిందో చూశారా? ప్రాచీన కాలంలో తాటికమ్మల లేత ఆకు చుట్టగా చుట్టి మడచి చెవుల తమ్మెలకు పెట్టుకొనేవారు ఇప్పటికీ సవరస్త్రీలు పెట్టుకొంటారు కొంతకాలానికి ఈ లేతకమ్మల స్థానంలో క్రమక్రమంగా ఇత్తడివి, వెండివి, బంగారమువి, వజ్రపు పొడులు గలవి వచ్చినా మొదటనుండిన కమ్మ అనే మాట నిలచిపోయింది ప్రాచీన కాలంలో ముదిరిన తాటి కమ్మలమీదనే లేఖలుకూడా వ్రాసుకునేవారు కనుక కమ్మ పంపించాడు అంటే లేఖ, చీటీ పంపించాడన్నమాట ఇప్పుడు కాగితం మీద వ్రాసినా చీటీ అనే అర్థంలో కమ్మ వ్రాశాడు అంటాము పూర్వకాలంలో నాలుగు పాకలు వేసుకున్న ప్రదేశం పాక్కము యింది. విల్లివాకం, పుదుప్పాకం, నుంగంబాకం అలాగున వచ్చినపేళ్ళు.

ఇప్పటికీ మురపాక, తాళ్ళపాక, అలపాక, అనే గ్రామాలు ఉన్నవి. ద్వివేదుల వారు, చతుర్వేదులవారు, సామవేదం వారు, వేదులవారు, చిత్రకవి వారు, శృంగారకవి వారు అంటే వారి పూర్వులు ఆ యా విద్యలలో గడతేరిన వారని అర్థము. అవి యిండ్ల పేళ్ళుగా వాడుకలోనికి వచ్చినవి దేవులపల్లి వారు అంటే వారి పూర్వులు మొదట దేవులపల్లిలో ఉండేవారని ఊహించ వచ్చును అట్లే ఓరుగంటి వారు. ఈ విధముగా యింటి పేళ్ళనుబట్టి కొన్ని వెనుకటి విషయములు తెలుసుకోవచ్చును. ఒకటి వకటిగాను, ఒద్ద, వద్దగాను, రూపాలు మారినవి ఇవి గ్రామ్యరూపాలని వడ్డాది సుబ్బారాయడుగారు ఒక సారి అంటే ''అయితే ముందుగా మీ యింటి పేరు మార్చుకొండి, అది గ్రామ్యరూపము. 'ఒడ్డవాది' అని ఉండాలి'' అన్నాము చిలకమర్తి వారితో కూడా ఈ విధముగా ప్రసంగించవలసి వచ్చినది చిలుకంబఖ్ఖునుండి వచ్చిన రూపమది పఱ్ఱి, కుఱ్ఱి, తుఱ్ఱి అనేవి ఆ యా ప్రదేశము లందలి నైసర్గిక స్వరూపాన్ని తెలియజేస్తవి వాటికి జౌపవిభక్తి రూపాలువచ్చి పర్తి, కుర్తి, తుర్తి అవుతవి కాకరపఱ్ఱు గ్రామంలో ఉన్నవారు కాకరపర్తివారు, సాకుఱ్ఱు లో ఉన్నవారు సాకుర్తివారు, పులుకుఱ్ఱులో ఉన్నవారు పులుగుర్తి వారు, పెనుతుఱ్ఱులో ఉన్నవారు పెందుర్తివారు. ఈ గ్రామనామాల విషయం చెప్పా లంటే ఎంతయినా ఉంది

సామెతలలో మాటలశక్తి, నుడికారపు సొంపులు, సంఘస్థితి, భావనా సంపద మొదలయిన సంస్కృతి విశేషాలు ఎక్కువగా గోచరిస్తూ ఉంటవి. కనుకనే ఒక భాష మాతృభాషగా గలవారి గొప్పతనము ఆ భాషలోగల సామెతలనుబట్టి తెలుసుకోగలము, సామెతల గ్రంథము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు ప్రకటించారు గనుక, సామెతల విషయం నేను అట్టే ప్రసంగించను. అందులో చేరవలసిన సామెతలు యింకా ఉన్నవి. కొన్ని పాడిందే పాటగా పునరుక్తి దోషమునకు ఆస్పదమయినవి.

కొన్ని మాటలు అసందర్భంగా భాషలోకి ఎట్లు ప్రవేశిస్తవో చూడండి. ఆక్స్‌ఫర్డు నిఘంటు నిర్మాతలు ప్రపంచమందంతటను గల ఆంగ్లేయ

మిషనరీలకు, ఉద్యోగులకు నివేదించుకున్నారు. మన ఆంగ్లేయులకు తెలియని జంతువుల పేళ్లు వృక్షముల పేళ్లు పట్టికలు వ్రాసి వాటి లక్షణాలు తెలియ జేస్తూ పంపండి అన్నారు. మెడగాస్కర్‌లో ఒక మిషనరీ అక్కడ ఉండే వింత జంతువుల పేళ్లు వ్రాస్తూ ఒక జంతువు పేరు ఇన్ద్రీ. అని వ్రాసి పంపించాడు. అది ఆ జంతువు పేరు కాదు. ఆ మాట కర్థము 'అదిగో' '10'. అది ఎలాగు వచ్చిందంటే ఆ దొర అక్కడి స్థలజ్ఞుడ్ని ఒక వింత జంతువు కనబడగానే "దాని పేరేమి?" అని అడిగాడు. ఆ స్థలజ్ఞుడు దాని కోసం వెనుకకు తిరిగి చూచేలోపున అది పారిపోయింది. మరికొంత సేపటికి అది మరల వచ్చి ఆ స్థలజ్ఞునికి కనబడింది. ఆ జంతువు గురించేనా నీవు అడిగావు అన్నాడు. "ఏదీ ఆ జంతువు?" అన్నాడు దొర. 'అదిగో' అన్న అర్థంలో 'ఇన్ద్రీ' అన్నాడువాడు అదే ఆ జంతువు పేరు అనుకుని ఆ దొర వ్రాసు కున్నాడు అది నిఘంటువులలో నిల్చిపోయింది. ఇప్పుడందరమూ పాండిచెరీ, పాండీ అని అంటున్నాము. అది వాస్తవంగా పుదుచ్చేరి. కొత్తచేరి అని అర్థము. ఆ ఊరు మొదట ఆక్రమించుకొన్న విదేశీయులు ఫ్రెంచివారు. వారు తమ Spelling సంప్రదాయాన్ని అనుసరించి Poudicherry అని వ్రాసు కున్నారు. 'ఊ' అనే ఉచ్చారణ తెలియజేయుటకు *on* వ్రాస్తారు. మరి కొన్నాళ్లకు on లో ఉన్న n అనే అక్షరము 'n' అనుకొన్నాడొక ఆంగ్లే యుడు. అతడు పాండిచేరి అని ఉచ్చరించాడు. ఇటువంటిదే మద్రాసులో ఉన్న Barber's Bridge. అది కట్టించిన హామిల్టన్‌ను అంబట్టంగా తమిళులు ఉచ్చరించారు. అంబట్టం అంటే తమిళ భాషలో మంగలి, దానికి ఇంగ్లీషు అనువాదము Barber.

కొన్ని మాటలు చిత్రంగా పరిణమించినవి. వాడు చాలా పితలాటకం మనిషి అంటాము. తంటాలుకోరు మనిషి అర్థములో పిత్తలిహాటకం చేసే వాడని అర్థము, అనగా ఇత్తడిని బంగారంగా చేసే గారడీ వాడని భావం. ముదరష్టం - మృతనష్టంలో నుంచి వచ్చినది.

కొన్ని సంస్కృత శబ్దాలకు సంస్కృతంలో లేని అర్థాలు కల్పించుకునీ మనం వాడుకొంటున్నాము. నాకు అభ్యంతరము లేదు అంటే నేనేమీ అడ్డు చెప్పను, అసమ్మతిని చెప్పను, అన్న అర్థంలో వాడుతున్నారు అభ్యంతరం అంటే మందిర మందలి లోపలిగది అన్నమాట. ముందరి గదిలో ఇంటి యజమాని కూర్చుని ఉండగా వారిని చూడడానికి వచ్చిన వారు "మీతో ఒక ముఖ్య విషయం మాటలాడడానికి వచ్చినా'నని చెప్తే, "ఇక్కడ బహిరంగంగా చెప్పే విషయమా? లేక అభ్యంతరములో - రహస్యంగా చెప్ప వలసినదా? అన్నప్పుడు "అక్కర లేదండీ, అభ్యంతర మెందుకు ఇక్కడనే చెప్పవచ్చును" అంటాడు క్రమక్రమంగా అభ్యంతరమంటే ఆటంకమన్న అర్థం పరిణమించింది. 'మర్యాద' అంటే మొదట పొలిమేర హద్దు అని అర్థము బమ్మెర పోతరాజుగారి కాలానికి గౌరవమనే అర్థం వచ్చింది. 'మర్యాదగాదంచు' పిమ్మట మర్యాదస్తుడు, మర్యాద గలవాడు అనే వాడుక వచ్చినది. మగ పెండ్లి వారికి జరుపవలసిన మర్యాదలు చక్కగా జరిగినవా? అంటే, సమ్మానం బాగా జరుగుతున్నదా అని అర్థం.

ఒక్కొక్కప్పుడు ముందు మాటలు విడిచిపెట్టి చివరమాట అర్థం తెలుసుకోకుండా ప్రయోగిస్తూ ఉంటాము. ముహూర్తము రహితమయినదా? "నిశ్చయమయినదా?" అనే అర్థంలో ప్రశ్నిస్తాము. వర్జ్యరాహు కాలవిదోష రహితమయినదా అనవలెను.

కొన్ని పదములు ఎట్లు పరిణమించినవో చూడండి. త్రగ్గు-తరగు-తగ్గు, మ్రగ్గు-మరగు-మగ్గు; క్రాగు-కరగు-కాగు. ఏమే 'అచ్చమక్కా ?' రావే బుచ్చమ్మక్క అంటారు అని ఇద్దరును పొత్తుగా మాటలాడుకొను సంబంధమువల్ల పుట్టింది. అచ్చికబుచ్చికలు అనే సమాసము. ముందు కలుపుగోలు తనము మాటలు అనే అర్థంలో పిమ్మట ముచ్చటలు అనే అర్థంలో వాడుకొంటారు కల్లబొల్లి మాటలు అని అర్థమురాదు. "అక్క అంజూడ" పేటికల యచ్చికబుచ్చిక సేయునంచల౯ (విజయ విలాసం). అచ్చుగాఁ దీర్తు ఋ యప్పని కొన్ని యచ్చికబుచ్చికలాడి (హంసవింశతి)

కొన్ని బాలక్రీడల పేళ్ళు గ్రంధాలలో కనబడుతున్నవి. అందులో కొన్ని మన కిప్పుడు తెలియవు.

దినముల్ కొన్నిసనంగనంతఁ గడునర్థిఁ బొమ్మ పెండ్లిండ్లు గు
జ్జెన గూళ్ళచ్చన గండ్లు పింపిళులు కుచ్చిల్ గీరంనం గింజలో
మన గుంటల్ కనుమూసి గంతనలు కంబాలాట లోనైన ఖే
లనముల్ మీఱఁగ బోంట్లతో నలరె బాలారత్న మెల్లప్పుడున్.

(కళా.)

ఇవికాక తొక్కుళ్ళు, బేడిసె తిరుగుళ్ళు, దాయాల వాళ్ళు మొదలయినవి హంసవింశతి మొదలయిన తక్కిన కావ్యాలలో ఉన్నవి.

ఇప్పుడు మన పిల్లలు ఆడుకొంటూ ఉన్న ప్రాచీనకాలపు ఆటలలోని మాటలు అందరికీ తెలియవు.

కాళ్ళాగజ్జా కంకాణమ్మ వేగులచుక్కా వెలగా మొగ్గా
మొగ్గాకాదు మోదుగనీడా

ఇందులో కాళ్ళకు గజ్జి పట్టుకుంటే అందుకు కావలసిన ఓషధుల పేళ్ళు కలవట,

కొండమీద వెండీ గిన్నా కొక్కిరాయీ
కాలూ విరిగే దానికేం మందు ?
వెల్లుల్లి పాయ .

సారంగధరుని కాళ్ళు పోతే అతకడానికి చెప్పిన మందుల పేళ్ళు గలవట !

ఉత్తుత్తి పండు, ఉత్తరేణి పండు
దానిమ్మపండు, దబ్బపండు

ఇందులో బాలికల వయస్సు, యువతుల వయస్సు ధ్వనించే పేళ్ళున్నవంటారు.

కొన్ని మాటలు ఇప్పుడు మనం గ్రామ్యాలను కొంటున్నవి మునుపటి గ్రంధాలలో కవులు వాడుక చేసినవే. ఉదాహరణము 'పలకర నేసినావా ?'

అంటే వేప పుడకతోనో కాగు పుడకతోనో పళ్ళు తోముకొన్నావా? అని అర్థము పింగలి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో "పలకర సేయక పసుపు రాచికొనక" అన్నాడు.

కొన్ని అసందర్భపు సమాసాలు గ్రంథాలలోనికి ఎక్కుతున్నవి. అల్లకల్లోలము ఇందులో అలలన్నా, కల్లోలాలన్నా ఒకటే. కెరటాలంటే కీ శే. వావిలకొలను సుబ్బారావుగారికి బోధపడలేదు అన్నదమ్ముడు అంటే వారు ఆక్షేపించారు. అన్నైనా కావాలి, తమ్ముడైనా కావాలి. ఒక్కడే రెండున్నూ ఎట్లు కాగలడు అన్నారు. అన్నో, తమ్ముడో తెలియనప్పుడు అంటారు. శ్రీనాధుని నాటి రడ్డి నేడు రెడ్డి అయినది. ఆనాటి రడ్డీ-రాజూ అన్న పలుకుబడి నేటికిన్నీ నిలిచియున్నది. ప్రాచీనకాలపు అర్ధానుస్వారాలు గంజాం జిల్లా మారుమూల తెలుగు ప్రదేశాలలో ఇప్పటికిన్నీ ప్రాణాలతో ఉన్నవి. ఈఁగలు, తోఁకలు, ఈఁకలు నీళ్ళు కాఁగుతున్నాయి అంటారు. అసలైన తెలుంగు కాఁపులు ఆంబోతు, దాంగొన్నాడు మొదలయిన కొన్ని తెలుగు మాటలలో నిండు సున్న ఉంచికూడ మాటాడుతారు. కురుమాపు గడ్డము అన్నాడొక మంగలి కళింగపట్నంలో కురుమాపు వుట్టంబులఁ గట్టి అన్నాడు నన్నయ. కురుమాపు-అల్పంగా మాసిన అని అర్థము. కంబారి, కోనారి (=గొల్ల) బైరారి (=అగనాలి) నొన్నారి, 'కని నొన్నారి కృతుల్ నగల్' అన్నారు చిలకమర్తివారు. నన్నయ అట్టిడు, అట్టిరు (అట్టిరే వేల్పులు) అన్నాడు. అట్టిడు అంటే అట్టివాడు అని అర్థము. దాని కంటెవే పొట్టడు, కుఱ్ఱడు, గొల్లడు, పిల్లడు, ఒక్కడు, టిక్కడు మొదలయిన రూపాలు.

ఒక్క ప్రత్యయము ఒక మాటకు క్రొత్తగా చేరితే సాదృశ్యం బట్టి మరికొన్ని మాటలకు చేర్చుతారు పెంకెతనం, మొండితనం, చిన్నతనం, పెద్దతనం, పెత్తనం, బెత్తుపెత్తనం, రాలుగాయి తనం, కలుపుకోరు తనం మొదలయినవి. *అరికం* ప్రత్యయంతో కొన్ని భావార్థక రూపాలు ఏర్పడ్డవి - ఇల్లరికం, మేనరికం, కన్నెరికం, పెద్దరికం, చుట్టరికం మొదలయినవి. కారం

అనే ప్రత్యయంతో నుడికారం, వెటకారం, కనికారం, కనికరం, పటికారం, వెలిగారం, నయగారం మొదలయినవి కల్లు అంటే రాయి అన్న అర్థం ఇప్పుడు కొందరికి తెలియదు. అయినా, సన్నెకల్లు, ఒరుగల్లు, ఓరుగల్లు, కుత్తుకల్లు (మునుపు చిన్నరాతి గోళమే పుణ్యస్త్రీలకు కంఠాభరణము) ఇప్పుడు బంగారంతో చేసినా కుత్తిగల్లు, గుత్తిగంటు అనేమాట నిల్చిపోయినది కొన్నిమాటలు కుద్దించి వాడుతారు. బృహస్పతివారం – బేస్తవారం అయింది. నన్నయనాటికే పూజించితివే పూజించితే అయినది. ఋత్విజుండని విచారించి (పూజించితే) ఆలాగునే చూచితివేని క్రమంగాతగ్గిచూస్తే అయింది కొన్ని జంట మాటలు శబ్దాలంకారాలతో శ్రావ్యంగా ఉంటవి. వావీవరుస, ఊరూ పేరూ, అప్పూసొప్పూ, మడీమట్రా, దిక్కూమొక్కూ, అద్దూపద్దూ, మాటామంతీ, అడపాతడపా, ఏండ్లూపూండ్లూ, కబురూ కాకరకాయా మొదలయినవి.

సింగినాదం జీలకర్ర అంటే సింగిణికి నాదం లేదు. జీలకర్ర కర్ర కాదు అన్న మాట. గాడిదగుడ్డూ కంకరపాసూ - అంటే గాడిద గుడ్డూ పెట్టదూ, కంకరపాచీ కట్టదన్నమాట. "నా అప్పు ఎప్పుడు తీరుస్తావురా! అంటే ఎల్లుండి ఏకాదశినాడా!" అంటారు. ఇంగ్లీషులో at the Greek Kaleuds అన్నట్టు. కోతిపుండు బ్రహ్మరాక్షసి అయినది అంటే గోకడం చేత పుట్టిన కురుపు సెప్టిక్ అయి రాచపుండువలె అయినదన్నమాట.

కొన్ని నుడికారాలు హాస్యరసంతో వినసొంపుగా ఉంటవి. పనసకాయ దొరికి నప్పుడే తద్దినం పెడతానని భర్త అంటే, ఐతే నులకమంచం దొరికి నప్పుడే నేను నీళ్ళాడతా నన్నదట భార్య. అల్లుడు వచ్చిన దాకా అమవాస్య ఉంటుందా?

కొన్ని పద్యాలలో తెలుగు నుడికారం ఎంతసొంపుగా ఉంటుందో చూడండి :–

"ఇదిరాయి రప్ప పల్లంబిది మిట్టిది మాకుమట్ర యిది,
పామిదిగామిది యని వివరింపఁగఁ బెట్టిదమై
ఉన్నయట్టి అక్కటిక చీకటి లోనన్" (పంచ. వే.)

శ్రీనాథుని శృంగారనైషధంలో నలుడు హంసను పట్టుకొన్నప్పుడు నలునితో హంస పల్కిన పల్కులలో తెలుగు తీయందనము, నుడికారపు సొంపులు ఎట్లున్నదో చూడండి :—

మూలంలోని ఒక చిన్న శ్లోకంలో

మదేక పుత్రా జననీ జరాతురా, నవప్రసూతర్వ
రటా తపస్వినీ గతిస్తయోరేష జనస్త మర్ద
యన్ అహోవిధేత్వాం కరుణారుణద్దినో"

అని ఉన్న అంశాలు శ్రీనాథుడు ఒక సీసపద్యంలో చక్కగా వివరించాడు :-

"తల్లి మదేక పుత్త్రిక, పెద్ద, కన్నులుగాన విప్పుడు
మూడుకాళ్ళ ముసలి
ఇల్లాలు కడుసాధ్వి, ఏమియు నెఱుఁగదు పరమ
పాతివ్రత్య భవ్యచరిత ;
వెనుక ముందరలేరు నెవరైన చుట్టాల లేవడి యెంతేని జీవనంబు
కానకకన్న సంతానంబు శిశువులు జీవస్థితికి నేన తావలంబు
కృప దలంపఁగదయ్య యో నృపవరేణ్య
అభయ మీవయ్యయో తుహినాంశు వంశ
కావఁగదయ్య ; అర్థార్థి కల్పశాఖి
నిగ్రహింపకుమయ్య యో నిషధరాజ ;"

ఈ హంస దమయంతి వద్దకు పోయినప్పుడు అన్న మాటలు చూడండి :—

"అడిగితి నొక్కనాఁడు కమలాసును తేరికి వారువంబునై
నడచుచు ఉర్విలో నిషధనాథుని కెవ్వతె యొక్కొ భార్య య

య్యెడు నని చక్రఘోషణమున నించుక యించుక కాని యంత యే
ర్పడ వినసైతి 'నీ' వనుచు బల్కిన చందము తోఁచెమానినీ !

ఇటువంటి కమ్మని పద్యా లింకా ఎన్నో మన కావ్యాలలో ఉన్నవి. ఇటువంటి పద్యాలు శబ్దకారిన్యానికి అదుఃపిండమని పేరుపొందిన ఈ శృంగార నైషధంలో ఇంకా ఎన్నో ఉన్నవి. ఇతర గ్రంథాలలో వందల కొలదిగా కనపడతవి.

తెలుగు తీయందనము అర్థం సులువుగా గాని కఠిన సంస్కృత పదాలవల్ల చెడుతుంది. అంతేకాదు సంస్కృత పదాలు డంబంగా పలుకుతూ తిట్టినా విన్నవారు సులువుగా అర్థం చేసుకోలేరు. ఒక భట్రాజు పిసినిగొట్టు పిల్ల జమీందారు వద్దకు పోయి ఎంత పొగడినా ఏమీ ఇయ్యలేదు. అప్పుడా భట్రాజు మనసులో మండిపోతూ ఆ జమీందారుకు అర్థంకాని సంస్కృత పదాలు గుప్పుతూ 'వైనతేయారి గ్రైవేయ వైధవేయా !' అని రాగవరుసను పాడగా ఆ జమీందారు పరమానంద భరితుడై సమ్మానించాడు. ఆ మాటల కర్థం తెలిసికోలేకపోయినాడు, "పాములను కంఠాభరణంగా దాల్చిన వేధ వేయా !" (ముండకొడకా) అని అర్థము. అచ్చ తెలుగైనా వాడుకలో లేని మాటలతో చెప్తే అర్థంగాదు.

కైరాకుత్తుకఁ జుట్టువాఱి మెరయుణ్ గట్టాణి పేరెంతయుణ్ 'అంటే కవిరాజుగారి మెడచుట్టును గల ముత్యాలపేరు ఎక్కువగా మెరుస్తున్నది' అని అర్థము. "నిండునెల మూతిదాన" అన్నారు ఆదిభట్ల నారాయణదాసు గారు తద్భవమైనా రాని అచ్చ తెలుగులో, అంటే అర్థమేమి ?" పూర్ణచంద్రి ముఖీ" అన్నమాట.

విదేశీయ పదములవల్ల భాషాభివృద్ధి ఎట్లు కలుగుతున్నదో సూచన మాత్రంగా చెప్పి నా ప్రసంగం ముగిస్తాను. ప్రపంచమందలి భాషలలో భావనా సంపత్తికి అందుకు తగిన పదసంపత్తికి పేరు పొంది అగ్రస్థానము

పొందినది ఆంగ్లభాష. అది ప్రపంచమందలి అన్ని ముఖ్యభాషలనుండిన్నీ కావలసిన పదములను యథోచితముగా చేర్చుకుని జీర్ణించుకొన్నది. అందు చేత అది గౌరవము పొందినదే కాని లాఘవము పొందలేదు.

Boycott, Mackıntosh, Fabıan, A'ugust August' Sandwıch, మొదలయిన మాటలు మనుష్యుల పేళ్ళ నుండి వచ్చినవి. అట్టివి మన భాషలో అజానేయాలు, ఆణిముత్యాలు, పెగ్గూలు, మైసూరుపాక్కులు, పూరీలు, భీష్మించుకొన్నాడు మొదలయినవి కల్పిత సమాసాలు — tea-cup, tomfoolery, Aprıl-fool, easy chaır, Boredom, Bı-weekly, dısbelıef మొదలయినవి అటువంటివే మనభాషలో నేరస్థుడు, అపనమ్మకము, వెర్రి వెంగళప్ప, దరిద్రగొట్టు దామోదరుడు, మరచెంబు, కంచు మరచెంబు, ఉత్తర జందెములు, లింగకాయ, జీనకర్ర, ప్రాణగొడ్డము, పట్టినామాలు మొదలయినవి.

విదేశీయాలు

Latın-cırcus-devıate-exert - దీనారాలు - దీనారటంకాల తీర్థమాడించితి.
Greek-autonomy-orthodox-Trıgnometry-Jaronıan - త్రికోణయవనులు.
French-Bronze, Glacıar, Buffet పరాసులు, బూచి, మదాం (పేకాట-చీట్లాట) జాకీ.
Dutch-Ges, Skate - బలందులు - బత్తాయి
Portuguese-Cobra, Zebra - బుడతకీచులు, ఫరంగీలు, చిట్లఫిరంగి
Indıan languages · Chıntz, Coolıe, Jungle, Khakı loot, Pandıt, rag, thug, tomton, catamaran rıce, arıcanut, Zanana, Mangoose, Serpent, Sapıece, Cheroot etc
Persıan-Back-sheush, Durbar - దర్బారు.
Turıksh-Bosh, jackal - తురకలు.

Arabic-Amir, harem – అమీరు
Chinese-tea – టీ, తేయాకు.

ఈ విదేశీయ పదములు రావడమువల్ల భాషాభివృద్ధి కలుగుతుందన్నాడు Doyden. భాష చెడిపోయిందన్నారు Swift Johnsen లు. చెడిపోయేదేమీ లేదు. ఈ మాటలు మన సొంతం చేసికొని మన భాష పెంపొందించుకొంటామన్నారు ఆ తర్వాతి విద్యావంతులు.

అదే నేటి వివేకుల అభిప్రాయము.



# తెలుగు పలుకుబడులు

—తాపీ ధర్మారావు.

మానవుడిని పెద్ద చేసింది మాట. మాట ద్వారా మనుష్యులు భావాలను ప్రకటిస్తారు. భావాల హెచ్చు తగ్గులను బట్టి, అనేవాడి సామర్థ్యాన్నిబట్టి మాటలు బయటపడతాయి వినడాని కిష్టములేనప్పుడు "ఊరుకో" అంటాము. ఇంకా చికాకైనప్పుడు "నోర్మూయ్" అంటాము. అలాగే, అటునుంచి ఇటు, మాటలనుబట్టి మనిషికూడా బయటపడతాడు ఆ మనిషి ఏ భాషవాడో, ఏ ప్రాంతంవాడో, ఏ వ్యాసంగం వాడో, అతడాడిన తీరునుబట్టి అనిన మాటలను బట్టి తెలుసుకోవచ్చును. "మాకీ అదీ పన్కీరాదూ" అని ఉచ్చరించిన మనిషికి తెనుగు మాతృభాష కాదని స్పష్టమౌతుంది. "చారు ఉన్నాయా" అన్న మనిషి కృష్ణా, గుంటూరు జిల్లాల వాడని గ్రహించగలము. ఈ కాలపు గుంటలను నమ్మరాదు" అన్నవాడు, గంజాం, విశాఖపట్న ప్రాంతాలవాడని చెప్పనక్కరలేదు.

"చుట్టత్రాగుట" అనడం తెలుగువారి అలవాటు. "పొగత్రాగనివాడు దున్నపోతై పుట్టున్" అన్నాడు మహాకవి గురజాడ.

"మీరున్ ప్రొగత్రాగెదరా
వారిజభవ, వామదేవ, వైకుంఠపతీ !
ఓరీ నారద వినరా
ఈరేడు జగంబులందు నిది ముఖ్యమురా !"

అని చాటువు. ఓఢ్రులు, "పిక్కాఖై బూకీ" అంటారు. దీనివి తెలుగు చేస్తే, చుట్టతింటావా" అనాలి తెలుగువారికి హాస్యాస్పదంగా ఉంటుంది.

మనము ఒరియా భాష నేర్చుకొని "పిక్కా-పీబూకీ" (త్రాగుతావా) అని అంటే ఒరియా వారు నవ్వుతారు. అందులో తప్పున్న దని కాదు. ఆ భాషలో అలా అనరు వారి కా అలవాటులేదు. అంతే! అదే వారి ప్రత్యేక పద్ధతి, మాటతీరు, పలుకుబడి నుడికారమన్నా, ప్రాంతీయమన్నా, దేశీయ మన్నా, భాషీయమన్నా, జాతీయమన్నా, ఆ ప్రత్యేకతే!

పలుకుబడి అంటే పలికే తీరు: ఆ భాష మాతృభాషగా కలవారు. అలవాటుపడి పలికిన పద్ధతి, తప్పైనా ఒప్పైనా సకారణమైనా, అకారణమైనా ఆ భాషవారు అలాగే అంటారు. ఇంకొకలాగ మార్చి అంటే, ఆ అర్థం రా వచ్చును గాని, ఆ భాషాగుణము రాదు. ఏదో పరాయి భాషవాడు మాట్లాడుతూన్నట్లే ఉంటుంది. ఈమార్చి అనడం నిర్దుష్టమైనా, ఆ భాష వారికి అది నచ్చదు.

కాబట్టి మన పలుకుబడులకు తెలుగుతనం ముద్ర ఉంటుంది. వాటి ప్రయోగమువల్ల తెలుగుతనం స్పష్టంగా కనబడుతుంది. తెలుగువారి హృద యాలకు సూటిగా నాటుతుంది. ఆ రూపంగా సంభాషణకు గాని, రచనకు గాని ఒక అందం, ఒక రససిద్ధి సమకూరుతుంది. ఆ అందం ఉండబట్టే దానిని మనం నుడికారం అని కూడా అంటున్నాం.

ఈ నుడికారం గురించి ఒక్క చిన్న సందేహం:

"ప్రౌఢి పరికింప సంస్కృత భాషయండ్రు,
పలుకు నుడికారమున ఆంధ్రభాషయండ్రు;
ఎవ్వరేమైన నండ్రు నాకేమి కొదవ
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష"

అన్న శ్రీనాథుని పద్యముంది కదా! ఇక్కడ నుడికారమన్న మాటకు "పలుకుబడి" అని అర్థంచెప్పి, "పలుకు నుడికారము" అంటే "పలుకు నట్టి పలుకుబడి" అని వ్యాఖ్యానిస్తామా? కాక "పలుకు నుడికారము" అంటే

"పలుకులందుగల నుడికారము (గుణము, అందము)" అని అర్థం చెప్తామా? పెద్దలు నిర్ణయించవచ్చు.

ఏమైనా మాటలో కారమున్నా, నుడికారంలో ఒక మాధుర్యముంది. ఆ నుడికారం ఎంత సమృద్ధిగా ఉంటే రచన అంత హృదయంగమంగా ఉంటుంది.

తల్లి మదేక పుత్రక, పెద్ద కన్నుల
గాన, దిప్పుడు మూడు కాళ్ల ముసలి ;
ఇల్లాలు కడుసాధ్వి ఏమియు నెరుగదు
పరమ పాతివ్రత్య భవ్యచరిత;
వెనుక ముందరలేదు నెనరైన చుట్టంబు
లేవడి యెంతేని జీవనంబు ;
కానక కన్న సంతానంబు శిశువులు
జీవన స్థితికేన తావలంబు ;.........

అన్నప్పుడు ఆ ముసలితనము. ఆ దిక్కులేనితనము, ప్రత్యక్షంగా కనబడకతీరదు. "మూడుకాళ్ల ముసలి" అనడానికి బదులు "బాగా నడుము వంగిపోయిన ముసలిది" అనినా, "వెనుక ముందరలేదు" అనకుండా "ఆదరించే వారెవ్వరూ లేరు" అనినా ఆ బలమే ఉండదు; ఆ అందమూ రాదు, అందుచేతనే నుడికారాలు శక్తిమంతములైనవని అంటాము.

## వీటి పుట్టుక

ఈ నుడికారాలు ఎప్పుడు, ఏ పరిస్థితులలో ఎవ్వరు మొదట ఉపయోగించారో చెప్పలేము. కాని అవి చాల పురాతనమైనవని, జనసామాన్యంలో నుంచి వచ్చాయని, ప్రజలలో వ్యాపించి నాటుకు పోయాయని మాత్రం మన మంగీకరించక తప్పదు. "జన సామాన్యం లోనుంచి వచ్చాయి" అన్నప్పుడు, నా ఉద్దేశం, పాండిత్యంవల్ల ఏర్పరచినవి కావు" అనే. ఎవడో ఒకడికి – నిరక్షర కుక్షే కావచ్చును – బాగా కోపం వచ్చినప్పుడు, తన ఒళ్ళంతా

మండుతూన్నట్లు అనిపించింది. ఆ భావాన్నే వాడు "ఆమాటే అనకు, నా ఒళ్లు మండుతూంది" అని అంటాడు. ఆ మాటలవల్ల అతని కోపం ఎంత అధికంగా ఉందో, విన్నవారికి అచ్చొత్తినట్టు తెలుస్తుంది మనస్సులో నాటుకుపోతుంది. అవసరం అనిపించినప్పుడు, ఇతరులు కూడా అలాగే అంటారు. అది ఒక పలుకుబడి అవుతుంది. ఈ పలుకుబడిలో ఉన్నమాటలు రెండు: ఒళ్ళు మండడం. కాని భావం అధిక కోపం అని. ఇక్కడ ఒళ్ళులేదు, మండడం లేదు. అలాగే యాచించాడు అన్న అర్థంలో చేయిచాచాడు అంటాం యాచించిన వాడు చేయిలేని వాడు కావచ్చును ఉన్నా, చేయి ముడుచుకొనే ఉండవచ్చును. అయినా ఆ అర్థంలో తెలుగువాడు ఆ నుడికారాన్నే ప్రయోగిస్తాడు ఒళ్ళు మండుతూంది అనడానికి "దేహం దహించుకుపోతుంది", అని అనగలం కాని, దానిని విన్న తెలుగువాడు అర్థం చేసుకోవాలంటే, మొదట దానిని ఒళ్లుమండడంగా మార్చుకొని, ఆ తరువాతనే కోప తీవ్రతను గ్రహించాలి. ఈ మార్చుకోవడం ప్రయత్నపూర్వకంగా కావచ్చు. అప్రయత్నంగా, అభ్యాసరూపంగా కావచ్చు. కాని ఆ మార్పు జరగక తీరదు ఎందుచేతనంటే తెలుగునుడికార ముద్ర ఆ ఒళ్ళు మండడానికే ఉంది. ఆ రూపమే ప్రజా సామాన్యంలో వ్యాప్తి పొందింది. అదే ప్రసిద్ధమై స్థిరమయింది. మార్పుడమంటే ఒప్పుకోదు మార్చి చెప్పినవాడు తాత్పర్యాన్నే ప్రకటిస్తాడు కాని, పలుకుబడిని పలుకడు. "తెలుగు తెలుగు" మాట్లాడడు. అనగా పలుకుబడులు సాధారణంగా భాషాంతరీకరణానికి లొంగవన్న మాట. వెనుకాడుట (అంటే సంకోచించుట, తప్పించుకొనుట) అని ఒక పలుకుబడి మనకుంది. "ఆ నాడు చెప్పాడు కాని ఇప్పుడు వెనకాడుతున్నాడు" అని వాడతాం. దీనిని వెనుకనాడుట" అని మార్చామా, ఆ పలుకుబడి పాడైపోవడమే కాదు అర్థంకూడా మారిపోతుంది.

అవలబోయిన వెన్కనాడు పెన్నడు లేదు
మొగము ముందరనంట మొదలె లేదు

చనవిచ్చి చవుక చేసినది యెన్నడు లేదు
పదరిహెచ్చించుట మొదలె లేదు......
(విజయ విలాసం)

ఇక్కడ "వెనుకనాడుట" అంటే, "వెనుకాడుట" 'అని అర్థం చెప్ప లేము. వెనుకనాడుట అంటే 'దూషించుట' అనీ "మొగము ముందరననుట" అంటే "ముఖ ప్రీతికోసం" మాట్లాడడం అని, నుడికారార్థాలు చెప్పుకోవాలి.

"పలుకుబడులు సాధారణంగా జనసామాన్యంలో నుంచే వస్తాయి, పాండిత్యం వల్ల ఏర్పడినవి కావు" అని అన్నాను. దీనికి పండితులు కోపించ నక్కరలేదు. కొంచం పరిశీలించి చూస్తే, మహావ్యాప్తిలోనున్న కొన్ని నుడి కారాల రూపాలు. అగమ్యగోచరంగా ఉంటాయి "కాదారి మాదారి పొద్దు" (చాలా చీకటిగా ఉన్న సమయము) అంటారు. ఈ కాదారి మాదారిని సమ ర్థించడానికి మన వారు ప్రయత్నించి, "కాని దారి మాని దారి" అని వ్యాఖ్యా నించారు ఇక్కడ మాని దారి అంటే, సరియైన దారి అని అర్థం చెప్పు కోవాలి కాని దారిని కాదారి చేసి, మాని దారిని మాదారిచేసి అన్వయించు కోవడానికి వ్యాకరణం ఒప్పుకోవాలి. ఆ తరువాత "ఈ రెండు దారులూ" ఏర్పరచుకోలేనంత చీకటి" అని అధ్యాహారంగా చెప్పుకొని" ఆ ప్రొద్దు" తో అన్వయించాలి. ఇంత గందరగోళం ఉన్న రూపం పండిత శాఖనుంచి వచ్చిం దనడం మనకు గౌరవప్రదం కాదు. పలుకుబడులలో అనేకం వ్యాకరణానికి విరుద్ధంగా ఉంటాయి ఇంకెన్నో తర్కానికి లొంగవు. ఎన్నిటిలోనో అతి వ్యాప్తి, అవ్యాప్తి దోషాలుంటాయి. ఇలాంటివన్నీ భాషాసంస్కారం కలిగిన వారు నిర్మించారనడం ధర్మంకాదు.

అంతేకాదు. ఈ పలుకుబడులలో నూటికి తొంభై అయిదుపాళ్లు అత్యంత సాధారణంగా, అందరు తెలుగువాళ్ల నోళ్లకు వచ్చినటువంటి, పద హారణాల తెలుగు మాటలే. మన "పదబంధ పారిజాతం" లో ఏ నాలుగు పుటలైనా చూస్తే, ఈ సత్యం తేటపడక మానదు. ఈ కారణంచేతనే వీటికి

తెలుగు ముద్ర లభించింది. వాటినలా ఉపయోగించే మన పండితులు, కవులు తమ తెలుగుతనాన్ని ప్రకటించుకొన్నారు; తమ వాక్యాలకు వన్నె తెచ్చుకొన్నారు. పదాలను మార్చి భావాన్నే ప్రకటించిన వారికి ఈ తెలుగు ముద్ర లభించదు. ఈ విధంగా పలుకుబడి తెలుగు ప్రజలలో పుట్టి, తెలుగు ముద్రను పొంది తెలుగు దేశంలో వ్యాపించి, తెలుగు జాతీయమన్న గౌరవం సంపాదించుకొని, తెలుగు కవిత్వానికి ఒక అందాన్ని కలిగించింది.

## పండితు లూరుకున్నారా ?

ఇన్ని చదువులూ చదివిన పండితులు, పలుకుబడులను నిర్మించకుండా ఊరుకున్నారా అంటే, ఊరుకోలేదనే చెప్పాలి పలుకుబడులవల్ల రచనకు కలుగుతూన్న ఆదరాభిమానాలను గుర్తించారు. వాటిని విశేషంగా తమ రచనల యందుపయోగించి, తెలుగువారి మెప్పును పొందారు.

"చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధి
పొడమిన చెలియ తోబుట్టు మాకు......
నన విల్తుశాస్త్రంపు మిఱుకు లావర్తించు
పనివెన్నతోడ బెట్టినది మాకు .. .. "

అని అల్లసాని పెద్దన్న ఎంతో హాయిని కలిగించాడు. "వెన్నుదన్ని", "వెన్నతోడ పెట్టినది" అన్న జాతీయాలను ప్రయోగించి, వాని లాభం అపారంగా పొందాడు. వెన్నెలకందు అని ఒక పదబంధంకూడా నిర్మించాడు. దీనిలోనూ చక్కని అర్థం ఉంది. తెలుగుతనమూ ఉంది. కాని ఇది ప్రజల్లో వ్యాప్తిపొందలేదు. ప్రజాముద్ర ఇంకా దీనికి చిక్కలేదు.

కెలకులనున్న తంగెటి జున్ను గృహమేధి,
యజమాను డంక స్థితార్థపేటి,
పండిన పేరటి కల్పకము వాస్తవ్యుండు,
దొడ్డిపెట్టిన వేల్పు గిడ్డికాపు ;

కడలేని యమృతంపు నడబావి సంసారి,
సవిధ మేరునగంబు భవన భర్త;
మరుదేశ పథ మధ్యమ ప్రపకులపతి,
ఆకటి కొందవు సస్యము కుటుంబి; . . .

అన్నాడు అల్లసాని కవి. అనాయాసంగా కావలసినప్పుడు సులభంగా దొరకడానికి వీలైన గొప్ప విషయం అన్న భావం ప్రకటించడమే కవి ఉద్దేశం. దీనికోసం తంగెటి జున్ను, అంకస్థితార్థపేటి, పెరటి కల్పకము మొదలైన ప్రయోగాలు చేశాడు. శక్తిమంతమైన ఉపమానాలు, చక్కని పద బంధాలు. కాని వీటికి నుడికార ముద్ర దొరకలేదు అంటే అవి ప్రజలలోనికి ప్రాకలేదు. ప్రజలకు తెలిసిన నుడికారం, ఈ అర్థంలో "కొంగు బంగారం". చేమకూర కవి

"కోప మొకింత లేదు బుధకోటికి కొంగు పసిండి"

అన్నాడు సూటిగా — దానిలో ఇదే భావము. ఇంతకంటె తెలుగు జాతికి అందుబాటులో ఉన్న పలుకుబడి. అల్లసాని పదబంధాలకు ఆ గౌరవం రాదు.

దీనినిబట్టి చూస్తే "పదబంధాలన్నీ పలుకుబడులు కావు" అని అన వలసివస్తుంది. తర్క శాస్త్రంలో "All 'S' is 'P'; but some 'P' is not 'S' - అన్నట్టు, పలుకుబడులన్నీ పద బంధాలైనప్పటికీ, పదబంధాలన్నీ పలుకుబడులు కావు. పద్మము పంకజము అయినా, పంకం (బురద) లో పుట్టినవన్నీ పద్మములు కావుకదా.

"పెట్టనికోట నీకు హరి భీముడు నర్జునున్ విరాటుడున్
చుట్టపు మేరువు... ... ... ... ... ..."

అన్నాడు తిక్కన. పెట్టని కోట చుట్టపు మేరువు రెండూ భావ స్ఫూర్తికల పదబంధాలే. కాని పెట్టనికోటకు వచ్చిన నుడికార గౌరవం, చుట్టపు మేరువుకు రాలేదు కదా.

తార్కాణ :

"పెట్టని కోటకాదె గజబృంటము లెందును రాజధానికిన్" —
(విజయ విలాసం)

వజ్రకవచ మన్న పదబంధ ముంది కదా. పెద్దన్న — "నిజ భుజా శ్రితధారుణీ వజ్రకవచంబు" అన్నాడు. దీనినే విజయవిలాసకర్త. "హిత శిష్టవ్రాత సంతోషణ శ్రీవజ్రాంగి" అని ప్రయోగించాడు. వీటిలో నుడికార లక్షణాలున్నాయి కాని, పలుకుబడి గౌరవం వాటికి రాలేదు. అలా అనటానికి

తార్కాణ

ఆనందాహరి మనుచరిత్రకు శ్రీ కోమాండూరి అనంతాచార్యులవారు టీకాతాత్పర్యాలు వ్రాసారు. శ్రీ తేవప్పెరు మాళ్లయ్యగారు పీఠిక వ్రాసారు. శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు పరిష్కరించారు. వీరిలో చిన్న వారెవ్వరూ లేరు. ఆ వ్యాఖ్యానంలో, "నిజ భుజాశ్రిత ధారుణీ వజ్రకవచంబు" అంటే, "తనదైన బాహువును పొందిన భూమికి వజ్రమణులతో చేయబడిన కవచము వంటివాడు" అని వ్యాఖ్యానం వ్రాశారు. 'వజ్రకవచమును' పలుకుబడిగా వారు గ్రహించలేదు. కాబట్టే ముక్కకు ముక్క అర్థం చెప్పారు. కఠినాతి కఠినమైనది వజ్రము. కాబట్టి లోహకవచం కన్న వజ్రకవచం ఎక్కువగా రక్షిస్తుందని భావము. అందుచేత పై మాటలకు అర్థము, "చేతి కిందికి వచ్చిన దేశాన్ని బాగుగా రక్షించగలవాడు" అని చెప్పడం న్యాయం. అలా చెప్పక పోవడమే 'వజ్రకవచం' అన్న పదబంధము ప్రజా వ్యాప్తి పొంది పలుకుబడి కాలేదనడానికి నిదర్శనము. కాబట్టి పలుకుబడుల కోశాన్ని 'పదబంధ పారిజాతం' అనడం కొంచెము అతివ్యాప్తిపాల పడుతుందేమో.

## వీటి ప్రయోజనం

సముచితమైన పలుకుబడుల ప్రయోగంవల్ల మన కవులు తమ కావ్యాలను రసవంతంగా చేసుకోగలిగారు. మనుచరిత్రలో, మనోరమ ఘట్టములో

"ఓయి దయావిహీనమతి ఊరక ఈ పసిబిడ్డ గొట్టగా
చేయెటులాడెనీకు ? నిది చేసిన దేమి వృధా శపింతురే ?
బోయవె, యాడుతోడునను బుట్టవె ? శాపనిమిత్తమే తపం
బీ యెడనున్న శాంతిపరులే మనువారిక నీ చరిత్రికున్."

అన్న పద్యం ఉంది. నాగబెత్తము పట్టుకొని, మనోరమను కొట్టిన మునితో చెలికత్తె లంటున్నారు. దీనిలోని "పసిబిడ్డ" పలుకుబడి నాలుగై దేళ్ళ బిడ్డ అనికాదు. ఏమియు నెరుగనిది అని అర్థము చెప్పాలి. ఎందుచేతనంటే ఆ మనోరమను,

"తిమిరంపు వయసు గుబ్బల
కొమరాలవు నీకు దగిన గోవాళ్ల మహిన్
నెమకి నగరాదె ముదిసిన
మము జెనకిన నేమిగలదు మదమేమిటికిన్"

అని అనడానికి అవకాశం కలగాలి. దీనిలో "తిమిరంపు వయసు" ఎంత అందమైన నుడికారము ' ఆ పద్యంలో "చే యెటులాడె నీకు" అన్నది కూడా నుడికారార్థములోనే "మనస్సెలా ఒప్పిందీ" అన్న భావం

"ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు
చిద్ద్రోహంబును నీకు నేయరు,రణోత్సేకంబునన్ పుత్రులన్
భద్రాకారుల పిన్నపాపల రణప్రౌఢ క్రియా హీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా నీ చేతు లెట్లాడెనో."

అని ద్రౌపది తన కొడుకులను ఘోరంగా చంపిన అశ్వత్థామతో అంటుంది. "నీ చేతు లెట్లాడెనో" అన్న పలుకుబడివల్ల, ఈ వాక్యాలలో ఒక అడుతనము కనిపిస్తుందనడానికి సందేహము లేదు.

పలుకుబడులు జనసామాన్యంలో పుట్టి బ్రతకాలి కాబట్టి, అవి జన సామాన్యానికి అందుబాటులో ఉన్న విషయాల్ని గురించే ఉండాలి. అంతే

కాదు. జన సామాన్యం నోళ్ళకు వచ్చిన మాటలలోనే ఉండాలి. అందుచేతనే ఈ పలుకుబడులలో శరీరావయాలకు సంబంధించినవి. పశుపక్షులకు సంబంధించినవి, ప్రకృతి విషయాల గూర్చినవి, వ్యవసాయాది వృత్తులకు సంబంధించినవి, ఇలాంటి వనేకం ఉంటాయి. నగనట్రు, ఏండ్లుపూండ్లు వంటి జంట పదాలు ఉంటాయి అందులో కొన్ని పదాలకి ప్రత్యేకంగా అర్థమే ఉండదు. నోరు చెయ్యడం, కాలు త్రొక్కడం లాంటి శబ్దపల్లవాలు అనేకం పలుకుబడులయినాయి. వీటిని గురించి మన పదబంధ పారిజాత సంపాదకులు పీఠికలో విపులంగా వ్రాసారు. ఇక్కడ పునరుక్తి ఎందుకు ?

పలుకుబడులు కొన్నింటిలో వ్యాకరణము, తర్కమూ కనబడదని మనవి చేసాను. చూడండి. "ఊరికి ఊరే తగులబడి పోయింది" అని అంటాం. అర్థం "ఊరు సంపూర్ణంగా" అని. ఈ 'కి' షష్ఠిని ఏ వ్యాకరణం కాపాడుతుందో తెలియదు.

"ఇంటికి నిల్లు గట్టుకొని యేగగవచ్చు మురారి వెంట; నా
ఇంటికి వచ్చి పూజగొని యేగుట నన్ను కృతార్థుచేత"

అని కకుత్స విజయం, దీనిలో పలుకుడి అనదగినది "ఇంటికి ఇల్లు" అన్నంతవరకే కాని, "ఇంటికి నిల్లుగట్టుకొని యేగు" అన్నంతవరకూ కాదు. ఇంటికి ఇల్లు అంటే ఇంటిలోని అందరూ, కట్టుకొని యేగుట అంటే కూడి జట్టుగా వెళ్లుట అనేగాని మరొకటి కాదు. ఇటువంటి సందర్భములలో "ఇంటిల పాది" అని కూడా అంటారు. ఈ "ఇలపాది" "వేలుపాది" అవుతుందేమో ! ఆలాగే అయితే ఈ రూపాన్ని పండితు లెలాగ సాధిస్తారో తెలియదు.

## అర్థం చేసుకోవడం :

తరువాత, పలుకుబడులు జనసామాన్యంలో నుంచి కలిగినవి కాబట్టి వాటిని చక్కగా గ్రహించాలంటే మనకు ఆ జన సామాన్యంతో సంబంధముండాలి. లేకపోతే ముక్కకుముక్క అర్థమయినా చెప్తాము. లేదా తప్పు

అర్థమయినా చెప్తాము. అదే ఒక పండితుడూ పరిష్కర్తా అయితే అర్థంచేసుకో లేక ఆ పలుకుబడిని దిద్ది, రూపుకూడా మాపుతాడు.

"చెలువ నిను రాజకీరంబు చెట్టబట్టె
కలికి నిను రాజహంసంబు కాలుద్రొక్కె
మంచి శకునంబు, లిదిగొ ' నా మాట చూడు
కన్నె ఈ లోన పెండ్లి కాగలదు నీకు"

అని విజయ విలాసంలో పద్యం త్రిదండివేషంలో ఉన్న అర్జునుడు, సుశ్రూష చేస్తూ ఉన్న సుభద్రతో అంటాడు. ఈ పద్యంతో మెల్లగా వివాహ ప్రసంగం మొదలు పెడతాడు. ఆ సమయంలో ఆమె

"కంగుల్ దీర్చిన పైరి నీ రవికె చన్గట్టంటి రాణింపగా
చెంగల్వల్ నెరిగొప్పునందు నొరపై చెంతఁ గుబాళింపగా
బంగారందియ ముక్కునఁ గమిచిపై పైనంచ యెల్గింపగా
సింగారంబగు ముద్దుచిల్క తనకుఁ చేదోడువాదోడుగాన్."

నిలబడ్డది. చేతిమీద ఒక చిలుక, కాలు త్రొక్కుతూ ఒక హంస ఉన్నవి. వాటి నాధారం చేసుకొని, రాజకీరంబు చేయిబట్టి ఉంది కాబట్టి రాజశ్రేష్ఠుడు నిన్ను చెట్టబట్టును (పాణిగ్రహణము) చేయును అనీ, రాజ హంసము కాలుత్రొక్కుతూ ఉంది కాబట్టి రాజశ్రేష్ఠుడు నిన్ను కాలుత్రొక్కును, (పెండ్లి చేసుకుంటాడు)" అని శకున ఫలం చెప్తా డర్జునుడు. దీనిలో "చెట్ట బట్టు" "కాలుతొ్రిక్కు" అన్న రెండు మాటలకు, "వివాహము చేసుకొను" అన్న అర్థమే ఉంది. అదే చేమకూరి వాని చమత్కారము శ్లేష.

ఆ సంగతి మన వ్యాఖ్యాతలకు తెలియలేదు "కాలుత్రొక్కు" అంటే "కదియు (సమీపించు)" అన్న మరొక పలుకుబడి అర్థము పట్టుకున్నారు. శబ్దరత్నాకరములో ఈ అర్థమొక్కటే ఉంది దానితో జేసిన వ్యాఖ్యానానికి సందర్భశుద్ధి ఎలావస్తుంది? కొన్ని తెగల వివాహములలో భర్త చేత భార్య

కాలు తొక్కించడం ఆచారం మంగళసూత్రధారణ జరిగినా, ఈలాగు కాలు తొక్కకున్నంత వరకు వివాహము పూర్తికాదు. ఈలోగా భర్తచని పోతే, ఆ పెళ్ళికూతురు విధవకాదు. కాలుత్రొక్కి కంకణం కట్టడం, కత్తికి కంకణం కట్టడం అని పెళ్లి పద్ధతులున్నాయి ఈ విషయం తెలియకే, శ్రీనాధుడు వ్రాసిన పద్యాన్ని, దిద్దివేయడానికి కూడా, మన పండితులు, పరి ష్కర్తలు సాహసించారు —

"అమరపతిన్ వరించెదవొ
హవ్యవహున్ చరణంబు ద్రొక్కెదో
శమనునిచెట్ట పట్టెదవొ
సాగరవల్లభు బెండ్లి యాడెదో."

అని దూతగా వచ్చిన నలుడు దమయంతితో అంటాడు ఇది కూచి మంచి తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్రహములో చూపిన పారము. శ్రీనాధుడి అభిప్రాయము ఈ నలుగురిలో ఎవరిని పెండ్లి చేసుకుంటావు అని. పెళ్ళి చేసుకోడానికి నాలుగు మాట లుపయోగించాడు, వరించెదవో, చరణంబు త్రొక్కెదో, చెట్టపట్టెదవో, పెండ్లియాడెదో. వీనిలో చరణంబు త్రొక్కెదో (కాలు తొక్కెదవో, పెండ్లి చేసుకొందువో) అన్న అర్థములో వాడాడు కాలు త్రొక్కడం శుభక్రియాకలన, సప్తపదులుకావు కాబట్టి వివాహార్థం చెప్పడానికి వ్యాఖ్యాతలకు వీలులేకపోయింది. అందుచేత "చరణంబు త్రొక్కెదో" అను దానిని "వరణం బొనర్చెదో" అని దిద్దారు మన పరి ష్కర్తలు. ఈ దిద్దుబాటుతో శ్రీనాధుడికే పెళ్ళిచేశారు.

ఏకార్థము గల నాలుగు వేరువేరు పలుకుబడులు చెప్పడానికి శ్రీనాధుడు చేతగాని వాడయాడు. చేతనైతే ఒకచోట వరించెదవో అని క్రియారూపమును వాడి, యింకొకచోట దాని కృదంతరూపముతో వరణం బొనర్చెదో అని ప్రయోగిస్తాడా అనవలసి వస్తుంది. జనసామాన్య పరి చయం లేనందు వల్లనే ఇలా జరిగింది.

సారంగధర చరిత్రలో రాజనరేంద్రుడు, వేటకు బయలుదేరుతూ "దేగ పదునుగ" భోజనం చేసినట్టు కవి వర్ణించాడు. ఆ దేగ పదును ఏమిటో తెలుసుకోలేక మనవారు చాల తికమకలు పడ్డారు — పడుతున్నారనే అనవచ్చునేమో! ఈ పద బంధము డేగవేట వారిలో నుంచి వచ్చినా ప్రజలలో వ్యాపించి పలుకుబడి అయి తంజావూరు రఘునాధరాయల ఆస్థానము లోనికి కూడా పోయింది డేగను వేటకు తీసుకుపోయినప్పుడు దానికడుపునిండా మేతపెడితే అది భుక్తాయాసంతో కదలమన్నప్పుడు కదలదట. అలాఅని తిండి పెట్టకుండా తీసికొని వెడితే ఎగరమనకుండానే, చూచిన పిట్టనల్లా పట్టుకోడానికి ఉరుకుతుంటుందట. అందుచేత దానిని పదునుగా, అగ్రాకలితోనే తీసుకుపోతారు. వ్యాయామం కోసం వెడుతూన్న రాజనరేంద్రుడు, దానికి తగినట్టు లఘుభోజనం చేశాడిని అర్థము.

అలాగే భటుల సంభాషణలవో "రేకమోయుట" అన్న పలుకుబడి ఉంది. చేమకూరకవి స్త్రీముఖవర్ణన సందర్భంలో,

కన్నె నగుమోము తోడన్
పున్నమచందురుని సాటి పోలుప వచ్చున్
నెన్నుదురు తోడ మార్కొని
మున్నందరు జూడ రేకమోవక యున్నన్.

అని అన్నాడు పద్యములో ఉన్న మార్కొని అన్న పదంవల్ల కవి అభిప్రాయంలో యుద్ధము ఉందని అనడానికి సందేహము లేదు. ఆ యుద్ధంలో మున్ను ఒకనాడు చంద్రుడికి అవమానమో, అపజయమో కలిగి ఉండాలి ఆ కారణంచేత ఈనాడు ఆ చంద్రుడు సాపంక్తి గౌరవం పొందడానికి అనర్హుడౌతాడు. ఇది కవి కల్పన. ఆ అవమానమో, అపజయమో తెల్పడానికి "రేకమోవక యున్నన్" అని కవి ఉపయోగించాడు అతనికి ఆ భటుల పరిచయమూ, సంపర్కమూ ఉంది తాను క్షత్రిధర్మములో ఉన్నవాడేకదా! దీనికి వ్యాఖ్యానము వ్రాస్తూ బ్రౌను దొరగారి ఆంధ్రవ్యాఖ్యాత

జూలూరు అప్పయ్య పండితుడు రేక మోవకయున్నఁ — హర్కారా పని చేయకుండా ఉండి ఉంటే అన్నట్టు అర్థం వ్రాశారు. ఆ అర్థాన్ని అంగీకరించే కీ. శే. వేదం వేంకటరాయశాస్త్రిగారు రేక మోయుపని తపాల నౌకరీ, చేయకుండి నట్టయితే అని వ్యాఖ్యానించారు మార్కొనుట (యుద్ధము) లో కలుగదగిన అవమానము. తపాలానౌకరీ అవుతుందా అని వారు శంకించ లేదు. ఆ ప్రజలతో సంపర్కము లేకపోవడమే దీనికి కారణం

ఆ కాలపు వాఙ్మయము కొంచం శ్రద్ధగా చూచి ఉండినా ఆ పలుకుబడికి యీలాటి అర్థం చెప్పడానికి సాహసించి ఉండరు - తారాశశాంక విజయంలో -

సుత్రామాదుల్ . శశిమీదఁ రేక రా నిత్తుమే" అని

శేషం వేంకటపతి ప్రయోగం ఉంది. ఇక్కడ తపాలాపనికి తావేలేదు కదా ! అంతదూరం కూడా పోనక్కరలేదు విజయ విలాసంలోనే అర్జునుడు సుభద్రను తీసికొని ఇంద్రప్రస్థానికి పోతూంటాడు బలభద్రునికి తెలియకుండా తీసికొని పోతున్నాడని అపోహపడి ఆ పురరక్షకుడు తన సైన్యంతో అర్జునుడ్ని ఎదిరిస్తాడు సుభద్ర, "నేను రథము తోలుతాను, నీవు యుద్ధము చేయుమని" అర్జునుడ్ని ప్రోత్సహిస్తుంది. అలాగే అర్జునుడు వారిని తరిమి వేస్తాడు, తరువాత కావ్యంలోని వచనం

యిత్తెరంగున జయాంగనా సంగమంబునన్ బొసంగియు, చెక్కు చెమర్పక అక్కురువీరుడు సారథ్య నిపుణత్వమునకు మెచ్చి అచ్చిగురుబోడి నవారిత ప్రేమాతిశయంబునన్ గౌంగిలించి, "యొక్కించుక రేక మోవని నా యురస్థ్సలంబున నీకుచకుంకుమ రేక లంటించి మీ వారికి సూడు దీర్చితివి" అని నవ్వుచు . .

యీ విధంగా ఉంది ఎందుచేతనో వెంకటరాయశాస్త్రిగారి వచనానికి అర్థాలే వ్రాయలేదు. ఆ ఆలింగనములో సుభద్ర వక్షస్థలమున పూసుకొనిన సుగంధ కుంకుమములోని రేకలు (గీటులు) ఎర్రగా అర్జునుడి వక్షస్థలానికి

అంటుకొని, కత్తివల్ల కలిగిన గాయాలలాగ కనబడుతున్నాయని కదా అర్థం చేసుకోవాలి? తపాలానౌకరీ అనగలమా? హిర్కారా పని అనగలమా? బలభద్రుడి సైన్యము ఏకాకిగా ఉన్న అర్జునుడి నెదిరించి, చివరకు పారి పోయిందే కాని, ఆ అర్జునుడికి ఒక గంటుకూడ కలిగించలేక పోయింది అన్న అపకీర్తి (సూడు) సుభద్ర బంధువులకు కలుగకుండా, కుచకుంకుమ రేకల నెపముతో సుభద్ర తన భర్తను రేకమోసే లాగ చేసింది అని తాత్పర్యము.

రేకమోయుట అనగా గంటు, గాయముపడుట. ఆ గాయమే మచ్చగా చంద్రుడిలో ఉందనీ, ఆ మచ్చలేకపోతే ఆమె నగుమోముతో పున్నమచంద్రుని పోల్చవచ్చుననీ చక్కనిధ్వని ఉంది కదా! ఈ రేక మోయుట ఆనాటి భట సామాన్యములోని నుడికారము. వారి సంపర్కము లేనందువల్లనే వ్యాఖ్యా తలలో ఇలాంటి అవకతవకలు.

## పలుకుబడులూ శ్లేషలూ

మరొక్క విషయం. పలుకుబడి అంటే రెండు మూడు పదాలుకలిసి, ఆ పదాలన్నిటితో గాని, కొన్నిటితో గాని సంబంధములేని ఒక విశిష్టార్థా న్నిచ్చేది అని అనుకున్నాము. నాకుద్యోగం వస్తే వాడికెందుకురా కడుపు మంట అంటాము. ఇక్కడ కడుపుమంట నుడికారము. దీని అర్థము అసూయ-కాని కడుపు అన్నమాటకొక అర్థము ఉంది. మంటకు ఒక అర్థము ఉంది. అసూయ అన్నది ఈ రెంటితోనూ సంబంధంలేని అర్థం. ఇలాంటి అవ కాశం ఉండడంవల్ల భాషలో ఒక చిత్రమైన విషయ మేర్పడుతుంది. పలుకు బడికి నుడికారార్థ మొకటి స్వతస్సిద్ధంగా చెప్పగల అర్థమొకటి 'మొత్తం రెండర్థాలకు' వీలుంటుంది, అనగా శ్లేషకు మంచి అవకాశం కలుగుతుం దన్న మాట

కొందరు కవులు కేవలం నుడికారార్థంతోనే సంతోషించి వ్రాస్తారు పెద్దన్న కటికి చీకటిని వర్ణించిన పద్యంలో—

మృగనాభి పంకంబు మేయినిండ నలదిన
మాయాకిరాతు మైచాయ దెగడి,
నవఘించమయ భూషణలవధరించి నటించు
పంకజాక్షుని చెల్వు సుంకమడిగి
.. .. ... . ..
కటిక చీకటి రోదసి గహ్వరమున కలిసె.

అన్నాడు. తెగడి అంటే తిరస్కరించి, మించి అని అర్థము. ఆ అర్థములోనే సుంకమడిగి, కాకునేసి, అన్న పలుకుబడులను తక్కిన పాదాలలో ఉపయోగించాడు - వీటిని కేవల నుడికారార్థములోనే వాడాడనడానికి సందేహములేదు. ఏమంటే, దీనిలో సుంకం (పన్ను) నకు గాని, అడగడానికి గాని అర్థములేదు.

ప్రకట శ్రీహరి యంఘ్రిబుట్టి హరుమూర్ధం బెక్కి యా పాద మ
స్తకముఁ వర్ణన కెక్కు దేవి —

అని చేమకూరవాడు గంగాభవానిని వర్ణించాడు. గంగానది త్రిజగములలోనూ ప్రవహిస్తూందని ఏ చోటనైనా అది పాపహారిణే నని వాడుక. అంటే సర్వత్రా - ఇక్కడా అక్కడా అనకుండా అంతటా - పావనమైన దనే ప్రఖ్యాతి ఆపాదమస్తకము అన్న నుడికారానికి అదే అర్థము. దీనికి తోడు మరొక సొగసుకూడా ఉంచాడు కవి. గంగ విష్ణుమూర్తి పాదమున పుట్టిందట, ఈశ్వరుడి తల మీది కెక్కిందని చూపించాడు ఆ (విష్ణు) పాదము మొదలు ఈ (ఈశ్వర) మస్తకం వరకూ అని చమత్కారం కనబరిచాడు. సహృదయులకు ఎంతో ఆనందము కలుగుతుందనడానికి సందేహముంటుందా ?

ఉలూచి అర్జునుడిని తన లోకానికి తీసుకొని పోతుంది.

"కాముకుడ గాక వ్రతినై
భూమి ప్రదక్షిణము సేయబోయెడు వానిఁ

కామించి తోడితే దగ
వా మగువ వివేక మించుకైనఁ వలదా ?"

అని అర్జునుడు చిన్న నాటకమాడతాడు. "కాముకుడ గాక" అన్న మాటను ఖండిస్తూ ఉలూచి

నిను గీతి సాహితీ మో
హిన వాణులు చెవులుపట్టి యాడింపంగా
గనియుండి "కామకుడగా"
నని పల్కిన నాకు నచ్చె కౌనే నృపాలా।

అంటుంది. నిన్ను సంగీతము, సాహిత్యమూ, అన్న ఇద్దరు కాంతలు చెవులు పట్టి యాడిస్తూ ఉండడం అనగా స్వాధీనునిగా చేసుకొని, చెప్పినట్లు చేయించుకోగలగడం చూచిన తరువాత నేను కాముకుడను కాను అంటే నమ్ముతానా" అని దాని భావము. ఇక్కడ నుడికారార్థం ఉపయోగించాము. మంచి సంగీతము, చక్కని సాహిత్యము, చెవులు పట్టినందువల్ల (వినడం వల్ల) మెప్పుతోనో, ఆనందంతోనో తల ఆడించడం సహజం. అర్జునుడు అలాంటి సరసుడు. సంగీత సాహిత్య ప్రియుడు అని భావము. చమత్కారంగా పలుకుబడి అర్థముతో, మరొక అర్థము కూడా అమర్చి కవి మనోహరంగా వ్రాసాడు.

ఇలాంటి దేవతలపై నెక్కించుకోవడం నుడికారంగా చూస్తే దీని అర్థము ఎక్కుడుగా (తెలివి తక్కువగా గూడా) గౌరవించడము. సాధారణార్థం చూస్తే తలమీద పెట్టుకోవడం అవుతుంది. ఈ రెండర్థాలు జోడించి కవి,

తాస్సైరింప కపర్దయుండ భవద్గర్భంబునన్ దాల్చితే
జ్యోసహ్యన్ శరజన్ముగాంచి యల నీహార క్షమాభృత్కుమా
రీ సాపత్న్యముగన్న మోహపు పురంధ్రీరత్నమౌ దీవ కా
వే, సర్వజ్ఞుడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవీ !

అని గంగానదిని వర్ణించాడు. నీహారక్షమా భృత్కుమారీ (రాచకూతురు) అపర్ణ (తపస్విని) అయిన పార్వతి చేయలేని ఘనకార్యముచేసి, ఈశ్వరుడికి పుత్రప్రాప్తి కలిగించిన "మోహాపు" కుటుంబిని అని గంగను ఈశ్వరుడు అపారమైన గౌరవంతో చూచాడని భావము. భార్యను తలపై నెక్కించు కోవడం కొంచెం తెలివి తక్కువ పనిగా భావిస్తాము ఈశ్వరుడు అలా తెలివి తక్కువగా చేసి ఉండడు. సర్వజ్ఞుడు కాబట్టి చాలా సకారణంగా, సము చితంగానే తలమీద నెక్కించు కున్నాడు. ఈ సొగసుకు తోడు ఆ నుడి కారంలోని మాటల్ని బట్టి నెత్తిమీద పెట్టుకున్నాడు అన్న అర్థం వస్తుంది కదా! అది కూడా నిజమే! ఈశ్వరుడు గంగాధరుడు. జటా జూటములో గంగ నిముడ్చుకున్నాడు ఆహ్లాదకరమైన శ్లేష అనక తప్పదు

చిత్తజు డల్గి తూపు మొనచేసిన చేయగ నిమ్మ, పై ధ్వజం<br>
బెత్తిన నెత్త నిమ్మ, వచియించెద కల్గిన మాటగట్టిగా<br>
నత్తరళాయతేక్షణ కటాక్షవిలాస రసప్రవాహముల్<br>
కుత్తుకబంటి తామరలకున్ తలమున్కలు గండుమీలకున్

అని ఆ కవే అన్నాడు. పద్యంనిండా పలుకుబడులే. పసందైన శ్లేష. మొన చేయుట కత్తి నూరుట లాంటిది. ధ్వజం బెత్తుట దండెత్తుట రెండూ క్రోధ సూచనలే కలిగిన మాట అంటే యథార్థము. కుత్తుకబంటి అంటే మిగుల ప్రమాదకరమైనది. తలమున్కలు అవమాన సూచన. తామరలకు ఈ (విలాసరస) ప్రవాహము కుత్తుకబంటి - మెడవరకు ఉంటుంది అది కలిగిన మాట ఆలాగే గండుమీలకు ఈ ప్రవాహము తలమున్కలుగానే ఉంటుంది. ఇదీ కలిగిన మాటే - మన్మథుడికి ఆ తామర బాణము. ఈ మీను ధ్వజము. ఈ కలగిన మాట - తన వస్తువులకు అవమానకరము అన్నమాట - అని చెప్పినందుకు మన్మథుడు తూపుమొనచేసి నా ధ్వజము ఎత్తి వచ్చినాసరే, అనక తప్పను అంటాడు కవి. తామర నెంత మొన చేసినా, మీను నెంత

యెత్తినా ఆ రస ప్రవాహము కుత్తుకబంటి, తలమున్కలు, తప్పించలేదు అని భావము.

## చిన్న తారతమ్యం

కేవల నుడికారార్థముతో చెప్పిన పద్యానికి రెండర్థాలను చాక చక్యముతో జోడించి చెప్పిన పద్యానికి అర్థగౌరవంలో ఉండే తారతమ్యం చూపడానికి ఒక్క పద్యము "అమ్మకచెల్ల" అని ఆశ్చర్యార్థకమైన నుడికారం ఉంది. దీనిలో అమ్మడం, చెల్లడం రెండు విడివిడి అర్థాలున్నాయి. అల్లసాని పెద్దన్న ప్రవరాఖ్యుని వర్ణనలో -

కమ్మని కుందనంబు కసుగందని మే, నెలతేటి దాటులం
బమ్మెర వోవదోలు తెగబారెడి వెండ్రుక, లిందు బింబముం
కిమ్మన నీదు మోము, గిరి క్రేపులు మూపులు, కౌను గానరా
దమ్మక చెల్ల ' వాని వికచాంబకముల్ శత పత్ర జైత్రముల్.

అని ఒక పద్యం వ్రాసాడు. ఇక్కడ "అమ్మకచెల్ల" అంటే "ఓహోహో" అని ఆశ్చర్యాన్నే అర్థం చేసుకుంటాము. మరి విశేషం లేదు.

ఈ "అమ్మకచెల్ల"ను ఉపయోగిస్తూనే చేమకూర కవి ఒక పద్యం చెప్పాడు. అల్లసాని వాడిలాగనే తన పద్యం మొదటి చరణం "కమ్మని" అని అరంభించి చివరి చరణం "అమ్మకచెల్ల" అన్న పదంతోనే మొదలుపెట్టాడు. మూడు వంతులు మనుచరిత్ర పద్యాన్ని మనస్సులో పెట్టుకొనే తన పద్యం వ్రాసి ఉంటాడు ప్రత్యక్షంగా తన నేర్పు చూపించడానికే అలాగు చేశాడేమో అనిపిస్తుంది.

ఆ పద్యంలో ఉలూచి అర్జునుడ్నిగూర్చి తన భావాన్ని వ్యక్తచేస్తుంది.

కమ్మని జాళువా నొరయ గల్గిన చెక్కుల చెక్కువాడు, చొ
క్కమ్మగు జాతికెంపు వెలగాగొను మోవి మెరుంగువాడు, స

త్యమ్మగు రూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించు వా,
డమ్మకచెల్ల! నా హృదయ మమ్మకచెల్లదు వీనికియ్యెడన్.

ఇక్కడ ఆశ్చర్యాన్ని కాశ్చర్యం, అమ్మకాని అమ్మకం రెండూ ఉన్నాయి. పైగా తన హృదయం ఒక మంచి రత్నాభరణము అన్న అందమైన ధ్వనికూడా కానవస్తుంది.

స్త్రీలలో పరాక్రమ విక్రీతలు లాగానే (పరాక్రమానికి అమ్ముడు పోయిన వారివలెనే) సౌందర్యవిక్రీతలు కూడా ఉంటారు కదా! ఈ పద్యంలో ఉలూచి హృదయము సౌందర్యానికి అమ్ముడు పోతూంది. ఆ హృదయం కెంపులు తాపిన బంగారు నగ – దీనిని అమ్మడానికి మొదట బంగారము గీటుపెట్టి వన్నె తేల్చుకోవాలి, తరువాత దానిలోని కెంపులు పరీక్షింపించి వాటి ధర కట్టించుకోవాలి. ఆ తరువాత పై రెండు పరీక్షలవల్ల తేలినంత ధనము యిచ్చి కొనగలవాడిని చూచుకోవాలి. ఈ మూడు ఒక్కచోటనే సమకూరినప్పుడు, ఆ రత్నాభరణాన్ని అక్కడే, ఆ మనిషికే అమ్మకతప్పదు. లేకపోతే అది చెల్లక పోవచ్చును కదా!

ఈ భావాన్నే మహా చమత్కారంగా పద్యంలో ప్రకటించాడు. పెద్దన్న పద్యములో లాగానే, ఈ పద్యంలోకూడా (అర్జునుడి) సౌందర్య వర్ణన ఉంది నున్నగా నిగనిగలాడుతూ గీటురాయి (ఒరగల్లు) లాగ నల్లగా ఉన్న చెక్కులు కలవాడు. జాతికెంపును కూడ మించిపోయిన ఎర్రతనంగల పెదవులు కలవాడు. సుప్రసిద్ధ సుందరరూపుడైన నలకూబరుని కూడ ధిక్కరించగల రూపసంపదగలవాడు అన్న ఆశ్చర్యానికి (అమ్మకచెల్ల అనుటకు) ఏలాంటి లోటూలేదు. ఈ పాటి అర్థంతోనే చివరి చరణం "అమ్మకచెల్ల నా హృదయ మమ్మక చెల్లదు వీనికీయెడన్" అని అన్వయించుకొనినా సంతోషించవచ్చును. కాని చేమకూరవాడు అంతటితో తృప్తిపొందలేదు. అందుచేతనే ఈ చెక్కుల టెక్కువానిచేత (అందమైన చెక్కులుగల వాడి చేత) బంగారాన్ని ఒరగల్లు మీదపెట్టి గీటుపెట్టించి దాని వన్నెను నిర్ణ

యించాడు. ఆ "మోవిమెరుగు" వాడిచేతనే జాతికెంపుల వెల నిర్ణయించేలా చేసాడు. దీనితో ఆ అమూల్య రత్నాభరణం వెల తేలింది అంత ధనమూ యిచ్చికొనడానికి అతడే రూపసంపద (ను) ధనాధిపసూనుని ధిక్కరించు వాడు అయాడు. ఇన్నీ ఒక్కచోట కలిసి వచ్చినప్పుడు కాక ఇంకెప్పుడు ఆ ఆభరణం చెల్లుతుంది ఈ విశేషార్థాన్ని అరటిపండు ఒల్చిపెట్టినట్లు యిమిడ్చాడు. సహృదయులకు అద్భుతానందమును కలుగచేసాడు.

జనసామాన్యమున ప్రచారంలో ఉన్న పలుకుబడులు శక్తివంతములు. వాటికి ప్రసిద్ధమైన రూపు, నిర్దిష్టమైన జీవం ఉంటుంది. వాటిని ఉచితజ్ఞతతో ప్రయోగించినప్పుడు రచన అర్థగౌరవం గలిగి రసవంతంగా ఉంటుంది. వాటిసాయంతో సిద్ధహస్తులు చక్కని శ్లేషలనల్లి తలలూపించే రచనలు చేసి కీర్తి నార్జించగలిగారు రచనలలో ఉపయోగించడానికి రచయితలకుగాని రచనలను అర్థం చేసుకోడానికి పాఠక వ్యాఖ్యాతలకు గాని ఈ నుడికారాల విలువలు తెలుసుకోవడం చాల అవసరం. అందుకే ఈ పదబంధ పారిజాత సంపుటములు ఆంధ్రులకు పెరటి కల్పకములాగ ఉండగలవు - వీటిని పరిచురింపించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారు అభినందనీయులు.



శ్రీ

# సాహిత్యోపన్యాసములు

౨

చిన్నయసూరి




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ :: హైదరాబాదు

శ్రీ

# సాహిత్యోపన్యాసములు

౨

చిన్నయసూరి




ప్రచురణ.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ :: హైదరాబాదు

## ప్రకాశకుల విజ్ఞప్తి

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ పక్షాన చిన్నయసూరి శతవార్షిక వర్ధంతి ఉత్సవాలు చేయవలెనని నిర్ణయమైనది ఆ నిర్ణయానుసారము 21 ఏప్రిల్ 1962 నాడు యీ ఉత్సవము హైదరాబాదు నగరములో యేర్పాటు చేయనైనది ఈ సభకు కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు అధ్యక్షత వహించినారు ఈ సందర్భమున జరిగిన ఉపన్యాసములలో రెండింటిని యీ పుస్తక రూపమున ఆంధ్ర మహాజనులకు అందించుచున్నాము సాహిత్య అకాడమి పక్షాన జరుపు ఉపన్యాసాలను పుస్తకరూపముగా ప్రకటించవలెనని కార్యనిర్వాహకవర్గమువారు నిర్ణయించినారు ఈ ప్రచురణల వరుసలో యిది రెండవది

మా ఆహ్వానము నంగీకరించి చిన్నయసూరి జీవితమును గూర్చి ప్రసంగించిన శ్రీ నిడదవోలు వెంకటరావుగారికి, వ్యాకరణమును గూర్చి ప్రసంగించిన శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారికి మా హృదయపూర్వక ధన్యవాదాలు నీతిచంద్రికను గూర్చి మూడవ ఉపన్యాసము గావించిన మహాశయులు మేము యెన్ని పర్యాయములు కోరినప్పటికిని ఉపన్యాసపు ప్రతి పంపనందున, దానిని యిందులో చేర్చనందుకు చింతిల్లుచున్నాము

హైదరాబాదు
19-10-62

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి,
ఆం ప్ర సా అకాడమి

విషయసూచిక :

# శబ్దశాస్త్ర వైదుష్యము

—శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి

ఈ సాహిత్యసభాపీఠమున చిన్నయసూరి సారస్వతమూర్తిని సమ్మానించుటకును, ఇంతమంది సాహితీప్రియులు ఏకముఖముగా ఆ మూర్తిని సమీక్షించి ఆనందించుటకును సాహిత్యఎకాడమి సంకల్పించిన యీ దినము మిక్కిలి సుదినము —

ఈ కదంబ కార్యక్రమమున చిన్నయసూరి లాక్షణికతా వైశిష్ట్యమును విశదపఱుచు నవకాశముగలుగుట నాకు ఎంతో తృప్తికరమగు సన్నివేశము —

లాక్షణికులున్నారుగాని చిన్నయసూరివలె జీవితమున వ్యాకరణ రచనమునే ఏకైకలక్ష్యముగా ఎంచుకొన్నవారు లేరు మఱియు ఆ విషయమున ఆతనివలె శ్రద్ధాసక్తులు, శక్తియుక్తులు, కౌశలపాటవములు చూపిన వారును కానరారు —

అంతమాటా! అని అబ్బురపడవలదు —

అంతమాటో! ఇంతమాటో! ఉన్నమాట అది —

లోకమున ఒక్కొక పనికై ఒక్కొకరు జనింతురు —

ఒక్కొకపనిలో ఒక్కొకరు రాణింతురు.

లోపలిమాట పైకనుటకు సంకోచమేలగాని నిక్కమని నేను నమ్మినది ఒక్కమాట అనుచున్నాను

"తెలుఁగున 'సూత్రకర్త' అనుపేరు సూరికిఁదప్ప ఇతరులకు ఇంతకు మున్ను లేదు ఇకమీఁద రాదు"

తక్కిన లాక్షణికులలో సమర్థులే లేరా? అని యడుగుదురేమో! లేకపోలేదు ఇది భాషాలక్షణ రచనకు బాటలు చూపిన మాన్యులను, పూర్వ లాక్షణికులను మఱచి మాటాడుట కాదు

వారికి వ్యాకరణరచనము ప్రధానలక్ష్యము కాదు

వారు, తమతమ ప్రధానాభిలషితమగు కవితాపరిశ్రమమునందే బద్ధాదరులై అమూల్యములగు మహాకావ్యములు వెలయించుచు నడుమనడుమ వినోదముగా వ్యాకరణములు రచించినవారుగాని వ్యాకరణమును శాస్త్రచ్ఛాయలతో లోకమున కందించుటకు దీక్ష వహించినవారు కారు

చిన్నయసూరి—అట్లు కాదు

కవితాభిలాషము, తన్నిర్మాణ కౌశలము, కలవాఁడయినను ఈతనికి శాస్త్రమార్గములందు పరిశ్రమాసక్తియు గౌరవాదరములును అధికములు.—

నీతి చంద్రికలో —

"పలుసందియములఁ దొలఁచును
వెలయించు నగోచరార్థవిజ్ఞానము, లో
కుల కక్షి శాస్త్ర మయ్యది
యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు జగతిన్."

అని యొక ప్రసంగమున అవకాశము కల్పించుకొని శాస్త్రాభ్యాసమునకు తన మాపులోఁగల విలువను వెల్లడించుట జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు —

ఈతనిది శాస్త్రతత్త్వము —

మూలతత్త్వములందే భేదమున్నది దానినిబట్టి దృక్పథములును భిన్నములగుట సహజము — భిన్నదృక్పథులలో తారతమ్యపరీక్ష తగినపని కాదు

అదియుఁగాక చిన్నయసూరి చిరకాలము ఆచార్యుఁడై బాలురకు ననేకులకు అధ్యాపనకృత్యము సాగించినవాఁడు ఎప్పటికిని బాలకులే

కాఁగల కవులని భావించినాఁడు తాను కవితారచనమునే ప్రధానముగ నెంచుకొని, ఒండు రెండు కావ్యములు రచించి లోకమున కిచ్చుట కంటె—— ఇట్టి కావ్యములు వేనవేలు సంతరింపవలసిన బాలుర భాషను పటుత్వముగల శాస్త్రమార్గమున చక్కదిద్ది తీర్చుట యెక్కుడు సార్థక మని యెంచినాఁడు శక్యమగునంత మేరకు శాస్త్రసంప్రదాయమును సరిపుచ్చుకొనుచు వ్యాకరణమనఁదగిన లక్షణగ్రంథమును రుచికరమగు రచనలో వెలయించినాఁడు ——

కావుననే తెలుఁగు శాబ్దికులలో చిన్నయసూరికిని, తెలుఁగు వ్యాకరణములలో బాలవ్యాకరణమునకును అనితరలభ్యమైన ప్రశస్తి ప్రచారములు దేశమున ఏనాఁడో పాదుకొన్నవి ——

ఇంత ప్రశస్తియు —— ఇంతటి ప్రచారమును గలుగుటకు సూరిలోఁ గల విశిష్టత యెట్టిది ? బాలవ్యాకరణమునకుఁగల ప్రత్యేకత యెట్టిది ? అని సమీక్షించుట యిప్పటి మన కుతూహలము ——

బాలవ్యాకరణ పీఠికనుబట్టి

[1] పూర్వవ్యాకరణములందు మిక్కిలి తక్కువయియున్న అచ్చ తెనుఁగుశబ్దముల లక్షణముగూడ, పూరింపవలయును

[2] సరళమయిన భాషతోఁ జక్కని వచనరచన గావించు నేరుపు బాలురకుఁ గలిగింపవలయును

[3] ప్రాచీనభాషనుండి బాలురకందింపవలసిన సుశబ్దములు సేకరించుట కయి భారతాదిగ్రంథములు పరిశోధింపవలయును ——

[4] వైశద్యాది సౌకర్యములకయి పరిచ్ఛేదకల్పనాది రచనా ప్రణాళికను సరిక్రొత్తరీతిని సంతరింపవలయును

[5] ఉపపాదనరీతి లలితముగా నుండవలయును

అనునవి సూరి సంకల్పముగాఁ దెలియుచున్నవి

ఈ సంకల్పములయిదును బాలవ్యాకరణమున నెంతవఱకు రూపొందినవో ముందు పరికించినచో నాతని రచనావిధాన విశిష్టత చాలవఱకు గోచరము కాఁగలదు ——

[1] బాలవ్యాకరణమున నున్న పరిచ్ఛేదములు పదింటిలో ఒక్కపరిచ్ఛేదము మాత్రమే తత్సమశబ్దములకుగాఁ పృథక్కరింపబడినది. అందును ఆచ్ఛిక పదోపయుక్తములగు సాధారణ విధానములు కొన్ని లేకపోలేదు —

సంజ్ఞా, సంధి, కారక, సమాస ప్రకరణములు తత్సమాచ్ఛికోభయ సాధారణములే యయినను వానిలో నుదాహరణ ప్రదర్శనాదులందు ఆచ్ఛిక పదజాలమే అధికముగాఁ గాననగును

మఱి - తక్కిన కృత్తద్ధితాచ్ఛిక క్రియా ప్రకీర్ణక పరిచ్ఛేదము లయి దును ఇంచుమించు ఆచ్ఛికపదములకే ఉద్దిష్టములయినవి —

వెరసి మాటగా జెప్పవలయునన్న బాలవ్యాకరణము మూఁడు వంతులాచ్ఛికవిషయకము—ఒక్కవంతుతత్సమ విషయకముగా తేలినిది —

పూర్వవ్యాకరణములందలి యెట్టి కొఱఁతను వారించుటకయి సూరికి వ్యాకరణరచనాప్రవృత్తి కలిగినదో ఆ కొఱఁత యీరీతిగా తీఱిపోయినది —

[2] సూరికి వచనరచనముపయి మక్కువ యధికము తద్రచనమున అతనికున్న కౌశలమును అసాధారణము—అసాధారణ మన్నది మామూలు మాట కాదు ఆ వచనశైలి సాటిలేనిది — అతిరథులయిన రచయితలు పలువురు ఆ శైలికై నూఱేండ్లనుండి తపస్సులు చేయుచు తంటాలుపడు చున్నారు అదెట్టి యింద్రజాలమోగాని పట్టుదొరికినది కాదు

తఱచిచూడ, వ్యవహారభాషలోని జీవకళలుగల పలుకుబడు లన్నిటిని ప్రాచీన భాషతో మేళవించినట్లు మాత్రము గోచరించును ఏయే పాళ్ళలో కలిపియుండునో! అదే తెలియకున్న రహస్యము—

పరవస్తువారు తెరచాటువారు—

అంజనము లెన్నివచ్చినను అమృతాంజనపు పాళ్లుమాత్రము కుదురునవి కావు—

ఎంత యత్నించినను ఆ శైలి ఉన్నదున్నటులు మనకబ్బుట దుర్ఘ టము— అది అతని సొత్తు

అట్టినేర్పు బాలురకుఁ గలిగిన బాగుండునని అతనికి ముచ్చట —అందు లకే అతిరమ్యము, అహ్లాదకరమునగు వచనకావ్యమును ఆదర్శముగా రచి యించి బాలుర కందించుచు

"తుదముట్టఁగ నీకబ్బము
పదిలముగాఁ జదివినట్టి బాలుర కోలిం
బొదలును భాషాజ్ఞానము
కుదురుం గొదలేక నీతికుశలత్వంబున్"

అని పలికినాడు —

అది ఆదేశమో! ఉపదేశమో! అభిలాషమో! ఆనందమో!

[3] అట్టి వచన కృతులు రచించుటకు వలసిన భాషాజ్ఞానము బహు లక్ష్యములందు పరిశ్రమ చేసినంగాని సిద్ధింపనేరదు అంతటి పరిశ్రమ బాలురకు అశక్యము — దీనికయి భాషాసమష్టి స్వరూపనిరూపకమగు లక్షణగ్రంథము కుదిరినయెడ బాలురకు సౌకర్యము కలుగునని సమాలోచించినాఁడు

సామగ్రిని కూర్చుకొని వ్యాకరణము రచింప సంకల్పించినాఁడు

వ్యాకరణరచనమునకు సామగ్రిని సేకరించుటయన్న సాధారణ కృత్యము కాదు

పూర్వకవులు ఏయే పదములను ఏయేయర్థములలో ఏయేరూపము లతో ప్రయోగించినారు? ఏ రూపములకు ప్రచారమధికము? వేనికి విరళము? మున్నగు చూపులతో పరిశీలించి భాషాసమష్టి స్వరూపము నాకళించుకొన వలయును

ఈ పనికి చాలవరకు తాళపత్ర గ్రంథ పరిశోధనము గూడ ఆవశ్యక మగును సూరి కాలమునకు మన గ్రంథములు కొన్ని ముద్రితములు లభించి నను వానిలో పెక్కు తావులందు వాస్తవిక శబ్దరూప నిర్ణయమునకయి తాళపత్రములనుండి శబ్దములు సేకరించుట అన్నిటికన్న క్లిష్టకార్యము

అట్టి పరిశ్రమలకోర్చి సూరి ఒక్కభారతమునే కాదఁట, 'పెక్కు లక్ష్య ములు' పరికించితినని పీఠికలో వక్కాణించుచున్నాఁడు ఆ పరికించుట ఒక్క మాఱు మాత్రమే కాదఁట 'పలుమాఱు'ని తెలుపుచున్నాఁడు ఆ పలుమా

అయినను ఆదరబాదరగా కాదఁట, 'సావధానముగా' చూచితినని చెప్పు చున్నాఁడు సావధానముగనైన వట్టిచూపు కాదఁట, 'పరిశీలించితి' నని పలుకుచున్నాఁడు

ఈరీతి పరిశ్రమతో నాతనికి రచనాసామగ్రి సిద్ధమయినది కాని అంతతో కర్తవ్యము ముగియలేదు, ఆపిమ్మట రచనావిధాన మెట్లుండ వలయునన్నది మిక్కిలి క్లిష్టసమస్య ఆ నిర్ణయ మాతనికి తృప్తికరముగా తేలుటకు ఎంతో శ్రమింపవలసి వచ్చినది

రచన మారంభించి యట్లుకాదని యింకొక దీరున - అది కాదని మఱొకతీరున - మార్పులు గావించుకొనుచు, ఒకదానికంటె నొక దాన నిగ్గుతేల్చుకొనుచు, నాలుగు విధముల రచనలు కావించి తుదికి వానినెల్ల రద్దుచేసి అన్నింటి సారముగా బాలవ్యాకరణము నావిష్కరించినాఁడు ఇన్ని వడఁబోఁతలతో బాలవ్యాకరణము బయలుపడినది

ఈ రచనకు జరిగిన సన్నాహ వివరములను సంక్షిప్తముగ నివేదింతును,

[4] సూరికి ముందున్న తెలుఁగువ్యాకరణములు చింతామణి వికృతి వివేకాదులు సంస్కృత శ్లోకములుగను, భూషణచూడామణ్యాదులు తెలుఁగు పద్యములుగను, ఛందోబద్ధములయి రచింపఁబడినవి క్షుణ్ణమయిన ఆ పూర్వ మార్గముననే పట్టి సూరి తొలుత పద్యరూపముననే రచనము సంకల్పించి నాఁడు

శబ్దచింతామణి చేతఁబట్టినాఁడు

"ఆద్యభాషకు నేఁబది యక్షరములు
ప్రకృతి కవి పదికొండవడి వఱలు నిందు
ముప్పదాఱగు నవి యన్యములును శబ్ద
యోగవశమునఁ బెఱుసొచ్చు నుదధిశయన "

అని పద్యాంధ్రవ్యాకరణము నుపక్రమించినాఁడు అది రవంత సాగినది సంజ్ఞాప్రకరణ మయిన సమాప్తము కాకముందే కాఁబోలును —

"సంక్షిప్తముగ నుండవలసిన వ్యాకరణము సూత్రప్రాయముగ నుండఁ దగును గాని శతకములందువలె మకుటములు దిద్దుకొనుచు ఈ పద్దెములేల!" అని పొడగట్టినది.

అట్లె యాలోచించి అంతటితో ఆ పద్యరచనను నాఁపినాఁడు.

సూత్రరచనమువంక పూర్తిగా దృష్టి మరలినది

సూత్రములనఁగనే బుద్ధికి గోచరించునవి పాణినిసూత్రములు పాణినీయమున తాను గడించిన పటిష్ఠమగు పాండితినిబట్టియు, ఆ యష్టాధ్యాయితోడి చిరపరిచితిని బట్టియు, ఆ ప్రశాఖికయందు తన కేర్పడిన అభిరుచిని బట్టియు, దానినే ఆదర్శముగ నెంచుకొని అదే ఫక్కిలో -

శ్రేయః ప్రమేయవిజ్ఞానమ్ -
సిద్ధిర్లోకతః -
శాసనమిదం దిక్ప్రదర్శనమ్ -

అత్ర ద్వివిధా అదిరుప్వ్రకా ఐచావచో బిన్దు యుగమ్. అని సూత్రాంధ్ర వ్యాకరణము నుపక్రమించినాఁడు

ఈ రచనము చాలదవ్వు సాగినది - సమాప్తికి సమీపించి యుండును అంతట ఒక్కపరి సింహావలోకనము గావించుకొన్నాఁడు

"సూత్రములు నొగసుగా కుదురుచుండుట తృప్తికరమేగాని తెలుఁగు వ్యాకరణము సంస్కృతమున నున్నచో తెలుఁగు బాలురకు పలువురకు అందుబాటుగా ఉండునో! ఉండదో!"

అని సందేహము తట్టినది - సావధానముగా బాలురచేఁ జదివించి చూచినాఁడు అది వారికి సులభసాధ్యము కాకుండుట గ్రహించినాఁడు పిమ్మట ఆ సూత్రములను ఆ యష్టాధ్యాయి పద్ధతినే తెలుఁగున అనువదింప నారంభించి 'శబ్దానుశాసన' మని యొక గ్రంథమును, దానికిఁ గొంత మెఱుఁగు వెట్టి 'శబ్దలక్షణ సంగ్రహ' మని వేఱొక గ్రంథముచు రచించినాఁడు — అందు -

'డాకు లకారంబగు'—(ఎట్టిడాకో!)
'కగ చస పమవలు'—(ఏమగునో!)
'సకారంబునకు'—(ఏదివచ్చునో!)
'నీమీలకుంగాదు'—(ఏదికాదో!)

అంతయు అస్పష్టమే, - ఈ రీతిగా అనువాదము నడచినది.

ఈ సూత్రములలో సంస్కృతము తెలుఁగుగా మాఱినదేగాని అష్టా ధ్యాయిపద్ధతి మాఱదయ్యెను —

అష్టాధ్యాయి యనఁగా ప్రపంచమునఁగల సూత్రవాఙ్మయమున అభిజ్ఞులకెల్లరకు అబ్బురపాటు గలిగించిన అద్వితీయము, అభేద్యమునగు ఒక పద్మవ్యూహము—

దాని ప్రణాళికలో విప్పరాని గొప్ప చిక్కొకటి గలదు ఏదియన — అందలి సూత్రములకు ప్రక్రియానుకూలమగు ప్రకరణక్రమ ముండదు ఉండుటకు వలనుపడదు ప్రకరణానుకూలముగ సూత్రక్రమమును మార్పఁదలఁచి ఏ ఒక్కసూత్రము నయిన దాని స్థానమునుండి కదలించితిమా ఆ వ్యూహమెల్ల తలక్రిందులగును

మఱియు సాధారణముగ ఏ సూత్రమును అర్థబోధమున స్వయం సంపూర్ణము కాదు అనఁగా ముందువెనుకలనున్న యితర సూత్రములందలి పదములు కొన్నిటినిఎరువుతెచ్చుకొని సమన్వయించుకొన్నంగాని సూత్రార్థము తేటపడదు

ఒక్కరూపమును సాధించుటకయి వలసినసూత్రములు, ఒక్కచోఁ గాక పెక్కుతావులందు దూరదూరముగ విప్రకీర్ణములయి యుండుటచే ప్రక్రియకై వానిని ఏర్చికూర్చుకొను క్లేశము ఆ మార్గమున అధ్యేతలకు తప్పదు

సూరికాలమునకు పాణినీయమున సులభములగు సిద్ధాంతకౌముది మున్నగు నవీన గ్రంథముల యధ్యయనమే ప్రచారమునకు వచ్చియున్నను నీతఁడు ప్రాచీనాధ్యయన సంప్రదాయాభిరుచి కలవాఁడగుటచే క్లిష్టమయినను అష్టాధ్యాయి పద్ధతినే కాశికావృత్త్యాది మూలగ్రంథములయందు నెక్కుడు పరిశ్రమ మొనరించినవాఁడు—ఇది వట్టి యూహకాదు దీనికి నాధారములు బాలవ్యాకరణముననే కొన్ని గోచరించును - అవి మనుముందు చూడఁ గలరు—

ఇట్లు పాణినీయపరిశ్రమమున ప్రాచీనసంప్రదాయ సంస్కారము, అతనిలో దృఢముగా రూఢమయి వీడకుండుట వల్లనే పైని జూపిన యాతని రచనములయందు ఆ పద్ధతియే అనువర్తించినది—

కాని ఆ పద్ధతిలో బాలురకు సూత్రార్థములును, ప్రక్రియాక్రమమును బోధపడుటకుఁ గొంత క్లేశమున్నటులు అనుభవముచే గుర్తించినాఁడు–

ఆ పిమ్మట, ఇది పనిగాదని తన మొదటి రచనమునందలి ముఖ్యాంశములనెల్ల సేకరించి వానిని వర్గీకరించి ప్రకరణములు విభజించినాఁడు ప్రతి ప్రకరణమునను ఏ శబ్దమును సాధించుట కయినను తడవుకొనఁబని లేకుండ ఎక్కడికక్కడ ప్రక్రియాక్రమము నేర్పఱచినాఁడు ప్రతిసూత్రమును ఇతర సూత్రాపేక్ష లేకుండ సమగ్రముగా అర్థవంతమగునటులు సంతరించినాఁడు.

పయి నాలుగు రచనలకు సారభూతముగ తుదికి బాలవ్యాకరణము నావిష్కరించినాఁడు

చేఁదయిన ఓషధులనుండి తియ్యని రసాయనము దించినాఁడు

ఇట్టి తన రచనాపరిశ్రమ ప్రకారము నంతను

"మును మదుపజ్ఞం బగుచున్
దనరిన వ్యాకృతిని సూత్రతతి యొకకొంతన్
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగుభంగి దగన్

అని ఒక్క పద్యముతో వెల్లడించినాఁడు —మఱియు,

"తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందినవారల్
తనరఁగ నీ వ్యాకరణం
బున మూలంబయిన కృతిని బోలఁగనఁ దగున్

అని తన మొదటి సంస్కృత రచనము నందలి విషయములు పెక్కులు విడిచి పెట్టితిననియు విశేషములు తెలియగోరువారు ఆ సంస్కృత రచనము చూచు కొండనియు సూచించియున్నాఁడు దీనినిబట్టి ఆ సంస్కృత రచనము సమాప్తప్రాయమై యుండవచ్చునని తోఁచుచున్నది — అది మనకు లభింప దయ్యెను ఎవరో వ్రాసికొన్న అస్తవ్యస్తమయిన కొంతభాగము లభింపఁగా దానిని యథావకాశముగ సంస్కరించి ఆ భాగమును,— పద్యాంధ్ర

వ్యాకరణ శబ్దానుశాసన భాగములను ఆంధ్రసాహిత్య పరిషత్తు ప్రకటించినది ఇప్పటికి అవే మనకు నాధారములు —శబ్దలక్షణ సంగ్రహము వేర్వేఱ కొన్ని ముద్రణము లందినది లభించినవానిలో ఇదే కొంత కొఱంతలేనిదిగా గోచరించును.

ఇ౧౬ ంచనారీతిలోని లాలిత్యము —

[౯] రచించునది క్లిష్టము శుష్కమునగు వ్యాకరణమే యయినను దానిని ప్రతిపాదించురీతులు లలితముగా నుండవలయునని యాతని కుతూహలము

కోమలహృదయులు లాలిత్యమును తమపరిసరము లన్నింటను నభిలషింతురు.

రచనాలాలిత్యము శబ్దగతముగా అర్థగతముగా

రెండురీతుల నుండవచ్చును —

I వాక్యమున మృదువయిన శబ్దములతో ఇంపుగొలుపు కూర్పు కుదిరినయెడ శ్రావ్యత యేర్పడును — ఆ కూర్పు గణబద్ధము కూడ నయినచో మఱింతగా శ్రవణసుఖము చేకూరును —

అది శబ్దలాలిత్యము —

II. అమంగళము – జుగుప్స – పారుష్యము – మున్నగువాని వలన ఏ విధముగను వెగటు తోపకుండ విన్నతోడనే చదువరుల హృదయములకు ఉల్లాసము కలిగించునది అర్థలాలిత్యము

ఇట్టి శబ్దార్థలాలిత్యము కావ్యములందు నభిలషింపవలసినదిగాని వ్యాకరణములయందు దాశింపఁ దగినది కాదు

అయినను వీలుపడినంతవఱకు లక్షణగ్రంథము సయితము రమణీయతను లాలిత్యరీతులకును దూరము కారాదని సూరితలంపు —

కావుననే —

"అనయము లలితోక్తులతో
నొనరుపడంగూర్చి శబ్దయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్"

అని రచనారంభమున తనకుతూహలమును - వెల్లడించియున్నాఁడు. ఇట్టి యుత్సాహము అనితర లాక్షణిక సాధారణము —

అత్యంతాభినంద్యము—

పలుతావులందు వచనమయినను అప్రయత్నముగ గణబద్ధమయి తాళలయానుకూలమయి శ్రుతిహితమగుట సూరిరచనలో గోచరించు - ఒక ప్రత్యేకలక్షణము —నీతి చంద్రిక - అంతగా శ్రవణరమణీయమగుటకు ఇది గూడ కొంతకారణము —

కావ్యవచనములందెగాక యీతని సూత్రములందును, వివరణము లందును ఉదాహరణములందును అట్టితీరే కానవచ్చును ఇది మాత్రము ఏ వ్యాకరణములందును లేనివింత —

చూడుఁడు —మచ్చునకు కొలఁది తావులు —

సూత్రములలో,—గణబంధము

[1] పట్టి - వర్ణ - కంబు - హేతు - వులగు - గుణ - క్రియల - కగు (ను)

[2] ద్వంద్వంబు - నందుబు - కారంబు - నకురవ - ర్ణంబువి - భాషను (గలుగు - చుండు)

[3] అందు - వరుసను - రేండేసి - ప్రథమ - మధ్య - మోత్త - మంబుల - నంబడు —

ఇఁక వివరణ వాక్యములలో —

[1] మీరలు - పెద్దలి - త్యాదులు - ప్రాయిక - గ్రహణంబు - చేరక్షి - తంబు లయ్యె

[2] ఏనిప్ర - భృతిశబ్ద - ములుగొన్ని - నియమసా - పేక్షంబు - లయియుండు - (నచట - నచట )

[3] చైత్రుని - చేతమై - త్రుండుకొ - ట్టంబడి - మడిసెని-త్యాదిసి-ద్ధంబ - యయ్యె—

ఇంక ఉదాహరణములలో.—

[1] ముక్కంటి - కడలిరా - చూలి - నలువ

[2] మూఁడుజ - గములుము - జ్జగములు - మూఁడులో - కము లుము - ల్లోకములు (గాన - నయ్యె )

[3] అన్న - దమ్ములు - తల్లి - దండ్రులు - ఊరు - వల్లెలు - ఆలు - మగలు (౯)

ఈ రీతిగా రుచిరమగు నడకతీరుతో కుదురుపడిన పయివాక్యముల కూర్పు అటు రచయితకును, ఇటు చదువరికిని నెట్టి యుల్లాసము కలిగించునో యోజింపుఁడు —

విస్తరభీతిచేఁ జూపనయితినిగాని యిట్టివి ఐదులు పదులు కావు, అనేకములు గలవు

ఇఁక అర్థలాలిత్యము

వ్యాకరణమున ఉదాహరణములను లక్షణ సమన్వయమునకు సరిపడునట్లు చూపినఁ జాలును

నిజమునకు వానికుండవలసిన బాగు అంతమాత్రమే.—

కాని - సూరికి - ఆబాగు చాలదు

ఉదాహరణము శుష్కముగా నీరసముగా నుండరాదు

విరసము పరుషము నగు నర్థము తోఁపరాదు

సరసమయి చదువరికి ఉల్లాసజనకముగా నుండవలయును,

అని అతని చూపు —

మచ్చునకు కొలఁది తావులు —

I. "తిర్యగ్జడంబులు వాచ్యంబులగునపుడు లిఙ్గాట్టుల ప్రథమ బహు వచనంబున కేకవచనంబగు " (క్రియ - 25)

చిలుకలు పలికెను - చిలుకలు పలుకును

అని దీని కుదాహరణము

ఇచట 'కాకులు కూసెను' 'కాకులు కూయును' అని యుదాహరణను చూపినను లక్షణసమన్వయమునకు లోటు కలుగదు

అట్లుచూపరాదా ?—చూపవచ్చును.—చూపఁడు

అట్టివాక్యములు వినుటకు బాలకులచెవులు ఏవగించుకొనును.

ఆ చెవులకు సోఁకవలసినవి చిలుకపలుకులుగాని కాకి యఱపులు కావని ఆతని దృష్టి—

ఆచూపులోని సౌకుమార్యము గుర్తింపుఁడు. ఈ చూపుతో నాతని యుదాహరణములు పరికింపుఁడు —

సూరిది—మిక్కిలిసరళప్రకృతి—అనఁగాద్రుతప్రకృతి అన్న మాట ద్రుతప్రకృతుల యొద్దఁ బరుషములకుఁ దావులేదు.

అవియెల్ల సరళములుగ మాఱక తప్పదు

ఇంతయేల ! ఈ యేకవచనముకే ఉదాహరణము చూపవలసిన యిదే సందర్భమున ఇతరలాక్షణికులు, సింహములు చరించెను— సింహములు పరాక్రమించెను — పులులు కఱచెను — పశువులు వచ్చెను—పక్షులు వ్రాలెను — ఇత్యాదిగా భీకరములు, నీరసములు నగు సన్నివేశములు చూపినవారే కానంబడుదురు — అది వారివారి దృష్టులలోని తారతమ్యము

ఈ యుదాహరణ మొక్కటియకాదు ఈ చూపుతోఁబరికించినయెడ ఇంచుమించు అన్నియు నిట్టివే యనిపించును —

ఈతని యుదాహరణముల తీరు, తన యధ్యాపన మందిరమున (class room) బాలకులను బాలికలను ఎదుటఁ గూర్చుండఁబెట్టుకొని, ఒక్కొకరిని వాత్సల్యముతోఁ బలుకరించుచు బుజ్జగింపుతో బోధించుచున్నటులు గోచరించును—

కొన్నిటిని తిలకింపుఁడు,—

"వినుఁడు బాలకులు! వినుఁడు బాలకులార!

వచ్చితిరి కాంతలు! —వచ్చితిరి కాంతలార!

వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు — వీరుముగ్వురు శ్రీ భూనీళలు.—

వానివంశము శ్రీమంతము — వీనివంశము గుణవంతము

ధనముచేత సౌఖ్యంబు గలుగు — విద్యచేత యశంబు గలుగు

రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులం జదివిరి

విద్యాశాలియగు పురుషుని సకలజనులు సమ్మానింతురు

పురుషార్థంబునకు యత్నింపవలయును

దేవదత్తునకు మోక్షమునిచ్చగలదు

అధ్యయనము వలన డస్సె — పాపంబువలన నేవగించె

భోగంబులవలన విరమించె — జ్ఞానముఁబట్టి ముక్తుఁడగును

కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను

సర్వంబునం దీశ్వరుఁడుండును—సర్వం బీశ్వరునియం దుండును

జాబిలి తోతెంచుడుం గువలయంబులు వికసిల్లె

మేఘములు గర్జిల్లెను — వానలు కురిసినం బంటలు పండును

మీకు మేలు గలిగెడును — మీకు మేలు గలుగుతను

సత్యము సర్వశ్రేయము అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు

భూతదయాళురగు మహాత్ములకు శ్రేయంబుఁ గలుగును —

దీర్ఘాయులరగుఁడు — శుభంబగును.

ఈ వాక్యములలో ధర్మతత్త్వములు — నీతినియమములు—అభ్యుదయములు — ఆహ్లాదములు — శుభాకాంక్షలు — ఎన్నెన్ని యిమిడి యున్నవో ఎంత సరళములో నిదానింపుఁడు —వ్యాకరణ కార్యములకయి యిట్టి యుదాహరణములు చూపిన రచయిత హృదయ మెట్టిదయి యుండునో ఊహింపుఁడు —

అవసరము కలిగినను సుకుమారులు క్రూరవాక్కులు పలుక లేరు —

శాపార్థమున వచ్చు ఎడున్, తన్ — అను ప్రత్యయములకు లక్ష్యములు చూపవలసి,

నీకు రాక్షసత్వంబు గలిగెడును
నీకు రాక్షసత్వంబు గలుగుతను

అని యుదాహరించినాఁడు ఇది సామాన్యదృష్టికి తిట్టుగనే గోచరింపదు — ఇదొక తిట్టా యని పెక్కుమంది వెక్కిరింపను వచ్చును — అంతకన్న గట్టిగా తిట్టుట ఆతనికి శక్యమే కాదు —

ఇంకొక తీరు—

రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు
విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను
రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు
జనకుఁడు రామునకుం గన్య నిచ్చెను
రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబు గాదు
రాముఁడు వాలి నొక్క బాణంబునఁ గూలనేసె
లంకం గలకలంబు పుట్టె
రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగఁ
పుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె —

ఇట్లు విశ్వామిత్ర యాగరక్షణ మొదలు రావణ సంహార పర్యంతము రామాయణ కథలోని ప్రధాన ఘట్టములు జ్ఞప్తికిఁ దెచ్చుట బాలుర చిత్త సంస్కారమునకు నెట్టి యుద్బోధకమో యోజింపుఁడు –

ఇంకొక చిన్న వినోదప్రసంగముతో ఈ మార్గము విడిచి ఇతర విశేషములవంక మరలుదము—

"జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగానగు."

వాఁడు పూవులు దెచ్చె
ఆకె సొమ్ములు దాల్చె
వాఁడిల్లు వెడలె ––

ఇచట ద్వితీయ ప్రథమగా మాఱినది

పయి సూత్రమునందును లక్ష్యములందును దెరచాటైతొంగి చూచు ఆ వినోద సన్నివేశముపైపు దృష్టి సారింపుఁడు

మనదేశమున సాధారణముగా సంసారభారము వహించుటలో భర్త మొదటివాఁడుగను, భార్య రెండవదిగను నుండుట పరిపాటి – దీనినిబట్టియే భార్యకు ద్వితీయ అనుపేరు ఏర్పడియుండును––

ఒక్కొక సంసారమున దంపతులలో భర్త మేదకుఁడయి భార్య చురుకయినది కావచ్చును అపుడు భార్య తానే పూనుకొని సంసారము దిద్దుకొను పూచీ కలదిగా నుండుట సహజము ––

అనఁగా, ద్వితీయగా నుండవలసినది ప్రథమగా మాఱవలసి వచ్చినదన్నమాట ––

ఎందువలన ? జడసంబంధి ద్వితీయ కాఁబట్టి––

ఇట్టి సందర్భములందు ఆ భార్య భర్తను విలువతో చూడదు—అంతగా లక్ష్యపెట్టదు ––ఆ పరిస్థితిలో, పాపము ! వాఁడొకనాఁడు అంగడికిఁబోయి ఆమెను సంతోషపెట్టుటకు

పూవులు దెచ్చెనఁట –

ఆతనిని రంజించు మనసు లేనిదిగావున ఆ పూవులు ముడుచుకొనక ఆమె మఱేవో సొమ్ములు దాల్చినదఁట —

దానితో వాని మనసు చిన్నవోయినది — ఆ యవమానమునకు కోపముగూడ వచ్చినది — రాదామఱి!

వచ్చి యేమి చేయఁగలఁడు? ఏమనఁగలఁడు?

ఒకటి యని రెండనిఁకించుకోవలయును — మఱింత చిన్నతనము — ఏమి చేయుటకుం దోఁచక కొంతతడవు అటునిటు తిరిగివ త్తమని వాఁడిల్లు వెడలిపోయెనఁట —

పోనీ తనకు లోఁకువగు భార్యనే మొదట చేసికొనరాదా? అనుట కును వలనుపడదు —

ద్వితీయప్రాప్తించు విధిసూత్రము వేఱుగాఁ గలదు —

"కర్మంబున ద్వితీయ యగు"

కర్మనుబట్టిగదా ద్వితీయ ప్రాప్తించుట!

అమాయకపుమగని సంసారమునందలి చిన్న వినోద సన్నివేశము సూత్రోదాహరణములందు ఎట్లు స్ఫురించుచున్నదో నిదానింపుఁడు —

ఈ సందర్భమున ఇతరలాక్షణికుల యుదాహరణములు పరికింతుమేని "రథమెక్కిదిగెను—, చెట్టెక్కిదిగెను" ఇత్యాదులు కాననగును —

రసములేని చప్పని మాటలు —

నేనెఱిఁగినంతలో ఈతని కుతూహలము, ఈ చూపు ఇతరులలో కానరాదు — ఇట్టి ముచ్చట లనేకములు గలవు —

ఈ రీతిని సూరి మొదటిసంకల్పము లయిదును ఆతని రచనలో రూపొందిన ప్రకారమును ఇప్పటికి స్థూలముగాఁ బరికించితిమి.

ఇఁక బాలవ్యాకరణమునఁ గల యితర విశేషములు కన్గొందము —

అనఁగా —

1 సూరి శాస్త్రపరిశ్రమ
2 తత్సంస్కార పటుత్వము
3 పారిభాషిక జాగరూకత
4 సూత్రపటుత్వము
5 భావగంభీరత
6 సంక్షేప నైపుణి
7 వైశద్య ప్రయత్నము
8 ప్రయోగప్రామాణ్యదృక్పథము
9 సభ్యత
10 సౌమ్యత.

మున్నగు విశేషములను పయిపయి మాటలు గాక బాలవ్యాకరణపుఁ బుటలే త్రిప్పుచు అందే యన్వేషింతము

అన్నియుఁ గానవచ్చును

చిన్నయసూరి వ్యాకరణము చిత్రశాలవంటిది

అందలి విశేషములు అనవకాశముచే అల్పకాలములో దర్శింపఁగోరు మిత్రులకు నా గచ్ఛద్వ్యాఖ్య (running commentary) ఎంతవఱకు నుపచరించునో !

కాలము తక్కువ—కాంచవలసినవి పెక్కులు —

[1] సూరి యనేక శాస్త్రములందు నసామాన్యమగు ననుభవము గడించిన ప్రతిభాశాలియని యాతని జీవితచరితము తెలుపుచున్నది —

ఆ శాస్త్రములలో వ్యాకరణశాస్త్రమున నాతనికిఁ గల పాండితీపటిమ యెట్టిదో బాలవ్యాకరణమే తెలుపఁగలదు

పాణినీయమున నర్వాచీనములగు సిద్ధాంత కౌముద్యాదులందె గాక ప్రాచీనములగు కారికావృత్త్యాదులందు సహితము నాతఁడు పరిశ్రమించి నటులు బాలవ్యాకరణముననే యనేకములు సూచనలు గలవు —

[1] "నిర్ధారణషష్ఠికి లోపల వర్ణకం బగు" (కారక—16) అను సూత్రమునకు సూరి చూపిన యుదాహరణములలో,

I 'మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు'
'అధ్వగుల లోపలం బాలుఁవాఁడుశీఘ్రగామి

అను వాక్యములు గలవు —

II 'మనుష్యాణాం క్షత్రియశ్శూరతమః'
'అధ్వగానాం ధావన్తశ్శీఘ్రతమాః'

అను వాక్యములు కారికావృత్తిలో "యతశ్చనిర్ధారణమ్" అను సూత్రమునకు వామనుఁడు చూపిన యుదాహరణములలోఁ గలవు —

ఈ సందర్భమున సిద్ధాంతకౌముదిలో ;

III. 'నృణాం ద్విజ శ్రేష్ఠః'
'గచ్ఛతాం ధావన్ శీఘ్రః'

అను వాక్యములు కానంబడును —

పయిమూఁడింటను గల పోలికలు పరిశీలించినచో సూరి వాక్యములకు కారికావాక్యములే మూలములగుట సుస్పష్టముగాఁ దెలియఁగలదు

కారికావాక్యములను సూరి పరికింపక కౌముదిని మాత్రమే పరికించిన యెడల నీ తెలుఁగు వాక్యముల విన్యాసము, ఇట్లుండుట మిక్కిలి యసంభవము

ఇట్టిపోలికలు గల మఱిరెండు తావులుకూడఁ బరిశీలింపుఁడు —

[2] కారికావృత్తియందు,

"ధాతోః" అను నధికారసూత్రము నద్ద
"అధికారోయమ్," "ఇత ఊర్ధ్వం యదనుక్రమిష్యామః
తద్ధాతోరితి వేదితవ్యమ్."

అను వివరణవాక్య మొకటి కాననగును ఈ యొక్కచోటనేగాక అధికార సూత్రము లన్నిటియొద్దను నిట్టివాక్యమే కానంబడును

అది యా గ్రంథశైలిలోని తీరు —

బాలవ్యాకరణమున,

"ధాతువునకు — ఇది యధికారసూత్రంబు
ఇంక నెయ్యది యుపక్రమింపంబడు
నయ్యది ధాతువున కగునని యెఱుంగునది."

అని సూరి పయి కారికావాక్యమును తు-చ-తప్పకుండఁ దెనిఁగించినటులు సుస్పష్టముగాఁ దెలియుచున్నది —

సిద్ధాంత కౌముదిలో;

ఈ సూత్రము నొద్దఁగాని మఱి యే యధికార సూత్రము నొద్దఁగాని యిట్టి వివరణవాక్యమే కానరాదు

ఇట్టి వాక్య ముండుట కౌముదికి శైలియే కాదు –

[3] కారికావృత్తియందు,

1. అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః = ... ఉదిచ్చ సవర్ణానాం గ్రాహకో భవతి,—

2 తపర స్తత్కాలస్య – తపరోవర్ణః ......సవర్ణస్య గ్రాహకో భవతి

3 ఆదిర న్త్యేన సహేతా = ఆదిః ...... మధ్యపతితానాం వర్ణానాం గ్రాహకో భవతి — అను మూఁడు సూత్రములందును ప్రతి వివరణ వాక్యమునను అవృత్తమయిన గ్రాహకశబ్దమును గుర్తుపట్టుఁడు

వర్ణములలోఁ బరస్పర సవర్ణములను నిర్దేశించునట్టి యిదే సందర్భమున సూరి,—

"దంత్యతాలవ్యంబులయిన చజలు **సవర్ణంబులు**"

"తాలవ్య చకారంబు దంత్యచకారంబునకు దాలవ్యజకారంబు దంత్యజకారంబునకును **గ్రాహకములని** తాత్పర్యము"

అని వివరించినాఁడు

ఇచట కారికావృత్తిలోని 'గ్రాహకోభవతి' అను వివరణపద్ధతి తనకు స్ఫురించి సరిగా ఆ 'గ్రాహక' శబ్దము నే ఉపయోగించుట గమనింపఁదగినది

సిద్ధాంత కౌముదిలోఁ బయిసూత్రములు మూఁడింటి యొద్దను 'సవర్ణస్య సంజ్ఞాస్యాత్' అనురీతి వాక్య విన్యాసమేగాని 'గ్రాహకో భవతి' అను విన్యాసము కానరాదు,

అది కౌముది శైలి కాదు — పరిశీలింపుఁడు

ఇట్టి యాధారములనుబట్టి సూరి పాణినీయమునఁ బ్రాచీన గ్రంథము లందుఁగూడ నెక్కువగాఁ బరిశ్రమించినట్లు తెలుచున్నది —

ప్రసక్తి కలిగినదిగాన నీ సందర్భమున నే యాలకింపవలసినది ఒక్క మాట ,—

సంస్కృతమునందలి **యీ** సవర్ణతా విధానమును నిగూఢముగా,

"అర్ధ న్త్యః—తాలవ్యశ్చుర్వక్రసాన్యత్—మిథస్సవర్ణశ్చ"

అని తెలుఁగు వ్యాకరణమునఁ దొలుతఁ బ్రవేశపెట్టినది శబ్దచింతామణి —

చ—జ లకు స్థిరసంజ్ఞ రాకుండుటకును చ జ లతోపాటు పరుష సరళ సంజ్ఞలే కలుగుటకును ఈ విధి యుద్దిష్టమయినది

తెలుఁగు వ్యాకరణమున దీని ప్రయోజనము గ్రహించి

"సూత్రద్వయే సవర్ణత్వాత్ గృహ్యేతే దన్తజౌ చజౌ
సా సంజ్ఞైవ తయోస్తేన నాన్యా సంజ్ఞా ప్రవర్తతే"

అని వికృతి వివేకకర్త వివరించియున్నాఁడు

పిమ్మట బాలసరస్వతి చింతామణి విహితమగు సవర్ణతకుఁ బ్రయోజనము గుర్తింపక, వికృతివివేకకారికను మూలసూత్రమున ననుసంధించు కొనక, యిది యతిప్రాస విషయకమని భ్రాంతిఁజెంది, ప్రకరణమును గమనింపక, ఛందోవిషయకముగ దీనిని సమన్వయించినాఁడు మూలసూత్రమునకుఁ ద్రోవ తప్పించినాఁడు

అది చూచి, అప్పకవ్యహోబిలపండితాదులు గతానుగతికులయి యీ సావర్ణ్యమును యతిప్రాసమైత్రికే ముడివెట్టినారు

ఎక్కడి పరుషాది సంజ్ఞలు ! ఎక్కడి యతిప్రాసలు !

సందర్భములేని సమన్వయము — మూలకారుల యుద్దేశమునకు విరుద్ధము — వ్యాకరణకార్యములకు భంజకము —

అది పరిశీలించి సూరి పరుషాది సంజ్ఞలు నిరూపించు సందర్భమున, ఈ సావర్ణ్యమును విధించి తాలవ్యచజలు దంత్యచజలకు గ్రాహకములగునని విశదీకరించినాఁడు

ఈ సావర్ణ్యము చ జ లకు, పరుషసరళసంజ్ఞా సంపాదనమునకై యత్యావశ్యకమను చింతామణి వికృతివివేకముల యుద్దేశమును, ఇంతమంది లాక్షణికులలోఁ జిన్నయసూరి యొక్కఁడే గుర్తింపఁగలుగుట యొన్నఁదగిన యంశము —

సూరి ప్రాకృతమునందుఁగూడఁ బరిశ్రమించినవాఁడని ప్రతీతి గలదు

ప్రాకృతసమములకును ప్రాకృతభవములకును ఉదాహరణములు నిర్దేశించు తావున వేనినో పది ప్రాకృత శబ్దములను జూపుట పాండితీ సూచకము కాదుగాని ఒక చిన్నయంశము పయిప్రతీతికిఁ బోషకముగా బాలవ్యాకరణముననే గానవచ్చుచున్నది

ఇత్సంజ్ఞాస్వరూపమును నిరూపించుపట్టున (తత్సమ 19)

"కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి
ప్రయోగించునపుడు మానంబడు వర్ణమిత్తునాఁబడు."

అని బాలవ్యాకరణమున నొకవాక్యము గలదు

ఇదే సందర్భమున త్రివిక్రమ ప్రాకృత శబ్దానుశాసనమున

"యః కార్యార్థం సూత్రే అనుబధ్యతే
నతు ప్రయోగే దృశ్యతే స ఇత్." (1-1-14)

అను వాక్యము గానంబడును ఈ వాక్యమునే యథాతథముగా సూరి యనువదించినటులు సుస్పష్టముగా నగపడుచున్నది

ప్రతీతులను బట్టియేగాక యీ రీతిగా బాలవ్యాకరణమును బట్టియు సూరి సంస్కృతప్రాకృత వ్యాకరణ పరిశ్రాంతుఁడని తేటతెల్లమగుచున్నది

సంస్కృత భాషకు, చాంద్ర శాకటాయనాది వ్యాకరణ తంత్రము లనేకము లున్నను పాణినీయమే యధికప్రచారము నందుటకు దానికున్న కట్టుపాటులే ముఖ్యకారణము

దానిలోఁ గల క్రమశిక్షణము (discipline) మఱి యెందును గాన రాదు

ఆ కట్టుపాటులు సూరికి గట్టిగా నలవడియుండుట వల్లను, వానిని దన లక్షణమున నుపయోగించుకొను చూపును నేర్పును నాతని కుంపుట వల్లను రచనమునఁ దగినంతగా జిగి బిగువులు కుదురుకొన్నవి —

కనుకనే బాలవ్యాకరణము వ్యాకరణముగాఁ బైకి వచ్చినది —

బింకము లేనిది వ్యాకరణ మనిపించుకొనదు

బాలవ్యాకరణమున.

ఆదిరన్త్యేన సహేత — ఆద్యన్తౌటకితౌ — అలో, న్త్యస్య— అనేకాల్ శిత్సర్వస్య — అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః— తపరస్తత్కాలస్య — — అజ్గాత్ర కర్ణోభ్యో వక్తవ్యమ్— యదాగమా స్తద్గుణీ భూతా స్తద్గ్రహణేన గృహ్యన్తే సహచరితా సహచరితయో స్సహచరితస్యైవ గ్రహణమ్ పరనిత్యాన్తరజ్గాపవాదానా ముత్తరోత్తరం బలీయః— సన్నియోగ శిష్టానాం సహవా ప్రవృత్తిస్సహవా నివృత్తిః నిరవకాశాహివిధయ స్సావకాశాన్ విధీన్ బాధన్తే జ్ఞాపకసిద్ధ నసర్వత్ర — కృతాకృత ప్రసజ్గిత్వం నిత్యత్వమ్— భావిత్వంచ విద్యమాన ప్రాగభావ ప్రతియోగిత్వమ్— భూతత్వంచ విద్యమాన ధ్వంస ప్రతియోగిత్వమ్

మున్నగు సంజ్ఞలు—పరిభాషలు,— పరిష్కారములు, నియమములు — నిబంధనలు పెక్కులు పాణినీయమునుండి యీ ప్రక్రియలోఁ బ్రవేశ పెట్టఁ బడినవి ఇవన్నియు విషయసంక్షేపాది ప్రయోజనము లుండుటంబట్టి యావశ్యకములయి యాశ్రయింపఁబడినవేగాని పాండితీ ప్రకర ప్రదర్శనము నకుఁగాదు—

పయిని నిర్దేశించిన పాణినీయ పారిభాషిక రీతులు బాలవ్యాకరణ మున నెచ్చటెచ్చట నేయే ప్రయోజనములకయి, ఆశ్రయింపఁబడినవో యించుకయిన వివరించు చాపలము—లోపలఁ గలదుగాని తీఁగ లాగి డొంక కదలించుట—

ఆ చావ్ స్తమునకు నిది తావుగాదు — తరుణమును గాదు — మఱియు నిది మహాసభ మాత్రమేగాక మహత్సభయును గావున నిచట నట్టి వివరణములకు నావశ్యకతయుఁ గానరాదు

ఈ ప్రసంగములో బాలకుల వ్యాకరణమునకు, ఇన్ని నిబంధనలా ? అని యడుగువారును గొందఱుందురు —

నిజమేగాని — బాలురనఁగా బసిపిల్లలుగారు సంస్కృతాంధ్ర భాషా పరిజ్ఞానము కొంతవరకుఁ గలిగి శాస్త్రమార్గ గ్రహణ ధారణ పటుత్వము గల ప్రాజ్ఞులు సూరిదృష్టిలోని బాలురు —

అది యటుండనిండు —

లాక్షణికులు తమకొదవిన శాస్త్రసంస్కారము తమ రచనములందుఁ బ్రతిబింబించునటులు శ్రద్ధాసక్తులు వహించి, ఆ సంస్కారమును ననంతర కాలికులకు నందింపఁగలిగినపుడే సంస్కర్త లగుదురు — అధ్యేతలు సంస్కారు లగుదురు

అట్టి సంస్కర్తలలో, చిన్నయసూరి యగ్రస్థానము నందఁదగిన వాఁడు —

ఇతర రచనములమాట యెటు లున్నను లక్షణరచనమున మాత్రము శాస్త్రసంప్రదాయమును సడలింపరాదు శాస్త్రవిహితములగు సంజ్ఞాదుల నియమము జాఱనీయరాదు శబ్దముల వాడుకలో లౌకికలాక్షణికములకు సాంకర్యము కలుగనీయరాదు —

ఈ విషయములందు సూరికి నెట్టి జాగరూకత గలదో పరిశీలింపుడు —

సాధారణముగాఁ బారిభాషిక పద్ధతులందు, ఆంధ్రవైయాకరణులకు నాదర్శమయినది పాణినీయము — ప్రాకృత వ్యాకరణముల నుండి గ్రహింపఁబడిన మార్గములును గొన్ని లేకపోలేదుగాని యవి మిక్కిలి తక్కువ —

"అదర్శనం లోపః" = (ప్రసక్తస్య అదర్శనం లోపసంజ్ఞం స్యాత్) అని లోపసంజ్ఞ సకలలోపసాధారణముగా విహితమయినది ప్రత్యయ లోపమునకు 'లుక్' అను విశేషసంజ్ఞ విధింపఁబడినది —

"ప్రత్యయస్య లుక్ శ్లు లుపః"
(లుక్-శ్లు- లుపీ శబ్దైః కృతం ప్రత్యయాదర్శనం
క్రమాత్ తత్తత్సంజ్ఞం స్యాత్ )

అని ఆ విశేష సంజ్ఞాసూత్రము —

ప్రత్యయములుగాక తక్కినవర్ణముల లోపమునకు లోపశబ్దమే గాని 'టక్' అనుపేరు చెల్లదు చెల్లఁగూడదు

లుక్సంజ్ఞనుబట్టి విధింపఁబడిన విశేషకార్యములు, ఆ వ్యాకరణమున ననేకములు గలవు అవి లోపస్థములందు రాఁగూడనివి — కావున లుక్కు లుక్కే — లోపము లోపమే — సంస్కృత వ్యాకరణమున నంతటను నీవాడుక నియమితముగా నుండును,— ఎచ్చటను బెసుకదు —

ఇటులుండ ,—

ప్రాచీనాంధ్రవ్యాకరణములలో చింతామణి వికృతి వివేకాప్ప కవీయములలో లోపశబ్దముతోపాటు లుక్ శబ్దము సయితము ప్రత్యయ ప్రత్యయేతర సాధారణముగా నియమరహితముగా వాడఁబడుట కానవచ్చును

ఈ సాంకర్యము ప్రాకృతవ్యాకరణములందును జాలచోటుల గోచరించును – పాటింపక తప్పని యీ లుగ్లోపతారతమ్యమును వీరందఱు, ఏల గమనింపరయిరో యెఱుకపడకున్నది.—

పయి గ్రంథములతోఁడి సంతతపరిచితినిబట్టి చిన్నయసూరియు, తన మొదటిరచనములయందు ప్రత్యయేతరస్థలములందుఁగూడ లుక్ శబ్దమును బ్రయోగించి యుండెను

పిమ్మట బాలవ్యాకరణము నుపక్రమించు తఱిని ,—

పాణినీయమున లోపసంజ్ఞ యుండఁగా లుక్కను విశేషసంజ్ఞ ప్రత్యయస్థలములందు వేఱుగా నేల విధింపఁబడినదో — ఆ లుక్కులకుఁగల విశేషకార్యము లెట్టివో — అవి లోపస్థములందుఁగూడఁ బ్రవర్తించినచోఁ గలుగు చిక్కులెట్టివో — ఒక్కపరి సమాలోచించి ఆ పథకమునంతను నవగాహనము చేసికొన్నాఁడు —

తెలుఁగు వ్యాకరణమున లోపస్థములందుఁ గొన్నిటనే రాఁదగినవియుఁ, గొన్నింట రాఁగూడనివియు, కార్యవిశేషములు, ఎవ్వియు లేకుండుటచే లోపస్థలములను లుక్కులనియు, లోపములనియు పాణినీయమునందువలె రెండుగా విభజింపఁ బనిలేదేయని వివేచించినాఁడు

ప్రయోజనము లేనపుడు మనము తెలుగు వ్యాకరణమున లుక్ శబ్దమును స్వీకరింపనే యక్కఱలేదని నిర్ణయించినాఁడు

అదియుఁగాక ప్రత్యయేతర స్థలములందు లుక్ శబ్దమును వాడుట శాస్త్రదృష్టికి విరుద్ధముగదా యనియు గుర్తించినాఁడు —

వ్యావహారికముగా మనము లుగ్లోప శబ్దములను బర్యాయములుగా వాడుకొన్నను లక్షణగ్రంథమునం దట్లు వాడుట యుక్తము గాదని నిశ్చయించుకొన్నాఁడు

ఇన్ని విధముల పరిశీలనముతో బాలవ్యాకరణమున, ఒట్టిడినయట్లొక్క చోటనయిన లుక్ శబ్దమును బ్రయోగింపలేదు

అవసరము కలుగలేదేమో యనుకొందమా, తొంబది రెండు (92) తావులందు లోపవిధానము ప్రసక్తమయినది ఆ 92 తావులందును లోప శబ్దమునే ప్రయోగించినాఁడు

దీనినిబట్టి శాస్త్రీయ పారిభాషిక మార్గపరిపాలనమున నీతని విచక్షణత యెట్టిదో గమనింపుడు —

ఇంత పూనికతో లుక్ శబ్దమును దొలఁగించుట గుర్తింపనేరక యీ బాలవ్యాకరణమును నెదుటఁ బెట్టుకొని యనువాగముగా రచింపఁబడిన హరికారికావళియందుఁ బ్రయుక్తములయిన లుక్కులకు లెక్కలేదు — ఏమనుకొందుము !

అది యటుంచి పూర్వవచనములకు మెఱుఁగులు తీర్చిన సూరి సూక్ష్మతను గుర్తింపుడు —

ఈ ఏ ఆ
"ఇదమ్, అదస్, ఏతత్, - యత్ - తత్ - శబ్దాః శబ్దాన్త
రాన్వయే బహులమ్ ।
హ్రస్వం ప్రపద్య దీర్ఘాః ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి"

ఇది త్రికసంధిని విధించు చింతామణి కారిక —

ఇప్పలుకు — ఎప్పలుకు — అప్పలుకు, మున్నగునవి దీనికి లక్ష్యములు.

ఇందు 'ఏ' అనునది యచ్ఛబ్దార్థకముగా నిర్దిష్టమయినది

ఏ యను దానికి నర్థములు రెండు గలవు

'ఏ పలుకు వింటివో అది సత్యము' అనువో నుండు నర్థము వేఱు ,

'ఏ పలుకు వింటివి ?' అనుచోట నుండు నర్థము వేఱు —

మొదటిది యచ్ఛబ్దార్థకము — రెండవది కింశబ్దార్థకము

ఈ యర్థములు రెండిటికిని సంస్కృతమున యత్, కిమ్ - అని వేఱు వేఱు శబ్దములు ఆ రెండిటికిని దెలుఁగును నున్నది 'ఏ' యనునది యొక్కటే శబ్దము

పయిసంధిలో రెండు విధములగు శబ్దములకును ప్రవేశ ముండ వలయును —

'యత్' అని యొక్కదానినే పేర్కొన్నచో ,

'ఎప్పలుకు వింటివో అది సత్యము' అను తావున మాత్రమే యీ సంధి సాధితమగునుగాని 'ఎప్పలుకు వింటివి ?' అనుచోట త్రికసంధి సాధింపఁ బడదు

ఈ చిక్కును గుర్తించి చిన్నయసూరి ఏ' అను శబ్దమును నెచ్చట నిర్దేశింపవలసి వచ్చినను యత్కిమర్థకము' అని కింశబ్దమును గూడ మేళ వించునే గాని అరకొఱగా 'యదర్థకము' అని నిర్దేశింపఁడు

ఇటులే 'ఎన్ని - ఎందఱు' అను శబ్దములను 'కియద్యావదర్థకములు' అనునేగాని యావదర్థకములని యూరకుండఁడు

బాలవ్యాకరణ సర్వనామ ప్రకరణము పరికింపుడు.—

సంక్షిప్తముగ వేఱొక చిన్నయంశము,—

సూరికిఁ గల లౌకిక లాక్షణిక శబ్దపృథక్కరణదృష్టి గమనింపఁ దగినది

"ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ
స్త్రీసమంబులుం గ్లీబసమంబులు నయియుండు — "

అని యచ్చతెనుఁగు శబ్దములను రెండుశాఖలుగా విభజించినాఁడు. స్త్రీసమము— క్లీబసమము, అను నీశబ్దములు లౌకిక శబ్దములవలెఁ గాన వచ్చుచున్నను సూరిదృష్టిలో నవి లాక్షణికములు = పారి భాషికములు — అనగా,

ఈ శబ్దములను నాచ్ఛికములకే గాని తత్సమములకు వాడరాదు

'దూత' అను తత్సమశబ్దము స్త్రీతుల్యము కావచ్చును గాని స్త్రీ సమము కానేరదు

అటులే 'కంధరము' అను తత్సమము క్లీబతుల్యము కాదఁగును గాని క్లీబసమము కాఁజాలదు

అచ్చతెనుఁగులకు — సమ శబ్దమును

తత్సమములకు — తుల్యశబ్దమును

ప్రత్యేక నియతములుగా వాడుటకుఁ దలంచినాఁడు

గ్రంథమంతటను నటులే వ్యవహరించినాఁడు

స్త్రీసమ క్లీబసమ శబ్దములు పెక్కుచోట్లఁ గానవచ్చును

స్త్రీతుల్య క్లీబతుల్య శబ్దములును బలుతావులఁ గానంబడును

ఎచ్చటను సాంకర్యముండదు

ఇట్టి పృథక్కరణము లేకుండ వానిని గలిపివైచినచో స్త్రీసమశబ్దములకు విధింపఁబడిన కార్యములు స్త్రీతుల్యములయిన తత్సమములందుఁ గూడఁ బ్రవర్తిల్లి అపశబ్దములు సంభవించును

ఈ పృథక్కరణము తనదృష్టిలో నున్నటులు మాత్రము, ఎచ్చటను స్పష్టీకరింపఁడు

అదే యాతని యరచాటు పద్ధతి —

ఆ స్వభావము నెఱింగి మనమే యాతని యాంతర్యమును నిదానించు చూపుతో నుండవలయును

అట్టిచూపు పెట్టక బాలవ్యాకరణ వ్యాఖ్యాతలు - అఖ్యాతలు - అనువాదకులు పెక్కుమంది యీ స్త్రీసమక్లీబసమ శబ్దముల వాడుకను సంకీర్ణము చేసి సూత్రకారుని హృదయము నావిష్కరించుటకు మాఱు మఱింత మాటు పఱిచినారు —

అరచాటు నిండు చాటయినది —

తేట తెల్లముగఁ జెప్పమికిఁ దగినశాస్తి జరిగినది —

అయినను నింతమాత్రానఁ గొఱంత రాదు

ఉన్నగుణ మెప్పటికయిన బయలువడి యభిజ్ఞులమెప్పు నందకపోదు.

'నహి కస్తూరికామోదః శపథేన నివార్యతే' —

ఈ చూపు నింతటితో మరలించి యిఁక నీతని సూత్రపటుత్వమును, భావగంభీరతను, సంక్షేపణ చాతురిని, వైశద్యప్రయత్నమును గలిపి పరికింతము —

విపులమయిన విషయమును సర్వాంగ సంకలితముగా సంక్షేపించుట చాల క్లేశకరము ఆ సంక్షిప్తమును మఱింత కుదించి సూత్రరూపముగా రచించుట యంతకన్నను క్లేశదాయకము — సంతత బోధనాభ్యాసముగల యధ్యాపకులకు, ఇది మఱింత కష్టసాధ్యము —

సూత్రము రచించు నైపుణి, అందఱకు నబ్బునదికాదు

సూత్రమన్నది శక్యమగునంతలో నల్పాక్షరమయి యుండవలయును అట్లని యర్థసంశయము కలుగరాదు ఒక్క సూత్రము పెక్కులక్ష్యములను సాధింపఁగలిగి యుండవలయును. నిరర్థకములగు పదము లుండరాదు —

ఇవి సూత్రముల కుండవలసిన ముఖ్యలక్షణములు —సూరి సూత్రము లన్నిటి యందును, ఈ లక్షణములు గోచరించును —

ఈతఁడు గ్రంథమంతటను రూపసాధనమునకై వలసిన విధులన్నిటిని సూత్రీకరించి, సర్వనామ రూపసాధనమునకు సూత్రములు రచింపక సిద్ధరూపముల పట్టికను మాత్రమే చూపియుండెను — ఏమికారణమో గమనింపుడు —

సర్వనామ శబ్దములందు రూపభేదములు వివిధముగా నుండును ఒక యనుగమ పద్ధతికిని వర్గీకరణ మార్గమునకు వశపడునవి కావు అట్టివానికి సూత్రములు రచింపఁబూనినచో నొక్కొక్క రూపమునకుఁ బెక్కు సూత్రములు రచింపవలసి యుండును గ్రంథము సంక్షిప్తమగుటకు మాఱు మఱింత విస్తృతమయి వ్యాకరణ ప్రయోజనమే వినష్టమగును

అని యాలోచించి సర్వనామ ప్రకరణమున సూత్రరచనమే తల పెట్టక విడిచినాఁడు

దీనినిబట్టి పటుత్వము కుదరని సూత్రములు రచించుటకన్న నుపేక్షించుటయే యుత్తమ మార్గమని యాతని తలంపుగాఁ విశద మగుచున్నది

సూత్రము, అల్పాక్షరమయి అతి సంక్షిప్తమగుటకు నాతని పూనిక యెట్టిదో, ఒక్క యుదాహరణము చూపుదును —

డు - రు - వు - రు - ను - ము— అను క్రియాప్రత్యయములను నిర్దేశించి, యందు యేవి యేకవచనములో యేవి బహువచనములో చూపవలసి,

"వానిలో రుములు బహువచనంబులు
పెఱ లేకవచనంబులు"

అని సూత్రించినాఁడు

ఏకవచనములను ముందు చూపి తక్కినవి బహువచనము లని నిరూపించుట క్రమప్రాప్తము దానికి వ్యత్యాసముగాఁ బయి సూత్రమున ముందు బహువచనములను, ఏల నిర్దేశించెనో గమనింపుఁడు —

ఏకవచనములనే ముందు చూపినచో, ఈ సూత్రమును

"వానిలో **డువును** లేక వచనంబులు
పెఱలు బహువచనంబులు"

**అని** రచింపవలసి **యుండును** రెండు విధములగు రచనము లందును తెలియఁదగిన విషయము తుల్యామే కాని ప్రథమ మధ్యమ బహువచనము లందు 'రు' వర్ణకము సమానమే గావున రు – ము– లని రెండింటిని మాత్రమే నిర్దేశించినఁ జాలును ఏకవచనములను జూపినచో 'డు – వు – ను లని మూఁడింటిని బేర్కొనవలసివచ్చును

చెప్పఁదలచినది రెండక్షరములతో సిద్ధించుచుండ మూఁడిటిని నిర్దేశించి సంక్షేపరీతి చెడఁదీయనేల ! అను నూహతో, క్రమముకంటె సంక్షేపమార్గమే యాదరింపఁ దగినదని బహువచనములను ముందు నిర్దేశించినాడు

దీనిని బట్టి యాతనికి, క్లుప్తీకరణము విషయమున నెంత దూరపుఁ జూపు కలదో —అట్టి చూపుతో సాగించిన సూత్రరచనము, ఎంతటి సంక్షేప పాటవము (Brevity) గలిగియుండునో యూహింపవచ్చును –

నిషిద్ధాక్షర కవిత యందువలె, ఇన్ని నిర్బంధములతో రచింపఁబడిన వయినను, ఈతని సూత్రములందు, కొంకిబికి శైలి సంభవింపక శ్రావ్యమయిన గేయశైలి కుదురుకొనుట విశేషించి సంతసింపఁదగిన యంశము —

ఏ సూత్రము చూచినను దాని పూర్వోత్తర భాగములకు తగ్గు మొగ్గులు లేకుండ తూనిక (Balance) సరిపడి యుండును తూఁచి పరీక్షింపుడు —

సూత్రముల శ్రావ్యతకు, ఆ తూకము సగము కారణము –

మఱియు, —

కొన్ని సూత్రములలోఁ జిన్నపదము నొకదానిని బ్రయోగించుచుండును నలుసువలె, ఉన్నటులే గోచరింపదు

కన్ను పెట్టితిమా కావలసినంత ప్రయోజనము –

"ఇట విశేషంబుత్సర్గంబునకు విభాష ను బాధకంబగు" (తద్ధిత-2) "ఇట బిందువు మీఁది తదలకు నిత్య వైకల్పికంబులయి టడలగు" (క్రియ - 59) మున్నగు సూత్రములందు, 'ఇట' మున్నగు శబ్దములు, కొందఱ పద్యకవితలోని లలి - నల - ఇలన్ - భువిన్ - మున్నగువానివలె, ఊఁతపదములుగాఁ బయికిఁ గానఁబడును, కాని యా పదము లట్టివి కావు - అత్యావశ్యకములు ఆ యా తావులందలి రూపసాధన ప్రక్రియకు నాధారము లయిన మూల స్తంభములు - కదలింప వలనుపడదు -

గోరంత శబ్దము -- కొండంత ప్రయోజనము -

మఱియు ,

ఒకే కార్యము వివిధములగు శబ్దములకు రావలసినయెడ వేఱువేఱుగా విధింపక వానినన్నిటిని వర్గీకరించి, ఒకే సూత్రమున గుదిగ్రుచ్చుట సంక్షేపమునకు మిక్కిలి సాయపడు మార్గము — ఇట్టి మార్గములచే రచనమును స్పష్టీకరించు దృష్టిలోఁబడి, అర్థవైశద్య విషయమున మాత్రము, ఇసుమంతయు నేమఱుపాటు చేరనీఁడు

ఆ వర్గీకరణమును (Classification)
వైశద్యదృష్టిని (Clarity)

ఒకే సూత్రమునఁ దిలకింపుఁడు —

"ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు"

(రత్సమ-44)

ఈ సూత్రమున, ఇకారాంతముల ప్రక్రియ యారంభింపఁబడినది — వానితోఁబాటు ప్రథమైకవచన లోపము రావలసిన గ్లౌ - రై - శబ్దములను, ఉగాగమాంతములను (రుక్కు - రాట్టు - మొ ) ఆ యా చోటులందు మరలఁ జెప్ప నేలయని, ఇకారాంతములతోఁ గలిపి యీ సూత్రముననే నిర్దేశించినాఁడు —

ఈ వర్గీకరణమువలన మూఁడు సూత్రముల వలని ప్రయోజనము, ఒక్కదానివలననే సిద్ధించినది —

అంత్యావర్ణ క్రమమును బట్టి యీ సూత్రమున రై - గ్లౌ - అను క్రమమున ఆ శబ్దములను నిర్దేశింపవలసి యున్నది - అది న్యాయ్యమయిన క్రమము — (ఐ - ఔ -)

"రై - గ్లౌ - శబ్దంబుల కోత్వంబు విభాషనగు " (తత్సమ-64) అను సూత్రమున నట్టి క్రమమునే తాను పాటించి యుండెను

ఈ 'ఇగ్లౌ' సూత్రమున గ్లౌ - రై అని క్రమవిరుద్ధముగా ఏల నిర్దేశించినాఁడో పరికింపుఁడు —

అది వైశద్యము కొఱకు —

రై - గ్లౌ అన్నచో, సూత్రమున 'ఇరైగ్లా వుగంతంబుల' అని సంధి యేర్పడును

తన ప్రక్రియలో వుగాగమాంతములు వేఱుగాఁ బెక్కులుండుటచే' ఆ పరిచితిని బట్టి బాలురకు వుగంతము లను భ్రాంతి కలుగవచ్చును

'ఇగ్లౌరా యుగంతంబుల' అని మార్చినచో వుగాగమ భ్రాంతికిఁ దావు లేదు — ఈ మార్పులో 'యుగంత' అని సంధి యేర్పడినను 'యుక్' అను నాగమమే లేదు గావున సందేహమునకు లేశమును నవకాశము గలుగదు

ఈ వైశద్యమునకయి క్రమము మార్చినాఁడు

ఇదేగాక యీ సూత్రమున "ఇకారాంతములకు, గ్లౌ రై శబ్దములకు మఱి యుగాగ మాంతములకుఁ బ్రథమైక వచనము లోపంబగు —" అని వివరణవాక్యము వ్రాసియున్నాఁడు అందు 'మఱి' - అను శబ్దమును గమనింపుఁడు —

అనావశ్యకమగు సూత్రపదముగాఁ బైకిఁ గానఁబడును

ఆ పదము లేనిచో నచటి సంధిలో 'ఉగాగిమ' అనునది 'నుగాగమము' గా మారును నుగాగమములు, ఈ ప్రక్రియలో మిక్కిలి ప్రచురము లగుటచే, ఆ నుగాగమములేమో యను సందేహము కలుగవచ్చును సంశయ

కారణమగు, ఆ సంధిని దప్పించుకొనుటకయి మధ్యను 'మఱి' అను పదము చేర్చినాఁడు చేర్చినట్లు కనఁపడనీఁడు — స్పష్టతా సంరక్షణమున నాతని శ్రద్ధ యెట్టిదో దీనిని బట్టి విశదము కాఁగలదు

ఒక్క కణము చాలును — అన్నమంతయుఁ బట్టిచూడఁ బనిలేదు —

ఇట్టి బింకముతో సూత్రములు రచించి గ్రంథాంతమున, కొట్టకొన సూత్రమున, తుట్టతుది శబ్దముగా శ్రేయశ్శబ్దమును బ్రయోగించి యున్నాఁడు —

"రేఫంబులు లఘ్వలఘువులుం
దక్కంగల విశేషంబులు
నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు"

(ప్రకీర్ణక-25)

అని యిటు సూత్రార్థమునకును, అటు మంగళాంతత్వమునకును సరి పడునట్లు చిట్టచివర శ్రేయశ్శబ్దమును బ్రయోగించుటలోని దృష్టికుశలత యెట్టిదో యోజింపుఁడు

ఇఁకఁ గవి ప్రయోగ ప్రామాణ్య దృక్పథము

చిన్నయసూరి దృష్టి సంకుచితమనియు, భారత ప్రయోగములను మాత్రమే గైకొని ప్రాబంధిక ప్రయోగములు నిరసించుననియు కొంద అను కొందురు - అది వాస్తవికము కాదు. బాలవ్యాకరణమున, ప్రబంధ బాష కును ననుశాసనము గలదు. ప్రబంధ కవుల యెడను నాతనికిఁ బ్రామాణ్యము గలదు ప్రాచీన గ్రంథములలో నెట్టిరూపములకు నధికప్రచారము గలదో యట్టి వెల్లను బరిగ్రాహ్యములని యాతని చూపు —

భారతమునుండి వలెనే

1 నిర్వచనోత్తరరామాయణము
2 ఉత్తర హరివంశము
3 శృంగార నైషధము
4 భీమఖండము
5 భాగవతము
6 మను చరిత్రము
7 ఆముక్తమాల్యద
8 రామాభ్యుదయము
9 కళాపూర్ణోదయము
10 జైమిని భారతము

మున్నగు ప్రబంధములలోని పదములు మాత్రమే గాక పద్యపాదము లకుఁ బాదములే యాతఁ డెత్తిచూపినవి బాలవ్యాకరణమునఁ గలవు —

I. ప్రబంధములందలి దయినను సధిక ప్రచారము గల—దాని నాద రించునేగాని పరిత్యజింపఁడు.—

II. భారతమందలిదే యయినను, అత్యల్ప ప్రచారము గలదానిని సూత్రింపఁడు —

చూడుఁడు ,—

| | |
|---|---|
| గంగను కాసె | ఏకాంతమునందు నున్న జవరాంద్రను |
| గర్వగరిష్ఠుండగు నన్ను | అన్నలార మిమ్ము నడిగెద నొకమాట |
| మీరలు పెద్దలు | దుర్బలస్య బలం రాజా యన వినవే |
| మాటలు పెక్కులేల | ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ |
| నాకుం దమ్ముఁడు మీకు | గార్యముల్ |
| నెచ్చెలి | గతానుగతికో లోకో యటంచున్ — |

ఇవన్నియు, ప్రబంధములందలి పద్యభాగములు —

ఇన్ని ప్రబంధ ప్రయోగములను బ్రమాణములుగా, ఎత్తి చూపు చుండ నాతనికి ప్రబంధ ప్రామాణ్యము లేదనుట లేశమును, పొసంగని మాట —

అది యటుంచి వేఱొకవంక చూడుఁడు

"ఇచ్చునకు సర్వంబున కీ యగు" (క్రియ - 92)

ఈ సూత్రముచే, ఇచ్చుధాతువునకు 'ఈ' అను నాదేశము విహితమయి నది — ఇమ్ము - ఇండు - ఈఁడు - ఈని మున్నగునవి యీసూత్రము సాధించు రూపములు —

భారతమున 'ఈయని' అని ప్రయోగము గలదు —

దానికి సూత్రము రచింపలేదు

పయి సూత్రమున వృత్తిలో,

"ఈయ" యను నాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి

"బలిమి నీయని భూమివలయపతుల." (భారత - ఆది - 1 - 7) అని మాత్రము పరామర్శించి యూరకున్నాఁడు

ఉలుకఁడు — పలుకఁడు

ఇది భారత ప్రయోగ మాఱె —

అందును నన్నయభట్టారకులది—

మఱియు భట్టారకులు భారత రచనమునకు నుపక్రమించిన ప్రప్రథమ దివసమున, పట్టుగా రచించిన మొట్టమొదటి పద్యములు పదింటిలోనిది —

ఇంతకంటెఁ బవిత్రము, పరిగ్రాహ్యము నయిన శబ్దము మఱేది యుండును ?

అయినను సరే —

భట్టారకు లయినను ఈ యొక్కచోటఁ దప్ప తిరిగి యెచ్చటను బ్రయోగింపరయిరి

తక్కిన పర్వములం దొక్కచోట నయినఁ గానరాదాయెను ప్రాచీన ప్రబంధములలో నయితము మిక్కిలి యరుదాయెను — దీనికి సూత్రము రచించుట ప్రధాన దృక్పథమునకు విరుద్ధము —

అనుచూపులతోఁ బ్రయోగము మాత్రము ప్రదర్శించి యూరకున్నాఁడు

ఈ సందర్భమును బట్టి ఏ కవిది ? ఏ గ్రంథమునందలిది ? అనియే గాక — ఏ శబ్దము రుచికరముగా ననేకుల యాదరముతో బహుతర ప్రచారము నందినది ? అనుచూపు, ఆతనిలో హెచ్చుగా నున్నటులు గోచరించును

ఇంక సూరికిఁ గల సభ్యతారీతి వ్యాకరణమున నెట్లు వ్యక్తమగునో పరికింపుఁడు —

వ్యాకరణ కార్యములపట్ల నితరలాక్షణికులతోఁ దనకు మతభేదము గలిగిన చోటులందు విషయ ప్రధానముగాఁ దన యసమ్మతిని సూచించి విడుచునేగాని వ్యక్తులను జులకనసేయుట కిచ్చగింపఁడు

ఇతరుల సిద్ధాంతములను గట్టిగా ఖండిపఁదలఁచిన తావులందుఁ గూడ తూలనాడు తేలిక ప్రసంగము లాతనికి రుచింపవు —

ఎవరిమాట కాదనునో, ఆ వ్యక్తుల పేరులుగూడఁ దెలుపకుండుట యాతని స్వభావము —

చూడుఁడు.

1 అనుకృతిని నిషుదకుం గురుచ యగునని యొకండు పలికె నది నిరాకరంబు —

2 పూను పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచార మూలకంబు —

3 కుచధాతువునకు గుణంబు లేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబు గాదు

4 ఎందు శబ్దమున కలిగాగమము కొందఱు లేదండ్రు —

5 ద్వితీయైకవచనంబు పరంబునగునపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి అయ్యది లక్ష్యలక్షణ విరుద్ధం బగుటంజేసి యనాదరణీయంబు —

6 వనమునుంచి - ధనమునుంచి యని యుంచి శబ్దాను ప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరుగాని యది సాధుకవిప్రయోగారూఢంబు గావని యెఱుంగునది —

ఇదే తీరు — ఎవ్వరి పేరును నిర్దేశింపఁడు ఎంత గాంభీర్యమో !

ఎట్టి సభ్యతయో ! గమనించి యభినందింపుఁడు —

మఱియు —

తనగ్రంథము నాలోకించు విజ్ఞులకు నాతఁ డొనరించిన విజ్ఞప్తి యొకటి గలదు అందలి గంభీరతను దిలకింపుఁడు — దాని తీరే వేఱు —

"మానితపు నడక పేరిమి
మానసమున కింపుఁజెంప మను నంచలయున్
బోనిడి నీరస నీరము
జానుగ క్షీరంబు గొనుట సహజము కాదే."

అని యూరకున్నాఁడు

ఇందుఁ బ్రకృతాంశ మేమియుఁ గానరాదు అది వాచ్యముగాఁ జెప్పడు

అప్రస్తుతమగు హంసల స్వభావమును, అందఱు నెఱింగిన దానిని జ్ఞప్తికిఁ దెచ్చి విడిచినాఁడు

ఆ తెఱచాటున నున్న ప్రస్తుతార్థమును మనంత మనము గ్రహింప వలయునని యాతని తలంపు –

"గుణములు గ్రహించి లోపములు పరిత్యజించుట సాధుజనులకు సహజలక్షణము — అది వారిని వేఱుగా, కోరఁబనిలేదు,—" అని మనసు లోని భావము –

ఈ విజ్ఞప్తిమార్గము రచయిత హృదయమునందలి అప్రస్తుత ప్రశంసా చమత్కృతి నే గాక, ఆతని యాత్మవిశ్వాసమును – గంభీరతను – సౌమ్యతను, పట్టిచూపుచున్నది

ఇంకను, ఈ వ్యాకరణమున

[1] ఆగమాదేశ కల్పనమునందలి మెలఁకువ —,

[2] ప్రాచీన సంజ్ఞలలోఁ గొన్నిటిని మాత్రమే గైకొనుటలోని వివేచనము,

[3] నూతనసంజ్ఞలను నూతనబంధములను గల్పించుటలోనియుపజ్ఞ,

[4] సూత్రముల మొత్తమున దేనికి ఏ పరిచ్ఛేదమున, ఎచ్చట స్థాన **ము**చితమో నిర్ణయించుటలోని దూరదృష్టి,

[5] రూపసాధన ప్రక్రియావిభాగమునందలి క్రమపద్ధతి,

## [6] ప్రయోగముల బాహుళ్య వైరళ్యముల సూచనారీతి

మున్నగు ప్రణాళికావిశేషములును, సూరి యాంతరంగిక భావములును నివేదింపవలసినవి యనేకములు గలవు కలవని సూచించుట తప్ప, చూపుట కిది తావుగాదు ఒకే దృక్కోణమునుండి పరికించినచో సూరి యాంతర్యము సాంతము గోచరింపదు వివిధములగు దృష్టులతోడి సమీక్ష యావశ్యకము —

సూరి వైశిష్ట్యమును నివేదించుటకు గ్రంథస్థములగు నిదర్శనములు చూపుచు, ఇంత తడవు మీకు శ్రమ యొసవించితిని గాని వ్యాకరణము విప్పకుండఁగనే, అశ్రమముగా మనము గ్రహించునట్లు, ఆ విశిష్టతను ఎత్తిచూపఁగల బహిరాధార మొక్కటి గలదు — ఏదియన,

ఈ యిరువదవశతాబ్ది యారంభదశలో గ్రాంధిక వ్యావహారిక భాషా వివాద విప్లవము తీవ్రముగా సాగిన ఘట్టము, ఎల్లరు నెఱింగినదే — ఆ భాషాసంగ్రామ దినములలో సారస్వత సభలు జరుగని పట్టణములు-లేవు భాషాచర్చలు సాగని పల్లెలు లేవు ఆ వాద ప్రతివాదములను ప్రకటింపని పత్రికలు లేవు —

ఆ సంరంభమున వ్యావహారిక వాదులలో భాషావేత్తలయిన ప్రముఖులెల్లరును, చిన్నయసూరి నుద్ఘాటింపని సభ లేదు ఆతని రచనములను ఖండనదృష్టితో విమర్శింపని సమావేశము లేదు ఆతని లక్షణమార్గము నెదుర్కొనని చర్చ లేదు ఆ కాలమున, ఏ వంక చెవి యొగ్గినను చిన్నయసూరిని గూర్చిన ఖండన విమర్శన కోలాహలమే కర్ణతాడిత మగుచుండెడిది వ్యాకరణమను మాటయేని యెఱుంగని మూల మూలలందుఁ గూడ వ్యావహారికుల వలన సూరిపేరు మాఱుమ్రోగినది

వ్యావహారిక వాదమునకుఁ బ్రధానప్రతిబంధకులు లాక్షణికులు గావున, ఆ లాక్షణికుల మార్గములను ఖండింప యత్నించుట వారి పక్షమునకు నీపుస్తకము కాదు - అనుపపన్నమును గాదు

కాని చిన్నయసూరికి ముందు లాక్షణికు లెందఱెందరో యుండఁగా వారి నెల్లరను జాఱవిడిచి, యీ భాషాసమరమున చిన్నయసూరి నొక్కనిని

మాత్రమే ప్రతిపక్షు వీరునిగాఁ బరిగణించి పట్టుటకు హేతు వేమి? అనునది మనము యోజింపవలసిన ప్రస్తుతాంశము,

హేతువు సులభముగా గ్రహింప వచ్చును

గ్రాంథిక భాషాసక్తిని బెంపొందించుటలో, లాక్షణికు లందఱిలో నెవరికి శక్తియుక్తు లధికములో, ఎవరి వ్యాకరణము బాలకలోకము నెక్కువగా నాకర్షించినదో, ఆతని నొక్కనిని త్రోసిపుచ్చినచో మన వాదమునకు మఱియడ్డులేదను నిశ్చయము తప్ప దానికి హేత్వంతర మేదియుఁగానరాదు

దీనినిబట్టి సూరి లాక్షణికనాయకుఁడుగా, ప్రతిస్పర్థివర్గముచేఁ గూడ భావింపఁబడినట్లు సుస్పష్టముగాఁ దేలుచున్నది ఆతని వైశిష్ట్యమునకు, ఈ నిదర్శన మొక్కటియే చాలును —

నిజమునకు ఈ సందర్భమున చిన్నయసూరికి గౌరవముతో గ్రాంథికులు కూర్చిన మేలుకంటె స్పర్థతో వ్యావహారికులు కూర్చినదే యెక్కుడు మేలుగా నెంచుకొనఁదగినది

సూరి విశిష్టతను నిరూపించుటకు గ్రంథస్థనులు బాహిరములు నగు నిన్నియాధారములను నన్వేషించితిమిగాని ఆ విశిష్టత యాతనికి జన్మసిద్ధమని యింతతడవును గుర్తింపమయితిమి

సూరికి ముందు ప్రసిద్ధులగు నాంధ్రలాక్షణికు లందఱును నద్వైతులు— ఈతనిది కేవలాద్వైతము కాదు — విశిష్టమగు నద్వైతము, అది జన్మసిద్ధము

కాబట్టి బాలవ్యాకరణము అద్వైతవ్యాకరణము కాదు మఱి,— విశిష్టాద్వైత సంప్రదాయ సంకలితము కావుననే ఏపుట త్రిప్పినను నుదాహరణవ్యాజమున హరినామ కీర్తనమే వినవచ్చుచుండును –

నంది తనయుండు కృష్ణుండు నాకు దిక్కు
దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు
శుభవిధాయుల రామకృష్ణుల భజింతు.
భువన వంద్యను రుక్మిణిఁ బొగడుచుండు

అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు,
ఆద్యుఁడప్రమేయుఁడు నగు హరిని గొలుతు
ఆద్యుఁడు నమేయగుణుఁడు నౌ హరిని గొలుతు
ఆర్యుఁ డప్రమేయుండగు హరిని గొలుతు
ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁ
డయి యొసంగెడు దేవుని నభినుతింతు
ఆర్తిహరుఁడవౌ నినుఁ గొల్తు నంబుజాక్ష —

వ్యాకరణము చదువుచు నడుమ నడుమన ప్రయత్నముగ నిట్టి హరికీర్తనము గావించుకొను నవకాశము గలుగుట బాలకుల యదృష్టముగ భావింపఁదగును

తెలిసినవనుకొన్న యంశములలో, కాలసంకోచముచేఁ గొన్నిటిని మాత్రమే నివేదింపఁగలిగితిని

సూరి యన్నట్లు తక్కుంగల విశేషంబు లార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు —

ఆర్యులార ! సూరిగారు పరమపదించి యిప్పటికి నూఱేండ్లు గడచినవి ఇన్నాళ్లకు — ఇంతమంది కవిపుంగవులు — విద్వాంసులు — విదుషీమణులు — విమర్శకులు సమావిష్టులయి అ భాషారాధకుని శారదామూర్తిని సందర్శించు నవకాశము కల్పించిన యీ సాహిత్య ఎకాడెమీకి పునఃపునరభినందనములు —

ఈ కార్యక్రమమునఁ బాల్గొను నవకాశము నాకుఁ గలిగించినందులకు ధన్యవాదములు —

ఆదరముతో నామాట లాలకించిన యగ్రాసనాధిపులకు, సభాసదులకు, అభివందనములు —

చిన్నయసూరి విన్నాణమునకు జోహారులు ...

శ్రీస్తనాఞ్చిత కస్తూరీ పఙ్కసంకలితోరసే
పఙ్కజాక్షాయ నాథాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్ ...

# చిన్నయసూరి జీవిత చరిత్ర - రచనలు

—శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ

శ్రీయను మించు మించొలయ సేవక చాతక లోక మోద సం
ధాయకుఁడై యుదార కరుణా రసవృష్టి దురాప తాపముల్
వాయఁగఁ జేయుచున్ సకల వాంఛిత సస్యము లుల్లసిల్లఁగాఁ
జేయుచు వేంకటాద్రి నివసించు ఘనుం డిడుగాత భద్రముల్

(నీతిచంద్రిక)

భాషాభ్యాసులకు ప్రథమాచార్యుఁడు, పండితులకు భట్టాచార్యుఁడు నైన శ్రీ చిన్నయసూరి శతాబ్ది జయంత్యుత్సవ సందర్భమున (చిన్నయ సూరి జీపిత చరిత్ర - రచనలు) అను విషయమునుగూర్చి యుపన్యసించుటకు న న్నాహ్వానించిన - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికిని, ప్రత్యేకముగ చిన్నయసూరి శత జయంత్యుత్సవ కార్యవర్గ కార్యదర్శులకు ప్రప్రథమముగా నా కృతజ్ఞతాంజలులను సమర్పించుచున్నాను

చిన్నయసూరి ప్రభవ సంవత్సరమున (1806) ప్రభవించినాఁడు దుంధుభి సంవత్సరమున కీర్తిశేషు డైనాఁడు శబ్దగుణ ప్రధానమగు గ్రాంథికా కాశమున నాతని యశోదుందుభి నాటికిని, నేటికిని, ముందటికిని మాఱు మ్రోగుచునే యుండును ఈనాటి విశ్వవిద్యాలయాంధ్రాధ్యాపకాధ్యక్షు లకును, కళాశాలా పండితోపన్యాసకులకును మూలపురుషుడు చిన్నయ సూరి

మదరాసు విశ్వవిద్యాలయము సంపూర్ణ స్వరూపముతో నవతరించిన నాటికే చిన్నయసూరి ఆంధ్రభాషా ప్రధానోపాధ్యాయుడు, ఆంధ్రభాషా శాఖాధ్యక్షుడు ఈ నాఁ డా విశ్వవిద్యాలయములో విశ్వవిద్యాలయ శత జయంత్యుత్సవము (క్రీ శ 1957) నాటికే కాక నీ జయంత్యుత్సవ సందర్భ మున గూడ, నే నాంధ్రభాషా శాఖాధ్యక్షుఁడ నగుట నా పూర్వ పుణ్య

విశేషము అస్మదాదుల కాచార్య పురుషుడై, ఆరాధ్యమానుడైన యా మహనీయుని జీవిత చరిత్రమును ప్రకటించి, నా కృతజ్ఞతను వెల్లడించితిని ఈ వెనుక నాతని జీవిత విశేషములను, గ్రంథములను సేకరించితిని ఈ జయంత్యుత్సవ సందర్భమున విశేషాంశములతో ప్రామాణికమైన చిన్నయ సూరి జీవిత చరిత్రకు కాక యింతవరకు మఱుగుపడిన హిందూ ధర్మశాస్త్ర సంగ్రహమును వెలువరించితిని ప్రస్తుతము సంగ్రహముగా చిన్నయసూరి జీవితము, నాతని రచనలను గూర్చియు నివేదింతును

## జ న న ము

చాత్తాద వైష్ణవ సంప్రదాయమునకు జెందిన చిన్నయసూరి క్రీ శ 1806 లో శ్రీనివాసాంబా రామానుజాచార్య దంపతులకు, భగవద్రామానుజులు పుట్టిన శ్రీ పెరంబూదూరునందు జన్మించెను తలిదండ్రు లీతనికి శ్రీనివాస శబ్ద భవమగు 'చిన్నయ' అని నామకరణము గావించిరి ఈ బాలునికి కుడికంటియందు నల్లగ్రుడ్డు గల స్థలము కొంచెము మాఱి యుండెను ఇదియొక శుభ లక్షణమని, ఆ విధముగా నున్నవారు శాశ్వత కీర్తి సంపాదింతురని పెద్దలు చెప్పుచుండెడివారు పెద్దల మాటలు సర్వదా సత్యములే! చిన్నయసూరి మరణించి నూఱేండ్లయిన యీనాటికి నాతని కీర్తి నిరుపమానముగ విరాజిల్లుచునే యున్నది

## అక్షరాభ్యాసము - చదువు

చిన్నయసూరి అక్షరాభ్యాసము సంగతి చిత్రమైనది పదునాలేండ్ల వయసు వచ్చువఱకును నల్లరచిల్లర నాటపాటలతో తిరిగెడువాడు ఏకైక పుత్ర మమకారము వలన తల్లిదండ్రుల గారాబము కూడ సూరి యక్షరాభ్యాసమునకు ప్రతిబంధకమైనది. అయితే నేమి, యొకానొక సంఘటనముచే సూరి చదువు ప్రారంభించినాడు పదునాలవ యేట ప్రారంభమైన చిన్నయ చదువు మఱి పదునారేండ్ల కాలమునకు వెనుక,పాండితీ శిఖరము నధిష్ఠించినది సంస్కృతాంధ్ర సాహితీ సముద్రములను మథించుటయే గాక, ప్రాకృతము, తమిళము, ఇంగ్లీషు మొదలైన యితర భాషలను సూరి యభ్యసించినాడు సాహిత్యమే కాక, వ్యాకరణము, తర్కము మీమాంసా, అలంకారము, మున్నగు శాస్త్రములలో కూలంకషమైన పాండిత్యము సంపాదించినాడు

సాహితీ నిష్ణాతుడైన సూరికి సహజమైన కవిత్వధోరణి పట్టుబడినది ప్రప్రథమముగా, పండితలోకమున నాతని ప్రతిభయెఱుకపడినది యతని కవిత్వము చేతనేగాని, పాండిత్యముచేత కాదు

## పండితపదవి

విక్టోరియా చక్రవర్తిని మకుటాభిషేక పద్యములతో మొదలిడిన కవిత, పచ్చయప్ప మొదలియారి వార్షికోత్సవ సందర్భములలో ప్రసిద్ధికెక్కనారంభించినది కాని సూరి దృష్టియంతయు పాండితీప్రదర్శన హేతువగు నుద్యోగముపైనే యుండెను తోడనే, అతనికి అప్టను మిషను పాఠశాలయందు నొక పండిత పదవి లభించెను ఇది కాక, యాతనికి నాంగ్లభాషా పరిజ్ఞాన ముండుటచేత క్రైస్తవ మతబోధకులు, తమ మతబోధనల కవసరమైన తెలుగు భాషా పరిచయమును చిన్నయసూరి వలన పొందెడువారు అతని బోధనాశక్తి క్రమముగా వెల్లడియగుట కారంభించినది మదరాసులో నప్పుడు పురప్రముఖులుగా మకుటాయమానులుగ నున్న శ్రీ గాజుల లక్ష్మినరసింహులు చెట్టిగారు, న్యాయాధిపతులైన కలువలపల్లి రంగనాథ శాస్త్రిగారు చిన్నయసూరి వైదుష్యమును గ్రహించి, అతనికి, పచ్చయప్ప కళాశాలలో పండిత పదవిని సమకూర్చ జేసిరి ఆకాలమున పచ్చయప్ప పాఠశాలకు కార్యదర్శులైనవారు పుట్టుకచే తమిళులైనను, తెలుగుభాషయం దత్యంతాభిమానముగల కోవిదులు కోమలేశ్వరపురపు శ్రీనివాస పిళ్లగారుకూడ సూరి పండితపదవికి హేతుభూతులైరి సూరి క్రీ శ 1841 నుండి - 1845 వఱకును నా పాఠశాలయందు పనిచేసెను

## రాజధాని కళాశాలా పండిత పదవి

ఇక చిన్నయసూరి జీవితమునందు ముఖ్యఘట్టము క్రీ శ 1846 లో ప్రారంభమైనది అంతకుముందు, మదరాసులో కంపెనీవారు స్థాపించిన, మదరాసు ప్రెసిడెన్సీ హైస్కూలును కళాశాలగా మార్చు నుద్దేశముతో, నాకాలపు టధికారు లందు క్రొత్తగా పండితులను నియమించు నేర్పాటు గావించిరి కాని యాకాలమున నొక కళాశాలలో తెలుగు పండితుని నియామక మీకాలమునందువలె సులభసాధ్యమైన పనికాదు ఉద్దండులైన పండితుల సదస్సున నతికఠినమైన పరీక్షలలో నుత్తీర్ణుడైనవానికే యా

పదవి లభించెడిది. అందులో సూరి యా యుద్యోగమునకు దరఖాస్తును పంపినపుడు, ఆ కాలమున సుప్రసిద్ధపండితులైన శ్రీ పురాణం హయగ్రీవ శాస్త్రిగారును పంపియుండిరి - పండితసభ పరీక్షలో చిన్నయసూరిదే విజయము కావున నాతనినే హైస్కూలు ప్రధానపండితునిగా నియమించిరి.

ఆ రోజులలో పాఠశాలా పండితులకు 'శాస్త్రి' అను నుపనామధేయము నియతముగా నుండవలెనను యనుశాసనము గలదు. అంతకు ముందా పదవియందున్నవారు బ్రాహ్మణులు గావున 'శాస్త్రి' పేరు పుట్టుకచే లేక పోయినను, పెట్టికొనెడివారు. కాని చిన్నయసూరి బ్రాహ్మణుడు కాక పోవుటచే నాతనికి ప్రతిబంధకము గలిగినది. కాని, ఆ కాలమునందలి కళాశాలాధ్యక్షులైన "ఆర్బత్‌నాట్" దొరగారు, దానికి సమానార్థకమైన పేరు పెట్టుకొనవచ్చునని చెప్పుటచేత చిన్నయ తాను 'సూరి' అని నామకరణము గావించుకొనెను. వెంటనే, ఆర్బత్‌నాట్ 'పరవస్తు చిన్నయసూరి' అని యింగ్లీషుభాషలో చెక్కించిన సువర్ణ హస్తకంకణ మొకటి ఇంగ్లండునుండి తెప్పించి నిండుసభలో నాతని కొసంగి గౌరవించెను.

ఆ హైస్కూలే నేటి 'రాజధానీ కళాశాల' ఆంగ్లభాషలో దానినే 'ప్రెసిడెన్సీ కాలేజి' అని యందురు. చిన్నయసూరి అందు పనిచేయుచుండ గానే క్రీ. శ. 1853 లో మదరాసు విశ్వవిద్యాలయ మేర్పడినది. రాజధాని కళాశాలయే విశ్వవిద్యాలయమున కేకైక కళాశాలయై, విశ్వవిద్యాలయ ప్రథమ ప్రధానాంధ్రాధ్యాపకుడుగా ఆయన నియమితుడయ్యెను. ఆ సందర్భముననే, చిన్నయసూరి 'నీతిచంద్రిక' అను వచనగ్రంథము రచించి, తనకు ముఖ్యులును విశ్వవిద్యాలయాధ్యక్షులు నగు, ఆర్బత్‌నాట్ దొరగారికి అంకిత మిచ్చెను. పై విషయము లన్నియు నా గ్రంథప్రథమముద్రణ (1853) ముఖపత్రమునం దున్నవి.

ఆ కాలమున కళాశాలలో విశ్వవిద్యాలయములో నుపాధ్యాయులకు నిప్పటివలె, ఉపన్యాసకులు, ప్రొఫెసర్లు అని పేర్లు లేవు. ఆత దేశభాషను గాని, శాస్త్రమును గాని బోధించినను నాతనిని (Master) మాస్టరు - ఉపాధ్యాయుడు అనెడువారు. ఇట్లే English master, Science master, Telugu master అని యాకాలమున వ్యవహారము. ఇట్టి పరి

స్థితిని బట్టియే విశ్వవిద్యాలయమున (M. A - Master of Arts) అను పట్ట మేర్పడినది

చిన్నయసూరి మద్రాసు విశ్వవిద్యాలయమున క్రీ శ 1857 నుండి 1862 వఱకును పండితుడై యా విశ్వవిద్యాలయాంధ్రభాషా చరిత్రమున సువర్ణాక్షరములతో లిఖింపదగిన సుస్థిరమైన కీర్తిప్రతిష్ఠల నార్జించెను

## రచనలు

ఈనాడు చిన్నయసూరి రచనలలో, నీతిచంద్రిక, బాలవ్యాకరణము అనునవి రెండును చిరస్థాయిలైనవి వచన రచనకు, వ్యాకరణ రచనకు, ఆ కాలమున 'నన్నయ్య' ఈ కాలమున చిన్నయ్య' అను నుడి కాధార మైనవి పై రెండు గ్రంథములే ఈ రెండు గ్రంథములే కాక, అక్షరాభ్యాసము మొదలుకొని - ఆంధ్రమహాభారతము వరకు గల సాహిత్యజ్ఞానము సంపాదించుటకు నాతడు పెక్కు రచనలు కావించియున్నాడు వానిలో - భాషా పరిణామ క్రమము ననుసరించి అక్షరగుచ్ఛము - విభక్తిబోధిని - శబ్ద లక్షణ సంగ్రహము - సూత్రాంధ్ర వ్యాకరణము - బాలవ్యాకరణము రచించెను భాషాపండితులు నిరంతరము పరిశీలించు నిఘంటువును వ్రాయ ప్రారంభించినాడు కాని, అది పూర్తి కాలేదు

పై వానిలో బాలవ్యాకరణ మాంధ్రవ్యాకరణ సౌధమునకు శిఖ రాయమానమై, పండితులచే పరమప్రమాణముగా నంగీకృతమైనది ఇందు 10 పరిచ్ఛేదములు 465 సూత్రములు గలవు ఈ గ్రంథ వివరము లీ వ్యాస మున కనుబంధముగా నిచ్చియుండుటచే నిచ్చట వివరింపలేదు

వాఙ్మయ ప్రపంచమున నిస్తులయశస్సు నార్జించిన నీతిచంద్రిక - పంచతంత్ర హితోపదేశ కథలను సంగ్రహించి, మిత్రలాభము - మిత్ర భేదము - సంధి - విగ్రహము - అను నాలుగు భాగములుగ రచింప నారంభించి, అందు మొదటి రెండు భాగములు మాత్రమే యాతడు రచించెను ఆత డీ నాలుగును రచింపఁ దలపెట్టిన ట్లాతని నీతిచంద్రిక ముఖపత్రమున ప్రథమసంపుటము (Vol I) అని ముద్రించుటచేయే తార్కాణ కాని యాంధ్ర సారస్వతలోక మట్టి భాగ్యమునకు నోచుకొనలేదు

నీతిచంద్రిక నాటినుండి నేటివరకు సలక్షణ వచనరచన కాదర్శప్రాయమై, విద్వల్లోకమున విశ్వవిద్యాలయములలో నేకచ్ఛత్రముగా నేలుచున్నది పండితవ్యవహారమున గ్రాంథికమే యున్నను, ప్రజావ్యవహారమున పత్రికా ప్రపంచమున వ్యావహారికభాష లేక వాడుకభాష ప్రచుర ప్రచారమున నున్నది భాషాశైలిలో రచనలలో వైవిధ్యము కానవచ్చుచున్నను గ్రాంథిక నిబంధనలు కొన్ని సడలినను - నీతిచంద్రిక రచనాపథకము మాత్రము నిరవద్యమై, త్రికాలా - బాధితమై వెలయుననుటలో విప్రతిపత్తిలేదు

నీతిచంద్రికలో పదమూడు ప్రధానకథలును, నాలుగు ఉపకథలును గలవు ఇది బాలవ్యాకరణ సూత్రలక్షణములకు లక్ష్యగ్రంథము తెలుగు భాషలో లక్ష్యగ్రంథము ననుసరించి లక్ష్యము నడుచును గావున చిన్నయసూరి మొదట లక్ష్యమును నావెనుక లక్షణమును రచించినాడు

చిన్నయరిష్ట పద్యరచన ప్రశస్తమైనది ఆతడు ఆంధ్రశబ్దశాసము అనునది పద్యములతో వ్రాయుటయే గాక 'నీతిసంగ్రహము' అను గ్రంథమున పచ్చయప్పపై పద్యములు రచియించి యున్నాడు నాతడు వ్రాసిన పద్యములు నేటికిన విద్వన్మహాకవుల మన్నన లందుకొనుచున్నవి బాలవ్యాకరణము, నీతిచంద్రిక గ్రంథప్రారంభమున నాతడు రచించిన పద్యము లందఱకు సుపరిచితములే

ఇట్లు గ్రంథరచనయందే గాక, గ్రంథముద్రణ కళయందు చిన్నయసూరి ప్రత్యేకశ్రద్ధ చూపినాడు ఈనాడు ప్రాచీనగ్రంథ ముద్రణమున మనము పాటించు, వర్ణక్రమ నియమముల నన్నింటిని నాతడే యేర్పఱచి స్వయముగా ముద్రాక్షరశాల పెట్టుకొని వానిని వ్యాప్తిలోనికి దెచ్చియున్నాడు

'సుజనరంజని' యను పత్రికను స్థాపించి నడిపినాడు ప్రథమమున మదరాసునందు పరనీయ గ్రంథసభ కధ్యక్షుడై పదునేడు సంవత్సరములు నిర్వహించినాడు తన కాలమునకే ప్రసిద్ధములై, సర్వాంగీణములైన తన వచన రచనను తానా సంస్థ కధ్యక్షుడుగా నున్నంతకాలము పరనీయ గ్రంథము గాకుండ నిలిపిన నియమవర్తుడు.

నేటి సాహిత్యవిమర్శనమున నాధ్యాత్మికమత సంప్రదాయ దృష్టియే లేదు ఇష్టదేవతాస్తుతితో ప్రారంభమైన మన కావ్యములు వేదనిష్టము లైనవి చిన్నయసూరి చాత్తాదవైష్ణవుడైనను, హయగ్రీవ మంత్రము నుపాసించి, • తన మతధర్మములను ప్రత్యక్షరము పాటించువాడు మఱియు తన బాలవ్యాకరణమున, రామాయణ భాగవతాది గ్రంథముల ప్రస్తుతులైన పురాణ పురుషులను స్మరింపజేసియున్నాడు

ఇచ్చట విమర్శకుల దృష్టిని మఱి యొక్క విషయమునకు మరల్చవలసి యున్నది వచన వ్యాకరణ వాఙ్మయములయందే కాక శ్రీ తిరుపతి వెంక టేశ్వర వాఙ్మయమునందును చిన్నయసూరికి స్థానమున్నది అతడు శ్రీ వేంకటేశ్వరుని మహాభక్తుడు తనగ్రంథములన్నింటియందును ప్రారంభమున వేంకటేశ్వర స్తవమే గలుగు * - అవి యన్నియు నాతని భక్తిప్రపత్తులను దెలుపును —

ఆంధ్రకవి పండితవర్గమున అసూయ మాత్సర్యము ఆంగ్లభాషా ప్రాభవము వచ్చినను మాయని లక్షణములు, ఇవి చిన్నయసూరి నాటినుండి యున్నవి —

---

• నవీనుల కట్టి వ్రాతలు విడ్డూరముగా దోచవచ్చును ప్రాచీనకాలము నందేమి, నవీనకాలమునందేమి, ఉపాసన నిత్యకర్మనుష్ఠానముచే నిరవద్య కవితావిద్యాసంపన్నులైన వారున్నారు

* విశ్వవిద్యాలయములో విద్యాశాఖలో పఠనీయ గ్రంథములైన చిన్నయసూరి కృతులలోనివి యున్నవిగదా! ఈనాడు విశ్వవిద్యాలయము లలోగాని పాఠశాలలోగాని యే పఠనీయగ్రంథమునకైన యీ విధముగా దైవస్తుతియుండునా? దైవస్తుతి లేకుంటయే పాశ్చాత్యసాహిత్యలక్షణము వారికి మతమును వేఱు, సాహిత్యమువేఱు - భారతీయులకు రెండింటికి నవినా భావ సంబంధము ఇట్లే కావ్య ప్రాచీనసంప్రదాయమును నిష్టదేవతాస్తుతి నవీన పాఠ్యగ్రంథముల చిన్నయసూరి నెలకొల్పినాడు ఈ వెనుక మనము పశ్చిమ బుద్ధులమై దానిని పాటించుటలేదు

"సాలి జేంద్ర సభామధ్యే సాతానిః పండితో త్తమ" అనునది చిన్నయ సూరి కాలమునుండి యేర్పడినది చిన్నయసూరి జీవితమున నాతనికి సర్వ కళాశాలా ప్రధానాంధ్ర పండితపదవి లభించినపుడు పండితులు మత్సర గ్రస్తులై యాతని పదవికి భంగము నొందింప దలచిరి కాని సాగ లేదు ఆ వెనుక చెన్నపురి పండిత సభలలో చిన్నయసూరికి ప్రథమసత్కారము లభించెడిది అదియును వారి యసూయను నినుమడింపజేసినది అతడు విశ్వ విద్యాలయాంధ్రపండిత పదవి వడసిన వెనుక, ఆశాఖ నెత్తివేయుటకే-కొందఱు పండితప్రముఖులు (అందఱునూ బ్రాహ్మణులే !) గట్టి ప్రయత్నములు చేసిరి కాని ఆ కాలమున చెన్నపురి ప్రముఖులగు—గాజుల లక్ష్మీనరసింహులు సెట్టిగారు, కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు (న్యాయాధిపతి, మద్రాసు విశ్వవిద్యాలయమున మొదట పట్టము పుచ్చుకొన్నమనీషి) యిక ముందెన్నడట్టి యకార్యములు జరుగకుండ రాజకీయ శాసనమును చేయించి, ఆంధ్రభాషాశాఖను—చిన్నయసూరిని చిరస్థాయి గావించిరి వీరిలో గాజుల లక్ష్మీనరసింహులు సెట్టిగారు సాలి కులజులు వారికి ముఖ్యుడు చిన్నయ సూరి. కావున నే 'సాలిజేంద్ర సభామధ్యే' అని పండితులు వ్యాఖ్యానించిరి

పైనిచెప్పిన విషయములను వెల్లడించినది యీనాడు నేను కాదు. ఇప్పటి కరువది నాల్గేండ్లక్రిందట బళ్ళారిలో ఆంధ్రకవి పండితసభ కధ్యక్షత వహించిన విద్యావినోది, భాషాపోషకులు విద్వాంసులు నైన పనప్పాకము ఆనందాచార్యులుగారు చెప్పిన మాటలు ఆ సమయమున విజయనగరము నుండి ఆహూతులైన నా ఽనకులు సుందరముగారును, కవి జీవిత గ్రంథ కర్తలు గురుజాడ శ్రీరామమూర్తిగారును నున్నారు ఇంతేకాక బ్రౌను దొరవారి లేఖలందును గలదు ఇది చిన్నయసూరి చరిత్రకు సంబంధించిన విషయము గావున నిట తెలిపితిని

చిన్నయసూరి హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము ఈ వఱకును పరిచితముకాదు కావున, దానినిగూర్చి తెలుపు అనుబంధమున చిన్నయసూరి జీవితమున చేర్చదగిన మరికొన్నిటిని చేర్చి యున్నాను విద్వల్లోక మంగీకరించుగాక

పందొమ్మిదవ శతాబ్ది ప్రథమార్ధమున ననగా క్రీ శ 1800–1857 వఱకును పెంపొందిన యాంధ్రసారస్వత చరిత్రము సమగ్రముగ రచితమై

ననే చిన్నయసూరి యుగ ప్రవర్తకు డెట్లయినదియు మనము గ్రహింప గలము ఉపలబ్ధములైన చిన్నయసూరిగ్రంథములు, సంపూర్ణ వివరణ వ్యాఖ్యానములతో ప్రకటితములైన చిన్నయసూరి యాంధ్రవాఙ్మయమున గల నత్యున్నత స్థానము ను మనము నిరూపింపగలము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారట్టి మహోద్యమమునకు గడంగుదురు గాక ! విశ్వ విద్యాలయములలో నాతని కొక శాశ్వత చిహ్నమును నిలుపు ప్రయత్న ములు జరుగునుగాక ! చిన్నయసూరిని గూర్చిన యీ నా చిన్న యుపన్యాస మునకు హేతుభూతులైనవారికి మఱియొకతూరి కృతజ్ఞత దెలుపుచు—నాతని శాశ్వత చిహ్నమును గుఱించి తగుకార్యక్రమము నేర్పాటు చేయుటకు నాంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు పూనుకొందురని యభ్యర్థించుచు, సభాసదులను ప్రార్థించుచు నింతటితో విరమించుచున్నాను

శ్రీస్తనాంచిత కస్తూర పంకసంకలి తోరసే
కలౌ వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళమ్

## హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము

చిన్నయసూరి రచించిన వచన గ్రంథములలో నీతిచంద్రిక వెనుక "హిందూ ధర్మశాస్త్రసంగ్రహము" ప్రత్యేకముగ పేర్కొనదగినది—నీతిచంద్రిక యెన్ని తడవలు ముద్రణమునంది ప్రచుర ప్రచారమును బడసినదో హిందూ ధర్మశాస్త్ర సంగ్రహ మంత యజ్ఞాతదశ ననుభవించినది ఇది క్రీ శ 1853 లో ప్రథమ ముద్రణమునంది, 1867, 1869 లో ద్వితీయ తృతీయ ముద్రణము లందినను, నవి యీ దేశమున లభ్యము కాకపోవుటయే దీనికి కారణము కాబట్టియే నేటి వాఙ్మయ చరిత్రలలో దీని ప్రసక్తి కానరాదు లండను నగరమున బ్రిటిషు మ్యూజియము గ్రంథాలయమున నున్న ప్రథమ ముద్రణ ప్రతిని చలనచిత్ర ఛాయా గ్రహణ మూలమున బడసి యీనాడు చిన్నయసూరి జీవితముతో దీనిని ప్రకటించితిని

హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము, ఆంగ్లేయ భాషలో థామస్ లుమిసిడన్ స్ట్రేంజి అను న్యాయాధిపతి రచించిన మాన్యుయల్ ఆఫ్ హిందూలా అను గ్రంథమునకు నాంధ్రానువాదము. ఇది కేవలము న్యాయ

శాస్త్రమునకు లోకవ్యవహారమునకు సంబంధించినది సమస్త జనులు సులభముగా గ్రహింపదగినది. చిన్నయసూరికి ముందిట్టి యనువాదములు వ్యావహారిక భాషయందే యుండెడివి—ప్రభుత్వమువారి చట్టములు—తీర్పులు—అజ్ఞాపత్రములు—మున్నగునవి యన్నియు వ్యావహారిక భాషలోనే ప్రకటితములు, చిన్నయసూరి గ్రంథమునకు నేడేండ్లు ముందుగా, తెలుగులో జాన్ ఫ్రేయర్ థామస్ భూపాలీయము లేక *వ్యవహారదర్పణము అను హైందవ ధర్మశాస్త్ర గ్రంథ సంగ్రహము వెలువడినది దాని రచయితలు వడ్డెము వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రిులుగారు వీరు గ్రంథమును వ్యావహారిక భాషలో రచించుటయేగాక, అట్టి రచనను సమర్థించుచు గ్రంథాంతమున నీ క్రింది పద్యము రచించి యున్నారు

గీ "అఖిలలోకోపకారార్థ మట్టి ధర్మ
వాక్యతతి తెల్గు భాషచే బల్కబడిరెు
గాన నన్నయ సూత్ర సంస్కారములను
విడిచిపెట్టుట దోషమై వెలయ దిచట"

చిన్నయసూరి దీనిని కనిపెట్టి తాను హిందూ ధర్మశాస్త్ర సంగ్రహమును నన్నయ సూత్ర సంస్కారములనే ప్రమాణీకరించి, వానికి లక్ష్యముగా వ్యాకరణ యుక్తమగు గ్రాంధిక భాషలో రచించి యున్నాడు—చిన్నయసూరి యనువాదమువలన మూడు ముఖ్య విషములు మనము గ్రహింపగలము

[1] శాస్త్రీయ గ్రంథములు, వ్యావహారిక శైలినిగాక, గ్రాంధిక శైలిలో వ్రాయుట

[2] ఇంగ్లీషు భాషనుండి యనువదించు నపు డనుసరణీయము లగు పద్ధతులు

---

*వ్యావహారిక భాషా ప్రవర్తకులైన శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి వాదమున కాధారములైన గ్రంథములలోనిది యొకటి గ్రంథము సంస్కృతముననే రచితము ధర్మశాస్త్ర గ్రంథ శ్లోకములన్నియు తెలుగు తాత్పర్యములతో వెలయుచున్నవి

[3] పారిభాషిక పదరచన—

పై మూడింటికి లక్ష్యములను ఆ గ్రంథమునుండి చూపుచున్నాను ఇందు పదునాలుగు ప్రకరణములు గలవు

[1] The law and it sources—శాస్త్రముల యుత్పత్తి క్రమము
[2] Marriage—వివాహము
[3] Adoption—పుత్రస్వీకారము
[4] Gaurdianship-రక్షకత్వము
[5] Property-సొమ్ము
[6] Alienation-వినియోగము
[7] Wills-ఉయిల్లు
[8] Charges on Property-సొమ్ములో జేయవలసిన వ్యయములు
[9] Disability to inherit-దాయానర్హత
10] Partition-దాయభాగము
11] Succession-దాయాధికారము
12] Bengal law-బంగాళా శాస్త్ర సంప్రదాయము
13] Malabar law-మళయాళ దేశ శాస్త్రము
14] Contract-క్రయ విక్రయాది వ్యవహారము

పై ప్రకరణము లన్నియు స్పష్టత కొఱకు తిరిగి పేరాలుగా విభాజ్యమై యున్నవి ఇవి 408 గలవు

## 2ND CHAPTER – MARRIAGE

para 11

"The binding circumstances essential to the completion of a marriage are gift and acceptance of the girl and the ceremony termed SAPTAPATHI or the seven steps This is

performed by the bride-groom placing the bride's foot successively on seven lines drawn upon rice in a platter From this observance has followed the practice of any two persons pledging friendship by taking seven steps together so that the term SAPTAPADINAM has come to be synonymous with friendship The ceremonial in question accomplishes the marriage. The other ceremonies observed including sacrifice by fire (Homam) are of minor significance The tying of Tali or nuptial token, by the bridegroom round the neck of the bride is a practice sanctioned by usage, but not prescribed in the Sastras "

[Grihya sutram]

దీనికి తెలుగు

వివాహము పుట, ౧౧ పేరా 28

"వివాహపూర్తికిఁ గన్యాదానమును దత్పరిగ్రహమును సప్తపదియును ముఖ్యక్రియలు ఒక పళ్లెరములో బియ్యము నెఱపి యేడు గీంట్లు గీఁచి యా యేడు గీఁతలమీఁద వరుఁడు పెండ్లికుమార్తె కాలుపట్టి గీఁత గీఁతకొకొక్కసారి వరుసగా నుంపించుట సప్తపదియనఁబడును ఇందుచేతనే యిద్దరు చెలిమి యొడంబడికకయి కూడి యేడడుగులు నడచు నాచారము గలిగినది కాఁబట్టి సాప్తపదీనమను శబ్దము సఖ్యమునకు వాచకమైనది ఈ క్రియతోనే వివాహము పూర్ణమవుచున్నది హోమములోనైన యితర క్రియలు విశేషములుగావు వరుఁడు కన్య కంఠమందు మంగళసూత్రము కట్టుట లోకాచారము గాని శాస్త్రీయముగాదు "

[గృహ్యసూత్రము]

# 5TH CHAPTER

140 para

Property

'Property is again distinguished according as it is ancestral or self acquired Whatever, whether immovable or movable has been derived by inheritance or obtained by means of trimonial funds is ancestral property That which has been

obtained by individual exertion, unaided by ancestral funds is viewed as self acquired "

ద్రవ్యము పిత్రార్జితమని స్వార్జితమని మరల రెండు విధములుగా విభాగింపబడియుండు పితృద్రవ్యముగాని, దానిచేత సంపాదించినది గాని జంగమ స్థావరములందేదయినను బిత్రార్జిత మనఁబడును పితృద్రవ్య నిరపేక్షముగ స్వప్రయాసముచేత సంపాదించిన ద్రవ్యము స్వార్జిత మనబడును

## CONTRACT.

417

"If earnest money, and not the full price, have been paid, the buyer forfeits the same should the breach of the engagement be upon his part Should it be on the part of the seller, he is liable to repay the earnest money two fold "

వెలదీర్చుకొని సంచకరము మాత్ర మిచ్చినవాఁ డొడఁబాటు తప్పి పోయిన పక్షమందిచ్చిన సంచకరము విడచిపెట్ట వలసినది ఒడఁబాటు దప్పుట విక్రయించిన వానిదైన పక్షమందు వాఁడు పుచ్చుకొన్న సంచకరము రెట్టిగా నియ్యవలసినది "

## బాలవ్యాకరణము : పుట్టు పూర్వోత్తరములు

ఇది 1858వ సం డిసెంబరు మాసము చెన్నపురమందలి హిందూ ముద్రాక్షర శాలయందు జ్ఞా సరవప్ప సెట్టి చేత ముద్రింపబడియె

ఈ ముద్రణ కాలమునకు సూరి జీవించియుండిరి

సూరిగారు పరమపదించిన వెనుక ననేక పరియాయములు బాల వ్యాకరణము ముద్రితమైనది

1867 రెండవ మూడవ ముద్రణములు

1871 నాల్గవ ముద్రణము

1876 ఆరవ ముద్రణము

1882 ఏడవ ముద్రణము.

1887 ఎనిమిదవ ముద్రణము

దీని తరువాత ముద్రణములను నేను చూడలేదు

1900వ సంవత్సరము ముద్రితమైన బాలవ్యాకరణమున నది పదునేడవ ముద్రణము అని వ్రాయబడియున్నది

1908 ముద్రణ మెన్నవదియో తెలియలేదు కాని ముఖపత్రమున నిట్లు కలదు

Balavyakaranamu by
Paravastu Chinnnaya Suri,
The greatest Pandit of the 19th Century.
Published by
Paravastu Alemelamma, daughter-in-law of the author
1903

1911-పై అలమేలమ్మగారి పేరుతో మరల ప్రకటితమైనది. ఆ వెనుక వావిళ్లవారు పెక్కుసారులు దీనిని ముద్రించిరి

మహారాష్ట్రదేశమున భండార్కరు మహాశయుని First Book, Second Book of Sanskrit గ్రంథములవలె, చిన్నయసూరి బాలవ్యాకరణ ముద్రణము రాజకీయ శాసనముచే సురక్షితము కావలసి యుండెను కాని యట్లు జరగలేదు అట్లు గాకపోయిన విశ్వవిద్యాలయ పక్షముననైన సాధికారమైన సప్రమాణ ముద్రణము వెలువడలేదు వ్యాకరణ గ్రంథముల యందు మన కెంత యాదరాభిమానము లున్నవో వ్యక్తము చేయుటకీ యొక్క విషయము చాలును

పై ముద్రణములలో నొక పట్టున యతిభ్రంశము తానగు చున్నది కారకపరిచ్ఛేదము — 19 సూత్రము "విశేష్యమునకు బోలె విశేషణంబునకు లింగ విభక్తివచనంబులగు, ఉదా నంద తనయుండు కృష్ణుండు నాకు దిక్కు— దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు— శుభ విధాయుల రామ కృష్ణుల భజింతు — భువనవంద్యను రుక్మిణి బ్రస్తుతింతు—"

ఇట్లు వచనముగా ముద్రితమైయున్నను నిది తేటగీతి పద్యము.

నందతనయుండు కృష్ణుండు—నాకు దిక్కు
దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు
శుభవిధాయుల రామకృష్ణుల భజింతు
భువనవంద్యను రుక్మిణి బ్రస్తుతింతు

నాల్గవ పాదమున యతి తప్పినది—ప్రాత ముద్రణముల నిట్లే కలదు.

ఆంధ్ర వ్యాకరణసంహిత సర్వస్వమున 1066 పుటలో (కారక పరిచ్ఛేదము—విషయము 259) భువనవంద్యను రుక్మిణి బ్రస్తుతింతు-అను యతిభ్రంశ పాఠమే గలదు

సుంకరి రంగయ్యగారి వ్యాఖ్యలోను, దూసివారి పేటికా వ్యాఖ్య లోను "భువనవంద్యను రుక్మిణి బొగడుచుందు" అను సరియగు పాఠము గలదు

## బాల వ్యాకరణము - పద్యానువాదము

బాలవ్యాకరణమునకు పద్యానువాదము నొకదానిని యిప్పటికి రమారమి యెనుబదియేండ్ల క్రిందట ఓరుగంటి సోమశేఖరకవి రచియించి యున్నాడు పద్యానువాద మనగా చిన్నయసూరి సూత్రములను పద్య రూపముగా రచియించినాడు అందుండి యొక పద్యము నిట నుదాహరించు చున్నాను

సీ. ప్రథమయు గయి యొక్క పట్టీతరంబులై
పరగు విభక్తిక ప్రత్యయములు
నల్ల నుత్తమ పురుషైక వచనములు
దద్ధర్మభూత ప్రథమ పరుషము
లేకవచనములు బ్రాకటాశీరర్థ
కములెా నడు త వర్ణకముల నంత
రార్థక శతృ తు విధ్యర్థ చేదర్థకం
బులు దాను నేనులు వలె ప్రకృతులు

గీ. ధర ధృతప్రకృతికములై తనరు మరియు
మిగిలినవి యెల్ల గళలన మెఱయుచుండు
గ్రమముతోడ నుదాహరణముల నిడుదు
బాలు రెడ మెచ్చ గామేశ పండితార్య !

పై పద్యము సంజ్ఞా పరిచ్ఛేదము 12 వ సూత్రమున కనువాదము గ్రంథకర్త ఒరుగంటి సోమశేఖర కవి—క్రీ శ 1818—1903 కాలమున విలసిల్లెను ఈతడు బహు గ్రంథకర్త పై బాలవ్యాకరణ పద్యానువాదము గ్రంథకర్త క్రీ శ 1832 ప్రాంతమున రచియించినట్లు తెలియుచున్నది కృతిపతి కామేశ పండితుడు—కేవలము పండితుడుకాదు కలియుగ దానకర్ణుడని ప్రఖ్యాతిగాంచిన న్యాయవాది (క్రీ. శ 1846-86). తెలుగువారిలో మొదటి బి ఎల్ పట్టము పొందిన మనీషి విద్యావినోది పనప్పాకము ఆనందాచార్యులవారి సహాధ్యాయి, ప్రాణమిత్రము గ్రంథము ముద్రితము.

## వ్యాఖ్యలు

చెన్నపురిలో చిన్నయసూరికి ప్రథమమునుండి ప్రోత్సాహకులగు శ్రీ ఆనరెబుల్ గాజుల లక్ష్మీనరసింహులు శ్రేష్ఠిగారు, చిన్నయసూరి గతించిన వెనుక, బాలవ్యాకరణమునకు వ్యాఖ్య వ్రాయింప దలపుగొని సూరిగారితో పచ్చయప్ప కళాశాలలో నాంధ్ర పండితులుగా పనిచేసిన వింజమూరి కష్ణమాచార్యులవారి నాపనికై నియోగించిరి కాని వారు సూరి వెనుక మరి నాలుగేండ్లకే అనగా తే 15-10-1866 లోనే కీర్తిశేషు లైరి వారెంత వరకు వ్యాఖ్య రచించినది తెలియుట లేదు

ఆ వెనుక శబ్దరత్నాకర నిఘంటుకర్తలగు సీతారామాచార్యుల వారు, బాలవ్యాకరణమునకు వ్యాఖ్య వ్రాయుటకు బదులుగా 'త్రిలింగ లక్షణ శేషము' అను ప్రౌఢవ్యాకరణమును రచించిరి సీతారామాచార్యుల వారి జీవితకాలము నిఘంటు రచనవునందే నియుక్త మగుటచేత వారి వ్యాఖ్య తలపెట్టియుండరు వారు తే 27-3-1891 ని కీర్తిశేషు లైరి

క్రీ శ 1908లో "బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక" అను పేర 176 పుటల గ్రంథమును సుంకరి రంగయ్యగారు ప్రకటించిరి ఇందు కారక

పరిచ్ఛేదము చివర, సమాసపరిచ్ఛేదమునాది కొన్ని పంక్తులు గలవు మూల సూత్రములు తప్ప తక్కిన లక్ష్యములు చిన్న యక్షరములతో నీయబడినవి

క్రీ శ 1915 శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులువారు ప్రకటించిన గుప్తార్థ ప్రకాశిక పండితలోకమున ప్రఖ్యాతిబడసినది వాక్యవ్యాఖ్యాన సార్వభౌములని వేదమువారిచే పొగడ్తగన్న వేంకటరామశాస్త్రిగారు, శ్రీవర్ఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారి విమర్శనమునకు గురియైరి

క్రీ శ 1937 లో కీర్తిశేషులు దూసి రామమూర్తి శాస్త్రిగారి పేటిక— వెలువడినది

క్రీ శ 1949 లో ప్రశస్త విద్వాంసులు బులుసు వేంకట రమణయ్య గారు సూత్రార్థములను వివరించిరి

క్రీ శ 1951 "ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము" అను గ్రంథమున బాలవ్యాకరణమునకు బ్రహ్మాండమైన వ్యాఖ్యాన మొకటి గలదు ఆ వ్యాఖ్య విషయము లీవరకే పత్రికా ముఖమున సువిమృష్టము లగుట నిందు ప్రత్యేకముగ తెలుపబడలేదు ఈ గ్రంథమున ఒక్కచో సూరి గ్రాంథిక భాష నుద్ధరించినాడని కైవారము, నిరాధారములైన సూత్రములు రచించినాడని కొన్ని చెప్ప మరచినాడని వేరొక్కచో నింద

క్రీ శ 1960 లో సంహితాసర్వస్వకర్తలు వెలయించిన బాల వ్యాకరణోద్ద్యోతము ఇది "రణోద్ద్యోతము" గాని వ్యాకరణోద్ద్యోతము గాదు-బాలవ్యాకరణోద్ద్యోత మసలేగాదు-బాలవ్యాకరణ ఖద్యోతము

బాలవ్యాకరణము క్రీ శ 1858 లో ముద్రితమైన నది పండితైక వేద్య మగుటచే, బడులలో క్రింది తరగతులకు పఠనీయ గ్రంథముగా చేయుటకు నను వు కాలేదు క్రీ శ. 1857 లో బాలవ్యాకరణమునకన్న ముందు ముద్రితమైన శేషయ్యశాస్త్రి వ్యాకరణము ఆవెనుక వచ్చిన వెంకయ్యవ్యాకరణము పఠనీయములుగా నుండెడివి క్రీ శ 1887 బాల వ్యాకరణము ఎనిమిదవ ముద్రణమునాటికి పై రెండును, పది పండ్రెండు ముద్రణము లందినవన్న వీని ప్రచారము తెలియగలదు తరువాత వీరేశ లింగముగారి సంగ్రహ వ్యాకరణమును ప్రచారమున నుండెను బాల

వ్యాకరణ ప్రచారము 1900 నుండి హెచ్చుగా నుండెనని చెప్పవచ్చును మొదటివ్యాఖ్య 1900 తరువాతనే యగుట పైవిషయమును స్పష్టము చేయుచున్నది

చిన్నయసూరి బాలవ్యాకరణమున తనకు ముందున్న వైయాకరణులను కొందఱను వాచ్యముగను, కొందఱను వ్యంగ్యముగను సూచించియున్నాడు

I 1 సంస్కృతీయమునకు సంధి యగునని యథర్వాణాచార్యులు చెప్పిరి (సంధి 4 సూ)

2 "అప్పు డిప్పు డెప్పు డను శబ్దములు నిత్యైక వచనాంతములు, వాగనుశాసనులు యదాతదాయని గ్రహించుట ప్రపంచార్థమని యెరుగునది" (సంధి 13 సూ)

పై వారిలో నథర్వణాచార్యుడు వికృతి వివేకమును రచించినాడు వాగనుశాసనుడు 'ఆంధ్రశబ్ద చింతామణి' కర్త నన్నయభట్టు వీరిరువురిలో నన్నయను ప్రథమాచార్యుడుగాను, నథర్వణుని ద్వితీయాచార్యునిగను పేర్కొనుట సంప్రదాయమే దైనను నిచ్చట ప్రథముని ద్వితీయునిగాను, ద్వితీయుని ప్రథమునిగాను పేర్కొనుట విశేషమేమో ?

II 1 "అనుకృతిని నిడుదకుం గురుచ యగునని యొకండు పలికె నది నిరాకరంబు దుర్బలస్య బలం రాజా యన వినవే" (సంధి 54 సూ)

ఈ "ఒకండు" అప్పకవీయమును రచించిన అప్పకవి, అతడు గ్రంథాదిని—

క, సాతత హేతి పరిజన
వ్రాతంబుగ శేషశయను వనరుహనయనున్
ఖ్యాతిగ "న హరేస్తు పర
స్తాత్రిత" యనుట దెలిసి కృతి మొదట దలచి వెసన్
(పీఠిక 17 ప)

అని అనుకృతిని హ్రస్వము ప్రయోగించెను ఇట్లు మొదటనే గాక 5-98 లో నిట్లు ప్రయోగమునకు మాత్రమే చేసియున్నాడు

సీ అనుకరించెడుచోట నవ్యయాదుల కొన
గల బొట్టు గవకు దీర్ఘంబులకును
వచ్చు లోపము కేశవాయ తుభ్యం నమ
యనగ రామోఘ సంహర్త యనగ

హాదులయు నీలుగు లోనగువాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగ నగు

2 పూను పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచార మూలకంబు (ప్రకీర్ణ 10 సూ)

ఇచ్చట 'ఒకండు'ను అప్పకవియే చూడుడు అప్పకవీయము

తే గీ పూనె నెగసె బొదివె బొనరె బొందె నటన్న
పలుకులందు మొదల గలుగునట్టి
వ్యంజనంబు లడగి వానిపై స్వరములు
నిలుచు వలసినపుడు నీరజాక్ష

(2 ఆ. 75 ప)

3 సమాస పదంబునందు సంయోగంబు పరంబగు నప్పు డెల్లచో ఖండబిందువునకుం బూర్ణం బగు అనటులు-అనంట్లు.. పడుఁలు-పండ్లు-కాఁడులు-కాండ్లు, పండ్లు - కాండ్లిత్యాదులందు డాకు 'ళా' దేశంబు కొందరు వక్కాణించిరి తెనుగున బిందుపూర్వక స్థిరంబు లేమిం జేసి యది గ్రాహ్యంబు గాదు. (అచ్చిక, 15 సూ,)

'డా' కు 'ళా' దేశంబు వక్కాణించినది, చిన్నయసూరికి ముందు ఫోర్టు సెంటు జార్జి కళాశాలలో ప్రధాన పండితుడైన రావిపాటి గురుమూర్తి శాస్త్రి - ఇతడు రచించిన తెనుగు వ్యాకరణము క్రీ శ 1836 లో ననగా బాలవ్యాకరణమునకు నిరువది రెండేండ్లు ముందుగా నచ్చయినది

ఆ తెనుగు వ్యాకరణము–విశేష్య ప్రకరణము 131 విషయమున డి డు వర్ణములకు పూర్వముగా బిందువు వుంటే డ కారమునకు ళ కారము వికల్పముగా వచ్చును, ఉ–డు వర్ణములకు పూర్వమునందున్న అరసున్న నిండుసున్న యవును ఉదా— "గుండు - గుండులు - గుండ్లు - గుంళ్లు కాడి - కాడులు - కాండ్లు - కాంళ్లు ఇట్లే 133 విషయమున పెండ్లిండ్లు - పెంళ్ళింళ్ళు" అని రెండేసి రూపములు వచ్చునని తెలుపబడినది

ఈ గురుమూర్తిశాస్త్రి వ్యాకరణమును చిన్నయసూరి రాజధాని హైస్కూల్ (ఇదియే తరువాత రాజధాని కళాశాలగా మారినది) లో పాఠము చెప్పియున్నాడు *

ఈ వ్యాకరణము క్రీ శ 1951లో వావిళ్ళవారిచే నా పీఠికతో ముద్రితము ఇందు క్రియాప్రకరణమున నున్నంత విపులముగా సంస్కృతాంధ్ర క్రియారూప నిష్పత్తి మరి యే వ్యాకరణ గ్రంథమునను లేదు 74 పుటలలో వ్యావహారిక రూపములతో కూడా, వివరణపట్టికలతో నున్న యీ ప్రకరణము బాలవ్యాకరణమున క్రియాపరిచ్ఛేదమునకు మూలమైనది

బాలవ్యాకరణము క్రియా పరిచ్ఛేదము సూత్రము 6వ "లిఖభుజరుచ కృశంబులకు గుణంబు లేదు. లిఖించు, భుజించు, రుచించు, కృశించు–కుచ ధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబు గాదు గుణము లేకుండా, సంపూర్వక కుచధాతువునకు ప్రయోగము సంకుసాల నృసింహకవి రచిత కవికర్ణరసాయనమునం దున్నది

తే గీ సుందరత్వమునకు జోటిచ్చి తా సంకు
చించెనన గడు గృశించె నడుము (1-56)

సూరి పేర్కొనకపోయినను బాలవ్యాకరణమున నీ క్రింది విషయములు, సూరికి ముందున్న వైయాకరణులనుండి గ్రహించెనని స్పష్టముగా రూపింపవచ్చును

---

* Report of the High School of the Madras Uuniversity. (1840–1857) P. 90.

త్ర్యవర్ణకార్థంబునం దెడి యెడు వన్నియలగు ( క్రియా 44 సూ )
ఇందు* వర్ణకములు అనుటకు "వన్నియలు" అని వాడబడినది మొదటినుండి యన్ని ముద్రణప్రతులయం దిట్లే యుండుటచేత, సూరి "వన్నియలు" అని వాడెననుట స్పష్టము

వర్ణకములకు వన్నియలు–వన్నెలు–అని వాడుక చేసినది వేదము పట్టాభిరామశాస్త్రిగారు వీరి కాలము (క్రీ శ 1770—1820) వీరు ఫోర్టు సెంటు జార్జి కళాశాలయందు ప్రథమమునుండి అనగా 1812 నుండి 1820 వరకును తెలుగు పండితులు వీరు నన్నయభట్టీయమని చెప్పబడు ఆంధ్రశబ్ద చింతామణికి "పట్టాభిరామ పండితీయము" అను వాఖ్యయు, "సంగ్రహవ్యాకరణము" అను సూత్రాంధ్ర వ్యాకరణమును, పట్టాభిరామ పండితీయము అను నన్నయభట్టీయ పద్యానువాదమును వన్నింటికన్న మిన్నగ నేడు చిన్నయసూరి రచనగా ప్రకటితమై ప్రచారమున నున్న "ఆంధ్ర ధాతుమాల" ను రచించిరి వీరు క్రీ శ 1820 లో చనిపోవుటచేత పై గ్రంథము లన్నియు నంతకుముం దున్నవనుట నిర్వివాదము ప్రస్తుతమునకు కావలసినది వన్నియలు. "పట్టాభిరామ పండితీయము" అను పద్య వ్యాకరణమున వర్ణకమునకు వన్నియలని ప్రయుక్తమైనది. చూడుడు .

శా. "ఆద్య ప్రాకృతసిద్ధ నామములపై
యావన్నెలం ద్రోసి యా
స్వాద్యంబైన తెలుంగు వన్నియలురా (23 పద్యము)

సీ డు ము వులు నా వర్ణకములు మొదటి వన్నియలు " (107 పద్యము )

---

* ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రకటితము ఈ గ్రంథము చిన్నయసూరి కృత్యము కాదని, పట్టాభిరామశాస్త్రిగారి రచనమని సప్రమాణముగ నా "చిన్నయసూరి జీవితము" న నిరూపించితిని

ఇట్లు బహువచనమునందే కాక యేకవచనమున, వన్నియ (115 ప) వన్నె (115) అని కూడ నందు* ప్రయుక్తమైయున్నది

ఈ సూత్రముననే కాక, మఱియొక పట్టున, లక్ష్యలక్షణముల సూరి యథామాతృకముగా పట్టాభిరామ పండితీయము ననుసరించి యున్నాడు.

బాలవ్యాకరణము, సంధిపరిచ్ఛేదము—(సూత్రము 46)

"పడ్వాదులు పరంబగునపుడు మువర్ణంబునకు లోప పూర్ణ బిందువులు విభాష నగు"

భయము ......... పడె .. ..... } భయపడె / భయంపడె / భయము పడె

సూత్రము.........పట్టె .... .... } సూత్ర పట్టె / సూత్రం పట్టె / సూత్రము పట్టె

పట్టాభిరామ పండితీయము సీసమాలిక

మఱియును నల ప్రథమావిభక్తికమైన
యట్టి మూకు బడు పట్వాదులైన
హ్రస్వ*దీర్ఘావర్ణ భాస్వరరంగు పకా
రం బాదియైన శబ్దంబు లున్న
నిది పక్షమున వచ్చు నది గాక యది మూకు
రాని పక్షమునందు దాని గొట్టి
బిందువు పూర్ణమై యందంబుగా వచ్చు
నొక పక్షమున మువర్ణకమ యుండు
భయము పడియె, భయపడె, భయంపడె నిట్లు
సూత్రము పట్టెను సూత్రపట్టె
ననియు సూత్రంపట్టె నా జెలు నిట్లగు

(56 పద్యము)

---

* ఈ పట్టాభిరామపండితీయమును మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము ది 1246 సంఖ్య బ్రౌనుదొరవారి సేకరణల నుండి ప్రతి వ్రాయించి వావిళ్లవారు క్రీ శ 1951 లో ముద్రించిరి

ఇట్లే మరియొక పట్టు చూడుడు ,-బాలవ్యాకరము సంజ్ఞా పరిచ్ఛేదము

"లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు (22) వస్తాడు, తెస్తాడు, వచ్చేని, తెచ్చేని, వచ్చేవాడు, వచ్చేటివాడు, తెచ్చేటివాడు, ఈ భాష ప్రయోగంబున కనర్హంబు

ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు (23)

పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపందగునని తాత్పర్యము కరకంరుడు, ప్రాణగొడ్డము, జీవగర్ర, కపిల కన్నులు, కపిలగడ్డము, కపిలజడలు

పై రెండు సూత్రములలో "వస్తాడు" అను లక్ష్యములు రెండును, "ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము" నుండి సూరిగారు గ్రహించిరి

ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణ కర్త పుదూరి సీతారామశాస్త్రి ఈతడే, తెలుగువారిలో మున్ను పిన్నలకు, నేడు పెద్దలకు గూడ నత్యావశ్యకమైన 'పెద్దబాలశిక్ష' యను గ్రంథము రచించిన పండితుడు ఈ ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము క్రీ శ 18[illegible]4 లోను, క్రీ శ 1852లోను సూరిగారు జీవించియుండిన కాలమున రెండు తడవలు ముద్రితమైనది

పై రెండు సూత్రముల వ్యాఖ్యలో ననావశ్యకము ననంబద్ధమగు ప్రసంగము చాల గలదు తనకు ముందుగల యే వ్యాకరణ ఛందో లక్షణ గ్రంథకర్త లుదాహరింపని, 'కపిల కన్నులు, కపిల గడ్డము, కపిల జడలు' అనువానిని సూరి ప్రామాణికముగా నుదాహరించినాడు అవి నన్నయభట్టు భారతమందున్న కారణమున (ఇందును సూరి యిచ్చిన క్రమము భారత పద్యక్రమమునకు విరుద్ధము) వాని ప్రామాణికత కొరకు వాదులాడి కలము, కాలము పండితులు వ్యర్థము చేసిరి ఇట్టి పట్టు లింకను గలవు

సూరి సూత్రమున లక్ష్య లక్షణములు రెండును పై వ్యాకరణము నుండి గ్రహింపబడిన వనుట స్పష్టము ఇంకను మరియొకటి

బాల వ్యాకరణ సూత్రము

లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు (సంజ్ఞా 22 సూ) వస్తాడు-తెస్తాడు - వచ్చేని - తెచ్చేని - వచ్చేవాడు - తెచ్చేవాడు - వచ్చేటివాడు - తెచ్చేటివాడు - ఈ భాష ప్రయోగంబున కనర్హంబు

పై సూత్రమున - లక్షణము పట్టాభిరామపండితీయమునుండి గ్రహింపబడినది

గీ లక్షణగతి విరుద్ధంబులైన మాట
లింక గ్రామ్య సంజ్ఞ పదంబు లవేవి యనిన
దాన్ని చూస్తాను చేస్తాను దీన్ని వస్తి
చూస్తి పోతాను వాడికి నిస్తి వాణ్ణి - (సంజ్ఞ 28వ పద్యము)

పై వ్యాకరణమున లక్షణము గ్రహించినను సూరి లక్ష్యములను *ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణమునుండి గ్రహించియున్నాడు

ప్ర గ్రామ్యంబు లెన్ని విధంబులు ?

ఉ నింద్యగ్రామ్యంబు లనింద్యగ్రామ్యంబు లని రెండు విధంబులు

ప్ర నింద్యగ్రామ్యంబు లేలాగంటివి ? అనింద్యగ్రామ్యంబు లేలాగంటివి ?

ఉ వస్తాడు, తెస్తాడు, ఇస్తాడు మొదలగు ప్రయోగరూఢంబులు గాని శబ్దంబులు నింద్యగ్రామ్యంబులు కలకండుడు, ప్రాణగొడ్డము మొదలగు ప్రయోగరూఢంబు లగు శబ్దంబులు అనింద్య గ్రామ్యంబులు

సూరి 22 సూత్రమున వస్తాడు, తెస్తాడు అని లక్ష్యములను గ్రహించి అనింద్యగ్రామ్యంబులకు—వేరుసూత్రము చేసియున్నాడు

ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు (23)

*ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము శ్రీపుదూరి సీతరామశాస్త్రి కృతము ఈతడు పెద్దబాలశిక్ష యను ప్రశస్తసంగ్రహ విజ్ఞానకోశము రచించిన మనీషి ఈ వ్యాకరణము క్రీ శ 1834 లోను, 1852 లోను బాలవ్యాకరణముకన్న ముందుగా రెండుసారులు ముద్రితమైనది.

పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబైన గ్రహింపదగు నని తాత్పర్యము కఱకంఠుడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిల గడ్డము, కపిలజడలు ఇందు కఱకంఠుడు, ప్రాణ గొడ్డము పై వ్యాకరణము నుండి సూరి గ్రహించినవి, తక్కినవి యాతడు స్వంతముగ జేర్చినవి

అనింద్య, నింద్య గ్రామ్య శబ్దములు సూరి యుపయోగింపలేదు సీతారామాచార్యులవారు, శబ్దరత్నాకరములో 'అనింద్య గ్రామ్య' శబ్దము వాడియున్నారు చూడుడు సంజ్ఞావివరణ పట్టిక గ్రా గ్రామ్యము (అనింద్యము) కాని నింద్య గ్రామ్యములకును ప్రయోగములు కన్పట్టు చున్నవి.

క వస్తాఁడు నీలభూపతి
తెస్తాఁడు ధనంబు నీ కతిప్రమదముగా
నిస్తాఁడు విరహవేదన
చస్తాఁడా ? నమ్ము మదిని సందియమేలా ?

చంద్రరేఖా విలాపము (1-73)

'వస్తాఁడు' మున్నగునవి గ్రామ్యలోపములనుచు వానిలో ఖండమును సూరి నిల్పుట యసంగతము (బాలవ్యాకరణోద్ద్యోతము పుట 33 )

చంద్రరేఖావిలాపము కూచిమంచి జగ్గకవి కృతము క్రీ శ 1750 ప్రాంతమున రచితమైనది ఆ గ్రంథము ముద్రించినప్పు డందు, ఉద్ద్యోత కర్తలవంటి పరిష్కర్తలు ఖండములను-అనగా అరసున్నలను నిల్పరు కాబోలు !

ఈ పట్టున బాలవ్యాకరణ వ్యాఖ్యాత లొనర్చిన విషయములను విమర్శించిన పెద్దగ్రంథ మగును గాన నిట విడచితిని

## బా ల వ్యా క ర ణా వ త ర ణ ము

సూరి తన కాలమున, తనకుముందున్న వ్యాకరణములను పరిశీలించి, కొన్ని గ్రహించినను, నాతని బాల వ్యాకరణము ప్రత్యేక స్వతంత్ర రచన. సూరికిముందు వ్యాకరణములు పద్యాత్మకములు, వాక్యాత్మకములు కాని

సూత్రాత్మకములు గావు వ్యాకరణమన్న సూత్రముతో వెలయవలెను అప్పుడే యీ వ్యాకరణమునకు స్థాయిత్వము ప్రామాణికత సిద్ధించును సంస్కృతమున పాణినీయమునకువలె, తెలుగునకుగూడ నట్టి వ్యాకరణము దలచి, సూరి తెలుగు భాషలోనే వ్యాకరణ సూత్ర సంపాదన చేసి కృత కృత్యుడైనాడు బాలవ్యాకరణ రచనము కొఱకాత డెన్నియో యభ్యాసములు చేసియున్నాడు

ప్రథమమున సంస్కృతములో సూత్రాంధ్ర వ్యాకరణము రచించినాడు దీనివలన సూత్ర సంపాదన సులభమే సూత్రభాష సంస్కృతము-ఉదాహరణలు తెలుగు కాని కావలసినది తెలుగులోనే సూత్రరచనము సంస్కృతములోనున్న తెలుగువారికి టీకా తాత్పర్యము లావశ్యకములు కాబట్టి యా పద్ధతి వీడి, యావెనుక, పద్యాంధ్ర వ్యాకరణము రచించినాడు దీనివలన లాభ మేమనగా సూత్రములలో వ్యర్థపదములు రాకుండ చేయుట యని చెప్పవచ్చును పద్యములలో యతిప్రాస నిర్బంధమున వ్యర్థపదములు చూచి పరిహరింపవచ్చును

సూత్రములలో వ్యర్థమైన పదమే కాదు, అక్షరము కూడ నుండదు

ఆ వెనుక '*శబ్దలక్షణ సంగ్రహము' అను పేర తెనుగుసూత్ర గ్రంథము రచించెను

"సిద్ధి లోకంబువలన దెలియనగు"
"శాసనం బియ్యది దిక్ప్రదర్శనంబు"

అను రీతిని యిందలి సూత్రము లుండును కాని, యివి మిక్కిలి సంగ్రహరూపమున నుండుటచేత - ఆంధ్ర శబ్దానుశాసనము అను మరియొక సూత్ర గ్రంథము రచించెను ఇందలి సూత్రములు పైవానికన్న విపులములు

"ఉత్వంబున కచ్చురా సంధియగు"

"ప్రథమాంతంబున కస్మద్విశేషణంబునకు బహుత్వమున ము వర్ణకంబగు"

---

* ఇది క్రీ శ 1853లో ముద్రితమైనది ఇది యలభ్యమగుటచేత నా వద్దనున్న ముద్రిత ప్రతినుండి యొక ప్రతిని వ్రాసి కీర్తిశేషులు గిడుగు రామమూర్తిపంతులుగారి కొసగితిని. ఇది నలుబదేండ్లనాటి మాట

కాని యిందు సూత్ర వివరణము, ప్రయోగములు లేవు సూత్ర వివరణతో ప్రయోగములతో పమనారేం డ్లీరీతిని గాఢపరిశ్రమ మూలమున •బాలవ్యాకరణ మవతరించినది ఆంధ్ర వ్యాకరణ చరిత్రయందే కాక, ఆంధ్ర భాషాచరిత్రమున, బాల వ్యాకరణ రచన యొక ప్రత్యేక విశిష్టత గల ఘట్టము

## బాలవ్యాకరణము - లక్ష్యలక్షణములు

సూరి బాల వ్యాకరణమునం దిచ్చిన లక్ష్యముల కన్నింటికిని కవి ప్రయోగములు గలవు, ఈ సందర్భమున సూరి ప్రస్తుత వైయాకరణుల నిఘంటువులపై నాధారపడలేదు తాను స్వయముగా గ్రంథము లన్నింటిని నామూలాగ్రముగ చదివి, ప్రయోగసేకరణము గావించి యున్నాడు అతడే ఆకారాదిగా ప్రామాణికమగు *తెలుగు నిఘంటువును నిర్మించుటకు నాద్యుడని తెలియవలెను సూరి గ్రహించిన గ్రంథములో కొన్ని యిప్పుడు మనకు లభ్యములుకావు కాని యా ప్రయోగము లితరత్ర లభ్యమగుచునే యున్నవి చందోబద్ధమగు రచనల కన్నింటికి సూరి ప్రామాణ్యము నిచ్చి యున్నాడు 'చికిత్సా సంగ్రహము అను చిన్న వైద్యగ్రంథమునుండి అతడు యతిప్రాస నిబద్ధములగు పద్యములు గ్రహించినా డన్నచో నాతనికి కవుల ప్రయోగముల యందుగల గౌరవము తేటపడును మరియు నిప్పటి 'సంహితోద్ద్యోత కర్తలవలె, మహాకవులని ప్రాచీనమహాకవులని – అర్వాచీన కవులని – సామాన్యకవులని – వ్యవస్థ చేయకుండగనే కవిమాన్య విభాగము గావింపలేదు ఉద్ద్యోతకర్తలవలె ప్రకటితమైన నిఘంటువులపై యాధారపడలేదు సూరి యుదాహరించిన ప్రయోగములు స్వయముగా

---

• నా రచించిన చిన్నయసూరి జీవితమున పై రచనలను గూర్చి విపులముగా గాంచనగును

* చూడుడు శబ్ద రత్నాకర పీఠిక ఈ నిఘంటువు సూరి స్వహస్త లిఖితము 7 సంపుటములుగా సూర్యరాయ నిఘంటు కార్యస్థానమున నుండెడిది తక్కినవి పదములు, అకరములు, వీనిలో కొంత చిత్తుగా నున్నను మొదటి సంపుటము ముద్రణకొరకు వ్రాయబడినట్లు కానవచ్చును ఈనాడు వాని యునికియే యెరుకపడదు

మూలగ్రంథములు పరిశీలించిచేసినవి ఏ ప్రయోగ మేకవి చేసెనో తెలియకుండ, అథవా కవుల పేళ్ళయిన తెలియకుండ, ఉద్ద్యోతకర్తలు చిన్నయసూరి నాక్షేపించుట మహాసాహసము !

విజ్ఞప్తి యనుబంధము - బాల వ్యాకరణోద్ద్యోతము

"కవిలియ - కవిలె, అను శబ్దములు లేవని యెవ్వరును జెప్పలేదే దమ్మకవిల - దమ్మకవిలె అను తద్భవ రూపముల నంగీకరించి, పాపము, బసవకవిని వైరిపదదోషము పాలుకాకుండ జేయరాదా !" (పుట 10)

పై వాక్యములో బసవకవి యెవరో? ద్విపద బసవ పురాణ కర్తను కవిగా పరిగణించినవారితో వాదించుట యేల?

"ముజ్ఞు పరంబగునపుడు 'కో' శబ్దంబు కొనుటకు బహుళంబుగా నగును (20)

బహుళంబగుటచేత దీనికి నొకానొకచో నతిచారంబని యెరుంగునది అనగా ముజ్ఞు పరమగునపుడేకాక జీత్తులలోని వ్యతిరేకార్థకములు, నుజ్యంతములు మున్నగునవి పరమమగునపుడును, యథాప్రయోగముగ నీ యాదేశము విభాష నగునని తాత్పర్యము-భారతేతర గ్రంథములందే యిట్టి యాదేశ మగునని యెఱుంగునది మ "తుదిరాజ్యమ్ము సగమ్ముగొమ్ము" అనుచో నన్నయ 'కో' అను నాదేశమును ప్రయోగించెననరాదు అచట తుది రాజ్యమ్ము 'గొన్ము' అనునది కవి ప్రయుక్తము శబ్దాలంకార ప్రియులగు సంస్కర్తలట్లు ప్రక్షిప్తము చేసిరని యెఱుగునది" (ఉద్ద్యోతము పుట 401)

"తుది రాజ్యమ్ము సగమ్ముగొమ్ము" అన్న పద్యము, తిక్కన భారతము ఉద్యోగ పర్వమున (3-97) నున్నదని, పండితుల మాట యటుండనిచ్చి పాఠశాలా విద్యార్థులకు సైతము తెలిసిన విషయము కాని 'ఉద్ద్యోతకర్తల' కది తెలియకపోవుటచే దానిని "ముఖ్యములగు తప్పొప్పుల పట్టిక" లో చేర్చలేదు అచ్చులో స్పష్టముగా "నన్నయ" అని యున్నది ఒక్క ప్రాచీన గ్రంథమైనను మూలతాళపత్రప్రతులతో పరిశీలించి ప్రకటింపని యుద్ద్యోతకర్తలు, ప్రాచీనాంధ్ర గ్రంథ పరిష్కర్తలకు, పాండిత్యము లేదని, పలుమారులు నిరసించుట యవిమృశ్యకారిత్వము

బాల వ్యాకరణములోని గంభీరార్థ ముద్ద్యోతకర్తలకు నెఱుక పడలేదని యీ క్రింది సూత్రార్థముల విమర్శనుబట్టి తెలియఁగలదు.

సంధి 20 అవసానంబునందు ద్రుత స్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు విభాషగా నగు

వాడు వచ్చెన్ - వాడు వచ్చె - వాడు వచ్చెను - ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబై యుండు-గుర్వవసాయియగు పద్యంబు తుదను స్వత్వంబులేదు అతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్

ఉద్ద్యోతమున (పుట 51) పుట యడుగున నా సూత్రముక్రింద నీ వాక్యములు గలవు

"గుర్వవసాయియగు పద్యంబు తుదను స్వత్వంబులేదు అతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్ - ఈ సూరివాక్యము లనావశ్యకములు"

సూరి వాక్యము లనావశ్యకములట? సూరి గుర్వవసాయియగు పద్యంబు తుదను స్వత్వములేదని సూత్రించుటకు కారణ మిది మన తాళపత్ర గ్రంథములయం దనుసరించునట్టి లేఖన సంప్రదాయము ననుసరించి లేఖకుడు "అతిశయముగ బుద్ధిమంతుడగు బుధ సేవనూ" అని దీర్ఘ స్వత్వములతో వ్రాయును - పద్యములు చదువునప్పుడు పదము చివరి స్వరము దీర్ఘముగా చదువుదుము - అట్టి ఉచ్చారణ ననుసరించి ప్రాత వ్రాతలలో చివర స్వత్వరూపములే యుండును భారతాది ప్రాచీన గ్రంథముల ముద్రణ ప్రారంభమగుచున్న కాలములో తాళపత్రములలోని వ్రాతలను యథా మాతృకముగ నచ్చువేసిన భాషాపరిపాటి తెలియదని సూరి స్వత్వములేదని సూత్రించెను నేటి ముద్రణములలో స్వత్వ ముండదు ఇట్లెంతయో దీర్ఘ దర్శిత్వమున సూత్రింపగా, తాళపత్ర లేఖన సంప్రదాయము నెఱుంగ కుండ, 'యీ వాక్యము లనావశ్యకము లనుట'*యుద్ద్యోతకర్త సూత్రార్థము గ్రహింపలేదని స్పష్టమగుచున్నది

* వ్యాకరణ సంహితా సర్వస్వము, మొదటి సంపుటము పుట 190 తాళపత్ర మాతృకనుండి యుదాహరణ "పెంపును వృథ కాయగాఁజనదు భూవలయేశ్వర యింమ్ము నెమ్మితోనూ" అని స్వత్వరూపమే గలదు ఉద్ద్యోతకర్త లిది విస్మరించి యుందురు

పై లేఖన పద్ధతి నెరిగిన- వ్యా సం సర్వస్వ కర్త 307, 308 పుటలలో ననావశ్యకముగ నంత విషయమును విస్తరింప బనిలేదు

ఇంక నొక సందర్భమును నుదాహరించి యీ వ్యాసము ముగింతును

"తెనుఁగుమీది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు

వాఁడు + కంసారి = వాఁడుకంసారి

వీఁడు + చక్రపాణి = వీఁడు చక్రపాణి.

ఆయది + టంకృతి = ఆయదిటంకృతి

అది + తథ్యము = అది తథ్యము

ఇది + పథ్యము = ఇది పథ్యము"

బాలవ్యాకరణము— సంధి 14 సూత్రము

దీనిపై సంహితా సర్వస్వములో నిట్లు గలదు

"సంజీవని 78 IV విప — ఈ సూత్రము నిర్మూలము భారత ప్రయోగములకే కాక, యీ సూత్రమెల్ల ప్రామాణిక గ్రంథ ప్రయోగములకును విరుద్ధమై యున్నది అని 'ఎంతగుమతులు' 'ఎవ్వండు వరించు' 'పెంపు వరీక్షింపమె 'ఇట్లు దపంబు' 'వీరల్గోపించిన 'వేవణనులు' అని యుదాహరణ లీయబడి యున్నది

బాల వ్యాకరణోద్ద్యోతమున (పుట 46)–

"తెనుఁగులమీది సాంస్కృతిక పరుషములకు గ.. స ..డ. .ద... వా ..' దేశము లేదను సూరి సూత్ర మవిమర్శక కృతము" అని మీది యుదాహరణములలో మూఁడు మాత్ర మీయబడియున్నవి

ఉద్ద్యోతకర్తల యభిప్రాయము ననుసరించి సూరి, భారత, నిర్వచనోత్తర రామాయణ, ఉత్తర హరివంశ, కాశీఖండ, వసుచరిత్రలలోని ప్రయోగములను కూడ నెఱుఁగడన్నమాట ! అట్టివానిని పరిశీలింపకయే యిట్టి రీతి సూత్రించినాఁ డన్నమాట ఉద్ద్యోతకర్తలచే యుదాహృతము లైన ప్రయోగములన్నియు ని త రు ల వి యే — వారి దొకటియులేదు–

వానిలో విజ్ఞా - ప్రాయకాం 49 ప అని కలదు ఇది కేతనకృతి *విజ్ఞ నేశ్వరము - ఉద్యోతకర్త ఈ గ్రంథ మెప్పుడైన చూచియున్నారా? చిన్నయ సూరి యెరుగును

అది యట్లుండనిండు, ఈ ఘూత్రమున సూరి లోకోత్తర ప్రతిభ ప్రదర్శించినాడు

కంసారి, చక్రపాణి అనునవి సంజ్ఞావాచకములు వీనికి గసడదవా దేశము చేసిన వ్యవహారజ్ఞానము నశించును కంసారిని గంసారి యన్న - కామయ్యను గామయ్య అన్న రీతిగా సంజ్ఞాబోధకము కాదు చక్రపాణి - సక్రిపాణియైన - అది సశల భేదము వ్రాతలో తారుమారై, శక్రపాణి యగును అప్పుడు దాని యర్థ మేమగును?

నామవాచకములయందు గసడదవాదేశము చేసిన నెట్టి యపార్థములు గలుగునో, ముద్రిత పండితారాధ్య చరిత్రమునుండి యొక యుదాహరణము చూపుచున్నాను

"ద్వి......వీరవ్రతోద్యుక్తి నడవ
బుడివుళ్ళు వోవుచు భూసురుల్ నరులు
బండితు జూచి సైపక యొక్కనాడు
వండితయ్యా! నీవు వౌరాణకుండవు
స్ద్విజోతముండవు సచ్చరిత్రుండవు"

దీక్షాప్రకరణము-పుట 31

పై పాదములలో

వండితయ్యా—అనగా 'వండితివయ్యా' అను నపార్థము గలుగును ఇక 'వౌరాణికుండవు' అన నెవరు!

---

* చిన్నయసూరి తన నిఘంటువు కొరకు విజ్ఞానేశ్వరమునుండి యెన్నియో ప్రయోగములను సేకరించినాడు ధర్మశాస్త్రగ్రంథ మగుట చేత అందలి పారిభాషిక పదములను తెలుగున నేపదములు వాడినాడో తెలిసికొనుట మూలశ్లోకములు గూడ నుదహరించినాడు సీతారామాచార్యుల వారు, శబ్దరత్నాకరమున విజ్ఞానేశ్వరము నుండి గ్రహించిన పదములన్నియు చిన్నయసూరి వ్రాసికొనినవియే కాని వేరుకావు

"పండితయ్యా! నీవు పౌరాణికుడవు" అని యుండినగదా యర్థస్ఫూర్తి కలుగును

సూరి సూత్ర మిట్టి యపార్థములను వారించుచున్నది అయితే గసడదవాదేశము నిత్యము, తాళపత్ర గ్రంథములం దున్నది యన్నచో మూలపాఠమున సంస్కరింపబడిన పై పాఠ మిచ్చి, పుట యడుగున తాళపత్రమాతృకాపాఠము చూపనగును ఇక ప్రాసస్థలము లైనప్పుడు నిర్వివాద మే కదా

సూరి చూపిన తక్కిన యుదాహరణములు నిట్టి జాగరూకతతో నీయబడినవియే.

ఆ యది 'టంకృతి' – ఆ యది 'డంకృతి అనిన ధ్వనులు టం, డం అనునవి వేఱుగదా, *'టంగ్' అని గంట మ్రోత. డం అని తుపాకి మ్రోత ఇట్లే.

అది తథ్యము – అది దథ్యము' అయిన 'దధి' సంబంధమైనదను భ్రాంతి కలిగించును ఇది పథ్యము – అనుచోట ఇది 'బధ్యము' అన్నచో, పథ్యముగా మనము పుచ్చుకొనదగిన పదార్థము యొక్క జ్ఞానమే నశించును.

ఇంత గంభీరార్థము నొక్క సూత్రమున నిమిడించిన సూరిని 'ఆంధ్ర పాణిని' యని ప్రశంసించుటకు బదులుగా నుద్యోతకర్త లాతని సూత్రములను నిర్మూలము లనుట యవిమర్శనకృతము

పై విషయములనుబట్టి సూరి హృదయము ననుసరించి సంగ్రహముగ, శాస్త్రీయముగ నొక వ్యాఖ్య యత్యావశ్యకమని తెలుచున్నది వర్ణనాత్మకమగు బాలవ్యాకరణమునకు చరిత్రాత్మక మగు వ్యాఖ్యతో సాధికార ముద్రణము వెలసిన నది – యాంధ్ర పాణినీయ మగును

ఈనాడు ప్రఖ్యాత భాషాతత్త్వశాస్త్రవేదు లందఱును చిన్నయసూరి బాలవ్యాకరణము నాధారముగా గొని గ్రంథములు రచించినవారే –

* "టంగ్ టంగ్ అనునది వర్ణవిప్లుతి" (Metathesis) చేత "గంట"గా మారినదని రెలుంగునది,

వాఙ్మయమహోధ్యక్ష శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు తమ వ్యావహారిక భాషావ్యాకరణమున - చిన్నయసూరి సూత్రములను సగౌరవముగ గ్రహించిరి

## శబ్దలక్షణ సంగ్రహము

"శబ్దలక్షణ సంగ్రహం బని పేర్కొనఁబడిన యాంధ్ర వ్యాకరణము మదరాసు యూనివర్శిటీయందు ఆంధ్రభాషా ప్రధమోపాధ్యాయుఁడగు పరవస్తు చిన్నయసూరి తిరువళ్ళిక్కేణ వాణీదర్పణం బను ముద్రాక్షరశాల యందుఁ గృత్తికర్తచే ముద్రాక్షరాంకితము చేయింపబడి ప్రకటింపఁబడియె. 1853 ఈ గ్రంథము మే కొండస్వామిచెట్టిచే ముద్రింపఁబడియె బాల్యంబు దొరఁకొని మదీయమిత్రులు దేశభాషా పరిజ్ఞానంబును నిరతిశయంబైన దేశాభిమానంబును గలిగి బహుజనోపకార కార్యంబులం బ్రవర్తించుచుఁ గీర్తి సమార్జించు గాజుల లక్ష్మీనారసింహచెట్టిగారి వలన బహూపకారంబులం బడసినవాఁడం గావుటంజేసి కృతజ్ఞాతాభివ్యంజకముగా నీ గ్రంథంబు తదీయాంకితంబు గావించినాఁడ

ప చిన్నయసూరి"

## హిందూధర్మశాస్త్ర సంగ్రహము

### రెండవ, మూడవ ముద్రణముల ముఖపత్రములు

హిందూ శాస్త్ర సంగ్రహము ఇంగ్లీషుభాషయందు చెన్నపట్టణము హైకోర్టు జడ్జిగా న తామస్ లంస్డన్ స్ట్రేంజి దొరగారిచేత రచింపబడినది

ఈ గ్రంథము పరవస్తు చిన్నయసూరిచేత, నరహరి గోపాలకృష్ణమ సెట్టిగారి సాహాయ్యము వలనఁ దెనుఁగింపఁబడియె

Third Edition – 1869
Hindu Press, 13 - Armenian Street
C. V Krishnaswami Pillai
Copy right
Second Edition - 1863 సం

## కృతి - నీతి సంగ్రహము

కృతికర్త మదరాసు యూనివర్శిటీయందుఁ దెనుఁగు ప్రథమోపాధ్యాయుఁడు, పరవస్తు చిన్నయసూరిచే ప్రాచీన పద్యంబులు కొన్నింటితోడం బెక్కులభినవ నవ పద్యంబులు గూర్చి బాలురకు నీతిబోధంబుకై యీ కృతి రచియింపఁబడి, పరవస్తు వెంకట రంగయ్యగారిచే లేఖక ప్రమాదజనిత దోషంబులు లేకుండ పరిష్కరింపఁబడి ముద్రింపఁబడియె.

Madras
Printed at the Hindu Press,
by
C. V. Krishnaswami Pillai
No. 13, Armenian Street
1862

## చిన్నయసూరి సమకాలీనులు

కోమలేశ్వరపు శ్రీనివాసపిళ్ళ (1804-1859) చెన్నపురి పచ్చయప్ప దానధర్మ నిధికి, వ్యవహర్త ఆంధ్రభాషాభిమాని వీరివలననే చిన్నయ సూరి పచ్చయప్ప కళాశాలలో పండిత పదవి వడసెను

1 నరహరి గోపాలకృష్ణమసెట్టి (1823-1888) ఈతఁడు చిన్నయ సూరికి "హిందూధర్మశాస్త్ర సంగ్రహ" భాషాంతరీకరణమున సహాయ మొనర్చెను ప్రభుత్వోన్నతద్యోగియయ్యు నాంధ్రభాషా పండితుడు. శ్రీరంగరాజ చరిత్రమను నవల (1872) ను రచించెను కర్నూలు మండల మున నితనిపేర యిప్పటికి నొక పేట యున్నది ఈతని జీవిత చరిత్రము నంతయు శతకరూపమున రాజామణిసెట్టి యను నీతని తనయుఁడు రచించి ప్రకటించియున్నాడు (1889) ప్రభుత్వోద్యోగియయ్యును, ప్రజాభ్యుదయము కొఱకు పాటుపడిన మహనీయుడు ప్రభుత్వగౌరవము, ప్రజామోదము బడయుటయన్న యీ కాలమున యసిధారా వ్రతము వంటిది దానిని ప్రత్యక్షరము పాటించిన యాంధ్ర మహాపురుషుడు గోపాలకృష్ణమసెట్టి ఈతని సమగ్రజీవితమువఱ కాంధ్రులకు సుపరిచితము కాలేదు.

శ్రీ

# సాహిత్యోపన్యాసములు

౨

[1962 వ సం॥రము జూలై 16 వ తేదీని హైదరాబాదులో నన్నెచోడ పదప్రయోగ కోశావిష్కరణ సభలో నొసంగఁబడిన యుపన్యాసము]




ప్రచురణ.

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి

కళాభవన్ : హైదరాబాదు

శ్రీ

# సాహిత్యోపన్యాసములు

౨

[1962 వ సం॥రము జూలై 16 వ తేదిని హైదరాబాదులో నన్నెచోడ పదప్రయోగ కోశావిష్కరణ సభలో నొసంగఁబడిన యుపన్యాసము]

డా. దివాకర్ల వేంకటావధాని




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ : : హైదరాబాదు

# ప్రకాశకుల విజ్ఞప్తి

1962 వ సంవత్సరము జూలై 16 వ తేదీని నన్నెచోడ పదప్రయోగకోశ మాంధ్ర సారస్వత పరిషద్భవనమున ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి అధ్యక్షులైన శ్రీ డా బెజవాడ గోపాలరెడ్డిగారిచే ఆవిష్కరింపబడినది ఆ సందర్భమున నన్నెచోడుని కుమారసంభవమందలి భాషాప్రయోగ విశేషములను గూర్చి శ్రీ డా దివాకర్ల వేంకటావధాని గారి నుపన్యసింపుమని కోరి యుంటిమి వారు మా కోరిక నంగీకరించి యా విషయమును గూర్చి విపులమైన యుపన్యాసము నొసంగియుండిరి అకాడమి పక్షమున ఏర్పాటుపబడు సాహిత్య సభలలో జరుగు నుపన్యాసము లను పుస్తకరూపమున ముద్రింపవలెనను సంప్రదాయము ననుసరించి ఆ యుపన్యాసము సాహిత్యోపన్యాస పరంపరలో ఐదవదిగా ముద్రింపబడినది మేము కోరిన వెటనే నన్నెచోడుని కుమార సంభవ మందలి భాషాప్రయోగ విశేషములను గూర్చి పరిశీలనము గావించి యీ యుపన్యాసము నొసంగిన శ్రీ డా అవధానిగారికి మా కృతజ్ఞతలు

హైదరాబాదు
29-8-64

(సం) దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి,
ఆం ప్ర సా అకాడమి

# నన్నెచోడుని కుమారసంభవము: భాషాప్రయోగ విశేషములు

ఆంధ్ర వాఙ్మయమునందలి శివకవులలో నన్నెచోడుఁడు మొదటివాఁడు ఇతఁడు నన్నయకుఁ బూర్వుఁ డనియు, నన్నయకు సమకాలికుఁ డనియు, నన్నయ తిక్కనల నడిమికాలము వాఁడనియు, తిక్కనకుఁ దరువాతి వాఁడనియు నాల్గు వాదము లున్నవి పలువురు విమర్శకు లతఁడు నన్నయ తిక్కనలకు నడిమి కాలము వాఁడను వాదమునే యంగీకరించుచున్నారు అతఁడు రచించిన కావ్యము కుమారసంభవ మొక్కటే కాళిదాసుని కుమారసంభవమునందలి శ్లోకముల కనువాదములు, ఛాయలు అని చెప్పఁదగిన పద్యము లిందుఁ గొన్ని యున్నను ఇది స్వతంత్ర కావ్యమే యని చెప్పుటకు సందేహింప నవసరము లేదు భాషాప్రయోగ విషయమున తరువాత వర్తిల్లిన పాల్కురికి సోమనాథునివలెనే యితఁడును గొంత స్వాతంత్ర్యము ప్రదర్శించినాఁడు అందుచే నన్నయ భారతము నందలి భాషకును, ఇతని కుమారసంభవము నందలి భాషకును జాల తారతమ్యము గోచరించును ఇతఁడు నన్నయకుఁ బూర్వుఁడని భావించు వా రందు కితని ప్రయోగముల ప్రాచీనతయు నొక కారణముగాఁ జెప్పుచున్నారు - అట్లుగాక యితఁడు నన్నయకుఁ దరువాతివాఁడే యైనను ఆంధ్ర వాఙ్మయమున వెలసిన ద్వితీయ మహాకవి యగుటచే నితని కావ్య మందలి భాషాప్రయోగ విశేషములఁ బరిశీలించుట ఆంధ్రభాషా చరిత్రమున కెంతయో తోడ్పడఁ జాలును

## ధ్వనులు

నన్నయకుఁ బూర్వమున్న శాసనములలో ఱ, న్ఱు అను ధ్వను లున్నను నన్నయ వానిని పరిహరించుటచే నవి భారతమునఁ గనఁబడవు

క్రమముగా ఱ కారము డ, ళ, ఱ ల రూపమును, న్ఱు, డుఙ్ రూపమును బొందినవి. నన్నెచోడుని కుమార సంభవము నందును ఇవి కానరావు ఇక్లే సంయుక్తాక్షరములం దెక్కడను శకటరేఫ ముండదు.

నన్నయ భారతమున క్షకారమునకు కకారాదులతోనే కాని చకారాదులతో నెచ్చటను యతి వేయఁబడలేదు క్షకారమునకు జ స శ లతో యతి వేయఁబడి నట్లు ముద్రిత ప్రతులలోఁ గనవచ్చు మూఁడు ప్రయోగములకును పాఠాంతరము లున్నవి సంస్కృతమునందలి క్షకారము ప్రాకృతమున ఖ, ఛ కారములుగా మార్పు చెందుచుండును ఖకారోచ్చారణమే తన కెక్కువ సమ్మత మగుటచేఁ గాఁబోలు నన్నయ దానికే ప్రాధాన్యము నొసఁగి యుండెను కుమార సంభవమున క్షకారమునకు క చ వర్గములు రెండింటితో యతి వేయఁబడి యున్నది

సతి జన్మంబున్ గణాధీశ్వరు జననము దక్షక్రతు ధ్వంసముం 1-68
ఒనకుం గల్లోల మాలా చలిత నిజతట క్ష్మాజరాజీ విలాసున్ 1-115
క్షితి సర్వేశ్వర పాదభక్తుల మహాకీర్తి ప్రభానూన 12-222
క్షతజాతపాతతోయోత్కరముఁ గరికులక్ష్మా ధరాకీర్ణము 11-197

దీనినిబట్టి క్షకారమునకు నన్నెచోడుని నాఁటికి ఛకారోచ్చారణము కూడ ప్రబలమయ్యెనని భావింపవచ్చును

న ల లను ణ ళ లు గా నుచ్చరించు నాచారముకూడ నన్నెచోడుని నాఁటికి తగ్గినట్లు కన్పించుచున్నది

అద్రుచు అను ధాతువునకు సంబంధించిన రూపములందు కుమార సంభవమున అకారము లఘువుగానే యున్నది

బ్రహ్మాండ ఖండ మద్రువ 11-3, వియత్తలం బద్రువ 12-131
ఆర్తరవంబు మిన్నద్రువఁ జెలఁగ 5-70

నన్నెచోడుఁడు ఎడఁద యను పదమును కొన్నిచోట్ల ఎడ్డ అను రూపముతో వాడి యున్నాఁడు వానిలో సర్వత్ర ఎ లఘువుగానే యున్నది

ఎడ్డ నీ శ్రీపాదముల్ భక్తితో 10-90
నిన్ను మానవు డెడ్డం గామించి సేవించి 10-97
ఆనందుం డమందుం డెడ్డన్ 12-226
పైనెత్తిరానెన్ని యెడ్డలు గలవు 9-42

ఎడ్డ అను రూపము వాడినచోట్ల ఎ గురువుగానే యున్నది

కం. కాదెడ్డ నజుఁడు నోపని - వేదము లేర్పఱిచె ననిన 1-18

నన్నెచోడుఁడు మిశ్ర సమాసములు పెక్కు వాడుచుండును అట్టి వానిలోఁ గొన్నిచోట్ల నతఁడు భిన్న పదాదిని గల సంయుక్తాక్షరమును బట్టి తత్పూర్వ పదాంత్యాక్షరమును గురువుగాఁ జేయుచుండును

చం మరుప్రసవాస్త్రహతిన్ జలింపదే 5-133
మ. మనమారంగ నొక క్షణంబయిన 10-94

ఈ సమాసములలో రు-క అను వానిని గురువులుగాఁ జేయుటకు వీలు లేదు

సంస్కృతమునందలి "తృణ" శబ్దమును నన్నెచోడుఁడు "త్రిణ" రూపమున వాడుచుండును. అది సమాసగతమై యున్నప్పుడు పూర్వ పదాంత్యాక్షరము గురు వగుచున్నది

శా అంభోజ రాగ త్రిణానీకో ద్యద్ధరి దశ్మకస్థల 6-103, 10-161

ఆశ్చర్య శబ్దమునకు వికృతి అచ్చెరువు. దీనిని నన్నెచోడుఁడు అకార మధ్యముగా వాడి యున్నాడు

అ-చ్చరువడి పిచ్చలింప భుజ-శక్తియు షణ్ముఖు నుగ్రశక్తియున్ 10-121
అ-చ్చరువు పిశాచ కాంతలు పి-శాచములం దవిలించి రొప్పులన్ 11-202

నుగ్గు అను పదము కుమార సంభవమున నుగ్గఁ (నుర్గు) అను రూపమునఁ గూడఁ గనవచ్చుచున్నది

నుగ్గాడఁడన్ ఘటకోరకంబు లలరన్ 11-34 ప్రాసస్థానము
నుర్గుగా నరద సమూహివై చి 12-171
నుర్గునూచగాఁ దురగ రథంబులు 11-146

నన్నయ భారతమున "నుగ్గు" అను రూపమే వాడఁబడినది (ఆ-2-49, ఆ-234)

దీనినిబట్టి ఆ కాలమున ఈ శబ్దము విషయమున సమీకరణము కొన్ని ప్రాంతముల పూర్తిగా జరిగెననియు, కొన్ని ప్రాంతముల జరుగుచుండె ననియు నూహింపవచ్చును

నన్నెచోడుఁ డవసరమైన చోట్ల 'వర్ణనాశము' చే మధ్యమాక్షరము నందలి అచ్చును లోపింపఁజేసి సంయుక్తాక్షరములతోఁ గూడిన రూపములను వాడుచుండును

తర్గంగా రథపత్రముల్ విఱిఁగి 11-34 (దఱుఁగంగా)
మర్గింతుం బర సైన్య పద్మవనముల్ 11-34 (మఱిఁగింతున్)
వండఁ దర్గి నట్లడగొని యుండె 11-192 (తఱిగి)
తద్జ్ఞునం దెర్గనగు -1-32 (ఎఱుఁగ)
చూచి కాకెర్గ వచ్చునె 1-32
తాల్మికి కట్టవ్సి వెడలెనా 5-127 (అవిసి)
లోడసినసెంత మెర్గడరి యున్నొ 7-7 (మెఱుఁగు)
అణ్చుఁగోయిలలు-అణ్చెఁ గోయిలలు 8-152 (అణఁచు, అణఁచె)
పులకలు పొడ్మె నంగమున 10-89 (పొడమె)
పను లడ్గరాడ జంభారి 10-191 (అడుగ)
ప్రతిబల మంతయు మర్గి 11-36 (మఱిఁగి)
వైఁ గ్రమ్మకొని కుర్యు బాణవృష్టిఁ 11-195 (కురియు)
పీరొరుచేఁ దాఁకె నీరని పో టుడ్గి 12-103 (ఉడిగి)

స్వరభక్తిచే శబ్దము నందలి సంయుక్తాక్షరమును రెండక్షరములుగా విడఁదీసి వాడుట కుమారసంభవమునఁ బెక్కుచోట్లఁ గాననగును సంస్కృత శబ్దములందుఁ గూడ నిట్టి మార్పులు కావించి నన్నెచోడుఁడు వానిని సాంస్కృతిక సమాసములలో సైతము వాడుచుండును

వధాద్యాపదల కరుహా (2-80), బరిహి కేశభరంబున (4-102), నీముక్కు చనుపక మనుభీతి (5-165); ఆ వనితలు చనుపక పుష్పావలిచేఁ బట్టుకొనుచు (9-120)

చంపకమునకు చనుపక మను వికృతిరూప మున్నది (శ ర) అప్పుడు చనుపక పుష్పావలి యనునది వైరిసమాసమగును జలజాత కైరవోత్పల కలహారాది గంధంబులు (9-72), తేల్చెవడిన్ హారుపాశుధారలన్ (12-213) అనునవి కూడ నట్టివే

నన్నెచోడుఁడు యౌవన మను పదమును యవ్వన మను రూపమున వాడి యున్నాఁడుంఇప్పుడు కూడ నా శబ్దము నట్లుచ్చరించుట కలదు

ఉమా-యవ్వన వారిపూర సురతాబ్ధి (9-157) ప్రాసస్థానము

తిగియు ధాతువునకు తివియు, తివుచు అను రూపాంతరము లున్నవి ఇందు తివియు రూపమునందలి మధ్యమ - ఇకారమును తొలఁగించినచో నది తివ్య్ర అయి తరువాత సమీకరణముచే తివ్వు అగును నన్నెచోడుఁ డీ రూపమును రెండుమూఁడు చోట్ల వాడియున్నాఁడు

విట మత్స్య వ్రాతముం దివ్వుచున్ 8-53
మైఁ దివ్వఁడ లోకవర్తనకు 9-157

దృష్టి శబ్దమునకు బహువచనము దృష్టులు ఇందలి మధ్యమ - ఉకారము లోపించిన దృష్ట్లు అను రూపము వచ్చును భారతమున నీ రూపము వాడఁబడినది నన్నెచోడుఁడు దానిని ద్వితీయావిభక్తిలోఁ గూడ వాడి యున్నాఁడు

అనిమిష దృష్ట్లను నాకి సమితి దగిలి కనుఁగొన (4-39)

కొను ధాతువునకు తద్ధర్మ ప్రథమ పురుష బహువచన రూపము కొనుదురు ఇది కొందురు - కొండురు అను రూపములను బొందును కాని మొదటి రూపమునకే ప్రాచుర్య మెక్కువ నన్నె చోడుఁడు కొండురె అను రూపము వాడినాఁడు

నే కొన్న మరుల్ జగజ్జనులు గొందురె ప్రాత్యులఁ బూజ్యు లందురే
2–34

దీనికి కొందురె అను పాఠాంతర మున్నది

**అం**దురు (అనుదురు) అను రూపము కూడ కుమారసంభవమున **ను**న్నది

మారుపు లందిన మేని కందురు 7–123

ఇచ్చటఁ గూడ మేని కందురని యనవచ్చును వావిళ్ళ వారి ప్రతిలో నా పాఠమే యున్నది.

బహువచన రూపముల తుది ఉకారము లోపించిన "పలువుర్" వంటి శబ్దములు నన్నెచోడుఁడు వాడినాఁడు 1–23

దీర్ఘము మీఁద నెఱసున్నగల రూపములు కుమారసంభవమున పెక్కు కానవచ్చుచున్నవి నన్నయ భారతమున నిట్టివి లేవు

వీంగు నపార సత్త్వగుణ విస్ఫురణ౯, లోంగొని పేర్మితోన్ 1–4
వీండె ఖలుండు దక్షుఁడను వీఱిఁడి పాఱుఁడు 2–84
వీం డేమిసేయుఁ బంచినవాం డుండఁగ, పసినవాం డుండఁగ
10–155

ఫోండిగ నగజ తపశ్శిఖి మూండుజగంబులకు దీవ్రముగఁబర్విన
6–157

ఫోంక నలినీ రజస్వల సోంకిన దోషంబువాయ 8–88
వీంక మదకరులు రెండుం దాంకె వడిం గొండఁ గొండఁ దాఁకిన భంగిన్ 12–58
నాందగు శీతలోపకరణంబులు. 5–141

వాన్డు (వాణ్డు) అను రూపము నన్నయకుఁ బూర్వపు శాసనములలో పలుచోట్ల గలదు

## విభక్తి ప్రత్యయములు

**డు, ము, వు** ప్రథమైకవచన ప్రత్యయములు అకారాంత పుంలింగ శబ్దములకు ప్రథమా విభక్త్యేక వచనమున డు చేరును ఇది బిందుపూర్వం

కమై యుండును ఈ డు జ్వర్ణకము మహద్వాచకములైన కొన్ని తెలుఁగు శబ్దములందుఁ గూడఁ గనఁబడుచున్నది తత్సమములందు పెక్కింటికి డుజ్వర్ణకమునకుఁ బూర్వము ఉత్వము వచ్చును ఈ విధముగా రాముఁడు, శివుఁడు మొదలగు రూపము లేర్పడుచున్నవి నన్నయకుఁ బూర్వపు శాసనములలో ఉత్వము మాత్రము వచ్చి డు జ్వర్ణకము రాని పాతకు, పణ్డరంగు మున్నగు రూపము లున్నవి నన్నెచోడుఁ డిట్టి రూపము నొక్కచో వాడియున్నాఁడు

జలధి మహీపతి మొలనూలుగాఁ జుట్టి పాలించెఁ గలిఁ గరికాలచోడు.

కొన్ని తత్సమములకు, మహద్వాచకము లైన తెలుఁగు శబ్దములకు డుజ్జు వచ్చునుగాని ఉత్వమురాదు నన్నయకు పూర్వమును దరువాతను వేయఁబడిన శాసనములలోఁ గూడ నిట్టి రూపము లున్నవి (రామణ్డు, దేవడు, భీమండు) కుమారసంభవమున నన్నెచోడఁడు, గరుడఁడు అను శబ్దములు వాడఁబడినవి వీనియందు డుజ్జునకు పూర్వ ముత్వము రాలేదు

సత్కవి భువి నన్నెచోడఁ డశె 1 - 57

హరిఁ ద్రోచికొనిపోయి గరుడండు దేగగా విడుచు భేరుండాది విహగములకు 4 - 23

గరుడుఁడు అనుటకు గరుడి యను రూపము కూడ ప్రయోగింపఁ బడినది

గరుడి నడుము మెడయుఁ గాలును గేలును 2 - 71

గరుడి విచిత్రాంగముపై హరి యెక్క 8 - 29

'కలవాఁడు' లోని వా లోపింపగా నేర్పడు 'కలఁడు' అను రూప మొక్కచో నున్నది

పురులు గలఁ డిచ్చునని 8 140

దేశ్యమైన అకరు శబ్దమునకు అకరువు అను రూపాంతర మున్నది ఇది ఉకారాంత తత్సమ శబ్దముల సామ్యమున వచ్చిన రూపమై యుండును నన్నెచోడుఁడు మూఁడు నాల్గు చోట్ల అకరువు అను రూపమునే వాడి యున్నాఁడు

పొదిగొన్న యకరువు సెదరకుండ 3-108.

తాలుపు (ధరించువాఁడు) అనునది స్త్రీసమము నన్నెచోడుఁడు దీనికి డుఙ్ఞు చేర్చి ప్రయోగించి యున్నాఁడు.

తగిలి యున్న తమ్మి దాల్పుఁ డొక్కొ 10-56

అదంతములు దీర్ఘపూర్వలోపథములు నగు మహత్తుల మీఁది లు వర్ణకమునకు రు వచ్చును

ఒండొరుల కంటె మనోభవ కేళి లోలురై 9-153

అదంతమును దీర్ఘపూర్వలోపథమును కాకపోయినను అల్లుఁడు శబ్దమునకు బహువచనమున అల్లురు అను రూపము వాడఁబడినది

తన యల్లు రందఱ చేసిన సత్కారంబులును 2-3

కింక పడం జన దల్లు రిత్తఱిన్ 8-137

అందఱు, ఎందఱు, కొందఱు అనువాని యందలి తుది ఱు వర్ణము బహువచన ప్రత్యయమే కుమార సంభవమున చూపఱు, పగఱుఁ అను ప్రయోగము లున్నవి

చూపఱ విదిశలు సొరఁగఁ దోలి 2-66,

చూపఱు మెచ్చి చూడఁగన్ 9-33

శబ్దరత్నాకరమున చూపఱు శబ్దము చూపు + వారు అని విడఁదీయఁ బడినది

భయార్తులై కూడిన పగఱఁ దమకు (10-195)

అని పగఱ శబ్దము ద్వితీయా బహువచనమున వాడఁబడినది దీనికి ప్రథమా బహువచన రూపము పగఱు అని యుండ నగును. కాని దీనిని నన్నయ కాని నన్నెచోడుఁడు కాని యెక్కడను వాడి యుండలేదు శబ్దరత్నాకరకారుఁడు దీనిని పగ + వారు అని విడఁదీసి యున్నాఁడు

నన్నెచోడుఁడు వేఁట, ఈఁటె మున్నగు పెక్కు శబ్దములపై కాఁడు అను తద్ధిత ప్రత్యయము వాడి యున్నాఁడు దీనికి బహువచనమున కాఱు, కాండ్రు అను రూపము లగును నన్నెచోడుఁడు కాఱు అను రూపమునే వాడి యున్నాఁడు

దురము సేసిరి కైవున నీఁకె కా అనిన్ 11-151
వేఁటకాఱు ముట్టి వెనుకొనఁగా 2-72

ఆల్వాదుల బహువచన ల కారమునకు రేఫంబును, ముందటి లు వర్ణంబునకు బిందుపూర్వక డకారంబు నగునని చిన్నయసూరి దీనిని బట్టి ఆంధ్రు అను రూప మేర్పడును ఆండురు అనుదాని యందలి ఉత్వము లోపింపఁగా నీ రూపము వచ్చియుండును నన్నెచోడుఁడిట్టి రూపములను వాడి యున్నాఁడు

మగలఁ గల్వక యాండురు దొల్లి యాండురం గలుతురె 8-151
వెలయాఁడుర జవ్వనంబు 8-157.

అరుంధతి యాదిగాఁ బేరఁటాంద్రయి యనుచోట (9-21) ఆంధ్రు అను నుత్వ లోపముతోఁ గూడిన రూపము కూడ నున్నది

నన్నెచోడుఁడు వాంధ్రు అను రూపమును వాడి యుండలేదు నన్నయ భారతమందును ఇది లేదు వారిరువురను 'వారు' అను దానినే ప్రథమపురుష బహువచన సర్వనామ రూపముగా వాడి యుండిరి ర ల డాంతము లగు పదములకు బహువచన ల కారము చేరునప్పు డందలి యుత్వమునకు లోపము కలుగు ననియు, బహువచన శ్లిష్టములయి అద్విరుక్తము లైన డకార ల కారముల కెల్లను ల కారము నిత్యముగా నగు ననియు బాలవ్యాకరణము చెప్పుచున్నది దీని వలన డ్లు వర్ణాంతరూపములు పరిహరింపఁ బడుచున్నవి నన్నయ భారతమున నిప్పుడు ళ్లు వర్ణాంత రూపములు కనవచ్చు చున్నవి కాని నన్నయకు డ్లు వర్ణాంతరూపములే సమ్మతము లని ఆచార్య శ్రీ గంటి సోమయాజిగారు తెల్పియున్నారు (ఆం భా వి 403) నన్నయ కాలమునను అంతకు పూర్వమును గల శాసనములలో డ్లు, ళ్లు వర్ణాంత రూపములు రెండును గనవచ్చు చున్నవి కుమారసంభవమున డ్లు వర్ణాంత రూపములు లేవు ళ్లు ళులు వర్ణాంత రూపములు గోచరించుచున్నవి

రాళు లన నెల్ల దెసవానకాళు లమరె 6-97
ఎలుకలు పిల్లులు లేళ్ళుం 6-67
వ్రేళ్ళునులోమ్ముఁ బోయి యాచకు లై 7-36
ఈ వచ్చిన పేళ్ల యందు 2-24

నన్నయ వలెనే నన్నెచోడుఁడును ఏఱులను రూపములే కాని ఏళ్లను ళ్లు వర్ణాంత రూపమును వాడియుండలేదు (6-115, 5-172)

నన్నెచోడుఁడు కొలఁకులు, వ్రాఁకులు, మెఱుఁగులు, వలఁకులు, ఎలుకలు మున్నగు రూపములును వాడియున్నాఁడు ఇందలి కలు, కులు, గులు అనునవి కళ్, గళ్ అను ద్రావిడ బహువచన ప్రత్యయముల మాఱు రూపములు అనుచిత విభాగముచే నిందలి యాద్యక్షరములు పదగతములుగా భావింపఁబడుట సంభవించినది అందుచేతనే ఎలుక, మెఱుఁగు, చిలుక మొదలగు నేకవచన రూపము లేర్పడినవి మెఱుమునకు బహువచన రూపము మెఱుఁగులు అనుచిత విభాగముచే నిది యేకవచనమున మెఱుఁగైనది ఇందలి అర్ధానుస్వారము పోయిన ముపర్ణమునకు చిహ్నమై యుండును

"కూర్చి, ల, ను, నయోశ్చ వేద్ద్వితీయాతు" అని ఆంధ్రశబ్ద చింతామణి కూర్చి, ల, ను, ని అను వానిని ద్వితీయా విభక్తిప్రత్యయములుగాఁ బేర్కొన్నది నన్నయభారతమున కూర్చి అను ప్రత్యయము లేదు ముద్రిత ప్రతులలో గుఱిచి, గుఱించి యను ప్రత్యయములు కనవచ్చుచున్నవి కుమార సంభవమున కూర్చి అను ప్రయోగము మూఁడు నాలుగు చోట్ల నున్నది కాని అది యా యన్నిచోట్లను కూర్చు ధాతు క్త్వార్థక రూపమైన పదముగనే వాడఁబడినది కాని, విభక్తి ప్రత్యయముగా వాడఁబడి యుండ లేదు గుఱిచి, గుఱించి అను వానిని గూడ నన్నెచోడుఁడు వాడలేదు.

త్రిపురుషము దానయైనగతిఁ బొల్చె బురాంగనలోలిఁజూచుచున్
8-71

అనుచోటఁ బురాంగన లను ప్రథమా బహువచన రూపము ద్వితీయార్థమున వాడఁబడినది పురాంగనల నని యర్థము, ఇట అజడము ద్వితీయకును ప్రథమ వాడఁబడినది కాని వావిళ్ళవారి ప్రతిలో "పురాంగన లోలిఁజూచుచున్" అను పాఠము కనఁబడుచున్నది.

కైసేయు, విభూషించు అను వాని క్రియారూపములకుఁ గర్మలైనట్లు పదములకు ద్వితీయా విభక్తికి బదులు షష్ఠీ ప్రత్యయ మెనకు వాడఁ బడినది

రోహణాచలపతి కూహించి పరరత్న సంచయంబున విభూ
షించునట్లు 1 - 49.

పడఁతుల కై సేసి రచలపతి సుతకెలమిన్ 9 - 14

ద్వితీయా ప్రత్యయమైన 'ను' జడవాచకములకు తృతీయాసప్త మ్యర్థములందు పలుచోట్ల వాడఁబడినది

కామాసక్తి నాసక్తమై 1 - 100 (కామాసక్తితో)
గణనాథుం డుర్వి జన్మించిన 1 - 109 (ఉర్వియందు)
కూఁతులఁ జూడఁగ నరిగె నతికుతూహల బుద్ధిన్ (బుద్ధితో) 1-111
వనధిఁ గల నగములు (1 - 117) (వనధియందు)

నన్నెచోడుఁడు చేత, చే, తోడ, తో, తోడుత, చేసి, మై, న అను ప్రత్యయములను తృతీయార్థమున వాడి యున్నాడు

నిజభుజ శక్తిచేతం జెటిచి 10 - 132 (కరణార్థకము)
తారకాసురుచేతం బరాజితులై 4-47 (కర్త్రర్థకము)
వీనిచేత సురవరులు పెక్కుమాఱులు పరిభవపడిరి (12 - 150)
హేత్వర్థకము
వలరాజు సురరాజుచేత నపార సత్కారంబులు గొని (4 - 54)
గ్రహ్యాది యోగము
తెమ్మెరలచే నల్లాడు లేఁదీఁగ (11 - 58) హేతువు
శిలీముఖహతిచే సుమనోదర్పంబు చెడుట (12 - 124) కరణము
వరదుచే వరము వడయ (5-73) గ్రహ్యాదియోగము
దృగ్విలాసము మృగంబులచే.. ఇల్లడల్ గలయఁగఁ బెట్టె 6-91

అనుచోట చే దెస అను నర్థమున వాడఁబడినది

సర్వేశుతోడ నెన్ని సాఱులు వెట్టఁ నెన్నెదీపు 7-27 (తుల్యార్థము)
తమతమ రాజ్యచిహ్నములతోడ వెలసి 8-36 (సహార్థము)
వేదరావములతోఁ గిన్నర గంధర్వ గీత లులిసె 12-91
కొండఁ గొండతోఁ దాఁకినగతి 11 - 140 కరణము

తోడ -మీఁద అను నర్థమున వాడఁబడినది.

ఎలుకతోడి కోపమున 2-58, వానితోడి పగన్ 4-15

సహార్థమున తోడుత అను ప్రత్యయము వాడఁబడినది

వేళ్లతోడుతఁ గల్పవృక్షముల్ వెఱికించి 4-11

నన్నయ దీని నెచ్చటను వాడియుండలేదు కాని అరణ్యపర్వమున (2-71) నా తోడుతఁ గడునిడుమలు వడఁజాలవు-అనుచో నది పాఠాంతరముగా నీయఁబడినది

చేయు ధాతుక్త్వార్థకరూపమైన చేసి - చేత అను నర్థమున వాడఁబడినది ఇది సాధారణముగా తృతీయార్థకమైన 'న' తరువాతఁ గాని ద్వితీయా ప్రత్యయముల తరువాతఁ గాని వచ్చుచుండును

మా పుణ్యమునఁ జేసి వచ్చుట 3-12, సామదానములఁ జేసి జయింతురు 10-189

తృతీయార్థమున మెయి, మై, న అను ప్రత్యయములు కూడ వాడఁబడినవి

ఆమనిఁ బిల్చి వేగమెయి (తో) 4-85, నిరుపమ కీర్తిమైఁ దనరి (తో) 7-13
వచ్చె వేగమునఁ గడంగుచున్ 11-68, వ్రేఁగునఁ జివ్వంకలు వంగ 9-113

కొఱకు, కయి చతుర్థ్యాస్స్యుః - అని ఆంధ్రశబ్ద చింతామణి

నన్నయభారతమున కొఱకు అను ప్రత్యయము లేదు ఆదిపర్వమున నది రెండుచోట్ల పాఠాంతరములం దున్నది

ఒక్క యువతి కొఱకు 8-93, ఒరుల నొప్పి కొఱకు 3-210.

కుమారసంభవమున 8-136 వచనములో "ఎడకొఱ కెడసొచ్చి చిల్లతర్కంబు లాడుచు" అను వాక్యమున నది కనఁబడుచున్నది దీని కర్థమేమో తెలియకున్నది ఎడకొఱకు అను దానికి ఎడకారకు అను పాఠాంతరమున్నది తార్పుకాండ్రకని యర్థము ఇంకెక్కడను కొఱకు ప్రయోగింపఁబడి యుండలేదు కై అను ప్రత్యయము రెండుచోట్ల నున్నది

దక్షుండను నిద్దురాత్మునకై (2-81)
బడరునకై నవయనేమి ప్రళయము వచ్చెన్ 7-39

నన్నయభారతమున కు + అయి అనువాని కలయిక వలన కయి యేర్పడుచున్నట్లు తెలియుచున్నది కుమారసంభవమున నొకటి వచన మందును, వేఱొకటి యతితో సంబంధము లేనిచోటను నుండుటచే దాని స్వరూపము నిర్ణయించుట కవకాశము లేదు

యుద్ధముచేసిరి భటులు శౌర్యదర్పోన్నతికిన్ 12-124

అనుచోట షష్ఠికి ప్రత్యయము కై యను నర్థమున వాడఁబడినది

సంప్రదానంబునం జతుర్థియగు నని చిన్నయసూరి కాని అట్టి యెడ చతుర్థికి మాఱుగా షష్ఠియే తఱుచు ప్రయోగింపఁబడు చున్నది నన్నెచోడుఁడును సంప్రదానమున కు ప్రత్యయమునే వాడినాఁడు

మత్సుతన్ హరునకు నిత్తు 7-234

కుమార సంభవమున పొంటెన్ అను ప్రత్యయము కానరాదు

పట్టి, వలన, కంటె' అనునవి పంచమీ విభక్తి ప్రత్యయములు (ఆం శ చిం)

నన్నయభారతమున వలెనే నన్నెచోడుని కుమారసంభవ మందును పట్టి అను ప్రత్యయము కనరాదు.

దిగర్థకమైన వలను శబ్దమునుండి యేర్పడిన వలన ప్రత్యయము అపాయ భయ త్రాణ గ్రహణ వారణా ద్యర్థములందు వాడఁబడినది

అమ్మహాదేవి వలన లబ్ధ వరప్రసాదుఁడై 1-71
మీరు భిక్షువలని భయంబున 2-41
తమ కుమ వలన న్నిలుకడ యగు నని 3-42

వలన 'దెస' అను దిగర్థమునఁ గూడ పెక్కుచోట్ల వాడఁబడినది

మలయానిలంబు నీ వలన రాదు 5-165
మావలన దోసములేదని 8-16, నారీమణి వలనఁ బర్వురాగ మొక్కొ 8-107

దీనినిబట్టి నన్నెచోడుని కాలమున నప్పుడప్పుడే వలను పదత్వమును క్రమముగా వీడుచు ప్రత్యయత్వమును బొందుచుండెనని భావింపవచ్చును వలన కొన్నిచోట్ల హేత్వర్థమునను (చేతవలె) కొన్నిచోట్ల 'నుండి' యనునర్థమునను గూడ వాడఁబడినది

నారదువలన విని (నారదునుండి) 2-49, నీవలన సతులపురులు వాలిసెఁ గాక (నీచే) 7-36, భూముక్తకిబంధముల వలన మొగిఁ గ్రమ్మ (నుండి) 11-181, కొలను వెడలిరి జలకేళి వలనఁ దనిసి (చే) 9-91, నీవలనన కానియొరునకు సాధ్యంబుగాదు (చేతనే) 4-47.

కు, ను అను ప్రత్యయములు కొన్నిచోట్ల పంచమ్యర్థమున వాడఁబడినవి

పానితి మీకు నింతలోన్ 6-19
బ్రహ్మాండ నికరంబు పరమేశు జలమూర్తి నుదయించు నల్ప బుద్బుదము లనగఁ 7-27

పంచమ్యర్థమున వచ్చు ద్వితీయకును ప్రథమ వాడఁబడును.

ఘనపటలంబు వెల్వడు వికాసిత, కండవడ మల్లన వెల్వడి 9-20.
కొలను వెడలిరి జలకేళి వలనఁ దనిసి 9-91

ఇచ్చటి ప్రథమకు నుండి యను నర్థము చెప్పుకొనవలెను

లో యను షష్ఠి ప్రత్యయము కూడ నుండి యను నర్థమున వాడఁబడినది

జలధరంబులో వెలువడు చంద్రమండలంబొ 9-8

పెక్కు చోట్ల ఎందున కుండి పదం బనుప్రయుక్తమై పంచమ్యర్థము నొసంగుచున్నది

ఎఱుక నీ కిప్పు డెందుండి దొఱకిపడియె 2-29.
నీ వెవ్వరిపని కెందుండి వచ్చితి 10-130.

అన్యార్థాది యోగజమైన పంచమికిని, నిర్ధారణపంచమికిని కంటె వర్ణకము వాడఁబడును

పరమేష్ఠి నీకంటెఁ బరువిడిఁరెయే 2-29
క్రొవ్విరితోవకంటెఁ గోమలంబగు మోము 6-13
తొల్లిటి కంటెను జెలువ మెసఁగ 7-63 (నిర్ధారణ)

నిర్ధారణ పంచమ్యర్థమున కు వర్ణకమును వాడఁబడినది

తన కధికుల కతిభక్తియు 10-188 (తన కంటె)
తన్ను శివునికంటె నన్నెంబు గాకుండు టెఱిఁగి 6-79 (అన్యార్థ యోగజము), కవయఁ గాన్పుకంటె సుఖంబున్ బరికింప నొండు లేదు 8-164, విరహమున కంటె దుఃఖము 8-164

అనుచోట వలెఁ గొన్ని చోట్ల కంటెకు ముందు 'న' ఆగమముగా వచ్చుట కలదు

కంటె కొన్ని యెడల క్రియాజన్య విశేషణముల మీఁదఁ గూడఁ గనవచ్చును

సిద్ధియుఁ గన్నకంటె 7-13
ఇడుగడ పడుచుండు కంటె నీ భరమెల్లన్ 6-5.

కొల్, కోల్ అను ద్రావిడ ధాతువుల నుండి పుట్టినకోలె ద్రుతాంతమై విభక్తి ప్రత్యయముగా మాఱినది నన్నయ దీనిని సప్తమ్యంతములగు కాలాధ్వ వాచకములపై వాడుచుండును నన్నెచోడుఁడు దీనిని సప్తమ్యంత కాలవాచకముల మీఁదనే కాక క్రియాజన్య విశేషణముల మీఁదను, ద్వితీయాంతకములైన విశేష్యముల మీఁదనుగూడ నుండి యను నర్థమున వాడి యున్నాఁడు

బాలవు నీకు నిప్పటఁ గోలె 6-21, ఈ బాల తన్నుఁ దా నెఱిఁగిన కోలెను 3-102, కను చూడ్కిం గోలెను దండ నమస్కారములు చేసి 7-80

చే, చేతలు పలుచోట్ల పంచమ్యర్థమున వాడఁబడినవి.

కుమారుచేతఁ బరాజితుండు 10-194, అబ్జగర్భుచేఁ ఒడసిన 10-151

లోపల, కి, కు, యొక్క షష్ఠీ విభక్తి ప్రత్యయములని అం శ. చింతామణి చెప్పుచున్నది చిన్నయసూరి వీనికి లో కూడ చేర్చినాఁడు కు ప్రత్యయమే కొన్నిచోట్ల కి గా మాఱును గావున, నతఁడు దానిని వేఱుగాఁ జెప్పియుండలేదు షష్ఠీ విభక్తిలో సంబంధార్థమున అ, ఇ అనునవి చేరు చుండును ఏమియుఁ జేరకుండ సంబంధార్థమును సూచించు ప్రయోగ ములును గలవు దుఃఖునకుఁ బూర్వము వచ్చు నుత్వము కూడఁ గొన్ని చోట్ల సంబంధార్థమును సూచించును ఇట్టి యెడల ని - ఆగమమునకు లోపము కల్గినదని చెప్పవచ్చును

కు, క్కు అనునవి తమిళమునను, కె, గె అనునవి కన్నడమునను చతుర్థ్యర్థమున వచ్చు ప్రత్యయములు తెలుఁగునందలి కు కూడ వీని రూపమే దీని నాంధ్ర వ్యాకర్తలు షష్ఠీ ప్రత్యయముగాఁ జెప్పినను ఇది చతుర్థ్యాది బహ్వర్థముల వాడఁబడు చుండును

కుమారసంభవమున కు - సంప్రదానార్థమునను, నిర్ధారణ పంచమ్యర్థ మునను వాడఁబడుట కిదివఱ కుదాహరణములు చూపఁబడినవి

> నీకు నీ వావాహించితి 1-72 (కొఱకు), ఈ మునివరులకుం జూడ, గౌరిఁ దోడ్కొనిరండు 7-137 (ప్రథమార్థము ఈ ముని వరులు చూడ), మా యెత్తి వచ్చునంతకుం జిక్కనై 10-177 (వఱకు), అతనికి నలిగి 10-173 (పై), అరవిందముల కలిగి 1-91 (పై)

కరుణించు మున్నగు ధాతువుల కర్మపదములకు కు ప్రత్యయము వాడఁబడును

> సురపతికిఁ గరుణించి 10-86, గిరిపతికిఁ గరుణించి 3-83,
> కులాచలంబునకు మాఱ్కొను దంభోళియుంబోలెఁ గుంజరాఘునకు
> ననలాక్షుండు మాఱ్కొని 12-14

ఇచ్చట తో అను ప్రత్యయమును గూడ వాడవచ్చును శబ్దరత్నాకర కారుఁ డిట్టి యెడల మాఱ్కొను అకర్మక క్రియగా సూచించినాఁడు.

కుమారకున్ శరణు చొచ్చిరి 12-127
అంబికానందను నభిషేకంబు సేసిరి 10-19

అనుచో ఏష్యర్థమున ద్వితీయ వాడఁబడినది

ఉప్పర మెగసిన కరణి 9-81

అనుచోఁ గూడ నంతే కాని యిచ్చట ద్వితీయకుఁ బ్రథమ వాడఁబడినది

నన్నెచోడుఁడు నన్నయాదుల వలెనే పలుచోట్లఁ గర్తృపద ప్రథమకు షష్ఠి వాడుచుండును

మా చేసిన దోషంబు లేదు 10-39,

లో, లోపల అనునవి అందు అను నర్థమున వాడఁబడుచుండును.

ధారాగృహంబులో విలసిల్లు 5-148
తననీడ నీరిలోపలఁ గని 1-95
నిర్మలుఁ డయ్యె జగంబు లోపలన్ 7-413
జలధరంబులో వెలువడు చంద్రమండలంబొ 9-8
మృదుల పల్లవ తతిలో మే లేటికొని 5-22

లో అను ప్రత్యయము మీఁద సప్తమీ విభక్తి ప్రత్యయ మైన న కూడ వచ్చుచుండును

వారలలోనఁ బదుమువ్వు రువిదల 1-74
ప్రతిబింబ మెసఁగె నద్దము లోనన్ 9-18

నన్నయ వలెనే నన్నెచోడుఁడును యొక్క వాడి యుండలేదు.

అందు, ఇందు, న అనునవి సప్తమీ విభక్తి ప్రత్యయములని ఆంధ్రశబ్ద చింతామణి

'అందు' కుమారసంభవమునఁ దఱుచుగా నధికరణార్థమునందే వాడఁబడినది.

దేశములందుఁ బర్వె హేమంతము 6-90
రాగరసమం దాహారనిర్వృత్తియే 22-219

రాగరసము విషయమున నని యర్థము

"వరాంగములు సోకుం బుష్కరాగ్రంబునందు" (1-100) అనుచోట అందు, తో నను నర్థమున వాడఁబడినది సుస్వాగతాభిమతవాక్యములం దభ్యాగతోచిత సపర్యలఁ దన్పెన్ (7-5) ఇట వాక్యములం దనఁగా వాక్యములతో నని యర్థము

అందునకుఁ గుమారసంభవమున స్థలార్థమున వ్యస్తప్రయోగము కూడ నున్నది

గౌరి నందు సురక్షితముగ నునిచి 3-104

అం దిచ్చిన బిడ్డ మనకు- ఖాపె నని 2-4

అం దింత మహనీయ రత్నసామగ్రి కలదె 3-2

క్రింది ప్రయోగములలో లో నుండి యను పంచమ్యర్థమును సూచించు చున్నది

స్థలార్థక మైన అందునకు షష్ఠీవిభక్తి కు ప్రత్యయము చేరునపుడు ఉల ఆగమముగా వచ్చును

అందుల కరుగు మనిన 10-18

అం ద్వందుల కుల చేరునప్పు డవి విశేషణము లగును

ఇందుల యుదకంబు సేవించి 10-56

అందుల కోమటు లిచ్చు ధేనులన్ 7-119

అందలి, ఇందలి అనుప్రయోగములు కుమారసంభవమున లేవు.

అందులోన నొక్కఁడు నక్కనైన 1-38

ఇచ్చట స్థల వాచక మైన అందునకు షష్ఠీ ప్రత్యయము చేరినది మదరాసు యూనివర్సిటీ ప్రతిలో వామాంగము లందు పుట్టి (2-40) అనుచో అందుపై పకారమునకు వాదేశము కనఁబడు చున్నది దీనినిబట్టి యది కళగాఁ గూడ నప్పుడు భావింపఁ బడినట్లు కన్పించును కాని వావిళ్ళవారి ప్రతిలో అందుఁ బుట్టి అనియే యున్నది

బొలుపుగఁ జిప్పరువు గవిసె భూతల మెల్లన్ (6-100) అను

## అసమాపక క్రియలు

నన్నెచోడుని కుమారసంభవమందలి యసమాపక క్రియలకును ఇప్పుడు మనము వాడు వానికిని భేదమంతగాఁ గానిపింపదు కొన్ని విశేషములు మాత్రమే యిచ్చటఁ జెప్పఁబడును.

ధాతువునకు ఉ, ఎడు, ఎడి అను ప్రత్యయములు చేర్చినచో తద్ధర్మ క్రియాజన్యవిశేషణము లేర్పడును. ఉదంతములైన అను, మను మున్నగు వాని తద్ధర్మక్రియాజన్య విశేషణముల తుదియుత్వమున కొక్కొక్కప్పుడు లోపము కలుగుచుండును లుప్త శేషములగు అన్, మన్ అనునవి ద్రుత ప్రకృతికములు కావు ఏలయన వాని తరువాత వచ్చు పరుషములకు సరళా దేశము కలుగదు

తనుఁ దాల్పనోప దన్గతి 3-32
నడతుమన్వారెవ్వరైనన్ 4-41
కులదైవమన్ మన్నన లేదేని 4-61
ప్రియునానన మన్వగన్ 9-89

అలకలన్ తరుణుల నార్పుచుఁ దారాడి (8-179) అనుచో తకుదా దేశము రాలేదు. నన్నయ భారతమునఁ గూడ అన్తెఅంగు; అన్పురంబు, అన్కాఁతురు అను సరళాదేశమురాని రూపములే కనఁబడుచున్నవి లుప్త శేషములైన అన్, మన్ అనువాని కచ్చుపరమగుచోఁ దుది నకారమునకుఁ గొన్నిచోట్ల ద్విత్వము కనఁబడుచున్నది

అజశిరోధ్దళనుఁ డన్నదరులేదేనియు 4-61
ఎమ్మెలుదొడవు లన్నింతియకాదు 7-38
కాముఁడన్నటికుఁ డోజంగూడ నాడింపఁగా 8-180
విడువుమొండేని మన్నాళ విడువుమొండె 10-142 మన్ + ఆళ = మన్నాళ

అను + అదరు = అనునదరు, మను + ఆళ = మనునాళ అను రూపములు Haplology చే అన్నదరు, మన్నాళ అనునట్లుగా మాఱెనని

చెప్పవచ్చును అన్నదరు మున్నగువానిని అన్న + అదరు అను రీతిగాఁ గూడఁ విడఁదీయ వచ్చును

తుమున్నర్థక రూపములపై స్వార్థమునందే కొన్నిచోట్ల అగు ధాతు తుమున్నర్థక రూపములైన కాన్, కన్ అనునవి చేరుచున్నవి

కరమొప్పుఁగఁ దాల్చి 1–107, వడి గూలఁగఁ ద్రోచి 2–56
నదుల్ కుణపాద్రులు ముంచి పాఱఁగాన్ 12–92
తన్పు మెఱుంగు సముల్లసిల్లఁగాన్ 9-112

తుమున్నర్థక రూపములు పెక్కుచోట్ల భావార్థము నొసంగుచు విశేష్యములవలె వాడఁబడుచున్నవి

తలఁప నలఁతి మహీసుకవులకున్ 1-28 తలఁపన్ = తలఁచుట.
చనునే పొగడన్ 1-22 పొగడన్ = పొగడుట
మఱి యెన్నఁడు నేర్చెను వెక్కిరింపఁగాన్ 10-145 వెక్కిరించుట

చేదర్థక, తుమున్నర్థకరూపములు కొన్నిచోట్ల నానంతర్యమును సూచించుచున్నవి

గణనాథుం డుర్వి జన్మించినన్ 1-109
ఒప్పె గౌరి నవయౌవన సంగమలీల డాయఁగాన్ 2-40

ఏని అను నవ్యయముతోఁగూడి క్రియాపదములు చేదర్థద్యోతకము లగుచున్నవి

మమ్ము విడిచెదేని 6-30, మార్కొనియెనేని సహింతునె 10-139

తద్ధర్మక్రియాజన్య విశేషణము 'నాఁడు' తోఁగూడి చేదర్థకమగుచున్నది వారలపైఁ బంపనినాఁ డారిపుపై (4-51) పంపనిచో నని యర్థము.

నెఱసున్నమీఁది ఆగమచకారము దుక్కుపరమగునపుడు పకారము విభాష నగునని చిన్నయసూరి దుక్కుపరమైనపుడేకాక శత్రర్థక చువర్ణకము పరమగునపుడు కూడ కుమారసంభవమున నీ పాదేశము కనఁబడుచున్నది.

దుష్కృవి హృత్సరోజవనముల్ భజింపుచున్ 1-40, మునిముఖ్యుల దర్శింపుచుం జనిచని 6-78; దరములు ముంపుచున్ 6-106, నిజ జనకు నూరుపీఠం బలంకరింపుచున్న 7-139; మంత్రతంత్రము లెడన్ సవరింపుచునుండు వారునై 11-208; విభవుండై యుండెఁ జింతింపుచున్ 12-165

ధాతువునకు భావార్థమున టవర్ణకము చేరును కుమారసంభమున టవర్ణకమే కాక డువర్ణకము కూడ భావార్థమున వాడఁబడియున్నది

ఎడపని రాగద్వేషములఁ దపము సెడు డరుదే 5-55, చెడుట మధు సంగతి జనులు రాగమయులగు డరుదే 4 110, అగుట

అగుడుకు కావుడు అను రూపముకూడ నున్నది.

కావుడిదేమి చోద్యమో 6 162

## ఇతర క్రియా విశేషములు

ఇప్పుడు యువర్ణాంతములుగా నున్న త్రోయు, మెఱయు మున్నగు ధాతువులు కుమారసంభవమున చువర్ణాంతములుగాఁ గానఁబడు చున్నవి

తునియలు మెఱుచుచు దివి కెగయఁ దొడఁగె 11-172
హరిఁ ద్రోచికొనిపోయి 1-23, త్రోచిరి కరిఘట లాజిని 11-120
తరులతాతతి వేళులతోన కూలఁగా నురువడిఁ ద్రోచుచున్ 6-106

త్రోచునకు త్రోపించు అను ప్రేరణార్థక రూపము కనఁబడు చున్నది

అల్కన్నిరఁ ద్రోపించునట్లు 7-96
ధూర్జటి నీళ్ళున్ మోపించె 4-25, మోచు ప్రేరణార్థకరూపము
విష్ణుఁబసులఁ గాపించెను 4-25, కాచు ప్రేరణరూపము
గుల్మాదు లేచి నయంబునఁ బూచి కాచి 7-17 అనుచో కాచునకు కాయకాచు అని యర్థము.

నన్నయ భారతమున వలెనే కుమారసంభవమునను మెఱయు, కురియు, ఇఱుకు మున్నగు ధాతువు లంతర్భావిత ప్రేరణములుగా వాడఁబడినవి

'కేలును గేలును నిఱికి క్రొనుచు 2-71, తమ తమ విభవంబులు మెఱసి 2-9, అమరసతులు నిర్మల జలధారలు గురసి రోలి 10-108

మెచ్చు ధాతువునకు కుమారసంభవమున మెచ్చించు అను ప్రేరణ రూప మొక్కచే కనవచ్చు చున్నది.

హారు మెచ్చించెన్ 1-21

విన్యాసములు దీర్చి విమలాత్మ దీపంబు ప్రణవ సంపుటముగాఁ బ్రజ్వ లించి (3-93) ఇందు ప్రజ్వలించి అనునది ప్రేరణార్థమున వాడఁబడినది

వేదవిహిత విప్రుల నుఱిచె 4-11

ఉఱిచె ననఁగా ఖండిచెనని యర్థము ఇది ఉఱియు ధాతు ప్రేరణ రూపము. పుణ్యకర్మ ముఱిచె అనుచో ఉఱిచె ననఁగా ధ్వంసము చేసెనని భావము

బిగియు ధాతువునకు బిగుచు అనునది ప్రేరణ రూపము బిగించు అనునది కుమారసంభవమున లేదు

'అహిబంధంబు వఱల బిగిచి 3-91

పరిమాఱుచు, పరిమార్చు అనఁగా చంపు, ఖండించు అని యర్థము ఇది వరిమారు ధాతువు యొక్క ప్రేరణ రూపము. దీనిని నన్నెచోడుఁడు వాడినాఁడు

అష్ట దిక్పాలురన్ బరిమారన్ వధియింతుమో 2-54

నిండునకు నించు, నింపు అనియు ఉండునకు ఉంచు అనియు ప్రేరణ రూపములు నన్నెచోడుఁడు నినుపు, ఉనుచు అను రూపములను వాడినాఁడు

కుసుమాయుధంబులు నినిపి తెచ్చి 4-83

ఇంద్రుఁ జేసన్నునిచె 7-155

కట్టు, తొడు, పూయు, కుడుచు మున్నగు ధాతువులు నన్నయ భారతమున నంతర్భావిత కర్మములై వాడఁబడు చుండును వానికి

వేఱుగాఁ గర్మపదము లుండవు నన్నెచోడుఁ డట్లుగాక వానిని గర్మల తోడనే వాడియున్నాఁడు తోడు ధాతువునకు తోడుపు అనునది ప్రేరణ రూపము

మణి భూషణములు తొడిపి 9-24

కుమారసంభవమున నించు గ్వర్కాదులు పరమగునపుడును ఎఱుఁగు, మగుడు మున్నగు ధాతువుల మధ్య మో కార మికారముగా మాఱక యట్లే నిల్చియున్నది.

ప్రియవయస్యలచే నెఱింగించుచు 8-146 ,
భేదింప నోపక మగుడె 10-64

తప మెత్తికొనియె నగజ (7-21) అనుచో నెత్తికొను ధాతువు గ్రహించు, అవలంబించు అను నర్థమున వాడఁబడినది

తుమున్నర్థకములకు పడు ధాతు వనుప్రయుక్తము చేయఁగా నేర్పడు కర్మణ్యర్థక రూపములు కుమారసంభవమునఁ గొలఁదిగా నున్నవి. నన్నయ భారతమునఁ గూడ నివి యున్నవి తరువాతి కవులలో వీని సంఖ్య క్రమముగాఁ దగ్గినది

అలఁదురవలదె మెలుఁత మెట్టఁబడిన మీనువోలె 8-162
వానఁ బురులు వొదియఁ బడియున్న పురినమ్మిఁ బోలియుండె 9-67

ఇట ధాతువు పొదియు ఇది పొదువు ధాతువు వంటిదే కావల యును. పొదువఁబడి యున్న అని యర్థము

పతులచేతం బరిభవింపఁబడితిమి 10-47

కర్మణ్యర్థమునఁ గాక స్వార్థముననే పడు ధాతు వనుప్రయుక్త మైన ధాతువులు కొన్ని యున్నవి

మొగులెఱఁగి పేరఁబడిన విధమునన్ 1-88 ,
పేరఁబడు ఘంటలకోయన 10-72

పేరఁబడు అనఁగా దొంతులుగాఁ బడు-అని యర్థము

వలు లల్లన డిగ్గఁబడం దొడంగె 3-24

హయ గజభట తతి సాల్వడి, పడి, మ్రొగ్గఁబడి, మిట్టిపడ రభసమునన్ 10-152

తుమున్నర్థక రూపములపై క్రియలుగా వాడఁబడు వలయు మున్నగు ధాతువులు నన్నయభారతమునఁ బెక్కుచోట్ల వ్యస్తముగాఁ గూడఁ వాడఁ బడినవి నిజమున కట్టియెడ నాతుమున్నర్థకములే భావార్థకములై వలయు ధాతువునకుఁ గర్త లగునని భావింపవలయును కుమారసంభవమునఁ గూడ అరుగవలయును, సహింపవలయును, నిలుపవలవదే మున్నగు క్రియలు పెక్కు వాడఁబడినవి వీనిలో నన్నింట వలచు ధాతువు తుమున్నర్థకమున కవ్యవహితపరముగానే వాడఁబడి యున్నది వలవదు అను వ్యతిరేక రూపము రాదు, తగదు అను నిషేధార్థమున వాడఁబడి యున్నది పోవలదు-పోరాదు అని భావము

విగుర్వించు ధాతువును నన్నెచోడుఁడు విజృంభించు అను నర్థమునవాడినాఁడు (తళతళమని వెడలి విగుర్వించి 2-55) శబ్దరత్నాకరమున దీనికి విఱుచు + విఱుచు = చక్కగా విఱుచు నను నర్థ మొసంగబడినది నన్నయ "ఈ పర్వత వివరము దెర్చి విగుర్వింపుము" (7-273) అనుచోట సంస్కృతమునందలి ఉద్యమనార్థకమైన గుర్వీధాతువును వి ఉపసర్గ పూర్వకముగా నుపయోగించి నట్లు కనఁబడు చున్నది

దక్షునిఁ గాన నెమ్మితోన్ 1-126 కానన్ = చూడన్

నన్నెచోడుఁడు తమిళ కన్నడ ధాతువులనే కాక క్రొత్త తెలుఁగు ధాతువుల రూపములను గూడఁ బెక్కింటిని వాడియున్నాఁడు

గెత్తుచును (2-101) గంతుచు, వెలడక (3-66) వెలువడక, కమలించి (5-135) కమలు నట్లు చేసి, నల్లపఱచి, అభ్యుదయింపవే(5-135) పెంపొందునట్లు చేయవే, ఉన్నతిల్లె (7-57) అతిశయించెను, పెల్తురు (7-123) అభినవించె (8-38) క్రొత్తలగునట్లభినయించెను, గర్జు (12-169) గర్జించు-ఇట్టి వింకను బెక్కు గలవు అతఁడు విశేష్యముల కించు చేర్చి పెక్కు క్రొత్త క్రియలను రూపొందించుచుండును ఉదా. ఎంగిలించు ;

కావడించు, ఎల్లిదించు, విలాపించు మొద ప్రేమించు అను నర్థమున నతఁడు కల్చు ధాతువును బెక్కు పర్యాయములు వాడి యున్నాఁడు. వేఁడిన ఫల మీయఁ జాల దరి డీకొని తాఁకిన నిల్వఁ జాలరున్ (11-47) అనుచో కూడ అను నర్థమున క్రియచివర సముచ్చయము వాడఁబడినది

దేవాంగనాగాన ముత్సవలీలన్ వినిచెన్, నిధుల్ తెలిచె 3-30

అనుచో వినిచె, తెలిచె అను క్రియలు వినఁబడె, తెలవఁబడె అను నర్థముల వాఁడబడినవి.

## అ వ్య య ము లు

కొన్ని విశేషణములకును, విశేష్యములకును అగు ధాతు తుమున్న ర్థకరూపములైన కన్, కాన్ అను వానిని జేర్చుటచే నవ్యయత్వము కలుగు చున్నది

నునుపుగఁ జందనం బలఁది 8-59
మహాసురముగఁ బోరిరాసురాసుర వీరుల్ 12-168

అగు ధాతుతుమున్నర్థక రూపములు లేకుండఁ గూడ నన్నెచోడుఁడు కొన్ని విశేషణముల నవ్యయములుగా వాఁడినాఁడు.

హరుఁడు వచ్చె రజతగిరికుమాన్వితము గ్రొక్కారులీల 9-141
సప్తర్షుల ధర్మపత్ను లరుంధతీ సహితంబు నిరంబరులై 10-31
హరిపరమేష్ఠి పురందర సురనరఫణి సహిత మగజసుతుఁడు 12-211

అవ్యయముల తరువాత నగు ధాతుతుమున్నర్థకములకు బదులు నన్నెచోడుఁడు కొన్ని చోట్ల నవధారణార్థకమైన అ వాడుచుండును

నిర్ణిమిత్తంబ గర్భంబులయ్యె 11-39 నిర్ణిమిత్తంబుగా నని యర్థము
తరుగుల్మాదుల మఱుపునఁ దరతరమ చలించి 5-14

తరతర మనునది అవధారణార్థకమైన అ లేకుండఁ గూడ పెక్కుసార్లు వాడఁబడినది

తరతర మత్యరుణరుచి మెఱుఁగడరు 8-92
తరతర మంజికఁ దఱకఁగ 9-148

కొన్ని విశేషణముల తరువాత కన్, కాన్ అనువానికి బదులు న అను సప్తమీవిభక్తి ప్రత్యయము కనఁబడుచున్నది

మనసిజుం బడయ నుద్యుక్తులై భక్తిపూర్వకంబున 9-37
దుర్భరమున వహ్నిపై కుటికి పట్టుడు 12-57

పోలె అను నుపమావాచకము ప్రథమావిభక్తిమీఁదను, సముచ్చయములమీఁదను, అవధారణార్థకముల మీఁదను వాడఁబడినది కుమారసంభవమున మాడ్కివోలె, తెఱఁగవోలె, పగిదివోలె, భంగివోలె, అట్లువోలె, రమణవోలె; వడువవోలె, విధమవోలె అని యుపమావాచక ద్వితయము పెక్కుచోట్లఁ గనఁబడుచున్నది నన్నయ భారతమునఁ గూడ నిట్టివి కలవు కాని యవి రెండు మూఁడుకంటె నెక్కువలేవు

నన్నెచోడుఁడు అట, అట్టె, అటె అనునవి మూఁడును వాడెను. అట కుమారసంభవమున నిర్బంధకముగా నున్నది

అతనిఁగోరి తపంబు సేసెదట 7-38, 7-60, 9-74
కావ్యము దివ్య కథం గుమారసంభవమటె 1-57
జంగమ మల్లికార్జునుం డవిచలితార్థ యోగధరుఁడట్టె 1-57

కాక అను నవ్యయ మాశీరర్థమునఁ గ్రియల తరువాత వాడఁబడును.

మత్కృతికి వెలయునదిగాక దయన్ 1-11 (అగుఁగాక)

కాక అనునది కాని, తప్ప అను నర్థములందు కూడ వాడఁబడినది

నాకుఁగా కొరునకు నిట్లు సేకురునె 1-50 (తప్ప)
నాయిదోర్పనేర్చుఁ గాకది యేమి సేర్పనేర్చు 1-29 (కాని)
రోహణాచలమను రూఢిగాకందింత 3-3 (అంతేకాని)

కాక అనునవ్యయము ఏమితోఁగూడి కాఁబోలు అను నర్థము నిచ్చును

వియోగతాప మనఁగా నిశ్లేర్చుఁ గాకేమి 5–113

కడు కుమారసంభవమున విశేషణముగను అవ్యయముగను గూడ వాడఁబడినది

కడుసెమ్మిన్ (3–56), కడుభీతిఁ జాఱిపోయెనో (5–61) (విశేషణము); దుర్మతినై కడు విభ్రమించి (2–36), కడుగంది(5–172) కడుఁదఱుచుగా నెగసెన్ (9–95)

తద్ద అను నవ్యయము కుమారసంభవమునఁ గళగను ద్రుతప్రకృతికముగను గూడ నున్నది

ఏలుపారితద్దయడరె 9–32 , తద్దఁ దెంపునన్ 10–133

కళయగుటయే సమంజసము ఇది సముచ్చయముతోఁగూడ పెక్కుచోట్ల వాడఁబడినది

తద్దయుఁబేర్మి వెలుంగుచున్నవారు 5–103 ,
తద్దయుం జెలువుగ 11–13

ఎక్కటి వీరుఁ డనుచో ఎక్కటి విశేషణము ఇది ద్రుతాంతమై అవ్యయముగాఁ గూడ వాడఁబడినది

దనుజారి నెక్కటిఁ దలపడి 11–101

కుమారసంభవమున ఎక్కట అను నవ్యయము కూడఁ గనఁబడుచున్నది

భూభార మెక్కటఁ దాల్చి పరఁగువాఁడు 7-129 అసహాయముగా నని యర్థము

నన్నెచోడుఁడు లగ్గ అను నవ్యయమును ద్రుతాంతముగా వాడినాఁడు దీనికి మిక్కిలి యను నర్థము చెప్పవచ్చును

లగ్గనోపి 2–22, నేఁడు లగ్గబావనమై 4–61

కుమార సంభవమున ఒకో, అకో అను రెండవ్యయములును సందేహసూచకములుగా వాడఁబడినవి

ఎగసెనోకోయన 1—118, ఘంటలకోయన 10—72

కదే యనునది కదా యను నర్థమున వాడఁబడినది

లోఁబడరుగదే 4—9

ఒండొండ అను నవ్యయము క్రమక్రమముగా అను నర్థమున వాడఁబడినది ఇది కొన్నిచోట్ల ద్రుతాంతముగా నున్నది

నన్నెచోడుఁడు కనుకని, కన్కని అను రెండు రూపకములను ద్రుతాంతములుగా వాడినాఁడు

ఎడతెగకుండఁగా నను నర్థమునఁ బుంఖానుపుంఖముగా అను సమాసమును పలువురు వాడుచుందురు నన్నెచోడుఁ డా యర్థముననే 'పుంఖాపుంఖముగా' అని వాడియున్నాఁడు

మానక పుంఖాపుంఖముగా నేసె నపార ఘోరఖరవరశరముల్ 12—152

ఒండు + ఏన్ అనువాని పరిణామ రూపమైన ఒండెన్ అనునది నన్నయ వలెనే నన్నెచోడుఁడును బాతికార్థమున వాడియున్నాఁడు

విడువు మొండేని మన్నాన విడువుమొండె 10—142

కుమారసంభవమున ఏని, ఏనియు అను రూపములు వివిధార్థముల వాడఁబడినవి

వలనుగలదేనిరూపేల 8—166 (చేదర్థము)
అజశిరోదళనుఁ డన్నదరు లేదేనియు 4—61 (అయినప్పటికిని)
మున్నెండేని డాఁగిన 10—48 (ఐనను)

ఏని యను దానికి నేని యను రూపము కూడఁ గలదు

మనోజ నేనియుం జూపవు నిన్ను 5—77
తడియారదు నేనియు నంగజన్మ 5—72
నెలకన్నెఱుంగవు నేని ముందర 6—13

పై యుదాహరణములలోఁ దుది రెండింట సముచ్చయ మున్నదను కొని ఏని అని విడఁదీయ వచ్చును మొదటి దానిలో నట్లు విడఁదీయుటకు వీలులేదు

కొన్ని క్రియాజన్య విశేషణవులకు నాఁడు చేర్చినచో చేదర్థక మేర్పడును

వారలపైఁ బంపనినాఁడు 4—51
పెఱనాఁడమ్మరుశరంబు భేదించుహరున్ 5—39 , పెఱనాఁడు = అట్లుకానిచో

నన్నెచోడుఁడు సంస్కృతమందలి సద్యః అను అవ్యయమును వ్యస్తముగా సద్యము—సద్యంబు అని వాడినాఁడు

సద్యమిష్టఫలదు జంగమ మల్లికార్జునని గొలువు 1—12
మద్యరసంబులు సద్యంబ సిద్ధరసంబులుం బోలె 9—132

## కృత్తద్ధితాంతములు

నన్నెచోడుఁడు వాడిన కొన్ని ముఖ్యములైన కృత్తద్ధితాంత రూపము లిట నొసంగఁబడు చున్నవి

చెప్పు - చెప్పు - నా చెప్పుసేయు (7—40) నేర్పు సెప్పుసేయునే (5—79)

మెచ్చు - మెచ్చు - మెచ్చువడయు (9-42)
కొలుచు — కొలువు — జంగమ మల్లికార్జునని కొలువు 1—12
గెలుచు - గెల్పు - పోరగెల్పున్ 1—68
గెల్వు - హరుగెల్వదురు 3—58
ఒలుచు - ఒల్వు - చిరముగ నొల్వువడ్డ 4—76
నిల్చు - నిల్పు - దిశాపతి సంహతికెద్దినిల్పు 10—60
కలుచు - కల్పు - పడఁతులకల్పు 5-74
నెగడు - నెగడ్త - కులభామినులై నెగడ్తకుం జని 1-11
కొండాడు—కొండాటంబు—కొండాటంబుగదాన సంపదకు 1—86

# తద్ధితాంతములు

మతుబర్థము-

జాల + అరి = జాలరి, జాలరివలఁదగిలివచ్చు ఝుషములపోలెన్ 8-131

ప్రేలుడు + అరి = ప్రేలరి 6-45

పూన్కి + కా = పూన్కికాఁడు, ఆతఁడొక యేలినవాఁడని-
పూన్కికాఁడవై 4-62

బీరము + కా = బీరగాఁడు, వెడతాపసి నాకడ బీరగాఁడుగా 7-33

ఇట క కారమునకు గా దేశము

లంజ + కా = లంజకాఁడు, అని లంజకాని రీతి నూల్కొల్పు చుండిరి 8-144

ఏకాదశాశ్వాసముసందలి 40 వ సీసమున విలుకాని, సవడికాని, ఈఁటె కాని, చురియకాని, పనికకాని, గుంటుకాని అను ప్రయోగములున్నవి

కాఁడు అను దానికి బహువచన రూపము కాఱు

ఏసిరి కైపున నీఁటెకాఱనిన్ 11-151 బాడతికారఱబుజ్జగించుచు 8-136

గెడ + కత్తియ = గెడకత్తియ, అడుగెడకత్తియగాఁ గయి
సేసిరి 9-108

ధైర్యవంతుఁడై యున్న సొబగుఁ డెవ్వండో జగతి 7-15

అను వాక్యమున సొబగుఁ డను పదమున్నది దీని కందగాఁడని యర్థము సొబగు + ఉ + ఁడు అని మతుబర్థమున ఉ వచ్చినదని చెప్ప వచ్చును శబ్దరత్నాకరమున ఈ పదమున్నది

స్వార్థము-

చెలి + కత్తె + చెలికత్తె, నెచ్చెలికత్తెకుఁ జెప్పె సమ్మతిన్ 5-131

మొండి + ఈ = మొండీఁడు, తన కొలఁది వేడ్కలెఱుఁగఁడు మొండీఁడు 7-49

తాద్వార్థము.

ప్రేక + తనము = ప్రేకదనము, విస్తారముగ ప్రేకఁదనము నందు 2-5

జఅఖి + తనము = జఅఖితనము, ఒఅఖితనములెందుఁ గఅచితీవు 6-16

వలవంతతనము 6-21, ప్రేలరితనము 6-45

చక్క + న = చక్కన, ఒయ్య + న = ఒయ్యన మొదలగు వానిలో తాద్వర్థమున న అను ప్రత్యయము కనవచ్చుచున్నది

అభావార్థము-

పరువు + ఇఁడి = పరువిఁడి, పరమేష్ఠి నీకంటెఁ బరువిఁడియే 2-29

మానార్థము-

మాన + ఎఁడు = మానెడు, కందువుమానెఁడై 8-135

దఘ్నార్థము-

ముక్కు + బంటి = ముక్కున బంటిగ, మురహర పద్మజాదులకు ముక్కున బంటిగఁబోరు 12 187, ఇట న ఆగమముగా వచ్చినది

ప్రేలుగొండ్లు (9-49) పోటుగొంగ (4-71)
చేట్లపురులో (7-38)

అను పదములందలి గొండి, గొంగ; పురి అను వానిని తాచ్ఛీల్యార్థమున వాడఁబడిన తద్ధిత ప్రత్యయములుగా భావింపవచ్చును.

## విశేషణములు

ఆంధ్ర సంస్కృతములందు విశేషణముల ప్రయోగమున నించుక భేదమున్నది. ఆంధ్రమున విశేషణములు సాధారణముగా విశేష్యములకు ముందే

వాడఁబడు చుండును సంస్కృతమున నట్లుగాక యవి విశేష్యములకు ముందును వెనుకను గూడ యథేష్టముగా వాడఁబడు చుండును

అర్థము చెప్పుకొను నప్పుడు అన్వయక్రమము ననుసరించి విశేషణముల నన్నిటి నొక్కచోఁ జేర్చి వాని తరువాత విశేష్యములను గూర్చుకొన వలయును నన్నెచోడుఁడు సాధారణముగా విశేషణములను విశేష్యములకు ముందే వాడుచుండును – కాని యెడనెడ సంస్కృతానుసరణము కూడఁ గానఁబడుచున్నది

ఘనబృందానేక దేశాగత పథికజనౌఘ ప్రపాపాంగు......కల్లోల
మాలాచలిత నిజతట ఖ్యాజరాజీ విలాసుఁ గనియెన్ దక్షుండు
రత్నాకరు నిఖిల మహీకామినీ మేఖలాభున్ 1–115

పెక్కు విశేషణము లున్నపుడు చివరి విశేషణముల తరువాత ఐ, అయి అనుక్త్వార్థక రూపములు వాడఁబడినవి

కమలాభిశోభితము, హరిరమణీయము, విద్రుమాభిరామము, శుక
రమ్యమునై, గగనాబ్ధులతోసమమై, వనమధ్య జలజ షండం
బొప్పెన్ 10–19

భవత్యర్థకము (అగు) సన్నిహిత విశేషణమునకును దానిముందు విశేషణముల కయి పదమును గనఁబడుచున్నవి

అంత నఖిల భువనాధీశ్వరాకీర్ణంబై కనక రౌప్యాది సమస్త వస్తు
సంపూర్ణంబై యతిరమణీయం బగు నిజపురోత్సవంబుగని 2–9

భవత్యర్థకము కాని అయి పదముకాని లేకుండఁగనే కొన్నిచోట్ల కేవల విశేషణములు వాడఁబడినవి

స్థూలసమున్నతాంగులు చతుర్భుజ ఘోలతలాఘ శూలకా
పాలకరోర కార్ముక కృపాణధరుల్ ప్రమథాధినాథులా
భీల పరాక్రముల్ నిఖిల భీకరమూర్తులు వచ్చి రోలి...2–62

ఐన అనుటకు బదులు కొన్నిచోట్ల 'నాఁజను' అను పదములు వాడఁబడినవి

అది నరపాలమౌళి...... డగువాఁడు పాకనా డిరువది యొక్క-
వేయిటి కధీశుఁడు నాఁదగు చోడబల్లికిన్ 1_53

న్యస్తమైనప్పుడు సర్వపర్యాయమైన యెల్ల శబ్ద మెప్పుడును విశేష్యములకుఁ దరువాతనే వాడఁ బడినది అప్పుడు విశేష్యములకే ద్వితీయాది విభక్తులు గోచరించును

జలనిధి తమకెల్లఁ జాలదు త్రావ 10–22
కాలుఁడాదిగ దేవసంఘబునెల్ల 12–99

మహాద్విశేషణమైన ఎల్లకుఁ బెక్కుచోట్ల సమహాత్కార్యము కన్పట్టుచున్నది

రాక్షసులనెల్లద్రిమింగె 12-111 కడఁగి ప్రియవయస్యలెల్ల 5–139

అన్ని, కొన్ని యను సర్వనామములకుఁ బ్రథమా విభక్తియు వానికి ముందు వాడఁబడు విశేష్యములకే ద్వితీయాది విభక్తులును గొన్నిచోట్ల గనఁబడు చున్నవి

లాలితాశోక పల్లవముల నొకకొన్ని గమనీయమగు గుచ్ఛకములు
వెట్టి 5–23
వాని నన్నియు మగువ వరుసఁ బతికి మగుడఁ జూపె 9–152

కొన్ని ధాతుజ విశేషణము లవయవ విశేష్య పూర్వకములై యవయవితో సమసించును

పురులు వొదియఁబడియున్న పురినమ్మిఁ బోలియుండె 9–67

ద్వితీయాంత విధేయ విశేషణమునకుఁ గొన్ని యెడలఁ బ్రథమ చూపట్టుచున్నది

ఆత్మవిత్తము సత్తమున్ .. .. కని భూరిప్రీతిం బ్రణమిల్లి గురు
స్థానంబుగా స్వీకరించి 6–81
భారతిఁ దమమోము పసిఁడిమాడువులోన నిలువేల్పుగా నిల్పఁ
దలఁచు వారు 12–225

నన్నెచోడుఁడు కొన్ని విశేషణములను విశేష్యములుగా వాడినాఁడు

శైత్యమున కింత విదాహకరంబు గల్గునే 5-163

సురలకు దీనన యజరామర మయ్యెంగాక 9-131

ఆత్మార్థమైన తా నభిహితమైనపుడు విశేషణమును బహువచనము నందుంచిన రూపములు కూడ కుమార సంభవమున నున్నవి

గౌరియుఁ దాను నొండొరులకంటె మనోభవకేళిలోలురై 9-153

కుమారసంభవమున విశేషణ విశేష్యముల లింగవచనములందు కొంత స్వాతంత్ర్యము కనవచ్చుచున్నది

రోచులు గప్పి యొప్పె...... అమృతాంశుకర ప్రకరాభిరామమై 5-26

విచలేక్షణము లింత రుచిర మగునె 6-52

ఇట్లు విశేష్యములు బహువచనమందున్నను ము వర్ణకాంత విశేషణము లేక వచనమందుండుట పెక్కుచోట్లఁ గానబడు చున్నది.

అంభోవాసియై గౌరి 6-107 విశేష్యము స్త్రీలింగము విశేషణము పుంలింగము

విటవిటియలు నిల్చిరి పురము వీధులం దభినవమై 8-120

ఇట అభినవముగా అను నర్థము కూడ చెప్పుకొన వచ్చును ఇట్లు కా, క లకు బదు లయి, ఐ అనుక్త్వార్థక రూపములు పెక్కుచోట్ల వాడఁబడినవి

మధుఁడాయస వప్రము వెట్టినట్టులై 9-99

అట్టుగన్ పడఁతులు శోభాకరమైరి 9-115, శోభాకరులై 8 యని యుండవలెను

ఆ రామాసమూహం బభిరామ కేళీలాలసలై 9-107 ఆరామలు

మునితతికరముకుళితులై 7-80మునులు ప్రౌ వ్యా ఇట్టివాని నంగీకరించినది

భ్రమరములు...పంకరుహానన గంధలుబ్ధులై 9-118 లుబ్ధములై.
హార్మ్యమాలికలు సుధాధవళితలుగాఁగ 12-266.

నన్నెచోడుఁడు ముకుళిత కరులై అనుటకు కరముకుళితులై (7-80) యనియు, క్షుభితమనస్కులై యనుటకు మనః క్షుభితులై యనియు, బధిరీకృత దిక్కమై యనుటకు దిగ్బధిరీకృతమై (8-24) అనియు వాడినాఁడు

నగపతి నమస్కృతులై అను సమాసమును నన్నెచోడుఁడు నగపతిచేత నమస్కృతులై అని వ్యస్తముగా వాడినాడు (4-139) అట్టి, పోని యనునవి యౌపమ్య సూచక విశేషణములుగా వాడఁ బడినవి

దొంతివెట్టి మ్రింగునట్టి గణములోన 11-95
విడ ల్వడి వ్రేసినట్టికైవున 11-42
ప్రద్యుమ్ను వనంబునుం బోని 3-41
తపోలక్ష్మి ముఖ విశేషంబునుం బోని 6-86

పోనికి 'ముందుండు నుపమానము ద్వితీయాంతమై ద్రుతముతోఁ గూడియున్నది పోని యనఁ బోలిన యని యర్థము

## వా క్య ని ర్మా ణ ము

ప్రాఙ్నన్నయ యుగమునందలి శాసనములలోవలెఁ గుమార సంభవమున సమాపక క్రియలు లేని వాక్యములు కొన్ని కాననగుచున్నవి వానితోఁ గొన్నింట విశేషణములో, తచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన ధాతుజ విశేషణములో క్రియా కార్య మొనరించు చుండును కొన్నింట అగు ధాతువు నధ్యాహార్యము చేసికొనవలెను

హేమాద్రి విస్తారమెంత (అగు) 3-5, ఇదియ మనకుఁగ ర్తవ్యంబు 4-52,

నా కిది యేమి గహనంబు 4-52, మహాదేవధ్యాననిరతు లప్పుర విప్రుల్ (అగుదురు) 7-11[illegible]

వీరేకాదశ రుద్రులు 11-86, శ్రీవర్ణాకారంబులు చెవులు 3-67

వారెల్లఁ గామ వశులగు వారు 4–81

అగు వాడఁబడిన వాక్యములును గొన్ని కలవు

మురహారునకు నీకు హస్తిమశకాంతరము (అగు)
ఆ పరమునకు నీకుఁ బర్వత పరమాణ్వంతరము తలఁపఁ బతి
యెట్టులగున్ 6–9
సర్వగుఁడై నిశ్చలుఁడగు నేకాంతుఁడయ్యు సర్వాత్ముఁడగున్ 6–74
ఆడువారు సిక్కని డెందంబు వారు జగతి 5–93

అను వాక్యము ప్రాఙ్మన్నయ శాసనములందలి "వక్రంబు వచ్చువాన్డు...పాఱ జమ్పినవాన్డు" అను శాసన వాక్యమును బోలియున్నది డెందంబు వారనఁగా డెందంబు గలవారని యర్థము.

కొన్ని వాక్యములందుఁ దుమున్నర్థకములే భావార్థద్యోతకములై విశేష్యములవలెఁ గర్తలుగా వాడఁబడి యున్నవి

వినంగొనియాడఁ జాలదే 1–57
కలిగియుఁ జెప్పనురా దెల్లచోటఁ దానై యెందున్
గలయఁడు (6–74) ఇట రాదనఁగాఁ గూడదని యర్థము.
దానవ పతిమీఁద నడవఁ దగునే మీకున్ 10–166

మహాత్సమూహార్థక శబ్ద మమహాత్కార్య యుక్తమయ్యును దాని విశేషణ క్రియలు మహాత్కార్య యోగ్యములగుట యందందుఁ గానవచ్చుచున్నది.

ఆరామా సమూహం బభిరామ కేలీలాలసలై 9–167
మునితతి కరముకులితులై 7–80
వ్రాలిరి శరఘట్టనముల వడి నిరువాగున్ 11–129
భృంగములు మూఁగి చెలువొందు బిసరుహంబు
పాఁకు దాల్చియు గరమొప్పు భంగివోలె 6–85

మూఁగియన మూఁగుటచే నని యర్థము ఇట క్త్వార్థకము హేత్వర్థమున వాడఁబడినది

వగచిన చిత్తము సలఁదురి మొగిచిన కనుఁగవయు నుదుగమోపిన కేలున్
వెగచిన కంఠము నుడుగక నెగసిన నిశ్శ్వాస తతియు నీరజ ముఖికిన్ 5-108

ఇట్టి వాక్యములలో అగును అను పదము నధ్యాహార్యము చేసికొనవలయును

కొన్ని వాక్యములలో నేక దేశాన్వయము కనఁబడు చున్నది.

అమ్మహాదేవి వలన లబ్ధ వరప్రసాదుండై 1-71

ఇట దేవి వలన అనునది లబ్ధ అను పదముతో మాత్రమన్వయించును.

త్రిభువన కంటకులైన గజాసురాదులన్
బరువడి నోర్చి విశ్వము శుభ స్థితి నిల్పినవాఁడు దొల్లి నీ
హరియె పితామహుండె దివిజాధిపుఁడే సురలే మునీంద్రులే 2-21

ఈ వాక్యమున హరి, పితామహుఁడు, దివిజాధిపుఁడు, సురలు, మునీంద్రులు అనున వన్నియు నిల్పినవాఁడు అను పదముతో నన్వయించు చున్నవి అందుఁ గొన్ని యేకవచనమునను గొన్ని బహువచనమునను ఉన్నవి మొదటి పదమైన హరి యేకవచనాంతమై యుండుటచేఁగా బోలు కవి నిల్పినవాఁడని యేకవచనమే వాడియున్నాఁడు. ఇట నిల్పినవారని యుండుట యుక్తము

సంస్కృతమున యత్ తదాది సంబంధ బోధక సర్వనామములతోఁ గూడిన వాక్య యోజన యధికముగాఁ గనిపించును. నన్నయ భారతమున నట్టి వాక్యములు కొన్ని యున్నవి. కుమార సంభవమునఁ గూడ నట్టివి కొన్ని లేకపోలేదు కాని వాని సంఖ్య చాల తక్కువ

నాకుఁగా కొరునకు నిట్లు సేకుఱునె యొక్కట లాభము లెన్ని యన్నియున్ 1-50

నాకుఁ గూర్చు గుమ్మ లెవ్వరీ కొమ్మలందు వారు సేకొని
రక్షింపవలయుపీని 6—27

సంస్కృతమునవలెఁ దెలుఁగున గర్మణ్యర్థక వాక్యము లెక్కువగాఁ గనిపింపవు నన్నయ భారతమున నట్టివి కొన్ని యున్నవి తరువాత వాని సంఖ్య తగ్గినది మరల నిప్పు డాంగ్లభాషా ప్రభావమున నట్టి వాక్యముల సంఖ్య యధికమగుచున్నది కుమార సంభవమునఁ గర్మణ్యర్థకము లైదాఱుకంటె నెక్కువగా లేవు అవి క్రియలను గూర్చి తెల్పునపు డొసంగఁబడినవి కర్తృపదములకుఁ జే, చేత వర్ణకంబులు చేర్చి సంస్కృత ప్రత్యయాంతరూపములను గూడ కర్మణ్యర్థకములుగా వాడవచ్చును కుమార సంభవమున నట్టి వొండురెం డున్నవి

నగపతిచేత నమస్కృతులై వీడ్కొని చనుదెంచిరి 7—139
తారు దారకాసురుచేతం బరాజితులై 4—47

నన్నయ భారతమున మనమిప్పుడు శత్రర్థ చువర్ణము వాడుచోట తచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన తద్ధర్మక్రియాజన్య విశేషణములు వాడఁబడిన వాక్యములు పెక్కున్నవి కుమార సంభవమునఁ గూడ నట్టివి కొన్ని కనఁబడుచున్నవి

కలహభోజనుండైన నారదమహాముని కలహావలోకనార్థంబు లోకంబులఁ బరిభ్రమించువాఁడు తత్కాంతారాంతరంబునం జనిచని 60—52

ఈ వాక్యమున నారదమహాముని, పరిభ్రమించువాఁడు అనునవి సమానాన్వయము కలిగియున్నవి ఆంగ్లమున నిట్టివానిని "Put in apposition with" అందురు మనమిప్పుడు పరిభ్రమించువాఁ డనుదానికి బదులు—పరిభ్రమించుచు అని వాడుదుము

పరమపరు శివునిఁ గాంచు టది పరపదవి సుమ్ము 12—220

ఇట్లు అది, తాను పదము లూతపదములుగా వాడఁబడిన చోట్లు కొన్ని గలవు ఇచ్చట అది లేకపోయినను అర్థభంగము కలుగదు

ఇట్లయొనఁ దుదిగానెడ నింద్రుఁడు నీవుఁ దక్కఁజే 4—63

ఇచ్చట భావార్థక ట ప్రత్యయముతోఁ గూడిన రూపము దక్కుదురా యను తద్ధర్మ క్రియార్థమున వాడఁబడినది

కుమార సంభవమున దీర్ఘములైన వచనము లెక్కడను లేవు ఉన్న వచనములు పెక్కు పరోక్ష వచనములుగనే (Indirect) యున్నవి ప్రత్యక్ష వచనములు తక్కువ అట్టివి నాలుగైదున్నవి

దక్షుండందఱ నాక్షేపించి "మీరు భిక్షువలని భయంబున దాక్షాయని పక్షంబునఁ బలికినం గర్మబాహ్యుండైన పాపండుండు పూజ్యుం డగునే" యని యెవ్వరిం గైకొనక 2-41

అని నెనరు ముట్టం బూనిన కుసుమాయుధు పూనికి వజ్రాయుధుండు ఘనంపఱిచి తారు దారకాసురుచేతం బరాజితులై పరమేష్ఠి మఱువుఁ జొచ్చిన విధంబును......ఎఱింగించి..." హరగిరిజలు నైష్ఠికానుష్ఠానులై హిమవంతంబున నున్నవారు వారికి సంగమంబుసేసి జగద్ధితంబు సేయు మిది యనన్య విషయంబు, నీ వలననకాని సాధ్యంబుకాదు కావున నిన్నుం బ్రార్థించితి" మెట్లనిన 4-47 ఇందు పరోక్ష ప్రత్యక్షవచనములు రెండు నున్నవి

కొన్ని చోట్ల నొక పద్యమునందుఁ బూర్తికాని యర్థము తరువాతి వచనములందో పద్యములందో పూర్తి చేయఁబడినది

కృష్ణాజినోత్తరీయులు......దివ్యులు భవ్యుల్ 6-62
అనంబరఁగు దివ్యగణంబులందు 6-64
ఆ దానవు బలిమియు, విల్లునేర్పుఁజూచి వీనిచేత 12-149
కం. సురవరులు పెక్కుమాఱులు పరిభవపడిరి 12-150

నన్నెచోడుఁడు "సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున వింపు పెంపుతోఁ బిరిగొన" వను పద్యమున జాను తెనుఁగు తన కభిమతమై నట్లు చెప్పెను కాని ఆ జాను తెనుఁగొట్టిదో యాతఁడు స్పష్టముగా నిర్వచించి యుండలేదు కన్నడమున నాగవర్మ గుణవర్మలు "జాణ్ణుడి"కిఁ బేరు పొందినవారఁట జన్నకవి యశోధర చరిత్రలో గుణవర్మ జాణ్ణుడి నభినం

దించియున్నారు ఈ కన్నడ కవులు కూడ 'జాణ్ణుడి' నిదమిత్థమని చెప్పి యుండలేదు నన్నెచోడుఁడు జాను తెనుఁగను పదము నా కన్నడ కవుల జాణ్ణుడి ననుసరించియే వాడియుండును పాల్కురికి సోమనాథుఁడు "బలుపొడతోలుసీరయును" అను పద్యము జాను తెనుంగని చెప్పెను దానినిబట్టి కూడ జాను తెనుఁగు స్వరూపమును నిశ్చయించుట కవకాశము లేదు ఇందలి చీర, వల్గు పదములు సాంస్కృతికములే సరి అనునది వైకృతము ఇందు సంస్కృత సమాసములు లేవు దీనినిబట్టి సంస్కృత సమాసములు లేనిదియు, సంస్కృతపద బహుళము కానిదియు, సర్వసుబోధ మగునదియు నగు తెలుఁగు జాను తెనుఁగని యూహింపవచ్చును కాని కుమార సంభవమున దీర్ఘ సంస్కృత సమాసములును, సంస్కృత పద బాహుళ్యమును గూడఁ గానఁబడును అతఁడు జాను తెనుఁగే వాడవలె నని చెప్పవచ్చును అతఁడు తననాఁడు వ్యవహారమున నున్న పదములు సమాసములు పెక్కువాడెను తమిళ కన్నడ పదములు యథేచ్ఛముగాఁ బ్రయోగించెను అతఁడు వాడిన క్రియలలో నధికమైన వైచిత్రి కానిపిం చును అట్టి కుమార సంభవ మందలి భాషాప్రయోగ విశేషములు కొన్ని యిట సూచించితిని ప్రాజ్ఞు లిందలి దోషములు సవరించి లోపములు పూరింతురుగాక!

# సాహిత్యోపన్యాసములు

## ౭





ప్రచురణ

**ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి**

కళాభవనము · హైదరాబాదు—4

# విషయానుక్రమణిక

# శ్రీ శ్రీపాద కవిసార్వభౌముల జీవిత చరిత్ర

—శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

## జన్మవిశేషములు —

శ్రీవిద్యోపాసన చేయుచునే శ్రీపాదవారని వారి పూర్వులను
పిలువసాగిరని శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి గారే నుడివి యున్నారు
శ్రీపాద వంటి సొగసైన యింటి పేరు అందరకు లభ్యమయ్యెడిది కాదు
శాస్త్రిగారు పశ్చిమ గోదావరీ మండలమున ఎర్నగూడెము సమీపమున
కల దేవరపల్లి యను గ్రామమున 29-10-1866న జన్మించిరి అదే
మండలమునకు చెందిన ప్రస్తుతపు విద్యాశాఖామాత్యులు ఆంధ్రప్రదేశ
సాహిత్య అకాడమీ పక్షమున నిర్వహింపబడు శ్రీపాద జయంత్యుత్సవ
ములకు అధ్యక్షత వహించుట ఒక విశేషము ఘుణాక్షరన్యాయముగా
ఈ వక్తయు నదే మండలమునకు చెందినవాడు శ్రీ శాస్త్రిగారు వెలనాటి
వైదిక బ్రాహ్మణులు కౌశికసగోత్రులు తండ్రి వేంకట సోమయాజులు
గారు అగ్నిష్టోమాది క్రతువు లాచరించిన పవిత్రశరీరులు వేదశాస్త్ర
శ్రౌతము లభ్యసించుటయేకాక జ్యోతిష వైద్యములను అభ్యసించిరి
సాహిత్యవేత్త లేకాక మంచి పౌరాణికులును కోట రామభూపతి యాస్థాన
మున దివాను పదవిని నిర్వహించినవారు తల్లి శ్రీమతి వేంకటసుబ్బ
సోమిదేవమ్మ వీరికి పదుగురు సంతానము నష్టమైనపిదప శాస్త్రిగారు
జన్మించిరి సంతాన నష్టమునకు కారణము సర్ప దోషమని ఒక
యోగి చెప్పి, ఆరాధన నిమిత్తము గరుడ విగ్రహ మిచ్చి
వల్మీకమునందు సర్పము నారాధించు విధానమును బోధించి,
శ్రీకృష్ణ మంత్ర ముపదేశించెను. శాస్త్రిగారి తల్లిదండ్రులు

యథావిధి కృష్ణ సర్పము నారాధింపగా నది యానందమును పట్టజాలక సోమయాజిగారి తలకు చుట్టుకొని ఆడియాడి తిరిగి వల్మీక మును జొచ్చెను పిమ్మట వారికి స్వప్నమున గరుడారూఢుడైన కృష్ణ భగవానుడు తోచి రాజ సన్మానము నందుకొను ఒక మహా పురుషుడు సోమయాజిగారికి జన్మింప గలడనియు, ఆతని పేరున తన పేరు కూర్ప వలెనను అభిలాషము గరుడునికి కూడా కలదు గనుక పుట్టబోవు శిశువునకు గరుడకృష్ణ నామములతో నామకరణము గావింపవలెనని ఆదేశించెను కాగా సోమయాజిగారికి జన్మించిన గరుడాచల కృష్ణమూర్తి గారే నేటి ఉత్సవనాయకులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు పుత్ర శోకోపహతయై శుష్కించిన సోమిదేవమ్మకు కలిగిన సంతాన మగు టచే శాస్త్రిగారు జనన కాలమున తీసికట్టుగా నున్నను, సద్యోగర్భ జని తువి వలె క్షణక్షణాభివృద్ధిని గాంచిరి. రెండవ యేట విషూచినోకి మృతులై రుద్రభూమికి గొంపోబడి గోతిలో పెట్టబడి పూడ్చబోవు సమ యమున తిరిగి గుండె యాడి యింటికి గొంపోబడిన చరిత్రము వారిది

విద్యాభ్యాసము :-

శాస్త్రిగారిని గారాబముగా పెంచుటచే భయభక్తులు సన్నగిల్లి, గోలీలు, కోతికొమ్మచ్చులతో నక్షరాభ్యాస కాలము దాటిపోగా ఎనిమిదవ యేట అక్షరాభ్యాసము జరిగి అక్షరములు వచ్చుట కొక యేడాది పట్టెను అందును, "న" అను అక్షరము వచ్చుటకు మరి కొంతకాలము పట్టెనట కాని ఆ యూరి కరణముగా రింటిలో భారతాది పురాణశ్రవ ణము చేయుటయు, వీధి నాటకములను, తోలుబొమ్మలను చూచుటయు, కాగితపుటట్టలతో బొమ్మలు చేసి రామాయణాది కథలు ప్రదర్శించుటయు వారికి పరిపాటియైనది ఈ యభిరుచియే ప్రాచీన సంస్కృతికి ప్రతిబిం బము లగు భారతాది గ్రంథములను భావికాలమున వారు రచించుటకు బీజమని చెప్పవచ్చును. ఒకపరి వీరు గోదావరీ స్నానమునకు పోగా,

నది, కొండపోటుగై యుండిన కారణమున వీరు సుడిగుండమున బడి విసరి వేయబడి లంకకు చేరగా పడవవాండ్రు వీరి నొడ్డునకు చేర్చిరి. జీవిత కాలములో నిట్టి గండములు వీరికి చాలా తప్పినవి ఆఎనిమిదవ యేటనే ఏలూరు సమీపమునందుగల ద్వారకా తిరుమలలో వీరికి శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధిని ఉపనయనము జరిగెను. బ్రహ్మోప దేశమునాటినుండియు గాయత్రిని దీక్షగా నుపాసించుటచే వీరి మేధాశక్తి పెరిగి చదువు చురుకుగా వచ్చుట ప్రారంభించెను. కాటవరములో, కంబైండు స్కూలులో చదువు దినములలో కొంత ఆంగ్ల మభ్యసించి, బడి పెద్దయై పరీక్షాధికారుల ఒహూకృతుల సందుకొనిరి కాని తండ్రికడకేగి శాస్త్రిగారు "నాకు విదేశభాష నభ్యసించుట యిష్టంలేదు" అని కచ్చితముగ చెప్పుటతో, తండ్రి, ఉద్దండ పండితులును, శివపూజా ధురంధరులును అగు బ్రహ్మశ్రీ ఇవటూరి నాగలింగశాస్త్రిగారి యొద్ద గీర్వాణ విద్యాభ్యాసమునకు ప్రవేశపెట్టిరి శాస్త్రిగారు వారియొద్ద కావ్య నాటకాలంకారాది సాహిత్య గ్రంథములను, వైయాకరణ సిద్ధాంత కౌముదిని చదివిరి కుశాగ్రబుద్ధులగుటచే, మాఘము, భారవి, రెండు మూడు దినముల కొక సర్గము చొప్పున చదివెడివారట వీరి మేనమామ శ్రీ కల్లూరి బ్రహ్మసోమయాజులు గారు వీ రింటనుండి విద్యార్థులకు చెప్పుచుండగా తన పదునైదవ యేటనే శాస్త్రిగారు షోడశ కర్మాంత స్మార్తమును నేర్చుకొనిరి బ్రహ్మశ్రీ వాజపేయాజుల పాపయ్య సోమయాజులుగారి వద్ద చయనాంతము శ్రౌతము నభ్యసించిరి పదునెనిమిదవ యేట తండ్రిగారి యజ్ఞమున కాధ్వర్యమును వహించిరి మరియు ననేక యజ్ఞముల కాధ్వర్యమును ప్రశంసాత్మకముగా నిర్వహించిరి. ప్రాయశ్చిత్తము లేకుండ యజ్ఞమును చేయించగల దిట్టయని పేరు మోసిరి వీరు తమ పండ్రెండవయేట కుమారసంభవమును చదువు కాలమున, వీరికి సంస్కృత కవిత్వ మభ్యస్తమయ్యెను తొలుత రామలింగాష్టకమును, రామాష్టకమును చెప్పిరి శ్రీనాథుని గ్రంథములు చదివిన పిదప తెలుగు

పద్యము లల్లవలెనను అభిలాషము కలిగెను శ్రీనాదునే కవితా గురువుగా నిర్ణయించు కొనిరి పిఠాపురమునకు సమీపమున నున్న గొల్లప్రోలునకు చెందిన శ్రీ అల్లంరాజు సుబ్రహ్మణ్య కవి, కొటవర మునకు వచ్చినప్పుడు "తొట్టెటి గ్రామమందున", అను తన తొలి తెలుగు పద్యమును వారికి చూపింపగా, వారు లక్షణ గ్రంధములను జదువవలసినదిగా సలహా నీయగా, శ్రీశాస్త్రిగారును వారి సహాధ్యాయి, మధిర సుబ్బన్న దీక్షితులు గారును భారతాది గ్రంధములను, లక్షణ గ్రంధములను చదివిరి

గృహ విషయములు:-

పదునాకొండవ సంవత్సరమునసే వీరికి ప్రధమ వివాహ మయ్యెను అది కావలసిన సంబంధమే తొట్టేటి గ్రామములోని శ్రీ వాడ పల్లి లక్ష్మీపతి దీక్షితులవారి పుత్రిక వీరిభార్య. వయస్సులో రోజులు మాత్రమే తారతమ్యము అగుటచే "పెద్ద పెండ్లాము మగడా" అని ఇరుగుపొరుగు వా రాక్షేపించెడి వారు నల్లని శరీరము, స్ఫోటకపు మచ్చ కల ఆమెయెడ వీరి కాభిముఖ్యము లేకపోయినను పెద్దలు పదునైదవయేటనే, పునస్సంధానమును జేసిరి ఆ శీలవతి కోకిల కంఠముతో గానము చేయగలది ఒకనాటి రాత్రి యామె పాడుచుండగా నాకర్ణించుటచే, ఎవరు పాడుచుండిరో యని వీ రామె గది యొద్దకు వెళ్ళిరట తలుపు చప్పుడు విని పాట నాపి ఆమె "ఎవ్వరు" అని యడుగగా శాస్త్రిగారు మాటాడక తిరిగి వచ్చిరట ఆమె గానమునకు తాను పరవశుడ నైతినని చెప్పియుండినచో ఆమె సంతోషించి యుండెడిది గదా యని, ఆమె స్వర్గస్థురాలైన పిదప వాలాకాలము దుఃఖించిరి తన అవసాన స్థితిలో "రాబోవు ఆమెయం దైన మీరు ప్రేమ కలిగియుండుడ"ని శాస్త్రిగారికి చెప్పి మరణించిన దట! ఆ కడపటి మాట వీరి స్మృతిపధములో జీవితాంతము వరకు నిలచి

యుండెను దానిని వారు చెల్లించిరి. గ్రంధరచనము సాగుచున్న కొంత కాలమునకు నరసాపురము తాలూకాలోనున్న నడుపూడి గ్రామవాసులు, శ్రీ కళా లక్ష్మీనారాయణశాస్త్రి గారు, తమ తృతీయ పుత్రికయైన 'వేంకట రత్నాంబ'ను వీరి కిచ్చి వివాహము జేసిరి. శాస్త్రిగారికి కాశీ విశాలాక్షిని దర్శించినట్లు స్వప్న మగుట చేతను, ఆ కాలమున తాను బాలాత్రిపుర సుందరీ మంత్రమును బాగుగా పునశ్చరణము చేయుటచేతను, తమకు గల్గిన ప్రథమ పుత్రికకు "విశాలాక్షి" అను నామకరణము చేసిరి ఆమెను ఆంగ్ల పాఠశాలలకు బంపక తామే ఆంధ్రగ్రంథముల నభ్యసింప జేసిరి. రాళ్ళపూడి గ్రామస్థులైన శ్రీ కల్లూరి వేంకట సుబ్బారాయుడు గారి కిచ్చి వైభవముగ వివాహము గావించిరి. ఆమె సుప్రసిద్ధ కవయిత్రియై భారత కథామృతము, భాగవత కథామృతము, రామాయణ కథామృతము మున్నగు గ్రంథములు రచించిరి ప్రతి దినమును సహస్ర గాయత్రిని జపించు కాలమున కలిగిన ద్వితీయ పుత్రికకు "సావిత్రి" యని నామకరణము చేసి, సంగీతము చెప్పించి రాజోలు తాలూకా రావిపాటి అగ్రహార వాసులైన శ్రీ కడియాల సుబ్రహ్మణ్యముగారి కిచ్చి యుభయుల ఖర్చు లున్నతానే భరించి, వివాహము చేసిరి ఈ వివాహమున కైన ద్రవ్యమును ముక్త్యాలాధీశులు సమకూర్చి రని ప్రతీతి ఇద్దరు పుత్రికల వెనుక 11-5-1913న, శంకర భగవత్పాదులు జన్మించిన తిథి వార నక్షత్రాదులు సరిపడినవేళ జన్మించిన సుతునకు "సుదర్శన సుధి" యని నామకరణము చేసిరి "నేను మున్ను మీ తండ్రికి జన్మించితిని సినక మఱియు పుట్టు చున్నాను" అని యొక వైష్ణవాకృతి శాస్త్రిగారికి స్వప్నములో జెప్పిన కారణమున, వా రటు నామకరణ మొనర్చిరి శాస్త్రిగారు కృష్ణ భార తములో నభిమన్యు వధా ఘట్టమును రచించు సమయమున ఆ కుమా రుడు వీరిని విచారసాగరమున ముంచి స్వర్గస్థు డయ్యెను వీరి తండ్రి గారు వనప్రతిష్ఠాదికములు నిర్వర్తించి శాస్త్రిగారు కాటవరము నుండి

రాజమహేంద్రవరము చేరిన పిదప స్వర్గస్థులైరి. పదియేండ్లనంతరము వీరు ఆరణ్యపర్వమును రచించు సందర్భమున తల్లి దివంగతయయ్యెను.

ఆధ్యాత్మిక విషయములు.-

శాస్త్రిగారు చాలాకాలము ప్రత్యహము సహస్ర గాయత్రి ననుష్టించిరి. ఆ శక్తి వలన వీరికి గ్రహ బాధ గలుగ కుండుటయే గాక లంఘనము కూడా నెఱుగనంత ఆరోగ్యము సమకూరెను జ్వరము వచ్చినపుడు వీరు వేడి యన్నములో పెరుగు కలిపి తిని కంబళము కప్పుకొని నిద్ర పోయెడివారట దానితో జ్వర ముపశమించెడిదట. శైవునొద్దనే శివుని మంత్రము ఉపదేశింపబడవలెనని విద్యాగురువైన నాగలింగ శాస్త్రిగారి యొద్దనే 'షడక్షరీ' మంత్రోపదేశమును బొందెను. అంతకుముందే యొక వృద్ధ బ్రాహ్మణుడు వీరింటికి వచ్చి 'బాలాత్రిపుర సుందరీ మహామంత్ర ముపదేశించెను ఆ మహామంత్రోపదేశమును వీరు మరణ పర్యంతము దీక్షగా జపించెడివారు ప్రమాదవశమున నెప్పుడైన ఆ మంత్రమును వీరు అశుచిగా జపించినయెడల, దేవి వీరిని మందలింపుగా శిక్షించెడిదట. హలకులిశాది రేఖాంచితుండును, శ్రీవత్సాంకితుండును నైన సుదర్శనసుధి, తన పదునొకొండవయేట, కాలి యెముకలో పోటుబుట్టి, జ్వరము వచ్చి దివంగతుడైన సందర్భమున వీరిని శ్రీ అల్లక వీరభద్రకవి అను దేవాంగి బలవన్మరణము నొందకుండ జాగరూకత వహించెడివాడట అట్టి స్థితిలో నప్పటి విరూపాక్ష పీఠాధిపతులును, జ్యోతిష, మంత్ర శాస్త్ర ప్రజ్ఞానిధులును, నా పరమేష్ఠి గురువులును అయిన, శ్రీ శ్రీ శ్రీ బోధానంద భారతీ స్వామివారు శాస్త్రిగారి కనుగ్రహ పూర్వకముగ 'రాజమాతంగి' యను శ్యామలామంత్ర ముపదేశించిరి. ఆ మంత్రము ననుష్టించి, పదునొకండు దినములు నిరశనముగా జపించి, పట్టసాచలస్థ భద్రకాళి యెదుట పూజారికి గూడ దెల్పియకుండ, గుడిలోనికి బోయి మరల జపింప ప్రారంభించిరట.

అట్లు జపించు వారికి రక్తము గ్రక్కుకొని చచ్చుటయో, లేక ఏదియో విపత్తు సంభవించుటయో జరుగునని శాస్త్రిగారికి తెలియక పోలేదు. కాని దేవి ప్రత్యక్షమై తన వామభుజముపై సుదర్శనసుధి శీర్షమును శాస్త్రిగారికి దర్శింపజేసినదట అంతలో పూజారుల వలన సమాధి కంతరాయము గలిగెనట. ఈ రాజమాతంగి మంత్రమునే కవికుల గురువు కాళిదాసును అనుష్ఠించెనని చెప్పుదురు ఒక వైష్ణవుడు వచ్చి శాస్త్రిగారికి "శ్రీరామ జయరామ జయ జయ రామ" అను మంత్ర ముప దేశించెననియు, భవిష్యద్బ్రహ్మపురాణము జదివిన పిదప నది మంత్రమే యనియు, దాని శక్తి గొప్ప దనియు తెలిసికొంటినని చెప్పి యున్నారు వీరికి సాధువులయెడ, యోగులయెడ, పీఠాధిపతులయెడ గౌరవభావము మెండు. వారి యనుష్ఠాన మైనపిమ్మట గణపతిని, వ్యాస భగవానుని, కంచి కామకోటి పీఠాధిపతులను, శ్రీ శ్రీ శ్రీ చంద్ర శేఖరేంద్ర సరస్వతీ స్వాములవారిని, వేంకటేశ్వర స్వామి వారిని షోడశోపచారములతో ప్రత్యహము మానసికారాధనము చేసెడివారు కామకోటిస్వామివా'రపరశంకరు'లనియు, ఒకానొక సమయమున వారి యకాలమృత్యువును తప్పింపజేసి రనియు వారు చెప్పి శ్రీవారి చరిత్రము "నాంధ్రాభ్యుదయము"న కీర్తించిరి శాస్త్రిగారి చేతితో విభూతి, మంత్రతీర్థము నిచ్చినచో పిశాచాది పీడనము తొలగెడి దని ప్రతీతి ఒకానొక సమయమున తెలంగాణాలోని పెద్దపల్లియను గ్రామమునకు జమీందారైన శ్రీ పోలేపల్లి వేంకటరాజేశ్వరరావుగారి సమక్షమున విచిత్రావధాన మొనర్పగా, వారు తమ యింట శాస్త్రిగారిని కొంతకాలము నిలుపుకొని, తమ పురోహితుని పుత్రునకు 'బ్రహ్మ గ్రహము' పట్టినదని చెప్పి వారికి పుత్రభిక్షము పెట్టవలె నని అభ్యర్థించిరి భూతవైద్య ప్రక్రియ తనకు తెలియదని శాస్త్రిగారు తెలియచెప్పి నను పట్టుబట్టి, 'తమచేతితో తీర్థ మిచ్చిన చాలు'నని వీరి నచ్చటకు గొని పోయిరి పురోహితుని కుమారుడు నూఱు సింహముల గర్జనము జేసి

శాస్త్రిగారిని భయపెట్టెను గ్రహావేశకుని ఒక స్తంభమున కంటగట్టించి ఒక యంత్రమువేసి జపమునకు గూర్చుండిరి వాడు 'ఘన' జెప్పుచు స్తంభమును ఊపెగా, ఇల్లే జవజవలాడెను "గోదావరివాడా ' నిన్ను మ్రింగెదను " అనుచున్నపుడు వీరు పింటబరికెతో దెబ్బ వేయుచుండిరి అతడు శాస్త్రిగారిని నామముతోపిలిచి "నేను కౌశికుడనని యెఱింగితి, నేను నా భార్యబోధచేతను, పరిగ్రుడనగుటచేతను ఘనాపాఠినైనను కాలపురుష దానముపట్టుటచే బ్రహ్మరక్షస్సునైతిని గాయత్రీమంత్రమున షట్కుక్షుల లోను నేనుచెప్పు ఒక్కొక్క బీజాక్షరముఉంచి వేయిమార్లు జపించిన నాకు విముక్తికలుగును వేయిమంది కన్నదానము చేయవలెను" అని చెప్పెను శాస్త్రిగారు రాత్రి 8 గంటలనుండి తెల్లవారువరకు వేయిమార్లు జపించిరి వీరు తప్పినచోట్ల బ్రహ్మరక్షస్సే సవరించుచుండెను. తన గోత్రనామ ములతో ఆ జపఫలము తనకు ధారపోయుమని రక్షస్సు కోరగా శాస్త్రి గారట్లు చేయగా, వీధి కొంజా గుభిల్లున కూలి బ్రహ్మరక్షస్సు తాను వెడలిపోయినట్లు దృష్టాంతమును చూపెను పట్టులలోనున్న పురో హితుని కొడుకు నీరసముచే గ్రంచపడిపోయెను కొంతకాలమునకు కోలుకొనెను వేయిరూపాయలు శాస్త్రిగారికి వారీయబోవగా, వీరు తీసి కొనుటకు నిరాకరించిరి ఉర్లాము జమీందారుగారైన శ్రీ కందుకూరి లక్ష్మీప్రసాదరావుగారికి, జయపురాధీశ్వరులు శ్రీ విక్రమదేవవర్మగారికి బాలామంత్రోపదేశమును శాస్త్రిగారు చేసిరని ప్రతీతి జీవుడు పూర్వ జన్మమున చేసిన కర్మము విప్పి యనుభవించుచుండెను తల్లిచేసిన చేతలు కొడుకు దేహస్థితికిని, తండ్రి చేసిన చేతలు ఆత్మస్థితికిని జీవగర్ర లగునని వీరి విశ్వాసము. చిన్నతనమున శాస్త్రిగారు చేసిన అల్లరులకు, బక్కచిక్కియుండుటకు తాను గర్భములోనుండగా తల్లి వేదనపడుట హేతువనియు, తాను సార్వభౌము డగుటకు, తండ్రి యజ్ఞాదులు కారణ మనియు శాస్త్రిగారి నమ్మకము అణిమాది సిద్ధులయందు వీరికి మక్కువయెక్కువ, క్షేత్రములలో దేవమహత్త్వముకన్న స్థల మాహా

త్మ్యమునే వీ రధికముగా తెలిసికొన యత్నింతురు. ప్రతిదినంబును వీరు కనులు మూసికొనునప్పుడు మనస్సు నైమిశారణ్యాదుల యందలి మహ ర్షులను దర్శించును భారతములో విరాటోద్యోగ పర్వములు రచించు నపుడు వీరికి సుస్తీచేయగా అశ్వినీ దేవతలు స్వప్నములోకన్పించి, మధ్య శాస్త్రిగారిని కూర్చుండబెట్టుకొని "మీ రారోగ్యవంతు లగుదురు. కృష్ణ భారత రచనము నిర్విఘ్నముగా కొనసాగు"నని చెప్పిరట వేదవ్యాసు లును వీరి కట్లే దర్శనమిచ్చిరట రామాయణమును రచించువేళ సుందర కాండములో హనుంతుడు లంకా ప్రవేశమొనర్చు సందర్భమున ఆంజ నేయస్వామి దర్శన మిచ్చెనట. సుతుడు దివంగతుడైన పిమ్మట వీరు కాశీ మొదలు కన్యాకుమారివరకు గల తీర్థక్షేత్రముల పెక్కు దర్శిం చిరి జగన్నాథముకడ ఇంద్రద్యుమ్నమను సరస్సుదగ్గర శాస్త్రిగారికి స్వర్ణచ్ఛాయగలిగిన పదియేండ్లవాడు గంజాయిబీల్చుచు వచ్చి తాను సమీపారణ్యవాసిననియు, తనకొక సింగము రక్షగా నుండుననియు చెప్పెనట శాస్త్రిగా రతనితో వెళ్లుటకు నిరాకరించి ఆవిషయ మచటనున్న 'లోకనాథపండా'గారికి చెప్పగా నాతడు వేయేండ్లయోగియనియు, మహా పురుషులు పుణ్యపురుషులకట్లు దర్శనమిచ్చెదరనియు చెప్పిరట. శాస్త్రి గారి కుమారుడు మరణించిన కొన్ని దినములకు శాస్త్రిగారి నెరుగక పోయినను అప్పనపల్లినుండి శ్రీ అల్లూరి వెంకటపతిరాజుగారు నూరు రూప్యముల మనియార్డరు చేయగా వారికి కృతజ్ఞతను వెల్లడించుటకు పోయి తిరిగి మహాదేవపట్టణమునకు శాస్త్రిగారు శ్రీ పుల్లెల శ్రీరామ శాస్త్రిగారితో బయలుదేరివచ్చుచుండగా నాకాశమున మెఱపులో నంగుష్ట మాత్ర శరీరుడై శ్రీ మహావిష్ణువు కన్పించి భారతమును పూర్తిచేయుదు వని పలికి అంతర్ధానమందెనట ఇట్టివి శాస్త్రిగారి జీవితములో పెక్కులు

అవధానములు, సన్మానములు.

శాస్త్రిగారు స్వతంత్రముగ జీవించవలె నను అభిప్రాయము గల వారు. తక్కువ లాభముతో ప్రజల కాహారాది పదార్థము లందింపవలె నని వీరు వర్తకమును ప్రారంభించిరి నష్టపడిరి ఇనుగంటివారిపేట లంకలను పదునైదువేలకు పాట ఖాయపరచుకొని అప్పుదెచ్చి కృషిని సాగింపగా మాఘమాసమున అకాలపు వరదలు వచ్చి వీరి పొగాకు నేలపాలాయెను. క్షేత్రాధి కారులగు కిర్లంపూడి జమీందారు శ్రీ రాజా ఇనుగంటి వేంకట రాజగోపాల బుచ్చితమ్మయ బహద్దూరువారు వీరు బహూకరించిన విచిత్ర సౌధబంధ కవిత్వమునకు సంతసించి తమ కీయ వలసిన నాలుగువేల రూప్యములు వదలుకొని వీరికి నూటపదియా ర్లిచ్చి బహూకరించిరి. మిగిలిన ముప్పదివేల రూప్యముల ఋణము నెట్లు దీర్చవలయునా యని కాకినాడలోని మిత్రులగు నిమ్మన జీయన్నగారిని సలహా అడుగగా వారు ముంగళపూడి గ్రామవాసులైన పంతము వెంకన్నగారి యొద్ద తక్కువ వడ్డీకి అప్పు యిప్పించి వీరి అవధా నాదులపై వచ్చిన సొమ్ముతో నా ఋణము తీర్చిపెట్టిరి శాస్త్రిగారి యవధాన ప్రజ్ఞ అసామాన్య మైనది వారు తల్లి గర్భములో నున్నపుడు త్రేమ యెడమకాలు ఒక పొరలో మడతపడి చాపుకొనుటకు వీలులేనిస్థితి వారికి జ్ఞప్తియున్నది వ్యవసాయిపు ఋణమును దీర్చుటకై శాస్త్రిగారు విజయనగరము, బొబ్బిలి, పర్లాకిమిడి సంస్థానాధీశులను దర్శించిరి. ఆయా స్థలములం దవధానముల నొనర్చిరి 1895 వ సంవత్సరమున కళ్ళికోట ప్రభువు లైన శ్రీ హరిహరి మర్దరాజదేవ్‌గారి దర్శనము జేసి వారి వివాహమునకు ఓఢ్రదేశమున నేడు 'మోరోబంజో' అని పిలువ బడు, అరణ్యస్థమైన మయూరభంజి సంస్థానమునకు వెళ్ళిరి అచ్చటి పండితమండలి సంస్కృతములో వీ రొనర్చిన అష్టావధాన, శతావధాన ములకు హర్షించి వీరిని "కవిరాజ" బిరుదముతో సత్కరించిరి. రాజు

గారు స్వర్ణపతకముతో సత్కరించిరి రాష్ట్రేతర ప్రాంతమున విశిష్ట మైన సభలో నీయబడిన బిరుద మగుటచే గాబోలు శాస్త్రిగారు కవిసార్వ భౌమ బిరుదము వచ్చినపిదపగూడ కవిరాజ బిరుదమును వాడుకొనెడి వారు "కవిరాజు కంఠంబు" అను చాటువులో శ్రీనాధుడు రెండు బిరుద ములను వాడుకొనియుండుటయు కారణము కావచ్చును శ్రీనాధుని జీవితమునకును, వీరిజీవితమునకును కొంతపోలికగలదు వీరియష్టావధాన ములో వ్యస్తాక్షరి, న్యస్తాక్షరి, చిత్రాక్షరి, లిఖితాక్షరి, ఆకాశపురాణము, సహపఠనము — ప్రధానములు సహపఠన మనగా ఎవరు యేభాషలో ఏమి చదివినను వారితో ఆ భాష వచ్చినవాడు చదివినట్లు చదువుట ఇది దేశములో వీరికే కల ఒక ప్రత్యేకశక్తి పేరున కష్టావధానమైనను వీరి యవధానములో ఇరువది, ముప్పది యంశములవరకు చేసెడి వారట తెలంగాణాలో ప్రసిద్ధమైన మంథెన గ్రామంబున వీ రవధానము చేయునప్పుడు ఒక మహమ్మదీయుడు వీరికిరాని అరబ్బీభాషలో పద్య ములు చదువగా శాస్త్రిగారు సహపఠనముచేసి అందర నాశ్చర్యపరచిరి హనుమకొండ, పెద్దపల్లి, జగ్గయ్యపేట, మొదలైన ప్రదేశములలో వీ రవధానములు చేసిరి వేంకటగిరి, జటప్రోలు, బొబ్బిలి, మొదలైన సంస్థానాధీశులచే సత్కరింపబడిరి విద్యాపోషకులైన పిఠాపుర సంస్థా నాధీశులు తమ ఆస్థానకవులైన శ్రీరామకృష్ణ కవులకును, తిరుపతి వేంకట కవులకును వివాదము లుంటచే కాబోలు వేంకటకవిగారి గురువు లైన కృష్ణమూర్తి శాస్త్రిగారిని ఆహ్వానించినట్లు కనబడదు ఉర్లాము సంస్థాన వ్యవహారములలో శాస్త్రిగారు కృషిచేసిరి జమీందారులు కొంత ప్రతిఫలమిచ్చిరి. కాని, వీ రాసించినట్లుగ మాత్రము వీరికి లాభింపలేదు. గవర్నరుగారి యెదుట ఉర్లాము ఆస్థానకవిగా వీరు పద్యముల చెప్పి రని తెలియుచున్నది. వీరికి వరంగల్ జిల్లా 'మడికొండ'లో నచ్చాతి భూస్వామి శ్రీ తౌటిరెడ్డి గోపాలరెడ్డిగారు వేయాఱులిచ్చి తెలంగాణమున

తొలిపన్యాసము చేసినారనియు శాస్త్రిగా రొక కృతిని వారి కిచ్చిరనియు డాక్టర్ బి. రామరాజుగారు తెలిపి యున్నారు.

స్వరూప స్వభావములు, పత్రికా నిర్వహణము,
విద్యా సంస్థలతో సంబంధము :

చతురంగ ఖేలనమునందు శాస్త్రిగా రందెవేసిన చేయి 'మయూర భంజి' సంస్థానములో ఆట పద్ధతి క్రొత్తయగుటచే మొదటిసారి యోడి పోయి పిదప శపథముచేసి మిగిలిన ఆటలన్నియు గెల్చిరి వీరి కశ్వ శాస్త్రము, సహదేవ శాస్త్రము, బాగుగ తెలియును లంక వ్యవసాయపు రోజులలో గుఱ్ఱపుస్వారీ చేయుచుండెడివారు పశ్చిమగోదావరి జిల్లా కోపి రేచర్ల జమీందారుగారు వేయి రూపాయలకు కొన్న గుఱ్ఱము అంకెకు రాకపోగా దానిని స్వాధీనపరచుకొని తిరిగి వారి కప్పగించిరి కొంత కాలము చిలుకను పెంచిరి అది పంజరమునుండి యెగిరిపోయిన పిదపగూడ వీరి యింటికివచ్చి వీరి చేతిపై వ్రాలుచుండెడిది శాస్త్రిగారు నిర్భీకులు. ఒకమాఱు వర్షములో మార్గమధ్యమున తడిసి, కలరాతో మృతించిన జనుల శవములే యని తెలిసియు చలిబాధ కోర్వలేక ఆ మంట శగను బట్టి లారవేసికొనిరి తెలంగాణములోని కల్లూరు గ్రామ సమీపారణ్యమున లోయలో పులి వీరి నెత్తిపైనుండి దూకిపోగా, దానిని బాగుగ చూడలేకపోతినే యని విచారించిరి 1930 వ సంవత్సరములో వారింటిలో పడిన దొంగను బట్టుకొని శరీరము రక్తసిక్తమైనను వదలక ప్రభుత్వమువారి కప్పగించి బహుమతి నందిరి వారు నిరతాన్న దాతలు. ప్రతి దినము వారి యిల్లు అతిథి, అభ్యాగతులతో పెండ్లి వారింటివలె కలకలలాడు చుండెడిది. రాజమహేంద్రవరమున వీరి మాటకు తిరుగులేదు. "నే నెవ్వరి మీదకును, ముసుమున్ను కాలు దువ్వను; పరుడు నా కొత్తిడి గలిగించినపుడే ప్రతిక్రియకు బూన

యత్నింతును'' అని చెప్పెడివారు శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారికిని, వీరికిని ఒక విషయమున ఛార్జీలు జరిగినవి. కాని ఫలిత మెవ్వరికిని అనుకూలము కాలేదు. కొల్లాపురమునకు సంబంధించిన శ్రీ వనం సీతారామశాస్త్రిగారితో వీరికి కొంతకాలము వాదము నడచెను శ్రీ కల్లూరి వేంకట్రామ శాస్త్రిగారి చరిత్రమును వ్రాయుచు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారిని దూషించిరని వీరభియోగము తేగా, రావుగారికి రెండు వందల రూపాయలు జరిమానా పడి అప్పిళ్ళలో ఖాయపడినది వీరు పరిశ్శ్రియస్సహాసము కలవారు సచ్ఛీలురు స్ఫురద్రూపులు పరస్త్రీ పరాఙ్ముఖులు సంప్రదాయవాదులు సంప్రదాయవాదులకు జాతి, వర్ణములందు విశ్వాసముండును, కాని ద్వేషముండదు. వీరికి జాతివర్ణ ద్వేషము లేదు. ద్రోహబుద్ధి లేదు వీరు జాతీయతావాదులు 'స్వరాజ్యోదయము' అను నాటకమును వీరు వ్రాయగా జైలుప్రాప్తియగునని యింటిలోనివారు వీరియెఱుక లేకుండ దానిని నశింపజేసిరి ఆవల 'తిలక్ మహారాజ్', 'గాంధీ విజయధ్వజము' నాటకములను శాస్త్రిగారు ప్రకటించిరి. తిలక్ నాటకముపై ప్రభుత్వము వారు పెట్టిన కేసు పోయినది ఉద్యోగమునందభిలాష లేకపోయినను శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి ప్రోత్సాహమున వారు హెడ్మాష్టరుగా నుండు పెద్దాపురము హైస్కూలుతో సంస్కృతోపాధ్యాయులుగా ఒక సంవత్సరము పనిచేసిరి విలాసార్థము రాజమండ్రి మిషను హైస్కూలులో ఒకయేడు ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేసిరి ఆంధ్ర విశ్వవిద్యాలయములో (తెలుగు ప్యాను) 'బోర్డు ఆఫ్ స్టడీస్' సభ్యులుగా మూడు సంవత్సరములుండిరి ఆంధ్ర సాహిత్య పరిషత్తు అధ్యక్షులుగా నాలుగు సంవత్సరము లుండిరి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులుగా మూడు సంవత్సరము లుండిరి. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయాధ్యక్షులుగ చాలకాల మెన్నుకొనబడిరి. 1954 లో కాకినాడలోని ఆంధ్ర సాహిత్య పరిషత్తున కధ్యక్షత వహించిరి హిందూ సమాజములోను, గౌతమీ గ్రంథాలయమునందును. వీరు శాశ్వత

గౌరవ సభ్యులుగ నెన్నుకొనబడిరి అచ్చాఫీసు నెలకొల్పి కూచిమంచి జగ్గకవి ప్రణీతం బైన 'సుభద్రా పరిణయము'ను ప్రకటించిరి తంజావూరి గ్రంథాలయమునుండి 'ఘటికాచల మాహాత్మ్యము'ను తెప్పించి వెలుగులోనికి దెచ్చిరి 1899 లో 'కలావతి' యను మాసపత్రికను చెన్నపురినుండి ప్రకటించి, వత్సరమైన పిదప రాణ్మహేంద్రవరమునకు మార్చి, పదియేండ్లు దానిని నిర్వహించిరి "వందే మాతరమ్" అను వారపత్రికను కొన్ని మాసములు నిర్వహించిరి "మానవసేవ" అను మాసపత్రికను మూడేండ్లును "వజ్రాయుధ"మను మాస పత్రికగా గ్రామ్యభాషా నిరసనమునకై నాలుగేండ్లును నడిపిరి పాత్రోచితముగ వ్యావహారిక భాషను వాడవచ్చు ననియు, కావ్యములు ప్రామాణిక భాషయందే వ్రాయదగుననియు శాస్త్రిగారి నిశ్చితాభిప్రాయము. "గౌతమి" యను దినపత్రికను స్థాపించి ఒక సంవత్సరము నిర్వహించినారు. తండ్రిగారు స్వర్గస్థులైన దినమునగూడ పత్రికను పోస్టుచేసియే, తండ్రి కపరక్రియలను నెఱపినారు. విధినిర్వహణమునందు వారంత అప్రమత్తులు. ఆంధ్రదేశమున మొట్టమొదటి దైనికపత్రికను నిర్వహించిన కీర్తి శాస్త్రిగారికే దక్కినది

గురుశిష్యప్రశిష్యులు :

శ్రీపాదవారికిని, చెళ్ళపిళ్ళవారికిని వైమనస్య మేర్పడుట దురదృష్టకరమైన విషయము. ఈ గురుశిష్యులు ఆంధ్రలోకమునకు మాన్యులు శాస్త్రిగారు కాటవరములో నున్నపుడు వేంకటశాస్త్రి గారిని తనయింటనే యుంచుకొని విద్యనేర్పినారు వీరియొద్ద కుమారసంభవము మొదలు మాఘము వరకును వేంకటశాస్త్రి గారు చదువుకొనిరనియు, కవితా లక్షణము, అవధానోచిత లక్షణము, చతురంగ ఖేలనము మున్నగునవి నేర్చుకొనిరనియు, హైదరాబాదునుండి ఎవ్వరో వ్రాసిన లేఖకు 'సమాధానముగ శాస్త్రి గారు వ్రాసిరి. దానిపై వేంకటశాస్త్రి గారు

1935 సంవత్సరము కృష్ణాపత్రికలో "శ్రీపాదగురువులకడ నా శుశ్రూష, నా ముక్త్యాల ప్రయాణము" అను వ్యాసములలో తాము వారియొద్ద కొలది కాలము మాత్రమే చదివితి మనియు, మాఘము వరకు చదువ లేదనియు మున్నగు విషయములు వ్రాసిరి శాస్త్రిగారు వ్యక్తిగతముగా వ్రాసిన లేఖాంశములు తా మంతకు పూర్వము గ్రంధస్థము చేసిన విషయములకు ప్రతిబంధకము లగుననియు, తన్నుతాను సమర్థించుకొనినచో తా మస త్యములోకమునకు చెప్పిన ట్లగుననియు వేంకటశాస్త్రి గారి వాదము శాస్త్రి గారు 28-12-35 తేదీ కృష్ణా పత్రికకు". . . .నే నెమీ తప్పు చెప్పలే దని ప్రమాణం చేస్తాను..... కాటికి కాళ్ళు చాపుకొనివున్న కాలంలో మనకిలాంటి రాతలు రాసుకోవడం మంచిదికా దనుకుంటాను...హైదరా బాదులో ఎవరికో రాసినమాట నిజమే, అది నా ప్రమాద మేమోనని నువ్వు సమాధానపడొచ్చునే నేను శిష్యుణ్ణని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పగలవాడి కిది తప్పుగా తోస్తుందా ? తోచదు" మొదలైన వాక్య ములతో సమాధానమును పంపిరి శ్రీ వేంకటశాస్త్రి గారు శాస్త్రిగారి క్షమాపణ అను వ్యాసమును ప్రకటించుటయేకాక "గిడుగా ?-పిడుగా ?" అను వ్యాసములో శ్రీచిలుకూరి వీరభద్రరావు గారి గ్రంధమునుండి శాస్త్రి గారిని కొంచెపఱచు వాక్యము లుదాహరించిరి. శాస్త్రిగారు వేంకటశాస్త్రి గారికి లాయరు నోటీసీయగావారు శ్రీ నాళం కృష్ణారావు గారితో శాస్త్రి గారింటికిపోయి క్షమాపణ పత్రము వ్రాసియిచ్చిరి. క్షమాపణము వ్రాసియిచ్చుటచే వేంకటశాస్త్రి గారు ముద్దాయిల జాబితానుండి తొల గింపబడిరి కాని వారు వీరభద్రరావు గారివైపు కోర్టులో సాక్ష్య మిచ్చిరి. ముద్దాయిలకు శిక్ష పడినది క్షమాపణ పత్రమును తా మంగీకరించిన పిదప, వేంకటశాస్త్రి గారు వ్యతిరేకపక్షమున సాక్ష్యమిచ్చిరను బాధ శాస్త్రి గారికి కలిగి, అది కోపముగా మారి, తిరుపతి వేంకటకవులలో వేంకట శాస్త్రిగారు మాత్రమే రచించిన 'బొబ్బిలి పట్టాభిషేకము'ను శాస్త్రిగారు విమర్శించిరి సుప్రసిద్ధమయిన పత్రికలు శాస్త్రిగారి వాదమును ప్రక

టింప వని కాకోలు "చెళ్ళపిళ్ళ చెర్లాటము" అను పేరుతో ఐదు భాగము లుగా గ్రంథములను ప్రచురించి శాస్త్రిగారాంధ్ర దేశముపై విరజిమ్మిరి. వేంకటశాస్త్రి గారికి తమ పాండిత్యముపై విశ్వాస మధికము వారు శ్రీజయంతి రామయ్యపంతులు గారిని తీర్పరిగా కోరిరి. వారుతీర్పునిచ్చిరి వేంకటశాస్త్రి గారు ఈ వివాదమునకు సంబంధించిన "జయంతి" యను గ్రంధమును తీర్పరి కంకితము చేసిరి శాస్త్రిగారు "చెర్లాటము"లలో ఆ తీర్పును నిరసించిరి ఈ విధముగ మహనీయు లిరువురి నడుమ, స్వల్పవిషయమునకు మహావైర మేర్పడినది తప్పనిసరిగ నొక సభలో నున్నపుడు గురుశిష్యు లెడమొగము, పెడమొగముగ కూర్చొ నెడివారు దీని కాంధ్రలోకము విచారము వెలిబుచ్చెడిది ఇట్టి వైర సమయమున, వేంకటశాస్త్రి గారికి పత్నీ వియోగము కలుగగా, శాస్త్రిగారు పరామర్శించుటకు కడియము వెళ్ళిరి ఆ సమయమున వేంకటశాస్త్రి గారు వాద ప్రస్తావనము తేగా, శాస్త్రిగారు వైముఖ్యమును ప్రకటించిరి వేంకటశాస్త్రిగారి పుత్రులను వాత్సల్యముతో జూచిరి వేంకటశాస్త్రి గారు దివంగతులైన సందర్భమున నేను విజయవాడ దివ్యజ్ఞాన సమా జములో ఏర్పాటు చేసిన సభలో శిష్యునికై వలవల దుఃఖించిరి తాము రచించిన ఆంధ్రాభ్యుదయమున 230వ పుటలో "ఘనికో దంట కవీంద్రు లన్న నుడిమైఁ బొంగారి రంగారగా, దివిషల్లోకము మర్త్యలోకమును కీర్తిన్మ్రోంచి రంచద్గతిన్" అని తిరుపతివేంకటేశ్వరులను కీర్తించిరి వేంకటశాస్త్రి గారితో వీరికి విరోధభావము కల్గిన యనంతరము సుమారు నూఱు గ్రంథములు హేలగా రచించిరి వేంకటశాస్త్రిగారికి గురు వగుటచేతనే శాస్త్రిగారికి కీర్తి కలిగిన దను కొందఱి భ్రాంతిని విదల్చి, తమ వ్యక్తిత్వమును లోకమునకు చాటిరి శ్రీ విశ్వనాథ సత్యనారా యణగారిపై ఏ కారణముననో కోపమువచ్చి, రామాయణ కల్పవృక్ష మును శాస్త్రిగారు విమర్శించుటయు, శ్రీ వేంకటశాస్త్రిగారు దానికి సమా ధాన మిచ్చుటయు జరిగినది. కాని శాస్త్రిగారు తమ గ్రంథములయందా

విషయ మెచ్చుటను పేర్కొనలేదు శ్రీ మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి గారును, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారును, కీర్తిశేషులు కొమ్మూరి బాలబ్రహ్మానందదాసు గారును శాస్త్రిగారి శిష్యులే వారికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ప్రభృతి ప్రశిష్యవర్గమును గలదు శ్రీ విశ్వనాథసత్యనారాయణగారు ముక్త్యాల రాజావారిని దర్శించుటకు వెళ్లినపుడు "పరమ ధీకుండు శ్రీపాద కృష్ణుండు మీ, కొరడులో పిల్లనగ్రోవి నూదె" అను చాటువును చెప్పిరి

భారత, భాగవత, రామాయణ గ్రంథరచనము :

సంస్కృత భాషలోని గ్రంథములను సులభమగు శైలిలో తెలుగు లోనికి తీసికొనిరావలయునని యభిప్రాయము నేటి పెద్దలలోనున్నది. భారతమును సులభశైలిలో వ్రాయవలయునను అభిప్రాయముతో శాస్త్రి గారు మొదలిడిరో లేదో తెలియదుగాని కృష్ణభారతమును ప్రసన్న మగు శైలిలోనే దేశమున కందించిరి మూలాను సరణముగ కవిత్రయ భారతము లేనందున వారీపనికి పూనుకొనిరని కొందఱి యభిప్రాయము. నన్నయభట్టు శాంతరసప్రధానముగ నిర్వహింపవలెనను తాత్పర్యముతో ప్రారంభించిన భారతము, ఒక్కచేతిమీదుగా పూర్తికాకపోవుటచే శాస్త్రి గారు దీనికి పూనుకొనిరని, వారి మణికిరీట సన్మాన సభలో నొకరు చెప్పిరి భగవద్గీత, సనత్సుజాతీయాదులు తిక్కనగారు తెనిగింపక పోవుటచే మొత్తము గ్రంథమునే రచింప శాస్త్రిగారు పూనుకొనిరని కొంద అనిరి ఎవ్వ రేమన్నను శాస్త్రిగారు మాత్రము గ్రంథ రచనకు హేతువు "భారతేష్టత"యని చెప్పిరి

నన్నయ తిక్కనాది కవినాథులకన్నను మిన్నగా తెనుం
గున్నుడువం గలాడ నధికుండను నేననికాదు, గ్రంథమం

దు న్నెరసుల్ గొంతలును తోచునపంచనిగాదు వెండియుం
బన్నట భారతేష్టతను బట్టిన చాపలమంచు నెంచుడీ
(కృష్ణభారతము)

శాస్త్రిగారు ఆది సభాపర్వముల రచనమును పూర్తిచేసి ముద్రణ విషయ మాలోచించుచుండగా భద్రాచలము. పాలవంచ సంస్థానముల కధీశ్వరులైన శ్రీ పార్ధసారధియప్పారావుగారు వారికి వారై వీరికి వేయిరూప్యము లిచ్చిరి కృష్ణామండలమున ముక్త్యాల సంస్థానాధీశ్వరులు శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరువారు, అష్టోత్తర శతశివాలయములు ప్రతిష్ఠించిన శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రి ప్రభువులకు ప్రపౌత్రులు కృష్ణభారత రచనమును గూర్చి కర్ణాకర్ణిగ విని వారు జగ్గయ్యపేట వాసులైన పండిత పిరాట్ల మృత్యుంజయశాస్త్రి గారిచే శాస్త్రి గారికి జాబు వ్రాయించిరి శాస్త్రిగారైదారురోజులు వారేర్పరచిన భోజన వసతితోనుండిన పిదప పర్వమున కెంత కావలెనో తెలుపుడను చీటి వారికి వచ్చినదట శాస్త్రిగారు తాను బేరగాడను కానని చెప్పి ప్రయాణము కట్టుచుండగా ప్రభువుగారి దర్శనమైనది శాస్త్రిగారు ఆశీః పూర్వకముగ తాము రచించిన పద్యమును వారి కిచ్చి దానిని ప్రభువులు పూజలోనుంచుకొనినచో వత్సరములో పుత్రోదయ మగునని చెప్పి వెడలిపోయిరి శాస్త్రిగారి ఆశీస్సు ఫలించిన పిదప వారిని రావించి తమకు నెలకెంత ఖర్చగు నని ప్రభువులు ప్రశ్నింపగా, శాస్త్రిగా రెనుబది రూప్యము లనిరి ఉదారులగు అధీశులు నెలకు నూటపదియార్లచొప్పున శాస్త్రిగారికి పంపిరి మూడేళ్ళైన పిదప, రాజుగారి యాంతరంగికులు శాస్త్రిగారు గ్రంథము వ్రాయుట లేదనియు, చతురంగ ఖేలనాదులతో కాలక్షేపము చేయుచుండి రని చెప్పుటచే కాబోలు, వారు నెలకు ఏబది రూప్యములకు సరిపడునట్లుగ రెండుమూడు నెలల కొక పర్యాయము సొమ్ము పంపెడివారట దానిపై శాస్త్రిగారు తాము చతురంగ మాడుకొను పనియున్నది గనుక గౌరవ మాస వేతనము పంపవలెనని రిజిష్టర్డు

పోస్టులో తెలియ చేయగా వారు పంపుట విరమించిరట శ్రీ చల్లపల్లి రాజాగారి వివాహమున కాహూతులై శాస్త్రిగారు వెళ్ళినపుడు ముక్త్యాలా ధీశులు వెనుకటి చరిత్రమును మరవిపోవ మనిచెప్పి రెండువేల రూప్యము లీయగా శాంతిపర్వమునుండి తిరిగి వారి ప్రతి పత్తిప్ర మేర్పడి భారత మంతయు ముద్రిత మయ్యెను పాలకొల్లు వణిగ్వరులు శ్రీ రేపాక సత్యనారాయణమూర్తిగారికి కృతిగా నిచ్చిన భీష్మ ద్రోణ పర్వముల సంపుటమును, శ్రీ చుండూరి నారాయణరావుగారికి కృతిగా నిచ్చిన కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వముల సంపుటము తప్ప మొత్తము భారతము ముక్త్యాలాధీశులకే అంకితమైనది రచనమునకు సుమారు పది సంవత్సర ములకాలము (1916 నుండి 1926 వరకు) పట్టిన దని వినికిడి. అల్పా శనము, అల్పనిద్ర కలిగియుండుట మహనీయుల లక్షణ మని పెద్దలు చెప్పుదురు శాస్త్రిగారు దినమునకు నాలుగు గంటలే నిదురపోయెడి వారు రాత్రి ఎనిమిది గంటలనుండి రెండు గంటలవరకు వారు గ్రంథ ములు రచించు సమయము వెండిపళ్ళెరములో లడ్డు వమ్ములు, దొరకినవో నాగ్రమఫలములు రచనాకాలమున అచట యుండెడివట. వారి గ్రంథములకు లేఖకులులేరు వారే చిత్తుకాగితములమీద తొలుత వ్రాసికొని, పిదప పుస్తకములతో ముద్రణమున కర్హమగు పద్ధతిని తిరిగి వ్రాసికొనెడివారు. ప్రూఫ్‌లను వారే దిద్దుకొనెడివారు వ్యాసరచిత మగు మహాభాగవతమును పోతనగారు తెనిగించిరి. అందు "పునర్జ న్మంబు లేకుండగన్" అని యవతారికతో వారు వ్రాసినదానికి విద్వాంసులు స్వారస్యమును చెప్పుచు భారతమైనను తెలుగులో మఱియొకరు వ్రాసిరి గాని భాగవతమున కాంధ్రమున బునర్జన్మము లేదని పలికెడివారు. శాస్త్రి గారు భాగవతమునకును 1948లో పునర్జన్మమును కలుగజేసిరి శ్రీకృష్ణ భాగవతమునకు డా దివాకర్ల వేంకటావధాని గారు పీఠికను రచించిరి అందు "వీరు చతుర్విధ కవిత్వములం దారితేరిన కవిసార్వభౌములు... ఆశుకవిత్వమందు వీ రందెవేసిన చెయ్యి వీరితో సమానముగ నిపుడు

కవిత్వము చెప్పగలవారు లేరని ఘంటాపథముగ చెప్పవచ్చును వీరి కవిత్వము సర్వలక్షణలక్షితమై, మృదుమధురమై, మనోహరముగ నుండుననుట సత్యదూరముకాదు ... శ్రీ శాస్త్రిగారు భారత భాగవత రామాయణములు చర్వితచర్వణముగా రచింపలేదనియు, పూర్వగ్రంథములు మూలభిన్నములుగ నుండుటంజేసి మూలార్థము లోకులకు తేటతెల్లముగావించుట కిట్లు మఱల వాని నాంధ్రీకరించి రనియు మనము తెలిసికొనవలసియున్నది'' అని చెప్పియున్నారు శాస్త్రిగా రీయుద్గ్రంథమును ప్రస్తుతము ఆంధ్రప్రదేశ ప్రభుత్వములో కాంగ్రెస్ చీఫ్ విప్‌గానున్న శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజుగారికి అంకితముచేసియున్నారు. శ్రీ ఈదర వెంకట్రావు పంతులుగారికి 1947లో రచించిన శ్రీకృష్ణరామాయణము నంకితము జేసియున్నారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయముతోడను, తిరుపతివేంకటకవుల పాండవోద్యోగవిజయముతోడను, తుల్యముగా, ఆంధ్రదేశమున ప్రదర్శింపబడి మన్నన లందుకొనిన 'బొబ్బిలియుద్ధ'మను వీరరసప్రధానమైన మహానాటకమును వీరు స్వర్గస్థుడైన తమ కుమారునికే అంకితముచేసిరి బ్రహ్మానంద మను అచ్చతెనుగు ప్రబంధమును పిఠాపురం మహారాజా శ్రీ రావువేంకట కుమారమహీపతిసూర్యారావు బహద్దరుగారి కంకితముజేసిరి శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్యూష్మ నిర్వచనమై కాచశాస్త్రిగ రచింపబడిన శాకుంతలము గవర్నరు శ్రీకూర్మా వెంకటరెడ్డినాయుడిగారికంకితము చేయబడినది ఈ గ్రంథములో త,న,జ,డ,క,ర,గ,ల,ద,ట,య అను పదకొం డక్షరములకే వినియోగము జయపురము మహారాజులుం గారైన శ్రీ విక్రమదేవవర్మగారికి 'విజయలక్ష్మీ విలాస'మను సంస్థాన చరిత్రకు సంబంధించిన గ్రంథమునుఅంకితముచేసిరి. 'గణేశపురాణము'ను కాండ్రేగుల జమీందారు గారైన శ్రీనివాస జగన్నాధరావుగారి కంకితము చేసిరి కాని పుస్తకమింతదనుక ప్రచురితము కాలేదు 'మరుత్తరాట్చరిత్రము'ను శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారికిని, 'స్వరాజ్యోదయము'ను శ్రీ అవసరాల రామారావు

గారికిని, 'ఆంధ్రాభ్యుదయ పూర్వభాగము'ను విజయవాడ వాసులు శ్రీ యనమండ్ర పిచ్చయశాస్త్రి గారికిని, అంకితము చేసిరి పైవన్నియు పద్యగ్రంథములే 'రాజేంద్రప్రసాదాభ్యుదయ'మను సంస్కృత కావ్యమును రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు గారి కంకితము చేసిరి ఆ కావ్యము రాష్ట్రపతి జీవితచరిత్రమును వర్ణించునదే 'భగవద్గీతామృత'మను ఆంధ్రగ్రంథము రాష్ట్రపతి రాధాకృష్ణన్‌గారి కంకితము చేసిరి 'గోమాహాత్మ్య'మను కావ్యమును రాజమహేంద్రవరములోని శ్రీ రామేన ఆదినారాయణగారి కంకితము చేసిరి ఆదినారాయణగారు గోబ్రాహ్మణ పూజాధురంధరులు వీధిలో తిరిగెడి ఆవులన్నియు ఎగబడి యాయనను సమీపింపును విశ్వాసముతో మోరలు పైకెత్తి వాలము లాడించును కారణము వారు బజారులో పచ్చగడ్డిని రోజునకు 30 రూపాయల చొప్పున కొని గోవులకు వేసి ఆ పరాయి యావులు దినుచుండగా తాను సంతోషించుచుండుటయే శాస్త్రి గారు తమ మరణశాసనములో వీరి నొక ట్రస్టీగా పేర్కొనిరి ఆదినారాయణ గారు వీరి జన్మదినమునకును, మరణదినమునకును ఉత్సవములు చేయుదురు వీరి శిలావిగ్రహమునకు పత్నీసమేతముగ అష్టోత్తర శతనామములతో పూజచేసి వేదపండితులను, కవులను సంభావింతురు. ఒక ఉత్సవసభకు నే నధ్యక్షత వహించుటవలన నా కీవిషయము లవగతము లయినవి ఆదినారాయణగారు తన సంతానమును శిలావిగ్రహము నొద్దకు తీసికొనివచ్చి తన యనంతరము శాస్త్రిగారికి ఉత్సవములు కొనసాగజేయుదు మని వారిచే శాస్త్రిగారి పాదములు పట్టింపించి ప్రమాణము చేయించిరి జటప్రోలు రాజా శ్రీ సురభి లక్ష్మారావు బహద్దరు గారికి 'చంద్రికాపరిణయ'మను నాటకము కృతి నిచ్చిరి శాస్త్రిగారు 'కావేరీచరిత్రము'ను శ్రీ వాడరేవు సూర్యనారాయణ పంతులుగారి కంకితము చేసిరి శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథము, దంటు భాస్కరరావు, నిమ్మన జీయన్న, చుండూరి వెంకటరెడ్డి, శ్రీమతి కాంచనపల్లి కనకాంబ

ప్రభృతుల కనేకులకు శాస్త్రి గారు కృతుల నిచ్చిరి వీరు నాటకములు, ప్రహసనములు నిఘంటువులు, అష్టకములు, శతకములు, ప్రబంధములు, ఛందోవ్యాకరణాదులు, అచ్చతెనుగు ఏవిన్వ, విద్ర, బంద, గర్భ ఏవిత్వములకు సంబంధించిన గ్రంథములు, కురుపాండవదాయ వాగ విమర్శనము మహాభారత తాంద్రీకరణ విమర్శనము, దురుద్ధరదోష శృంఖలము మొదలైన విమర్శన గ్రంథములు అనేకములు రచించియున్నారు వీరు అనేక మాహాత్మ్య గ్రంథములను వ్రాసిరి రాజమహేంద్రవరములో శ్రీతోలేటి వనకరాజు గారి అధ్యక్షతను ఏర్పడిన శతవార్షిక జయంత్యుత్సవ సంఘమువారు ప్రకటించిన సంచికలో నీయబడిన 211 గ్రంథముల జాబితాను ఈ వ్యాసాంతమున జతపరచుచున్నాను శాస్త్రిగారు తమ స్వీయచరిత్రమును తల్లిదండ్రుల కంకితముచేసిరి శ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారు శ్రీకృష్ణకవి జీవితమును పద్యమున రచించిరి శ్రీయుతులు కాకరపర్తి కృష్ణశాస్త్రి, కొమండూరి కృష్ణమాచార్యులు, అనంతపంతుల రామలింగస్వామి, మారేమండ రామారావు, కొమ్మూరి బాలబ్రహ్మానందదాసు, చల్లా పిచ్చయ్యశాస్త్రి, కోగంటి దుర్గామల్లికార్జునరావు, ఒంపోలు సత్యనారాయణ, విశ్వనాథ నరసింహంగారలు వారి వారి గ్రంథములను శాస్త్రిగారికి కృతి యిచ్చిరి శాస్త్రిగారు రచించిన గ్రంథములలో పదియవవంతుకూడ ప్రస్తుతము వారి యింటివద్ద లేవు. శ్రీకృష్ణ భారతమే సమగ్రముగ లేదు ఉన్నవానిలో కొన్ని అకాడమీ వారు సేకరించియున్నారు వారి గ్రంథములెచట యెచ్చటనున్నవో తెలిసికొని పుస్తకమున కొక ప్రతి చొప్పుననైన ఒకచోట దొరుకునట్లుగ సేకరించి యుంచుట అవసరము వారి గ్రంథములపై పి హెచ్ డి డిగ్రీకి రిసెర్చి చేయువారికి అవి యుపయోగపడవచ్చును

రాజసన్మానాదికములు :

11-1-1930వ సంవత్సరమున పాలకొల్లులో వీరి భారత భాగములను కృతిపొందిన శ్రీరేపాక సత్యనారాయణమూర్తి, శ్రీ చుండూరి

నారాయణరావు గార్లు రెండువేల రూపాయలు విలువగల బంగారు పూవులను, గోదావరి, కృష్ణ, కావేరి, గంగ మొదలగు నదీ జలంతో సమంత్రకముగ నునిచి సామ్రాజ్య పట్టాభిషేక మంత్రములతో శ్రీ శాస్త్రిదంపతుల నభిషేకించిరి శాస్త్రిగారు ఆరోజున, అభిషేకమునకు పూర్వము, 108 మృత్తికాస్నానములు చేసి, రామలింగేశ్వరాలయములో సర్వప్రాయశ్చిత్తము చేయించుకొని,సొంత ద్రవ్యముతో గోదానాదికములు నిర్వర్తించిరి. అభిషేకించిన స్వర్ణ పుష్పములను రెండువందలమంది వేదపండితులకు పంచిపెట్టివేసిరి. ఆ సభలో పీఠికాపుర విద్వాంసులు ఆమ్నాయార్థ వాచస్పతి శ్రీ వడలి లక్ష్మీనారాయణశాస్త్రి, శతావధాని శేషాద్రికవి, నాదెళ్ల మేధాదక్షిణామూర్తి ప్రభృతులు పాల్గొనిరి. బ్రహ్మశ్రీ వేమూరి రామగోవిందశాస్త్రిగా రధ్యక్షత వహించిరి శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య ప్రభృతులు సందేశము లంపిరి "ఆదత్తా కవిసార్వభౌమ పదవీశ్రీ భారతాఖ్యానతః, స్వర్ణేనాప్యభిషేచితోస్యభినవ శ్రీనాథ ధన్యో భవాన్" అని వైయాకరణ కేసరి శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రిగారు ప్రశంసించిరి పాలకొల్లు సభలో నొసగబడిన 'కవిసార్వభౌమ' బిరుదమునే శ్రీ కడప కోటిరెడ్డి గారి యధ్యక్షతను జరిగిన పదియారవ ఆంధ్ర మహాజన సభవారు విజయవాడలో నామోదించిరి నెల్లూరి వాసులు శ్రీ ప్రొఫెసర్ అంజన్‌గారు శాస్త్రిగారికి కవిగండపెండేరమును వేయించుటకు కొంత ప్రయత్నము విజయవాడలో చేయుటయు, రాజమహేంద్రవర వాసులు శ్రీ ముత్తంగి సీతారామయ్యగారు అట్టి సన్మానమునకే గౌతమీ పుస్తక భాండాగారమువారిని ప్రోత్సహించుటయు, శాస్త్రిగారు బ్రహ్మాండ పురాణకర్త శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి కృతి సమర్పణ మహోత్సవ సభకు అగ్రాసనాధిపత్యము వహించుట కేగినప్పుడు కడపలోని న్యాయవాదులు శ్రీ గుండురావు ప్రభృతులు నట్టి సంకల్పమే వెలిబుచ్చుటయు హేతువులై, రాజమహేంద్రవరమున శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావుగారధ్యక్షులుగను, శ్రీ బెజవాడ వెంకటస్వామి నాయుడు

గారు కార్యదర్శిగను సన్మాన సంఘ మేర్పడి, 20-10-1932వ తేదీని శాస్త్రిగారికి కవిగండపెండేర సన్మానము చేసెను చందాలు వసూలు కాకముందే నాయుడుగారు తమ భార్య మెడలోని కాసులు కరగించి గండపెండేరమును తయారు చేయింపగా నావ్యయమును కలవచర్ల గ్రామ వాసులు శ్రీ మందపాటి సీతారామచంద్రరాజు గారు భరించిరి సభాధ్యక్షులుగ తొలుత నిర్ణయింపబడిన శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు ఆలోజున సభకు రాలేకపోగా, శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారును, శ్రీ జయంతి రామయ్య పంతులుగారును, శాస్త్రిగారి శిష్యాగ్రగణ్యులైన శ్రీ చెళ్ళపిళ్ళవారిని సభాపతిగ నెన్నుకొనిరి శ్రీ వేంకట శాస్త్రి గారు కవి గండపెండేరమును శాస్త్రిగారి వామ పాదమునకు తొడిగిరి సన్మాన సంఘాధ్యక్షులు శ్రీ ఉకుమళ్ళ అచ్యుతరావుగారు "శ్రీకృష్ణ భారత మను పేరున ప్రకటించిన మన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి నిల యము కూడ 'సాహిత్య స్మారక చిహ్నముగ' దేశమునకు గైకొనదగి నది." అని సభలో సూచించిరి. శాస్త్రిగారు తన యనంతరము కవిగండ పెంచేరమును ఆంధ్రాయూనివర్సిటీవారి కిచ్చెద మని వాగ్దాన మొనర్చిరి శాస్త్రిగారు పిమ్మట వ్రాసిన విల్లు ననుసరించి గండపెండేరమేకాక, కళా ప్రపూర్ణ పట్టము, మహామహోపాధ్యాయ పట్టము, ఆ బిరుదమునకే సంబంధించిన రెండు రజత పతకములు, పెన్షన్‌ఫారము, తలపాగ, బెల్టు, కోటు, శృంగేరీ పీఠాధిపతు లిచ్చిన బంగారు పూవుల పట్టుశాలువా, మణి కిరీటము, మయూరభంజిలో వచ్చిన బంగారు పతకము, అఖిలభారత సంస్కృత పండితులుగ భారతప్రభుత్వము గుర్తించి యిచ్చిన ప్రమాణ పత్రము, శాలువ, పెన్ను, కళ్ళజోడు మొదలైనవి శాస్త్రిగారి మనుమడు శ్రీ కల్లూరి సత్యనారాయణమూర్తిగారు చేసిన కృషి ఫలితముగ శత జయంత్యుత్సవ సంఘాధ్యక్షులు శ్రీ తోలేటి కనకరాజుగారు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు పక్షమున అరుదెంచిన డాక్టరు కాకర్ల వేంకటరామ నరసింహముగారి కందజేసిరి. 1-2-1937వ సంవత్సరమున భారత

ప్రభుత్వము వీరిని "మహామహోపాధ్యాయ" బిరుదముతో సత్కరించెను 13-3-37న ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు వీరిని "కళాప్రపూర్ణ" బిరుదముతో సత్కరించిరి. 29-11-1941న రాజమహేంద్రవర వాసులు మ్యునిసిపల్ పార్కులో వీరి శిలావిగ్రహమును ప్రతిష్ఠించిరి పురపాలక సంఘమువారు వీరికి "ఫ్రీడమ్ ఆఫ్ దిసిటీ" యిచ్చి గృహమునకు పన్ను లేకుండజేసిరి 1945లో విజయవాడ నగరమున వీరికి "గజారోహణోత్సవము' జరిగెను నెల్లూరులో కూడ అట్టి యుత్సవమే జరిగెను శ్రీ మందూరి వెంకటరెడ్డిగారు వీరికి మణికిరీటమును సమర్పించిరి శ్రీకృష్ణ నాటకమునకు విజయవాడలో బ్రహ్మరథోత్సవము జరిగినది 1954వ సంవత్సరములో సంయుక్త మద్రాసు రాష్ట్రప్రభుత్వమువారు వీరి నాంధ్రాస్థాన కవిగ గౌరవించిరి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ ముఖ్యమంత్రి డా॥ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆస్థానకవి పదమును జీవితాంతము ఉండునట్లుగ చేసి నెలనకు వేయి రూప్యములు యిచ్చునట్లుగ ఉత్తర్వు లిచ్చిరి అంతియగాక ఆంధ్ర రాష్ట్రావతరణోత్సవ సభను కర్నూలునవీరిని రావించి ప్రభుత్వ పక్షమున వేయాఱులతో సత్కరించిరి మాన్యశ్రీ రెడ్డిగారు వీరి 92వ జన్మదినోత్సవమునకు అధ్యక్షస్థానమ లంకరించినపుడు శాస్త్రి గారు శ్రీ గోపాలరెడ్డి గారిని "విద్యాభూషణ" బిరుదముతో సత్కరించిరి శ్రీ గోపాలరెడ్డిగారు శాస్త్రిగారి నిర్యాణానంతరము పాదచారియై వారింటికేగి వారి కుటుంబమునకు సానుభూతిని తెలిపివచ్చిన ఉదాత్తులు 1954వ సంవత్సరములో గుడివాడలో శ్రీ యజ్ఞోజు మాధవాచార్యులవారి పూనికపై 'స్వర్ణ పుష్పపూజ' శ్రీ శాస్త్రిగారికి జరిగెను అన్నవరములో దేవస్థాన ధర్మకర్తలు శ్రీ ఇనుగంటి వేంకటప్రకాశరావు బహద్దరువారు శాస్త్రిగారి దంపతులను పూజించి 2.116 రూప్యములు పూజా దక్షిణగ నొసంగిరి. 29-10-1958న సంవత్సరమున వీరు కేంద్రప్రభుత్వము వారిచే 'భారత సంస్కృత పండిత'' సత్కారమును పొందిరి వీరికి 'ఆంధ్రవ్యాస, అభి

నవశ్రీనాథ, వేదవిద్యా విశారద, ప్రసన్న వాల్మీకి, విశ్వకవి, కవి బ్రహ్మ'' మొదలైన బిరుదములు చాల కలవు. ఆంధ్ర ప్రదేశము వీరికి పెక్కుచోట్ల సన్మానములు జరిపెను. ఇట్లు ఆంధ్రకవితా సామ్రాజ్యమును సుమారొక శతాబ్దము పాలించిన కృష్ణమూర్తిశాస్త్రిగారు 29-12-1960వ సంవత్సరమున ముక్కోటి ఏకాదశినాడు రాత్రి కాలమున పరమపదించిరి వీరి మృతికి సంతాపమును సూచించుచు దేశమంతటను సభలు జరిగెను. విజయవాడలో, నే నేర్పాటుచేసిన సభలో ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు ప్రసంగించుచు "శ్రీ శాస్త్రిగారి ప్రతిభ ఉపజ్ఞ అనన్యసామాన్యము. నాకు దెలిసినంతవఱకు ఏ భాషలోను ఏ కవియును యిన్ని సాహిత్యరీతులలో కృషి చేసి యింతగ బహుళ గ్రంథరచన చేయలేదు'' అని తమ భక్తి ప్రపత్తులను వెల్లడించిరి హైదరాబాదులో ఆంధ్ర కళాకేంద్రమువారు శ్రీ శాస్త్రిగారి గృహమును ప్రభుత్వము తీసుకొని సాహిత్య యాత్రాస్థలముగ రూపొందింపవలెనని తీర్మానించిరి శ్రీమాన్ ఉప్పల సత్యనారాయణాచార్యులుగారు మాట్లాడుచూ శ్రీ శాస్త్రిగారిని పోప్, డ్రైడెన్‌లతో పోల్చుచూ వీరు ప్రబంధయుగమునకు చెందిన ఆఖరి కవి యని వర్ణించిరి శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు ఒక ప్రకటన చేయుచు "శాస్త్రులవారి నివాస భవనమును ప్రభుత్వము శాస్త్రులవారి పేర చిరస్థాయిగ తగురీతిని కాపాడవలెనని శాస్త్రులవారు కోరుచుండిరి వారి యీ చరమ కాంక్షను ప్రభుత్వము నెరవేరిస్తే ఆంధ్రసరస్వతి సంతోషిస్తుంది'' అనిరి అనేక పత్రికలు తమ విషాదమును ప్రకటించుచు సంపాదకీయములు వ్రాసినవి శ్రీ నార్లవారు తమ సంపాదకీయములో "ఆయనది ఒకమాట, ఒక బాణ మనే ప్రకృతి. కొన్ని సునిర్దిష్ట భావాలాయనకున్నవి వానిని వెలనాటుటలో జంకు-గొంకు లెరుగని గుండెబల మాయనిది......ఆంధ్ర చరిత్రలో, ఆంధ్రవాఙ్మయములో సుప్రతిష్ఠితుడై కలకాలం నిలువ గలడు'' అని వ్రాసిరి వారే ఆంధ్రజ్యోతి 30-12-1960 తేదీ సంచిక

మొదటి పుటలో, వారి జీవిత సంగ్రహమును వెల్లడించుచు "వజ్రాయుధము సాహిత్యరంగంలో వజ్రాయుధంగానే వెలుగొందినది" అని శాస్త్రిగారి పత్రికా సంపాదకత్వమును ప్రశంసించిరి.

కర్తవ్యము :

ఇట్టి మహనీయుడు గతించి సుమారాఱు సంవత్సరము లైనది. వారు ముద్రించిన గ్రంథముల నుచితముగ పంచిపెట్టిరేకాని యార్థికముగ వానివలన ప్రయోజనమును పొందలేదు. వారు సంతానమున కిచ్చి పోయినది కొంత ఋణము, వారి నివాసగృహము మాత్రమే వారికి పుత్రులు లేరు పుత్రికలు సంపన్నులుగారు వారి గృహము సాహిత్య యాత్రాస్థలముగ జేయబడుట యెల్లరకు నభిలషణీయము. దానివలన మన రాష్ట్రమునకు గౌరవమేకాక, వారి పుత్రికలకును ఆర్థికముగ కొంత లాభించును శ్రీ శాస్త్రిగారి గ్రంథము లన్నియు సేకరించి యచట నిలుపవచ్చును. శ్రీ శ్రీ శ్రీ శృంగగిరిస్వామివారు 23-9-1965న నొక లేఖ వ్రాయించుచు "He contributed much for the elevation of the Andhra community as a whole and has won an immortal fame at home and abroad It is but right that his memory should be kept ever green in the minds of the Andhra patriots by putting up a fitting memorial for original research work on the glories of his life". అని సూచించిరి శాస్త్రిగారి జీవితకాలములో దేశము వారి కేలోటును కలుగనీయలేదు. వారి నిర్యాణానంతరము వారి కేదేని చేయుట మిగిలియున్నదని పెద్దలు భావించినచో, నది కార్యరూపము దాల్చినచో యీ వక్త అధికముగ సంతోషింపగలడు. ఈ యవకాశమును నాకు కల్గించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధిష్ఠానవర్గమునకు నా నమస్సులు.

# శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి
# ర చ న లు

1 శ్రీకృష్ణభారతము 18ప
2 శ్రీకృష్ణ రామాయణము 7 కాం
3 శ్రీకృష్ణ భాగవతము 12 స్కం
4 మంగళగిరి మాహాత్మ్యము
5 శివానందలహరి
6 ఆంధ్రాభ్యుదయము
7 నైషధీయ చరిత్రము
8 కపిలగిరి చరిత్రము
9 వేదాద్రిమాహాత్మ్యము
10 అన్నవరక్షేత్రమాహాత్మ్యము
11 విజయలక్ష్మీ విలాసము
12 సానందసాయుజ్యము
13 జగద్గురు చరిత్రము
14 మధుకర విజయము
15 భీమశంకర విజయము
16 కామాక్షి విజయము
17 సతీత్రయ చరిత్రము
18 ద్వారకాతిరుమల మాహాత్మ్యము
19 కల్పభూజము
20 అమృతానందము
21 గోమాహాత్మ్యము
22 యాజ్ఞవల్క్య చరిత్రము
23 గణేశ పురాణము
24 బ్రహ్మానందము

25 భోగసుందర సీతారామ చరిత్రము
26 భద్రాచలరామ చరిత్రము
27 గజానన విజయము
28 కావేరి చరిత్రము
29 ప్రద్యుమ్నోపాఖ్యానము
30 మణిత్రయ చరిత్రము
31 గౌతమీ మాహాత్మ్యము
32 కనకగిరి
33 వేంకటేశ్వరీయము
34 భగవద్విలాసము
35 ఏకావళీ పరిణయము
36 సత్యనారాయణోపాఖ్యానము
37 సావిత్రీ చరిత్రము
38 రామకృష్ణపరమహంసీయము
39 ఇల్లిందకుంట రామాయణము
40 కలి మాహాత్మ్యము
41 అమృతరాజీయము
42 శకుంతల చరిత్రము
అన్నపూర్ణా పరిణయము
44 ఆంజనేయ చరిత్రము
45 తిక్కన చరిత్రము
6 హంసద్వీప మాహాత్మ్యము
4 శ్రీరామ చరిత్రము
48 జీడికంటి రామాయణము
49 ధన్వంతరి చరిత్రము
50 మీరాబాయి చరిత్రము
51 అహల్యాబాయి చరిత్రము
52 త్రికూటాచల మాహాత్మ్యము
53 మరుత్తరాట్చరిత్రము

54 ఐరోపా మహాసంగ్రామము
55 రాజమహేంద్రవర చరిత్రము
56 మార్కండేయ చరిత్రము
57 సింహాచలక్షేత్ర మాహాత్మ్యము
58 హేలాపురశంకర చరిత్రము
59 పల్వలేశ్వర మాహాత్మ్యము
60 శిదేవీ స్తవరాజము
61 ఆంధ్రరాష్ట్ర తృతీయ వార్షికోత్సవము
62 భగవద్గీతాసారము
63 స్కాందపురాణము (మొదటిభాగము)
64 వేంకటనృసింహరాయ చరిత్రము
65 పాదపూజ
66 యమలోకము
67 సరస్వత్యనునయము
68 గోదేవి కొఱ్ఱు
69 అరణ్యరోదనము
70 న్యాపతి సుబ్బరాయ చరిత్రము
71 సురభిరాజవంశావతారము
72 శ్రీకృష్ణాశీర్వచనము
73 భారతీమనస్తాపోపశమనము
74 విచిత్ర ప్రసంగము
75 కవితోపదేశము (ఛందస్సు)
76 గారెబూరె సంవాదము
77 మాదిరెడ్డి వేంకటేశ్వర స్మృతి
78 సుదర్శనోదంతము
79 అలక్ష్మి లక్ష్మి సంవాదము
80 లక్ష్మి సరస్వతీ సంవాదము
81 విజయాభ్యుదయము
82 దుష్టచతుష్టయము

83 శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిరూష్మ్య నిర్వచనైకాదశాక్షరి
84 ఆనందోదయము
85 భవిష్యన్మహాపురాణము
86 ఆంధ్రనామసర్వస్వము (నిఘంటువు)
87 గ్రామ్యారణ్య కురారము
88 బౌద్ధచరిత్ర సంగ్రహము
89 ఆంధ్రరాష్ట్రావతరణము
90 పలదమేశ్వర చరిత్రము
91 స్వరాజ్యోదయము (నాటకము)
92 స్వరాజ్యోదయము (ప్రబంధము)
93 అన్నవరక్షేత్రము (మంజరీద్విపదము)
94 మహమ్మదు చరిత్రము
95 గోదావరీ విలయతాండవము
96 ఏకాదశ స్వాతంత్ర్యోత్సవము
97 శ్రీకృష్ణ స్వీయ చరిత్రము
98 గేమ్మెరామోండము

## - నాటకములు :-

1 యాజ్ఞవల్క్య నాటకము
2 వీరసేనవిజయ నాటకము
3 యజ్ఞఫల నాటకము
4 బొబ్బిలియుద్ధ నాటకము
5 రాజభక్తి నాటకము
6 వధూవిజయ నాటకము
7 మాయావతీ నాటకము
8 సావిత్రీ నాటకము
9 భారతసార నాటకము
10 వీరరుద్ర నాటకము
11 స్వరాజ్యోదయ నాటకము

12 వేణీసంహార నాటకము
13 కలభాషిణీ నాటకము
14 కమలినీ పరిణయ నాటకము
15 భోజరాజవిజయ నాటకము
16 గాంధివిజయధ్వజ నాటకము
17 తిలకమహారాజ నాటకము
18 శ్రీరామకుమారవిజయ నాటకము
19 మోహినీమనోహర (ట్వెల్త్ నైట్)
20 సుందోపసుంద నాటకము
21 అహల్యా నాటకము
22 శ్రీనాథకవిరాజీయ నాటకము
23 విక్రమదేవ విజయ నాటకము
24 వ్యాసావతార నాటకము
25 యయాతి నాటకము
26 మహాభారతయుద్ధ నాటకము
27 పంచవర్ష ప్రణాళిక నాటకము
28 చంద్రికాపరిణయ నాటకము
29 సుకన్యా నాటకము
30 ఆంధ్రజ్యోతి (అల్లూరాం)
31 శకుంతలా నాటకము
32 ఉత్తర రామచరిత్ర నాటకము

## — శతకములు —

1 శనైశ్చర శతకము
2 అయితే అంతే శతకము
3 కల్లూరప్ప శతకము
4 చాణక్య శతకము
5 చిత్ర శతకము

## - వ చ న కా వ్య ము లు :-

1 గోదావరీ మహాప్రళయతాండవము
2 గౌతమీపుష్కర మాహాత్మ్యము
3 తెనాలిరామకృష్ణ చరిత్రము
4 కాళిదాస విలాసము
5 జగన్నాథ మాహాత్మ్యము
6 పతివ్రతల చరిత్రము
7 సకలఫలసార సంగ్రహము
8 గౌరాంగ చరిత్రము
9 ఆంధ్రభాషోపన్యాసము
10 రాజమహేంద్రవర చరిత్రము
11 శ్రీకృష్ణకవిరాజీయము
12 స్వీయచరిత్రము
13 రామాయణతత్త్వము
14 భారత భాగ్యోదయము
15 మాలతీ మధుకరము
16 శ్రీకృష్ణభావార్థదీపిక
17 విక్రమోర్వశీయ విమర్శము
18 మహా నైవేద్య నిరసనము
19 మోసకృత్యము
20 ఉర్లాం మాహాత్మ్యము
21 ప్రతిపక్షరక్షాబంధనము
22 గ్రహోచ్చాటన మంత్రము
23 మాయాపులు
24 పండిత వివాదము
25 మంగలి మంత్రి
26 సీతాకోకచిలుక
27 మహాభారతచరిత్ర నిరాకరణము

28 ఆంధ్రభాషాభూషణము
29 స్వర్ణోత్సవము
30 గ్రామ్య వ్యాకరణము
31 సుకవులు కుకవులు
32 ధర్మసంరక్షక సభ
33 గ్రామ్యనిరాకరణము
34 నన్నయభట్టారక చరిత్రము
35 రావుబహద్దూర్

-: పత్రికలు :-

1 గౌతమీ దినప్రతిక
2 కలావతి మాసపత్రిక
3 స్వరాజ్యోదయము పక్షపత్రిక
4 మానవసేవ మాసపత్రిక
5 వజ్రాయుధము మాసపత్రిక
6 వందేమాతరం పక్షపత్రిక

-.విమర్శన గ్రంథములు:-

1 మహాభారత హాస్యవిమర్శనము 2 భా
2 శివభక్తి విమర్శనము
3 వేణీసంహార విమర్శనము
4 చెళ్లపిళ్ల చెర్లాటము 5 భాగములు
5 జాతకచర్యా విమర్శనము
6 బొబ్బిలి పట్టాభిషేక విమర్శనము
7 ఆంధ్రభాషానుశాసన విమర్శనము
8 కర్ణ జనన విమర్శనము
9 ఖండకావ్య విమర్శనము
10 రావణ విమర్శనము
11 సుశీల విమర్శనము

12 ఆంధ్రవిక్రమోర్వశీయ విమర్శనము
13 సుయోధన విజయ విమర్శనము
14 విజయవిలాసకృతి విమర్శనము
15 ప్రసన్న యాదవ నాటక విమర్శనము
16 జయంతి నిరసనము
17 కురుపాండవదాయభాగ విమర్శనము
18 మహాభారతాంధ్రీకరణ విమర్శనము
19 దురుద్ధరదోష శృంఖలము
20 సుయోధన విమర్శనము
21 శ్లోకపంచక నిరాకరణము

—: ప్ర హ స న ము లు :—

1 కాళిదాస సహస్రనామానువాదము
2 ధార్మికపంతులు
3 లొట్టారి బుచ్చిగాడు
4 కుక్కకాటు వైద్యము
5 పాదపూజ

—: సంస్కృత గ్రంథములు:—

1 స్వీయచరిత్రము
2 శ్రీ రాజేంద్రప్రసాదాభ్యుదయకావ్యం
3 పరబ్రహ్మాష్టకము
4 ముక్తిపురరాజేశ్వరాష్టకము
5 బ్రహ్మానంద సరస్వత్యష్టకము
6 శ్రీరామాష్టకము
7 చంద్రయశశ్చరితము
8 గురుచరిత్రము
9 శ్యామలాష్టకము

మఱియు నెన్నో గ్రంథములు పేరు లేకుండనే పోయినవి.

# శ్రీకృష్ణ భారత ప్రాశస్త్యము

—ప్రొఫెసర్ టి అంజన్
నెల్లూరు

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిని సుమారు అర్ధశతాబ్దమునుండి నేను బాగుగ నెఱిగి యుండుటచే ఈ శత జయంతి మహోత్సవ సందర్భమున శాస్త్రి గారియందలి భక్తిచే నేమను నాల్గు మాటలు చెప్పి నా శ్రద్ధాంజలిని ఘటించు కుతూహలమే నన్నిట్లు పురికొల్పి మీ సమక్షమునకు రప్పించినది

శాస్త్రి గారి పాండిత్య కవితాసామర్ధ్యములు, దండిపండితమండలి చేతను, ప్రభువులచేతను, కొనియాడబడియున్నవి అందులకు వారికీయబడిన బిరుదములు, జరుపబడిన గౌరవములే ప్రత్యక్ష సాక్ష్యములై యుండగ విశేషించి వారి శక్తిసంపదలలో ప్రజ్ఞాప్రాభవములలో సహస్రాంశమైనను లేని నేను ఏదో చెప్పబూనుట వెఱ్ఱితన మనిపించుకొనును శారదపూర్ణిమనాటి తారామనోహరుని జూపుటకు చేతిలాంతరు కావలయునా? అయినప్పటికి నుడుతభక్తివోలె, చిరకాలమునుండియు వారి యాశ్రయమునను, ఆదరణమునను, పెద్దలగువారిని సేవించుట చేతను, ఏకొంచెమో పలుకనేర్చిన నేను ఈరీతిగా నా వాక్కును ధన్యమొనర్చుకొనుట మాత్రమే ఉద్దేశించి నిజ సామర్ధ్యమును శంకించుకొనక మహామహులైన మీ మ్రోల నిలచిన నా సాహసమునకు మన్నింప వేడుచున్నాను శాస్త్రి గారి రచన లన్నిటిలో "శ్రీకృష్ణభారతము" ప్రథమ గణనీయము

## శ్రీకృష్ణ భారత ప్రాశస్త్యము

శ్రీ వ్యాసభగవానునిచే రచియింపబడి పంచమ వేద మని ప్రసిద్ధి గాంచిన మహాభారతమును కవిత్రయమువారు మున్నాంధ్రీకరించిరి

మన శాస్త్రి గారు దానిని చదువునపుడు అది మూలానుసరణముగ లేకను, కొన్ని ఘట్టములు మూలములోనివి తెనుఁగున లేకయుండుటయు, పారక లేఖక ప్రమాదములు గోచరించుటయు, గమనించి, వానిని సవరించు తలంపు గొని తుద కది సరిపడునది కాదనియెంచి ఆ యుద్యమమును విరమించుకొని, గ్రంథమునందలి వ్యత్యయ వినిమయాదులు, పారకలేఖక ప్రమాదములు తొలగించి తామే మూలానుసరణముగ తెనిగించిన బాగుగనుండు ననియెంచి, భారత రచనకు బూని యథామాతృకముగా భారతమును రచించితి నని, శాస్త్రి గారు వ్రాసికొనియున్నారు

చూడుఁడు:- కర్ణుని జన్మవృత్తాంతము ఆదిపర్వమున సద్యోగర్భ మనియుండ, ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వాంతమున కుంతి తొమ్మిది మాసములు గర్భము మోసి పదియవ మాసమున కర్ణునిం గనియె నని యున్నది. మూలమున నట్లు లేదని, శాస్త్రి గారు నిరూపించిరి కుంతి, దుర్వాసు డిచ్చిన మంత్రప్రభావ మఱయగోరి, సూర్యునిం జూచుచు- "కన్యాసతీదేవ మర్క_మాజుహావ, యశస్వినీ సాదర్శత తమాయాతం భాస్క_రం లోకపావనం" అని మూలము

ఇట్లు, సూర్యు నాహ్వానించెననియు, అతడు ప్రత్యక్షమై వచ్చి "తాం సమాసాద్యదేవస్తు వివస్వా నిదమ్రబవీత్- అయమస్మ్య సితా పాంగి బ్రూహికింకరవాణితే- రపనస్సంభూవ తయాసహ- తత్రవీర స్సమభవ త్సర్వశస్త్ర భృతాంవరః। ఆము_క్తకవచః శ్రీమాన్ దేవగర్భ శ్రియాన్వితః సహజం కవచం బిభ్రత్కు_ండలోద్యోతి తాననః అజాయత సుతః కర్ణస్సర్వలోకేషు విశ్రుతః॥" అని యున్నది "వసునా సహజా తోయం వసుషేణో భవత్వితి" అనుటచే కర్ణునకు వసుషేణు డనియును పేరు కలదు

"మూ - తతోగర్భస్సమభవత్పృథాయాః పృధివీపతే, శుక్లే దశో_త్తరే పక్షే తారాపతి రివాంబరే సాబాంధవ భయాద్బాలా గర్భతం వినిగూహతి" అనియుం గలదు

ఇందు ఏకోత్తర శబ్దము ప్రమాదమును గల్గించుటచే, శంభుదాసుని భారతమును ఎవ్వరైనను సంస్కరించియుందురేమో యనియు, దాని యర్థమును శ్రీ నీలకంఠాచార్యులవారు, భావార్థదీపికయందు- "తత ఇతి- దశోత్తరే ఏకాదశే శుక్లే పక్షే ప్రతిపది, చంద్ర ఇవ బాల ఉద్భూతః మాఘ శుక్ల ప్రతిపది, కర్ణ నిషేక జన్మే త్యర్థః।" అని వ్యాఖ్యానించియున్నా రనియు, కావున కుంతి సూర్యు నారాధించిన ఆనాడే సద్యోగర్భమున కర్ణుడు జన్మించెననియు, కుంతి పది మాసములు నీరు మోసి కర్ణునిం గనియె ననుట మూలవిరుద్ధ మనియు నది యసంగత మనియు శాస్త్రి గారి తెలుగు సేత తెలియజేయుచున్నది.

కవిత్రయమువారు తెనిగించి దానికి "శ్రీమన్మహాభారతము" అని పేరు బెట్టిరి శాస్త్రి గారు దీనికి "శ్రీకృష్ణ భారతము" అను పేరిడిరి మూలము శ్రీకృష్ణద్వైపాయనుని దగుట, భారతమున శ్రీకృష్ణుని ప్రశస్తి మెండుగనుండుట "కృష్ణ" శబ్దము ద్రౌపదికి, అర్జునునకు వర్తించుటచే శాస్త్రి గారు తమ పేరు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు కావున తమ పేరును స్ఫురింపజేయుటకు తమ యింటిపేరు లోని "శ్రీ" ని పేరులోని "కృష్ణ" శబ్దములను చేర్చి "శ్రీకృష్ణ భారతము" అను పేరు పెట్టియుందు రని ఊహించుచున్నాను.

కవిత్రయమువారు ముప్పురును మహామహిమాన్వితులు, మహాత్ములు అందు పదేను పర్వములు వ్రాసిన తిక్కన మహాశయుడు అమాత్యపదవియం దుండినవారు యజ్ఞముచేసి సోమయాజి యైనవారు. నన్నయభట్టారకుడు రాజరాజనరేంద్రుని యాస్థాన కవివరేణ్యుడు ఉభయులకును రాజాశ్రయము గలదు. నన్నయభట్టునకు నారాయణభట్టు, తిక్కనసోమయాజికి కుమ్మరి గురునాథుడు సహాయపడిరి మన కృష్ణమూర్తి శాస్త్రిగా రన్ననో, పితృ పితామహు లార్జించియుంచిన భూస్థితి నెల్ల వ్యవసాయాదు లొనర్చి నష్టము రాగా ఋణములు చేసి

పోఁగొట్టుకొనిరి అట్టి పీ రింతటి మహాకార్యమును తలపెట్టుట ఆశ్చ ర్యముగ దోఁపవచ్చును శాస్త్రి గారు మహాసాహసులు అత్యంత ధైర్యము, ఉత్సాహము, ఆత్మవిశ్వాసము గలవారు అనుపమాత్మ గౌరవ సంపన్నులు సత్యప్రతిష్ఠాపనాబద్ధ కంకణులు

వేదమును వల్లించి, వయనాంతము శ్రౌతము నేర్చి, సోమపంచ కమును క్షుణ్ణముగ పఠించి కంఠస్థము చేసి, వారి దండ్రిగా రొనర్చిన అగ్నిష్టోమమునకు ఆధ్వర్యము చేసిన శ్రౌతులు ప్రాచీ నాంధ్రప్రపితా పితామహులైన నన్నయ తిక్కనాదులకు వలెనే వైదిక సంస్కృతి సంప్రదాయములు గలవారు "అసంచయవాన్'' అను విప్రలక్షణమునకు లక్ష్యభూతులైనవారు అన్నింటికన్న శ్రీవిద్యోపాసకులు, బాలత్రిపుర సుందరీ మహామంత్ర ద్రష్టలు, గణపతిపూజా ధురంధరులు, అంతటివారు కావుననే ఇంతటి మహాకార్యమునకు బూని, దానిని నిర్విఘ్నముగ సాధింపగల్గి రని నా యభిప్రాయము

కవిత్రయమువారి తెలుగు భారత మొకటి మిగుల ప్రచారములో నుండగ మరల దీనినే పీ రాంధ్రీకరింప నేలఁ అనువారుందు రని కాబోలు శాస్త్రి గారు.

"నన్నయ తిక్కనాది, కవినాథులకన్నను మిన్నగా తెనుం
గున్నుడుపంగలాడ, నధికుండను నే ననికాదు..."

అని చెప్పి——

మ. అయి దాతేడుల యీడునన్ బ్రతిదినం
బా భారతామ్నాయముఁ
నియమం బొప్పఁ బురాణమున్ వినిచి ని
ర్ణిద్ర ప్రబోధాప్తి మా
యయగా రర్థముఁ జెప్పి తత్కథలు లో
నంటింప నెంతేనియున్

ప్రియమయ్యెన్ జుడి నాకు భారతముపై
నిత్యానుమోదంబుఁగన్.॥

అనియు "వాగనుశాసనాది కవివర్యు లదెక్కడ? మాటలాడుచో నాగెడునే నిదెక్కడ? ఈ భారత సంహిత యను మహాసముద్రమును ఏగతి నీదుదు ఈఁగలాగునన్" అనియు నిట్లు తమ వినయగుణమును చాటి చెప్పినారు శాస్త్రిగారు శాస్త్రిగారు వన పర్వము నాంధ్రీకరించునపుడు కష్ట పరంపర లెన్నో వచ్చినవి వనపర్వాశ్వాసాంత పద్యములలో, తమ కష్టముల నిట్లుగ్గడించుకొనిరి.

శా. ప్రారంభించిన దాదిగాఁగ నెపుడున్
ప్రత్యూహము ల్గగ్గె ని
య్యారణ్యంబున, నాధి వ్యాధియును సం
ప్రాప్తంబు లయెన్ మతి
న్జెరె న్మాంద్యము, గ్రంధనిర్మితియు నిం
తేనయ్యె నో యయ్య! నీ
కారుణ్యామృత మిచ్చి నిచ్చలు ననుం
గావంగదే మ్రొక్కెదన్ ॥

మ. గ్రహచారం బపసవ్యమార్గ గతిమై
గన్పట్టు నప్పట్టునన్
సుహృదుం డైనను దుర్హృదుండయి కడున్
శోచ్యార్థముం గూర్చెడున్
సహజుం డైన సపత్న సన్నిభుఁ డగున్
దత్సర్వమున్ నీ యను
గ్రహమున్న వ్వను నేమి సేయఁ గలుగుం
గారుణ్యవారాం నిధీ!॥

ఒకవంక భార తాంత్రీకరణము సాగవలెను మఱియొక వక్క పత్రికా నిర్వహణము జరుగుచుండవలెను (గౌతమి, కలావతి, వజ్రాయుధము, మున్నగునవి వారు స్థాపించి నడిపిన పత్రికలు) వే రొక ప్రో పొరుగూళ్లలోను, పురమునను జరుగు విద్వత్సభలకు బోవలెను. ఇవి యన్నియు నొక యెత్తు. సొంత ముద్రణాలయమును నిర్వహించుట ఇంకొక యెత్తు అన్నింటికి మించి ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దుకొనుట మఱియొక యెత్తు కాని, ఎట్లో భార తాంత్రీకరణము మాత్రము సాగించుచునే యుండిరి

ఇట్టితఱి అభిమన్యుడు పద్మవ్యూహమున వీర మరణము నొందిన ఘట్టమును వ్రాయునపుడు, అర్జునుడు పుత్ర దుఃఖమున వనటంగుందుచున్నట్టి పట్టు వ్రాయుచుండిరి ఆపట్టున శాస్త్రి గారి యేకైక సుతుడు పండ్రెం డేండ్లవాడు "సుదర్శనసుధి" నామాంకితుడు ఇంచుక జబ్బుచేసి జబ్బుచేసిన ఆనాడే హఠాత్తుగా ప్రాణముల బాసెను ఈతీరని పుత్రదుఃఖముతో, శాస్త్రి గారు కొంతకాలము పిచ్చివానివలె నైరి. ఆవల కొన్ని నెలలకు గాని వారు తేరుకొనలేకపోయిరి ఆపట్టున శాస్త్రి గారు, తమ స్థితి నిట్లు నుడివియున్నారు.

మ॥ ధనమా పూజ్యము, రా జొసంగునది యా
దవ్వయ్యె, మాన్యంబులా
మునుపే చెల్లెను, పుస్తక క్రయ ధనం
బుల్ వచ్చుటా లేదు, నె
మ్మనమా పోయె, వివేకమా చెడియె, నే
మాడ్కిం దనూయాత్రకై
యనుకాలించెనొ గాలి, నిద్రయును నా
హారంబు లేనప్పుడున్ ॥

ఇట్లున్న నొక్కనాటి ఉదయమున శాస్త్రి గారు పది గంట లప్పుడు అచ్చుప్రూఫులను చూచి దిద్దుకొనుచుండిరి పోస్టుమెన్ ఒక ఇన్షూ్యరెన్సు కవరు తెచ్చి శాస్త్రి గారి చేతి కిచ్చెను దానిని చించి చూడగా సందొక ఉత్తరము, వేయి రూపాయలునుండెను. ఆ లేఖలో- శ్రీ శ్రీ శాస్త్రి గారికి నమస్కారములు, ఉభయకుశలములు వైణిక విద్వాంసులు బ్ర శ్రీ పిరాట్ల శంకరశాస్త్రి గారు మా సంస్థానమునకు విచ్చేసి మా దర్బారులో ప చ్చేరి చేసినారు సంభాషణావశమున శంకర శాస్త్రి గారు, మిమ్ముం గూర్చియు, మీ భార తాంధ్రీకరణముం గూర్చియు, ముచ్చటించినారు తమకు వెయ్యి రూపాయ లిందుతో పంపించుకొంటున్నాము భద్రాద్రి శ్రీరామచంద్రమూర్తి కృపచే నేడు మా కీసంకల్పము గల్గినది దయతో స్వీకరించి, మమ్ము కృతార్థులను చేస్తారని వేడుకొంటున్నాము నమస్కారములు, ఇం సం.

చిత్తగింపుడు
స్వవె అశ్వారావుబహదర్
పాల్వంచ సంస్థానము, భద్రాచలము.

అని యుండెను ఆ యుత్తరమును చదువుచున్నపుడు శాస్త్రి గారి కనుల నుండి ఆనంద బాష్పములు బొట బొట నాయుత్తరముపై బడినవి. ఇట్లెందరో శాస్త్రి గారిని అయాచితముగ సమ్మానించుచు గౌరవించు చుండిరి.

సాధారణముగా శాస్త్రి గారి రచన మంతయు హెచ్చుకాలము రాత్రి భోజనానంతరము రెండు గంటల:వఱకును సాగెడిది అంతయును చేతి కందిన చిత్తుకాగితములపై సన్నగా జిలుగుగా వ్రాయుదురు. న. స. ప. వ. మున్నగు కొన్ని యక్షరములు ఒకే రీతినుండి కను గొనుట మిక్కిలి కష్టముగనుండినను, వారి ప్రెస్సులోని కంపోజిటర్లు అభ్యాసవశమున గుర్తించి ఒకాచ్చి ప్రూఫుల నంపుచుండెడివారు 1916వ

సంవత్సరములో ప్రారంభించిన భారత రచన మిట్లు 1926 వ సంవత్సరము వఱకును సాగిన దని చెప్పవచ్చును ఇందు రచన సాగిన కాలము మాత్రము, నా ల్గయిదేండ్లుండును. ఈమధ్యకాలములో వా రూరకొనలేదు మఱికొన్ని గ్రంధములు రచించి, వానిని వారికి వారికిసి అంకితము చేసిరి.

కవిత్వ మన్న నెట్లుండవలయునో శ్రీ శాస్త్రిగారే ఇట్లు వ్రాసి యున్నారు.

సీ. ముత్యాలకోవనా నత్యంత మమరెడు
మృదు శబ్దజాలంబు పదిలపఱచి
మొదలువెట్టినఁ దుట్టతుదదాక కమ్మచ్చు
నందీఁగనా సాగి నడువఁజేసి
జాతియు రీతియు శయ్యాపాకంబును
శైలియు లీలమై జతనుపఱచి
యావంత యరసిరే నర్ధభావంబులు
తేటతెల్లంబుగాఁ దెలియఁ జేసి

తే. తగు నలంకారములు వెట్టి సొగసుమీఱ
నవరసంబులు చిప్పిల నవనవముగఁ
గల్పనలు చేయుచును జీవ కవితఁ గూర్పఁ
గలుగు కవిని మెచ్చనివారు గలరె జగతి

చ. తెలు గెట సంస్కృతం బెచట
దేశ్య మదెచ్చట నన్యదేశ్యముల్
మలయఁగ జేయు టెచ్చట స
మాసము లెచ్చటఁ జేర్ప నొప్పునో

తెలిసి కవీశ్వరుండు నిజ
రేఖను పేర్పడఁ గబ్బమల్లినన్
పొలిచెడు దాని కమ్మదన
ముం గని లోకము సంతసింపదే.

క. విరిపొట్లం బది విప్పిన
తరుణంబున మదికి నెట్లు తగిలెడు నామో
ద రసంబు, సుకవి కావ్యము
పరికింపఁగ నట్టి రసము పడయుంగాదే

ఇది సభాపర్వములు మొట్టమొదటి సంపుటము. దీనికి పీఠిక వ్రాసినవారు పండితకవి, విమర్శకాగ్రేసరులు నాగపూడి కుప్పుసామయ్య గారు. వారు విశేష శ్రమ కోర్చి విపుల మగు పీఠికను వ్రాసి శాస్త్రి గారి యనువాద క్రమమును, రచనాసామర్థ్యమును, కవితారీతిని గొని యాడియున్నారు మఱియు నందు పండి తాభిప్రాయములును కొన్ని కలవు. అందు అవధానిశిరోమణి, "విద్యావారిధి" మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారు ఇట్లు ప్రశంసించియున్నారు.

శా. ధారాశుద్ధికి జహ్నుకన్య పద సం
దర్భంపుఁ బూదోట, భా
షా రామామణి దర్పణంబు, గవితా
సామ్రాజ్య సింహాసనం
బౌరా ! సర్వరసామృతాంబునిధి, శ
య్యాపాక వృత్త్యా ద్యలం
కారాగారము, కృష్ణభారత మనం
గా నెన్న సామాన్యమే !

మఱియు, శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి ప్రభృతులు కొందఱు ప్రశంసించియున్నారు పీఠిక వ్రాసిన నాగపూడి కుప్పుసామయ్య గా రిటుల వక్కాణించిరి.

చ అరుదుగ బాహుశక్తి మెఱ
యం గడు దుస్తరమౌ గభీర సా
గరమును నీఁది యద్దరిని
గాంచిన కైవడి భారతంబు, బం
ధుర సరసాంధ్ర పద్యముల
నూతన రీతిని జంద్రమౌళి స
త్కారుణను వ్రాసి సద్యశము
గాంచితి కృష్ణకవీ ! స్థిరంబుగన్.

మిగిలిన కొన్ని సంపుటములకు, పీఠికలు భూమికలు వ్రాసిన మహాశయులలో నొకరు శతావధాని కవితాకళానిధి శ్రీమాన్ సంపన్మూడుంబ సింగరాచార్యులవారు, ఆరణ్యపర్వమునకుం బీఠిక వ్రాసిరి అందు మూలముతో సరిపోల్చి కవిత్రయమువా రేయే ఘట్టములలో సంక్షిప్తము చేసిరో, ఎట పెంచిరో, శాస్త్రి గా రెట నెట మూలము ననుసరించి వ్రాసినారో నిరూపించుచు సోదాహరణముగా విపులముగ బేర్కొని ఆచార్యులవా రిట్లు నుడివియున్నారు.

మ. ప్రతి శబ్దమ్ము రసప్రపూరితముగా
భావించి భావార్థముల్
స్తుతిపాత్రంబుగఁ జేసి భాసురమతిన్
శోధించి మూలార్థమున్
శ్రుతిపేయామృత సారమోయన రుచుల్
చొప్పించి, శ్రీకృష్ణ భా

రతముం గూర్చిన కృష్ణమూర్తి కవి మూ
ర్ధన్యుం బ్రశంసించెదన్.

విరాటోద్యోగ పర్వముల సంపుటమునకు, భూమిక వ్రాసిన "సుధీమణి" పుల్లెల శ్రీరామశాస్త్రి గారు శాస్త్రిగారి రచనము, మూలాను సరణముగ నుండుటచే తిక్కనసోమయాజి విరాటపర్వమునకన్న నిది చిన్నదిగనుండుటయు, ఉద్యోగపర్వమున కన్న నిది పెద్దదిగ నుండు టయు, పొసగిన దనిరి. కవిత్రయమువారి కవిత్వమునకన్న మన "కవిరాజు" గారి కవిత్వ ముత్తమత్వము నొందియున్న దనఁజాలను. అన్నను లోకము హర్షింపదు. "తెలుఁగులఁగన్న సత్కవులు, వాగను శాసనాది కవివర్యులు" అని కవిత్రయమువారియెడ మిక్కిలి భక్తి ప్రపత్తులు గల మన కవిరాజు గారే దానిని సుతరాము అంగీకరింపక త్రోసిరాజందురు అందుచే నిది - మూలానుసరణముగ రసవంతముగ నున్నదని చెప్పుటకు మాత్రము సంకోచింప నని ఉదాహరణములం గొన్నిటిని బేర్కొనిరి మఱియు నిట్లనిరి.

తే. వ్యాసునియు నన్నపాదుల భారతములు
పజ్జ నునుచుక శ్రీకృష్ణభారతంబు
చదువువారల కాయాయి స్థలములందు
రసము నింపదె ? కృష్ణభారతము సతము.

చ. నవలలు నాటకంబులును
నాటఁగ వ్రాసిన నింతవోయెడిన్
గవివర ! సంస్కృతాంధ్రములఁ
గన్గొని చేసిన కృష్ణభారతం
బవిరళ మాధురీమహిమ
నంటి గుణోత్తరమై రవీందులున్

భువిగల యంతకాలమును
బొల్చుచు నీకు యశంబు గూర్చుతన్.

శాంతిపర్వ సంపుటమునకు విద్వాన్ శ్రీ గరిమెళ్ళ సోమన్న పంతులు, ఎం ఏ ఎల్ టి గారు, పీఠిక వ్రాసిరి మూలానుసరణముగ వ్రాయుటచే, శాస్త్రి గారి కృతి తిక్కన కృతికన్న రెండు మూడింతలు పెరిగినది యజ్వకృతి యా రాశ్వాసములు, శాస్త్రి కృతి-తొమ్మిది యాశ్వాసములు, సోమయాజి తక్కిన పర్వములకన్న తన శాంతిపర్వములో మూల గ్రంథము నెక్కువగ బొందుపఱచెను. భీష్మ స్తవరాజము, షోడశమహారాజు చరిత్ర మున్నగునవి తిక్కన కవిచే సవిస్తరముగ బరివర్తితము లైనవి శాస్త్రి గారికి శ్రీనాథకవి కవితా గురువు. కవిత్రయమువారు పూజ్యులు శాస్త్రి గారి శైలి ధారాళమై విస్పష్టమై సరసమై మనోజ్ఞమై కవిత్రయ శైలివలె సర్వోత్కృష్టతను బొందియున్నది. శ్రీనాథకవి పోకడలు, పద్యముల నడకలు, మెండుగ శ్రీపాద రచనం గానవచ్చెడిని. సోమయాజి కందముల సౌష్టవమ్ము, శ్రీకృష్ణభారతి కందములందుఁ బ్రతిఫలించినది ఈ సమ గ్రాంధ్ర భారతముచే ఆంధ్ర భాషకుఁ బునరుజ్జీవనమును, నూతన పటిమయును గలుగును, అని వ్రాసి, వ్యాసప్రోక్తము, సోమయాజి రచన, శాస్త్రి కృతినుండి ఉదాహరణముగ నొక్కొటిని చేర్చాని "సోమయాజి రచనకు శాస్త్రి రచనకు, భేదము కానరాదు రెండును శ్రేష్ఠములే. రెండును ఆంధ్రభాషకు భూషణములే" ననిరి

కవిసార్వభౌము లిరువురును, కవితావ్యాసంగము జేయుచు వ్యవసాయమునకు కాలుబెట్టి - చేతులు గాల్చుకొనినవారే శ్రీనాథ కవిసార్వభౌముడు తా నొనర్చిన వ్యవసాయ ఋణముల దీర్చజాలక కష్టముల పాలాయెను.

సీ. కవిరాజుకంఠంబు గౌగిలించెనుకదా
పురవీధి నెదురెండ పొగడపంద

... ... ... ...

తే. కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము
బిలబిలాక్షులు తినిపోయె దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు రంకంబు లేదు సూర్లు

మన శ్రీపాద కవిసార్వభౌముడును వ్యవసాయము చేసి ఋణ
ములపాలై తమ కష్టముల నిట్లుగ్గడించుకొనియె.

సీ. కవిరాజు మేనెల్ల జివికించెనే కదా
అప్పులవారి వాక్యాయుధములు,

... ... ... ...

తే. పేటలంకల పాటు లీపాటు దెచ్చె
మాలపుర్వుల పాలయ్యె మటి పొగాకు
అప్పు ముప్పది వేల రూప్యమ్ము లింక
నెట్లు దీర్చెడు శ్రీపాద కృష్ణమూర్తి

ఇట్లు లెన్నో శ్రమ లనుభవించి శాస్త్రి గారు భారతము నాంధ్రీక
రించిరి. శ్రీకృష్ణ భారతమున గల శృంగార వీర కరుణ రౌద్రాది నవ
రసములు అలంకారములు స్వభావోక్తులు ఉత్ప్రేక్షలు శ్లేషలు యమ
కములు ప్రకృతి వర్ణనములు మున్నగునవి యన్నియు, శాస్త్రి గారి
ప్రజ్ఞావిశేషమును భాషా వైదుష్యమును, లోకజ్ఞతను చాటుచున్నవి.
అనేక దేశ్య దేశ్యమాండలిక శబ్దములను ప్రయోగించినారు శాస్త్రి

పాఠకుల సౌలభ్యమునకై ఆయా చోట్ల ఫుట్‌నోట్సు లిచ్చి వివరించి యున్నారు

కవిత్రయమువా రేకారణముననో అంగీకరింపక విడిచిన సనత్సు జాతీయము - భగవద్గీత - శ్వేతుని, భీష్ముని ఘోరయుద్ధము మున్నగు నవి యెన్నియో శ్రీకృష్ణ భారతమున మనము చూడగలము.

తిక్కన భారతములో కంకభట్టును సన్యాసిగ వర్ణించి యున్నారు

శ్లో కంకశ్చధర్మ ద్విజేఖ్యాతో లోహపృష్ఠ కృతాంతయోః

అని విశ్వము ఇట ధర్మద్విజు డని కాని యముడని కాని యర్థము. "ఆత్మావై పుత్రనామాసి" అనుటచే ధర్మరాజు ధర్మరాజే కావున కంకు డని చెప్పుకొనిన నసత్యదోషము లేదని గ్రహింప వలె నని శాస్త్రి గారు విపులార్థముతో చేర్కొనియున్నారు

సీ చీలమండలు మోయఁ జిఱుపింజలను దీరి
సీర్కొవి ధోవతి నిగ్గులీన
బొలుపు మీఱెడు దర్భముడి యుంగరముతోడఁ
గుశ పవిత్రము కేలఁ గొమరుమిగుల
నుదుట బాహుద్వయి నురంబునందును
భస్మ త్రిపుండ్రము పరిఢవిల్ల
వెండితీవలు నాఁగ విరియఁ బాఱిన జన్ని
దములు భుజంబుపై దళుకు లొత్త

తే. నుత్తరీయము చెంగుల నుత్తమముగ
నడుములఁ గట్టి కక్షమునందుఁ బెట్టి

నివుఱుగప్పిన నిప్పునా నెఱి దలిర్చి
నృపతి కొలువుండు చోటికి నేగుటయును

[శాస్త్రికృతి —

ఇట్టి వేషముతోనున్న ధర్మరాజు సన్యాసి కాడని చెప్పవలయునా?

శ్రీ శాస్త్రి గారు కవిబ్రహ్మ యనుటకు ఏర్చి కూర్చినవి కొన్నిటి నిందు జేర్చెదను-

హిమవన్నగము - గంగావతరణము

సీ. బహువిధ ధాతు ప్రభాభాసమా నోన్న
తోన్నత శృంగ సముత్థితంబు
గరుడ గంధర్వ కిన్నర సుర మిథున సే
విత శిలాతల జగ ద్విశ్రుతంబు
నవిరత శార్దూల హర్యక్షి రవపూరి
తానేక ఘనకంద రాంచితంబు
శుక శారికా కేకి పిక కోక ముఖ విహం
గమ సంకు లాగమ సముచితంబు

తే. హంస సారస కలిత పద్మాకరంబు
దివ్యవారిప్రపూర్ణ నదీవరంబు
సుందరోన్నత బహులతా మందిరంబు
వర్ణనీయంబగున్ హిమవన్నగంబు.

ఉ. రంగద భంగ తుంగకత
రంగ పరంపరఁ గప్పి దిక్కులన్
వింగి నెసంగఁ బొంగి వడి
నేలఁ బడెన్, బటుబుద్బుద శంభుఁ డ

గ్గంగ జటాకలాపమున
గారవ మూరఁగ దాల్చెనంత నా
పంగతి నేఁటి ధారుణికి
జాతె, సుపర్వులు సూచుచుండగన్.

సీ. సలలిత కలహంస కలనాద మంజీర
రవకలిత మహోన్నత వరగతియు
విమల సార తుషార విశద ఫేనోత్కర
పరమోత్తర దుకూల వసనధృతియు
పతత పరిస్ఫుట చ్ఛంపాప్రభాభ్రాజ
మాన మీనేక్షణ మహితరుచియు
జవనవేగోచ్ఛల ద్భంగ పరంప రా
విశ లసద్రవ వచో నిభృతరుచియుఁ

తే. గలిగి నురుగుల నవ్వుచు లలిఁగరంళ్ళ
నాడుచును సుళ్ళఁ బాడుచు వేడుక మెయి
సొగసు కత్తియ తెఱఁగున జూడ వొప్పి
డిగియె నేలకు వినువాక వెగడు లేక

(ఈ) సృష్టికర్త కూర్పు నేర్పు గనుము

ప. చందురుఁ గరగించి కందువేనలియందు
వేసి, నెమ్మోముల వెలయఁ జేసి
ంందంబులను నల్చి యందలి తెలి నవ్వు
లందిడి, గొంతులింపొంద నలిపి
కమ్మిమొగ్గల నేర్చి కమ్మతేనియ వాక్కు
లం బూన్చి, చన్గవ లింబుపఱచి

మించుల జతకూర్చి చంచలత్వము చూపు
లందుంచి, మేనుల నాచరించి

తే. బొమ్మ యవ్వీటి కొమ్మల నెమ్మిఁ జేసి
పురుగు గొఱికిన పట్టి సక్కర మొకండు
దేలునటు లచ్చిచేత, యాదృచ్ఛికంబ
యనెడు, రట్టును బోఁగొట్టుకొనియె నపుడు.

తే. జానుగుల శ్రీల్ పిఱుందుల దానడుమున
శానుదుటఁ గ్రార పొక్కిటిలోన బొట్టు
ఘ్రాణమున నొత్తు కేల దీక్షములు దోప
రమణిబుధులెంతు రక్షర బ్రహ్మ మనుచు.

సీ. కచకుచోరునితంబకమ్ములు గురువులు
లఘువులు తుందావ లగ్నములుగ
కాలుసేతులు నాస వ్రేళులు లఘురేఖ
లలఘు రేఖలు కన్బొమలు నుదురుగ
నగములు పాలిండ్లు నలఘువేనలి నఖ
రంబులు శ్రీ భగణంబులుగను
కన్ను లుత్పలమాలికలు గతి జంఘలు
మత్తేభ శాలినీ వృత్తములుగ

తే. ఆరు వేణియుఁ బడిము లొప్పారు నాగ
ఖడ్గ పద్మబంధములుగాఁ గలిత చంప
కాది మాలికా గర్భచిత్రాంగ మలర
సకియ గవులెంత్రు లక్షణశాస్త్ర మనుచు. ౪౧—

తుది యొక్క మాట. మూలానుసరణముగ రచియించిన శాస్త్రి గారి "శ్రీకృష్ణభారతమును" మన అకాడమీవారు పునర్ముద్రణము గావించి యెల్లరకు నందుబాటులో నుండునట్లు చేయుదురని వారికి మనవి జేయుచున్నాను.

ఈ మహోత్సవమున నా కీపాటి యవకాశ మొసగిన అకాడమీ అధిపతులకు, కార్యకర్తలకు నా హృదయపూర్వక ధన్యవాదము లర్పించుచున్నాను.

# శ్రీకృష్ణ రామాయణ భాగవతములు

—శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి

# శ్రీకృష్ణ రామాయణ భాగవతములు

—శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌ మేత్యాద్యనేకానర్ఘ బిరుదావళీ విరాజమానులును, శతాధిక గ్రంథకర్తలు నగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారి శతవార్షికోత్సవము జరుగుట యాంధ్రశారదాపూజ యనఁదగును. ఆ మహనీయుని యపార మగు మాతృభాషా సేవను గుర్తించి యాంధ్రరాష్ట్ర ప్రభుత్వము వారాయనను 'ఆస్థానకవిగా' స్వీకరించి తమ యౌదార్యమును వెల్లడించినట్లె, ఆంధ్ర సాహితీ అకాడమీవారు కీర్తిమూర్తులైన శ్రీ శాస్త్రులవారి పాండిత్య కవితావైభవమునకుఁ దగినట్లు వారి శతవార్షిక జయంతి నడుపఁబూను టదే యావదాంధ్రదేశ కృతజ్ఞతకు సూచకమై, శాస్త్రులవారి ఋణమును గొంతవఱకుఁ దీర్చుకొనఁ గల్గె ననవచ్చును.

శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి గారి ప్రజ్ఞ సర్వతోముఖముగాని సామా న్యము మాత్రము కాదు. వారు సంస్కృతాంధ్రములందు నిశిత మగు సాహిత్యమును, ఆ రెండు భాషలందును గవిత్వముచెప్పు శక్తిని గడించు కొని, పెక్కు సంస్థానములం దష్టశతావధానము లొనర్చి కీర్తిని నెల కొలుపుకొనుటయే కాదు, సుమారు నూటయేఁబది గ్రంథములను రచించి, యించుమించు లక్ష రూపాయల నార్జించి, యేమియుఁ 'దన' కని మిగుల్చుకొనకుండఁ ద్యాగ మొనర్చి, రమారమి నూరేండ్లు మానవ దేహముతో జీవించిన యమరజీవులు. "నాస్తితేషాం యశఃకాయే జరా మరణజం భయమ్" కదా!

పక్కన రమారమి నూటయేఁబది కృతులమాట యటుండనిచ్చి, ముగ్గురేసి, నలుగురేసి మహాకవు లొకటి రెండు శతాబ్దులలో పూరింపఁ

జాలకపోయిన భారత, భాగవత రామాయణముల నొక్కచేతి మీఁదుగా నాంధ్రమున మంగళమహాశ్రీవృత్తముదాక రచించుటయేకాదు, ముద్రించి సర్వ విద్వాఖ్యాప్త మొనర్చి, నలువైపులఁ గీర్తిలతలఁ బ్రాకించి యానందింపఁ గలిగిన పురుషాయుషము పూర్ణముగాఁ బొందిన యదృష్టవంతులు శాస్త్రి గారు

సరే! వీ రొక్క చేతిమీఁదుగా రచించిన రచింతురుగాక! నన్న యాది మహాకవుల భారత భాగవత రామాయణము లాంధ్రదేశమున సుప్రసిద్ధములైయుండ శాస్త్రి గారి కీచర్విత చర్వణ మేల యని యొం శంక యేయాంధ్రుని హృదయమునఁ బొడమదు? కాని నన్నయాదుల దృష్టి వేఱు శ్రీ శాస్త్రులవారి దృష్టి వేఱు కథాప్రధానములును ధర్మప్రధానములును బూర్వుల రచనలు, శాస్త్రులవారివో కథాప్రధానములు గాక యథామూలములుగా నవతరించినవి నన్నయాదుల రచనలు యథామూలములు గాకున్నను భాషయందును. భావములందును, రస విషయమునను దరువాతి కవుల కెల్లను ప్రామాణ్యము వహించు టలో నెట్టి న్యూనతయును లేదు కాని యీ శతాబ్దిలోని కవులకు మూలగ్రంథము సమగ్రముగ నాంధ్రమునఁ జూపు నుత్సాహ మధిక మగుటచే నిద్దఱు ముగ్గురు వాల్మీకి రామాయణము నాంధ్రదర్పణమున యథామూలము ప్రతిబింబింపఁ జేసి స్తుత్యులైరి భాగవతము వేదాంత ప్రతిపాదక స్తుతులతో నిబిడ మగుటచేఁ గాఁబోలును ఎవ్వరును స్పృశింపరైరి భారతమును నట్టిదగుటయేకాక సపాదలక్షగ్రంథము మన జీవితములోఁ బూర్తియొనర్పఁ జాల మని కాఁబోలును దాని జోలికిని నెవరును బోవరైరి అట్టి యీరెండు గ్రంథములలో "భారత భారతీ సముద్రముఁ గడవంగ నీఁదను" విడిచేతులతో శ్రీ శాస్త్రులుగా రడ్డుపడి విధాత్రున కైనను నేరఁబోలని యా గ్రంథమును బూరించి కృతార్థు లగుటయే కాదు. పనిలోఁ బని భాగవతమును గూడ మూలాను సారముగాఁ దెనిఁగించి బమ్మెర పోతన రచన లందలి యెక్కువ

చక్కవులను సరిసమాన మెచ్చిరి. ఈ రెండు గ్రంథములును శాస్త్రి గారి స్వాతంత్ర్యము లేనివే కాని రామాయణముమాత్ర మట్టిది కాదు భాస్కరాదులు భాషాంతరీకరణమున మూలమునకు బద్ధులు కానివారు అప్పయహితపూర్వు డగు గోపీనాథము వేంకటకవి వ్యాఖ్యాన విశేషము లతో మూలము ననువదించినవాడు ఇట్టి మక్కికిమక్కి రామాయణాను వాదకులు వావిలకొలనువారును. జనమంచివారును, ఇవియన్నియు పరిశీలించి శ్రీ శాస్త్రులవారు రామాయణ విషయమున నొక నూత్న మార్గము ద్రొక్కినారు సంస్కృతమునసే యిరువదితొమ్మిదికి పైగా రామాయణము లున్నవనియు, అవి గాక దేశభాషలలో బెక్కులు గల వనియు శ్రీకృష్ణరామాయణమున జెప్పి-

ఉ॥ అన్నిటిలోని చిత్రముల నన్నియు నొక్కటిగాగ జేర్చుచున్
విన్ననువొప్ప రామకథ వీనుల విందగునట్లు చేసి మా,
మన్నన వీవు పొందుము ' ........

అని మునీంద్ర సంఘము కోరగా సూతు డారీతి వచించి నట్లుండుటచేత శ్రీశాస్త్రి గారు నన్నిటిలోని చిత్రకథలను తమ రామాయణమున బెక్కు తావుల జేర్చి యొక నూతన పక్కిని ద్రొక్కి సహృదయుల సాదర గౌరవమునకు భాజనమైనారు

ఈ వ్యాస శీర్షికమున కొలుతటిది రామాయణము గావున నందు శ్రీ శాస్త్రిగా రొనర్చిన మార్పుల గూర్పులను గొన్నిటిని స్థాలీపులాక ముగా ముందు దెలిపి, పిదప భాగవత యథా మూలానువాద విశేషము లను గూర్చి మనవి చేసికొందును—

శ్రీ శాస్త్రిగారి రామాయణమున వాల్మీకి మాటలుగాని, అధ్యాత్మ రామాయణపు పక్కిగాని కనబడవు అట్లని మెచ్చుట కైన నున్న వందురా యవి ఘుణాక్షరములు మాత్రమే యనుకొనదగును కథ యందలి ప్రధానాంశములు పాత్రల పేర్లు దక్క నంతయు నూతనము

గానే కనఁబడును. శ్రీమద్రామాయణమున నెచ్చటను లేని వాల్మీకి చరిత్రము విపులముగా ముందే కానఁగును. దశరథుఁడు కౌసల్యను పెండ్లియాడఁ బోవునప్పుడు రావణుఁ డామెను బెట్టెలోఁ బెట్టి సముద్రమునఁ బాఱవేయించి నట్లొక చిత్ర సంఘటనము- దశరథుఁడు దేవదానవుల యుద్ధమున దేవతల పక్షమునఁ గైకతోఁ గూడ నేఁగి, యామెకు వరము లిచ్చుకథ, దశరథుఁడు వేఁటకెగి గజభ్రాంతిని మునిబాలుని జంపి శాపమొందిన కథ, శాంతా ఋష్యశృంగుల వృత్తము, ముందుగనే చెప్పంబడినవి. పుత్రకామేష్టియందు భార్యలకు దశరథుఁడు పాయసము పంచియిచ్చిన యనంతరము రావణ వృత్తాంత మారంభింపఁబడి, విశ్రవోదీర్ఘ తపస్సు, రావణ కుంభ కర్ణాదుల జనన కథ, రావణాదుల తపస్సు, వరము లొందుట, రావణుని విజృంభణము, వేదవతి కథ మున్నగు నుత్తరకాండమందలి కథలు బాలకాండముననే చెప్పఁబడినవి. ఇందలి రావణుఁడు జ్ఞాని. కావున శ్రీరాముని చేతిలో దనకు మృత్యువని తెలిసి దానికై యత్నించుచున్నట్లు చిత్రింపఁబడెను. రావణాదుల చరిత్ర లన్నియు ముందు, పిదప రామాదుల జననమును జెప్పఁబడెను.

ఇది మొదలు సుమతి చరిత్ర వంటి చిన్న చిన్న మార్పులును చేర్పులును నున్నను వాల్మీకమునఁ జెప్పఁబడిన కథలే యిందును జెప్పఁబడెను. అహల్య యే పాపము నెఱుఁగ దనియు, ఇంద్రుఁ డామెపైఁ జేయి మాత్రము వేసె ననియు, దాని కామె యాతనిని దూఱుచుండ గౌతముఁడు వచ్చి యిరువురను శపించె ననియు, నామె నిరపరాధ యని తెలిసి గౌతముఁడు పశ్చాత్తప్తుఁడై

......సదాపతివ్రతా

జనమని యెంచి కూర్మినను "జానరో, కానమి శాపమిత్తు నిం
కను మరలింప నా తరము గాదటుగావున నోర్చి నీ విటఁ,

వనమున నుండు - రాఘవుఁడు వచ్చి నినున్ గడతేర్చు నవ్వలన్ -
బాల 2 363

అని పలికినట్లును, శాప విముక్తయై నిందపాలైతి నని విలపింప రాముఁడు

ఆ......ఓ తల్లి ! నీ, వెఱుఁగనట్టి దోష మెఱుకలేక,
యెవ్వఁడెవ్విధంబునే నిన్నుఁ బలికినఁ,
బాపభాజి యగుచు బడలు వడును.

గీ పంచకన్యలలో నీవు ప్రథమగణ్య,
వగుచు దీపించెదవు నీదు నాహ్వయంబు,
దలఁచినంత మహాపాపములు నశించు,
ననుచు వరమిచ్చె రాముఁ డహల్య కపుడు బాల 3 371

అని పరమ పవిత్రగాఁ జెప్పినట్లును మార్చి యహల్యపాత్ర పోషింపఁ బడినది మిథిలాపురమున రాముఁడు ప్రవేశించినది మొదలు సీతా వివాహ పర్యంత మది యొక శృంగార రసమయ ప్రబంధముగాఁ జిత్రింపఁ బడినది

అహల్యా శాప మోక్షణానంతరము శతానందుఁడు రామునకు సీతా జన్మకథ చెప్పి, యామె సౌందర్యమును మూఁడుపద్యములలో నిట్లు వర్ణించి చెప్పును.

గీ జానుగుల 'శ్రీ'ల్, పిఱుందుల 'దా'-నడుమున
శా-నుదుటఁ గ్రార-పొక్కిటిలోన బొట్టు
ఘ్రాణమున నొత్తు-కేల దీర్ఘమును-దోఁప
రమణి బుధులెంతు రక్షరబ్రహ్మమగను వాల. 4. 74.

గీ. నడుము 'మాయ' 'వేదాంతము' నాభి-కుచ యు
గంబు శ్రీగిరి-కూర్మము వాల్గొనుఁడు

మోవి మధురాంకమని గాంచి పువ్వుఁబోఁడి
దైర్థికులు తలంచెదరు క్షేత్రచయ మనుచు 75

ఈ మీఁద నొక సీసమున సర్వాంగ సౌందర్యము చెప్పి "ఆమె కీవు తగుదు వామె నీకుఁ దగు" ఇత్యాదిగా రాముని మనసున బీజము నాటెను పిదప రామలక్ష్మణులకు విడియ నొక మేడ యీయఁగా రాముఁ డందుఁ బ్రవేశించి సీతను స్మరించుచు విరహ వేదన నొందును రామ వృత్తాంతము విని సీత విరహబాధ నొందును. సీతా వివాహమునకుఁ గారణము రాముని సొగసును తన చెలికత్తె యిట్లు వర్ణించి చెప్పుటయే యైనది

మ ఇంద్రనీలము తళ్కుబెళ్కుల నీనుచుండెడి మేనితో
సాంద్రవైభవ మెల్లవారికిఁ జాటుచుండెడి నొద్దికన్,
జంద్రునిం బురుడించు మోమున జాను మీఱుచు నెప్డుని
స్తంద్రుఁడై వచరించుఁ గోయిల వాక్ప్రథన్ దగఁబల్కుచున్

ఉ గమ గమలాడు చందనము కన్నను మిన్న యనంగ నొప్పు రా
కొమరుని మేని సోయగము కొన్నిదినంబులు వెల్గు యామినీ
రమణుని, మేను లేని రతిరాజును నెట్టులమెట్టు మాధవున్
గ్రమమున గెల్చి పొల్చుఁ ద్రిజగజ్జన సంస్తవనీయమై కడున్

అని ఇంకను నాలుగు పద్యములచే శౌర్య క్షమా సౌందర్య గాంభీర్యాదులు వర్ణింపఁబడినవి పిదప సీత యొక్కతయ కూర్చుండి రాముని దలంచి పరిపరి విధముల ధ్యానించుచు, "ధను వేతీరున నెత్తఁగలఁడో యే నెఱుఁగనయో" అనుకొనుచు, మనసిజతాప జ్వరమునఁ బరాకు, భ్రాంతిని గనుచు మదనావస్థల నొందిన దని యిట్లు చెప్పఁబడె

చ సరగున తేవి యాకసము సందిటఁ జేర్చెదు, మోవిపానకం
బరయఁగ మోముఁద్రిప్పెదుఁ, బ్రియంబున నేమియొ పల్కరించెదున్,
జుఱచుటఁ జూచెదున్, గినిసి సోలెదు, వ్రాలెదు, నవ్వెదుం గడున్
విరహము నొందెదున్ దెలివి నీఁగి నెలంత దురంతచింతమై.

అనియున్నాదావసను జెప్పి ముప్పది తొమ్మిది బంతుల వచనమున మన్మథుని దౌష్ట్యము, దానిచేఁ గలిగిన యామెపీడ, చెప్పఁబడి "వాచ్యము చేయరాదని యాలంకారిక నియమ మున్నను "చిత్తజ వికారంబు లగు స్తంభ ప్రళయ రోమాంచాది సాత్త్వికాష్ట చేష్టలకుం బాలుపడి" అని యంచతుసకొని పోవుసట్లు సొగసుగా వర్ణింపఁబడినది. పిదప సూర్యాస్తమయము, సీత యుప వనమునకేఁగు శృంగారవేషము, పార్వతీపూజ కరుసుట చక్కఁగఁ జెప్పఁబడినది పూజానంతరము గౌరీదేవిని నమస్కార పూర్వకముగా సీత ప్రార్థన మరయ రుక్మిణీదేవి గౌరిని జేసిన ప్రార్ధనము మనస్సునకుఁదట్టును.

ఉ పుట్టక మున్న నేనెవనిఁబొంద వినిర్మితి గల్గి యుందునో
యెట్టి మహోదయంబునరు నెవ్వ దలంచుచు నుందునో, ఘనుం
డట్టి మనోవిభుం డిటకు నాగతుఁడయ్యెను, వానిపొందు నా
కెట్టు ఘటిల్లఁ జేసెదవొ యే నిను వేఁడుచునుంటి దల్లిరో.

అని యీ రీతి మఱి రెండు పద్యములతో బ్రార్థించినది పోతనగారు శాస్త్రిగారికంటెఁ బూర్వుఁడగుటచే నాయనను శాస్త్రిగారనుకరించి రను కొందురుగాఁబోలును కాదు, తనకంటెఁ బూర్వపుది యగు సీతను రుక్మిణి యను కరించిన దనిపించునట్లెంత చమత్కృతి శాస్త్రిగారొనరించిరో రసజ్ఞు లూహింతురుగాక. మఱియు సీతారాములా పూఁదోఁటయందే పరస్పర దర్శనమొంది రాముని సీతయును, సీతను రాముఁడును బరిపరి విధముల శ్లాఘించు కొనుచు వేర్వేఱ తాపమొందు చుండఁగా-లక్ష్మణుఁడు రాముని యొద్దకుఁ గొనిపోవును

ఈ కల్పనము జయదేవకృత ప్రసన్నరాఘవ నాటకమునఁ గొంచెము భేదముతోఁ గలదు రామలక్ష్మణులు మిథిలకు వచ్చిన పిదప వినోదార్థ ముద్యానమున విహరించుచు ('కథమితశ్చండి కాయతనం'') ఏమి! ఇచట చండికాలయమున్నదే అని రాముఁడు దోసిలియొగ్గి "మాతః కృపాతరంగిణి! వికసన్నయ నామృతోర్మిశీకరిణి! తరుణ సిత కిరణచూడామణి రమణి! త్వాంనమస్యామి" అని ప్రార్థించి, యిటు చూచుచుండ సీత చెలికత్తెతో వచ్చుచున్నది ఆమెను జూచి రాముఁడు పలుతెఱఁగుల వర్ణించును అంతట సీతతో "(భర్తృదారికే ఇద మగ్రే చండికాయతనం'') రాజపుత్రీ! ఇదిగో చండికాలయము అనఁగా సీత సాంజలియై, "అయిదేవి! శశిమకుట దేహార్ధవాసిని! త్రిభువన సువాసిని! నమస్తే" అని పలుక-చెలికత్తె సీతను బరిహసించుచునే - దేవికి మ్రొక్కి, "కాంత మిందుమణిధామ కోమతే కోమలేందు మకుటాంగశాయిని, ఇందుచారు శుచిరేణ విందతా మింది సుందరముఖీ సఖీమమ-'' అని చక్కని భర్తను మాసఖికిఁ గూర్చు మని ప్రార్థించును. పిదప సీతారాములు పరస్పర సందర్శన మాత్రము విస్తరించి చెప్పబడును అట్లే యిందును పార్వతిని సేవింప సీత వచ్చుట, రాముని జూచుటయును జక్కఁగఁ గూర్పబడినది

మూలమునఁగాని మఱియెందును గాని లేకున్నను విశ్వామిత్రుని వెంట నరుగుచున్న రామలక్ష్మణులు గంగను దాఁటవలసి నట్లొక కల్పనముచేసి, గుహుఁడు నావదాఁటింప వచ్చి రాముని పాదములు కడిగెదనని ప్రార్థించు నొక చిత్రమగు సన్నివేశము కూర్పఁబడినది

లక్ష్మణుఁడును మునియు నావ నెక్కిరి రాముఁడు నెక్కఁబోవు చుండఁగా గుహుఁడు వలదని వారించి యిట్లు ప్రార్థించెనఁట

శా నీపాదంబుల నచ్చు మందెదియొ కానీ యుండఁబోల్ తాఁకెనే
నాపాటన్ బిడితాయి అప్ప యెదియే నబ్జాక్షియై పోవునం

చీ ప్రొద్దే తెలియంగవచ్చె నిది కొయ్యేయైన-స్త్రీయైనచో
నాపాట్లేమని చెప్పవచ్చెడి జగన్నాథా ! దయం జూడుమా.

క దేవర నీ పాదంబులు
పావన జలములను గడిగి పరిహృత శంకా
భావుఁడనై నినుఁగొని నా
నావన్ నిలుపుకొందు... బాల 4. 9, 10.

అని "క్షాళయామి తవ పాదపంకజం
నాథ ! దారుదృషదోః కిమంతరం ?
మానుషీకరణచూర్ణ మస్తితే
పాదయోరితి కథా ప్రతీయతే"

అను చాటు శ్లోకమును మనసున నిడుకొన్న యొక చక్కని సంఘటనము

ఈ రీతిగా నాద్యంతము చిత్ర విచిత్రములగు మార్పులలో నీ కావ్యము నూతన రూపమున నవతరించినది అవి అన్నియుఁ దెలుపఁబూనిన యెడ గ్రంథము విస్తరించు నను వెఱపున నా భారము పాఠకులకే విడిచిపెట్టి, సూక్ష్మముగాఁ గొన్ని విశేషములను సూచింతును

1 రావణుఁడు శ్రీరాముని చేతిలో మరణించుటకే సీతను హరించెను కాని యామెను గామించి కాదు అని యొక సిద్ధాంతము.

2 సీత గర్భవతియై యుండ నామెకు వాల్మీకియే తన రామాయణ మంతయుఁ గాలక్షేపార్థము వినిపింప గర్భస్థులగు కుశలవు లది విని నేర్చిరని యొక సరసమగు కల్పనము

3 ఆంజనేయుఁడు లంకలోఁ జొచ్చి, విభీషణుని యింటియందు సూక్ష్మరూపమున డాఁగియుండ విభీషణుఁడు తన భార్యకు

రామాయణము చదివి వినిపించుచు "నాంజనేయుఁడు లంకకు వచ్చి, సీతను జూచి, లంకను గాల్చి, వెడలుననియు, రాముఁడు రావణుని జంపుననియుఁ దెలుపు చుండెనఁట అదివిని యాంజ నేయుఁడాశ్చర్య మొందును ఈ కల్పనమున రామాయణ మంతకు మున్నె పుట్టెననియు, దాని యందున్నట్టే వరుసగా జరుగుచుండె ననియుఁ దెలియుటేకాదు విభీషణుని రామ భక్తియు సూచింపఁబడెను "ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి" అని కదా భవభూతిసూక్తి "

4 రామ పట్టాభిషేక కాలమున సీత యిచ్చిన హారము నాంజ నేయుఁడు త్రెంచి యొక్కొక్క రత్నమును బగులఁగొట్టి చూచి పాఱవేయు చున్నాఁడఁట అప్పుడు సుగ్రీవుఁ డదియేమి ? అని

యడుగ — వీనియందెందేని రామనామ మున్నదేమో యని చూచుచున్నా ననెనఁట

అపుడు... .....సుగ్రీవుఁడనియె నో యాంజనేయ
జాతిలో అప్పలోపల రామనామ
ముండునని యెంతె ? నీలోన నుండునోయి ?
అనుటయే "తడవుగా—

తన హృదయంబు గోరుల నుదారతఁజీఱి కనుండటంచుఁజూ
పిన నటనున్న యెల్లరును వేడుకఁజూచిరి సూర్యపుత్రుఁడున్
హనుమ శరీరభాగ మది యంతయు రామమయంబుగాఁ గనుం
గొని కడు విస్మయంపడుచుఁ గొల్చెను రామునిఁబోలె నాతనిన్
యుద్ధ 4. 211.

ఈ రీతిగా రామాయణస్థములగు నుత్తమ పాత్రముల నెల్లఁగళంక రహితములొనర్చి, బ్రహ్మానంద సబ్రహ్మచారి యగు రసానందమున

ముంచి యెత్తి 'వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షాద్రామాయణాత్మనా'' అని నట్లు వేదమువలెఁ బవిత్రముగా గ్రంథ మంతయుఁ దీర్చిదిద్ది, భవద్భవిష్యత్కాల జనులకుఁ దరణోపాయ ముపదేశించి, ఇహమున ననశ్వర మగు యశమును, పరమున శ్రీరామరూప పరబ్రహ్మమున నైక్యమును బొందిన - యాంధ్రలోకమునకుఁ బ్రాతఃస్మరణీయులైన- ''కృష్ణమూర్తి శాస్త్రి శ్రీపాదులను'' వినతి పూర్వకముగా మనస్సున ధ్యానించుచు-వారి తృతీయ కీర్తిమూర్తి యనఁదగు శ్రీకృష్ణభాగవతమును గూర్చియు నించుక ప్రసంగింతును

## శ్రీకృష్ణ భాగవతము

''భక్తిజ్ఞాన వైరాగ్యములకు నిధానమును నిదానమునగు భాగవతపురాణము నాంధ్రీకరింప సర్హుఁడు పరమ భాగవతోత్తముఁడైన బమ్మెర పోతన యొక్కఁడే రాముని మనసున నిల్పికొని చేత గంటము పట్టుకొనినంత-''నిమిత్త మాత్రంభవ సవ్యసాచిన్'' అనినట్లు, ''విలిఖించెడివాఁడును బలికించెడివాఁడును రామభద్రుఁడేయై పోతన కావ్యమును నిర్వహించినాఁడు గావున'' అని యా బాలగోపాల మాంధ్రుల యచంచల విశ్వాసము అట్టియెడఁ గృష్ణమూర్తిశాస్త్రిలవారు మరల నాంధ్రీకరింప నేలపూని రని యొక ప్రశ్న ఇది సామాన్యమగు ప్రశ్నముకాదు నిరుత్తరమేమో యని కూడ ననిపించును

శ్రీశాస్త్రిగారు తమ భాగవతారంభ భాగమున - గ్రంథరచనావశ్యకత-యను శీర్షకముతో నిట్లు పై ప్రశ్నమున కుత్తర మొసంగినారు.
వ...ఒక్క సమయంబున నా పరమ మిత్రులు కొందఱు నన్నుఁగాంచి.

చ ఇతరులు వ్రాసినట్టికృతు లీవు రచింపనివాఁడవయ్యు భా
రతమున మూలభిన్నములు వ్రాఁతలు పెక్కులు గానవచ్చుటన్

క్షితిజన సమ్మతంబుగను జేసితికా! సరివేసి వాని, స
న్వితమున రామచంద్రకృతి విన్నను వొప్పఁగఁజెప్పి తెన్నఁగన్

చ భువన పవిత్రముల్ కృతులు మూఁడవు నం దొగి రెండు తీరె భా
గవత మొకండు వ్రాయుటకుఁగాదని యెంచకు, మందులోపలన్
దవిలెడుఁ బెక్కుతీరులగు దారులు- వానిని సంస్కరించుటల్
తవునని మేము చెప్పుదుము తావక చిత్త మదెట్టు లుండునో

ఉ "పోతనవంటి సత్కవులు పుట్టరు-పుట్టిన నట్టిరీతిగా
వ్రాఁతలు వ్రాయువారరిది, భాగవతంబది ముద్దులొల్కు, నే
నీతఱి వ్రాయఁ బూనితినయేఁ బరిహాస మొనర్తు" రంచు లో
భీతునఁ బోకు నీ కవిత వేరి కవిత్వమునేని మించెడిన్

ఆ. ఇదియుఁగాక భరతపృథివికి మణులైన
మూఁడు కృతులు చేసి పోడిమిఁగను
నట్టివాఁడ వగుదు వదియు రచింపుము
తెలియ నీకు నాల్గు నెలల పనియ" కృష్ణభాగ 1 సం 12-15-

అని ప్రబోధింప శ్రీశాస్త్రిగారు కడంగి, వారనినట్లు నాల్గు నెలలలోనే యనువదించి సమాధానము చెప్పి, గ్రంథమును జూచుకొండనినట్లు వెంటనే ముద్రించి లోకుల కందిచ్చినారు

"మూల భిన్నములు వ్రాఁతలు పెక్కులు కానవచ్చుటచే భారతము మూలానుసార మనువదించిన మాటవాస్తవమే-అన్వితమున రామచంద్రకృతి (రామాయణ మన్నమాట) విన్నను వొప్పఁగఁ జెప్పితి" వను దానిలో-రామాయణము విన్న వొప్పఁగఁ జెప్పుటయే ముఖ్యాశయము కాని మూలానుకృతము కాదని మాత్రము గ్రహింపఁదగును భారత భాగవతములు మూలానుకృతము కాక పోయిన చత్త్రిన్యాయ

ముప సట్లు చెప్పఁబడినది ఆ విషయ మింతకు మున్ను వ్రాసియే యుంటిని

భాగవతమునఁ బోతనామాత్యుఁడు భక్తిపారవశ్యమున మూలము వంటె భగవన్నుతుల పట్లఁ బెంచినాఁడనునది యంద రెఱింగిన విషయమే మూలమున నున్న దున్నట్లు తెలియఁగోరు వారికిఁ బోతన కావ్యముకంటె శ్రీకృష్ణ భాగవతము సహాయకారియగు చున్నది శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారు మూలానుసార మెట్లనువదించిరో యొకటి రెండు ఘట్టములు చూపెదను వానిని బట్టి తక్కినపట్ల సహృదయులు గ్రహింపఁగల రను తలంపుతో ముందుగా నందఱకుఁ దెలిసిన భీష్మ స్తవ మును పోతన గ్రంథముతో సహా పొందు పఱుతును

శ్లో॥ త్రిభువన కమనం తమాలవర్ణం రవికర గౌరవరాంబరం దధానె
వపు రలక కులావృతాననాబ్జే విజయసఖే రతి రస్తు మే నవద్యా''-

అను మూలమునకు శ్రీకృష్ణ భాగవతమున

ఉ॥ ఎల్లని మేనికాంతులు ఘనాఘన సంపద సొంపు డింప, సం
పల్లలి తోత్తరీయము సువర్ణ సువర్ణము మేలమాడ, న
ల్లల్లనఁ గుంతలంబులు ముఖాబ్జమునం దళులట్లు ద్రేల, వ్రే
పల్లె విహారమున్ సలుపు బాలునిఁ గృష్ణుని నేఁ దలంచెదన్''

అనియు

పోతనార్యుని భాగవతమున-

మ॥ త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప వ
విజయుం జేరెడు వన్నెకాఁడు మదినావేశించు నెల్లప్పుడున్.

అనియుఁ గలవు

మూలమందలి "త్రిభువన కమనం తమాలవర్ణం' అనుదళము నకుఁ బోతనార్యుఁడు - త్రిజగన్మోహన నీలకాంతి దనువు" అనెను శాస్త్రిగారు "త్రిభువన కమనం" అనునర్థము వాచ్యముగాఁ జెప్పక 'ఘనా ఘన సంపదసొంపు' జగన్మోహనముగా నుండునని ధ్వనింపఁ జేసిరి "తమాలనీలం" అను దానిలోని "తమాలమును" ఉభయులును విడిచినారు పోఁతన వట్టి నీలకాంతియే యనెను శాస్త్రిగారు నల్లనిమేని కాంతులని యూరకుండక త్రిభువన కమనమగు 'ఘనా ఘన సంపద సొంపు' అను పదముచే "తమాల" శబ్దమును స్ఫురింపఁ జేసినారు "రవికర గౌరవరాంబరం" అను దళమునకుఁ బోతన "ప్రాభాత నీరజ బంధుప్రభమైన చేలము" అనెను మూలమున "రవికర" యని మాత్రమే యుండ-పోతన యారవి ప్రాభాతరవి యనెను. ప్రాతస్సూర్యుని ప్రభ మిక్కిలి ఎఱ్ఱగా నుండును కృష్ణుఁడు పీతాంబరుఁడు కాని రక్తాంబరుఁడు కాఁడనియు, మూలమున "గౌర" పదమునకు "పీతో గౌరో హరిద్రాభః" అను నిఘంటువుచేత పసుపు పచ్చని రంగనియు, గమనించి శాస్త్రిగారు "సువర్ణ సువర్ణము (బంగారు రంగు గలది)" అని యనువదించినారు సూర్యకిరణములు ప్రాతఃకాలమున నెఱ్ఱగ నున్నను క్రమముగా పసుపు వన్నె గలవగును కావున రవికరములు గౌరములని మూలమున నున్నదానిని గ్రహించి శాస్త్రిగా రీసందేహము నకు తావులేకుండ సువర్ణ వర్ణ మనినారు

"అలక కులావృతాననాబ్జే" అను దానిని పోతన "నీలాలకవ్రజ సంయుక్తముఖారవిందము" అని యా యలకలు నల్లని యలకలుగాఁ జెప్పెను శాస్త్రిగారో "ఆననాబ్జే" అను దానిలోని "అబ్జ" పదము చరితార్థమగు నట్లును మూలమునకు మెఱుఁగు పెట్టినట్లును "కుంతలంబులు ముఖాబ్జమునం దళులట్లు వ్రేల" అని ఆ యలకలు తుమ్మెదలవలె నున్నవని వివరించిరి

"విజయసఖే" అనుదానికిఁ బోతన "మా విజయుం జేరెడు వన్నె కాఁడు" అని యనువదింప, శాస్త్రిగారు "వ్రేపల్లె విహారముఁ సలుపు బాలునిఁ గృష్ణుని" అని చెప్పుటకు వా రనువదించిన ప్రతిలో నట్టి పార మున్నదేమో యని సందేహము కలుగు చున్నది.

భీష్ముఁడు చేసిన స్తుతి యంతయు రణరంగమునఁ దన కెదుట నర్జునసారథి యగు కృష్ణరూపమునే చెప్పుచున్నదేమో యని పరిశీలింప-
"లలిత గతివిలాస వల్గుహాస, ప్రణయనిరీక్షణ కల్పితోరుమానాః
కృతమను కృతవర్త్య ఉన్మదాంధాః ప్రకృతి మగన్ కిలయస్యగోపవధ్వః"

అనుమూలమునను-అనువాదములందును శ్రీకృష్ణుని శృంగార చర్యలు గూడ వర్ణింపఁబడుటచే శాస్త్రిగారు తొలుత బాలకృష్ణుని వర్ణించి కృష్ణుని బాల్యము మొదలు పరతత్త్వముగా భావించు పర్యంతము చెప్పఁదలఁచి నట్లు కనఁబడుచున్నది- మఱియు,

"స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞా మృత మధికర్తుమవప్లుతో రథస్థః
ధృతరథ చరణోభ్యయా చ్చలద్గు ర్హరి రివహంతు మిభం గతోత్తరీయః"
అను శ్లోకమును బోతనగారు బహురమ్యముగా ననువదించినారు.

"అవప్లుతో రథస్థః" అనుదానిని-కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి గగన భాగంబెల్లఁ గప్పికొనఁగ" అని యా యవప్లుతిని కనులకుఁ గట్టి నట్లు పెంచి చెప్పెను

"చలద్గుః" అనగా చలించుచున్న భూమిగలవాఁడు. అను నట్టి భావమును "ఉఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతి గదల" అని భూమి యేల చలించెనో చక్కగా సహేతుకముగా వివరించెను మఱియు "ధృతరథ చరణః, గతోత్తరీయః" అను రెండు దళములను గొని ఉత్తరీయము జాఱుటకు-చక్రము ధరించి వచ్చు

నప్పటి గమన వేగము హేతువగునట్లు "చక్రంబు చేపట్టి చఱచెంచు రయమునఁబైనున్న పచ్చని పటము జాఱ" అని మనోహరముగా నుడివెను "స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞామృత మధిక ర్తు మవప్లుతో రథస్థః" తాను చక్రము పట్టనని (కృష్ణుఁడు) చేసినప్రతిజ్ఞను విడిచి- "కృష్ణునిచే చక్రము పట్టింతును" అనిన నాప్రతిజ్ఞను సత్య మొనర్పు టకై రథమునుండి భూమికి నుఱికినవాఁ"డను వాక్యార్థమును వివరింప మానినను నట్టి గంభీరార్థము స్ఫురించుట కైనను వీలుగాకుండ- "నమ్మితి నాలావు నగుఁబాటుసేయకు మన్నింపు మని క్రీడి మఱలఁ దిగువ" అని యర్జునుఁడు తనశౌర్యము నవ్వుల పాలగునని వెనుకకు మరలు నట్లు లాగుచుండఁగా" అని తెనుఁగు సేఁతలో-శ్రీకృష్ణుని భక్త పరాధీనతకు నికషోపల మనఁదగిన-తన ప్రతిజ్ఞపోయినను భక్తుడగు భీష్ముని ప్రతిజ్ఞనిలిపి నాఁడను భావము రాలేదు-

కాని శాస్త్రిగారు మాత్ర మారహస్యము నెఱిఁగిన వారగుటచే ' చక్రంబు చేఁబూన సమరంబునం''డను తన నియమంబెల్ల వెనుకఁద్రోచి "చక్రంబు పట్టింతు శౌరిచే" నను నాదు బాసచెల్లించెడు వాఁడ యగుచు అని నిస్సందేముగాఁ దెలియ వివరణ రూపమున ననువదించినారు

ఈ రీతిగా అనువదించుటలోఁ బెక్కు తావులందు శ్రీశాస్త్రిగా రెంతయో జాగరూకత వహించి మూలమును యథాతథముగా నాంధ్ర ముకురమునఁ బ్రతిబింబింపఁ జేసిరి-

మచ్చునకుఁ బద్యముల యనువాదరీతి స్థాలీపులాకముగాఁ జెప్పితిని ఇఁకకథా కథనమునఁ బోతనను, శాస్త్రిగారిని గొంచెము పరిశీ లింతము. సామాన్యముగా గజేంద్రమోక్షణ కథ తెలియనివారు తెలుఁగు భూమి నేనాఁటను గూడ నుండ రనవచ్చును. దానిని గూర్చి రెండు మాటలు గజేంద్రుని రక్షించినవాఁడు వైకుంఠవాసి యగు నాదివిష్ణువు కాదు "హరిపుట్టె హరిమేధునకు హరిణీయందు, గ్రాహబద్ధుఁ డయిన

గజరాజు విడిపించి ప్రాణభయము వలనఁ బాపికాచె" అని యుండుటచే రామకృష్ణాద్యవతారముల వలె హరిమేధునకు హరిణియను స్త్రీయందుఁ బుట్టిన హరి యని ముందుగాఁ జెప్పియు పోతన- "అలవైకుంఠ పురంబులో" అని యుపక్రమించి వైకుంఠమునుండి గరుత్మంతునైన నధిష్ఠింపక పరుగు పరుగున వచ్చెననియు, ఆతని వెనుక వైకుంఠ పురంబునం గలుగు వా రాబాల గోపాలము వచ్చిరనియు మూలములో లేని విషయమును బెంచిపెద్దగాఁ జేసినాఁడు ఆఘట్టమున శాస్త్రిగారు మూ లానుసారముగా-

వ ఇట్లు గజేంద్రుండనేక విధంబులఁ బ్రస్తురించి మొఱ్ఱవెట్టుటలు వినియు బ్రహ్మాదులు.........ఊరకున్నంత జగన్నివాసుండగు శ్రీహరి

మ. విని యొండొక్కఁడు వక్కఁ డెవ్వరికి, దోర్వీర్యంబునన్ జక్రముం
గొని ఛందోమయుఁడైన తార్క్ష్యునిపయిం గూర్చుండి తద్దేశముం
జని దంతీంద్రుని డాయవచ్చి-..........................
అని యనువదించి పోతన్నగారు పెంచిన శ్రీమహావిష్ణుని భూలోకావతరణ సమయమున లక్ష్మీదేవి సౌందర్య వర్ణనము శృంగార చేష్టలు మున్నగునవి పరిహరించి భక్తిరసమునకు బాధకలుగకుండఁ జక్కఁగాఁ బోషించినారు-
సిరికింజెప్పఁడు శంఖ చక్ర యుగమున్ జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిన్ బన్నింపఁడు...... ..

ఇత్యాదిగా నున్నపద్యమున చక్రము చేఁబూనక గరుత్మంతు నెక్కక, కాలినడకతో వచ్చినట్లుండుట గాంచి 'ఛందోమయేన గరుడేన సముహ్యమాన శ్చక్రాయుధో భ్యగమదాశుయతో గజేంద్రః' అను మూలమునకు విరుద్ధముగా నున్న దని పోతనను బ్రాజ్ఞు లెవ్వరో యాక్షేపింప-నది

శ్రీనాధుని కంటఁ గట్టి పోతన కల్పనమే సహజ మనిపింప నొక చక్కటి పురాణము పుట్టింపవలసివచ్చినది

గోపికా వస్త్రాపహరణ ఘట్టమున:-

"హేమంతే ప్రథమే మాసి
నంద వ్రజ కుమారికాః
చేరుర్హవిష్యం భుంజానా
మాసం కాత్యాయనీ వ్రతం"

అని కాత్యాయనీ వ్రత మాచరించుచున్నవారు నందుని మంద యందలి గోపకుమారికలు అని మూలమున నున్నది కుమారిక లనఁగా పసితనము వీడి కౌమారమునకున్న బాలికలు కృష్ణ సంబోధనమున అబలాః అనియు, కవి వాక్కులుగా గోప్యః, సుమధ్యమాః, దారికాః అనియు మూలమున గానఁ బడఁగా- పోతన యా బాలికలు తరుణు లనుకొని "రమణుల్ ప్రొద్దుట మేలుకాంచి సఖులన్ రండంచు నాత్మీయ నామములన్ జీరి కుచద్వయీభరమునన్ మధ్యంబులల్లాడఁగాఁ బ్రమదోద్దామ గజేంద్రయాన లగుచున్" అని యా బాలికలను యువతులుగా వర్ణించెను మరియు కరాభ్యాం యోనిమాచ్ఛాద్య ప్రోత్తేరుస్తీర మంగనాః' అను దానిని 'చంచత్కోమల పల్లవ కాంచన నవరత్న ఘటిత కంకణ రుచిరోదంచిత కరసంఛాదిత పంచాయుధ గేహలగుచుఁ బడఁతులు వరుసన్'' అని యెంతయో పెద్దచేసి వర్ణించెను అట్లు వర్ణించుటయేకాక-"వనిప్రౌఢ లైన సుందరుల ముందట నిడుకొని నెమ్మదిగాఁ గృష్ణు నెదుట నిలిచిరి'' అని యా బాలికలలోఁ గొందఱు ప్రౌఢలు గూడ నుండినట్లు సూచించెను మఱియు గృష్ణుఁ డా కుమారీవర్గమును గాంచి "శృంగారవతులార సిగ్గేల మీ" కని పరిపరివిధముల పరిహాసములాడె నని చెప్పిన పట్టున ప్రౌఢ లనియు శృంగారవతు లనియు మూలమున లేని శృంగారము కల్పించినాఁడు

ఈ పట్టున శాస్త్రి గారి యనువాదమును బరిశీలింతము - నంద గోకుల కుమారీరత్నములు ఆ మగువలు, వ్రజకన్యామణులు, వనితలు, కన్నియలు, దారికలు, సారీమణులు అని యా బాలికలను జెప్పిరి కాని యువతులను స్ఫూర్తి కలుగున ట్లెందును జెప్పరేదు మూలముననున్న "దారికా" శబ్దము ప్రయోగించి యౌచిత్యము చక్కఁగా పోషించిరి కాని ఆహూతాః" అను విశేషణమును విడుచుట లోపము కాకపోదు మఱియు "కరాభ్యాం యోనిమాచ్ఛాద్య" యని మూలమునందుండక 'ఆత్మభాగే హామ' అనియు, అది యొక వేలిలోను "స్తనయుగ్మంబు మఱొక్క హస్తమును బొందఁగ నిల్పి" అనియుఁ బోతన్న గారి సీ విషయమున ననుకరించిరి

అట్లు నది నుండి తీసుకొని వచ్చి నిలిచియున్న యా బాలిక లను "వ్రతఫలంబు మీకు వలసినఁ జక్కఁగఁ నింతులెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి, చేరి పుచ్చుకొనుఁడు" అని కృష్ణుఁ డన నాబాలికలు వ్రత భంగం బంచు శంకించి ఫాలతటన్యస్త కరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి రట్లందఱున్- అని పోతన్నగారు ధర్మనిరూపణము వదలి శృంగార రస ప్రసంగముతోఁ బూర్తి చేసిరి.

మూలమందు -

"యూయం వివస్త్రా యదపో ధృతవ్రతా
వ్యగాహతైత త్తదు దేవ హేళనం
బద్ధ్వాంజలిం మూర్ధ్న్యపనుత్త యేహ్యసః
కృత్వానమోవాక్ వసనం ప్రగృహ్యతాం"

మీరు వస్త్రములు విడిచి ఉదకమున దిగి స్నానము చేసి వ్రత మొనర్చుట మీ యిష్టదైవమున కపరాధ మొనర్చుట కావున నాపాపము పోవుటకై శిరస్సున దోసిలి పట్టి నమస్కరించి మీ బట్టలను మీరు

పుచ్చుకొనుఁడు. అని ధర్మహానికి ప్రాయశ్చిత్తముగా సమస్కారము విధించెగాని, వారిని కృష్ణుఁడు పరాభవించుటకుఁ గాని, వారి మర్మస్థానములను జూడవలెనని కాని, య ట్లనలేదు

"వివసనలై జలంబులఁ బ్రవేశ మొనర్చి రఁటన్న శాస్త్రముల్
'తవు' నన విద్ది తప్పగును, దానిఁ దొలంగఁగఁ జేసి కొంటకో
నవలలు। మీర లౌదలల నాఁగ నిల్పుచు హస్తయుగ్మమున్
ధవుఁడగు నాకు మ్రొక్కి వసనంబులు గైకొనిపోవు టొప్పగున్

అని శాస్త్రిగారు యధామూలము తెనిఁగించి ధర్మముగాఁ దెలిపిరి. ధర్మయుక్త మగు కృష్ణవాక్యము విని వ్రత భంగమునకు వెఱచి "ఏకేన పాణినానేము రేకేనాచ్ఛాద్య చాంగనాః" ఒక చేతితో కప్పుకొని యొక చేతితో నమస్కరించిరి అను మూలమును

"ధర్మయుక్తమైన వాని వాక్యమున్, విని యొకంట నాఁడు గుఱిని వేడ్కఁగప్పి యొంట మ్రొక్కను బొనర్చిరి...అని మూలమునకనుకూలముగా వ్రాయుచు శాస్త్రిగారు మూలమునందలి యాచ్ఛాదనము మాత్రము తొలఁగించివైచి బయలొనర్చిరి

ఒక్క చేతితో మ్రొక్కినందులకుఁ గృష్ణుఁడు

ఏకేన పాణినాయోవై ప్రణమేద్దేవ మచ్యుతం
తస్యదండః కరచ్ఛేద ఇది ధర్మ విదోవిదుః,
తస్మాదుభాభ్యాం పాణిభ్యాం ప్రణమత్వామి నరః
తథాచ యూయంకురుత........."

అను మూలమునకు:-

ఒక్కచేతను నమస్కరింపరాదు దైవతముల నెప్పుడున్.
ఒకదైన చేత మ్రొక్కిన,

సకలంబుని వేయి దునుమ శాస్త్రము చెప్పన్,
దికమంలాదక మీ రెం
మి కరంబుల నన్ను మ్రొక్కెదు మువంపడుచున్"

అని యనుకూలముగా శాస్త్రిగా రనువదించినారు. తరువాత "దిగంబరులై స్నానముచేయుట, వ్రతభంగ మని ఆ బాలికలు దెలిసికొని రెండు చేతు లెత్తి మ్రొక్కి, వస్త్రములను దీసికొని, ధరించి, కృష్ణునియెడ ద్వేషభావము లేక యెంతయు ప్రేమను వహించిరి పోతన భాగవతమున సంబంధు మూలమున కించిత్ భేదము లగుపడుటచేతనే శాస్త్రిలవారి మిత్రులు యధామూలము రచింపఁ ప్రేరించుటయు శాస్త్రిలవా రందు లకుఁ బూనుకొనుటయు, చరితార్థు లగుటయుఁ గలిగినది ఇట్టియనువాద విశేషము లన్నియు వివరింపబూనినది యొక పెద్ద గ్రంథము కావలసి వచ్చును దిఙ్మాత్రముగాఁ జేసిన యీ బాధక ననుసరించి సహృదయు లగు ప్రాజ్ఞులు పరిశీలించుకొందురు గాక

ఈ విమర్శము వలన "పోతనకు" లోపములున్న వని భ్రమింప రాదు ఆ మహాకవియుని దృష్టి వేఱు, శాస్త్రిగారి దృష్టి వేఱు మూల మందలి కథను సూచనగా శబ్దార్థ రామణీయకమును, రసమును గుమ్మరించినవాఁడు పోతన మూలమందలి యర్థమంతయుఁ జెక్కుచెదర కుండ ననువాద మొనర్ప దీక్షఁ బూనినవారు శాస్త్రిలవారు అంత్యాను ప్రాసములతో ధారాళ మగు శయ్యతో, మందార మకరంద మాధుర్య ముతోఁ గవిత్వము చెప్పుటలో పోతనకుఁ పోతనయే సాటి మూలాను సారముగా ననువదించినను, అనువాదము వలె నుండక తెనుఁగునఁ దొలుతనే పుట్టిన దీకవిత్వ మనిన ట్లతుకులు గనఁబడకుండ రచన సాగించుటలో శాస్త్రిగారికి శాస్త్రిగారే సాటి ప్రకృతము శతవార్షికోత్సవము శాస్త్రిగారిది కావున వారి కవితయందలి గుణముల నుగ్గడించుట ముఖ్యము కాన మూలానుసరణమునఁ బోతన కంటె శాస్త్రిలవారిని

ముందునకు దీసికొని వానైనది, యని సహృదయులు గుర్తింతురు గాక.

భారత భాగవత రామాయణ కర్తృత్వముచేఁ బ్రదిలోచనులై, శతాధిక గ్రంథముల చేత "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య" సర్వత్ర యక్షర రూపమునఁ గీర్తి శరీరముతో వెలుఁగొందు శ్రీ కృష్ణమూర్తి శాస్త్రిలవారిని స్మరించుకొనుచు- 'జయింతితే సుకృతినో' యని నమస్కరించుచు- నిట్టి యవకాశము కల్పించిన సాహిత్య అకాడమీవారికి ధన్యవాదము లర్పించుచు సెలవు గైకొనుచున్నాను.

---

# శ్రీపాదవారి రూపకములు

—డా. పోణంగి శ్రీరామ అప్పారావు.

"సృష్టికిం బ్రతిసృష్టినిఁ జేసినట్టి
కౌశికుని గోత్రమందు వేంకటమనీషి
కాత్మజుండయి పుట్టినయట్టి వాఁడు
కృష్ణకవిరాజు దలఁపఁ దత్కృతికిఁగర్త."

అని బొబ్బిలి యుద్ధ నాటక ప్రస్తావనలో సూత్రధారి ముఖముగా తన సాహిత్య సృష్టినిగూర్చి సూచన చేసియున్నారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు పలువురు మహాకవులు వేయి సంవత్సరముల పాటు కృషిచేసి, సృష్టి చేసినయంత తెలుగు సాహిత్యమును ఒక్క చేతిమీదుగా సృష్టి చేసిన మహామహులు కృష్ణమూర్తిశాస్త్రి గారు వీరు కలభాషిణి, వజ్రాయుధము, వందేమాతరము, గౌతమి (దినపత్రిక) మున్నగు పత్రికలను నడిపిన ధీరులు

ఇట్టి కృష్ణమూర్తి శాస్త్రిగారు ఒక రేడియో ఉపన్యాసములో తన స్వభావమును గూర్చి యిట్లు పేర్కొనిరి:

" నాకు జాతి మత విద్వేషము లేదు సర్వమత సమ్మతుఁడ నని చెప్పఁగలను పూర్వాచార పరాయణుఁడ నైనను గాలమును బట్టి సమయోచితముగఁ బ్రవర్తింతును స్త్రీ విద్య నా కిష్టమే కాని బి యేలు, యం యేలు ప్యాసు చేసి యుద్యోగములు చేయుట సమ్మతము కాదు సాధ్య మయినంతవఱకు సత్యమును మీఱి ప్రవర్తింపను. నే నిదివఱకు నితరులకు భంగకర మగు నెట్టి యసత్యము నాడలే దని చెప్పఁగలుఁగుచున్నాను. జ్ఞప్తిలో నే నెవరి సొమ్మును హరింపలేదు ఒరులకు అడిగినవి లేదన కీయవలె నని యభిప్రాయము కలదు గాని యది పూర్ణముగా

దైవము సాగనిచ్చుటలేదు నాకుఁ గోపము వచ్చును, రావలసిన పట్టునే. ఆవలివాండ్రు క్షమింపు మనినంతనే ఆ కోప మంతలోనే పోవును నాకు లౌకికోక్తులు, కపటోక్తులు పనికిరావు ఉన్నదున్నట్లు మాటాడుటయే సరి యని నా మతము దీనంజేసి నన్ను పెడ్డివాఁ డనియు నందురు నే నొకొక్కప్పుడు సాహసముగాఁ బ్రవర్తింతును అది ప్రాణాపాయ మగు నని జంకను నాకు మహామారియన్నను భీతిలేదు నే నెప్పుడును వ్యర్థముగాఁ గాలక్షేపముం జేయను ఏవో వ్రాయుటయో, చదువుటయో చేయుచుందును.''

ఇంక ప్రస్తుతాంశము శ్రీపాదవారి రూపకములు శాస్త్రి గారు తన స్వభావముగా పేర్కొన్న ఆయా అంశములు వారి రూపక రచనా నిర్మాణములలో ప్రస్ఫుటము లగుచుండుట మనము పరిశీలింపవచ్చును శాస్త్రిగారు మొత్తము 32 నాటకములను, 6 ప్రహసనములను రచించిరి ఇందు-

ముద్రిత నాటకములు:— 1 కలభాషిణి (1902), 2 వేణీసంహారము (1905), 3 బొబ్బిలియుద్ధము (1908). 4 రాజభక్తి నాటకము (1911), 5 మోహినీ మనోహరము (12th Night) (1914); 6 వీరసేన విజయము (Pericles) (1911), 7 తిలక మహారాజ నాటకము (1921), 8 గాంధీ విజయధ్వజ నాటకము (1921), 9 భోజరాజ విజయము (1921), 10 శ్రీనాథ కవిరాజీయము (1927), 11 మహాభారత యుద్ధము (1926), 12 చంద్రికా పరిణయము (1931), 13 వధూవిజయ నాటకము, 14 మాయావతీ నాటకము, 15 సావిత్రి నాటకము, 16 వీరరుద్ర నాటకము, 17 శ్రీరామ కుమారవిజయము; 18. విక్రమదేవ విజయము, 19 యయాతి నాటకము, 20 యాజ్ఞవల్క్య నాటకము; 21 యజ్ఞఫలము (1955)

అముద్రిత నాటకములు:— 1 స్వరాజ్యోదయ నాటకము (వ్రాతప్రతి పోయినదట); 2 భారతసార నాటకము, 3 కమలినీ పరిణయ నాటక

కము ; 4 సుందోపసుంద నాటకము , 5 అహల్యా నాటకము , 6 వ్యాసావతార నాటకము , 7 సుకన్యా నాటకము , 8. ఆంధ్రజ్యోతి, 9 శకుంతలా నాటకము , 10 ఉత్తరరామ చరిత నాటకము , 11. పంచవర్ష ప్రణాళికా నాటకము

ప్రహసనములు — 1 లౌడారి బుచ్చిగాడు (1911) , 2 డాలోరి బుచ్చి గాడు (1911) ; 3 ధాష్టిక పంతులు (1931) , 4. కుక్కకాటు వైద్యము , 5 కాళిదాసు సహస్ర నామానువాదము , 6 పాదపూజ

ఇప్పుడు చదివిన శీర్షికలను బట్టి శాస్త్రి గారు వ్రాసిన కథల యంచలి వైవిధ్యము తేటతెల్లము కాగలదు - పౌరాణిక - ఐతిహాసిక చారిత్రక -కల్పిత - వర్తమాన రాజకీయాదు లిందలి ఇతివృత్తములు ఇందు సంస్కృతానువాదములేకాక ఆంగ్ల నాటకానుసరణములు కూడ కలవు, ప్రహసనములే కాక విషాదాంతములును కలవు జార్జి చక్రవర్తి పట్టాభిషేకమును పురస్కరించుకొని రచించిన రాజభక్తినాటకమే కాక నేటి పంచవర్ష ప్రణాళికలను పురస్కరించుకొని వ్రాసిన ప్రహసనాటకము మును కలదు కాలాంగిన అరగంట సమయము ఇందులో ఏదేని ఒక్క నాటకమును గూర్చి అయినను సాంగముగా పరిశీలించుటకు చాలదు. ఇంతేక ముప్పదిరెండు నాటకములను, ఆరు ప్రహసనములను గూర్చి ప్రసంగించుట అశక్యము కావున ఒక కావ్య నాటకీకరణమును (కల భాషిణి), ఒక చారిత్ర నాటకమును (బొబ్బిలి యుద్ధము), రెండు వర్త మాన రాజకీయ నాటకములను (తిలక మహారాజ-గాంధీవిజయ ధ్వజ నాటకములు), ఒక ఆంగ్ల నాటకానుసరణమును (వీరసేనుడు), ఒక ప్రహసనమును (ధాష్టికపంతులు) గూర్చి, దిఙ్మాత్రముగా వివరింతును

1. కలభాషిణి :

"నాటకాంతం హి సాహిత్యమ్ " అన్నారు కావున కృష్ణమూర్తి శాస్త్రి గారు పెక్కు కావ్యాదులను రచించి, కవులుగా సుప్రసిద్ధులైన

పిమ్మటనే నాటకరచనకు పూనుకొనిరి వీరి తొలినాటకమగు 'కలభాషిణి' స్వతంత్ర రచన, సంస్కృత నాటక లక్షణానుసారముగా సాగినది ఇది 1902 లో ముద్రింప బడినది " నేను మహా పండితుండ; నాకే సర్వ మును దెలియును; నాటక నియమము లన్నియు నిందు నెలకొల్పితి నని విజ్ఞప్తిఁగను గాని శీఘ్రకాలములో నైనను గొంచెము శ్రద్ధచేసియే యీ నాటకమును రచించితిని నాటక రచనయం దెంత శ్రమయున్నదో గ్రంధ కర్తలకే యెఱుక" అని శాస్త్రి గారు వినయభరముతో అవతారిక యందు చెప్పుకొనిరి అంతియేకాదు, నాటక రచన కిదియే ప్రధమ యత్నం బగుట చేత ఇది సహృదయులచే నెట్లు స్వీకరింపఁబడునో యని సందియం బందుచు, ప్రస్తావ నాంతమున సూత్రధారి పరముగా తన భయము నిట్లు వెల్లడించి యున్నారు

"మన యిక్కార్య మవార్యమై సఫలమై మానొందు నందాకనూ
తన సంప్రాప్తము, చిత్రగర్భితము, విస్తారార్ధ యుక్తంబునై
ఘనతంజెందిన నాటకం బగుట నూఁగంబాఱు నా మానసం
బనయంబుం గలభాషిణీ రమణి యుయ్యాలూఁగు నాలాగునన్"

ప్రధమాంక ప్రారంభమందలి కలభాషిణీ డోలాకేళి సంద ర్భాను సారముగా ఈపద్యమందు సూచిత మైనది ఈవిధముగా పాత్ర ప్రవేశ సూచనము చేయుటను ఆలంకారికముగా ప్రయో గాతిశయ మందురు.

పింగళి సూర నార్య కృత మగు కళాపూర్ణోదయమున పూర్వభాగ మందు కలభాషిణీ మణికంధరుల సమావేశము వరకును గల కధను గైకొని, ప్రయోగ సౌలభ్యమును, రక్తిని దృష్టియందుంచుకొని, మూల కధయందు కొన్నిచోట్ల కొంతకొంత మార్చియు, కొంతకొంత చేర్చియు కొంతకొంత పేర్చియు కథానాయిక యగు కలభాషిణి పేరుతో ఈమహా నాటకమును శాస్త్రిగారు నిర్మించినారు కాగా కళాపూర్ణోదయ కథకును, ఈనాటక కథకు చాల వ్యత్యాసమున్నది. ద్వితీ యాంక-మందలి

శ్రీకృష్ణాంతఃపురము, తృతీ యాంక మందలి ఇంద్రసభ ప్రత్యేక దృశ్యములుగా కల్పితము లైనవి కొన్ని పాత్రలుకూడ యథోచితముగా క్రొత్తగా కల్పించబడినవి కలభాషిణి పాత్ర మూలమందు కంటె ఉదాత్తముగా హృదయాకర్షకముగా చిత్రిత మైనది. మొత్తముమీద నాటక మందలి ఆయా సన్ని వేశములకెల్ల ఏక సూత్రతను ఘటించి, సహృయద హృదయ రంజకముగా శాస్త్రిగారు ఈ నాటకమును సంతరించిరి

ఈ నాటకమందు పద్యములు బహుళముగా నున్నవి అంతియే కాదు చిత్ర విచిత్రము లగు నూత్న వృత్తములలో రచన సాగినది ఈ నాటకరచనాకాలమునాటికి సర్కారుజిల్లాలలో ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు నాటకములందు ప్రవేశపెట్టిన పాటల ప్రభావము పడినది కాని, పాటలను వ్రాయుట ఆరంభించినట్లు కన్పట్టదు అందుచేత శాస్త్రిగారు పాట కనుకూలము లై ప్రస్తారాగతము లగు కొన్ని క్రొత్త వృత్తములను స్వీకరించి, వానికి రాగ తాళములను నిర్దేశించియున్నారు. అంతియేకాదు వానిని "పాఠకులట్లే చదువుకొనవలయునని నియమము లేదు ఇచ్చవచ్చినట్లు మార్చి, మట్లు వేసి పాడుకొనవచ్చుననియు నిర్దేశించిరి ఈ క్రొత్తవృత్తములలో కొన్ని - త్రిభంగి, సుగంధి, మధుర మంజుళ, కల్యాణి, బంధుర, అలస, మనోహర, శతపత్ర, సదాగతి, సుప్రభ, మల్లిక, సుముఖి, కలావతి, వల్లి, వసంత, చిత్రపద, కమల మొదలగునవి."

ప్రాచీన కావ్యములను నాటకీకరించిన పలువురు కవులు, ఆ కావ్యములలోని కొన్ని పద్యముల నైనను సందర్భము ననుసరించి, తమ నాటకములందు యథాతథముగా గ్రహించియుండిరి. ధర్మవరం కృష్ణమాచార్యులు గారి 'వరూధిని' ఇట్టిదే కాని శాస్త్రి గారు ఆ పద్ధతి నవలంబింపక, ఇందలి పద్యముల నెల్ల స్వయముగా రచించిరి ఈపద్యములు మూలముతో సరితూగజాలి యున్నవి.

ఒక ఉదాహరణము:-

కళాపూర్ణోదయము నుండి (1-149)

తమిఁ బూఁదీఁగెలఁ దూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం దూగు నా
క్షామరుల్ ప్రాయపు గబ్బి గుబ్బెతల యంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టి మొగంబై చను దెంపు గని గనుఁగొంటే దివ్య మౌనీంద్ర నా
క మృగీనేత్రలమీఁదఁ గయ్యములకుం గాల్చాఁచు లాగొప్పెడిన్.

కలభాషిణి నుండి (ప్ర అం-163)

అలరుం దీవలనెక్కి యుయ్యెలల పయ్యాటంబుగా నొండొరుల్
గెలువన్ బందెములొడ్డి ప్రాయపుఁ దమిం గ్రీడించుచుం దూఁగు నీ
యలరుం గొమ్మల రాకఁ జూఁగు దివి మోహైచూడు ముల్లోక కాం
తలపైఁ గయ్యపుఁ గాలుద్రువ్వు నటుతెన్నంచెల్లు మౌనీశ్వరా!

ఈ నాటకము ఆనాడు (మద్రాస్ మెయిల్ (23-2-1903) మున్నగు ప్రముఖ పత్రికలలో) బహుళ ప్రశంసల నందినది

## 2. బొబ్బిలి యుద్ధము

క్రీ శ 1757 జనవరి 26వ తేదీన బొబ్బిలివారికిని, విజయనగరము వారికిని జరిగిన యుద్ధకథ ప్రబంధముగా, ద్విపదగా, పాటగా రచింపబడి బహుళ ప్రచారము నందియున్నది ఈ కథను గైకొని కాళ్ళకూరి సాంబశివరావు గారు 'రంగరాయ చరిత సమవాకారము, (1907) అను రూపకమును రచింపగా శాస్త్రి గారు మిత్రుల ప్రోత్సాహమున 'బొబ్బిలియుద్ధము' (1908) అను నాటకమును రచించిరి అటు పిమ్మట మరికొన్ని బొబ్బిలియుద్ధ నాటకములు వెలసినవి కాని, అన్నింటను శాస్త్రి గారి రచనయే బహుళ వ్యాప్తిని, ఖ్యాతిని పడసినది ఇందులకు శాస్త్రి గారు 1916లో రాజమహేంద్రవరమున స్వయముగా నేర్పాటు చేసిన నాటకపు పోటీ కూడ దోహదము చేసినదని చెప్పవచ్చును

బొబ్బిలియుద్ధ నాటకము లన్నియును రంగారాయాది వీరుల ప్రశస్తిని తెలుపునవియే అన్నింటను రంగారాయ డుత్తముడుగాను, విజయరామరాజు కుట్రదారుడు గాను చిత్రింప బడిరి ఇది సత్యము కాదనియు, నిజమునకు బొబ్బిలివారిదే లోప మనియు, వారు దురభిమాన మునకు లోనై రనియు, విజయరామరాజు తప్పు లేదనియు, వెంగళ్రావు చావు తప్పించుకొని ప్రాణములతో నరసాపురము చేరి, రంగరా ట్చరిత్రమును వ్రాయించె ననియు, తాండ్ర పాపయ్యను రామ రాజే చంపె ననియు క్రీ శే శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు ప్రసం గాంతరమున తెలిపి యున్నారు. ఇందలి సత్యా సత్యములు చరిత్ర కారులు తేల్చవలసిన అంశములు అంతమున చిన రంగారాయ పట్టాభి షేకము చిత్రింపబడినను, ఆద్యంతము విషాద చ్ఛాయలతో కూడిన ఇతివృత్త మిది. ఇందు నాయకు డగు రంగారావు మరణించినాడు కాన, ఇది విషాదాంత నాటక మగుచున్నది కాని శాస్త్రి గారు విషాద నాటక రచనకు సుముఖులు కారు అందుచేత వీరు దీనిని విషా దాంత నాటకముగా భావించి వ్రాయలేదు. ఇందు నాయకుడగు రంగారాయడు మరణించుట ప్రతినాయకు డగు విజయ రామరాజు పిరికివాడుగా చిత్రింపబడుట, నాటకమున యుద్ధమును ప్రధానముచేసి ఇది వీరరస ప్రధాన మగు నాటక మనుట- ఈ మూడును పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రి గారి తీవ్ర విమర్శకు గురియైనవి (ఆంధ్రనట ప్రకాశిక- 1930- పుటలు 377-79). ప్రతినాయకు డైన రామరాజును కేవలము పిరికివానిగా చిత్రిం చుట మున్నగు వానిలో కొంతసత్యమున్నను, అసలు, నాటకరచనలోనున్న జిగిబిగువులను కా దనుటకు వీలులేదు శాస్త్రి గారు దీనిని విషాద నాటక మును గానే మనస్సులో భావించి, తదనుగుణముగా రచన సాగించి యున్నచో ఇది ఇంకను వన్నెకెక్కి యుండెడిది

షష్ఠాంక పరిమిత మగు ఈ నాటకములోని ప్రథమ విశిష్టత సరళ గద్య పద్య రచన కలభాషిణీ నాటక గద్య పద్య రచనకును, ఇందలి

గద్య పద్య రచనకును చాల వ్యత్యాసమున్నది ఇంక రెండవ విశిష్టత పాత్రోచిత భాషాప్రయోగము. కలభాషిణీ నాటకములో నీచ పాత్రము లకు గ్రామ్యముపయుక్తమైనది ఇంక ఇందు, ఆయా పాత్రములకు ఆయాయాసలతో కూడిన గ్రామ్య ముపయుక్తమైనది తొలుత బుస్సీకి కూడా గ్రామ్యమే వాడిరి కాని నాటకమంతయును ద్వితీయాంకమంతయును గ్రామ్యభాషాభూయిష్ట మగుననెడి జంకుతో మరల మంచిభాషగా సవరించినారట "అది నా తప్పుగానెంచక ప్రదర్శకులు తదుచిత భాషలోనికి మార్చుకొనిన మార్పుకొందురుగాక" అని కూడ శాస్త్రిగారు నటులకు స్వేచ్ఛ నొసంగిరి.

### 3. తిలక మహారాజ నాటకము:-

1908లో జరిగిన కాంగ్రెసు మహాసభలో 'స్వపరిపాలనము' కావలె నని తీర్మానింపబడినది, ఆ తీర్మానము 1917 'హోం రూల్' ఉద్యమముగా రూపొందినది, ఇంక 1920లో అది 'స్వరాజ్యము'గా మారినది నాడు అసహాయోద్యమము దేశము నలుముఖముల వ్యాపించి నది. ఇంతలో జూలై, 31వ తేదిన లోకమాన్య బాలగంగాధర తిలక్ నిర్యాణముచెందిరి. పిమ్మట గాంధీజీ ఏకైక నాయకులైనారు ఇది 1921 నాటి కాంగ్రెసు స్థితి శాస్త్రి గారి తొలి వర్తమాన రాజకీయ రూపకము తిలక మహారాజ నాటకము లోకమాన్య బాలగంగాధర తిలక్ వేదశాస్త్రాది మహావిద్యా విశారదుడు. లోకజ్ఞుడు, దేశభక్తాగ్రేసరుడు; స్వార్థత్యాగి; ఉత్తమ నాయకుడు ఇట్టిమహామహునకు దేశ మందంతట స్మారక చిహ్నములు వెలయసాగినవి ఉడుతభక్తిగా శాస్త్రి గారు కూడ తిలక స్మారక చిహ్నముగా ఒక దృశ్య కావ్యమును వెలయింప సమకట్టి ఈ నాటకమును నిర్మించినారు ఇది 1921లో ముద్రింపబడినది తిలక్ జన్మము మొదలుకొని, జన్మాంతమువరకు గల [illegible] యందు వర్ణిత మైనది.

దశాంక పర్యాప్తమగు నీనాటకమందు 9వ అంకమున పట్టాభిషేక ప్రాయమగు తిలక్ షష్టిపూర్త్యుత్సవము వర్ణిత మైనది. కాని, 10వ అంకమందు తిలక్ నిర్యాణము వర్ణిత మగుటతో ఇదిపూర్తిగా విషాదాంత నాటక మైనది నాయక మరణముతో నాటక మంత మగుటచేత భరతవాక్యమునుగూడ శాస్త్రి గారు వ్రాయలేదు.

ఈ నాటకమున నాందీ పద్యమున హిందూమాతకు నమస్కారము చేయబడెను ఇంక ప్రస్తావనలో నేటి "సుజలాం సుఫలాం" గీతమును పాడుచు రంగమును ప్రవేశించును నాటక మందంతటను పర ప్రభుత్వ నిరసనము నిర్భయముగా చేయబడెను చివరి అంకములో మరణ శయ్యపైనున్న తిలక్ తన తేజస్సు నంతటిని గాంధీజీకి సంక్రమింపజేయుట అభివర్ణిత మైనది

4. గాంధీ విజయధ్వజ నాటకము:-

నవాంక పర్యాప్త మగు ఈ నాటకముకూడ 1921 లోనే వెలువడినది మహాత్ముడు దక్షిణాఫ్రికాలో నడిపిన యుద్యమములతో కథ ప్రారంభమై 1920 డిసెంబరులో జరిగిన నాగపూర్ కాంగ్రెసు మహాసభావిశేషములతో సమాప్తమైనది ఇది కేవలము ప్రత్యక్ష చరిత మగుటచేత తిలకమహారాజ నాటకముకన్న ఈ నాటకరచన ఎక్కువశ్రమ కలిగించిన దని శాస్త్రిగారు పేర్కొన్నారు దీనికి తొలుత గాంధీ విజయ మని పేరుపెట్టిరి కాని దీని ముద్రణము ప్రారంభము కాకముందే గుంటూరునుండి దామరాజు పుండరీకాక్షుడు గారి 'గాంధీవిజయము' ప్రకటిత మైనది అందుచేత దీనికి పేరు మార్చవలసివచ్చినది "విజయమును వెలయింప జేయునది ధ్వజ మగుటచేతను, సహాయ నిరాకరణోద్యమ విజయకాలంబున స్వరాజ్య ధ్వజము ప్రతిష్ఠింపంబడుటచేతను" శాస్త్రి గారు ఈ నాటకమునకు గాంధీ విజయధ్వజ మను పేరుపెట్టిరి.

మహాత్ముని కడ దుష్టులగు ప్రతిపక్షుల నెదిరించుటకు నొక మహాస్త్రము కలదు-అది ప్రేమ ధర్మ యుద్ధమున విద్వేషుల నెల్ల నిరాయుధులను జేసి విజయం బొందుటకు పాశుపతాస్త్రము కలదు-అదియే శాంతి ఇది మహాత్ముని శీల సారాంశము దీనిని ఈ నాటకమున చక్కగా నిరూపించినారు శాస్త్రి గారు

తిలక మహారాజ, గాంధీ విజయధ్వజ నాటకము లందలి మానవ పాత్రము లందరును యథార్థ వ్యక్తులే తిలక్ మకుటము లేని మహారాజుగా వర్ణింప బడెను ఇంక గాంధీజీ కేవలము అవతార పురుషుడుగా వర్ణింపబడుట చేత రెండవ నాటకమున చతుర్థాంక మందు ఇంద్రసభయు, దేవేంద్రాదులు గాంధీజీ నిత్య నిరతిని ప్రశంసించుటయు మున్నగునవి కల్పితములైనవి దేశమాత ప్రత్యక్షమై గాంధీజీ యెదుట దేశ దుస్థితిని గూర్చి దుఃఖించినట్లు వర్ణితమైనది. స్వరాజ్య సమరములో పాల్గొనినవా రందరు సరాసరి స్వర్గమునకే వచ్చివేయుచున్నారనియు, వారికి వసతులను కల్పించుట కష్ట మగుచున్నదనియు భటులు ఇంద్రునితో తెల్పినట్లు వర్ణిత మైనది

బొబ్బిలియుద్ధ నాటకమునందే గద్య పద్య రచన సరళముగా సాగిన దని తెలిపియున్నాను ఇంక తిలక్ మహారాజ నాటకమందు రచన మరింత సరళముగా సాగినది దీనిపై వచ్చిన విమర్శలకు శాస్త్రి గారు గాంధీ విజయధ్వజ నాటక పీఠికలో ఇట్లు సమాధానము చెప్పుకొన్నారు-

నా తిలక మహారాజ నాటకముం దిలకించిన కొందరు నా మిత్రులు సులభశైలి యనియు, గౌరము పాలు తక్కువగనున్న దనియు లోనగు మాట లనుట కర్ణాకర్ణికగా నాకు వినవచ్చినది కావున దీనిం గూర్చి ముచ్చటింప సాహసించుచున్నాను నాటకములు దృశ్య ప్రబంధములుగదా వాని శైలి భారత శైలిం బోలియున్న ప్రేక్షకులకుఁ గాని

ప్రదర్శకులకుఁ గాని సుబోధంబగునేమో పండితులే పరికింతురుగాత. నాటకములు పాండిత్యము ప్రకర్షించు కొనుటకుఁగాదు విషయము కన్నులకు గట్టి నట్లుండి లోకమునకు నీతిని బోధించుట కేర్పడినవి. కావున నాటకశైలి సర్వజన సుబోధకముగానుండుటయే యుచితమని నా అభిమతము. కారపుఁ బాలునకేమి? కొంత మరీచి వైచినచో నది పెచ్చుపెరుగునుగాని మితిమించిన నది శరీరమున కపాయకర మగునుగదా!

ఇందు శాస్త్రి గారు నాటకశైలిని గూర్చి చక్కని తీర్పు నొసంగి యున్నారు

1920లో లాలాలజపతిరాయి గారి అధ్యక్షతలో జరిగిన అత్యవసర కాంగ్రెసు మహా సభలో అసహాయోద్యమ ప్రతిపాదన మంగీకరింపబడినది ఆ యుద్యమములో పాల్గొనని దేశీయులను శిక్షించుటకు పంచాయితీ కోర్టులను పెట్టుకొనుట ఆ యుద్యమ కార్యక్రమములలో నొకటి. ఇట్టి పంచాయితీ కోర్టు విచారణము ఈ నాటకమున 8వ అంకమందు వర్ణిత మైనది. ఇందు విదేశవస్త్రముల నమ్మినవారిని, విదేశ తంతువులతో వస్త్రముల నేసినవారిని శిక్షించుటయేకాక, ఆ విదేశ వస్తువులను కోర్టులోనే తగుల బెట్టుదురు అట్లే ఇంటిలో రాట్నము పెట్టుకొనని వారికి, రాట్నము పెట్టుకొనియు ఉపయోగించనివారికి శిక్షలు విధింపబడినవి పిల్లలను ఇంగ్లీషు బడులకు పంపువారిని, ఉద్యోగములను విసర్జింపనివారిని, విసర్జించి మరల చేపట్టినవారిని కూడ శిక్షించుట జరిగినది ఇవి యన్నియును రంగస్థలమున ప్రత్యక్షముగా ప్రదర్శించుట కుద్దిష్ట మైనవి ఆనా డిట్టివి రాజద్రోహములు; అందులకు కనీసపు శిక్ష కారాగార ప్రాప్తి స్వాతంత్ర్య సమరములో అసువులనైన అర్పించుటకు వెనుదీయని రాజకీయవాదులకు ఇట్టివి లెక్కలోనివి కావు కాని కేవలము పండితకవులై, రాజకీయములకు సుదూరముగానుండెడి కృష్ణ

మూర్తి గారు ఆనాడిట్టి రచనలు చేయ సాహసించుటకు, నిజముగా ముష్టికారిని కూడ లెక్కచేయని వారి స్వభావమే హేతువు.

5. వీరసేన విజయము :-

షేక్స్పియరు మహాకవి రచించిన "పెరికిల్స్, ప్రిన్స్ ఆఫ్ టైర్" అను ఆంగ్ల నాటకమునకు ఇది అనుసరణము లేదా ఛాయా మాత్రానువాదము ఇది 1918 లోనే రచయింపబడినను 1948 లో మాత్రమే ముద్రణ భాగ్యమును పొందినది మూలమునందువలెనే పంచాంక పర్యాప్త మగు ఈఅనుసరణమందు 20 సీనులకు బదులు 13 సీనులు మాత్రమే ఉన్నవి. ఉదా · ప్రథమాంకమందు మూడు సీనులున్నవి. సముద్రతీరము పల్లెపల్లె స్వయంవర సభ ఈ అనుసరణమున పల్లెప్రజలు మొదలగువారికి గ్రామ్యము స్వేచ్ఛగా ప్రయుక్తమైనది.

మూలమునందువలెనే నాయకుని పేరుతోనే ఈ నాటకమును రచించినను, శాస్త్రి గారు మూలకథను ఛాయామాత్రముగనే స్వీకరించి, పెక్కు మార్పులను చేసినారు· అంతియేకాదు, సంస్కృత నాటక లక్షణములను పట్టించుటకు ప్రయత్నము చేసినారు పేర్లలో, సంభాషణములలో, సన్నివేశములలో, కథా పరిణామములో దేశీయతాముద్రను హత్తించినారు.

పేర్లలో మార్పులు ; పెరికిల్స్-వీరసేనుడు, సిమోనైడ్స్-శ్రీమంతుడు థైజా-లీలావతి; మెరీనా-సరస్వతి పెంటాపోలిస్-విద్యానగరము; టైర్-విజయవాటిక

సన్నివేశములలో మార్పులు ·

ఆంగ్లమూలమున ఆంటియో రాజు కన్నకూతురును మోహించి, అది పాప మని వారించిన కుమారుని (పెరికిల్స్‌ను) చంపుట కాజ్ఞాపించి

చును అప్పుడు పెరికిల్సు పరదేశముల పాలగును శాస్త్రి గారు దీనిని పూర్తిగా మార్చివేసి, శత్రురాజులు ఆకస్మికముగా రాజ్యమును వశపర్చుకొనుటచేత పెరికిల్సు పరదేశముల పాలయ్యె నని మార్చినారు మూలమున పెరికిల్సుకు భార్యతో పునస్సమాగమము డయానా దేవాలయములో జరిగినట్లున్నది కాని శాస్త్రిగారి రచనలో ఈ పున స్సమాగము పూరీ జగన్నాథుని సమక్షములో జరిగినది.

ఇట్టి మార్పులే అంతటను కలవు మొత్తముమీద రచన సరళమై, మూలాపేక్షరహితమై ప్రదర్శన యోగ్యముగానున్నది.

6. ధాష్టిక పంతులు :-

ఈ ప్రహసనము 1931 లో ముద్రింపబడినది. ముద్రాధికారము గల యుద్యోగమందున్న 'ధాష్టికపంతులు' అనువాని దుశ్చర్యలు ఇందు నిరూపింపబడినవి ఇతడు స్త్రీ వ్యసనమునకు లోనై, వావివరుసలు ఉచ్చ నీచములు పరిగణింపక ప్రవర్తించి, పెక్కువిధముల భంగపడి చివరకు చనపోవుచు తాను కామించినవా రందరికిని, ఒక వ్యభిచారి సంఘ నిర్మాణమునకును తన ఆస్తిలో అధిక భాగము సంక్రమింప జేయుచు విల్లు వ్రాయును.

ఈ ప్రహసన ప్రస్తావనలో "హాస్యంబున నంత నిపుణుఁడు గాఁడే" అని కర్తనుగూర్చి మారిషునిచే ఆశంకింపజేసి పిమ్మట సూత్రధారి ముఖముగా హాస్య స్వరూపమును, ప్రహసన ప్రయోజనమును, తన రచనా సామర్థ్యమును శాస్త్రిగారు ఇట్లు వెల్లడించుకొన్నారు:

"హాస్యమన్న బూఁతుకూఁతలు కూయుటయు, నప్రస్తుతంబులగు నెక్కసక్కెయంబు లాడుటయు, మాటకుఁ బదిమాట* లనుటయు ననుకొంటివి కాఁబోలు అట్లు కాదు. చరిత్ర హాస్యాస్పదము, లోక నింద్యము, నీతిబాహ్యము నని కన్నులకుం గట్టినట్లు చెప్పి యొప్పించు

నదే హాస్య ప్రబంధము. అదియే హాస్యరసము. వలయునన్న నన్ని రసములు నక్కవిసార్వభౌముండు నూఱిపోయఁగలఁడు నీ వే రసము త్రావెదవో త్రావుము. నీ నీరసము వదలిపోవును" శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి సాహిత్య సృష్టిలో నీరస మను పదమునకు తావు లేదు మరి వారి సాహిత్య ప్రపంచమున సంచార మొనర్పదలచు వారికి కూడ నీరసము పనికిరాదు.



శ్రీ

# సాహిత్యోపన్యాసములు

—

స్వర్గీయ

## కళాప్రపూర్ణ, వేదం వేంకటరాయశాస్త్రులవారి శతజయంతి

[ 30 జనవరి 1966 నాడు హైదరాబాదు నగరములో జరిగిన ఉపన్యాసాలు ].




ప్రచురణ:

ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి

కళాభవనము, సైఫాబాదు :: హైదరాబాదు.

శ్రీ

# సాహిత్యోపన్యాసములు

౼

స్వర్గీయ

## కళాప్రపూర్ణ, వేదం వేంకటరాయశాస్త్రులవారి శతజయంతి

[ 30 జనవరి 1966 నాడు హైదరాబాదు నగరములో జరిగిన ఉపన్యాసాలు ]




ప్రచురణ:

ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి

కళాభవనము, సైఫాబాదు :: హైదరాబాదు.

## విషయసూచిక :

# స్వర్గీయ వేంకటరాయశాస్త్రి సంస్మరణ :—

## అధ్యక్షోపన్యాసము

—శ్రీ తాపీ ధర్మారావు.

ఇది మహా సుదినం, ఆంధ్ర సాహిత్య సేవకు యావజ్జీవితం అంకితం చేసిన మహామహులు శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారిని సంస్మరించి, ఆ రూపంగా మన కృతజ్ఞతను ప్రకటించ గలుగుతున్నాము. మనకీ అవకాశ మిచ్చినందుకు ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారికి ధన్యవాదాలు దాదాపు 40 సంవత్సరాలు అత్యున్నత ఆచార్యపీఠము నలంకరించి, ఎన్నో విధాల ఆంధ్ర సారస్వతానికి ఎంతో ఉపకారం చేసిన శాస్త్రిగారు ఆంధ్ర మల్లినాథ, మహామహోపాధ్యాయ, సర్వతంత్ర స్వతంత్ర, కళాప్రపూర్ణ మొదలైన అనేక బిరుదుల నందుకో గలిగిన మహనీయులు వేల సంఖ్యలో గల తమ శిష్యుల శ్రద్ధాభక్తులు చూరగొనడమే కాక, ఆనాటి సోదర భాషాపండితుల గౌరవాభిమానాలను విశేషముగ పొందగలిగారు. వారిలో చాలమందికి శాస్త్రిగారు దైవ సమానులు, కొందరు శాస్త్రిగారి ఫొటోను దైవార్చన పీఠములో ఉంచుకొని పూజిస్తుంటారు అటువంటివారిని స్మరించడం ఆంధ్రుల కందరకు కర్తవ్యం అని వేరుగా చెప్పనక్కరలేదు.

అందులో నాకు మరొక బలీయమైన కారణం ఉంది విజయవిలాస వ్యాఖ్యాన వాదోపవాద సందర్భంలో కీర్తికాయులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నన్ను అన్యాయముగా "భారతి" పత్రికలో నిందించారు దానిని ఖండించడంలో వెంకటరాయశాస్త్రి గారిని గురించి కొంత కటువుగ వ్రాయవలసి వచ్చింది. ఆనాడు భాగవత రచనలో దక్షయజ్ఞ సన్నివేశములో బమ్మెరపోతన (అనే కొందరంటారు) శివదూషణచేసి "అల్పవచస్కుడు" అయినట్టూ, ఆ "వక్త్రదోష పరిహారతకై" వీరభద్రవిజయం రచించినట్టూ జనశ్రుతి ఉంది కదా. ఆ విధంగానే నా వక్త్రదోష పరిహారతకై ఈనాడీమహాసభకు అధ్యక్షుడుగా ఉండడానికి సంతోషపూర్వకంగా అంగీకరించాను.

వెంకటరాయశాస్త్రిగారు బహుభాషావేత్త, అనేక శాస్త్రాల పాండిత్యమున్నవారు. ఎన్నిచదివినా, ఎన్ని తెలుసుకొనినా, వారి దృష్టి ఆంధ్ర సాహిత్యాభ్యుదయ విషయంమీదనే లగ్నమై ఉండేది.

ఇతర భాషలలో మంచివనితోచిన గ్రంథాలను ఆంధ్రంలోని కనువ దించారు. కాళిదాసు, హర్షుడు వ్రాసిన నాటకాలను చాలవరకు భాషాంతరీకరించారు. కథా రూపంగా విజ్ఞానాన్ని లోకాలకు పంచి పెట్టిన కథా సరిత్ సాగరం తెలుగు చేశారు మేఘసందేశానికి మల్లినాథసూరి రచించిన అమోఘమైన వ్యాఖ్యానం తెలుగువారికి సుబోధంగా ఉండడానికి తమ స్వంత వివరణలతో ప్రచురించారు దానిలో కొన్నిచోట్ల మల్లినాథ వ్యాఖ్యలకు మెరుగు గూడ పెట్ట గలిగారు.

ఈ రచన లెంత గొప్పవయినా, వీటితో శాస్త్రిగారు తృప్తి పొందగలుగుతారా ? పొందరు, పొందకూడదు కదా! భాషా పటుత్వము, భావ స్వాతంత్ర్యము, కల్పనా చమత్కారము, అన్ని టిని మించి సవిమర్శమైన ప్రపంచపరిశీలన కలిగిన శాస్త్రిగారివంటి మేధావులు అలాగున తృప్తిపడలేరు కాబట్టే వారు స్వతంత్ర రచన లకు పూనుకున్నారు. ప్రతాపరుద్రీయము. బొబ్బిలియుద్ధము మొద లైన నాటకాలు ప్రచురించారు నాటినుండి నేటిదాకా ప్రతాప రుద్రీయము ఆంధ్రజనానీకాన్ని ఉర్రూతలూగిస్తూనే ఉంది, అంతే కాదు, ఇంకా నూరేండ్లవరకు కూడ ఆంధ్రులను ముగ్ధులుగా చేస్తుం టుందనడానికి సందేహంలేదు.

నాటకాలు వ్రాయడమే కాక, వాటిని రంగస్థలము మీగ ప్రయోగించడానికి కావలసినశిక్షణనంతటిని శాస్త్రిగారే నటకులుగా వచ్చిన యువకుల కిచ్చేవారు ఉచ్చారణ అభినయము మొదలైన విషయాలను వారు చెప్పి చేయించేవారు ఆ సమాదరణం చూర గొన్నవారు కాబట్టే, నెల్లూరు నాటక సమాజమువారు శాస్త్రిగారి నాటకాలు తప్ప మరెవ్వరి నాటకాలను ప్రదర్శించరాదని ఒక నియమం పెట్టుకున్నారు. వారిలో చాలమంది నటవతంసు లయి గొప్ప ప్రఖ్యాతిని సంపాదించారు.

ఒక్కచిత్రం! ప్రతాపరుద్రీయం తయారైన సమయాన్నే గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం గూడ తయారయింది అదిగూడ దీనిలాగానే ఆంధ్రజనాదరణను కైవసం చేసుకుంది ఆంధ్ర చరిత్రకు సంబంధించిన కథావస్తువును శాస్త్రిగారు తీసుకుంటే, గుర జాడ వారు ఆంధ్రసంఘ జీవనానికి సంబంధించిన కథ నెత్తుకున్నారు. యాభయి సంవత్సరాలుగా తెలుగువారి అభిమాన నాటకాలుగాఉన్న ఈ రెండు నాటకాలు ఇంకా నూరేండ్లదాకా ఇలాగే ఉండగలవు

ప్రతాపరుద్రీయములో 8 విధాలయిన గ్రామ్యం (వ్యావహారికం) శాస్త్రిగారు ఉపయోగించారంటారు

ఈ భావ స్వాతంత్ర్యాన్నే శాస్త్రిగారు ఇతర విషయాలలో గూడ కనబరిచారు

చిన్నయసూరి వంటి గడ్డుదేరిన గ్రాంథిక భాషావాదులు గూడ తమ రచనలలో వివరణలు, అవతారికలు వ్రాయవలసి వచ్చినప్పుడు వ్యావహారిక భాషనే ఉపయోగించారు. శాస్త్రిగారు అలా చేయక, గ్రాంథికాన్నే వాడి పూర్వ సంప్రదాయాన్ని కాపాడారు. కాని, అవసరమని తోచినప్పుడూ, భాషకు ఉపయోగకరమని వారు భావించినప్పుడూ, వారు సంప్రదాయాన్ని ఉల్లంఘించడానికి జంకే వారు కాదు. నాటకాలలో పాత్రోచితమయిన వ్యావహారికము ఉపయోగించిన్ని, సంస్కృత నాటకానువాదాలలో స్త్రీ పాత్రలకూ నీచపాత్రలకూ గ్రామ్యమును వాడి ఆనాటి పండిత రంగములో దుమారము లేవదీశారు. తమ వాదాన్ని సమర్థిస్తూ గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనము ప్రచురించారు

అలాగే కథాసరిత్సాగర రచనలో తమ తిరుగుబాటు తనాన్ని ప్రదర్శించారు చిన్నయసూరిగారి మీదా, వారి వ్యాకరణంమీదా తమకెంత గౌరవమున్నా, వారి నీతిచంద్రికలోని రచనా విధానాన్ని అంటనైనా అంటలేదు. సులభమైన శైలితో విసంధి పాటిస్తూ తమ రచన సాగించారు పండితుల వాదనలను విసంధి వివేకము వ్రాసి ఖండించారు.

నైషధానికి సర్వంకష వ్యాఖ్యనూ, ఆముక్తమాల్యదకు సంజీవనీ వ్యాఖ్యనూ వ్రాసి ఆంధ్రసహృదయ లోకానికి ఇంతింతన రాని మహోపకారం చేశారు. ఆ వ్యాఖ్యానాలను భక్తిశ్రద్ధలతో క్షుణ్ణంగ పఠించినవారు కొమ్ములు తిరిగిన పండితులనుగూడ ధిక్కరించగలరంటే అది అతిశయోక్తి కాదు వాటిలో శాస్త్రిగారి సర్వతోముఖ పాండిత్యమూ, బహుగ్రంథ పరిచయమూ ప్రస్ఫుటంగా కనిపిస్తాయి చేమకూరవాని సారంగధరకు వారు వ్రాసిన వ్యాఖ్యను చూచి, అనాటి పండితులు విజయ విలాసములోని సారస్యము అందీ అందకుండా ఉందనీ, దానికిగూడ వ్యాఖ్యానము రచించి పండిత పాఠకలోకానికి మేలుచేయ వలసిందని కోరారు వారికోర్కెను మన్నించి దానికి గూడా ఒక వ్యాఖ్యను ప్రకటించారు.

ఈ వ్యాఖ్యానాలలో కొన్ని లోపాలున్న వన్నమాట యథార్థము. ప్రమాదో ధీమతామపి అంతే కాకుండా, తమకు ముందు జూలూరు అప్పయ్య పండితులచేత సి పి బ్రౌన్ వ్రాయించిన వ్యాఖ్యానాలను కొంతవరకు అనుసరించడం వల్లనూ, తొందర తొందరగా వ్యాఖ్యానము ప్రచురించవలసి వచ్చినందు వల్లనూ, విషయ సేకరణకు శాస్త్రిగారు నియమించిన శిష్యుల అశ్రద్ధ వల్లనూ, ఆ లోపాలు సంభవించాయని అనడం మంచిది శాస్త్రిగారే చివర దశలో ఆ మాటనే తనతో చెప్పినట్టు వేటూరివారు ప్రకటించారు.

ఆ రోజులలో విమర్శన అంటే తప్పులెంచడమే అంతేకాదు; ఒకరి నొకరు, ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ తిట్టుకోవడమే ఆ పద్ధతి విమర్శనతో శాస్త్రిగారు కొక్కొండ వెంకటరత్నం పంతులు గారిని ముట్టడించారు గిడుగువారి వ్యాసాలు చదివినవారికి శాస్త్రి గారి విమర్శన అంత సమర్థనీయం కాదని తేటపడుతుంది. "తప్పు లెన్నువారు తమతప్పు లెరుగరు" అన్నమాట సత్యము కదా !

ఏది ఏలాగున్నా ! శాస్త్రిగారు 76వ ఏట కన్నుమూసి నంత వరకు ఆంధ్రభాషా సాహిత్యాలసేవే ప్రధాన లక్ష్యంగా పెట్టుకొని జీవించినవారు, దాదాపు 40 సంవత్సరాలు ఆచార్య స్థానాన్నలంక రించి వేలకొలది శిష్యులకు సాహిత్య భిక్ష పెట్టినవారు సౌమ్య భావంతో పెద్దలలో పెద్దలు, పిన్నలలో పిన్నలుగా మెలగి సర్వజనాదర ణను పొందగలిగినవారు, ఆంధ్రసాహిత్య పురోభివృద్ధికి నిర్విరామంగా కృషిచేసినవారు, నిక్షేపాలవంటి గ్రంథాల నెన్నింటినో ఆంధ్రసరస్వ తికి సమర్పించినవారు, కాబట్టి ఆంధ్ర మహాజనులకు ఆచంద్రార్కము కృతజ్ఞతా పాత్రులు, సంస్మరణ యోగ్యులు అనడానికి సందే హము లేదు. విజ్ఞాన ధనము పెట్టెలలో నింపి మన సారస్వత కోశాగారాని కందజేశారు. ఆ పెట్టెలలో ఎక్కడయినా ఒక సత్తు మూపాయిగాని చెల్లని నాణెముగాని ఉంటే, దానిని తొలగించి, నిర్దు ష్టమయిన దాని నా స్థానంలో నెలకొల్పడం మనవిధి, అంతేకాదు, ఆ ధనాన్ని మూలధనంగా భావించి, దానిని ఇతోధికంగా అభివృద్ధి పొందునట్లు చేయడం మనకర్తవ్యం. అలా జరిగినప్పుడే మన కృతజ్ఞ తకు ఒక ఆకారం ఏర్పడుతుంది. మన మాటలకు ఒక సార్థకత కలుగుతుంది.

—):—:(—

# మా తాతగారు

- శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి.

శ్రీవాణీ గిరిజాః చిరాయ దధతో వక్షో ముఖాంగేషు, యే
లోకానాం స్థితి మావహ న్త్య విహతాం స్త్రీ పుంస యోగోద్భవాం,
తే వేదత్రయ మూర్తయః త్రిపురుషాః సంపూజితావః సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకన్ధరాః శ్రేయసే॥

(నన్నయ)

శ్రీ యన గౌరి నాఁ బరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరం బగు రూపము దాల్చి విష్ణురూ
పాయ నమః శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

(తిక్కన)

తీరుగఁ దిక్కయజ్వ తరితీపు తెనుంగుకవిత్వసారపున్
ధారల నాంధ్రవాణిని సుధామధురం బొనరించెఁ బూర్వ ; మా
కీరితి పొల్లువోక పలికించెడి సింహపురాన నేఁటికిన్
శారద కావ్యనాటక విశారద మంజు విపంచినాదముల్.

నాఁటిని నేఁటినిం గలుపు నాణెపువ తెన యాచుఁ బాండితీ
పాటవమందు విద్వదభివంద్య కవిత్వ విమర్శనంబులన్
బోటియు సాటిలేని కవిపూజ్యుఁడు వేంకటరాయశాస్త్రి యా
మేటరి సంస్కృతి ప్రతిమ మించు హృదంతర పద్మపీఠికన్.

(శ్రీ దువ్వూరి రామిరెడ్డి)

ఆంధ్రవాఙ్మయములో గొప్ప తాతలను అనగా పితామహులను గలిగినవా రనేకు లుండిరి. వారిలో ప్రసిద్ధులు ముగ్గురు - తిక్కన, జక్కన, శ్రీనాధులు. తిక్కన తన తాతనుగురించి,

"సారకవితాభిరాము గుంటూరి విభుని
మంత్రిభాస్కరు మత్పితామహునిఁ దలఁచి
యైన మన్ననమెయి లోక మాదరించు,
పేఱ నాకృతిగుణములు వేయు నేల·" — అన్నాఁడు

ఇక్కన, తన తాత పెద్దయామాత్యునిగుఱించి ఒక సీసమాలికలో,

"సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల
ఘటికలో నొక శతకంబుఁ జెప్పఁ
బ్రహసనప్రకరణ భాణాది బహువిధ
రూపకంబులయందు రూఢి మెఱయ ....

ఇత్యాదిగా చెప్పి తుదిని,

"అనుచు నెల్లూరి తిరుకాళమనుజవిభుని
సమ్ముఖంబున సాహిత్య సరణి మెరసి
మహిమ గాంచిన పెద్దయామాత్య సుకవి
మనుమఁడవు నీ వంశమహిమ యొప్పు."
— అని చెప్పుకొన్నాఁడు.

కవిసార్వభౌముఁడైన శ్రీనాథుఁడు,

"కనకక్ష్మాధరధీరు వారిధితటీ కొల్పట్టణాధీశ్వరున్
ఘనునిం బద్మపురాణ సంగ్రహ కళాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌమ కవితావిద్యాధరుం గొల్తు నా
యనుగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్య చూడామణిన్."

"మత్పితామహుఁ గవిపితామహునిఁ దలఁతు
గలిత కావ్యకళాలాభు కమలనాభు,
చంద్ర చందనమందార సదృశకీర్తి
సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి"

ఈ విధముగా తమ తాతలను, అనఁగా పితామహులను పేర్కొన్న కవులవలెనే నేనును నా పితామహుని పేరుపై నుపజీవించుచున్నాను. పేరు పొందిన తాతలను మనుమలైన ఈ మహనీయులవలెనే పేరుపొందిన తాతకు మనుమఁడనే యైనను నాకును వారికిని చాల భేదమున్నది ఈ పెద్దల తాతల రచనలేవో తెలియవు. కాని మనుమలవి మాత్రము ప్రత్యక్షములు జగత్ప్రసిద్ధములు. వీరు మహాకావ్యనిర్మాతలు - ఒకరు కవిబ్రహ్మ, రెండవవారు చక్కని రచనకు ప్రసిద్ధులు, మఱియొకరు కవిసార్వభౌములై కనకాభిషేకము నందినవారు మఱి నేనో, ఏదో అవకతవక రచనలు చేయుచు కాలక్షేపము చేయువాఁడను పై మహనీయులవలన వారి తాతలకు ప్రసిద్ధి. నాకో తద్విపరీతము వాస్తవముగా తాతవలననే నాకు లోకమున మన్నన.

"సారకవితాభిరాము నెల్లూరి జనుని
మహితశాస్త్రిని మత్పితామహునిఁ దలఁచి
యైన మన్ననమెయి లోక మాదరించు,
వేఱ నాకృతి గుణములు వేయునేల?"

అని నేను చెప్పుకొన్న సరిగా నుండును. ఆ ప్రాచీనులలో అది వినయము. నాలో అహంకార మగునేమోయని భయపడుచున్నాను కాని ఇది వాస్తవము మఱియొక విషయము. ఇంతకన్నను సంతోషింపఁదగినది పై మువ్వురును పాతనాటివారే అనఁగా మా నెల్లూరి మండలమువారే. అందులకే పూర్వవాసన పోలేదని మా కవికోకిల కూజితము— "ఆ పేరిటి పొల్లుపోక పలికించెడి సింహపురాన నేఁటికిన్ శారదకావ్యనాటక విశారద మంజువిపంచి నాదముల్."

అట్టి తాతను అవలంబించి జీవించు నేను ఏమిచెప్పఁగలను? "వారిని మీరు చక్కఁగా ఎఱుఁగుదురు వారి మనుమఁడను" అని ఒకప్రక్క చెప్పుకొనుచు మరల "వారెటువంటివారనఁగా" అని మీకే చెప్పుట అందముగా లేదు మందముగా నున్నది. పెద్దలు మీరు వాస్తవముగానే వారిని ఎఱుఁగుదురు.

మనుమఁడనైన నాచేత మాటలాలించి వినఁగోరుచున్నారు అంతమాత్రమే. మీ అభిమానమునకు అంజలి ఘటించుచున్నాఁడను

బావిలోతుగాని కొండఎత్తు గాని కొలుచుటకు ఆపాటి కొలతసాధనమో, కొలుచు సామర్థ్యమో కావలఁయును నాకడ అట్టి కొలతబద్దయు లేదు, సామర్థ్యమును లేదు. కాని నేనును తాతగారిని, శిష్యులవలెనే కొలిచితిని. అనఁగా వారి కొలువు చేసితిని. వారిని సేవించుకొంటిని ఒకప్పుడు, అనఁగా, 1936 లో, నేను రాజమహేంద్రవరములో శ్రీ గిడుగు రామమూర్తి పంతుల వారి దర్శనము చేసికొంటిని. నన్ను చూచి వారు సంతోషించి, మాటల సందర్భములో "మీరు మీ తాతగారిని చక్కఁగా ఎఱుఁగుదురా?" అని యడిగిరి. నేను వెంటనే తడువుకొనకుండ, "ఆహా! ఎఱుఁగకేమి, చక్కఁగా ఎఱుఁగుదును వారు గతించునప్పటికి నాకు పదునాలేండ్లు పూర్తియైనవి గదా!" అని యంటిని, మాముఖధోరణిలో తత్క్షణమే పంతులవారు "అ ఎరగడం కాదండీ, వారు ఎంతటి పండితులో మీరు ఎఱుఁగుదురా? – అని నేనడిగాను మీ రెరగరు మే మెఱుఁగుదుము మహా పండితులు. వారిలో ఏమైనా తప్పులు కనిపెడితే మాకు పేరుగాని, మిగిలినవారు మాకు లెక్క లేదు. అంతటివారు ఇక పుట్టరు"

తాతగారే ఒకమారు నాతో అనియుండిరి "నా సంగతి నీకిప్పు డేం తెలుస్తుందిరా! ఇక ముప్పై యేళ్ళకు తెలుస్తుంది" అని తాతగారిమాటలకు వ్యాఖ్య పంతులవారి ప్రశ్న తాతగారు గతించి 35 సంవత్సరము లైనవి. వారన్నట్లు వారిని నే నింకను పూర్తిగా కాదుగదా కొద్దిగానైనను తెలిసికొనలేదు. పాశ్చాత్య శాస్త్రజ్ఞుల చంద్రమండల యాత్రవలె అందినట్లే యున్నది గాని అందలేదు.

ఒకటిమాత్రము చిన్నప్పుడే అందినది. తాతగారిది అందెవేసిన చేయి అని అందె, అనఁగా బంగారు తోడాలు ప్రిన్స్ ఆఫ్ వేల్సుగా విండ్సరు ప్రభువు మదరాసుకు వచ్చినప్పు డిచ్చిన దొకటి. తర్వాత గద్వాల మహా

రాజావా రిచ్చిన దొకటి. తాతగారుమాత్రము అందఱు తాతలవంటివారు కారని గ్రహించితిని. గొప్పవారు వారికి శిష్యులు ఆశ్రితులు, అభిమానులు చాల మంది అందఱును వారికి సాష్టాంగనమస్కారములు చేయువారేగాని, ఎవరి కిని వారు చేయఁగా నేను చూడలేదు విక్రమార్కుఁడు నమస్కారము చేయుట ఎఱుఁగ నన్నాఁడఁట! తాతగారుకూడ నమస్కారము ఎఱుఁగ రేమో అనిపించినది పురీజగన్నాథములో గోవర్ధనమఠము శ్రీశంకరాచార్యుల వారిని మేము దర్శించినప్పుడు, స్వాములవారుగదా యని తాతగారు నమ స్కారము చేయఁబోగా స్వాములవారే సంభ్రమముతో తాతగారిని పట్టుకొని ఆపిరి ఇరువురును ఒకరికొకరు మామూలు నమస్కారములు చేసికొనిరి. కారణ మేమనఁగా, ఆ శంకరాచార్యులవారు పూర్వాశ్రమములో తాతగారి శిష్యులే

ఒకప్పుడు తాతగారు మాటలసందర్భమున నన్ను బెదరించిరి "ఎవరి కుఁటాడురా ఇటువంటి తాత? ఏమో అనుకొంటున్నావ్!"అన్నారు నిజమే. వారికికూడ లేఁడు. నిజముగా వారు వారితాత నెఱుఁగరు వారిపేరుకూడ వేంకటరాయశాస్త్రిగారే మధ్యవయస్సులోనే గతించిరి నాకు మాత్రము – "పుట్టినదాదిగా తనదు పుణ్యమె దాదిగ"అని చేమకూర వెంకటరాజు అన్నట్లు (మేమును వెంకటరాజులమే) పుట్టినదిమొదలు ఒక మహాపండితుని దర్శనము నిరంతరసేవా సాన్నిధ్యగోష్ఠి వినోద లాలనాది భాగ్యము కలిగినది కాని – అ స్తమయ భానునితేజమును చూచితిని గాని, మధ్యందిన మార్తాండుని మహా త్త్వమును చూడలేదు పండుముసలి నెరసిన గడ్డమును పట్టుకొని ఊగి ఆడు కొంటినిగాని మధ్యవయసులోని మహాపురుషునియెదుట భయపడి నిలువలేదు, విశ్రాంతిగా కూర్చుండి యుండిన వికర్తనునితో నుంటినిగాని ప్రతాపించు చుండిన ప్రద్యోతనునికి సాయపడలేదు పగలంతయు నిద్రపోయి సాయం కాలము నాలుగుగంటలకు మేలుకొన్నవాని సూర్యదర్శనము వలె నైనది. కొంత వెలుగు చూచులోపలనే చీకటి పడిపోయినది,

నేను పుట్టినప్పుడు తాతగారికి 59 సంవత్సరములు తర్వాత ఒక సంవత్సరముననే షష్టిపూర్తి. కాని మా యింట దానిని ఒక పండుగుగా చేసికొను ఆచారము లేదు కాన ఏ విశేషమును జరిగినట్లు నాకు జ్ఞాపకము లేదు వెంట వెంటనే నాకు ఇరువురు తమ్ములును ఒక చెల్లెలును పుట్టిరి తాతగారికి పెద్ద అచ్చాపీసు ఉండినది పనివాండ్రు చాల మంది ఇంటిలో రెండు ఆవులు పశుసంరక్షణ మా నాయనమ్మది మేము పిల్లలము, శిశు సంరక్షణ మా యమ్మది. మా నాయనగారికి తాతగారికి అచ్చాపీసే గాక మూడు నాలుగు గుఱ్ఱములు, గుఱ్ఱపుబండ్లు, అందులో పెట్టెబండ్లు, రేకలా బండ్లు మొదలైనవి ఉండెడివి అశ్వపోషణ వారి పని కుక్కలు కూడ లేకపోలేదు. గుఱ్ఱపుపందెములకు గుఱ్ఱములను తయారు చేయుటలో మా నాయనగారికి ప్రీతి. ఇప్పుడు మే ముండు చిన్న యిల్లు గాక మఱియొక పెద్ద యింటిని అద్దెకు తీసికొనియుండిరి అక్కడ కూడ అచ్చాపీసు పుస్తకముల స్టాకు పెట్టుకొని యుండువారు. తాతగారికి అప్పటికింకను గడ్డము ఏర్పడ లేదు దాడీ పెంచలేదు. శృంగార నైషధములోని రూపమునుండి కొద్దికొద్దిగా మార్పు ప్రారంభమై యుండినది తాతగారి శృంగార నైషధ సర్వంకషయు నేనును ఇంచుమించు ఏక కాలమందే వెలువడితిమి

క్రీ శ 1914 లో. ఎండన్ మదరాసు కోటమీఁద గుండు వేయఁగానే మదరాసు గడగడలాడిపోయినది మే మందఱము నెల్లూరికి పోయితిమి. నాఁటి నెల్లూరిజీవితము నాకు ఏదో లీలగా జ్ఞాపకమున్నది. మూలపేట, పెద్ద యిల్లు, తాతగారి గది, పుస్తకాలు నాటకాల రిహార్సలు, మా నాయనగారి గుఱ్ఱాలుఇత్యాదులు. ఒక ఆడుగుఱ్ఱము ఒకదినము పిల్లవేసినది నాఁటిదృశ్యము నాకు బాగుగా జ్ఞాపక మున్నది మేడలో క్రింది భాగమున అచ్చాపీసు ఎక్కువ కాలము మేము నెల్లూరిలో ఉండలేదు. పూర్తిగా రెండేండ్లు నిండు లోపనే మరల మదరాసు చేరితిమి. అంతపెద్ద అచ్చాపీసు, ఆ దినములలో (1919 లో) పదునారు వేల రూప్యములకు అమ్మడు పోయినట్టిది, (Casting Machine) అక్షరముల పోత పోయు యంత్రముతోకూడ నుండి

నట్టిది - నెల్లూరిలో దానికి తగిన పని లేనందున మరల మదరాసునకే వచ్చి నది అంత అచ్చాపీసును ప్యాకింగు చేయించి మదరాసు నెల్లూరులకు తెచ్చినవారు గుమాస్తాలు కారు మా నాయనమ్మ! అంతయు దగ్గర నుండి చేయించి జాగ్రత్తగా మదరాసులో మరల నెలకొల్పినది ఆయమ్మ ఆమెను గూర్చి ఎంతైనను చెప్పవచ్చునుగాని ఇప్పుడు అవకాశము చాలదు

మరల మదరాసుకు రాఁగానే తాతగారు సూర్య నిఘంటువునకు సంపాదకులైరి అదేదో శాశ్వత మని తాతగారు భ్రమపడి వచ్చిరి నాకు నాలుగేండ్లైనవి. ప్రతిదినము తాతగారి బండిలో వారిని ఆఫీసులో - చింతాద్రి పేటలో —— వదలుట, సాయంకాలము మరల పోయి బండిలో పిలుచుకొని వచ్చుట. ఆ చిన్న వయసులో తాతగారు, వారి ఎఱ్ఱని లావుశరీరము, ఆ కోటు, తలపాగ, చేతికఱ్ఱతో గంభీరమైన వారి నడక, వారిముందు అందఱును భయభక్తులతో మెలఁగుట ఇవి నా హృదయములో నెలకొన్నవి. ఈ ఉద్యోగము ఎక్కువకాలము సాగలేదు త్వరలోనే తాతగారు దానిని వదలినారు ఆ తర్వాత అచ్చాఫీసు పనులుకూడ చక్కఁగా కొనసాగలేదు నాకు ఆఱేండ్లు నిండినవి; ఎందువలననో అక్షరాభ్యాసము చేయలేదు వారి వ్యాకులములో వా రుండిరి నేను మా తల్లిగారితో వారి పుట్టింటికి పోయి యుంటిని తటాలున ఒక దినము మా ఆఫీసు పెద్దబైండరు ఏకాంబర మొదలియార్ వచ్చి నన్ను మదరాసుకు పిలుచుకొని పోయినారు నాకు తాతగారికడకు వచ్చుట సంతోషముగా నుండినది. ఒకరోజు కూర్చుండబెట్టి అక్షరాభ్యాసము చేసిరి, బడికి పంపలేదు. ఇల్లంతయు కాగితములే. నాకు తోఁచినవానిమీఁద నంతయు వ్రాయుచుంటిని తటాలున ఒకరోజు అచ్చాపీసు మెషినులు, కేసులు, అక్షరాలు ఎవరెవరో వచ్చి కట్టలు కట్టి తీసికొని పోవుచుండిరి తాతగారు అచ్చాపీసు అమ్మివేసిరి పుస్తకముల స్టాకు మాత్రము మిగిలి యుండినది ఆ పెద్దయిల్లు వదలితిమి. ఒక యిల్లే మిగిలినది. గుఱ్ఱములు బండ్లును కూడ పోయినవి 1919.

నాకు ఏడేండ్లైనను నన్ను బడికి పంపలేదు మా యమ్మకు అందోళనము మనకు కష్టకాలము సంప్రాప్తమైనదే ఇంక పిల్లవానికి చదువు సాగదేమో అని ఆమె భయము తాతగారికి నిరంతరము చదువే చదువని సమయముగాని, వ్రాయని సమయముగాని లేదు. నేను ఎప్పుడును తాతగారితోనే, వారి గదిలోనే, వారి మంచముమీదనే, వారి ప్రక్కనే నా పడుక నా వస్తువులన్నియు వారి డ్రాయరులోనే పూర్తిగా తాతగారి మనుమఁడనుగానే యుంటిని. ఒక దినము మా నాయినమ్మ "వీడికి నోరు తిరగడానికి అమరం చెప్పడం మొదలుపెట్టండి" అన్నది ప్రారంభించి సంత చెప్పనారంభించినారు. వారు ఒకమారు చెప్పుట, నాతో రెండుసార్లు చెప్పించుట, శబ్దమంజరి కూడ ప్రారంభించిరి నాకు ఏదియు బుద్ధికి ఎక్కలేదు. ఒక శ్లోకమునకు ఒక దమ్మిడీ వంతున ఒక అమృతాంజనము డబ్బిలో వేయసాగిరి క్రొత్త దమ్మిడీలు తళతళలాడుచు సవరలవలె నుండునవి ఏరి తెచ్చివేయుచుండిరి. ఆ వయసులో నా కదేదో వింతగా ఆనందముగా నుండెడిది. కొన్ని రూపాయల వఱకు చేరినవి దానిని ఒకమారు తాతగారికే అప్పిచ్చితిని. ఎట్లనఁగా ఒక దినము తపాలాఫీసునకు నన్ను వెంటఁబెట్టుకొని పోయినారు అచ్చట ఎట్లు పోయినదో వారి పర్సుపోయినది మరునాఁడు వారి తండ్రిగారి తద్దినము డబ్బు లేదు నా దమ్మిడీ లన్నియు వారికి అప్పిచ్చితిని అహా ! నన్ను చదివించుటకు చేసిన పని మరియొక మంచి కార్యమున కుపయోగపడినది పిల్లల అనురాగమును పొందుచు వారికి విద్య నేర్పుటలో వారికి వారే సాటి ఈ విధముగా వారే నా కెంతయో ఋణపడి యున్నారు నా దమ్మిడీలు నాకు మరల ఇచ్చిరోలేదోగాని జ్ఞాపకము లేదు. వారి ఋణమును తీర్చలేనంత దమ్మ మాత్రము నాకు కలిగించినారు

బడిలో నన్ను వేసినారు. అందరిలోను నా వాక్కు స్పష్టముగా నున్నదని, చక్కగా చదువుచున్నానని మూఁడు నెలలకే నాకు డబుల్ ప్రమోషను దొరికినది ఆ కాలములో 1919లో కాఁబోలు, తాతగారు అచ్చాఫీసు బాధ్యతలు లేక సుఖముగా ఆముక్తమాల్యద వ్యాఖ్య వ్రాయుచుండిరి

తాతగారితోనే ఆ గదిలోనే నిదురించు నాకు వారి మంచము స్వాధీనము. ఎలెక్ట్రికు దీప ముండెడిది కాని తాతగారికి దానిమీఁద విశ్వాసము లేదు అది తటాలున ఆరిపోయెడిది గంటలతరబడి వచ్చునదికాదు. నాలుగు క్యాండిలు దీపములు, బెల్‌మాంటు క్యాండిలు వత్తులు ఎప్పుడును సిద్ధముగా నుంచుకొనెడి వారు ఎడతెగక వ్రాయుచుండువారు నే నెప్పుడు మేలుకొన్నను వారు వ్రాయుచునే యుండెడువారు ఎప్పుడు నిద్రపోయెడువారో; 'అవిదితగత యామా రాత్రిరేవవ్యరంసీత్' అని వీరి విద్యావ్యాసంగమును గుఱించి వ్రాయుట అతిశయోక్తికాదు, స్వభావోక్తియే యగును. ఒక దినము పగలంతయు వ్రాయుచుండిరి. ఆ ముందురాత్రికూడ వ్రాయుచుండిరి. సాయంకాలము మూఁడు గంటలు దాఁటిన తర్వాత అలసటచేత కొంచెము పరుండిరి ఐదున్నరగంటలకు మేలుకొనిరి. ఏమి తోచినదో పలుదోముపుల్ల చెంబులో నీళ్లు నన్ను తెమ్మనిరి. 'ఇప్పు డెందుకు తాతా?' అని యంటిని 'నీవలె తెల్లవారింతర్వాత కూడా నిద్రపోతా ననుకున్నావా, సూర్యుడు నీ పడుక చూడకూడదు. చూడరా ఎంత తెల్లవారిపోయిందో!' అన్నారు 'అయ్యో! తాతా, సాయకాలం చీకటిపడ బోతున్నది. ఇప్పుడు 5½ గంటలు కొంచెంసేపుంటే వీధి దీపాలు పెడతారు. అని అంటిని కొంత నెమ్మదిగా చూచి 'ఆహాఁ! అవునురా. సాయంత్రం నిద్రపోయినట్టున్నాను. సరే నీళ్లుమాత్రం తే కాఫీ చెయ్యమని చెప్పు మీ అమ్మను.' అని మొగముమాత్రము కడిగికొని కాఫీ తెప్పించుకొని త్రాఁగి మరల వ్రాఁతకే ప్రారంభించిరి

తాతగారికి కాఫీ ప్రాణము. భోజనముకూడ అంత లేదు ఎక్కువసేపు విస్తరిముందు కూర్చుండుటకు కూడ వారికి ఓపిక యుండెడిది కాదు. ఏవో రెండు మెతుకులు నోటవేసికొని మరల టేబిలువద్ద కూర్చుండవలసినదే. వారి గదిలో దక్షిణమువైపు మూఁడు కిటికీలు చక్కని దక్షిణపు మదరాసు సముద్రపుగాలి. ప్రక్కన ఏవియు పెద్ద కట్టడములు నాఁడు లేవు ఒక కిటికీకి సరిగా టేబిలు కుర్చి, వెనుక బీరువలు, ప్రక్కన మఱియొక చిన్న టేబిలు, అంతటను పుస్తకాలు, నోటుబుక్కులు, పేనాలు (మూఁడు నాలుగు - ఒకటి

కాదు) సిరాబుడ్డి, వ్రాత రెండు కిటికీలకు సరిగా మంచము, పఱుపు ఎప్పుడును వేసియేయుండెడిది. వీనికి ఎదురుగా ఉత్తరపువైపు రెండు కిటికీలు నడుమ తలుపు ఒక కిటికీవద్ద చిన్న టేబిలు, బెంచి. టేబిలుమీఁద, కిటికీ లోను, స్టవ్వు, కాఫీ కెటిలు మొదలైనవి బీరువలోపల బిసకత్తులు, పండ్లు మున్నగునవి. తోచినప్పుడు తోచినది తినుచుండవలసినది, కాఫీ చేసికొని త్రాగుచుండవలసినది, వ్రాయుచుండవలసినది. సంధ్యావందనము కూడ చాల వడిగా పూర్తిచేసికొనెడివారు. అనంతపద్మనాభ చతుర్దశి వ్రతము మాత్రము ఓపికగా సాంగోపాంగముగా చేయుచుండిరి. ఆముక్తమాల్యద వ్యాఖ్యా రచనకు వారికి, ఒక దినమునకు ఇరువది నాలుగు గంటలు చాలెడివి కావు.

తాతగారికి అభిని అలవాటుండెడిది దానిని విధవిధములుగా పుచ్చు కొనెడివారు కొంత గిల్లివేసికొనుట, దానినే నీటిలో కాఁచి ఆ నీటిని త్రాగుట. ఏదైన లేహ్యములోనో హల్వాలోనో పెట్టుకొని పుచ్చుకొనుట - ఈవిధముగా కాడ్లీవరాయిలు ఎన్ని రకములు గలవో, వారు రుచిచూడనివి లేవు. ఏవేవో టానిక్కులు, మందులు, తమకుండు విద్యాపరిశ్రమకు ఇవన్నియు ఆవశ్యకము లని యనెడువారు.

నడుమ నడుమ తాతగారి దర్శనమునకు ఎందరో మిత్రులు వారి శిష్యులు, దర్శనార్థము పండితులు, ఒకరు గారు ఈ కాలహరణము కూడ వారికి అప్పుడప్పుడు కష్టముగానే యుండెడిది. నాటకాల శిష్యులు వచ్చినప్పుడు మాత్రము వారి యానందమునకు మేర లేదు వారితో సమానముగా వీరును యువకులైపోయి, ఆడుచు పాడుచు ఆ పాత్రల నన్నిటిని అభినయించి చూపెడివారు. నెల్లూరి ఆంధ్రభాషాభిమాని సమాజముపై వారికి ప్రాణము కొందఱు మిత్రులు వారి కాఫీసమయము చూచి వచ్చెడివారు. వారు స్వయ ముగా చేసికొను కాఫీరుచి ప్రత్యేకము మేలురకము పీబెర్రీ విత్తనములు వేయించునప్పుడు వచ్చునట్టి సువాసన త్రాగు కాఫీలో వారు తెప్పించెడివారు. ఒకమాడు వారే అన్నారు "మీకంతా కాఫీ చెయ్యడం ఏం వచ్చునురా, ఇట్లా తే" అని ఇంటిలో ఎవరో వేసిన డికాక్షనే తీసికొని, పాలు చక్కెర కలిపి

ఇచ్చినారు. అద్భుతముగా నుండినది "చూచావా! ఇది ప్రపోర్షన్ తెలిసి కలుపుకోవలె" అని అన్నారు. నాటకములకొఱకు అప్పుడప్పుడు నెల్లూరికి పోయెడువారు. మదరాసులోను నెల్లూరిలోను వారు శిష్యులకు నేర్పి ఆడించుచుండఁగా ఎన్నిపర్యాయములు చూచితినో! మదరాసునుండి మహానది వఱకును, కన్యాకుమారినుండి కర్ణాటకమువఱకును పండితులు వారిని నిరంతరము దర్శించి సాష్టాంగములు పడుచుండుట నేను ప్రతిదినము చూచుచుండిన దృశ్యము

ఇంటిలో గాని, వీధిలో గాని ఒక్కొక్కప్పుడు ఏదో ధ్యానములో తన్మయులగుటయు నుండెడిది మదరాసులో ఆ కాలమున బస్సులు లేవు ట్రాము బండ్లుండెడివి ఒకమారు వారు మాత్రము నడిచి పోవుచుండఁగా వారికి సమీపమున ట్రాముకారు చాల వేగముగా వచ్చుచుండినదట, ట్రాము కారు గంటలుగాని, డ్రైవరు కేకలు గాని వారికి వినఁబడలేదు దగ్గరికివచ్చి ఆ డ్రైవరు వారిని పట్టి ఆవలికి నెట్టువఱకు వారికి తెలియలేదు అదరిపడి తప్పించుకొనిరి

అచ్చాఫీసు విక్రయించిన తర్వాత తాతగారికి శిష్యుల ప్రోద్బలమున నెల్లూరికే పోయి యుండవలయునని తోఁచినది 1922 వేసవిలో నెల్లూరికి వచ్చితిమి పనిలో పనిగా తాతగారు నా విషయములో ఏమఱలేదు నాకు ఆటలమీఁదికంటె చదువులమీఁద శ్రద్ధ యుండుటను గ్రహించి, మదరాసులో నుండఁగానే ఒక దినము ట్రాముకారులో పిలుచుకొని పోయి, బొమ్మలతోడి కథల పుస్తకములు కొన్ని డజనులు, ఒక్కపర్యాయముగా కొని యిచ్చిరి. నాకు ఆశ్చర్యము, అన్ని పుస్తకాలు, ఒక్కమారు, కథలు, బొమ్మలు - తెలుఁగు, ఇంగ్లీషు ఇంటికి వచ్చి అది పనిగా అన్నిటిని చదివి, తాతగారికి, నాయనమ్మకు, అమ్మకు చెప్పసాగితిని మా నాయనగారికి ఏవో సొంత పనులు, నిరంతరము ఏదో వ్రాత వారి వ్రాఁతయు భాషయు చక్కఁగా నుండెడివి. మంచి ఇంగ్లీషు వ్రాసెడివారు కాని వారికిని అభిని అలవాటైనది వారిధి సాండోస్ డంబెల్స్‌తో ఎక్సర్‌సైజులు చేసిన శరీరము, గొప్ప

ఫుట్‌బాల్ ఆటగాఁడుగా ప్రసిద్ధుఁడు. కాని ఎందుచేతనో 1921 నుండి శ్వాస కాస ఏర్పడినది. అంత శరీరము వెన్నవలె కరఁగిపోసాగినది.

నెల్లూరికి పోయితిమి గదా! నెల్లూరిలో మా చినతాతగారు వేదము వెంకటాచలముగారు పొగతోటలో పెద్ద బంగళా కట్టుకొని అందు నివసించుచుండిరి. మామూలుగా మేము అక్కడికే పోవువారము రంగనాయకుల పేటలో తాతగారికి శిష్యు లొక యింటిని కొనియిచ్చుటకు సంకల్పించిరి. వెంటనే డబ్బు లేదు తాతగారి డబ్బు అయిపోయినది. పుస్తకముల విక్రయము నమ్మఁదగియుండలేదు శిష్యులు తాతగారి పేరనే అప్పు పుట్టించి, మదరాసు యింటిని నెల్లూరి యింటిని తాకట్టు పెట్టి అప్పుచేసి ఇంటిని కొనిరి. అప్పు, నెమ్మదిగా డబ్బు, చందాలు వేసికొని, వసూలుచేసి తీర్పవలయునని శిష్యుల సంకల్పము. ఏమైన నేమి క్రొత్త పరిసరములు తాతగారి దర్శనమునకు ఎవరో యొకరు శిష్యులు నిరంతరము వచ్చుచుండువారు గునుపాటి ఏనాది రెడ్డిగారు, రేబాల సుందరరామరెడ్డిగారు, పొణకా వీరారెడ్డిగారు, పొణకా కనకమ్మగారు, తూములూరు శివరామయ్యగారు, మైదవోలు చెంగయ్యపంతులు గారు — ఇటువంటి వా రెందఱో వచ్చుచునే యుండువారు నాటకములాడు శిష్యులు సాయంకాలము వచ్చెడువారు నడుమ సంస్కృతాంధ్ర కావ్య నాటకములు పాఠము చదివెడు శిష్యులు అదొక విధమైన సంస్థగా నుండెడిది. వివరములు ఎన్నియైనను చెప్పవచ్చును. తాతగా రేదో ట్యూషనులు చెప్పుచున్నారని కొందఱు తెలియనివారు తలఁచుట కూడ సంభవించినది దమ్మిడీ ఆదాయము లేదు, క్షణము తీరిక లేదు ఎట్లో సందుచేసికొని వ్రాసికొనుచుండువారు 'ఆ ముసలాయన ఎప్పుడు చూచినా పుస్తకము, పేనా చెయ్యిగా ఉంటాడు గాని ఒక్కనిమిషం ఊరోడే! గుడికన్నా పోతాడా?' అని ఆశ్చర్యపడుతారు. చదువే గుడి జ్ఞాని. వారికి ఈ బాహ్యాపూజ లేల?

"నేనుమాత్రము నిరంతరము తాతగారిచెంత నుండవలసినదే వారి ప్రవచనము నా చెవిలో పడుచునే యుండెడిది. తమకు సమీపములోనే నేనును

నా తమ్ములును ఉండునట్లు ఉపాయములు కల్పించెడివారు. వారి బీరువలో బిసకత్తులు, ద్రాక్షపండ్లు, డబ్బిపాలు ఎప్పుడును ఉండెడివే. "ఒరేయి, నువ్వు ఇప్పుడు నా దగ్గిరకు రాకూడదు పిల్లలెవ్వరు రాకూడదు నేను బిసకత్తులు తినబోతున్నాను" అని అనెడువారు పిల్లలు రాకుండ నుండగలరా? రాకూడదని దీని యభిప్రాయమా? వీని కొఱకైనను మేము తాతగారిని వదలువారము కాము సమయము వచ్చినప్పుడు మాతో సమానముగా ఆడు కొనువారు బొంగరము త్రిప్పుటలో వారినేర్పు మాకు లేదు. చదరంగము ఒకప్పుడు చాల చక్కఁగా ఆడుచుండిరట! తర్వాత కథలు చెప్పెడివారు- తాతగారు గొప్ప గురువులే వారికి తెలియని కథలా! ఎన్ని కథలో, ఎన్ని పాటలో, ఎన్ని పద్యాలో, ఎన్ని దరువులో, ఎంత చమత్కారమో, ఎంత హాస్యమో, బొబ్బిలిపాట, దేశింగురాజుపాట ఇవి వారు పాడగా వినవలెను. జానపదవాఙ్మయము తాతగారుగాని, వారిసోదరులుగాని విని ఆనందించి అను భవించినంత మరెవ్వరునూ చేయలేదనుటలో అతిశయోక్తి కాదు

రంగనాయకులపేటలో అప్పుడప్పుడు వీధినాటకాలు యక్షగానములు ఆడువారు ఒకనాడు తెల్లవాఱువఱకు వీరభద్ర విజయము ఆడిరి. నెల్లూరిలో చుట్టుపట్టుల ప్రసిద్ధులైన నటీనటవర్గము నాఁడు పాల్గొనెను. మా యింటికి నాలుగవ యింటివాకిట తెర కట్టినారు మా యింటి ముందునుండి చక్కఁగా తెలియుచుండినది తెల్లవారువఱకు తాతగారు చూచి ఆనందించి "బాగా వేశాడ్రా, వా డెవడో, మన్మథుడి వేషం" అన్నారు. ఇక్కడ ఒకమాట. తాతగారు ఇంటిలోగాని, బజారులోగాని గ్రాంథికము మాటలాడగా నేను విన లేదు. శిష్యులతోను లేదు ఎవరైన విద్యాదర్పముతో వారి కడకు వచ్చిన, వారితో మాటలాడెడివారేమో!

మదరాసులో నుండఁగానే తాతగారు క్షవరము విషయములో ఉదాసీనులు కాఁజొచ్చిరి. రెండుమూడు నెలల కొక పర్యాయము క్షవరము చేయించు కొనెడువారు "గంటసేపు మంగలవాడివద్ద కూర్చోలేనురా" అనెడువారు

"నా తల చాల సుకుమారంరా. సన్న్యాసులకు బ్రహ్మరంధ్రం పగిలి ప్రాణం పోతుందట, యోగంవల్ల అటువంటిది నా తల. అంత సూక్ష్మం కత్తి తగిలితే మండుతుంది" అన్నారు. నెల్లూరికి వచ్చిన కొద్దిరోజులకే శ్రీ ద్వారకా శారదాపీఠ శంకరాచార్యులవారు తాతగారికి చాల సత్కారము చేసిరి "మహామహోపాధ్యాయ, విద్యాదానవ్రత మహోదధి, పండితరాజ, వేదవేదాంగ శాస్త్రజాల మహోదధి సనాతన ధర్మరత్నాకర, సర్వతంత్ర స్వతంత్ర" అను బిరుదు లిచ్చి, నెలకు నూటయేబది రూప్యములు మఠమునుండి ఇచ్చునట్లును ఏర్పాటు చేసిరి. సభ చాల వైభవముగా నెల్లూరిలో జరిగెను ఆ తర్వాత ఎందుచేతనో స్వాములవారి ఏర్పాటు జరుగలేదు. తాతగారికి ఆర్థిక దుఃస్థితు లేర్పడినవి. ఆ వెంటనే నెత్తురుభేదులు ఏర్పడినవి రెండు మూఁడు నెలలు మంచముననుండిరి. తమకు అవసానకాలము వచ్చినదని, తాతగారును, ఇంటిలో అందఱును భయపడిరి క్రమముగా ఎట్లో తేరుకొనిరి ఆ సందర్భములో వారికి రెండుకాళ్ళును వాచినవి. ఆ వాపు 1929 లో తాతగారు చనిపోవువఱకు నుండినది. అది మొదలు అనారోగ్య ప్రారంభము, కష్టదశ. మఱి రెండు నెలలు దాఁటకముందే, అనఁగా 1922 డిసంబరులో మా నాయనగారు, శ్వాస కాస వ్యాధి యెక్కువయై తటాలున రెండుదినములు బాధపడి చనిపోయిరి. వయస్సు 37 సంవత్సరములే. తాతగారికి ఇది పెద్దదెబ్బ. అది మొదలు వారు ఎంతో మారిపోయినారు "ఒరే, నాకుకూడా ముసలితనం వస్తుందని నేను అనుకోలేదురా" అని ఒకమారన్నారు. అంత ఆరోగ్యవంతులుగా, అంత దృఢగాత్రులుగా నుండినవారు నిముసములో ఎంతో మారిపోయినారు. శృంగార నైషధములో రేబాల లక్ష్మీనరసారెడ్డిగారితో కూర్చుండి కనఁబడుస్వరూపము పూర్తిగా మారిపోయినది ..

తర్వాత 1926 వఱకు నెల్లూరిలోనే యుంటిమి తాతగారికి ఇఁక చదువులు జరుగుటకు బదులు దిగులు ప్రారంభమైనది మేము పిల్లలము, మా భవిష్యత్తు ఒకటి ఇంటిమీఁది అప్పు రెండవది ఆముక్తమాల్యద ముద్రణము మూఁడవది తమకా వయస్సు డెబ్బది దాఁటినది పాఁత

పుస్తకాల విక్రియమే వరుంబడి. పుస్తకముల స్టాకు మదరాసులో, మేము నెల్లూరిలో పుస్తకములా బైండు కానివి. వానిని చూచుకొను దిక్కులేదు మా నాయనమ్మకు దాదాఁపు అఱువది యేండ్ల వయస్సు మదరాసు నెల్లూళ్ళ మధ్య ప్రయాణముచేయుచు, పుస్తకములు బైండు చేయించి, వాని విక్రియ మునకు ఏర్పాటు చేయించెడిది. మదరాసు ఇంటిని అద్దెకిచ్చి కొంత వరుమానము వచ్చునట్లు చేసినది ఒక నిముసము వృథాపోనీయక, ఒక పురుషుఁడు కాదు నలుగురు పురుషుల పని, ఆమె ఒక్కతే నిర్వహించెడిది. ఎంత పెద్ద బిల్లునైనను, ఎన్ని వందల రూపాయలకైనను నోటిలెక్కగా, సరిగా, ఆమె కమీషను త్రోసి మొత్తమింత యని చెప్పెడిది పుస్తకములకు వచ్చినవారు అరగంట కాగితముమీఁద లెక్కవేసికొని, 'అంత సరిగ్గా, అంత త్వరగా ఎలా చెప్పగలిగారమ్మా?' అని ఆశ్చర్యపడెడివారు 'మాది చిన్నప్పటి వీధిబడి చదువు గ్రామంలో చదువుకొన్నది పాతికలు పరకలు కూడా ఎక్కాలు చెప్పేవారు మీకవి చెప్పరు కాబట్టి లెక్కలు రావు' అని ఆమె చెప్పెడిది

అచ్చాపీసు పోయినది. బైండరులు ఇంటికి వచ్చి పనిచేయుట పోయినది కాని బైండరులకు పుస్తకాలు సరిచూచి గదా బైండున కీయ వలయును! మదరాసుకు పోయి రాత్రులు కూడ రెండు మూఁడు గంటల వరకును, లేక ఒక్కొక్కప్పుడు తెల్లవాఱువఱకు కూడ, దీప ముంచుకొని కంపోజుచేసి, తప్పొప్పుల పట్టికలు ఎక్కడ పెట్టవలయునో అక్కడ పెట్టి సిద్ధము చేసెడిది నేనును అప్పుడప్పుడు మదరాసుకు నాయనమ్మతో వచ్చెడి వాఁడను.

తాతగారికి నెల్లూరిలో నేను లైబ్రేరియన్. ఏ పుస్తకము కావలెనన్నను ఎత్తి యిచ్చుట నా పని ఒక్కొక్క పుస్తకమునకును రెండు మూఁడు పేళ్లు. వారేమి అడుగుదురో నా కొక్కనికే తెలియును. తాతగారి దగ్గరికి వచ్చిన వారికి ఆశ్చర్యము పుస్తకము పేరో, కవి పేరో, అందలి ప్రధానాంశమును బట్టి యేదో చెప్పి పెట్టువారు మాఘము అఁనగా శిశుపాల వధ అన్నట్లు.

రత్నావళికి బదులు సాగరిక అనువారు. చక్కఁగా చదివినవారికి కూడ తటాలున ఫలానిది అని స్ఫురింపదు తమ తాళపుచెవులకు కూడ పేర్లు పెట్టి యుండిరి ఒక తాళపుచెవికి "కాకామూకన్" అని తమిళపేరు పెట్టిరి కాకి ముక్కువంటి ముక్కు గలదని యర్థము జాబులలో 'నా కాకామూకన్ తేవలసినది' అని వ్రాసెడివారు. మా గృహభాష తమిళమే కాని ఎప్పుడో గాని తమిళములో మాటాడువారు కారు.

రంగనాయకులపేటలో మేము చిన్న తరగతులలో చదువుకొను కాలములో మరల నన్ను నా తమ్మునిని తాతగారు తెల్లవారుజామున నిద్రలేపి పండ్లుతోముకొనుటకు ఒక అరగంట ముందు అమరము శబ్దమంజరి హితోప దేశము చెప్పుచుండువారు మా కర్థమైనను కాకపోయినను మాచేత తెనుఁగు పద్య కావ్యములు చదివించి వినెడివారు. శిష్యు లెవరైన వచ్చినవెంటనే మాకు విడుదల సాయంకాలము నాటకాల రిహార్సల్సు జరిగినచో మాకు అదొక వినోదము

నాకు జ్ఞానము వచ్చినది మొదలు మదరాసులోను, నెల్లూరిలోను తాతగారి నాటకములను లెక్కలేని పర్యాయములు ఆడఁగా చూచితిని ప్రతాప రుద్రీయము, శాకుంతలము, బొబ్బిలి యుద్ధము, రత్నావళి, విక్రమోర్వశీయము ఇవి ఎక్కువగా చూచితిని ఉషాపరిణయమును నేను పెద్దవాడనైన వెనుక ఆడలేదు ఉత్తరరామ చరిత్ర ఒకమారే ఆడినట్లే నాకు జ్ఞాపకము గాని నేను చూడలేదు ప్రియదర్శిక ఎప్పుడు ఆడినారో తాతగారి మాళవికమాత్రము ఆడలేదు. తాతగారి శిష్యులు దొరస్వామయ్యంగా రనఁబడు కందాడై శ్రీనివాసన్‌గారు దుష్యంత ప్రతాపాది పాత్రలు ధరించెడివారు తర్వాత విడి పోయి మరల సమాజములో జైలునుండి వచ్చిన తర్వాత (వారు కాంగ్రెసు వాది) చేరి తాతగారి నాటకము లాడగా చూచితిని. తనకు ఎదురుతిరిగిపోయిన వారు మరల వచ్చి ఆశ్రయించినప్పుడు ఎంతో కనికరించి ఆదరించినారు దొరస్వామయ్యంగారు మొదట జబ్బుపడి తేరుకొని తమ ఆర్థిక పరిస్థితులను చక్కఁబెట్టుకొనుటకు శాకుంతల ప్రతాపరుద్రీయాదుల నాడిరి మొదటి

ప్రదర్శనమునకు మంచి వసూలే యైనది గాని తర్వాత నష్టము వచ్చినది. వారును చిన్నవయసులోనే 1923లో కాఁటోలు గతించిరి. అప్పటి తాతగారి చిత్తవృత్తి వర్ణనాతీతము

ఆ సంవత్సరమే యనుకొందును తాతగారు నూజవీడులో జరిగిన యొక సారస్వత సమావేశమునకు అగ్రాసనాధిపతిగా పోయిరి కూడ నన్ను కొనిపోయిరి. ఐదు దినములు జరిగినది. అది యొక అమోఘమైన దృశ్యము. నాఁటి అనుభవములు నాకు కొంత జ్ఞాపక మున్నది తాతగారితో నుండినందు వలన రైలు ప్రయాణములోను, కారు ప్రయాణములోను, వారి శిష్యులు, నూజవీడు, ఏలూరు ప్రాంతాలవారు వారికి చేయుచుండిన మర్యాదకు తగినట్లు నన్నును ఆదరించుచుండిరి నెల్లూరినుండి మమ్ము ఎవరో పిలుచుకొని పోయిరి. మధ్య నండూరు వెంకట సుబ్బారావుగారు తమ ఎంకిపాటలను తాత గారికి వినిపించుటకు మాతో కలసిరి. ఎడతెంపులేని సాహిత్యగోష్ఠి నూజ వీడుకు పోయిన తర్వాత ఒక పెద్ద మేడలో మాకు బస ఎందరో కవులు, పండితులు, రచయితలు, ఎక్కువగా నాఁటి యువకవులు వచ్చియుండిరి. ఆ దినములలో భావకవిత్వపు నినాదములతో దేశము మారుమ్రోగి పోవు చుండినది తాతగారి అభిప్రాయములు సమరసములు కొమ్ములు తిరిగిన సమకాలిక పండితులను దాక్షిణ్యములేక విమర్శించిరి. శబ్దము, దానివ్యుత్పత్తి, అర్థము, వ్యాకరణాంశములు, రసము, శైలి అన్నిటిలోను తర్వాత యువ కవులలో గుణమును గ్రహించి ఆదరించిరి. ఏ నూతన ప్రక్రియను గాని, విధానమునుగాని వారు నిరసింపలేదు. నూతన మార్గప్రియులు. నాటకములలో పాత్రోచితభాషకు మార్గమును వారే కల్పించిరి. ఎందఱో పండితులు పాత్రో చిత భాషాసిద్ధాంతమును ఎదిరింపఁగా వారిని డీకొని తమ సిద్ధాంతమును నెలకొల్పిరి భాషను సంపూర్ణముగా వ్యావహారికమయము చేయుటకు వా రంగీకరింపలేదు. ఒక్కొక్క రచనకును భాషలో అవకాశము కల దనినారు బొబ్బిలిపాటను మెచ్చుకొన్నవారే గదా పాఠశాలలలోను, కళాశాలలలోను నిర్బంధ గ్రామ్యము పనికిరా దన్నారు వా రేది చెప్పినను ప్రామాణికముగా

నుండును. ఈ నూజవీడు సమావేశములో ఒక దినము వారియెదుట భావ కవిత్వమును ప్రస్తావించిరి. అచ్చట టౌనుహాలులో ప్రొద్దున మీటింగు. బసలో మధ్యాహ్నము గోష్ఠులు. మరల సాయంకాలము టౌనుహాలులో ఉపన్యాసములు ఒకదినము మధ్యాహ్నము కాఫీ త్రాగిన యనంతరము గోష్ఠిలో భావకవిత్వమును ప్రస్తావింపఁగానే తాతగారు దానికి నిర్వచనము చెప్పుఁ డని అచ్చటివారిని కోరిరి. ఒక్కొక్కరు మాటలాడిరి. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు అందరికన్న నెక్కుడుగా పాల్గొనిరి నాలుగుగంటలు కావచ్చినవి. ఎవరికిని నిర్వచనము కుదరలేదు. "సరి, మనకు నిర్వచనము కుదరలేదు. సాయంకాలపు ఉపన్యాసములో నాకు తోఁచినది మాటలాడెదను" అని తాతగారు గోష్ఠిని నిలిపిరి

సాయంకాలము సభ క్రిక్కిరిసి పోయినది ఊరిలో పండితులలో భావకవిత్వము యొక్క గతి యేదో, అటో యిటో, తేలిపోవునని అందఱును గుమిగూడిరి తాతగారు మాటలాడుచు, తమకును నిర్వచనము కుదురలేదనియు కాని తమకు పెద్దలు నేర్పిన చదువునుబట్టి "వాక్యం రసాత్మకం కావ్యం" గాన, భావకవిత్వమునకు చూపునట్టి ఉదాహరణములలో రసముండుటచేత, కావ్యత్వము కలదుగాన, ఇవన్నియు నిలువ గలవు - అనియు, ఎంకిపాటలు ఆచంద్రార్కస్థాయిగా ఉండగలవనియు శ్లాఘించి ఉపన్యసించిరి సండూరి సుబ్బారావుగారి సంతోష మటుంచి ఆ దినము తమతమ ఉపన్యాసములను ప్రారంభించునపుడును, ముగించిన తర్వాతను తాతగారికి సాష్టాంగముగా నమస్కరింపని ఉపన్యాసకుఁడు లేఁడు. ఆ దినము, నాఁటి యువకవులు పొందిన హర్షము చెప్పఁదరము గాదు.

ఆ తర్వాత తాతగారికి గద్వాలు సంస్థానమునకు రావలసినదని ఆహ్వానము వచ్చినది అంతకుముందు జటప్రోలు సంస్థానమునుండి వచ్చి శ్రీ వెల్లాల సదాశివశాస్త్రిగారు కొన్ని నెలలు తాతగారికి, ఆ సంస్థానపు పూర్వ ప్రభువులు వ్రాసిన చంద్రికాపరిణయమును వినిపించి, పునర్ముద్రణోచితము చేసికొని పోయియుండిరి. గద్వాలులో తాతగారు మూఁడు నాలుగు

నెలలుండిరి. చాల సన్మానము జరిగినది తాతగారి పాండిత్యమును ధారణా శక్తిని చూచి ఆ యాస్థానపండితులు వీరవైష్ణవులు శ్రీమాన్ పుల్లగుమ్మి వెంకటాచార్యులుగారు, శ్రీనివాసాచార్యులు మొదలైనవారు తాతగారికి సాష్టాంగముగా నమస్కరించి "మేము వీరవైష్ణవులము. స్మార్తులకు నమస్కరింపము తాము సాక్షాత్తు సరస్వతి అవతారముగా నున్నారు కాఁబట్టి నమస్కరించుచున్నారము" అని రఁట వారు వ్రాసిన శ్లోక మొకటి -

"ఈదృగధీతీశాస్త్రే, గైర్వాణగ్రన్థజాలే చ,
అన్ధ్రగ్రన్థేషు తథా, నహి దృష్టః శ్రుతచరోవాఽపి"

1926 కు మరల మదరాసునకే వచ్చి చేరితిమి. ఆముక్తమాల్యద ముద్రణము సాగుచు, నిలిచిపోవుచు, మరల సాగుచు నుండినది. తాతగారికి రెడ్డి మిత్రులును, శిష్యులును ప్రయత్నించు చుండిరి రంగనాయకులపేట వాస్తవ్యులు, మన మద్రాసు తాత్కాలిక గవర్నరు, జస్టిసు చంద్రారెడ్డిగారి బావగారు, కీ.శే. శ్రీ ములుమూడి నారాయణరెడ్డిగారి సిఫారసుమీఁద శ్రీ యెఱ్ఱబోలు రామచంద్రారెడ్డిగారు కొన్నివేల రూపాయలు సాయముచేసి ఆ గ్రంథ ముద్రణమును పూర్తి చేయించిరి 1927 లో అది వెలువడినది. ఆ వెనువెంటనే శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు తాతగారికి "కళాప్రపూర్ణ" బిరుద మిప్పించిరి. తాతగారికోసమే ఏర్పాటు చేయఁబడిన దా బిరుదు.

కాని, తాతగారు చాల పెద్దవారైపోయిరి. 74 సంవత్సరములు. సాయము లేక ఎచ్చటికిని పోలేకుండిరి ఏ కారణముచేతనో మా కందఱకు నిరంతరము తమ బాల్యచరితాదికమును చెప్పుచుండువారు. అదంతయు గ్రహించి నేను పెద్దవాఁడనై వారి చరిత్రమును వ్రాయుదునని ఎంతమాత్రము తలఁచియుండరు. కాని ఆ విషయము లన్నియు నా హృదయములో గాఢముగా నెలకొన్నవి. ఇంకను ఎంత విషయ మున్నదో! తగిన వయసు, జ్ఞానము నుండియుండిన వారిచెంతనే ఎంతో వ్రాసికొనియుందునుగాని నాకు బుద్ధి వికసించుటకు ఆరంభించుటకు ముందే వారు గతించిరి.

తాతగారి నిర్యాణమునకు ఆఱునెలలు ముందే వారి తల్లిగారు గతించుట అంతవరకు జీవించియుండిరి. 102 సంవత్సరములు శ్రీగునుపాటి యేనాదిరెడ్డిగారు ప్రయత్నించి నెల్లూరు జిల్లాలో సంచరించి, తమ బంధువుల కడ నుండియు, మిత్రులకడనుండియు పదివేల రూప్యముల వఱకును వసూలు చేసి తాతగారి, ఆ యింటి మీఁది, ఋణమును తీర్చిరి తర్వాత ఇంకను వసూలు చేసి తాతగారికి కనకాభిషేకము చేయించి గొప్పగా సన్మానింప దలంచుకొనుచుండఁగా తాతగారి నిర్యాణము అశనిపాతమువలె వారి యుద్యమమునకు భంగము కలిగించినది మిగిలిన ద్రవ్యమును మాకే యిచ్చుచుండిరి

తాతగారి చరిత్ర నేను ఇదివరలో వ్రాసినది చాల సంగ్రహము. దానిని పెంచి వ్రాయవలసియున్నది. తాతగారికి వారి తండ్రిగారు 1870 ప్రాంతము నుండి వ్రాసిన జాబులు మొదలు, తర్వాత శ్రీ పూండ్ల రామకృష్ణయ్య గారు, శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారు, శ్రీ గురుజాడ అప్పారావుగారు మొదలైనవా రెందరో వ్రాసిన జాబులున్నవి వారు ప్రకటించు నుద్దేశముతో ఆంధ్ర భారతము మొదలు ఎన్నో ప్రబంధముల వఱకు సరిచూచి యుంచుకొన్నవి కలవు అట్లే సంస్కృత కావ్యనాటకములుకూడ ఆ పనిలో కొంత మాత్రమే నేను చేయఁగల్గితిని. ఇంకను ఎంతైనను ఉన్నది దేవుఁడు అనుగ్రహించిన పూర్తి చేయఁగలనని నమ్ముచున్నాను

ఇప్పటికే నా యుపన్యాసము దీర్ఘమైనదని తలంచుచున్నాను పెద్దలు ఎదురు చూచినదేదో, నేను చెప్పినదేదో, తాతగారిని గూర్చిన ఉదంతములు ఎన్నియో గలవు. వారి పాండిత్యము, ప్రతిభ, సద్యఃస్ఫురణము లన్నిటిని మించిన సమయోచిత ప్రవర్తనమును వానిలో తెలియును. పరమశాంతమూర్తి, కాని కోపము వచ్చిన అగ్నిపర్వతమే వారిది దాక్షిణ్య మెఱుఁగని విమర్శ ఐనను కపట మెఱుఁగని మైత్రి తాతగారికిని వారిని గుఱించి మాటలాడుటకు నాకును ఈ యవకాశమిచ్చిన ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ వారికి ఇవే నా కృతజ్ఞతలు.



# వేదము వేంకటరాయ శాస్త్రులవారి రచనలు

-డాక్టర్. దివాకర్ల వేంకటావధాని

స్వయంకృషిచే నాంధ్ర గీర్వాణ భాషలయం దసాధారణ వైదుష్యము గడించి, ఆంగ్ల తమిళము లందుఁ గూడ నద్వితీయ పండితులై, పెక్కు విమర్శలు, వివరణములు, సంస్కృత నాటకానువాదములు, స్వతంత్ర నాటకములు, వ్యాఖ్యలు, టీకలు, లక్షణ గ్రంథములు, వచనరచనలు సంతరించి, మహోపాధ్యాయ, మహా మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, సర్వతంత్ర స్వతంత్రేత్యాది సార్థక బిరుద పట్టవిభ్రాజితులై, బహుసహస్ర ప్రమితులైన అంతేవాసుల కాచార్యులై, అజ్ఞాత పరాజయులై, ఆజీవితాంత మాంధ్ర సంస్కృతముల కపార సేవ కావించిన విద్వత్కవిసింహులు కీ.శే. వేదము వేంకటరాయశాస్త్రులవారు. భవభూతివలె వారెంత కవులో అంత పదవాక్య ప్రమాణపారీణులు, మల్లినాథసూరివలె వారెంత పండితులో అంత సహృదయ శేఖరులు కవితాపాండితు లొక్కచోఁ గూడియుండ వను ప్రవాదమున కపవాదభూతులై ఆమోహనవాణుల నిరువుర దాక్షిణ్యమున నేలుకొనఁజాలిన రసికపుంగవులు వారు వారి రచన లసంఖ్యాకములు: అందు వారు ప్రదర్శించిన పాండితీ కవితా కళాకౌశల మపారము: దాని నంతను చూఱుబుచ్చు సామర్థ్యము నాకు లేమి, నందందుఁ దోఁచిన విశేషములను మాత్రము విన్నవింప యత్నించెదను.

1919 వ సంవత్సరమున మదరాసులో జరిగిన ఆంధ్ర సారస్వత సన్మాన సభలో శ్రీ శాస్త్రులవారు తమ వాగ్దేవతా పూజలో "ఆవాహనము శ్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణము, ఆసన సమర్పణము కథా సరిత్సాగరము, అర్ఘ్యము ప్రతాపరుద్రీయ నాటకము, పాద్యము మేఘసందేశాంధ్ర టీక, అలంకార మాంధ్ర ప్రసన్నరాఘవ నాటకాదివిమర్శ కింకిణీగణశింజాన శారదాకాంచిక, నైవేద్యము శృంగారనైషధ సర్వంకష వ్యాఖ్య" అని తెలిపి

యుండిరి. నిజమునకు వారి వాగ్దేవతావరివస్యలో నైవేద్యభూతము కావలసిన దాముక్తమాల్యద టీక అప్పటి కింకను అది రచింపఁబడియుండని కతమున సర్వంకష అవసర నైవేద్యముగా చెప్పఁబడినది పైని శ్రీ శాస్త్రిలవా రుపచారములుగా పేర్కొనిన వారి రచనలలో నొక్కొక్కటి యొక్కొక్క వర్గమునకు ప్రతినిధిగా నున్నది వానిలో మొదటిది శ్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణము ఆ కాలమున సంస్కారప్రియులైన శ్రీ వీరేశలింగం పంతులు గారును వారి మిత్రులును వితంతు వివాహములకు శాస్త్రనిషేధము లేదనియు, వాని నెల్లరును నిశ్శంకముగా చేయవచ్చు ననియు, నుపన్యాసము లిచ్చుచు, వ్యాసములు వ్రాయుచు, ప్రచారము కావించుచుండిరి అది చూచి సనాతన మతాభిమానులైన మదరాసులోని పెద్దలు కొందఱు ప్రోత్సహింపఁగా శ్రీ శాస్త్రిలవారు బహుశాస్త్రగ్రంథ పరిశోధనము కావించి క్రొత్తగా స్థాపింపఁ బడిన హిందూసభ పక్షమున నా సంస్కారప్రియుల వాదములను ఖండించుచు విధవా వివాహము శాస్త్రసమ్మతము కాదని యుపన్యాసము లొసంగఁ దొడంగిరి. ఆ యుపన్యాసముల లిఖితరూపమే వారి ప్రథమ రచనమైన శ్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణ మను విమర్శ గ్రంథము సారస్వతముగా దీని కంత విలువ లేకపోయినను దీనివలన శ్రీ శాస్త్రిలవారి పాండితీ ప్రతిభలు లోకము నకు వెల్లడి యగుటయు, మదరాసులో పలువురు పెద్దలు వారికి మిత్రు లగుటయు సంభవించెను అందుచే నిది వారి వాఙ్మయజీవిత విహాయసమునం దుదయించిన తొలితారగా నెన్నఁదగి యున్నది.

శ్రీ శాస్త్రిలవారి తరువాతి రచనలు ప్రక్రియా ఛందస్సు, అలంకార సార సంగ్రహము అను లక్షణ గ్రంథములు. ఇందు మొదటిది ఛందశ్శాస్త్ర మునకును రెండవ దలంకార శాస్త్రమునకును సంబంధించినవి ప్రక్రియా ఛందస్సును గూర్చి కీ శే శ్రీ పూండ్ల రామకృష్ణయ్య పంతులుగా రీ పుస్తకము రూపునఁ గడు చిన్నదైనను గుణాతిశయములచేఁ బెద్దదనియే యెన్నఁదగి యున్నదని తమ అభిప్రాయమును వెల్లడించియున్నారు. రెండవదైన అలంకార సార సంగ్రహమున శ్రీ శాస్త్రిలవారు చంద్రాలోకము, ప్రతాపరుద్రీయము

మున్నగు లక్షణ గ్రంథముల నవలోకించి తత్సార మంతయు నిమిడునట్లుగా 108 అలంకారములను వివరించియున్నారు. ఇందు లక్షణములును లక్ష్యములును పద్యరూపమున నున్నవి తరువాత వానికి సర్వ సుబోధమైన చక్కని వివరణము వ్రాయఁబడినది 1924వ సంవత్సరమున శ్రీ శాస్త్రిలవారు గద్వాల రాజుగారిని దర్శింప నరిగినప్పు డచ్చటి పండితులుకూడ తమ అలంకార సార సంగ్రహమును పరన పారములం దుపయోగించుట గాంచి యానందపారవశ్యము పొందియుండిరి. ఈ గ్రంథ మాకృతిని చిన్నదయ్యు మహాపండితుల మన్ననలఁ గాంచఁజాలుట కందు శ్రీ శాస్త్రిలవారు ప్రదర్శించిన సర్వలక్షణ సమయమును, వివరణ వైశారద్యమును కారణములు. శ్రీ శాస్త్రిలవారు 1910వ సంవత్సరమున భానుమిశ్రుని రసమంజరిని సటీకముగా ప్రకటించిరి రస లక్షణాదులను వివరించు నీ రసమంజరి నాట్యకళా నిష్ణాతులైన కూచిపూడివారి కాదరపాత్రమైన లక్షణ గ్రంథము ఆంధ్రమున లక్షణ గ్రంథములును అలంకారశాస్త్ర గ్రంథములును అసత్కల్పములై యుండుట గాంచి శ్రీ శాస్త్రిలవారు 1921లో విశ్వనాథ కవిరాజ ప్రణీతమైన సాహిత్యదర్పణము నాంధ్రీకరించియుండిరి. ఈ యాంధ్రీకరణమే మూలమున కన్యూనానాతిరిక్తమై శ్రీ శాస్త్రిలవారి శాస్త్రవైదుష్యమును, భావవ్యక్తీకరణ వైదగ్ధ్యమును చక్కగా ప్రకటించుచున్నది. ఇందు లక్షణములు 'సూత్రప్రాయముగను' లక్ష్యములును వివరణమును సులభ సుందరమైన వచనరూపముననను వ్రాయఁబడియున్నవి సంస్కృతమునుండి లక్షణ గ్రంథముల నాంధ్రీకరించినవారికి ఆంధ్రీకరింపఁ దలంచువారికి మార్గదర్శకమైన ఉత్తమ రచన యీ ఆంధ్ర సాహిత్య దర్పణము ఇది శ్రీ శాస్త్రిలవారి నిర్యాణానంతరము 1935వ సంవత్సరమున ప్రకటింపఁబడినది

శ్రీ శాస్త్రిలవారెంత పండితులో అంత విమర్శకులు చాల కాలము వఱకు వా రనవసరముగా నెవ్వరి జోలికిని పోయియుండలేదు. కాని వారు నాగానంద ప్రతాపరుద్రీయ నాటకములను ప్రకటించినతరువాత నసూయాగ్రస్తులును సద్భావరహితులు నైన పండితులు వారిని తీవ్రముగా విమర్శింప

నారంభించుటచే వారును విజృంభించి ఆ విమర్శకుల రచనలను నిశితముగా విమర్శింపఁదొడంగిరి. ప్రతిపక్షుల దుర్విమర్శలకును, దూషణములకును ఫలితముగా వారి విమర్శలందును, ఇంచుక నిందయు పారుష్యమును ప్రవేశించినను అవి నిశిత పరిశీలనమునకును సత్యమునకును నిష్పక్షపాత దృష్టికిని నిలయములై యనేక నూతనాంశములను వెల్లడిచేయుచుండెడివి వారి విమర్శ ధాటికి కొమ్ములుతిరిగిన పడింతులుకూడ నిలువఁజాలకపోవుచుండిరి వారు తమ విమర్శపరంపరకు శారదాకాంచిక యని పేరిడి యందొక్కొక్క విమర్శ నొక్కొక్క కింకిణిగా పేర్కొనుచుండిరి అట్టి కింకిణు లాఱు ప్రకటింపఁబడినవి అందు శ్రీరాయదుర్గము నరసయ్యశాస్త్రిగారును, కొమాండూరు అనంతాచార్యులవారును పరిష్కరింపఁగా ఆనంద ముద్రాలయమువారు ప్రకటించిన జక్కన విక్రమార్క చరిత్రమునకు సంబంధించిన విమర్శ ప్రథమ కింకిణి. ఇది 1898లో అముద్రిత గ్రంథ చింతామణి కనుబంధముగా ప్రకటింపఁబడినది. శ్రీ శాస్త్రిలవారందలి దోషములతోపాటు పరిష్కర్తల అసామర్థ్యమునుగూడ వెల్లడించి జక్కన కవిత్వమందలి కొన్ని విశేషములను ప్రదర్శించియుండిరి రెండవ కింకిణి మీ మ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు రచించిన ఆంధ్ర ప్రసన్న రాఘవ నాటకముపై విమర్శ ఇందు శ్రీ శాస్త్రిలవారు చూపిన విమర్శన విక్రమ మప్రతిమానమైనది ఆ యాంధ్రీకరణము నందలి ప్రతి పదమును విమర్శించి వారది తప్పులతడక యని తేల్చివైచిరి బళ్లారి కవి పండిత సంఘమున నొకప్పుడు కీ. శే. ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు 'Line by line criticisms' అని శ్రీ శాస్త్రులవారి విమర్శలను తూలనాడఁగా వారు "Word by word and syllable by syllable criticisms not line by line" అని బదులు పల్కియుండిరఁట. ఆ ప్రతిపద విమర్శనము ప్రసన్నరాఘవ నాటక విమర్శలో కానవచ్చును ఆ విమర్శను చదివి కీ. శే. విక్రమదేవవర్మ మహారాజుగారు అది కవికల్పద్రుమ మనియు, నీషత్పరుష వచన సహితమైనను నిష్పక్షపాత బుద్ధితోఁ జక్కఁగ పరిశీలించి వ్రాయఁబడిన దనియు, నట్టి పొత్తమును వ్రాయుట సామాన్య పండితుల కలవి

కాదనియు నభిప్రాయ మిచ్చియుండిరి ఈ యభిప్రాయము కొంచె మించు మించుగా శ్రీ శాస్త్రులవారి సర్వవిమర్శలకును చక్కగా నన్వయించును శ్రీ రా. వెంకట సుబ్బయ్యర్‌గారు ప్రకటించిన శ్రీ కాళహస్తి మాహాత్మ్య ముద్రణ విమర్శ తృతీయ కింకిణి. ఇది 1900 వ సంవత్సరమున సూర్యాలోకమున ప్రచురింపఁబడినది గ్రామ్యభాషా ప్రయోగ నిబంధన మను చతుర్థ కింకిణి 1899 వ సంవత్సరమున నెల్లూరి ఆంధ్రభాషాభిమాని సమాజమువారి మహా సభయందు మొదలిగి 1901 లో నక్షరరూప మందినది ఇందు శ్రీ శాస్త్రులవారు గ్రామ్యమును త్యజించు రూపకమే అశాస్త్రీయమైన గ్రామ్యరూపక మనియు, గ్రామ్యమును గ్రహించునదియే అగ్రామ్యమును శాస్త్రీయమునైన సురూపక మనియు సిద్ధాంతీకరించి యుండిరి. పంచమకింకిణియైన విమర్శ యే దను విషయమున రెండభిప్రాయము లున్నవి. అది అముద్రితముగా నుండిపోయిన పాండురంగ మాహాత్మ్య ముద్రణ విమర్శనము కావచ్చు నని యొకరును, ప్రమోదూత భారతిపత్రికలో ముద్రితమైన మోచాకుసుమామోదవిచార మని యొకరును సూచించియున్నారు. అందు పాండురంగమాహాత్మ్యముద్రణ విమర్శనమున ఆ కావ్యములోని కొన్ని సందర్భములందలి పాఠభేదములును, టీక యందలి దోషములును ప్రదర్శింపఁబడినవి మోచాకుసుమామోద విచారము కీ. శే ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి రగడలోని "మోచాకుసుమామోద సువాసిత మలయనగాగత మందానిలమున" అను భాగమునకు సంబంధించిన విమర్శ. శ్రీ శాస్త్రులవారు కందలీశిలీంధ్రములును మోచయు సమానార్థకము లనియు, దానికి పరిమళ ముండదనియు నందుచే మోచాకుసుమామోద మను ప్రయోగప్రకృతి విరుద్ధ మనియు నిరూపించిరి. నెల్లూరు వెంకటగిరి విద్యాశాలాంధ్ర పండితులైన శ్రీ నేలటూరి పార్థసారథి అయ్యంగారు రచించిన ఆంధ్రవ్యాకరణ సర్వస్వము యొక్క స్వరూపమును దెల్పు ఆంధ్ర వ్యాకరణ సర్వస్వతత్త్వము శారదాకాంచిక యందలి ఆఱవ కింకిణి. శ్రీ శాస్త్రులవా రిందలి దోషముల నుటంకించి "ఈ సర్వస్వమును కష్టపడి విశ్వాసపూర్వకముగా పఠించు విద్యార్థులకు ఇఁక నీ జన్మలో తెలుఁగుజ్ఞానము

కుదుర"దని హాస్యోక్తిపూర్వకముగా దాని వైయర్థ్యమును వ్యక్తీకరించిరి శ్రీ శాస్త్రిలవా రీ కింకిణుల నిర్మించుట కవ్యుత్పన్నులు పండితమ్మన్యులై భాషానాశనము కావించు సాహసమును ప్రకటించుటకే యని వారే శ్రీ వేంకట గిరిరాజావారికి వ్రాసిన లేఖలో తెల్పియుండిరి

శారదాకాంచి కింకిణులే కాక శ్రీ శాస్త్రులవారు కావించిన విమర్శ లింకను పెక్కు గలవు. వానిలో భారతా భారతరూపక మర్యాదలు, విమర్శ వినోదము, శ్లేషవినోదము అనునవి ముఖ్యము లైనవి. ఇందు శ్లేషవినోద మము ద్రితముగా నుండిపోయినది భారతా భారత రూపక మర్యాదలు ప్రాచ్య పాశ్చాత్య నాటక సంప్రదాయముల సామ్యవైషమ్యములను తెల్పు చక్కని విమర్శాత్మకమైన వ్యాసము. ఇది నాట్యకళాచరిత్ర మనుపేర శుక్ల సంవత్సర భాద్రపద భారతిలో ముద్రిత మైనది. శ్రీ శాస్త్రిలవారు తమ గ్రంథము లన్నిటిలోను ఉత్కృష్ట మైనదని తలంచిన విమర్శవినోదము 1902 లో ప్రక టింపఁబడినది. ఇందు కాళిదాస నాటకత్రయము, మాలతీమాధవము, రసార్ణవ సుధాకరము, రఘువంశ కుమారసంభవములు, విశ్వగుణాదర్శము మున్నగు సంస్కృత గ్రంథములందును, పాండురంగ మాహాత్మ్యము, పారిజాతాపహర ణము, భారతము, భాగవతము మున్నగు ఆంధ్రగ్రంథము లందును టీకాకారు లయు సంపాదకులయు భ్రమప్రమాదములచే దొరలిన కొన్ని పాఠముల అసాధుత్వమును నిర్ణయించుటతోపాటు శ్రీ శాస్త్రిలవారు సాధుపాఠములను గూడ సూచించియుండిరి వానిలో రెండు మూఁడు సందర్భముల నిచ్చట నుదాహరించెదను.

శాకుంతలమునందలి "క్షామక్షామ కపోలమాననముదః కాఠిన్యము క్తస్త నమ్" అనుచోట విరహిణియై శకుంతల యురమును కాఠిన్యయుక్తస్తనముగా వర్ణించుట పొరపా టనుకొని కొందఱు సంపాదకులు దానిని కాఠినయుక్తస్త నముగా మార్చిరి. కొంద ఱీ విషయమును స్వానుభవముచే సమర్థింపఁ జూచిరి. కాని శ్రీ శాస్త్రిలవా రిచ్చటి పాఠము "ముక్త" యుక్తమే యని

సోపపత్తికముగా నిరూపించిరి. భాగవతమున బ్రహ్మ, శ్రీకృష్ణుని సన్నుతించు సందర్భమున దశమస్కంధములో

"ఏలా బ్రహ్మపదంబు వేదములకున్ వీక్షింపఁగారాని ని
న్నీ లోకంబున నీ వనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్తభావములు నీయందే సమర్పించి నీ
వ్రేలం ద్రొక్కిన పాదరేణువులు పై వేష్టించినం జాలదే"

అను పద్య మున్నది యథాస్థితముగా చదివినచో చివరి పాదమునందలి యర్థమంత సరసముగా నుండదు ఇందలి పాఠమును సవరించి "సమర్పించు నీ వ్రేలం దొక్కరి పాదరేణువులు పై వేష్టించినం జాలదే" అను సరస సముచితమైన పాఠమును తొలుత సూచించిన వారు శ్రీశాస్త్రులవారే అట్లే ఆదిపర్వ ద్వితీయాశ్వాసమునఁ గల,

అతులోర్వీసుర ముఖ్యమంత్రహుత మాహాత్మ్యంబునన్ వాసవ
చ్యుతుఁడై ముందర తక్షకుం డురువిషార్చుల్ దూల వాత్యారయో
ద్ధతినుద్ధూత వివర్ధితాయత బృహద్దావాగ్ని వోలెన్ విచే
ష్టితుఁడై మేఘపథంబునం దిరుగుచుండెన్ విస్మితుల్గా జనుల్

అను పద్యమున 'వివర్ధిత' అను పదముకంటె 'వివర్తిత' అను పదము సుందరతరముగా నుండునని శ్రీశాస్త్రులవారు సూచించియుండిరి. ఇట్లువారి విమర్శ వినోదమున చూపిన పాఠభేదములన్నియు వారి నిశిత పరిశీలనమును, సద్యః స్ఫూర్తిని, వైదుషీ వివేకసంపదలను సూచించుచు విమర్శకులకు సమ్యగ్విమర్శన విధానమును సామాన్యులకు వినోదమును చేకూర్చుచున్నవి. దీన్నివలెనే ఆంధ్రగ్రంథ విమర్శ ప్రకార లేశ మను వ్యాసమునఁ గూడ వారు విమర్శన పద్ధతులను చక్కగా నిరూపించి యున్నారు.

శ్రీ శాస్త్రులవారి విమర్శల వలెనే ఉపన్యాసములును విషయ గంభీరములయ్యు హాస్యరస సంపూర్ణములై పండితులకు సామాన్యులకు కూడ మనోరంజకములై యుండెడివఁట వారు పెక్కు సభలం దధ్యక్షత వహించియుఁ నుపన్యాసకములుగా నుండియు నమూల్యములైన యుపన్యాసము లొసంగి

యుండిరి. హాస్యరసోదంచితములై యుండుటచే వినోదము నొసంగుచునే విజ్ఞానమును గ్రుమ్మరించుట వారి యుపన్యాసము లందలి ప్రత్యేకత. ఆంధ్రకవి పండిత సభలం దితర విద్వాంసు లెంద ఱెన్ని యుపన్యాసముల నొసంగినను సామాజికులు వారినే మరలమరల నుపన్యసింపఁ గోరుటయు కీ. శే. గురుజాడ అప్పారావు పంతులుగారివంటి విజ్ఞాన సంపన్నులు కూడ వారి యుపన్యాసములను చదువ నువ్విళ్ళు లూరుటయు ననితర సామాన్యమైన వారి యుపన్యాస కౌశలమునకు తార్కాణములు. ఉపన్యాసములు చెప్పునప్పుడు ప్రతిపక్షులు వినుచుండఁగనే వారికి విరుద్ధములైన భావములను వెల్లడించుటకుఁగాని మొగమోటమించుకయు లేకుండ తాము చెప్పఁదలచుకొన్నదంతయు చెప్పుటకుకాని వారెప్పుడును వెనుదీసి యుండలేదు అసంఖ్యాకములైన వారి యుపన్యాసములలో కొన్ని మాత్రమే వ్యాసముల రూపమున ముద్రితములై యున్నవి. వానిలో 1912 లో పచ్చయ్యప్ప కళాశాలలో విసంధి వివేకమును గూర్చియు, ఆ కళాశాలలోనే 1914వ సంవత్సరమున గ్రామ్యముననే గ్రంథములు వ్రాయవలయునను వారివాదములను గూర్చియు, నిడుదవోలులో గ్రామ్యభాషను గూర్చియు. 1919వ సంవత్సరమున నెల్లూరునందలి వర్ధమాన సమాజము వారేర్పఱచిన సభయందు తిక్కన సోమయాజి కవిత్వమును గూర్చియు వారొసంగిన యుపన్యాసములు ముఖ్యములైనవి. తిక్కన సోమయాజిని గూర్చి వారిచ్చిన యుపన్యాసము మరుసటి సంవత్సరము తిక్కనవిజయమను పేర ముద్రితమైనది. ఇందలి పెక్కువిషయములను వారు కేతన దశకుమార చరిత్రలో తిక్కననుగూర్చి వ్రాసిన పద్యముల నుండి సేకరించిరి. ఇందు శాసనాద్యాధార పూర్వకముగా తిక్కన నెల్లూరువాఁడే అను విషయము నిశ్చయింపఁబడినది. కవిత్రయము వారి యొక్కయు నాచన సోమనాథుని యొక్కయు కవిత్వములందుఁగల సామ్య వైషమ్యములిందు చక్కగా ప్రదర్శింపఁబడినవి. క్లిష్టములు శాస్త్రీయములు నగు విషయములనుగూడ తిక్తమైన యౌషధమును తియ్యని యనుపానముతో వలె సరసరమ్యమైన హాస్యముతో మేళవించి గ్రహీతృమనోరంజకముగా నొన

రించుట వారికి పరిపాటి. అందుచే శక్తిమత్తరములైన వారి యుపన్యాసములును ఆనాఁటి జనుల కమందమైన యానందము నొసంగఁ జాలినవి.

శ్రీ శాస్త్రిలవారాంధ్ర వచన వాఙ్మయమునకు కూడ విశేషమైన సేవ కావించిరి వారి బాల్యమున తండ్రిగారైన శ్రీ వేంకటరమణ శాస్త్రిలవారు తమమిత్ర బృందమునకు ఓరుగంటి ప్రతాపరుద్ర చక్రవర్తి కథను చెప్పుచుండఁగా విని, వారు దానిచే నాకర్షింపఁబడి, 1888వ సంవత్సరమున తామాంధ్ర జనవినోదినీ ముద్రణాధికృతులై యున్న సమయమున, దానిని తమకు తోఁచినట్లుగా పెంచి కథారూపమున ప్రకటించి యుండిరి. ప్రతాపరుద్రీయ నాటక రచనకు వారి మనస్సున నప్పుడే బీజావాపమై యుండెనన్నమాట 1896వ సంవత్సరము జూలై నెలలో వారు దానిని నాటకాకృతి నందించిరి 1891వ సంవత్సరమున వారు సోమదేవ పండిత విరచితమైన కథా సరిత్సాగరమును సులభము, సరసమునైన శైలిలో వచనకావ్యముగా సంతరించిరి ఇందువారు సౌలభ్యమునకై విసంధులను పాటించి యుండిరి. ఇందలి శైలియు, కథాకథన కౌశలమును మిక్కిలి ప్రసంశనీయములుగా నుండును దీనిని శ్రీ శాస్త్రిల వారు రచించిన విధము విచిత్రముగా నుండును మిత్రులెవ్వరో సంస్కృత మూలమును పరించుచుండఁగా వినుచు వారప్పుడే వచనానువాదము వ్రాసివేయుచుండిరఁట అనఁగా మూలగ్రంధమును చదువుటయు అనువాదము చేయుటయు నేక కాలముననే జరుగుచుండె నన్నమాట. ఇది శ్రీ శాస్త్రిల వారి పాండితీ ప్రకర్షకును, ప్రభా సంపదకును, రచనా వేగమునకును తార్కాణమై యున్నది.

1910లో వారు భేతాళ పంచవింశతి కథలను విక్రమార్కుని అద్భుత కథలను రచించి యుండిరి ఆ సంవత్సరమందే హితోపదేశ దశకుమార చరిత్రలను కూడ నాంధ్రీకరించి యుండిరి. 1921లో వారు పద్యగద్య రూపమున ననువదించిన హితోపదేశ చంపువు 1932లో ముద్రింపఁబడిన ఈ వచన కావ్యములు పెక్కాంధ్రీకరణములయ్యు స్వతంత్రములట్లు సరళసుందరములై

భాసిల్లు చుండును. ఆంధ్రకథా వాఙ్మయమున వీనికి విశిష్టస్థాన మున్నది. తమ కత్యంత మిత్రులు పోషకులు నైన శ్రీ వేంకటగిరి రాజాగారి కోరికపై శ్రీ శాస్త్రులవారు బాణుని కాదంబరిని కూడ నాంధ్రీకరింప వలెనని తలంచిరి. కాని దురదృష్టవశమున నాయాంధ్రీకరణము నారంభింపకుండనే వారు దివం గతు లౌట సంభవించినది

తమ నాఁటికి ముద్రితములై యున్న సంస్కృతాంధ్ర గ్రంథములు పెక్కు అపపాఠ జుష్టములై యుండుట గ్రహించి వారు కొన్నిటిని సరియైన పాఠములతో చక్కగా ముద్రించి యుండిరి అట్టి వానిలో సంస్కృత పంచ తంత్రము, జ్ఞాన వాసిష్ఠ రామాయణము, విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి, బాణాల శంభుదాసు సారంగధర చరిత్రము, పారిజాతాపహర ణము, ముఖ్యములైనవి ఇవన్నియు 1910వ సంవత్సరమున వారి జ్యోతిష్మతీ ముద్రణాలయముననే ముద్రింపఁబడి యున్నవి వీనిని పరికించినచో పాఠ పరిష్కార విషయమునను, నిర్దుష్టముగా గ్రంథములను ముద్రించు విషయము నను శ్రీ శాస్త్రులవారు చూపుచుండు శ్రద్ధ ప్రతిపుట యందును గోచరించు చుండును.

శ్రీశాస్త్రిగారి కీర్తి సౌధమునకు మూలస్తంభములని చెప్పఁదగినవి వారి నా ట క ము లు ను - వ్యా ఖ్యా న ము లు ను. వారు ర చి ం చి న నాటకములు మొత్తము పది. వానిలో అనువాదములేదు; స్వతంత్రములు మూఁడు కాళిదాస షేక్స్పియరుల నాటకములు చదివినప్పుడు తమకు కూడ నాటకరచన కావింపవలె నను నుత్సాహము కలిగె ననియు, తొలుఁదొల్త స్వతంత్రకల్పనకు వెనుదీసియు కాళిదాసాది మహాకవుల కవితారసము నాంధ్ర సోదరులకు కరతలామలకము కావించుట వాస్తవమైన భారతీసేవ యగునని తలంచియు, తా మాంధ్రీకరణములకు గడంగి రనియు శ్రీశాస్త్రులవారే యొక్కచో వివరించియున్నారు నాగానందము (1891), శాకుంతలము (1896), ప్రియదర్శిక (1910), మాళవికాగ్నిమిత్రము (1918), ఉత్తరరామ చరిత్ర (1920), విక్రమోర్వశీయము (1921), రత్నావళి (1921) అనునవి

కాలక్రమమున వా రనువదించిన సంస్కృత నాటకములు. శ్రీ శాస్త్రిలవారి అనువాదపద్ధతి విశిష్టమైనది. వారేనాటకమునైన ననువదించుటకు పూర్వము తన్మాతృకయందలి యపపాఠములను తొలఁగించి రమ్యపాఠములను బహు గ్రంథపరిశీలనముచే నిర్ధారణ చేసికొందురు. పిమ్మట శబ్దం బనుసరించియు, నభిప్రాయంబుగుఱించియు, భావంబుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు శ్రీనాథకవి విధమున ఆ నాటకమును మాతృకానుసారముగను అశేషమనీషి హృదయంగమముగను అనువదింతురు ఆంధ్రదేశమున సంస్కృతనాటకముల ననువదించినవారు పలువురున్నారు. కాని వారి అనువాదము లెవ్వియు యథాతథముగా మూలభావములను వ్యక్తీకరించుటలో శ్రీశాస్త్రిలవారి అనువాదములతో సాటిరాఁజాలవు. శైలీ స్వభావములందు పురాణేతిహాసములకును నాటకములకును చాల తారతమ్య ముండునని యెఱింగిన వారగుటచే శ్రీశాస్త్రిలవారు నాటకములందలి పద్యముల ననువదించుట యందు ప్రత్యేక జాగరూకత వహించియుండిరి అయ్యును వారిపద్యములు కొన్నిచోట్ల క్లిష్టముగా నుండుటకు వారు పెద్దభావమును అలఁతి అలఁతి మాటలతో వ్యక్తీకరింప యత్నించుటయు, సహజసిద్ధముగా వారి కలవడిన శైలియు కారణములు పద్యముల ననువదించు నప్పుడు వారు మూలకర్తభావము నే లోపమును లేకుండ నాంధ్రమున వ్యక్తము చేయుటకేకాక కొన్నిచోట్ల మూలమునకు వ్యాఖ్యాన ప్రాయముగా నుండునట్లు చేయుటకు కూడ యత్నించుచుందురు ఈ పద్యములను చూడుఁడు

కుందు జనించె నేగెడు శకుంతల యిప్పుడె యంచు బాష్పపుం
గ్రందు నడంప లోవెలుఁగు గాద్పడెఁ జింతకుఁ జూపు మాన్పడెన్
వందుర నిట్లు ప్రేమ వనవాసినె నేఁ దముఁ బాసి క్రొత్తగా
నందనలేగ నౌ వగమనంబున నెట్లు గృహస్థులోర్తురో.

ఇది "యాస్యత్యద్యశకుంతలేతి" యను సుప్రసిద్ధమైన శ్లోకమున కనువాదము ఇది మూలమున కన్యూనాతిరిక్తముగా నున్నది. "వైక్లబ్యం మమ

తావదీదృశమహో స్నేహాదరణ్యౌకసః” అను పాదమునకు “ఒకింత పెంచిన తపోధనులే యిటు కుంద” అనునది మఱియొక రొనర్చిన అనువాదము “వందుర నిట్లు ప్రేమ వనవాసినె నేనను శాస్త్రిగారి ఆంధ్రీకరణ మెంతో సంగ్రహముగా నున్నను మూలమునను సన్నిహితముగా ననుసరించుచునే యున్నది పైని పేర్కొనఁ బడిన యింకొక అనువాదమున స్నేహాత్ అనునది విడువఁ బడినది. ఒకింత పెంచిన అనున దధికముగా చేర్పఁబడినది. అరణ్యౌకసః అనునది తపోధనులైనది. ఇట్లే యితరానువాదములకును, శ్రీశాస్త్రిగారి యనువాదములకును మూలానుసరణమునను, భావసంగ్రహీకరణమునను ఎంతో తారతమ్యము కానపించును. శ్రీశాస్త్రిగారి యనువాదమున సాధారణముగా నమూలమైన దుండదు; మూలస్థమైనది విడువఁబడదు. ఎచ్చటనైన వారొండు రెండధిక పదములు చేర్చుచో నవి మూలభావమునకు వ్యాఖ్యానప్రాయములై యచ్చట కవి చెప్పఁదలఁచిన యాశయమునకు వన్నె కలిగించు చుండును

త్రాగ దెవర్తె దస్సినదె తా నిదకుంద జలంబు మీకు మున్
దాఁగయినేఁత కోరినదె తాకదకూరిమి మీ పల్లవాశమున్
సాగును బండు వెవ్వతెకుఁ జయ్యన మీ తొలి పూవుసూతి నే
నేగెడు నా శకుంతల యిదే మగనింటికి వీడుకొల్పరే

అనునది “పాతుం న ప్రథమం వ్యవస్యతిజలం యుష్మాత్స్వ పీతేషుయే” అను శ్లోకమున కనువాదము. శ్రీ శాస్త్రులవారి యనువాదమున మొదటి పాదమందు దస్సినదె అనునది అధికము. తాను దస్సినదయ్యును శకుంతల మీకు ముందుగా నీరు పోయకుండఁ దాను త్రాగదని భావము. ఇచ్చట దస్సినదయ్యును అనునది శకుంతల కాశ్రమ లతావృక్షములపైఁ గల ప్రీతిని ద్విగుణీకృతముగా ప్రకటించుచు మూలభావమునకు వన్నె పెట్టుచున్నది.

ఈ సకి లక్ష్మిగేహమున నీ సకి కన్గవకున్ సుధాంజనం
బీ సకి మేని తాఁకుడు మెయిన్ బహుళంబగు చందనద్రవం

బీ సకి బాహువల్లి యివ మీనెదు ముత్తెసరంబు కంఠ మం
దీ సకి దేది కాదు ప్రియమేర్చును గాని యిదం వియోగమే.

అనునది ఉత్తరరామ చరిత్ర మందలి "ఇయంగేహే లక్ష్మీః" అను శ్లోకమున కనువాదము. మూలమందలి శ్లోకము 'వియోగః' అను పద్యముతో ముగియుచున్నది అది యట్లే ముగియవలెను లేనిచో కవి యిచ్చట ప్రవేశపెట్ట నుద్దేశించిన గండ మను సంగము సువ్యక్తము కాదు శ్రీ శాస్త్రులవారిది గ్రహించి తమ పద్యమునుగూడ 'ఇదం వియోగమే' అను సమాసముతో ముగించిరి. ఈ పద్యము ముగియగానే ప్రతీహారి ప్రవేశించి "దేవా వచ్చెను" అనును. రాముఁడు "ఆఁ ఏమి వచ్చెను॰ ఎవరు" అని అడుగును ప్రతీహారి "ఏలినవారి ఆసన్న పరిచారకుఁడు దుర్ముఖుఁ" డని సమాధాన మిచ్చును. పద్యాంతమందలి వియోగమే యను పదమును ప్రతీహారి అన్న "దేవా వచ్చెను" అను వాక్యమును కలసి "వియోగమే వచ్చె" నని అర్థ మిచ్చుచు సీతారాముల భావి వియోగమును సూచించు చున్నవి ఇట్టి మెలఁకువలు గ్రహించి యుచితరీతి ననువదించినప్పుడే అనువాదకుఁడు మూలకర్తకు న్యాయము చేకూర్చినవాఁ డగును. శ్రీ శాస్త్రులవారి అనువాదము లన్నియు నిట్టి మెలఁకువలు చెడకుండ నతి జాగరూకతతో చేయఁబడినట్టివే. అందుచేతనే వారి యనువాదములయెడ దేశమునందలి పండితుల కధి కాదర గౌరవము లుండుట. సంస్కృత నాటకములను సంస్కృతభాషలో చదువ లేనివారి కందలి రసానందము చూఱలిచ్చుటకు దక్షములైనవి శ్రీ శాస్త్రులవారి యనువాదములే వారు సంస్కృత నాటకములనువలెనే షేక్స్పియరు, ఆంగ్ల నాటకములను కూడ ఆంధ్రీకరింపవలెనని పూని "కింగ్ లియరు" నాటకమును కొంతవఱకు అనువదించి ఎందుచేతనో ఆ ప్రయత్నమునుండి విరమించిరఁట! అది ఆంధ్రుల దురదృష్టము లేనిచో వారా యాంగ్లనాటక సార్వభౌముని నాటకము లందలి నిధులనుగూడ నెఱచూఱ లిచ్చియుండెడివారే.

శ్రీ శాస్త్రులవారు రచించిన స్వతంత్ర నాటకములు మూఁడు - ప్రతాపరుద్రీయము, ఉష, బొబ్బిలియుద్ధము మూఁడు మూఁడే త్రివిక్రముని పాద

త్రితయమువలె నాంధ్రలోకము నంత నావరించి రసికుల ననంతరసవాహినుల నోలలాడించుచున్నవి. వీనిలో కాలమునుబట్టియేకాక గుణపరంపరనుబట్టియు నగ్రగణ్యమైనది ప్రతాపరుద్రీయము. ఢిల్లీసుల్తాను సర్వసేనాపతి యైన వలీఖాను మృగయాపరిశ్రాంతుఁడై యరణ్యమున నిద్రించుచుండిన ప్రతాపరుద్రదేవుని శృంఖలాబద్ధుని గావించి బందిగా ఢిల్లీకిఁ గొనిపోవ మంత్రిపుంగవుఁడును మతివిజితపురందరగురుఁడు నైన యుగంధరుఁ డున్మత్తవేషమున ఢిల్లీకేగి రాజమాతకు వాగ్దానము చేసినట్లుగా నాఱుమాసములలో నాతని విడిపించి మరల నోరుగంటికిఁ గొనివచ్చుట యిందలి యితివృత్తము. పైకి చరిత్రాత్మకముగానే కనిపించినను చరిత్రాత్మకముకంటె కల్పితాంశమే యిం దధికము.

ఇందు యుగంధరుఁడు ప్రదర్శించిన శేముషీ ధౌరంధర్య మనన్యసామాన్యమైనది. ఎత్తుపైయెత్తులతోఁగూడి యతిక్లిష్టములైన కథాంశ సూత్రముల నిబిడనీరంధ్రమైన చిక్కుమువోలె నల్లుటలో నిందు శ్రీ శాస్త్రిలవారు చూపిన నేర్పును అసాధారణ మైనది ఎప్పటికప్పుడే సుల్తాను నిన్ని నెలలకు పట్టుక పోయెద నని లెక్క చెప్పుచు యథాక్షరముగా ప్రతిన నిర్వర్తించి సుల్తాను పరివారమును కన్నులు లేని కబోదుల నొనరించి "ఇల్లవా డల్లహో, అల్లవాఁ డిల్లహో" అని పాడఁగల్గిన పిచ్చివానిప్రజ్ఞ పరబ్రహ్మతత్త్వమువలె నిద మిత్థమని నిర్వచింపరానిది. అష్టమాంకమందలి అంతర్నాటక మద్భుతమైన సంఘటనము. మంత్రి యుగంధరుని మంత్రాంగ మంతయు కార్యరూపము దాల్చిన గంభీరఘట్ట మిది వీరరసప్రధానమైన యీ నాటకమున హాస్యకరుణాద్భుతరసములు కూడ నెడనెడ చక్కఁగా పోషింపఁబడినవి. రాజకీయ తంత్రప్రపంచమున దీనిని ముద్రారాక్షసముతో సరిపోల్పవచ్చును

సిద్ధసుధాప్రవాహ మని శ్రీ శాస్త్రిలవారే వర్ణించిన ఉషానాటకము 1901 వ సంవత్సరమున రచింపఁబడినది ఉషాపరిణయ బాణాసుర గర్వభంగము లిందలి ప్రధానాంశములు. భాగవత హరివంశములనుండి కొన్ని కథాంశములను గ్రహించి కొన్నిటిని తాము కల్పించి శాస్త్రిలవా రీ నాటకమును మిశ్రవస్తుకముగా సంతరించిరి. తృతీయాంకమున ననిరుద్ధుఁడు కావించిన

చంద్రమలయానిలాద్యుపాలంభమును, చిత్రరేఖ పలువురు సుందరాంగుల చిత్రములు రచించి ఉషకు వివరించిన తద్వర్ణనములును ప్రబంధోచితములుగా నున్నవి ఇందలి ప్రణయవృత్తాంతము శ్రీహర్షదేవుని నాటికలందలి కథా సంవిధానము ననుసరించుచున్నది చిత్రరేఖపాత్రను శ్రీ శాస్త్రిగారు సుస్పష్ట రేఖలతో తీర్చిదిద్ది నాటకర్తకు వన్నె చేకూర్చినారు

1916లో రచింపఁబడిన బొబ్బిలియుద్ధనాటకమునందలి యితివృత్తము ఆంధ్రదేశచరిత్రకు సంబంధించినది పెద్దాడ మల్లేశము రచించిన పాటయు, రంగరాట్చరిత్ర మను పద్యప్రబంధమును ఈ నాటకవస్తువునకు మూలములు. ప్రతాపరుద్రీయమున ధర్మవీరమువలె నిందు యుద్ధవీరము పరాకాష్ఠ నందినది. ఇందు బొబ్బిలి వీరులును వీరవనితలును జూపిన శౌర్యసాహసములును, మానాభిమానములును ఏ కాలమునఁగాని యే దేశచరిత్రమునఁ గాని కానరాక నిరుపమానములై విరాజిల్లుచుండును. ఇందలి నవమాంకము తాండ్ర పాపా రాయఁడు కావించిన ప్రళయ తాండవమునకు రంగము ఈ నాటకమందలి కథాసంవిధానము సుఘటిత సంధిబంధమై యాద్యంత రసనిర్భరమై మహోదాత్తముగా కూర్పఁబడినది. రంగారాయాదులు పరుల చేతులఁ జచ్చుట కంగీకరింపక స్వయముగా పొడుచుకొని మృతి నందుటయు, వెలమవనిత లాసన్న భర్తృవియోగ వ్యసన దుఃఖితలై యతధైర్యమున కృశానులకో కృపాణులకో యెర యగుటయు విషాదభావసాంద్రములై యిందు ప్రధానమైన వీర రసమున కెంతయో నైశిత్యము కూర్చుచున్నవి.

ప్రాచ్యపాశ్చాత్య నాటకవిధానములు రెండును సమగ్రముగా నెఱంగిన వారగుటచే శ్రీ శాస్త్రులవారా యిరుతెఱంగుల మేలి గుణముల సేకరించి తమ నాటకముల నుత్తమ కళాసంపన్నములుగా సృష్టింపఁజాలిరి. నాటకములను రచించుట యందెంత నైపుణ్యమో తగిననటుల నెన్ని వారిచే నా నాటకముల ప్రదర్శింపఁ జేయుటయందు వారికంత ఉత్సాహము. వారి నాటకములలో కేవలము ప్రయోగదృష్టితో సామాజికజనమనోరంజనమునకై కల్పింపఁబడిన ఘట్టము లెన్నియో కలవు. ప్రతాపరుద్రీయ మందలి పేరిగాని స్వారస్యగ్రహణ

పరీక్షతోఁ గూడిన షష్ఠాంకమును బొబ్బిలి యుద్ధమునందలి బ్రాహ్మణులయు పౌరులయు సంభాషణమును, ఉషాపరిణయమందలి కరేణుకా గంభీరవేదుల వృత్తాంతమును ఏ తత్ప్రయోజన ప్రధానములే

హాస్యరసపోషణమున శ్రీ శాస్త్రిగారు సిద్ధహస్తులు. అవకాశము గల్గి నప్పు డెల్ల, వారు తమ నాటకములలో నా రసము నెంతో సమర్ధతతో పోషించియుండిరి ఉషా ప్రతాపరుద్రీయములం దది ప్రతి ఘట్టమునందును ప్రత్యక్ష మగుచునే యుండును పేరిగాడు సంగీతము వినునప్పటి సారా చెంబుతాడునకు సంబంధించిన హాస్య మింతింతనరాక అపూర్వముగా నున్నది. శ్రీ శాస్త్రులవారికి చారిత్రిక వీర పురుషులపైఁ గల యాదరాభిమానములు బొబ్బిలి ప్రతాపరుద్రీయములలో సర్వతోముఖముగా గోచరించును.

పాత్రపోషణమున శ్రీ శాస్త్రిగా రందెవేసినచేయి చైతన్యరహితములైన చెక్కడపు బొమ్మలను గాక సజీవములైన పాత్రలను వారు చాకచక్యముతో చిత్రించియుండిరి. యుగంధరుఁడు చెకుముకిశాస్త్రి, ఎల్లి పేరిగాఁడు, పాపారాయఁడు, రంగారాయ వెంగళ్రావులు, మల్లాంబా వేంకటలక్ష్మలు, చిత్రరేఖ మున్నగువారు మఱచిపోవుద మన్నను మఱపునకు రాకుండుట యిందు చేతనే. రంగారాయాదులు విరోధులపాలికి భీకరరాక్షసులైనను మృదుభావ మండితములైన మానవహృదయములు లేనివారు కారు. యుద్ధమునకుఁ బోవుటకు ముందు రంగారాయఁడు తమ్ముని కౌఁగిలించుకొని "దైన్య మని తలంపకుము వీరుల మైనను మనుష్యులమే కదా" యనుట యిందుకు తార్కాణము

శ్రీ శాస్త్రులవారు తమ నాటకములందు స్వానుభవసిద్ధములైన విషయముల నెన్నింటినో చొప్పించి యున్నారు విద్యానాథుఁడు గోదావరిలో నీదుకొని యేగుచు పడవవారిని రక్షణార్థమై పిల్చుట, నేను "కండచీమను, ఏ మనుకున్నావో, పట్టుకుంటే వదల" నని పిచ్చివాఁడు శిష్యులతో పల్కుట, స్వారస్యపు త్రాటికిని ఆనందబాష్పములకును సంబంధించిన విశేషములు, బుస్సీ మనస్సంతాపకరకార్య మేదైన జరిగినప్పుడు "జిహోవా"యని పల్కుచుండుట, బొడ్మిన్, గులాంద స్త్రషైర్మనిషీ మున్నగు నామములు ఇందుకు

తాహ్మణములు. ప్రతాపరుద్రీయమున పిచ్చివాఁడు పాడిన సౌశమంగళము అతని శత్రువులైన వీరడికి రాగడికి మాత్రమే కాక శ్రీ శాస్త్రిలవారి శత్రువులకు కూడ సంబంధించినదే. వారు నాటకములం దెడ నెడ చేయుచుండు పాత్రప్రవేశ భావికార్య సూచనలును, చూపుచుండు నాటకీయ చమత్కారములును అద్భుతావహములై వారి నాటకములందలి రక్తి కెన్నోవిధముల తోడ్పడి యున్నవి శ్రీ శాస్త్రిగారు ఆంగ్లనాటక ఫక్కి ననుసరించి తమ నాటకములందలి యంకములను రంగములుగా విభజించియున్నారు. మిగిలిన విషయములలో వారు సంస్కృతనాటక లక్షణములనే చక్కఁగా ననుసరించియున్నారు. వారి నాటకములందలి సంవాదపద్ధతి మిక్కిలి సరసగంభీరముగా నుండును. ఏ పాత్ర యెప్పు డేది మాటాడినను అది నాటకకథాబంధమునకు బిగువు గూర్చునదిగా నుండుటయే యందలి విశేషము.

శ్రీ శాస్త్రిలవారి నాటకములను పరిశీలించు నప్పుడు పాత్రోచిత భాషా ప్రయోగమున వారు చూపిన ప్రతిభ యనన్య సామాన్యముగా నుండును ఆ విషయమున వారు సాధించిన విజయ మఖండమైనట్టిది వారు సంస్కృత సంప్రదాయము ననుసరించి స్త్రీ బాల సేవకాదులకు వ్యావహారిక భాషనే వాడి యుండిరి తెలుఁగు నాటకములలో మొట్టమొదట దాని నౌచిత్య భరితముగా వాడి రసికులచే సెబా సనిపించుకొన్నవారు శ్రీ శాస్త్రిలవారే బ్రాహ్మణులు పరిజనులు, రాణివాసపు స్త్రీలు, సామాన్య పౌరులు, మహమ్మదీయులు మున్నగువారు ప్రయోగించు భాషను వారు కడుమెలకువతో పరిశీలించి ఆత్మాయత్తము చేసికొని అచ్చెరువుగొల్పు సౌలభ్యముతో ననుసంధించియుండిరి. అందును మహమ్మదీయులు మాటాడు తెలుఁగును వారలవరించుకొన్న తెలుఁగు నిరతిశయప్రతిభా ప్రదర్శకముగా నున్నది. అది యెంత పాత్రోచితమో అంత సరసమును, ఎంత వికృతమో అంత చమత్కార గర్భితమునై యలరారు చున్నది. కన్యాశుల్కమున నాంగ్లభాషా ప్రయోగమువలె శ్రీశాస్త్రిల వారి బొబ్బిలి ప్రతాపరుద్రీయములలో ఉరుదూ భాషా ప్రయోగము అపూర్వమైన వైచిత్ర్యమును ఆవహించుచున్నది. వారు పాత్రోచిత భాషావాదులే కాని

గ్రామ్యవాదులు కారు. అన్యత్ర వారు వాడుభాష లాక్షణికమై జాతీయపదసూక్తి పరిపూర్ణమై పండితజన మనోరంజకముగా నుండును.

శ్రీ శాస్త్రిలవారు తమ నాటకములలో పద్యములను పాటలను కూడ వాడినారు. స్త్రీలకును నీచపాత్రలకును వారు సాధారణముగా పాటలనే వాడి యుండిరి వీరిపాట లన్నియు రసపాత్రానుగుణములై యెంతో రమణీయము లుగా నుండును. అందును ప్రతాపరుద్రీయమునందలివి సరసమైన పదప్రయోగమునను ప్రకరణోచితమైన అర్థగాంభీర్యమునను సాటిలేనివై యా నాటకము ప్రచారమున కెన్నియో విధముల తోడ్పడి యున్నవి. శ్రీ శాస్త్రిలవారి పద్యములు అలంతి యలంతి పదములతో గంభీరమైన యర్థమును వ్యక్తీకరించుచు కడుంగడు ప్రౌఢములుగా నుండును వర్ణనాత్మకములైన వారి పద్యములు కొన్ని ప్రబంధ పద్యములను బోలియుండును.

దండిత వైరివీరునిఁ బ్రతాపనరేంద్రుని ముల్లెమూటగాఁ
గొండని దైవ మీ తురకకూళలకిఁ గనుఁగొన్న మింటికిన్
గుండియ వ్రీల నెత్తురుల గుజ్జగు కండలు రెండునుం బలే
చండగ భస్త్రి మండలము శైవలినీ కలితార్క బింబమున్.

వంటి పద్యములు రమణీయ కల్పనాసంపదలతోఁ గూడి శ్రీశాస్త్రిలవారి భావనా పటిమను జాటుచున్నవి.

వేసర కేడ్చెదేల యరవిందసఖప్రతి మారుణాస్యమున్
మూసికొనంగ శైవలపు మూర్ధజముల్, గడు గాలి నూర్చుచున్
భాసుర వీచికాత్రివళిపై పయిఁ దోఁప, రథాంగ యుక్స్తనో
చ్ఛ్వాసము మీఱ, మాధుకర ఝంకృతి మూల్గున, నంచ యెల్గునన్

అను పద్యము రూపకాలంకార శోభితమై, కరుణరస పూరితమై శ్రీ శాస్త్రిల వారి పద్య రచనాపాటవమును ప్రకటించుచున్నది ఇట్లే "సరసిరుహాస్య కీలు జడ చందమునన్" "మృషావలగ్న జిల్గుపైఁట మించు సన్న మంచుగున్" "వీరబొబ్బిలి యిదే పేరు పొందిన లంక" "స్తంభము నుండి పైకుఱికి"

మున్నగు వారి పద్యములు భావనిర్భరతతో పాటు సారస్యమునకును నిలయములై యున్నవి

ఆయన గాలిని బేనును
దోయముతో నఱకుఁ బొగలతో గోడ లిడున్
ఆయన ప్రయోగ మభినవ
తోయజభవ సృష్టి పెఱది దుస్స్వప్నమగున్.

మున్నగు పద్యములు సరళములు సుపరిచితములు నైన పదములతోఁ గూడి యున్నను, గొండంత అర్థమును వెల్లడి చేయుచున్నవి, ప్రబంధధోరణిలో పరిపక్వమైన వారి పద్యశైలి క్రమక్రమముగా రసాంచితమును నాటకోచితమునై యలరారినది. శ్రీ శాస్త్రిలవారు టాడ్ రాజస్థానకథావళి చదివి అందలి యితివృత్తము ననుసరించి పద్మినీప్రతాపము, హిమ్మత్‌సింగు అను నాటకములను, సారంగధర తిక్కన విజయనాటకములను వ్రాయవలెనని తలంచి అంకవస్తు విభజనాదికము కావించుకొని యుండిరఁట. కాని వానిని వ్రాయకుండనే వారు కీర్తిశేషు లగుట సంభవించినది లేనిచో ఆంధ్రనాటక వాఙ్మయమునకు మఱి నాలుగై దమూల్యాలంకారములు లభించి యుండెడివే.

సంస్కృత మందలి పురాణేతిహాస కావ్య నాటకాది గ్రంథములను బరించి తద్విషయ గ్రహణముచే సర్వశ్రేయములను బొందఁగోరియు పలువురు తగిన యుపాధ్యాయులు దొరకకపోవుటచే ననవాప్తమనోరథులై నిరుత్సాహము పొందుట గాంచి శ్రీ శాస్త్రిలవారు కొన్ని ముఖ్యములైన సంస్కృత గ్రంథములను సంపూర్ణ టీకా తాత్పర్యాదులతో ముద్రించుటకుఁ గడంగి మొట్టమొదట 1902 వ సంవత్సరమున మేఘసందేశమును టీకా తాత్పర్యములతోడను పదప్రయోజనికతోడను ముద్రించి యుండిరి ఇందు మల్లినాధుని వ్యాఖ్యయు, పెక్కాక్షేపములకు సమాధానములును, ప్రతి పద ప్రయోజనమును ఒసంగఁబడినవి దీని సాహాయ్యమున సంస్కృతమేమియు తెలియనివారుకూడ ఉపాధ్యాయనిరపేక్షముగా మేఘసందేశ శ్లోకములందలి గంభీరార్థములను గ్రహింపఁజాలుదురు. అట్లే వారు 1909 లో పుష్పబాణ

విలాసమును, 1910 లో అమరుక బిల్హణ చరిత్ర రసమంజరులను సాంధ్ర టీకాతాత్పర్యములతో ముద్రించిరి. ఆ సంవత్సరమందే భర్తృహరి సుభాషితములను తెనుగుటీకతోడను తెనుగుపద్యములతోడను ముద్రించిరి. తరువాత రఘువంశ కుమారసంభవముల నాలు సర్గలవఱకు ప్రతిపదార్థ టీకాతాత్పర్యములతో ప్రచురించియుండిరి. సటీకములైన యీ గ్రంథములు సంస్కృత భాషాజిజ్ఞాసువులకు చేసిన, చేయుచున్న మే లింతింత యనరాదు. ఇట్లే శిశుపాలవధాది మహాకావ్యములకును, అమరకోశమునకును, కాళిదాస భవభూతి నాటకములకును గూఢార్థ బోధనపూర్వకముగా సంపూర్ణ టీకా తాత్పర్యములు రచించి ప్రకటింపవలెనని వా రభిలషించియుండిరి. ఒక్క ప్రియదర్శికా నాటకమును మాత్రము వారు ఆంధ్రీకరణముతోనే కాక, సంస్కృత టిప్పణీ ఆంధ్ర టీకా తాత్పర్య లక్షణ వివరణాదులతోఁగూడ ప్రచురింపఁ జాలిరి ఇట్టి పరిష్కరణ మాంగ్లమునందుగాని ఇతర భారతీయనాటకములందుఁగాని యెవ్వరును కావించి యుండలేదని విమర్శకుల అభిప్రాయము.

సంస్కృత గ్రంథములకువలెనే ప్రౌఢములును రసభావాంచితములునైన కొన్ని ఆంధ్రప్రబంధములకుకూడ వారు టీకలును వ్యాఖ్యానములును రచించియుండిరి. 1910 వ సంవత్సరమున వారు సారంగధరచరిత్ర విజయవిలాసములకును, గౌరన హరిశ్చంద్ర చరిత్రకును వ్రాసిన టీకలు సంగ్రహరూపము లయ్యును ఆ గ్రంథముల యర్థము నవగాహనము చేసికొన గోరువారి కెన్నో విధముల తోడ్పడఁజాలు నట్టివి. శ్రీ శాస్త్రులవారి పాండితీశౌండీర్యమునకు నికషోపలోపమము లై వారి కపర మల్లినాథ బిరుదమును సంపాదించి పెట్టినవి నైషధాముక్తమాల్యదలకు వారు రచించిన సర్వంకషా సంజీవనీ వ్యాఖ్యానములు. 1913 లో వారు శ్రీనాథుని శృంగార నైషధమునకు సర్వంకష యనుపేర సంపూర్ణ వ్యాఖ్యానము రచించి శ్రీ సి ఆర్. రెడ్డిగారి వంటి పండిత విమర్శకోత్తముల మన్నన లందుకొనఁజాలిరి. వారు నైషధ గ్రంథముఖ పత్రమునకు వెనుక ముద్రించిన పద్యములో "వేసర కాంధ్ర నైషధము విప్పి నిధుల్ నెఱచూఱ లిచ్చితిన్ జేసెద నింకఁ దత్పరత సేవలు

చూడి కుడుత్త దేవికిన్" అని వ్రాసియుండిరి వారు సర్వంకషా వ్యాఖ్యలో ప్రదర్శించిన ప్రతిభ అపారమైనది శ్రీనాధుఁడు కొన్నిచోట్ల నాంధ్రీకరణమున మూలమందులేని మనోహర భావములు ప్రకటించి యుండెను. వానిని ప్రదర్శించుట శ్రీ శాస్త్రిలవారికి తప్ప నితరుల కత్యంత కష్టసాధ్యములు

గిరః శ్రుతా ఏవ తవ శ్రవ స్సుధాః
శ్లథాభవ న్నామ్నిచతే శ్రుతి స్పృహా
పిపాసుతా శాంతిముపైతి వారిజా
నజాతు దుగ్ధాన్మధునోఽధికా దపి

అను శ్లోకమునకు

అధిక తరులైనఁ గాక దిశాధిపతులు
కౌతుకము నాకు నీవంశ కధలయందె
దప్పికల్గిన వారి కా దప్పి తీర్ప
సలిలపూరంబు హితవొ ఆజ్యంబు హితవొ

అనునది శ్రీనాథుని ఆంధ్రీకరణము ఇందు శ్రీనాధుఁడు మూలభావమునకు మెఱుఁగులు తీర్ప యత్నించుటే కాక శ్లేష సాహాయ్యమున నర్థచమత్కారమునుగూడ కల్పించినాఁడు దిక్పాలకులు ఘనవృక్షముల వంటి వారైన నగుదురు గాక నీ వంశమనెడి వెదురుచెట్టుకు సంబంధించిన కథలు వినుటయందే నా కభిలాష మెందు అనునది శ్రీనాధుఁడిందు కల్పించిన అధికార్థము. దీనిని శ్రీ శాస్త్రులవారు సూచించిన తరువాతనే యితరులు గుర్తించిరి ఇంక శ్రీ శాస్త్రులవారు ఆముక్తమునకు రచించిన వ్యాఖ్యానము నిజముగా సంజీవనియే దానిని రచించుటకు వారు శ్రుతి విస్మృతి పురాణతత్త్వవేదాంత గ్రంధము లెన్నియో మరల మరల చదువవలసి వచ్చెను వారా వ్యాఖ్యను సుమారు 4 నెలలలోనే వ్రాసి ముగించినను దాని కాయత్తులగుటకు నాలుగేండ్లు బహుగ్రంధ పరిశీలనము చేయవలసివచ్చెనఁట ఆ వ్యాఖ్యానమును నిజముగా నొక్క చూడికుడుత్త దేవినేకాక శ్రీకృష్ణరాయయశశ్రీకిని, ఆంధ్రసరస్వతికిని

చేసిన అపూర్వ సేవయని చెప్పవచ్చును. అతి ప్రౌఢమైన ఆ ప్రబంధమున కట్టి సమగ్రవ్యాఖ్య వ్రాసి దానిని సంజీవనిచే పునరుజ్జీవింపఁ జేయుట శ్రీశాస్త్రిల వారికి తప్ప నితరుల కసాధ్య మనుటలో నతిశయోక్తి లేదు సర్వంకషా సంజీవనులు వెల్వరించి శ్రీశాస్త్రిలవా రాంధ్రలోకము నంతను అధమర్ణము కావించినారు. అట్లే వారు కాశీఖండ సోమహరివంశ పాండురంగ మాహాత్మ్యాది గ్రంధములకుఁ గూడ విపులములైన వ్యాఖ్యలు వ్రాయనెంచిరి కాని విధి వేఱుగా నూహించుటచే నాతలంపు కార్యరూపము దాల్చలేదు

1916వ సంవత్సరమున ఆంధ్రసాహిత్య పరిషత్తువారు శ్రీ శాస్త్రిల వారిని సూర్యరాయాంధ్ర నిఘంటువునకు ప్రధాన సంపాదకులుగా నియమింపఁబడిరి ఆ నియోగముననుండి రెండేండ్లలో వారుకావించిన పని ఆశ్చర్యావహమైనది. నిఘంటు కార్య నిర్వహణమును గూర్చి వారు వ్రాసి సంఘమువారి కర్పించిన నివేదనము పఠించినచో నాపని యందలి యుదాత్తత తేటతెల్లము కాఁజాలును కాని పరిస్థితులు వారా పనియందు రెండేండ్లకంటె నధికముగా నుండుట కవకాశము కల్పించినవి కావు అందుచేతనే ఆ విద్వద్వరేణ్యుని పర్యవేక్షణమున నమోఘముగను అనవద్యముగను రూపొందు భాగ్య మా నిఘంటువునకు లేకపోయినది

శ్రీ శాస్త్రిలవారు కవిపండిత సార్వభౌములు, విమర్శకాగ్రగణ్యులు, వాగ్మివతంసులు, వ్యాఖ్యాతృ శిరోమణులునై ఆంధ్ర గీర్వాణ సరస్వతుల కొనరించిన సేవ అనవరత స్మరణీయమైనది సరస్వతీ సేవయే తమ జన్మకు పరమార్థమని భావించి వారనన్య సాధ్యములైన కృతు లనేకము నిర్మించిరి వారన్నట్లొక యర్థమున వారాంధ్ర మధుమథనులు వారు కళాప్రపూర్ణ మహామహోపాధ్యాయాది బిరుదముల నందుకొనుటయే కాక పెక్కుసభలలో సన్మానము లందుకొనిరి; కనకాభిషేక గౌరవము నొందిరి; వేల్సుయువరాజుచే ప్రత్యేకముగా సత్కరింపఁబడిరి ఛాత్రబృందముచే దైవనిర్విశేషముగా పూజింపఁబడిరి వారి యవతారముచే నాంధ్ర వాగ్దేవి చరితార్థమైనది ఆంధ్రి

రసికుల యదృష్టము పండినది అట్టి పాండిత్యముచే, విమర్శన వైశారద్యముచే, కవితాకౌశలముచే, కథాకథన సామర్ధ్యముచే, సరసోక్తి చాతుర్యముచే, అప్రతిమాన ప్రవచన పాటవముచే ఆంధ్రదేశమున నఖండ జ్ఞానరోచిస్సులు విరజిమ్మిన అంతిమ జ్యోతులు వారు మరలనట్టి కళాప్రపూర్ణు లాంధ్రిమున నావిర్భవించుట యెప్పుడో !

"ఈదృగధీతీ శాస్త్రీ గైర్వాణ గ్రంధజాలే చ
ఆంధ్ర గ్రంథేషు తథా నహి దృష్టః శ్రుతచరో వాపి"

అను గద్వాల పండితుల వాక్యమందలి సత్యసంపన్నతకు సంతోషించుచు, శ్రీ శాస్త్రిలవారి పూజ్య కవితా పాండితీమూర్తికి ప్రణామము లర్పించుచు నీ యుపన్యాసమును ముగించుచున్నాను



# వేదము వేంకటరాయశాస్త్రి వ్యాఖ్యానములు.

- శ్రీ నేటూరి రామదాసయ్యంగార్.

కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రులవారు మా గురువు నాకు 1908-10, 1910-11 సంవత్సరములలో మదరాసు క్రిశ్చియన్‌కాలేజీలో అప్పటి ఎఫ్.ఏ. క్లాసులలోను, బి. ఏ జూనియర్ క్లాసులలోను వారు సంస్కృతమున నాటక పాఠము మాళవికాగ్నిమిత్ర మంతయు ముద్రారాక్షసమున కొంతయు చెప్పిరి అంతట వారు ఆ కాలేజీనుండి విరతులైరి. తరువాత వారు అధ్యక్షులుగా నున్న నెల్లూరి యాంధ్రభాషాభిమాని సమాజమున సభ్యుఁడనై పెక్కేండ్లు అందు "కండక్టరు"గాను, "సెక్రటరీ"గాను ఉండి వారితో సంబంధము కలిగి వారు మదరాసునుండి నెల్లూరికి వచ్చినపుడును, నెల్లూరనే కాపురమున్నపుడును అట్లట్లు వారిని శుశ్రూషించుచునే యుంటిని నాకు సాహిత్యమున తెలిసిన దంతయు వారి యనుగ్రహపు ఫలమే. వారికి సాటి పండితుఁడుగాని, కవి గాని, ఒజ్జ గాని, నట్టువొజ్జగాని లేఁడను నిరూఢమగు నమ్మకము గలవాఁడను. వారికీర్తికి నెల్లూరి ప్రొగ్రెసివ్ యూనియన్‌వారు ప్రతిసంవత్సర జయంత్యుత్సవమును జరుపుచున్నారు నేఁడు ఆంధ్రప్రదేశ సాహిత్య - అకాడమీవారు వారికి ఆంధ్రరాజధానిలో ఇట్లు గొప్ప జయంత్యుత్సవము జరుపుట ఎంతయో ఉచితమగు పని. దీనిం గాంచఁగన్న నా సంతోషమునకు మేర లేదు. అందు నన్ను ఇట్లు కలుపుకొన్నందులకు నేను ఎంతయు కృతజ్ఞుఁడను.

వారి ప్రతిభ సాహిత్యమున బహుముఖము, సర్వతోముఖము. వారు పండితులు, కవులు, వ్యాఖ్యాతలు, విమర్శకులు, ఆచార్యులు అన్ని మార్గముల యందును అఖండులు, అద్వితీయులు. అందు వారి వ్యాఖ్యాతృతావిశేషములం గూర్చి నన్ను చెప్పుమని ఆనతిచ్చినారు. "అల మిన్నందినయట్టివాని పొడువు" ఎంత యని చెప్పుదును : ఇదె ఇంచుక.

శ్రీ శాస్త్రులవారు తమ తొలిరచనగా (1) "స్త్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణము" అను గ్రంథమును 1883 వ సంవత్సరమున ప్రకటించిరి. అప్పుడు వారికి వయసు ముప్పది యేండ్లే దానికిని ముందు చిరకాలము ఆ విషయముఁ గూర్చి పలుతావుల నుపన్యసించుచుండి, ఆ యుపన్యాససారమును నాఁటి పెద్దల కోరికచే అట్లు గ్రంథముగా ప్రకటించిరి అప్పుడు పెక్కు కారణములచే స్త్రీకి పునర్వివాహము చేయఁగోరిన కొందఱు అందులకు శ్రుతిస్మృతుల యనుమతియు కలదని కొన్ని శ్రుతిస్మృతి వాక్యములం జూపి వానికి అపార్థములు కల్పింపఁగా, అవెల్ల అపార్థములనియు, యుగాంతరము లందు విధవకు నియోగమునకు మాత్ర మనుజ్ఞ కలదనియు, ఆ వాక్యములకు సందర్భ పరికలనచే అది యర్థమగుననియు, అది స్త్రీకి మాఱుమనువునకు ఎంతమాత్రము శాస్త్రము గాదనియు, వాని యర్థమును ప్రతిపక్షార్థ ఖండన పూర్వముగా నిర్ణయించి ప్రతిష్ఠించినారు. కలియుగములో నన్ననో నియోగము నిషేధింపఁబడినది మఱి తరువాత ఆ రచనకు జవాబు పుట్టలేదు. అట్లు ఆ యౌవనారంభముననే వారు ప్రతిపక్షులకు అప్రధర్ష్యులు, ఎదిరింపరాని మాటలవారు ఐరి.

తరువాత 1890 లో తమ ముప్పదియేడవ యేట (2) "విక్రమార్క చరిత్ర భోజప్రబంధములను తెనుఁగున టిప్పణముతో ప్రకటించిరి. అప్పటికి వారు క్రిశ్చియను కాలేజిలో సంస్కృత ప్రధానోపాధ్యాయులుగా ప్రవేశించి నాలుగేండ్లైనది. తమ పాండితియందు తమకు ఆత్మవిశ్వాసము కలిగి, ఆంధ్రులకును, ఆంధ్రమునకును తాము సేవ చేయవలయునను కుతూహలము తోను చేయఁజాలుదు మను ధైర్యముతోను విశ్వాసముతోను వానిని తాము ప్రకటింపఁ బూనిన కారణమును చెప్పిరి ఏమనఁగా,

"ఈ దేశములో అనాదిగా హిందువులకు ఇహపర సాధకము లైన సకల విషయములును గీర్వాణభాషయందే ఉండుటయు అందు లోని నానావిషయములలో కొన్నిమాత్రమే కొంచెముగానే దేశభాష

లలో రచియింపఁబడి యుండుటయు అందుచేతనే ఎల్లవారును సంస్కృతము నేర్చుకొనన నపేక్షించుటయు సర్వత్ర విదితమేగదా

సకలభాషలకు తల్లియు దేవభాషయు సకలరహస్య నిధియునైన యీ భాషను అభ్యసించుటకు తగిన సాధనములు - సులువైన వచనగ్రంధములు - విశేషించి లేకపోవుటచేతను, ఉన్న వయినను మంచి కూర్పులు లేనందున లేనివానితో సమానమే అయియుండుటచేతను, ఎంద తెందతో ఎంత బుద్ధిమంతులైనను ఎంతటి యాసక్తి కలవారైనను విశేషకాలమును దానికే వినియోగము చేయలేనివారు దాని నభ్యసింపక యున్నారు.

యూనివర్సిటీ పరీక్షలకై సంస్కృతమును చదువు విద్యార్థులును, ఇంగ్లీషుభాషలో పరీక్షార్థము నియమింపఁబడిన గ్రంథములనే కాక ఇతరగ్రంధములను ఎన్నిటినో చదివి ఆ భాషయందు మంచి సాహిత్యమును సంపాదించు కొనునట్లు, గీర్వాణభాషయందు కూడ అధిక పరిశ్రమ చేయుటకు పైఁ జెప్పిన హేతువుచేతనే శక్తులు గాక యున్నారు. ..

ఈ రెండువిధములవారి కొఱకును ఈ గ్రంధము ..... శబ్దమంజరి మాత్రము చదివినవారికి సుబోధ మగునదిగా నున్నందున .. అచ్చు వేయింపఁబడినది టిప్పణములో శ్లోకములకు తఱచుగా దండాన్వయమే వ్రాయఁబడినది.'' అని

అవి సులువగు వచనగ్రంధములైనను, వానియందు విశేషముగా ుహాకవుల చమత్కృత్యుదాహరణములతో నిండిన భోజప్రబంధ మందును, పస్తావవశమున ఉదాహరింపఁబడు శ్లోకముల యర్థమును ఆ చమత్కారము త్తమునకు తగులునట్లు సుబోధముగా వ్రాసినారు పెక్కు శ్లోకములకు ండాన్వయము వ్రాసినారు ఇప్పుడు స్కూళ్ళయు కాలేజీలయు ప్రశ్న పత్రములలో దండాన్వయము వ్రాయుమన్న ప్రశ్న యుండును దానికి ప్రాశ్నికు

లచే ఏమి యుత్తరము ఎదురు సూడఁబడునో తెలియదు అన్వయ క్రమమున ప్రతిపదములను మాత్రము గ్రువ్వమని కాఁబోలు మఱి దానికి అది యెట్లు అర్థమగును? శాస్త్రులవారి దండాన్వయముననో, మూలపదములు చెప్పక శ్లోకములో అవి యున్న వరుసనే, వానికి పర్యాయములు గ్రువ్వఁబడినవి విభక్తి జ్ఞానముతో అన్వయము కుదుర్చుకొని శ్లోకార్థ మెఱుఁగుట విద్యార్థికి పని యగును దండాన్వయమున- దండ మనఁగా కొలగఱ్ఱ యనియు దానితో మూలమున ఒకటికి ఇందును ఒకటి, రెండు అనుదానికి రెండు అనియు అట్లు వరుసగా కొలిచినట్లు వరుసగా వ్రాయుట యనియు, ఇందు భాష నేర్వఁగోరిన వానికి అన్వయక్రమముతోడి వాక్య మేర్పఱచుట కొంత సొంత ప్రయత్నము వలసి అది యొక భాషాభ్యాసము (exercise) అగు ననియు, అందుకోసము దానిని వ్రాసితి నని శాస్త్రులవారు సెలవిచ్చిరి ఇప్పటికి డెబ్బదియైదేండ్ల క్రింద "దండాన్వయము"ను ఈ యర్థమున ప్రయోగించి, ఆ పుస్తకమునిండ ఉదాహరణములు తాము కూర్చియున్నారు హారార్థకము "దండ"వైకృతము (శ ర). అన్వయముతో సవర్ణదీర్ఘముగా సమసింపదు మఱి "దండాన్వయమునకు" అర్థమేమి? ఇదియే కదా కాఁదగును? కాకున్న పత్రమున ప్రశ్న ఈ పద్యమునకు అన్వయము వ్రాయుమనియే కదా ఉండఁదగును? కాఁగా ప్రతిపదార్థము వ్రాయుమను నంతకన్న ప్రశ్న లఘువుగా నుండఁగోరినపుడు పర్యాయపదములు వరుసన గ్రువ్వఁడు అని మాత్ర ముండుటయు చెప్పుటయు నాఁటిశైలి యని తలంపఁదగునేమో! అట్లడుగ నేల? అరసిన అది సరి యని తోఁపదు. దండాన్వయము కేవల విభక్తి జ్ఞానము గల శిష్యునికి చెప్పి, అందుండి అన్వయముం గూర్పుమని భాషాభ్యాసము చేయించు గురువు నుపాయమే కాని, పరీక్షలో ప్రశ్నగా అడుగఁదగినది కాదు. మఱి ప్రకృతము అనుసరింతును

అప్పుడె (1890) బిల్హణ చరిత్రమును (4) కూడ పూర్ణటీకతో ప్రకటించిరి అది 153 శ్లోకముల లలిత మగు శృంగారకథ దీనికి అతి మధుర

మైనది ఆ టీక. పెక్కు శ్లోకములకు అన్వయముఖ ప్రతిపదార్థమును, కొన్ని ఇంచుక కష్టమైనవానికి సుబోధమగు అర్థమును తాత్పర్యము సయితమును వ్యంగ్యార్థమును విద్యార్థులకు అతి మధురానుభవముగా వ్రాసినారు

తరువాత 189 లో నాగానందనాటకమును, 1896 లో శాకుంతలనాటకమును శాస్త్రులవారు అనువదించినారు శాస్త్రులవారి యనువాదములు మూలమును జదువువారికి సాధుపాఠ నిర్ణయమునకును సాధ్వర్థరసానుభవమునకును మార్గదర్శకములై ఒక తెలుఁగు వ్యాఖ్యానములే యగును. కావుననే తమ శాకుంత లానువాదముం గూర్చి "కాళిదాసు శకుంతల నేలినారు" అని ఉష సూత్రిచే (1901) పలికించినారు గ్రంథవిస్తర భయమున ఉదాహరణములు మానినాఁడను.

1898లో వారు శారదాకాంచిక ప్రథమకింకిణిగా జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణ విమర్శను (5) ప్రకటించిరి అదియు వారి యాంధ్రభాషోపకారపరాయణతచేతనే. పండితంమన్యులు,సాధుపాఠనిర్ణయపూర్వముగా "నిర్దోముగా" అనుచు తప్పులతడికెగానే మహాకవుల ప్రబంధములం బ్రకటించుటచేత అజ్ఞలోకము ప్రాయికముగా ప్రతారితమౌనని లోకమునకును స్వర్గవాసి మహాకవులకును భాషకును మేలుగూర్ప సేవచేయు జతనము ఇది ఇదియు నొక్క తెలుఁగు వ్యాఖ్యానమే యగును ఒకటి రెండు ఉదాహరణములు నాయికా నాయకుల పుష్పాపచయ వర్ణన సందర్భమున -

"చం తనరు నశోక భూరుహ లతాముకుళంబున నంతరాంతరం
బున నిడి(పొ)కొన్న క్రొన్ననల భూపతిమాలికగా నొనర్చి చూ
పిన గరువంపుఁ గెంపు లెడపెట్టిన మౌక్తికహారలీల నె
క్కొను (నఁ జ) చనుదోయిపై నునిచెఁ గోమలి లేనగువంకురింపఁగన్"

ఇందలి విరోధము - ఒక్క మొగ్గలో పెక్కు క్రొన్ననలు గ్రుచ్చుట యెట్లు? మఱియు క్రొన్నన లెల్ల తెల్లనివే యని నియమము లేదుగదా! ముత్తెము; కెంపు, ముత్తెము; కెంపు; - ఈ వరుసగా గ్రుచ్చిన హారమువలెనా మాల యుండుట యెట్లు? మఱియు "ఇడుట" చాలు గదా "ఇడుకొనుట"

యేమి ? మఱియు నెక్కొనను చనుదోయి యేమి ? నెక్కొననని - ఊడుచున్న - చనుదోయియు నుండునా ? దిద్దుఁడు పద్యమును -

"ముకుళంబుల నంతరాంతరంబున నిడి
పొన్న క్రొన్ననల...నెక్కొనఁ జను..."

పొన్న క్రొన్ననలు ముత్తెములం బోలును ఆశోక ముకుళంబులు ఎఱుపు ఇపుడు పద్యముం జూడుఁడు. మఱియొక యుదాహరణము -

చ. అలరుల తోటలోన విరు లన్నియుఁ గోసితిరంచు బోటులన్
సొలయఁగ నేల ? బాల, యిటు చూడఁగదే లతికావనీరుహం
బుల దెస, త్రవ్వి తండములు పుష్పము లున్నవి యంచుఁ బ్రోడయై
పలుకు వయస్యనేర్పు కలభామిను లెల్లరు మెచ్చి రిచ్చలున్.

తోటలోని పువ్వులన్నియు బోటులు గోసివేసికొన్నా రని యొక బాల కోపగించుకొన్నది. అది గాంచి యొకచెలి "ఓసి జేలా! ఏల నీవు వారి మీఁద కోపము చేసెదవు, నీ కోసము పూవులు ఉంచినారుగారని, పువ్వులు లేకపో లేదు ; ఇవిగో ఈ తీఁగలను చెట్లనుం జూడుము వీనియందు త్రవ్వుకొనిపోఁ దగినట్లు పువ్వు లున్నవి" అని ప్రౌఢిమీఱ బలికినది దాని యా నేర్పునకు కలభామిను లెల్లను మెచ్చుకొనిరి. - అనియున్న తీఱున పద్యార్థము

పువ్వులు నాకు లేకుండఁ జేసినా రని కోపగించుచున్నదానికి పువ్వు లున్నచోటు చూపుటలో ప్రౌఢి ఏమున్నది ? ఇతర భామినులు మెచ్చుఁదగి నంత నేర్పేమున్నది ? "తిలకో వీక్షణేన చ" తిలకవృక్షమునకు దోహదము వీక్షణము గావున తిలకవృక్షములను చూడు మన్నది. మొదటిది బాల గావున ఈ దోహదోపాయము తెలియక కోపించినది కడమ స్వారస్య మూహించు కొనుఁడు.

"తిలకావనీరుహంబుల" అని దిద్దుఁడు, వాక్చాతుర్యమునకు మెచ్చిరి గాన "కలభాషిణు"లనియు దిద్దుఁడు. - అని.

ఆ సంవత్సరమే ఆంధ్రప్రసన్న రాఘవనాటక విమర్శ (6) యు ప్రక టింపఁబడినది. ఈ విమర్శలో అనువాదదోష ప్రస్తావ ముండుఁగాక. మఱి

ఆనుషంగికముగా జయదేవకవి సంస్కృత నాటకమునకు చాల మధురమగు వ్యాఖ్య ఏర్పడినది ఒక్క యుదాహరణము : సీతకు తోడుగా చండికాయతనమునకు వచ్చిన సఖి దేవికి మ్రొక్కి తన సఖి సీతకై ఇట్లు ప్రార్థించినది

"కాన్త మిన్దుమణిదామకోమలే,
కోమలేన్దు మకుటాఙ్కశాయిని,
ఇన్దుచారు మచిరేణ విన్దతాం
ఇన్దుసున్దరముఖీ సఖీ మమ."

దీనికి శ్రీ శాస్త్రులవారి వివరణము – "చంద్రకాంతమణి సరము వోలె కోమలమైనదానా (ఓ గౌరీ), బాలచంద్రకిరీటుని యంకమందు శయనించుదానా, చంద్రసుందరముఖి నాసఖి చంద్ర సుందరునిం గాంతుని శీఘ్రింబుగం బడయుఁగాక

ఇందలి విశేషణములు సాభిప్రాయములు ఇందుమతికి దాను కోమలత్వము శివునిచే దేహమందు ధరింపఁబడినందులకుఁ గారణము, కోమలేందుముకుటాంకశాయిని యనుటచే నీవలెనే ఇంచుక విరహమేని ఓర్వని కాంతుని దయసేయుమని యాహూతము. "ఇందుచారు"ననుటచే గుణాతిశయమువలన ఎల్లవారికి, ఈ చంద్రుఁడు మీకుఁబోలె శిరసా వహింపఁ దగినవానిని అని యాశయము."ఇందుముఖి ఇందుచారుం బడయుత మనుటలో సదృశోత్కృష్ట దాంపత్యముగా కూర్పుమని ప్రార్థన "కాంత' ననుటచే ఈ సీత మనః పూర్తిగా నెవనిం గామించినదో వానిని అని భావము.

నాలుగు పాదములందును ఇందుని చెప్పుట చేత – హర ధనుస్సును హరచూడా బాల శశాంకాకారముగా ఎక్కువెట్టుటయు, క్రమ క్రమముగా టంకారము చేసి ఆకర్షించి పూర్ణ శశాంకాకారముగాఁ జేయుటయు సూచితములైనవి. ఈమె కోరువాఁడు ఇందుమణిదామము వోలె (అశ్రమముగా లీలగా) ధనుస్సును గ్రహించి (అనమిత ధనుస్సు వ్రేలుచున్న దామమువలె వంపు లేక యుండును) తనచెంత హరముకుటేందుని వలె నుండున ట్లెక్కువెట్టి (రెండవపాదమున ఇందునికి కోమల విశేషణము ఉన్నది.) క్రమ క్రమముగా

పూర్ణేందునివలెఁ జేయుచు (ఇందుచారు - కోమలవిశేషణ మిట నభిలషితము గాదు), పూర్ణేందునివలెఁ జేసి (ఇందు సుందరముఖి) ముఖమునకు సరిగా తెచ్చి, ఆకర్ణాంతము లాగునట్లుగా ననుగ్రహింపు మనియు ప్రార్థనాశయము

నాటకమున ఇతివృత్త సందర్భము అంత చమత్కారకారి గాకున్నను, ప్రసన్న రాఘవమున జయదేవుని ప్రతి శ్లోకమును అతి రసవంతము దానిని విప్పి పాఠించి శాస్త్రులవారు ఇట్లు "పద నిర్వృత్తి" కూర్చినారు.

1901 లో కాళిదాసుని మేఘసందేశమునకు ఆంధ్రవ్యాఖ్య వివరణము కూర్చినారు రసవత్తలో మేఘమునకు మేఘమే సాటి. తరువాత దానిని ఎందఱో అనుకరింపఁ జూచిరికాని, ఒకరును దానికి ఈడుగా చెప్పఁజాల రైరి. దాని వ్యాఖ్యానముం గూర్చి,

"భారతీ కాళిదాసస్య కువ్యాఖ్యా విషమూర్ఛితా,
ఏషా సఞ్జీవనీ టీకా తాముద్యో జ్జీవయుష్యతి"

అని మేఘకువ్యాఖ్యల విషమును విఱిచి మల్లినాథుఁడు "మేఘే గతం వయః" అని తన వయసునెల్ల దానికి దారవోసి సంజీవనము గావించినాఁడు. శాస్త్రులవారికి మల్లినాథునియందు కొలువరాని గౌరవము సంజీవనిని తు.చ. తప్పకుండ తెలుఁగున అనువదించినారు తాత్పర్యపద ప్రయోజనాదికమును విస్తరించివ్రాయుచు, అదెల్ల ఆ సంజీవనియందు ఇమిడియుండునదే అన్నట్లు తమ టీకను సంజీవనీ "చేటిక" అన్నారు "నామూలం లిఖ్యతే కిఞ్చిత్నాన పేక్షిత ముచ్యతే" అని మల్లినాథప్రతిజ్ఞ కావున తమ పదప్రయోజనములోని దెల్ల తదపేక్షితమ యగునని శాస్త్రుల హృదయము అట్లే అవతారికలో ఆనతిచ్చినారు "ఇట్టిదంటచే (కాళిదాసునిచే) ఏ పదమును ప్రయోజన నిరపేక్షముగా ప్రయుక్తం బయి యుండదని యూహించి పదముల ప్రయోజనం బుల నరసితిని. నాకుం దోఁచిన యా ప్రయోజనములు మల్లినాథసూరి సూత్ర ప్రాయముగా సూచించినవానికి ప్రాపకములుగా వృత్తిప్రాయములుగా సరి పడుచు రాఁగా, మదీయంబులును కవిహృదయంబ కా నమ్మిక వొడముడు సందర్భశుద్ధ్యాది సమాధానములను సరిచూచుకొని ఇందు ప్రకటించితిని"

అని శాస్త్రిలవారి ప్రతిపద టీకాతాత్పర్య పదప్రయోజనములం జదువునపుడు కాళిదాసు భారతి యిడు సద్యోనిర్వృతిలో సహృదయునికి మునుఁగుచు తేలుచు ఈఁదులాడుచున్నట్లుండును ఏ శ్లోక వ్యాఖ్యను మచ్చునకు ఉదాహరింతుమన్నను ప్రతిదియు నన్ను నన్ను అని ముందునకు దూఁకునట్లున్నది. ఐనను ఉదాహరించెదను. పూర్వ మేఘాంతిమ శ్లోకము :-

"తస్యోత్సఙ్గే ప్రణయిన ఇవ స్రస్త గఙ్గాదుకూలాం
నత్వం దృష్ట్వా న పునరలకాం జ్ఞాస్యసే కామచారిన్
యా నః కాలే వహతి సలిలోద్గార ముచ్చైర్విమానా
ముక్తాజాలగ్రథిత మలకం కామినీవాభ్రబృన్దమ్"

(ప్రతిపదార్థానంతరము) తాత్పర్యము:—కైలాసముయొక్క యుపరి భాగమందు అలకానగరము, ప్రియతముని తొడయందు కామినియుంబోలె సొంపొందుచుండును కామచారి వగుటచే ఇంతకుముందే పలుమాఱు చూచిన నీకు ఇపుడు మఱల చూడఁగానే అది యలక యని తెలియకపోదు మేఘములకు, మీకును, ఆ యలకకును విశేషమైన సంబంధముకూడఁ గలదు. ఎట్లన, ఆ యలకాపురి మేఘకాలమందు నీరు స్రవించుచున్న మేఘపంక్తి వలన ముత్యాల సరములచే నలంకృతములయిన ముంగురులు గల కామిని వోలె శోభిల్లుచుండును.

పదప్రయోజనము - కైలాసునికి ప్రియతముఁడు, ఉపరి భాగమునకు తొడ, గంగానది జాఱుటకు వలిపపైఁట యెడలుట, అలకకు కామిని, నీటి బిందువులు కురియుచున్న మేఘములకు ముత్యాలసరముతోడి ముంగురులును ఉపమానములు ప్రియతముని తొడపై కూరుచుండి, వలిపంపుఁబయ్యెద జాఱి ముత్యాలసరములతోడి ముంగురులు గలిగి శోభిల్లు కామినివోలె, అలకాపురి కైలాసుని పైభాగమున తాను నెలకొన్నదై, తనవెంబడి గంగ జాఱుచుండఁగా, సజలోద్గారమేఘములతో శోభిల్లుచుండునని యభిప్రాయము; అత్యంత దర్శనీయ యని భావము నీవలనఁగదా ఇపుడు అలకాపురికి అట్టి శోభ గలుగును అని భావము "గఙ్గామకూలామ్" తెలుపుగాన దుకూల సామ్యము.

"కామచారిన్" అంతకుముందే పలుమాఱు చూచినాఁడని భావము. "విమానా" "ఉత్సజ్గే" "సక్తిస్తదనుకూలా" ఇత్యాదులచే కైలాసునియందు ఁనుకూలనాయకత్వమును, అలకయందు స్వాధీనపతికాత్వమును సూచితములు. తెల్లవలిపముచే పద్మినీజాతి - "ధవళ కుసుమవాసో వల్లభా పద్మినీస్యాత్" "వి(గత) మానా" - మానము తీఱిన దనుటచే, తత్పూర్వము ఉండినదని తెలియుచున్నది. అందుల విశేష మేమనఁగా, అలుకతీఱిన స్థితిలో ప్రేమావేశము బలీయము. అలిగిన కాలమందు నిరుద్ధమైయున్న ప్రేమరసమెల్ల అలుకతీఱినప్పుడు మిక్కిలి గాఢముగా ప్రకటమై వెల్లివిరియును కావున "అమానా" అనక "విమానా" అని మహాకవి ప్రయోగించినాఁడు. అలుకతీఱి నాయకునితొడపై నెక్కిన నాయికవలె అలక శోభిల్లుచుండునని భావము. ఇట్లు అనుకూల దాంపత్య భోగవర్ణనము తనకును అట్టి మంచికాలము వచ్చునా అని యక్షుని యాశంసను సూచించుటకును, సర్గయును ఇట్టి వర్ణనతో ముగించుట కవి పరితృవ్యాఖ్యాతృపాధ్యాయాదులకు సకల మంగళ సంపాదనార్థంబును" అని

1909 లో అమరుకమునకు ఆంధ్రవ్యాఖ్య - టీకా తాత్పర్యములతోడిది ప్రకటించినారు. మేఘ వ్యాఖ్యావతారికలో అమరుక మొకటి. మేఘమునకు సాటియైనది కల దన్నారు. అది అనవద్యహృద్య మృదుమధురప్రబంధము, శృంగార రసోత్తరంగము అందలి శ్లోకముల నెన్నిటినో ఉదాహరించుకొనని ధ్వన్యాలోకాద్యలంకార గ్రంథ మొకటియు లేదు ఆ రసవంత మైనదానికి అర్థతాత్పర్యములు ఎంతయో ఆనందము కలిగించునట్లు నాజూకుగా వ్రాసినారు శ్రీ శాస్త్రిలవారు. ఉదాహరణముచే ఈ గ్రంథము విస్తరిల్లును. మఱి యుదాహరణము లేక తెలియు టెట్లు? తనియు టెట్లు? ఒక చిన్న శ్లోకము :-

"క్వ ప్రస్థితాసి కరభోరు, ఘనే నిశీథే?
ప్రాణేశ్వరోవ సతి యత్ర మనః ప్రియోమే,
ఏకాకినీ వద కథం నబిభేషి, బాలే?
నన్వస్తి పుఙ్ఖిత శరో మదనః సహాయః."

సఖి:- "నడికిరేయి కటికిచీకటిలో ఎక్కడికి పోవుచున్నావే?"

నాయిక:- "నా ప్రాణనాథుని కడకు"

సఖి:- "ఒంటరిగా పోవుచున్నావే, భయము లేదా?"

నాయిక.- "భయ మెక్కడిది? విల్లెక్కువెట్టి బాణము తొడిగి మదనుఁడు తోడు వచ్చుచున్నాఁడు గదా!" — అనుట.

మదనునిబారికి తాళఁజాలక ఈ యర్ధరాత్రంపుఁ గటికిచీకటిలో సాహసించి ప్రాణేశ్వరునికడకు పోవుచున్నానని నాయిక భావము

పుంఖితశరుఁడు మదనుఁడు తోడు అనుటలో, నాకు దారిలో ఎవఁడేమి యపాయము చేయవచ్చినను వాఁడు మదనబాణహతుఁడై నాకు దాసుఁడగును. కావున నాకేమియు నపాయము గలుగదు అని స్వారస్యము

ఆ సంవత్సరమే రసమంజరీ పుష్పబాణ విలాసములకు సంపూర్ణాంధ్ర టీక రచించి ప్రకటించిరి రసమంజరి నిజముగా శృంగార రసమంజరియే అది "మాధ్వీకస్యంద సందోహసుందరి"మని దాని కవి భానుమిశ్రుఁడే చెప్పినాఁడు ఈ శృంగార విస్తరము అంతయు తాను చెప్పు లక్షణమునకు తానే ఉదాహరణములు గూర్చినది. అది నూటముప్పదియేడు శ్లోకముల మొత్తము ఒక్కటొక్కటియు కాళిదాసు ప్రతిభను తలపించునవి శాస్త్రులవారి వివరణము రసము చిప్పిలుచు చిత్తమును బందిగొనును ప్రతిశ్లోకమునకు అర్థ తాత్పర్యములు చెప్పుటయే కాక అతినిపుణముగా లక్షణస మన్వయము చేయఁబడినది. గ్రంథాంతమున శృంగార నాయికానాయకులకు దర్శనము స్వప్న చిత్ర సాక్షాద్భేదముచే త్రివిధమని అందు సాక్షాద్దర్శనోదాహరణముతో గ్రంథమును ముగించుచున్నాఁడు ఇదె కనుఁడు

"చేతశ్చఞ్చలతాం త్యజ; ప్రియసఖి, వ్రీడే నమాం పీడయ,
భ్రాత, ర్మఞ్చ దృశౌ నిమేష; భగవన్, కామ క్షణం క్షమ్యతాః
బర్హం మూర్ధని, కర్ణయోః కువలయం, వంశం దధానః కరే,
సోఽయం లోచనగోచరో భవతి మే, దామోదరః సున్దరః!"

ఓ మనస్సా, ఇంచుకసేపు) చపలత్వమును మాను. (ఏకాగ్రముగా పరికింపుము.) ఓసి నెచ్చెలీ సిగ్గా ! నన్ను క్షణము పీడింపకుము ఓ యన్నా జెప్ప పాటా, (నా కన్నులను వదలుము. ఓస్వామీ మన్మథుఁడా! క్షణము ఓర్వుము. (తనివితీఱ చూడనిమ్ము ఈలోపల దర్శనప్రతిబంధముగా నన్ను ఏపకుము ) "ఏల యీ వేఁడికో లనఁగా, ౌదలయందు నెమలిపురిని, చెవులయందు కలువను, చేత పిల్లనఁగ్రోవిని దాల్చినవాఁడై వీఁడుగో అల్ల యందగాఁడు శ్రీకృష్ణుఁడు నా కన్నులకు విషయ మగుచున్నాఁడు" అని

సఖి అన్న అనుసంబోధనలచే నాపై చెలిమియు దయయు వహింపుడు అని భావము. భగవచ్ఛబ్దము జ్ఞానశక్త్యాది సంపన్న వాచకము గావున తత్సంబుద్ధికి స్వామీ, నీవు మా చిత్తావస్థ నెఱుఁగుదువు. ఇదొక వరముగా వేఁడెదను అని భావము దామోదరుఁడు అనుటచే యశోద ఈయనకడుపునకు త్రాఁడు చుట్టి ఈయనను ఱోటికి కట్టివేయుటలో నగు నద్భుత వృత్తాంత స్మరణము సూచితము దానిచే ఇంతకుముందు అమితముగా శ్రవణగోచరుఁడైన మహానుభావుఁడు అని సూచన. శ్రుతపూర్వుఁడు గావుననే "సోఽయం" అనుట ఇట సాక్షాద్దర్శనము స్ఫుటమే కవియు నిట గ్రంథాంత మంగళముగా దామోదర సాక్షాత్కారమును వర్ణించినాఁడు ఏతద్గ్రంథరచనా రూపోపాసనకు మెచ్చి శ్రీకృష్ణభగవానుఁడు దర్శన మిచ్చినట్లు చమత్కారము

పుష్పబాణవిలాసము ఇరువదియాఱు శ్లోకముల చిన్నగ్రంథము అది కాళిదాసరచితమని సంప్రదాయముగాని గట్టిగా రుజువు దొరకినది గాదు ప్రతి శ్లోకమును కాళిదాసురచనను స్ఫురింపచేయును దాని ప్రతిపదార్థ తాత్పర్యములందును శాస్త్రిలవారు రసపారణ విందునే కుతుకబంటిగా, వెగటించుకయు లేకుండ, పెట్టినారు.

అప్పుడే ప్రియదర్శికా నాటికను, శ్రీహర్షమహారాజకృతిని, తెనుఁగున సంపూర్ణ టీకతో ప్రకటించినారు అది యొక క్రొత్త ఫక్కి పుటలో పైసగమును నిలువున మరల రెండు సగములు చేసి ఎడమతట్టు మూలమును, కుడితట్టు ఆంధ్రానువాదమును కూర్చి, క్రింది సగమున సంపూర్ణాంధ్రవ్యాఖ్య సమ

కూర్చినారు. కలకత్తా ప్రిన్సిపాల్ శారదారంజన రే పండితుఁడు శాకుంతలమును అట్లు ఆంగ్లానువాదముతోను, గీర్వాణవ్యాఖ్యతోను ప్రకటింపఁగా ఆ తీఱును మెచ్చుకొని తాము అవలంబించినారు "శృంగార రసగుళిక" యనందగు ఈ రసమయ ప్రబంధమును ఆంధ్ర సంస్కృత విద్యార్థి లోకమునకు అరఁటిపండువలె ఒలిచి నోటఁ బెట్టుటకై సంస్కృత టిప్పణముతోను, తెనుఁగున సంపూర్ణ టీకతోను ఈ ముద్రణముం గావించినాఁడను - అని తామే అన్నారు ఆ మార్గమున పెక్కు సంస్కృత నాటకములఁ బ్రకటింపఁ దలంపుఁ గొన్నారు కాని, అది నెఱవేఱలేదు ఆయినను "పెద్ద లెల్లరును తమ శిశువుల కొఱకైన యీ మదీయ శ్రమను సఫలతం బొందింతురు గాక" అని దాని పీఠికలో ఎచ్చరించి తమ సదుద్యమమును ఆంధ్రలోకోపకారమునకైన తమ దీక్షను దానిని సాధించు ధీరతను ఆత్మవిశ్వాసమును మరలం బ్రకటించినారు.

1910 వ సంవత్సరమున భర్తృహరి సుభాషిత శతకత్రయిని, కాళిదాసు రఘువంశ కుమారసంభవములను ప్రసిద్ధ సంస్కృతవ్యాఖ్యతోను తమ యాంధ్రటీకతోను ప్రకటించినారు ఆంధ్రవిద్యార్థులు వాని సాయమున సొంతముగా సాహిత్య మలవఱుచుకొందురుగాక యని నిజాభీష్టము మల్లినాథుని సంజీవని వలెనే శాస్త్రులవారి యాంధ్రటీకయు తాత్పర్యమును పరితలను సులువుగా వాని రసమున ఈఁదులాడించి సంస్కృత భాషాప్రీతిని కలిగించి పెంచును.

తక్కిన ప్రసిద్ధ గీర్వాణకావ్యములకును భారవి మాఘ నైషధములకును తొలి యాఱు సర్గలకు అట్లే తెలుఁగు టీకా తాత్పర్యములు వ్రాయను, ప్రకటింపను దలంపుఁ గొనిరి. ఒకతూఱి ఆ యభీష్టమును నాకుం జెప్పి "మూఁడు నోటుబుక్కులు కుట్టి అందు శ్లోకసంఖ్యయు, ప్రతి శ్లోకమునకు మల్లినాథుని యన్వయక్రమమున మూలపదములను ఎడమతట్టు ఒకదానిక్రింద నొకటిగా వ్రాసి సిద్ధము చేయుదువేని నేను తెలుఁగు ప్రతిపదములను తాత్పర్యమును వ్రాసివేసెద" నన్నారు. కాని అది జరుగలేదు ఐనను ఆంధ్రావళికి

తాము ఈ సేవ పూర్తిని సంకల్పించిన మాటను ఇట్లు ఇందు ఉదాహరించి నాఁడను.

మఱి అమరనామలింగాను శాసనమునకు సంస్కృతాంధ్ర టీక గురుబాలప్రబోధిక యనునది యున్నను, శాస్త్రులవారికి వైయాకరణమహామహోపాధ్యాయ భట్టోజీ దీక్షితుల కుమారుఁడు భానోజీ దీక్షితుఁడు రచించిన "అమరవ్యాఖ్య సుధ - రామాశ్రమి" అను పేరులం బరగునది మిక్కిలి ప్రియము. అమరమును చక్కఁగా ఎఱుంగుట సాహిత్యాభ్యాసమునకు అత్యావశ్యకముగదా అమరముంగూర్చి "సర్వం భాష్య మచూచురత్" అను నాభాణకము గలదు. దానికి తాము తెనుఁగున ఒక టీక వ్రాయఁదొడంగిరి అది వా రొండెడ నన్నట్లు శిశువులకు అరఁటిపండు ఒలిచి నోటఁ బెట్టినట్లు ప్రసన్న మధురముగా నున్నది "దెమి" రెండుఫారములపాటి అచ్చైనది కాని, తరువాత ఏ కారణముననో సాగక నిలిచిపోయినది.

1910 లో తెలుఁగున చేమకూర వేంకటరాజ ప్రణీత సారంగధర చరిత్రమును, 1911 లో తత్ప్రణీతమునే విజయవిలాసమును వ్యాఖ్యతో ప్రకటించిరి సారంగధర చరిత్రయు, అంతకన్నను విజయవిలాసమును "అద్దములోని లిబ్బివలె ఆబ్బియు అబ్బని యర్థములచే నబ్బురం బొసంగుచు కాకలీగీతముంబోలె మధురం బయ్యు నస్ఫుటంబై రసికగోష్ఠులయందు సందేహాంతచర్యలకుం గారణంబైన కాకిమెలఁకువలతో నిండిన రసోత్తర ప్రబంధము" లన్నారు మఱియు "ఈ చేమకూర చక్కెరమడిలో అమృతము పాఱించి పెంచినదిగాని మట్టిలో నీరు పాఱించి పెంచినది గాదు ఇందు పూమొగ్గలు వోలె తామె విడు శ్లేషలును, ద్రాక్షాపాకంబున నోరూర రస మొల్కు రచనలును, విసిగింపని వర్ణనలును, బరువులు నెరువులుంగాని కబ్బంపఁ దొడవులును ఈ ప్రబంధము(ల)ను భారతీ భాండాగారమందు కడు నుచ్చస్థానమందు నెలకొల్పుచున్నవి" అన్నారు. ఆ కావ్యముల యీ వర్ణన యెంతయో యనుభవంపుఁ బరీవాహముగా పొరలినట్టిది. సందేహాంతచర్యలకు కారణ మగు కాకిమెలఁకువలు అన్నందున పదముల విఱుపు ఇటా అటా అనియు, అర్థ

నిర్ణయమును ఇటా అటా యనియు ప్రమాతలకు తోఁచుచు పదనిర్వృతి నొసంగుచునే యుండును ఉదాహరణముచే గ్రంథము విస్తరిల్లును కావున చిన్నది ఒక్కటే -

"భ్రమరక మనోహరం బౌటఁ బద్మ మగును,
తారకాహృద్య మగుట సుధానిధి యగు,
రెంటి జగడాలు మోమున నంటి యుంట
నబ్జముఖి యంట లెస్స యీ యలరుఁబోఁడి

భ్రమరక = తుమ్మెదలచే (ముంగురులచే అని భావము.) తారకాహృద్యము = నక్షత్రములకు మనోహరము. (కనీనికలచేత మనోహరము అని భావము ) సుధానిధి = చంద్రుఁడు ఇ య్యలరుఁబోఁణిన్ = పువ్వువంటి శరీరము గల యీ సుభద్రను, అబ్జముఖి యంట లెస్స — అబ్జ శబ్దము కమలము నందును, చంద్రునియందును వర్తించునుగాన "అబ్జముఖి" యనుట ఉభయ సమ్మత మగునని చమత్కారము. రెంటిజగడాలు...యుంటన్ = పద్మ సుధానిధులయొక్క పోరాటములు ముఖమునందు తగిలి యుండుటచేత — (రెంటియొక్క ఉత్కృష్టకాంతి అంటియున్నందున అని భావము.)

పిమ్మట 1916 లో శ్రీనాథుని శృంగార నైషధమునకు "సర్వంకష" యను వ్యాఖ్య ప్రకటించిరి సంస్కృతమున "నైషధం విద్వదౌషధమ్" అను నానుడి కలదు అది నారికేళఫలపాకమునం జవియైన భట్టహర్షుని కవితానుగుంభనము. ఆ గ్రంథమునకు పూర్వ వ్యాఖ్యలు లేవు. మల్లినాథసూరి తన మాఘవ్యాఖ్యను, అట్లే క్రొత్తదైనదానిని సర్వంకష యని పేర్కొనెను శాస్త్రులవారును తమ వ్యాఖ్యకు "సర్వంకష" యని పేరిడిరి ఆతని మహాకావ్యవ్యాఖ్యాన నియమము లన్నియు తామును ఇందు పాటించిరి.

"ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా
నామూలం లిఖ్యతే కిఞ్చిత్ నానపేక్షిత ముచ్యతే."

ఇట్లు వ్రాయు వ్యాఖ్యకు ఇదియే సాధుమార్గమని వారి తలంపు. "ఆకాంక్షా" మార్గము ఇంచుక రస "ప్రవాహ" పరిపంథి యగునని యెన్నఁబడినది. "ఎక్కడి

మాటకు, ఆవశ్యకమేని, నిఘంటువు అక్కడనే; ఎక్కడి వ్యాకరణాది విశేష వివరణమును అక్కడనే, ఇట్లు చెప్పుచు, ఏర్చిన ప్రతిపదమును వ్రాయుచు, దేని భావవిశేషమును దానికడనే తెలుపుచు, మఱియు ఎక్కడి కక్కడే అలంకారాది నిర్ణయమును చేయుచు క్రమముగా వ్రాయుచుంబోవుట.

ఇదిగో మల్లినాథుని సర్వంకష ప్రతిజ్ఞ :

"యేశబ్దార్థపరీక్షణ ప్రణయినో యేవా గుణాలంక్రియా
శిక్షాకౌతుకినో, విహర్తు మనసో యే చ ధ్వనేరధ్వని,
శుభ్యద్భావతరఙ్గితే రససుధాపూరే మిమఙ్క్షన్తియే,
తేషా మేవకృతే కరోమి వివృతిం మాఘస్య సర్వంకషాం."

ఇట్టి సర్వంకష వ్రాయుటకు అన్ని విషయములును జిహ్వాగ్రముననుకొనగోటను ఉండకున్న అలవిపడునది కాదు. సర్వంకషను ముగించి ప్రకటించిన క్రొత్తలో శ్రీనాథుని 1200 పద్యములు, వారి మూలశ్లోకములు, ఒక్కొక్కదాని వ్యాఖ్యలోను తాము వ్రాసినవి ఉదాహరించినవి - ఇవియెల్లను — రాయల్ ఆక్టేవో 800 ల పుటలును తుచ తప్పక వారికి స్మృతిలో నెలకొనియుండినవి (అట్లే ఆముక్తవ్యాఖ్యా ముద్రణ ప్రకటనముల యనంతరము—అంత గ్రంథమును.) అట్టిది వారి మేధాధారణ తమ చిత్తమునకు ఎంత తనివియు, తృప్తియు లేకుండిన,

"నైషధము విప్పి నిధుల్ నెఱచూఱ లిచ్చితిన్"

అని శాస్త్రిలవారు త్రేన్చియుందురు. అట్లే,

"అత్తెఱఁగు గాక నీ హొత్త మవని దిరిగి
నాట బాటను బేటను వీటఁ గోట
దివిరి చాటించు నీకీర్తి దవిణ గొట్టి
సరస లక్ష్మీనరస సాధుసంఘశింస!"

ఒక పద్యమును ఊరక పఠించెదను :—

"పవనాహార విషంబు సోఁకదు
యదౌపమ్యంబునం గేకిఁ, గే
కి విలాసంబునఁ దొండవార ఘటి
సంక్రీడించుటన్ క్ష్వేళ మ
భ్యవహారించెఁ గపాలి, యన్న మఱి
యేలా చెప్పఁ దచ్ఛక్తి? య
న్నవగారుత్మత భుక్తిపాత్రి
యొసఁగెన్ రాజాత్మజాభర్తృకున్"

"భదే సదైవ భవిమస్య బిభ్రతాం
న కేకినాం సర్పవిషం ప్రసర్పతి ;
న నీలకణ్ఠత్వ మథాస్య చిత్రచేత్
స కాలకూటం భగవా నభోక్ష్యత"

*(XVI-30)*

మూలమునకు శ్రీనాథుఁ డెంత మెఱుఁ గిడినాఁడు !

1920 లో "విమర్శ వినోద"మని యొక గ్రంథమును ప్రకటించిరి. దానింగూర్చి శ్రీ శాస్త్రిలవారే "ఈ పుటలలో రసికప్రమోదార్థము కావ్యాది వాఙ్మయంబున టీకాకార సంపాదక ప్రభృతుల ప్రమాదములం గొన్నింటిని యథామతి నివేదించితిని......ప్రమోదమే ముఖ్యోద్దేశ్య మగుటంబట్టి బుద్ధికి క్లేశ మొసంగని విషయములనే కూర్చినాఁడను"అన్నారు ఇది తత్కాల నిజ వినోదమునకై సంకలితము గ్రంథవిస్తర భయమున ఉదాహరణములను మానినాఁడను.

అనంతరము 1927 లో ఆముక్తమాల్యదా సంజీవనిని ప్రకటించిరి. అప్పుడు మరల పలికినారు -

"వేసర కాంధ్ర నైషధము
విప్పి నిధుల్ నెఱచూఱ లిచ్చితిన్
జేసితి నిష్ఠ తత్పరత
సేవలు చూడికుడు త్తదేవికిన్ " – అని

నైషధ సర్వంకషయు, ఆముక్త సంజీవనియు విశాలాగాధామృత హ్రదములు కవి సహృదయులు అందు ఇఁక చాలునని తనివిగొనక సదా ఈదులాడుచుండఁ గోరుదరు పద్యములు గద్యములు ఇందలివైనను అందలి వైనను ఇంత యనరాని ప్రౌఢి కలిగియు, వ్యాఖ్యతోడున, భయము వీడి సంతసమున ఎంత ఈదులాడి యనుభవించినను రసికులకు తనివి గలుగదు అట్లు వానిం జదువఁగల్గుట ఎన్నియో నోములఫలము. అట్లు వాన సాహిత్యాచార్యులు చెప్పిన "సద్యఃపరనిర్వృతి" కలుగుచునే యుండును. ఆ వ్యాఖ్య లది ఎట్టి యుదాత్తమైన రసవంతమైన భాష. అందు ఆ కావ్యశ్రీకి పుష్పక విమాన విహారము! అది వర్ణింపఁ దరము గాదు అనుభవైకవేద్యము ఈ కాల దేశ నియమములు గల యుపన్యాసమున ఉదాహరణము శక్యము గాదు. ఒక్క పద్యమే ఉపన్యాసపు – అరగంటను అక్రమించును. ఆముక్తలో ఒక్క పద్యమును చాల సులువైనను చాల ప్రసిద్ధమైనదానిని ఉదాహరించెదను. వ్యాఖ్యయు సంజీవని గదా!

"ఆంధ్రభాషయు సాధ్యంబె, యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ.
... ... ... ... ...
తెలుఁ గదేల యన్న, దేశంబు తెలుఁ, గేను
దెలుఁగువల్లభుండ తెలుఁ గొకండ,
ఎల్ల నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి,
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స."

దీనికి పూర్వవ్యాఖ్యలో :

తెలుఁ గొకండ = తెలుఁ గొక్కటియే (అనఁగా అది వింత గాదనుట) ఎల్లనృపులు గొలువన్ = సకల రాజన్యులు సేవింపఁగా, బాసాడి = నీవు సంభాషించి, ఎఱుఁగవే—కాక్వర్థమువలన సకల దేశభాషలను ఎఱుఁగుదు వనుట. రాజులెల్లరు కొలువఁగా నీవు తెలుఁ గొక్కటియే సంభాషించి యెఱుఁగుదు వనుట. మఱి నానా దేశ రాజులతో నానాభాషలవారితో రాజు తెలుఁగొక్కటియే భాషించి యెఱుంగుట యన నేమి? ఏ భాష రానియెడ ఆ భాష మాటాడుటయు వినుటయు న్యాయ్యము నాణెము అగును. తాను స్వయము కన్నడ రాయఁడు తనకును తెనుఁగు ఇంటిభాష కాదు తానును "బాసాడి" అలవఱుచుకొన్నదే, శాస్త్రిలవారు అఱవలయ్యు ఆంధ్రమహాపండితులును కవులును ఐనట్లే; రాయఁడును.

సంజీవనిలోని యర్థము :—తెలుఁ గొకఁడ = తెలుఁగుభాష యన్ననో పులకండము. ఎల్లనృపులున్ కొలువన్, (బాసాడి = ) సంభాషించి, దేశభాషలందు తెలుఁగు లెస్స ( = ఉత్కృష్టము) ఎఱుఁగవే = ఎఱుఁగుదువు గదా. తాత్పర్యమునను "మూఁడవకారణము ఆ రెంటి కంటెను గొప్పది. అది ఏమన, తెలుఁగుబాస యనఁగా పులకండము గదా! నానాభాష లాడు రాజులు నిన్నుఁ గొలుచునపుడు వారితో నా యా భాష లాడి దేశభాష లన్నిటిలోను తెలుఁగుయొక్క యా యుత్కర్షను నీవు కనిపెట్టి యుండలేదా..."

"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను నానుడి ప్రసిద్ధమై తనకుం బూర్వమునుండి దిగినదిగాని ఆముక్తరాయని కూర్పు కాదు. క్రీడాభిరామము చాల ప్రాచీన కావ్యము అందిట్లు గలదు :-

"జనని, సంస్కృతంబు సకల భాషలకును,
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స,
జగతి తల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చ నాఁడుబిడ్డ మేలు గాదె!"

"సన్తో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యన్తే
వైకృత కావ్యాని చాన్య దపహాయ."

అని వాగనుశాసన నన్నన కారిక.

"అమి అం పాడి అకబ్బం" అను గాథాసప్తశతి హాలునియు,

"పరుషాః సంస్కృతగుమ్ఫాః
ప్రాకృతగుమ్ఫోఽపి భవతి సుకుమారః
పురుష మహిళానాం
యావదిహాన్తరం తేషు తావత్"

అను రాజశేఖరునియు గల సూక్తులయందలి ఆ యమృతత్వమును సౌకుమార్యమును తెలుఁగునకు అతిదేశించుకొనఁ దగును అటవ శ్రీ శాస్త్రిలవారు తెలుఁగు అతిమధురము అన్నారు. "ఆంధ్రము పాడని యటవ లేఁడు; అటవము పాడెడు ఆంధ్రుఁడు లేఁడు" అనియు అన్నారు అట్టే అది కలకండ యనుటను అందు వ్యాఖ్యం గూర్చినారు.

సర్వంకషా సంజీవనులలో ఆ యా యెడ ప్రసంగవశమున ఆంధ్రమున బాలవ్యాకరణమును ప్రౌఢవ్యాకరణమును ఉన్నను, అవి యసమగ్రములే యయి, వాన ఎన్నియో సందియములు కలుగుచునే యున్నందున, తమ తేటిన యభిప్రాయములను, నిర్ణయములను సకల విప్రతిపత్తి సమాకలన పూర్వముగా వివరముగా సమకూర్చి యున్నారు.

శ్రీ శాస్త్రిలవారి యనువాదములును, 1891 లో ప్రకటితమైన కథాసరిత్సాగర నాగానంద నాటకములు మొదలుకొని 1932 లో ప్రకటితమైన హితోపదేశ చంపువు వఱకుం గల కావ్యనాటకములును, సాహిత్యదర్పణమును అసదృశములగు ఆంధ్రగ్రంథము లగుటయ కాక, సాధుపాఠ నిర్ణయమునకును, సాధ్వర్థనిర్ణయమునకును దారి చూపుచు ఒక తెలుంగు వ్యాఖ్యలుగాను గొనఁదగి యుండును వాన నా యనుభవ మట్టిది. గ్రంథ విస్తర భయమున వాని యుదాహరణమును మానితిని

సాహిత్యమార్గమున ఎందు ఎప్పుడు దేనిగూర్చియు అలవోకగా ఏ ప్రశ్న యడిగినను సమాధానము సంసిద్ధముగా అప్పుడే ఆనతిత్తురు నా మిత్రమొక యాంధ్ర "పండిట్టు" శ్రీ శాస్త్రులవారు తమ నాటకమునకైన నటుల యొద్దికను ( = rehearsal ) చూచుచు ఆ పరాకున నుండ తటాలున 'స్వామి, గుప్తార్థప్రకాశిక యను బాలవ్యాకరణ టీకలో తద్ధితమున అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహాత్ప్రయోగంబుల నెఱుంగునది (౨౮) అను సూత్రపు వృత్తిలో పెండ్లి శబ్దంబునకు "మఃడుబర్థంబునం "దము" ప్రత్యయం బగునని యుండ, ఆ గుప్తార్థప్రకాశికలో ఇందు దోషము చెప్పి, "అ" అనియే ప్రత్యయము, "ము" ఆంధ్రభాషాస్వభావమున తనంత వచ్చు ప్రథమైకవచనము, డు ము వులలో నిది అని యున్నదే' అన్నాఁడు. "అట్లు కాదు అది తప్పు "అము" అనియే ప్రత్యయము. అట్లు గాకున్న "పెండ్లమ్ము", "పెండ్లంబు" అనియు ప్రయోగింపరటయ్యా?" అన్నారు.

శ్రీ శాస్త్రులవారు ఇట్లు అనేక కార్యముల వ్యాఖ్యానించి, అదెల్ల తాము ఒక తెఱఁగున "ఆంధ్రీమధుమధనులై" ఆంధ్రికిని ఆంధ్రులకును చేసిన సేవ యని చెప్పినారు. అది నిజముగా అట్టిదే, సాటి లేనట్టిది ; కొలత లేనంతటిది. ఆంధ్రలోకము కృతజ్ఞతాబద్ధము కావలసినట్టిది.

## ఇందు వ్యాఖ్యాన పరామర్శకై గ్రహింపఁబడిన శాస్త్రులవారి గ్రంథములు.

1. 1873 స్త్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణము
2. 1890 భోజప్రబంధము
3. ,, విక్రమార్క చరిత్ర
4. ,, బిల్హణ చరిత్ర
5. 1898 జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణ విమర్శ
6. 1900 ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటక విమర్శ

| | | |
|---|---|---|
| 7. | 1901 | మేఘసందేశము |
| 8. | 1909 | అమరుకము |
| 9. | ,, | రసమంజరి |
| 10. | ,, | పుష్పబాణవిలాసము |
| 11. | 1910 | ప్రియదర్శికా నాటిక |
| 12. | ,, | భర్తృహరి సుభాషితము |
| 13. | 1911 | రఘువంశము |
| 14. | ,, | కుమారసంభవము |
| 15. | ,, | సారంగధర చరిత్ర |
| 16. | ,, | విజయవిలాసము |
| 17. | 1913 | శృంగారనైషధ సర్వంకష |
| 18. | 1920 | విమర్శవినోదము |
| 19. | 1927 | ఆముక్త సంజీవని. |



# వేదం వేంకటరాయ శాస్త్రి నాటకాలు.

- శ్రీ మరుపూరు కోదండ రామరెడ్డి.

ముందు మాట :

"సాహిత్యరంగమున వేదం వేంకటరాయశాస్త్రిపైకి ఎగిరి అందుకొనని ఎత్తుగాని, క్రిందికి దూకి తాకని లోతుగాని లేదు" అన్న, డాక్టర్ కట్టమంచి లింగారెడ్డి - ఒఱపువేసి నిర్ణయించినమాటలో శాస్త్రిగారి సమగ్రమైన సార స్వతమూర్తి అభివర్ణితమై యున్నది. కాబట్టే డాక్టర్ రెడ్డిగారు గొప్ప పండి తులతో సంప్రదించి "కళాప్రపూర్ణ" బిరుదమును సృష్టించి, శాస్త్రిగారిని అలంకరింపజేసినారు

శాస్త్రిగారు సంస్కృతసాహితీ సంప్రదాయముల అపరంజి ముద్ద. ఈ మహాశిల్పి కుంచెలో ప్రతి పోచకు ఒక్కొక్క ప్రత్యేకప్రతిభ గలదు. పండి తుడు, విమర్శాగ్రేసరుడు, వ్యాఖ్యాతృ చక్రవర్తి, నాటక రచయిత, నాటక ప్రయోగ దర్శకుడు, ప్రథమశ్రేణి ఉపాధ్యాయుడు, గడుసరి, మధుర గంభీర వచనరచనా ప్రవీణుడు, ముద్రాపకుడు, ప్రచురణకర్త-ఇట్లు ఎన్నో అసమాన కళలకు నెలవై - సర్వ స్వతంత్రాది బిరుద విభూషణుడు యీ వేదము పండితుడు.

ఈ బహుముఖ ప్రజ్ఞాశోభితుడు - తమిళుడుగా బుట్టిన పుదూరు తెనుగుబిడ్డ ఆంధ్రభారతిని సేవించిన మహామహులలో అగ్రశ్రేణికి జెంది వెలుగొందినాడు ఇట్లే చాలమంది పుదూరు ద్రావిడులు తెనుగుభాషకు అపారసేవ జేసినారు - చేస్తున్నారు పెద్దబాలశిక్ష వ్రాసిన విజ్ఞానకోశము చదలవాడ సీతారామశాస్త్రి యీ శాఖీయుడే. ప్రసిద్ధ భారతీయులను శిష్యులుగా గలిగిన గురుశ్రేష్ఠుడు యీయన పూరీ శంకర భగవత్పాదుల పీఠ మధిష్ఠించి యుండిన ఒక మహామహునికి సంస్కృతము ఎం ఏ తరగతిలో గరపి, వారిచే అనేక బిరుదావళులచే సత్కరింపబడినారు ఈ శంకరాచార్యుల వారే అలీసోదరులతో గూడ స్వాతంత్ర్యోద్యమములో బ్రిటీషు జెయిళ్ళలో

ప్రమగ్గిన దేశభక్తులు ఈ ... వేదములందు నిక్షిప్తమైన గణితశాస్త్ర సూత్రములను వివరించి ఖ్యాతి గాంచినవారు

యుగకర్త :

ఆనాడు ఆంధ్రపండిత లోకమున గోరాడి డీకొనిన దిగ్దంతులలో ఒక రైన వేదంవారు నిజంగా యుగకర్తలు. పూర్వాచారపరాయణు లయ్యు నేటి అభ్యుదయ కవులకు - రచయితలకు మార్గదర్శకు డైన ఉదారాశయుడు. అయినను నేటి సారస్వత అరాచకవాదమును నిరోధించిన పురోగామి. పాత్రోచిత భాషను వ్యావహారికభాష అనండి — తెనుగు వాణికి అలంకారముగా సంతనపరచిన వీరు - 1897 లోనే - అప్పారావు కన్యాశుల్కమునకుముందే ప్రతాపరుద్రీయమును ప్రచురించి, వాడుకభాషకు దారి చూపినారు. ఇంతేగాదు, ప్రతాపరుద్రీయము నాటకరూపమున ముద్రింపబడుటకు చాలకాలానికి ముందే యీ నాటక రూపురేఖలు పత్రికలలో ప్రచురింపబడినవి.

గద్యం :

"గద్యం కవీనాం నికషమ్" అనిగదా పెద్దలనేది ! వీరు 8 తెలుంగుల గద్యమును వ్రాసి, ఇంద్రధనుస్సులో వర్ణశబలత ఐక్యము పొందినట్లు తమ వివిధ రచనలలో దీపింపజేసినారు సంస్కృత మాధుర్య గాంభీర్యముల బట్టీ పెట్టి దించి, తెనుగుదనపు పుట్టుతేనెతో గలిపి కథాసరిత్సాగరమున, సంస్కృత నాటకముల అనువాదములలోను పారింప జేసి పాఠకుల ముగ్ధులఁ జేయుచున్నారు.

నాటకకర్త :

ధాత్రి సాహస్ర ప్రచారంబుగ నాటకములు తన్నిగమంబు గరపినారు - అని సగర్వంగా చెప్పికొనుట నిజంగా తగియే ఉన్నది. నాటకముల వ్రాసి, నేర్పించి, ఆడించి ఆంధ్ర భాషాభిమాని సమాజ మూలకంగా నెల్లూరి వారిని, ఆంధ్రులను నలభై ఏండ్లు తనియింపజేసినారు ప్రదర్శనానుగుణ్యముగ ఆవల నాటకములందు ఎన్నో మార్పులు చేసినారు. వీరు నటించక

పోయినా పెద్దనటకునిలక్షణములు కలవారగుటచే వీరినాటకములు ప్రదర్శించుటలో రక్తిని గూర్చుచున్నవి ప్రఖ్యాత నటసార్వభౌముడు కందాడై శ్రీనీవాసన్, బంగారయ్య, సుందరరాజన్, సినిమా నటకుడు రంగస్వామి, సినిమా దర్శకుడు వై. వి రావు మొదలగువారు - భరతమునిగా శాస్త్రిగారు దీర్చిదిద్దగా ఆంధ్రనాటకరంగ వియత్తలమున మెరసిన దీప్త తారలు

ఆంధ్రత్వము :

శాస్త్రిగారు ఆంధ్రమాత అకళంకోపాసకులు. ఆంధ్రత్వమన్న వారికున్న అభిమానము ఆ దినాలలో ఏ ఇతర తెనుగుకవికి లేదంటే అతిశయోక్తి కానేరదు ఆనాడు కథలలో, నవలలో, నాటకములలో వీరరసమునకుగా రాజస్థానపు ఇసుకఎడారులకు పరుగెత్తుచుండేవారు కాని, వేదం వారు తమ రెండు చారిత్రక నాటకములకు - ఆంధ్రచక్రవర్తులు కాకతీయులను, వీరపుగడ్డ బొబ్బిలి రావువారినీ నాయకులుగా జేసినారు

శాస్త్రీయప్రాబల్యము (Classical Influence) :

శాస్త్రిగారు సంస్కృత - ఆంధ్ర - ఆంగ్లేయ భాషా సంప్రదాయములలోను, మాధుర్యములలోను బాగా ఊరి, రుచి ఎక్కిన వ్యక్తి. వీరి ఉరుదూభాషాజ్ఞానం తెలంగాణేతరులకు కష్టసాధ్య మైనది "హూణరూపకరసం బుదరంబు నిండార ద్రావి గబ్బున దేర్చి తనిచినారు" అని చెప్పుకోగలిగినారు. ఆనాటి సాహిత్య ప్రతిపక్షులు యీ గీటును మార్చి వ్యంగ్యపరచి "గ్రామ్యరూపక రసం బుదరంబు నిండార ద్రావి పిత్తెత్తి దబ్బున పిత్తినారు" అని గేలిచేసినా, పాత్రోచితభాషను భయపడి విడనాడని చదువుల బిరుదుమగడు యీ పుదూరు "బ్యామ్మడు"

వీరి నాటకములన్నీ భరతనాట్య శాస్త్రము, గీర్వాణనాటక లక్షణములు, ఆంగ్లసంప్రదాయము - వీటి మెఱుగులతో నిండి, గట్లు ఒఱచుకొని పారి, ప్రదర్శనమున రక్తిని గూర్చుచున్నవి ఇందు షేక్స్పియర్ పరిదర్శన పద్ధతులు. కాళిదాస హర్షాదుల పలుకుబడి గట్టిగా ముద్రింపబడి యున్నవి.

ఇక, మొదట వారి స్వతంత్రనాటకములను గూర్చి ఇంచుక పరికిస్తాం

## (1) ప్రతాపరుద్రీయము

ఇది వీరు వ్రాసిన మొదటి నాటకము అయినా "వ్రాసితి మున్ ప్రతాపు కథ పండితమానుల గుండె నీఱుగాన్" అని వ్రాసికొనుటను నిల బెట్టుకొనినారు. అంటే - శాస్త్రీయ నాటక నిర్మాణానికి, ఉదారాశయాలకు, కత అల్లిక మొనగానితనానికి, పాత్రల సృష్టికి, భాషాశయ్యల విభిన్నతకు దీనికి అగ్రతాంబూలము. యుగంధర పేరిగాని పాత్రలు ఆంధ్రదేశమున స్థిరస్థాయి అయి సజీవవ్యక్తులై పోయినారు. ఇవిగాక కొండె చెకుముకి, ద్రోహి ఖుస్రూ, జనార్దనుడు, సుల్తాను వలీఖాన్ మొదలగు అనేక పాత్రలు - మానవప్రకృతి భిన్నపార్శ్వములను అద్దంలో వలె యీ నాటకంలో ప్రతి బింబింప జేసినారు. షేక్స్పియర్ వలె - మహాభారతంలో వలె, వీరి మూడు నాటకములలో పలు తెఱంగులైన వ్యక్తులు సృష్టింపఁబడినారు.

భాసుని నాటకములు - పదునాలుగు - గణపతిశాస్త్రి పుణ్యాన, 1914 ప్రాంతాన అనంతపద్మనాభుని సన్నిధిలోగదా బయట పడినవి! అందుచేత శాస్త్రిగారు ప్రతిజ్ఞాయౌగంధరాయణమును చూడకయే యుగంధరుని సృష్టించి నారు. నిజంగా ప్రశంసనీయమైన కల్పనాచాతురి! వాసవదత్తాపహరణగాథ లీలగా కథాసరిత్సాగరమున గలదు. శాస్త్రి గారి సృష్టికి, వారి తండ్రిగారు చెప్పగా వినిన ఛాయయే ఆధారము. 1816-20 లో మెకంజీ సంకలనం జేసిన కైఫీయత్తులలో యీ కథ - శాస్త్రిగారి నాటకములోవలెనే - పేర్లతో సహా - వ్రాయబడి ఉన్నది. దీనినే వీరి తండ్రిగారు వినియుందురు. దానిపై శాస్త్రి గారు మహా సౌధమును నిర్మించుటే వారి నేర్పరితనం. ఈ కథను కొందరు విమర్శించి - శాస్త్రిని దెగనాడ దలచుట మూఢము దెలియని మొఱకుదనము.

ఈ రమ్యసౌధము అనన్యసాధ్యమై - ప్రపంచ వాఙ్మయమున ఒక సువర్ణపీఠమున ప్రతిష్ఠింపబడి యున్నది. ఈ నాటకమునందలి భూమికలతో బాటు భాష, చమత్కారములు, ఎత్తిపొడుపు నానుడులు, గట్టిగా నిలిచిపోయి నవి. పేరిగాని జుట్టుకు తగిలించిన స్వారస్యపుతాడు - కంటికి బెట్టిన ఆనంద

బాష్పాల కర్పూరశలాకలు-ఒకపాటి అసహజము-అతిశయోక్తిగా తోచినప్పటి కిని, ఆంధ్రవాఙ్మయము సహజ జాతీయములను సమగ్ర విశ్వభారతికి సమర్పించిన ఒక కానుకై ఉన్నది

ఒకే పోలిక గల వ్యక్తులపై ఆధారము చేసికొని అల్లిన ప్రఖ్యాత కధలు - పింగళి సూరన కళాపూర్ణోదయములోని తబ్బిబ్బుల ప్రహసనము, షేక్స్పియర్ "కామిడి ఆఫ్ ఎఱ్ఱర్స్, ది కింగ్ అండ్ ది పాపర్, ప్రిజనర్ ఆఫ్ జెండా' పరాసు నవలాకారుడు అలెగ్జాండర్ డ్యూమా గారి "కోర్సికన్ బ్రదర్సు" మొదలగునవి ప్రిజనర్ ఆఫ్ జెండా కధలో - బంధీ అయిన రాజును, అదే పోలిక గల ఇంకొకవ్యక్తి రాజుగా నటించి రాజును విడిపించును. అట్లే - ప్రతాప పేరయ్యల సరిపోయిన మొక్కట్లను శాస్త్రిగారు ఉపయోగించి, ఒక రమ్యఫణితిని నాటకము వ్రాసి హాస్యమునకు నెలవుజేసినారు. ప్రతాపరుద్రుడు, యుగంధరుడు, కడకు సుల్తాను గూడ ధీరోదాత్త నాయకులైనారు చెకుముకి పోకిరితనం, కుట్రలో పాండితి, లారెన్సు ఆఫ్ అరేబియా. నేటి చైనా పంచమదళంవారిని జ్ఞప్తికి దెస్తున్నది ఇందు ఆనాటి తురకలు - హిందువులు పన్నుచుండిన కుట్రలను జీవం బోసి మన ఎదుట నిలిపినారు

## వ్యంగ్య విమర్శన :

యుగంధరుడు పిచ్చివాడుగా నేటికవులను వారి పద్ధతులను నాజూకుగా తూర్పారబట్టి ఒక Subtu Satire ను చేసినారు మొద్దు మొద్దు కవులనే పెద్దపాటంతా ఇదే. పేరిగాని నోట గూడ - "నాను మెచ్చుకొనేలాగ కయిత్తం శెప్తే - ఆ బోజనరాజు బోంచేసేయాల, కాళ్ళు గుద్దేవోడికి ఆ కాలిదాసుకు యిచ్చినలాగా అచ్చర నచ్చర ఇచ్చేస్తా"అనుటలోను, పేరిగాని ఆస్థానకవి - "ఇక ఆరు నూరేండ్లకు పేరు దొరతనంలో కొన్ని తావుల మీబోటి రసజ్ఞులే బహుళమగుదురు వారికై మీబోటి రసికులే కవనములు చేయుదురు మీవలెనే వారుభయులు, చదువుకొన్న వారి కంటె తామే మేలనువారే" అని ఎంతటి డొక్కపోటు పొడిచినారో చూడండి. క్షాకవులను దిట్టుచు -

హెచ్చగ నీవు సత్కవుల కిచ్చు పసిండినిరాలు రంజకం
బచ్చగ నీదు దానసలిలాపగలం బడి, యా మహాబ్ధిలో
జొచ్చి శయాన శౌరి హృది జోటిగ జిట్టెము గట్ట, దానినే
లచ్చియు, బుచ్చి పాల్కడలి లక్కను, యంచు వచింత్రు కాకవుల్

అని ఎత్తిపొడుస్తూ చక్కటి ఉత్ప్రేక్ష, హృద్య కవిత్వమును వ్రాసినారు. ఇందు గడుసుదనము — సొంపు ఎట్లా పురిగొన్నవో గమనించండి

"ఆవుపేడా మీరు హల్కికొంటార్
ఆవుచ్చా మీరు తాగికొంటార్
ఆవు ఎక్వా మీకి మన్షి తక్వా
అబ్బెబ్బె ఇది ఏమీ మతాం ?"

అని మతముమీద ఒక మంచి విసరు విసరినారు.

ఇట్లే వీరి పద్యములు సమయానుకూలముగ వివిధ పాకములలో బడి వివిధ శయ్యలు కళాప్రపూర్ణుని కావ్యాలలో నిండారినవి.

నిర్మాణ కౌశలము :

సంస్కృత ముద్రారాక్షసము - మృచ్ఛకటిక, షేక్స్పియర్ జూలియస్ సీజర్, ఐదవ హెన్రి, ఆంటొని క్లియొపాట్రా నాటకములను మనసులో బెట్టుకొని ఇందలి అద్భుత కుటిల వృత్తముల అల్లినారు.

పాత్రగోపనము :

నాటకములందుగాని, కథలందుగాని పాత్రగోపనము (Concealment) ఇంద్రజాలకుని హస్తలాఘవము వలె (Trick) మరుగు పఱచి చూపించుట ఒక ప్రజ్ఞాపూర్ణవిలసనమని పెద్దవిమర్శకుల మాట. జూలియస్ సీజరు నాటకమున, సీజరు ప్రేక్షకుల ఎదుట నిలిచి ఏమీ చేయకముందే ఇతరుల సంభాషణలల్లో, సంఘటనలలో, సీజరును ఒక మహోన్నతవ్యక్తిగాచిత్రించి "అబ్బో ఎంతటివాడు!" అనిపించినాడు - ఆ కవిసమ్రాట్టు. అది మొదలు సీజరు

చంపబడినా ఆయన ప్రభావ ఛాయలు నాటకంలో చివరవరకు దట్టంగా అలుముకొనిపోయి, చరమ పర్యవసానానికి ఆయనే కారకుడైనాడు.

అట్లనే శాస్త్రిగారు ప్రతాపలో యుగంధరుని, బొబ్బిలిలో తాండ్ర పాపారాయుని ప్రవేశపెట్టినారు.

"వీర యుగంధర్ పేరు చెప్పితే నీరు విడచు గోడా ... నిద్రపోదు హాతి ... పేలదుర తుపాకి ... పారదు ఫిరంగి" అనిన్ని,

ఆయన గాలిని పేనును

"కాను యుగంధరదేవుడ, మీ నొడువు లోకదీపపు గ్రీనీడగాక నవధరింపుము నన్ను" అను మొదలైన మాటలచే ఒక మిన్నులు దన్నిన శక్తి రూపాన్ని ప్రేక్షకుల ఎదుట నిలిపినాడు. ఇది ఒక పండబారిన కళ.

అట్లే బొబ్బిలిలో పాపయ్యను ఒక భీకరమూర్తిగా విజయరాముని మాటలచేత, కీచకుని చంపిన భీమసదృశుడుగా కల్పించి, చివరకు నెత్తురు వసంత మాడించినారు ఇది శాస్త్రిగారి అనన్యప్రజ్ఞావిశేషము.

పడవలో మత్తెక్కిన సుల్తాను ఎదుట ఆడించిన అంతర్నాటకంలో, పేరిగానిని పట్టినట్లు - బొంకును గుద్దిచెప్పి నిజం చేయుట, తప్పు జేసినవారి గుండె కలవరపరచుట, హ్యాంలెటు మహా నాటకంలోని అంతర్నాటకాన్ని జ్ఞప్తికి దెచ్చి, ఆహా ! అనిపించును.

ప్రతాప చాల పెద్ద నాటకము. నా చిన్నతనంలో రెండు రాత్రులు ఆటగా ప్రదర్శింపబడేది. మరల దానినే ఒకరాత్రి ఆటగా జరిపినారు. ఈ కత్తిరింపులలో వెలితి కనబడలేదు గదా ! కథాభాగానికి రక్తి చెడలేదు. ఇది గూఢ రచనా వైదుష్యానికి ఒక నిదర్శనము.

నాటక ఘట్టములలో చెకుముకి వేగుపని, విద్యానాధ జనార్దనులు పేరిగానిచే రాజునాటక మాడించుట, పిచ్చియుగంధరుడు ఢిల్లీలోనే "ఢిల్లీసుల్తాన్ పట్టుక పోతాన్" అని ఆరునెలలు అరచుట గోవా వర్తకుల తంత్రము ప్రధానాంగములు ఇట్లే ఖుస్రూ, వలీఖానుల సమాలోచనలు - కార్యనిర్వహణ ధౌరంధర్యము, సుల్తానుదర్బారు రక్తివంతములైన సన్నివేశములు "రాజును

పట్టలేదు ; చాకలి పేరయ్యనే పట్టినట్లు'' వదంతులు వ్యాపింపజేసి తురకల దండు వీడులో, ఢిల్లీలో గందరగోళము సంశయాలు కల్పించుట నాటక కర్త ఇంకొక నేర్పు. ఇది జర్మనీగోబెల్సు కళ వంటిది చెకుముకిశాస్త్రి చాకచక్యము చదువుటకు చూచుటకు చాల సొంపుగా నుండును.

శాస్త్రీయ పద్ధతి :

కథ అతిప్రాచీనమైనది కాకపోయినా, పూర్వ శాస్త్రీయ పద్ధతిలో — విష్కంభ, ప్రవేశకాలతోను, భిన్న మతములు రాజకీయముల గలగలపు నాటకమైన ప్రతాప Classical బాణీలోనే నడచి, నిర్దుష్టంగా ఉన్నది.

పాత్రానుగుణ్యమైన భాష, కాకలదీరి వన్నె ఎక్కి భిన్నత్వంచే రాణించినది ఇందు.

రాజు బంధీ అయినతర్వాత తలపోతలందలి గద్య మెంత గంభీరమో పద్య మంత రామణీయక మైనది. భావము, భాష, ధార రాజుపరివేదనమునకు జీవము పోసినవి. ధీరోదాత్తుడైన ఆ రాజు చెప్పిన పద్యాలలో కొన్ని అమృతగుళిక లున్నవి.

"కల్ల వచించినాడనొ ? విఘాత
మొనర్చితినో సురార్చకున్ ?
దల్లి మనంబు సేయనొ ?
యదండ్యుల దండన పెట్టినాడనో ?
యుల్లము నొంతునో ద్విజున ?
కోమనొ యార్తుని ? వింటినో ఖలున్
బల్లిదమైన వైశసము పాటిలగా
గత మేమి యీ క్రియన్ ?"

*ఇట ప్రతాపుడు ప్రజాప్రియుడైన రాజుగా దుఃఖించినాడు.

"అంచెల వైరులన్ దునుము
నప్పసిధారను దోడు నిల్పి, ప్రే
మించి, కవీంద్ర భాషణల
మెచ్చుతటిన్ గనుసన్న గొల్వ, న

మ్మించి, యకాండ పిప్డు విష
మించి, త్యజించె సుషుప్తు కానలో,
చంచల కన్న చంచల
నిజంబుగ లచ్చి; ఇదే గ్రహించితిన్ ”

మెత్తగా అదృష్టమును దూషించినాడు.

“కూలినాలి చేసి కుడుచు పేద సుఖంబు
దక్కదిలను మకుటధారి కిపుడు
తలకు దాకకున్న దర కేమి దెలియదు
ఫలము గంటి దీని రాజభావమునకు.”

Un easy lies the head that wears a crown అన్నదానికి ఎంతటి చక్కటి తెనుగో చూడండి! కందాడై శ్రీనివాసన్ బోటి మా పెద్ద నటకులు దీనిని ఝంఝూటిలో పాడినప్పుడు విని కంట తడిబెట్టని సింహపురి మండలీయుడు లేడు. ఆనాడు వర్షించిన దైన్యము యీనాటికిని తేలిపోలేదు.

విధి చేత బలీయమని తల వంచి, నెనరు గల నాలుగుకాళ్ళ గుఱ్ఱానికి మానవత్వ మారోపించి -

“మా దశ నీ వెఱుంగక హు
మాదొర, డస్సితివయ్య, వీరిచే
మా దశ జూడు, నీ వలన
మానదు, నీ పొర గాదు, మన్మనో
వేదివి, ప్రాణదాత, విట
వేఱులు నీకను మాకు నయ్యె; కుం
దేటి పయోదవీధి బరి
కేగుము ; వెండియు గాంతువో మమున్ !”

అని సమాశ్వసించి కరుణమును క్రుమ్మరించిన ఘట్టము కవితా శిల్పమున పారగులైన వారికే అరపిన పనితనం “ఏమీ విష్వాషం” అని సైనికులు గూడ ప్రశంసించినారు.

ఇక విద్యానాథుడు, అలంకారశాస్త్రమును వ్రాసిన ప్రౌఢతనమును పద్యాలలోను వచనములోను వెల్లడించును ఇచటి ఉత్ప్రేక్షలు. పద్యాల నడక రామణీయకములు (చూడుడు 60 పేజి - 11, 15, 16, 17, 18.)

విధి బలీయమని - శాస్త్రిగారు ప్రారబ్దవాదులు — భావికార్యక్రమమును కుదుర్చుకొను ఘట్టమున పద్య గద్యములు రెండును ప్రౌఢశైలిలో పడినవి. అయినను జీవమును పోగొట్టుకొనలేదు. దైవగతిని గుర్తించి యీ ఆలంకారికుడు నడచుకొనుట శాస్త్రిగారి వేదాంతము బయటబడుచున్నది

ఇట్లే చెకుముకి పేరిగాని ఓలగంలో చెప్పిన పద్యాలు అన్నీ సానలు దీరిన జాతిరత్నాలు. వలీఖానుని "సాహెబ! నీకు చంద్రుడు మషాలు" అనే పద్యం నిందాస్తుతి ద్వ్యర్థిలో చూపినారు.

జనార్దనుని భాష దీనికి ఒకమెట్టు తగ్గినా, పాకము సడలలేదు ఇది సూక్తులతో నిండిపోయినది.

యుగంధర - వెఱ్ఱివానిభాషలు ఒకేచెట్టున చీలిన కొమ్మలవలె ఒకే నోట బుట్టించి పాయలు చీల్చి రసవత్తరంగా నడపించినారు.

పేరిగాడు :

ఆంధ్రులకు ఒక జాతీయవ్యక్తిగా నిలబడిపోయిన పేరిగాడు - మొదట వెఱ్ఱిబాగులతనము, రాచగద్దెపై కూర్చున్న తర్వాత బిరుసుబారిన గడుసుదనము, అదొక్క కొత్త రీతిలో సాగినవి.

ఈ రసాభాసపు సభలో గాయకులుగా అరవలను బెట్టి, తెనుగుపాటలు అరవలసొమ్ము అన్నట్లు స్ఫురింపజేయ దలచుకొన్నట్లున్నది. శాస్త్రిగారి ద్రావిడాభిమాన మెట్లు చావగలదు?

తురక తెలుగు :

శాస్త్రిగారి మరియొక అపూర్వ అద్భుతసృష్టి తురక తెలుగు! ఉన్న సొంపంతా యీ నాటకంలో యీ సంకరభాషలోనే! ఇది కృత్రిమము కాదనుటకు మా ప్రాంత ముసల్మానుల తెనుగే నిదర్శనము. చదువుకొనిన వారిలో - ఉండే తెనుగు - చాలవరకు మార్పు వచ్చినా పట్నాలలో యీ తురక షష్ఠి-

మాకి, మీకి - పోనేలేదు. పల్లెలలో మాత్రం ఇది లేదు. సర్కారుముస్లిముల తెనుగు బాగానే ఉన్నది మాకు - తట్టు గొల్లసాయిబులు అన్న ఇంకొకతెగ వున్నది వారిభాష ఇట్టి అతుకులబొంతే : "పొద్దోస్తం శిర్‌పర్ తట్టా రక్కే బేచాతో మూడ్డబ్బుల దుగ్గాని మిల్‌తా నై."

మా డ్రాయింగ్ మాస్టర్ - "ఇస్కూలు, ముష్‌లీవాడు" - అంటూనే ఉండేవాడు.

ఉరుదూలోని వ్యతిరేకార్థక క్రమము - ఉంది లేదు - సంశ్లేషము - ఉద్‌గిరి, హలంతము - చెప్పినార్, షకారము - మొదలగువాటిని శాస్త్రిగారు చేపట్టి హాస్యమునకు పాదిగా చేసినారు కన్నడుల నాటకాలలో హాస్యానికి తెనుగునే వాడునట్లు ఉదాత్త విషయములందు గూడ ఆ శయ్యలోనే వెలితి లేకుండ గురుత్వమును గూర్చుట - శాస్త్రిగారి పారశీక పాండిత్య ప్రకర్షకు అనువైన ప్రయోగం దొరికింది అనాలి

దీని ఉచ్చారణను శాస్త్రిగారే ఆంధ్రభాషాభిమానిసమాజంవారికి గఱపి సొంపు వాటిల్ల జేసినారు. ఆ శిష్య పరంపరలో చేరనివారికి ఆ బాణీ, ఆ Accent, ఆ నొక్కులు అలవడవు. ఆ పాత ఆవకాయముక్కలు ఇప్పుడు ఏ కొద్దో మిగిలి ఉన్నవి.

మచ్చుకు కొన్ని వినండి. నాటకం నిలువెల్లా మధురమైన యీ భాషలో ఏరుట కష్టమే.

వలీ—మేము వచ్చినా కారణం గొప్పదే మా సుల్తానువార్కి కాబూలు వాడ్కి పెషావర్‌పర్గణా మాకి రావాలా మాకీ రావాలా అని తక్రార్ కల్గి, ఇద్దర్కి నమ్మక్ అంగారైంది...తమ యేలినవార్ స్వయంగా దండు నడ్పుకోనివచ్చి షహాయ పడ్వాలా అని, మా సుల్తాన్వారు నా నోటితో మన్వి చేస్తున్నార్—

వలీ—(ఆత్మగతం) ఎంత వేగుచూపు ఉందిరా యీయన్కి (ప్రకాశంగా) అవష్యం షమాధానం మన్విచేస్తాం వఖ్త-ముంగ్గా మీకీ తెల్పడాన్కి మాకి ఫుర్షత్ లేకపోయింది. మా సుల్తాన్వారూ ఒరంగల్లూ మహా

రాజావార్కి మనమీద చాలా దయావుంటుందు - అండీ స్నేహం వుంటుంది. ముందు తెల్వకుండా మన్మె ఎల్లినా వారు ఏమీ ఆచ్ఛేపించరులే - ఎల్లండి ఎల్లండి అని మాకి చాలా తొందర్ పెట్టినార్...

(వలీ—రాజతంత్రము ప్రయోగింప గలిగిన యోధుడు. జనార్దనునికి నయవంచనగా చెప్పే చమత్కారపు మాటలు.)

వలీ— హల్లా కటాచ్ఛం చల్లంగావుండ. తమర్ దయా బాగా ఉండితే మాకీ ఏమీ తక్వా ? ప్రతాపరుద్రి మహారాజావార్ గొప్పవార్ అని, వార్కి పంపే రాయభారం తక్వా వుండాకూడదని, మాతో యీ కొద్ది రాజ్వాకు పంపినార్ మరి యీ దారిన్నే ఎల్లి ఖట్కం పట్టుకొమ్మని, అందుక్కి యీ కొద్ది లష్కర్ పంపినార్. ఆ ఖాబూల్వాడ్కి మన ఢిల్లీలో ఇంక్వ పాలమిస్రి అమ్మకొని బతికేవాడులాగ చెయ్యవాలా అని సుల్తాన్వారి షంకల్పం అందుకోషం ఎక్డా ఎక్డా దండు అంతా జమా చేయడం...

వలీ—చాలా షంతోషం తమవాక్క గొప్పదనం మా దేశంలో విన్నాం-విన్నాం, ఇప్పుడు ప్రత్యక్షంగా చూచినాం తమ్‌రూ ఇంత షులు భులు అని తల్వలేదు.

రాజు వేటగుఱ్ఱంను వర్ణించుట చాల చమత్కారంగా నుండును.

తృతీయుడు— నేను తచ్చునం ఎల్లి - సర్దార్ సాహెబ్, ఘోడా-అరబ్బీకాదు, పార్శీకాదు, ఆజాఙా కాదు, తుర్కార్ గాదు. హిందూకే పాతాళంలో నాఘేంద్రుడు ఉంటాడే, వాడిది నద్మి తల్కాయమణి చెక్కి ఘోడా చేసి, దాన్ని వాళ్ళ బెంహాదేవుడు ముక్కులో వూధి ప్రాణంచేసింది; మైధానంలో మేస్తూ వుంది. ఏం హుకుం ? అని అడ్గుతాన్.... ...

అరే నీవు ఫెర్దూషికన్న యెక్వా కవి - జల్ది పో.

తృతీయుడు—ఇష్టం లేకపోతే ఖష్టం వుంది మీరు తిర్గుబాట్ చేస్తే ప్రవో జనంలేదు మీ దౌలత్ పోయింది, మీరు మా ఖయిది మేం రమ్మంటే రావాల. పొమ్మంటే పోవాల. మీరూ రాక్పోతే మేము ఇరె ౯

నల్‌ఖై మంది జులుంచేసి, మీకీ పట్టి యీడ్చుకొని పోతాం. అది మహా రాజావార్కి బలే గౌరథం? మర్యాదగా రండి. తమరికి అక్డ మర్యాద సర్దార్ ఖుషి, తమ్రి అ్ధృష్టం...

ఇదే విధంగా ఢిల్లీ సుల్తాను దర్బారు భాషణములు, మనోజ్ఞంగా నుండును.

సుల్తాన్‌వారు మొగలూ హల్లా, హల్లా
రొండోహల్లా – కొత్త ఆర్గ్యుమెంట్.

సుల్తాన్— ఇదేమీ వర్తకులూ, మధ్యాహ్న షూర్యుడూ హాకారం వుంది!
మా కంటిచూపు వస్తాద్ మీద కోటి కిరణం బాకుల్ గుచ్చి నహినహి చేస్తుంది...ఇది తామ్రకమ్‌లా పద్మం...హోల్ మొత్తం యావత్తు కుల్లుకంతా అన్నట్లు.

తాగుబోతు తనంలో సుల్తాను—

లోకమంతా చూడవచ్చు "హహహహ" షూర్యచంద్రుల్ కళ్ళుతో పగల్ సాహెబ్ చూడవచ్చు నచ్చత్రాల్ కళ్ళుతో రాత్రి బీబి చూడవచ్చు! జంగల్‌మె వుండే సింగ్ పులిగూడ చూడవచ్చు! హాయ్‌హాయ్‌హాయ్ - సముద్రంలో వుండే మచ్చం కన్నూ మూయక చూడవచ్చు—

అంటూ చేపకు కనురెప్పపాటు లేదన్న గురుతర విషయాన్ని గూడ క్లైపులో చెప్పిస్తున్నారు.

ఈ నాటకం ఎలపాదిన శాస్త్రిగారి విజ్ఞాన స్ఫోరకంగా, వేదాంత వచనాలు, నానుడులు, హాస్యోక్తులు వెదజల్లబడి, వాసనల గుబాళిస్తున్నవి

తుపాకీ కడ్పులో ఫిరంగి పుట్టినట్టు పుట్టినాడ్
చేపా అని ముష్టినోట చేయి పెట్టినా
నమ్మక తిన్నాం నౌకరీ చేస్తాం, మన్షు అమ్మకొంటాం!
ఈ తెలంగి చంత్రంలో తూర్పు పర్మడా తెల్వడంలేదు
వీరాంజనేయం తోకజాడించిన కళ్ళల్లో దుమ్ము కొట్టుచున్నది.

"వీనులును గన్నులును నను
మానమునకు సాటిగావు మంత్రపరులకున్"

"ఇతర పాపఫలము లిచ్చవచ్చినయట్లు
వ్రాయవయ్య మిత్రి, ననజభవుడ,
అరసి కాశిమ్రోల సరస కావ్యము జెప్ప
దలను వ్రాయవలదు వలదు — వలదు."

"అరయగా నమంత్రమౌ నక్షరములేదు
మందు గాని వేరు మఱియు లేదు
భువి నయోగ్యుడైన పురుషుం డొకడు లేడు
కూర్చువా డొకండె కొదువగాని!"

మొదలగునవి—

బొబ్బిలి :

కోడిపందెములలో కాలం గడుపుకొనుచుండిన బొబ్బిలి వెలమదొరలను, ఆత్మార్పణం చేసిన మహావీరులుగా, వంశగౌరవ సంరక్షకులుగా, కులీన ధీరోదాత్తులుగా చిత్రించి, తెనుగునాటి వీరపుకతను బొబ్బిలినాటకంగా వ్రాసి, శిష్యకోటిచే ఆడించి, మహోజ్జ్వల కీర్తి గాంచినారు వేదం వేంకటరాయ శాస్త్రిగారు.

ఇది చిన్నదైనా ప్రతాప కంటె చాల బరువైన నాటకం. ప్రదర్శనమున చిక్కటి రక్తిని గూర్చి ప్రేక్షకులకు ఆనందము కలిగించును

ఆమర్ అను ఒక బ్రిటీషు ఉద్యోగి "హిందూస్థాన్ హిస్టరీ" లో 1757 జనవరి - ఫిబ్రవరి మాసాల మధ్య జరిగిన యీ ఉదంతమును ఆధారంగా చేసికొని దిట్టకవి నారాయణకవి "రంగరాయ చరిత్ర"ను వ్రాసిరి. ఆవల పెద్దాడ మల్లేశకవి వ్రాసిన జంగం కథకు ఇది దిగదుడుపునకు గూడ పనికిరాదు. 1916 లో వేంకటరాయశాస్త్రిగారు, యీ నాటకమును రసపుత్ర వీరుల సాహసోపేత ఆత్మార్పణ గాథలకు తీసిపోనియట్లు రూపొందించినారు.

వీరరసమును కరుణరసములో ముంచి ముద్ద జేసి, ప్రేక్షకులను వట వట పడజేసే నాటక మిది బొబ్బిలికోటలో జరిగే పెండ్లివేడుకలతో విజయ రాముని కోటముట్టడిని సంధానపరచి, విషాదఛాయలను దట్టంగా నాటకంలో ఆద్యంతాలు అలముకొనజేసినారు రాణీమల్లమ్మ కొడుకు చినవెంకటరాయుని కోట దాటవేయుటకు దాసి వెంకటలక్ష్మికి అప్పగిస్తూ -

రాణి:- వెంకటలక్ష్మి, ఈ స్వామియెదుట, మా యమ్మవారి యెదుట, ఈ నారాయణమూర్తియెదుట, నిన్ను మా వంశమును నిలువబెట్టునట్లు వేడుకొనుచున్నానే! మాకు గల 33 దాసీజనములో నిన్ను పెద్ద దాసిగా గణన చేయుచుంటిమి నీవు మా సంస్థానమును నిలుపగదే వెంకటలక్ష్మి సామర్లకోటలో మా చెల్లెలు జగ్గమ్మకడకు వెంకట రాయని నీవు కొనిపొమ్మ మేము బలిమిచావులు చత్తుమని మా చెల్లెలితో చెప్పకువే వేంకటలక్ష్మి!

వెంకట:- అమ్మా! మీరు చావను, మేము బ్రతుకనా?

రాణి:- (అశ్రులు దుడుచుకొని) కాదే, మా వేంకటరాయడు బ్రతికిన మేము బ్రతికినట్లేగదే! వేంకటరాయడు పెద్దవాడు అగుదాక నీవు పోషింపుము ఆ తర్వాత మా నాయనయే నిన్ను పోషించును పగవాండ్రు మా నాయన అని తెలిసినచో బ్రతుకనీయరే! అడ్డగించువారితో బాపనవారి అచ్చమ్మ కొడుకని చెప్పవే ' ఓసీ, మా బాబయ్యకు మొలకు నులకత్రాడు దెచ్చి మొలత్రాడు గట్టుడు.

నాయనా, నీ తండ్రికంటె యోగశాలివని పెద్దలు చెప్పిరి కాని, ఇట్లు పకీరు వౌదువని యెవ్వరును చెప్పరైరి నా కొండా!

"ఏ పేదతల్లి కడుపున
నో పుట్టితివేని హాయి నుందువు తనయా!
యీ పాడుమల్లి కడుపున
నే పట్టీ! పుట్టి యిట్టి యిడుమ బడితివే"

అని ఆ పెద్దయాక్టర్లు అభినయించే రంగదృశ్యము, అప్పటి గగుర్పాటు ఇప్పటికిని మరపురానివి.

ఇందు శాస్త్రిగారు భవభూతితో భుజము లొరసి నిలిచినారు ఇందు రాణి చనవు, భాష ఎంత హృద్యంగా ఘట్టానికి అతికిపోయిందో చూడండి.

వేణుగోపాలస్వామి ఆలయంలో పెండ్లికంకణాలను వీరకంకణాలుగా మార్చిన మాటలు ఎండిన మాకులనుగూడ చిగిర్పజేయును.

బొబ్బిలి రంగారావు దేవిడిలో విశ్వాసగుణానికి పట్టుకొమ్మ అయిన దాసి వెంకటలక్ష్మి పాత్ర - కొడుకును బలిబెట్టి, అన్నం బెట్టిన అయ్యబిడ్డను రక్షించిన - రాజపుత్రవనిత - దాసి పన్నాకు ప్రతిబింబమై తనరారుచున్నది. వేంకటలక్ష్మికి నగరివారు బాగా చదువు చెప్పించినారు.

నాటకము ముగియువరకు, గ్యాక్‌బెత్తులో వలె నెత్తురు మడుగులలో నడిపింపజేయును హాపారాయుడు చివరన వచ్చినా, నర్తనశాలలోని కీచక వధను తిరిగి ఆడినట్లు తోపింపజేయును.

రంగరావుకు కండ్లు మసకలై దీపము రెండు చీలికలై కనబడునట్లు జేసి రానున్న ఘోరవిపత్తురేఖను స్ఫురింపజేయుట కళాపోషకము రంగరావు వీడ్కోలు కంట తడిబెట్టించు ఘట్టము.

ఈ నాటక పాత్రలు :

బుస్సీ:— మంచిచెడ్డలు అర్థం చేసికోగలిగిన పరాసు సేనాని

హైదరుజంగు :— లంచగొండి.

విజయరాముడు·— భూకాంక్ష గల నీచశత్రువు.

హసీనాల: — సానుభూతి గలిగిన రాయబారి (రాయబార మనే పారశీక పదం తెనుగులో ముచ్చటగా మిళిత మైపోయినది )

వెంగళరాయుడు — ఉడుకునెత్తురు పోటరి.

ఇవీ శాస్త్రిగారి రచనలో సానలుదీరిన సొంపుదాల్చిన ప్రతిమలు

ఈ నాటక మంతా గీర్వాణ ప్రాబల్యంతో నడచినా ఆంధ్రత్వమును మూర్తీభవింపజేసినది. ప్రవేశకములతో కథను ప్రేక్షకుల ఎదుట నడపించి, రచనా కౌశలమును చూపుదురు

రంగరావు పద్యాలు కొన్ని పిడుగుతునకలు 41 పుట - 30, 31, 32 పద్యాలలో ఘోరపరిస్థితి అద్భుతంగా వర్ణింపబడినది.

ఈ నాటకమున పద్యాలు - బాణాసంచా వర్ణనాదులు - ప్రబంధఫక్కీలో బడినవి. కొన్నిట నానుడులు ప్రాణం పోసుకొన్నవి.

లేఖ :

శాస్త్రిగారు యీ నాటకంలో ఒక జాబువ్రాతను ప్రవేశపెట్టి, దానిని మన వాఙ్మయమున ఉత్తమోత్తమ రసవత్తర ఖండంగా జేసి, తమ వైదుష్య పతాకమును ఎగగట్టినారు. దూరాన నిలబడిపోయి పాపారాయుడికి కరణం రామన్నచేత వ్రాయించిన ఉత్తరం చూడండి -

రంగరావు:— చదువు రామన్నా, చదువు

రామన్న:— స్వస్తిశ్రీ బొబ్బిలి నేలు రావు గోపాలకృష్ణ రంగరావు బహద్దరువారు, మా బావగారికి, తాండ్ర పాపారాయనివారికి, కడపటి దండములు మ్రొక్కి వ్రాయుట.— విజయరామరాజు రాజాముసీమలో పితూరీలు చేయించుట, మిమ్ము వెంగళరాయని పెండ్లికి రానీయకుండుటకోస మని మోసపోయితిమి. అందులకు కానేకాదయ్యా. బొబ్బిలిని తెక్కలు లేని పిట్టనుజేసి చిదుగగొట్టుటకు అని యెరుగమైతిమి ఇప్పుడు తెలిసినది మ తేమున్నది బావా ! రాజు మన యింటిమీదికి గోలకొండ పరాసు పౌజును ముట్టడి దెచ్చినాడు రెండు లక్షలకు కాకీమూక పరాసుమూక కమ్ముకొని యున్నది రాత్రి దొంగప్రొద్దున దొంగతనముగా ముట్టడి వేసినారు వేగుప్రొద్దున ఫిరంగి పేట్లు వేసి తెలిపినారు. గడియకో, అరగడియకో ఫిరంగివాతను బొబ్బిలిని వేసికొందురు మేము పాపకారి పెండ్లిండ్లు చేసితిమి కోటలోపల చుట్టాలు వచ్చి నిండియున్నారు, స్త్రీలను కోటలో నుంచి జగడమాడుట సరిగాదు మాకు కోటలోపల రస్తులేదు వలసలు తరలుటకు త్రోవలు లేవు. బావా ! వెంగళ్రాయుడు ఇంకను కంకణాల చేతులతోనే ఉన్నాడు మా కందరకు సంఘాతమరణము సిద్ధమైనదయ్యా ! పెద్దలనాటి బొబ్బిలికోటకు మాకు ఋణము చెల్లినది. ఇక్కడ స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, అందఱు నీపేరు పల్కుచు అంగలార్చుచున్నారు నీవు వచ్చిన మాకు సంఘాతమరణము తప్పును. ఏడేడు పదునాలుగేండ్లకును బొబ్బిలికోటను ఆ యముడును పట్టలేడు. జయము, కీర్తియు, క్షేమమును కలుగును నీవు రాకున్న, రాజామునకు తరలిననాటి చూపులే నీకును నాకును కడ

సారి చూపులు సుమా! పెండ్లికి రావైతివని చింతిల్లుచుంటిని. ప్రాణము గావ రావేని చెప్పవలయునా? ఈ జాబు చూచిన తక్షణము, బావా! రాజామునకు బొబ్బిలికి సందున విజయరామరాజు దండు విడిసి యున్నాడు. అతనిదండును విఱుగ బొడుచుకొని కోటకు రావయ్యా! ఇన్నూటితో వెంగళరాయని నీకు ఎదురుపంపెదను. నీకోసము దిడ్డితలుపు తీసియుంచెదను నీవును, మిరియాల సీతన్నయు మాలపల్లెమీదుగా, కొంతచోటు తిరిగి, ఆ దారిలో హైదరుజంగు డేరా యున్నది - ఆ హైదరుజంగును విడిదిలో నఱికి రావలయును ఈ రాత్రి వత్తువేని నీకును నాకును చూపులుండును. ఇవే బావా! కడసారి దండములు

ధాతు - ఫాల్గున - శుద్ధ ౩ లు సోమవారము.
(ఇది ఫిబ్రవరి 22 తేది అగును)

శాస్త్రిగారు మంచి యాక్టరు అగుటచే రసము ఉట్టిపడే పసిడితునకలు వెదజల్లుదురు "చదువు రామన్నా, చదువు, తర్వాత-తర్వాత; ఎట్లు-ఎట్లు" మొదలగు జంటమాటలు ఉద్వేగాన్ని తెలుపుచు భాషణానికి శక్తిని పోయును. ఇవి నాటకప్రయోగంలో రక్తికి నెలవులు.

## యుద్ధ వర్ణనము :

భరతముని యుద్ధం రంగస్థలంమీద చూపరాదన్నాడు చూపుటగూడ సాధ్యముగాని పని. ఇక యీ కథకు యుద్ధమే ప్రధానఘట్టము. అందుచేత శాస్త్రిగారు 5-వ అంకంలో దూరాన జరిగే యుద్ధాన్ని బుస్సీఎదుట నలుగురు నివేదకులచేత, మార్చిమార్చి చెప్పించి, యుద్ధం జరిగినట్లే కనుల ఎదుట కనుపింపజేసి, నేటి సినిమావలె ప్రత్యక్షంగా చూపింపగలిగినారు బొబ్బిలి నాటకంలో యీ ఘట్టము క్రూరహాస్యంతో రసమును చిప్పిలజేస్తూ, భారతీయ నాటకవాఙ్మయమున ఒక అపూర్వ సజీవ రమ్యసృష్టిగా నిలబడి, వారి వ్రాతజాణతనానికి స్మారకంగా నిలిచి యున్నది ఈ నాటకంలో రసవత్తర సన్నివేశమే ఇది. (పుటలు - 87, 89, 90, 91, 93, 94, 95, 96, 97, 98 లోని భాగాలు - కలకండ పొలుకులు)

ఉషా పరిణయము :

ఉష చాల చిన్ననాటకము ప్రతాప తర్వాత ఆంధ్రభాషాభిమాని సమాజమువారికిగా వ్రాసినది — వారు శాస్త్రిగారి నాటకములు దప్ప అన్యముల ప్రదర్శించి ఎరుగరు.

పాత్రలు - వర్ణనలు - శృంగారము - విరహము - నిర్మాణము- అన్నీ సంస్కృతపు మూసలో కరగి పోసినవే.

ఇందుగూడ పాత్రోచితభాషే దాని రాణింపునకు కారణ మైనది ఈ Classical నాటకంలోగూడ - అందులో పద్యాలలోగూడ ఉరుదు పదాలను ఉపయోగించుట - ఎటిగే సజీవభాషను ఇది ముఖ్యమని 60 ఏండ్లనాడే - పూర్వవాసన పండితుడు కావలసిన శాస్త్రిగారు నిరూపించుట, నేటి అభ్యుదయ వాదులు గమనించవలసిన విషయం

పద్యాలు కొన్ని వసుచరిత్ర కోవకు చేరినవి కొన్ని ప్రౌఢములు ; కొన్ని లలితములు ; కొన్ని సహజధోరణి లోనివి. చాలచోట్ల నవ్యత గోచరించును

"కురవక పుత్రకా, తిలక కూరిమితమ్ముడ, మాదియల్లుడా .." అనే పద్యంలో - ఉరమున జేర్చి, కాంచి - మొదలగు చేష్టలతో ఉష ఊరడించుటలో దోహదప్రక్రియలను బొందుపరచినారు. ఇట్లే చాల పద్యాలు యీ పాకమున బడి, కవితాస్థాయిని పెంచి ఉన్నవి

ఉషలో రెండు అంతర్నాటకములు - Bye Plots, మూలకథతో విడిబడకుండా, దానిగమనానికి నిరోధంకలిగించకుండా పెనవేసికొనిపోయిఉన్నవి. అవి గంభీరవేది కరేణుక, ఆహ్లాదన, చిత్రలేఖల ప్రణయగాథలు

ఏ బెంగాలీ పలుకుబడితోనో ఏర్పడిన మాటలవలె - తప్పులేక కుశీలపతాకనై (చెడ్డ నడవడికి) Flash కు క్షణరుచి అని Coin చేసినారు ఇది బెంగాలికవి మైకేల్ మధుసూదనదత్తు "క్షణప్రభ" వంటిది.

కొన్ని ఆణిముత్యాలవంటి ప్రయోగాలు చూడండి

"సురిగి సన్నసన్న శోకాంధకారంబు వలస పోవుతీరు వనజనేత్రి"

నేత్రి అనుట తప్పు అని ఆనాడు శాస్త్రిగారు ఘోరయుద్ధం చేసినారు.

"రేయెండ దాకిన। తమ్మిమై౯రి జాతిబొమ్మ నైతి."
"అట్టి యుదారపుకృతులు దయాదూరములు కానేరవు."
ఇది - సంస్కృత - ఇంగ్లీషు కరువువలె నున్నది

"నా నాలుక కృతజ్ఞతాజడమై యున్నది ఏమియు బలుకనేరకున్నాను"
"నాయన చండదర్ప పరిణద్ధ రణోద్ధతు దేమి సేయుదున్."
"నిఖిల లోకులకును నీరిచ్చు మేఘుండు పిడుగువైచు భాగవియుతుమీద"

హారమును గూర్చి -

"నా యెదను మున్ను నీవిట్టి నయ మెఱుంగవు
మెలత చనుగట్లతో గొంత మెలగినంత
విరహితుని కిట్లు సంజీవకరణి వైతి!
వున్నతులతోడ సంగడి వన్నె యిడదె?

ఈ తోడి నేటి అభ్యుదయ వాఙ్మయమున 'తోటి' అయినది. పాకీవాడై నందున కంపు గొట్టకపోవునా?

ఇట్టివాటిని ఎన్నిటినో ఏరవచ్చును

ఇక "అనువాద నాటకము"లను గూర్చి రెండే మాటలు:—

వేంకటరాయశాస్త్రి సహృదయచక్రవర్తి వారిబహుభాషాపాండితి, గట్లు ఒరసుకొని, పరవు - లోతు కలిగియుండుటచే మూలమును సాకల్యంగా అర్థం చేసికొని, జీర్ణించుకొని దాని భావము, సొంపు కొంచెమైనా పోకుండ, రస నిష్పందముగా అనువదించ గలిగినారు అనువాదకుల అగ్రశ్రేణిలో శాస్త్రి గారు అగ్రగణ్యు లనుట నిర్వివాదాంశము ఇది అర్ధపండితులకు అలవిగాని పని, భావము కొరకు కొన్నిచోట్ల శైలి కఠినమైనను కవితాశిల్పము వెలితి గాలేదు ఈ నారికేళ పాకప ను కొందరు ఆక్షేపింపగా బోలు— జంకు కళంకు లేని కవిచంద్రుడు, తోషిత కోవిదేంద్రుడా వేంకటరాయశాస్త్రి కృతి వెంగలి మూక కెఱుంగ శక్యమే—అని తిప్పికొట్టినారు. మరి కొన్నిచోట్ల పద్యాలలో లాలిత్యము—ప్రసన్నత సొగసుగా జాలువారినవి

ఈ అనువాదములు పండితులకు ఆనందమును, విద్యార్థులకు మహోపకారమును గూర్చగలిగియున్నవి ఆ యా సంస్కృత నాటకములకు వీరి **అనువాదములు వ్యాఖ్యానము లనవచ్చును.**

ఈ నాటకములన్నియు నెల్లూరులో ప్రదర్శింపబడి బాడుగ నాటకాలు బయలుదేరు నంతవరకు - 40 ఏండ్లు ప్రేక్షకుల ఆనంద పరవశుల జేయు చుండినవి

శాస్త్రిగారు కాళిదాస నాటకత్రయమును - శాకుంతలము - విక్రమోర్వశీయము - మాళవికాగ్నిమిత్రము - హర్షుని నాగానందమును, ప్రియదర్శికను ఆంధ్రీకరించిరి.

తెనుగు వచనమాధుర్యము వెల్లివిరిసినది చిన్నయసూరి, వేంకటరాయ శాస్త్రి, కట్టమంచి రామలింగారెడ్డి గారల రచనలలోనే అన్నవిషయం ఆంధ్రులు గుర్తించినదే వీనులకు విందుగొలిపే వాక్యరచన గంభీరమైన నడక, క్రొత్తదనము శాస్త్రిగారి అనువాద నాటకములలో అ - టా కనపించును

ఈ గుణము శాకుంతలమున - మరీ ఎక్కువగ ఉత్తర రామ చరిత్ర యందును ఉన్నది. "నీ మధుర భాషణముల వలని విశ్వాసము నన్ను బతికించుచున్నది. ఆర్యు డలంకరించు రాజర్షి వంశమేది ? ఏదేశ మార్యునిబాసి యుత్సుక పడుచున్నది? ఎందుకొరకు యీ సుకుమారమూర్తి తపోవన పరిశ్రమకు బాత్రీకృతమైనది ?"

ఇట్టి పనస దొనలను ఎన్నిటినో ఏరవచ్చును. ఇక వీటి సాకల్య పరిశీలనము విద్వాసులకు వదలిపెట్టి - Lighter Veiw లో ఒక సంగతి జెప్పి ముగిస్తా.

**గడుసుదనము :**

గడుసుదనము వేదం వారి ఇంటబుట్టి, వేంకటరాయ శాస్త్రిగారి ఒంట పెరిగినది ఎట్టివారినిగాని సమయం వచ్చినప్పుడు మాటలలో దెబ్బతిని వదలువారుకారు

వీరు మదరాసు క్రిశ్చియన్ కాలేజిలో సంస్కృత పండితులుగా పని చేసేటప్పుడు Dr Skinner దానికి ప్రిన్సిపాల్. అతడు పెద్దచేయిగదా ! ఒక నాడు ఆయన క్లాసులచుట్టు తిరుగాడుచు శాస్త్రిగారి క్లాసుకు వచ్చినాడు ఆ తరగతిలో కట్టకడపటి బెంచిలో ఒక విద్యార్థి నిదురించుచుండినాడు. స్కిన్నర్ అదిచూచి "Mr Sastry, Why ca'nt you wake him up" అనగా, వీరు తడవుకోకుండా "I am not paid for it" అని అనగా, ఆయన పోతూ నవ్వుకొన్నాడు.

ఇదీ ఆయన సరకు !!

వీరికి సర్వజ్ఞ సింగమ మహీపాలుడు - వెంకటగిరి సంస్థానాధీశులు పోషకులు. అప్పుడప్పుడు వీరిని పిలిపించి విద్యాగోష్ఠిలో కాలము గడపి సత్కరించి పంపేవారు శాకుంతలము ప్రచురించిన వెంటనే శాస్త్రి రాజును కలుసుకొన్నారు.

తృతీయాంకమున 10వ పద్యం మొదటి బంతిలో శకుంతలను - విరహవేదనగా వివశతను దుష్యంతుడు వర్ణించుచు "చిక్కదనం బెడలెం జనుంగవ" పాఠాంతరంగా "కాఠిన్య ముక్తస్తనం" అని వ్రాసిన దానిని రాజుగారు ఎత్తిచూపి "ఏమయ్యా పెండ్లిగాని పిల్లను అట్లు చెడిచినారే" అనగా - శాస్త్రిగారు "మనసార ప్రేమించిన పురుషుని చూచినప్పుడు యువతికి చనుగవ సడలును" - అని శాస్త్ర ప్రమాణాలు చూపి, సంస్కృతమున మ-యలు రూపంలో దగ్గరగా నుండును కాబట్టి, మీవలెనే భావించినవారు "ము" ను "యు" గా అనగా యుక్తస్తముగా చేసియుందురని ఏమేమో చెప్పినారు.

చివరకు రాజాగారు—"అదేమో గానీయండి. శాస్త్రులవారూ ! - ఈ సంగతి మా అనుభవంలో లేదు" అనగానే, తటాలున "అట్లయితే, మిమ్మ ప్రేమించిన స్త్రీ మీకింతవఱకు దొరకలేదన్న మాట" అని కొరడాదెబ్బవేటు వేయగా - సరసుడైన రాజు, ఆనందించి బహూకరించి పంపినారు.

ఇట్టివి ఎన్నో ఛలోక్తులు ఆయన శిష్యకోటి చెప్పుచుండును

ఇంకొక మాదిరి గడుసుదనం :

ఒక్కొక్క పుస్తకం ప్రచురించగానే, ఏదో ఒక కొత్తమాట బయట బడి రాద్ధాంతాలు బయలుదేరేవి.

ఒక నాటకంలో "తితఉ ఒక్కో" అన్నారు తితఉ అంటే జల్లెడ అని, అచ్చుతో ముగిసే సంస్కృత పదం. ఇది ఒక్కటేనని చెప్పబడింది.

ఆ మహాపండితుని కీర్తి మూర్తికి యీ చిన్న కర్పూర హారతి !

అదీగాక బడాబడా ఫిరంగుల నడుమ చోటా ఫిరంగి - యీడు చిక్కి నల్లిపోతున్నాడు—శలవు.

# సాహిత్యోపన్యాసములు

## క్షేత్రయ్య పద సాహిత్యము

[11వ ఆగష్టు 1963 నాడు విజయవాడలో జరిగిన ఉపన్యాసాలు]




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

తిలక్ రోడ్ హైదరాబాదు

# సాహిత్యోపన్యాసములు

3

## క్షేత్రయ్య పద సాహిత్యము

[11వ ఆగస్టు 1963 నాడు విజయవాడలో జరిగిన ఉపన్యాసాలు]




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

లక్ రోడ్ :: హైదరాబాదు.

## విషయసూచిక:

# ఋషితుల్యుడు, పదకర్త - క్షేత్రయ్య

—డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

భారతీయ సంగీతం అపారమైన ఒక నిధి వంటిది. అనేక శతాబ్దాల నుంచి మహోజ్జ్వలులైన వాగ్గేయకారులు తమ అమూల్య రచనలతో భారతీయ సంగీతాన్ని సుసంపన్నం చేసినారు అట్టి మహనీయులలో క్షేత్రయ్య ప్రథమ కక్ష్యలోని తారక వంటివాడు పదములుగా పిలువబడుతున్న గేయాల రచనలో క్షేత్రయ్య అద్వితీయమైన స్థానము ఆక్రమిస్తాడు

కర్ణాటక సంగీతంలో పదం ఒక మనోహరమైన, ప్రధానమైన సంగీత ప్రక్రియ ఇది ప్రయోగాత్మక సంగీత పరిధికి చెందినట్టిది ఈ 'పదం' అనే ప్రక్రియ ప్రధానంగా నాట్యానికి సంబంధించినది భరతనాట్యంలో పదం నిర్వహించే పాత్ర అత్యంత ప్రధానమైనది భరతనాట్యం మొదటి భాగంలో అలరింపు, జతిస్వరం, శబ్దం, వర్ణం ఉంటాయి రెండవ భాగం అంతా ముఖ్యంగా పదాలకే వినియోగింపబడుతుంది భరతనాట్యం యొక్క ప్రధానాంశం భావాన్ని లేక విభిన్న మనోభావాలను అభినయం ద్వారా అభివ్యక్తీకరించడము, 'పదాల' ద్వారానే ఇట్టి భావవ్యక్తీకరణకు సంగీత వాతావరణం కల్పించబడుతుంది పదాలకున్న సంగీత లక్షణంచేత సంగీత సభల్లో కూడ వాటికో ముఖ్యస్థానం లభిస్తున్నది.

**దక్షిణదేశపు వాగ్గేయకారుడు**

క్షేత్రయ్య కృతులన్నీ తెలుగులోనే రచింపబడినప్పటికిని, అవి దక్షిణదేశమంతటా ప్రసిద్ధిని పొందినవి శాస్త్రీయ సంగీతము యొక్క క్రమాభివృద్ధి మీద, ఆయన ప్రభావము చాలా శక్తిమంతమైనది ఈనాటికి కూడ ఆయన ప్రభావం ప్రబలంగా కొనసాగుతున్నది సాంప్రదాయికమైన పాండిత్యానికి, సంస్కృతికి నిలయమైన కృష్ణానదీతీర ప్రాంతమునగల మువ్వ గ్రామంలో క్షేత్రయ్య జన్మించినాడు. ఆంధ్ర విష్ణువుకు అంకితమైన దేవాలయం అమరియున్న శ్రీకాకుళం,

చరిత్ర ప్రసిద్ధికెక్కిన ఘంటసాల, భరతనాట్యానికి, భాగవత మేళానికి ప్రసిద్ధి వహించిన కూచిపూడి మున్నగు ప్రదేశాలన్నీ మువ్వకు కొద్దిమైళ్ళ దూరంలోనే ఉన్నవి కూచిపూడి కళాకారులు పదహేనవ శతాబ్దపు ప్రారంభ కాలంలోనే విజయనగర రాజుల పోషణ పొందినారు తరువాత రెండువందల యేండ్లలో యక్షగానాల ద్వారా వారి ప్రతిభ, ప్రాభవము మహోన్నత శిఖరాలను అందు కొన్నవి ఇటువంటి పరిసరాల్లో ఉండటంవల్ల సంస్కృతం, తెలుగు, సాహిత్యం, నాటకం, అలంకారశాస్త్రం, సంగీతం, నాట్యం అభ్యసించడానికి క్షేత్రయ్యకు అపరిమితమైన అవకాశాలు లభ్యమైనవి సాంప్రదాయికమైన వివిధ విషయ పరిజ్ఞానాన్ని లలితకళల యందుగల అభినివేశాన్ని తన పదాలయందు క్షేత్రయ్య గణనీయంగా ప్రదర్శిస్తాడు. తన అపారమైన విద్వత్తా, యోగ్యతలతో ఎటువంటి ఇతివృత్తమునయినా క్షేత్రయ్య రమణీయంగా రాణింపజేయ గలిగినాడు ఆయనకు గల కవితాదృష్టి, అత్యద్భుత పరిశీలనాపటిమ ఆయన కృతులకు ఒక అపురూపమైన సొగసును, సౌకుమార్యాన్ని చేకూర్చినవి పదిహేడో శతాబ్ది మొదటిపాదం నుండి చివరిపాదం వరకు క్షేత్రయ్య జీవించి ఉండినప్పటికిని ఆయన జీవిత విశేషాలను గురించి మనకు దొరికిన వివరాలు చాలా తక్కువ మువ్వ గ్రామంలోని క్షేత్రయ్య వంశీయుల కథనం ప్రకారం క్షేత్రయ్య అసలు పేరు మువ్వ వరదయ్య వరదయ్యకు గోపాలస్వామి దేవాలయంలో ఒక యోగి మంత్రోపదేశంచేసినట్లు అనూచానంగా తెలియుచున్నది అనవరతమైన ఆధ్యాత్మిక చింతనతో వరదయ్య శ్రీ మువ్వ గోపాలుని దర్శన భాగ్యాన్ని పొందినాడు దైవ కృప వలన ఆయనలో ఏదో జాగృతి కలిగింది తత్ఫలితంగా వరదయ్య గోపాలదేవుని లీలలను పారవశ్యంతో గానం చేయసాగినాడు. అందులోని శబ్దములు, సంగీతం కలిసి ఒక అందమైన పదం అవతరించినది

శ్రీపతి సుతుబారికి నే నోపలేక నినువేడితె
కోపమేల ? మువ్వ గోపాల,

వాగ్గేయకారుడుగా క్షేత్రయ్య వైభవోపేతమైన జీవితానికి 'శ్రీ' అన్న మాట శుభప్రదమైన నాంది అయినది పదం ఆనందభైరవి రాగంలో ఆదితాళానికి అమరి క్షేత్రయ్య పదాలకు సముచిత ప్రారంభమైనది మువ్వ గోపాల ముద్రతో పదాలను రచించి, వాటిని తన ఇష్టదైవమైన మువ్వ గోపాలునికే క్షేత్రయ్య

అంకితము చేసినాడు. కొంతకాలం క్షేత్రయ్య మువ్వలోనే నివసించి కొంత వ్యక్తిత్వము పొందిన తరువాత తన సంగీతాన్ని దూరదూరాలకు ప్రచారము చేయడానికి, దేశీయుల హృదయాలను తన వశము చేసుకొనడానికి ప్రయాణాలు చేసినాడు.

**అనాదరణ**

విజయనగర రాజుల ప్రాభవాన్ని వారసత్వముగా పుణికిపుచ్చుకొని, దక్షిణదేశాన పదిహేడవ శతాబ్ది ప్రారంభంలో పరిపాలించిన నాయకరాజులు గొప్ప కళాభిమానులు, విద్యాపోషకులు ఎంతో దూరానవున్న మువ్వ నుండి తంజావూరు మహారాజు రఘునాథనాయకుని ఆస్థానానికి వరదయ్య స్వయంగా విచ్చేసినాడు ఈ సమావేశాన్ని గురించి ఒక రమ్యమైన కథ గలదు పిలుపని పేరంటమువలె ఆహ్వానము లేకుండానే ఎందుకు వచ్చినావని రాజు రఘునాథ రాయలు హేళన చేస్తున్నట్లు వాగ్గేయకారుడగు వరదయ్యను అడిగినాడు తాను స్వయముగా కవి అయిన ఆ గాయకుడు వెంటనే స్ఫూర్తితో ఈ విధంగా ప్రత్యుత్తరమిచ్చినాడు

తము దామె వత్తు రర్థులు
క్రమ మెరిగిన దాతకడకు, రమ్మన్నారా ?
కమలంబులున్న చోటికి
భ్రమరంబుల నచ్యుతేంద్ర రఘునాథ నృపా !

ఇందుకు రఘునాథరాయలు ఎంతో సంతసించినాడనుటలో ఆవంతయు సందేహము లేదు అతని కుమారుడైన విజయరాఘవనాయకుని వద్ద క్షేత్రయ్య మహోన్నతమైన గౌరవాలు పొంది, అసదృశమైన స్థానాలను అందుకొన్నాడు "వేడుకతో నడుచుకొన్న విటరాయడే" అను మాటలతో మొదలయ్యే మేరు పదమనే కృతిలో క్షేత్రయ్య తన రాజపోషకులను గూర్చి కొన్ని మనోజ్ఞమైన వివరాలిస్తాడు ఆయన మాటల్లోనే విందాం మనం—

వేడుకతో నడుచుకొన్న - విటరాయడే
ఏడుమూడు తరాల నుండి - యెందునాగాని యెవతె
కూడుకొని మువ్వ గోపాలుడు - కృపగల్గినా విభుడు ॥వేడు॥

మధుర తిరుమలేంద్రుడు - మంచి బహుమాన మొసగి
యెదుట గూర్చుండుమని - యెన్నిక యిమ్మననే
యిదుగో రెండువేల పదము - లిపుడెంచు కొమ్మనిన
చదురుమీద నున్న సామికి - సంతోస మింతింతగాదె ॥వేడు॥

అళిమీర తంజాపురి నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి - వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ - చక్కగ వేయి పదముల
పలుకరించుకోగానే బహుమాన మిచ్చె నా వేళ ॥వేడు॥

బలవంతుడై గోలకొండ - పాదుషా బహుమాన మిచ్చి
తులసి మూర్తితో వాదు దలచె నా వేళ
వెలయ మువ్వ గోపాలుడు - వెయ్యిన్నెన్నూరు పదములు
నలువది దినములలోన - నన్ను గలసి వినుపించెనే! ॥వేడు॥

తిరుమలనాయకుని 1623-1659 అభ్యర్థనను అంగీకరించి క్షేత్రయ్య రెండువేల పదములను రచించినట్లు, గోలకొండ పాదుషా కుతుబ్షా దర్బారులో తులసిమూర్తితో వివాదపడిన సందర్భమున పదిహేనువందల పదాలను గానము చేసినట్లు యీ పదంవలన స్పష్టమగుచున్నది తంజావూరు ఆస్థానంలో క్షేత్రయ్య వేయి పదాలను వినిపించినాడు మొత్తము మీద ఆయన నాలుగువేల అయిదు వందలకంటె యెక్కువ పదములను రచించినట్లు తెలియుచున్నది

**అప్రతిమాన ప్రతిభాశాలి ·**

విజయరాఘవనాయకుడు క్షేత్రయ్య మీద చూపించిన గౌరవాదరణలు ఒకసారి రాజస్థానములోని కవులలో, గాయకులలో అసూయను రేకెత్తించినవి వారు క్షేత్రయ్య పదాల్లోని వాడుకభాషను, సరళమైన భావవ్యక్తీకరణను నిరసించినారు ప్రభువునుండి యీ నిరసన విన్న క్షేత్రయ్య 'వదరక పోపోవే' అను పదాన్ని అసంపూర్ణంగా రచించి మిగిలిన చరణాలను ఆస్థానకవులకు వదలివేసి సేతుయాత్రకు బయలుదేరెను ఆస్థానకవులు యెంతో ప్రయత్నించిరి కాని 'పదాన్ని' పూర్తి చేయలేకపోయినారు క్షేత్రయ్య తిరిగి వచ్చిన తరువాత ఆస్థానకవులు మిగిలిన భాగాన్ని పూరించుమని అభ్యర్థించినారు అనుకరణకు

అశక్యమైన తన ప్రత్యేక ఫణితిలో క్షేత్రయ్య ఆ పదాన్ని గానంచేయగా రాజాస్థానము ఆయనకు అవనతమై అంజలి ఘటించినది ప్రభువు పారవశ్యము నందినాడు

ఒక క్షేత్రము నుండి మరొక క్షేత్రమునకు తిరుగుచు, ఆయా క్షేత్రాలలో వెలసియున్న దేవతలను స్తుతించుచు గానము చేయడము వలన వరదయ్య, క్షేత్రయ్య అను పేరు పొందినట్లు తెలియుచున్నది ఇంతవరకు లభ్యమయిన పదాల వలన క్షేత్రయ్య కంచి తిరువెళ్ళూరు, తిరుపతి, శ్రీశైలం, శ్రీరంగం, మధుర, చిదంబరం మొదలైన పదునెనిమిది స్థలాలను దర్శించినట్టు అవగతమగు చున్నది. ఈ పవిత్ర స్థలాలలో ఆయన రచించిన పదములు ఆయా దేవతలను సంబోధిస్తున్నప్పటికిని, అన్నిటిలోను మువ్వ గోపాలముద్ర కనిపిస్తున్నది కాంచీపురము నందలి శ్రీ వరదరాజస్వామిని గూర్చి అత్యధికమైన పదములు రచించబడటము గమనింపవగిన విషయము

అత్యద్భుతమైన ప్రతిభతో, వివిధ మనోభావాల అవగాహనతో అలంకార శాస్త్రములో అభివర్ణించిన పలురకాల నాయికానాయకులను, సఖిదూతికలను క్షేత్రయ్య తన పదాలలో చిత్రించినాడు భానుదత్తుని రసమంజరిలో ఉదాహరించిన నిర్వచనములనే క్షేత్రయ్య అనుసరించినట్లు విదితమగుచున్నది. అయినప్పటికిని ఆయన సృష్టించిన పాత్రలు అనన్యమైన సొగసులతో, అపురూప మైన శక్తితో, ఓపముతో హృదయానుభూతిని కలిగించును తెలుగులోని శృంగార పదవాఙ్మయమునకు పదిహేనవ శతాబ్దికి చెందిన తాళ్ళపాక అన్నమా చార్యుల వారి శృంగార కీర్తనలు మొట్టమొదటి ఉదాహరణలు ఈ కీర్తనల కున్నూ పురందరదాసు శృంగార పదాలకును, క్షేత్రయ్య కృతులకును అవినాభావ సంబంధము వున్నది

**పదం – నూతన శోభ**

కాని క్షేత్రయ్య చేతులలో పదములు కొత్తపుంతలను తొక్కినవి. ఆయన పదాలలో పరిపూర్ణత నందిన కవితాశిల్పము శక్తిమంతమై, సహజమైన సంగీత సంపదతో తూలదూగుచున్నది ఈ పదాలయందు శబ్దానికి, భావానికి అద్వి తీయముగ సమన్వయము సాధించబడినది. 'మధుర' పద్ధతిలో భక్తిభావము

పరమాత్మలో లీనమగుటకు జీవుడు పడే తహతహ - యీ పదాలయందు అంతర్వాహినిగా జాలువారుతున్నది క్షేత్రయ్య పదాలు శృంగారరసమును విభిన్నమైన రూపాలలో వైవిధ్యముతో చిత్రించుచున్నవి ఉత్తరదేశమందు విద్యాపతి, జయదేవుడు సాధించిన మార్గాలనే ఆయన పదములు అనుసరించినవని చెప్పవచ్చును. మహిమాన్వితమైన మౌలికత్వముతో, కళాదృష్టితో క్షేత్రయ్య తన పదాలయందు సాహిత్యమునకు, సంగీతమునకు, భావమునకు మధ్య శ్రవణానందకరమైన మేలికలయికను సమకూర్చినాడు జాను తెనుగులోని జాతీయాలను నుడికారాలను క్షేత్రయ్య అలక్ష్యము చేయలేదు మీదు మిక్కిలి అవి ఆయన చేతిలో నవ్యమైన సొగసులను, సత్వమును సంతరించుకొన్నవి సాహిత్యంలో యిప్పుడు సముచితమైన స్థానాన్ని సంపాదించుకొన్న క్షేత్రయ్యపదాలలో పరిపక్వమైన, అగాధమైన ఆయన పాండితీపటిమ ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది

**భరతనాట్యంలో పదం :**

భరతనాట్యంలోని అభినయానికి క్షేత్రయ్యపదాలు చక్కగా సరిపోతాయి నిజానికి 'పద' సాహిత్యంలో క్షేత్రయ్యపదాలు సాటిలేనట్టివి ఆయన పదాలు అధికభాగం విలంబితలయలో, త్రిపుట తాళముకు ఒదిగియుండుట వలన నృత్యానికి ఎంతో ఉపయుక్తముగా నున్నవి మనకు లభ్యమైన పదాలను బట్టి క్షేత్రయ్య 39 రాగాలను ఉపయోగించినట్లు తెలియుచున్నది, ఇందులో చాల వరకు కాంభోజ, ముఖారి, భైరవి, తోడి, శంకరాభరణం, ఆనందభైరవి, పున్నాగవరళి, నీలాంబరి మొదలైన రక్తిరాగాలు, అపూర్వములైన సైంధవి, ఘంటామరువం వంటి రాగాలు కూడ కనుపించుతున్నవి క్షేత్రయ్య సృజనాత్మక వాగ్గేయకారుడుగా గుర్తింపబడినాడు ఆయన కృతులలోని వివిధ రాగాలు, వాని కూర్పు కమనీయమైన కర్ణపేయమైన సంగీత రచనలో ఆయనకు గల శక్తి సామర్థ్యాలను చాటుచున్నవి కర్ణాటక సంగీతానికి ప్రామాణికమైన, సాధికారమైన వ్యాఖ్యగా క్షేత్రయ్య పదాలలోని సంగీతము సర్వదా పరిగణింపబడినది ఈ కారణముచేత భరతనాట్య ప్రదర్శనలలోనే కాకుండా సంగీత సభలలోను పదాలు సముచిత స్థానాన్ని సముపార్జించినవి. సంగీత సభలలో పదాలను పాడి ఒప్పించడానికి తగినంత నేర్పు, అనుభవము అత్యావసరము ప్రఖ్యాత సంగీత విద్వాంసులు తమ గాన సభలలో ఇటీవలి వరకు వాడుకగా క్షేత్రయ్య పదాలను

గానము చేసేవారు క్షేత్రయ్య రచించిన అసంఖ్యాకమైన పదాలలో కేవలం 330 పదాలు మాత్రమే సంకలనము చేయబడి ప్రచురితమయినవి వీటిలో నలుపది, ఏబది పదాలు మాత్రమే సం'త విద్వాంసులచే పాడబడుతున్నవి వీణధనమ్మాళ్ వంటి ప్రఖ్యాత సంగీతకారులు వారి శిష్యులు క్షేత్రయ్య పదాలను భద్రపరిచి నారు అయన పదాలను పునరుజ్జీవింప జెయడమే ఆ మహావాగ్గేయకారుని యెడ మనము ఆచరించవలసిన విధి

క్షేత్రయ్య త్రిశతాబ్ద్యుత్సవము జన్మాష్టమితో కలసివచ్చినది అయన గౌరవార్థముగ యీ వారము జరుగుచున్న ఉత్సవ సందర్భమున ఆకాశవాణి గానసభలు, రూపకాలు, ప్రసంగములు, సదస్సులు, సంగీత నాటకములు, కదంబ కార్యక్రమాలు మొదలయిన ప్రత్యేక కార్యక్రమాల ద్వారా యీ అమర సంగీతకారునిః అంజలి ఘటించుచున్నది

క్షేత్రయ్యగా మనకు పరిచితుడైన యీ అసాధారణ మనీషికి అభినందన లను నివాళులను అర్పించుదాం

*"ఆకాశవాణి సౌజన్యంతో"*



# క్షేత్రయ్య పదముల నాట్యానుకూలత

—శ్రీ విస్సా అప్పారావు

కవులు, పండితులు, గాయకులు, నాట్యవేత్తలు, భక్తులు, రసికులతో నిండియున్న ఈ సభకు నమస్కారములు.

క్షేత్రయ్య త్రిశత వార్షిక వర్ధంత్యుత్సవమును ప్రారంభింప సంకల్పించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారికి నా వందనములు. దేశమంతటను ముఖ్యముగ ఆంధ్రప్రదేశమందును అమితోత్సాహముతో ఈ ఉత్సవము వారము దినములు జరుపుకొనుట కేర్పాట్లు జరిగినవి. ఇవి మనకు పర్వ దినములు. పదకర్తలలో అగ్రగణ్యుడైన క్షేత్రయ్య మనవాడై యుండుట మనకు గర్వకారణము. మువ్వగోపాలదేవుని దివ్యానుగ్రహము వలన ఆ దేవుని భక్తాగ్రగణ్యుడు, మహనీయుడును అగు క్షేత్రజ్ఞుని దివ్యస్మృతి జరుగుచున్నది. ఈ యుత్సవము నిజమునకు మువ్వగోపాలదేవుని యుత్సవమనే చెప్పవలెను.

క్షేత్రయ్యపదముల నాట్యానుకూలత:— క్షేత్రయ్యకు పూర్వముకాని, తరువాతకాని నాట్యమునకు సంపూర్ణముగా అనుకూలించే రచనలు లేవని నా యభిప్రాయము. ఈ యభిప్రాయము కలుగుటకు గల కారణములను చూపి దాని సత్యమును నిరూపించవలెను గదా. ఈ నిరూపణములో కొన్ని ముఖ్య విషయముల గురించి చర్చింపవలసి యున్నది. నాట్య మననేమి? నాట్యానుకూలతకు దగిన గుణములేవి? క్షేత్రయ్యకు ముందుగల రచనలేమి? వాని నాట్యానుకూలత ఎట్టిది? అనునది.

నాట్యమనగా నాటకము "త్రైలోక్య సర్వభావానుకీర్తనం నానాభావోప సంపన్నం నానావస్థాంతరాత్మకం లోకవృత్తానుకరణం నాట్యం." సుఖదుఃఖము లతో కూడిన ఈ లోకస్వభావమును ప్రదర్శించి లోకులకు మనశ్శాంతి నుపదేశించునట్టిది. అని భరతముని,

క్షేత్రయ్య పదముల నాట్యానుకూలత గురించి చర్చించు సందర్భములో వాడిన నాట్యమను పదముపైన చెప్పిన నాట్యమువంటిదికాక భరతనాట్యము అని మనము అనేదానికి సంబంధించినది నాట్యము, నృత్యము, నృత్తము అని మనము సాధారణముగ చెప్పుచుందుము. నృత్తము అర్థమును బోధించదు. కరణ, అంగహారములతో కూడియుండును. నృత్తము తాళాశ్ర యము- లయప్రధానము.

నాట్యము వాచిక, ఆంగిక, ఆహార్య, సాత్వికములను నాలుగు అభినయ ములతో కూడియుండును. కొంత నాట్యము, కొంత నృత్తము చేరి నృత్య మగును. దీనిని ఇప్పుడు మనము నాట్యమునకు పర్యాయ పదముగ వాడు చున్నాము ఉదాహరణ—— భరతనాట్యము ఇందు ఒక పాత్ర మాత్రమే పాల్గొనుచుండును ఇతివృత్తముండదు నవరసములు, సర్వభావములు దీనియందుండవు. ఇందు ముఖ్యమైన రసము శృంగారము. దీనిని నృత్యకళ యని అందుము. ఇది నాట్యమేళములలో ప్రదర్శింపబడుచున్నది. నట్టువులు ఈ కళను చిరకాలము నుండి అభ్యసించుచున్నారు. క్షేత్రయ్య పదముల గురించి చర్చించునప్పుడు ఈ నృత్యకళ గురించే చర్చించవలెను. ప్రాచీన నాట్యమేళముల గురించిన వర్ణనలు కొన్ని మన తెనుగు వాఙ్మయమున కలవు. వాటిని విమర్శింతము.

1. బసవపురాణములో తృతీయాశ్వాసమందు ముగ్ధ సంగయ్య కథా సందర్భమున శివార్చనలో హారతి ఇచ్చువేళ నృత్యమును చేసినట్లు వర్ణింపబడినది. హంగుదారుల వర్ణన, జవనిక తెప్పించుట, ఆర్భ టించుట యైనతరువాత నర్తకి——

'పొలుపగు ముఖరసంబును, సౌష్టవమ్ము
లలియు, భావంబు, ధూకళియు, ఝుంకళి
యును, మరియు రేవయు, విభ్రమము,
రేఖయును నెరయంగ నీ రీతి నృత్యంబుసలుప.'

అని యున్నది. ఇందు వాచిక, ఆహార్య, ఆంగికములే ప్రధానములు.

లలి = ఒయారము, విలాసము చూపుట.
భావంబు = మనోవికారము, అభిప్రాయము తెలుపుట.
రేఖ = గోటును ప్రదర్శించుట.
విభ్రమము = భ్రాంతి = భూషణభూషితయైన స్త్రీయొక్క శృంగార చేష్టావిశేషము.
రేవ = ఒప్పిదము

ఇవి భంగిమలతో కూడిన ఆహార్య, వాచిక, ఆంగికాభినయములు. ఇట్లే పండితారాధ్య చరిత్రలోని, పర్వత ప్రకరణమందు లాగు, మంజళము, ఢాలము, వళి మొదలైన పంద్రెండు నృత్యవిశేషములు చెప్పబడినవి.

2. శ్రీనాథుని పలనాటి వీరచరిత్రలో నలగామరాజు సభయందు విద్యా వినోదములు వర్ణింపబడినవి. అందు భూచారి, ఆకాశచారి నాట్యములు, వివిధ అంగహార నాట్యములు ఆడి, తరువాత ప్రేరణి, దేశిని, ప్రేంఖణము మొదలగునవి, సప్తతాండవములు, అంగ, ప్రత్యంగ, ఉపాంగములతో సంయుత, అసంయుత హస్తములతో అభినయించుట చెప్పబడినది. తరువాత మాచర్లచెన్నుని మహిమను దెలుపు ఆంధ్ర సంస్కృత వాఙ్మయముల యందలి గీతములను భావము తెస్సగా ప్రచురమగునట్లు అభినయింపబడెను. ఇందు మొదట పేర్కొనబడినవి ఆంగికాభినయములు, తరువాత మాచర్లదేవుని మీద గీతములు పాడి అభినయము చేయబడినది. ఇందు కొంత రసాభినయమున్నను భక్తిని వ్యక్తపరచుటకై కావలసినంతవరకే సాత్వికాభినయ ముండునవలెను.

3. శ్రీనాథుని తరువాత వ్రాసిన ప్రబంధములలో ఉదాహృతములైన నృత్యములు- పేరణి, పెక్కిణి, కుండలి, దండలాలసము, జక్కిణి, హల్లీసకము మొదలైనవి. ఇవన్నియును పైన చెప్పినవాటివంటివే. వీనిలో పెక్కింటిని గురించి నృత్తరత్నావళిలో వివరణ కలదు నాడు, నేడు కూడ నాట్యమేళములలో ఆంగికాభినయమే ముఖ్యమైనది.

సాత్వికాభినయము సాత్వికభావములను వ్యక్తపరచును. స్వేదము, గ్రమానుపాటు, గగుర్పాటు, స్వరభేదము, మాటతడబడుట, వెలవెలబారుట, కన్నీరు, మూర్ఛ అని సాత్వికభావములు ఎనిమిది. ఇవి మనోజములు. ఇతరుల సుఖదుఃఖములతో సానుభూతి పొందినప్పుడు ఈ భావములు కలుగును. సాత్వికాభినయము ఎక్కువగా శృంగారరచనలయందు ఒప్పును. అన్ని రసములకంటె శృంగారము సహజమైనది. సర్వసామాన్యమైనది. ఆద్యంతము మనోహరమైనది. రసమనగా హృదయానందము ఈ రసానందము సహృదయ హృదయములయందు స్థిరముగా ఉండుటను స్థాయీభావమందురు ఈ స్థాయీభావము విభావ అనుభావ, సాత్వికభావ, సంచారీభావములను వాని ద్వారా రసికహృదయులయందు సిద్ధించును. సామాజిక హృదయులయందు ఎక్కడో బీజరూపమున నున్న శృంగారరసమును ఈ సాధనములు పెంపొందించి అనుభవించునట్లు చేయును శృంగారరసము పుట్టుటకు కారణభూతులైన నాయికా నాయకులను ఆలంబన విభావములందురు యౌవనము, అలంకరణము, మలయమారుతము, గంధలేపనాదులు, వెన్నెల మొదలైనవి ఉద్దీపనవిభావములు. ఈ విభావములవలన పుట్టినట్టి శోభ, కాంతి, లీల మొదలగు శృంగారచేష్టలను అనుభావములందురు. సాత్వికభావముల నిదివరకే పేర్కొనబడెను. అవియును శృంగారరసానందమును తెలుపు సహజమైన గుర్తులు. మరియు నిర్వేదము, శ్రమ, దైన్యము, శంక, గ్లాని, హర్షము, విషాదము మొదలైనవి సంచారీభావములు. ఇవి శృంగారరసమును పోషించును. ఇవి రసాభినయమందు ముఖ్యమైనవి. వీటినే వ్యభిచారీ భావములందురు.

శృంగారరసానుభూతిని కలిగించునట్టి రచనలు ద్వివిధములు. పద్యాత్మకములు, గేయాత్మకములు. గాథాసప్తశతి, అమరుకము వంటి కావ్యముల కంటె అష్టపదులు, పదములు అను సంగీత రచనలు అభినయానుకూలములై అతిశయించిన ఆనందమును కలిగించును ఇట్టి సంగీత రచనలలో మొదటిది గీతగోవిందకావ్యము. జయదేవ మహాకవి రాధాకృష్ణలీలలను అష్టపదులలో రచించెను. ఇందు చాలవరకు విప్రలంభశృంగారము వర్ణింపబడినది. ఇది మధురభక్తిపూరితము. ఇందలి శృంగార మలౌకికము, దివ్యము దీనిని పాడి, ఆడి, అభినయించి సంపూర్ణరసానుభూతిని పొందవచ్చును. వీని యందలి నాయికాభేదములు కొన్ని మాత్రమే చిత్రింపబడినవి. అలంకార శాస్త్రమందలి నాయికా నాయకులలోని వివిధ భేదములన్నియు ఇందుదాహృతములు కాలేదు. మరియును ఇవి సంస్కృతమునం దుండుటచేత సుబోధకములు కావు ఐనప్పటికి వానికున్న అనుకూలతనుబట్టి సకృతుగా అష్టపదుల నభినయించుట కలదు.

తరువాత 15 వ శతాబ్దములో సంకీర్తనపితామహుడగు తాళ్ళపాక అన్నమాచార్యులవారు తెలుగుభాషలో శృంగారసంకీర్తనలను పదములను అనేక వేలు వ్రాసినారు. తెలుగు సాహిత్యములోని ప్రప్రథమ శృంగారపదములివే ఇవి అలౌకిక మధురభావములతో నిండియుండును. వేంకటేశ్వరస్వామికి అంకితములు. 'వేంకటశైలవల్లభుని రతిక్రీడారహస్యము'లను వెల్లడించునట్టివి.

"పదములు శృంగార వధూ
మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రములైనన్
విదితార్థగ్రామ్యోక్తులు
పదిలముగా బొంక మెరిగి పలుకగ వలయున్."

"పల్లవ నారీ మ్లేచ్ఛా
ద్యుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు చవికై
చెల్లును గ్రామ్యము లైనను
హల్లీసక ముఖ్యనాటకాదికఫణితిన్."

"జగతిగల జెల్లు బళ్ళై
నగి నగి భాషించునట్టి వానుడి పలుకుల్
తగదన రహిచెడు బువ్వాల
సొగసుడుగన్ పిసికి కంపు సూచిన భంగిన్."

అని అన్నమయ్యగారు శృంగారపదరచ నెట్లుండవలెనో నిర్ణయించి యున్నారు. బాగుగా పరిశీలించినచో అన్నమయ్యగారి శృంగారపదములు అభినయయోగ్యములై యుండును. ఒక ఉదాహరణ నిచ్చుచున్నాను ఇందు చెంచులక్ష్మి వెంకటేశ్వరస్వామిని గూర్చి సఖితో నిష్ఠూరముగా పలుకుచున్నది.

ప॥ మొల్ల లేలే నాకు తన్నె ముడుచు కొమ్మనవె, నే
జెల్ల పూవు కొప్పు తావి చెంచుదానను॥

చ॥ పట్టుచీరేటికి పారుటాకులె చాలు
దట్టి గట్టుకొమ్మనవె తన మొలనే
పట్టెమంచమేలే నాకు పవ్వళించు మనవె, నే
చెట్టుకింద దొరలాడే చెంచుదానను॥

సందిదండ లేలె నాకు సంకు కడియమె చాలు
యిందవే యెవ్వతెకైన నిమ్మనవె
గంద మేల నాకు చక్కని తనకే కాక నే
జిందువందు చెమట మై చెంచుదానను॥

కుచ్చుముత్యాలేలె నాకు గురివిందలె చాలు
కుచ్చితన మెడ గట్టుకొమ్మనవె
కచ్చు పెట్టి కూడె వెంకటగిరీంద్రుడు నను
చిచ్చి నే నడవిలో చెంచుదానను॥

[“ఇంత ప్రొద్దాయె నింక వాడేమి వచ్చేని” అను క్షేత్రయ్య పదములో మూడవ చరణములోని “సొమ్ములేలె, విరులేలె సొగసెవ్వరు చూచేరే కొమ్మా” అనునది దీనిని పోలియున్నది ]

ఇట్టి పదము లెట్లు పాడవలెనో నేడు తెలియుటలేదు అది గొప్ప లోటు. ఎట్లయినను కొన్ని పదముల నేరి స్వరపరచి ప్రచారములోనికి తేవలసియున్నది

అన్నమాచార్యులవారి తరువాత 150 ఏండ్లకు పదకవితాచక్రవర్తియైన క్షేత్రయ్య శృంగారపదములను రచించెను దివ్యమై, అలౌకికమైన శృంగారమును ఈ లోకమునకు క్షేత్రయ్య తీసికొనివచ్చెను. జనసామాన్యమునకు అనుభవములోగల శృంగారమంతయు ఈ పదములయందు వర్ణింపబడియున్నది. అందుచేతనే ఈ పదములు బహువ్యాప్తి జెందినవి మరియు ఇవి తేట తెలుగులో, వాడుకభాషలో లలితముగ వ్రాయబడినవి అన్వయకారిన్యము లేకుండ చిన్నమాటలతో, భావము ఎక్కడికక్కడ విరుగుటకు అనుకూలముగ, తాళము కొలకు అడ్డదిడ్డముగ పదములను విరుచుటకు అవసరము లేకుండ వ్రాయబడినది. విలంబకాలములో పాడునట్టివగుటచేత భావము నభినయించుటకు సావకాశము నిచ్చుచుండును. రాగభావము నిలిపి సువ్యక్తముచేయుటకు, రాగభావము సాహిత్యఅభినయములతో సమ్మేళనమై సంపూర్ణరసానుభూతి కలుగుటకు ఈ విలంబకాలము తోడ్పడును.

శృంగారపదములందు పాత్రలు, నాయికా నాయకులు, సఖీదూతికలున్ను. ఇందు నాయికలలో స్వీయ, పరకీయ, సామాన్యలనునవి ముఖ్యమైన భేదములు. స్వీయలో దివ్య, అదివ్య, దివ్యాదివ్య అని, ఉత్తమ, మధ్యమ,

అధమ అని, ముగ్ధ, మధ్య, ప్రౌఢ అని, ధీర, అధీర, ధీరాధీరయని, జ్యేష్ఠ, కనిష్ఠయని ఎన్నో భేదములు కలవు. ఈ ఒక్కొక్క భేదములోను స్వాధీన పతిక, విరహోత్కంఠిత, కలహాంతరిత, ఖండిత, వాసవసజ్జిక, విప్రలబ్ధ, అభిసారిక, ప్రోషితభర్తృక అని ఎనిమిది భేదములు కలవు. వీనినన్నింటిని విడివిడిగా బేరీజు వేసినచో నూరు, నూటయేబది భేదములుండును. ఇట్లనే పరకీయలోనివి కొన్ని, సామాన్యలో కొన్ని, నాయకులలో కొన్ని, సఖి, దూతికా విషయములుకొన్ని చేర్చినచో రెండువందలకు తక్కువగాని భేదములుండును. వీటన్నిటి లక్షణములకును తగిన లక్ష్యములు క్షేత్రయ్య పదములలో కలవు. శృంగారరసమంజరిలో ఇవన్నియు వివరింపబడినవి.

ఈ పదములు చాలవరకు త్రిపుట, చాపు తాళములలో రచించుటచేత నృత్యమునకు, అభినయమునకు బహుఅనుకూలములై యున్నవి. స్త్రీస్వభావ మందలి సౌకుమార్యమును, వైవిధ్యమును ఇంత సొంపుగా చిత్రింపబడిన రచనలు ఎక్కడనూ లేవు. వివిధ పాత్రల యొక్క మనోవృత్తులు, హావ భావములు, మిక్కిలి సహజముగా ఒక్కొక్క అవస్థలో, ఒక్కొక్క సన్ని వేశములో, ఒక్కొక్క సందర్భములో జీవ చైతన్యముతో తొణికిసలాడు నట్లు కళ్ళయెదుట ప్రత్యక్షమగునట్లు పదములయందు చిత్రింపబడినవి. 'వాక్యం రసమయం కావ్యం' అను న్యాయమును బట్టి క్షేత్రయ్యపదములన్నియు ఖండ కావ్యములే యనవలెను. సంగీతవేత్త, నాట్యవేత్త, బహుఅనుభవశాలి, మహాకవియగు క్షేత్రయ్య ఇట్టివి వ్రాయగలుగుటలో ఏమియు ఆశ్చర్యము లేదు. అందుచేతనే ఈ పదములను తాను పాడి, ఆడి అభినయించి వానిలోని రసానందమును సహృదయులగు సభ్యులకు అందించి విజయరాఘవుని కొలువు కూటమునంతను సమ్మోహితము చేయగలిగినాడు. నాటినుండి అభినయకళ యొక్క చరిత్రలో నూతనాధ్యాయము ప్రారంభమైనది.

ఆరంభమున చెప్పినట్లుగా క్షేత్రయ్యపదములు నాట్యమునకు సంపూర్ణ ముగ అనుకూలించునని, అట్టివి అంతవరకు రచింపబడలేదని నిరూపించుటకై

యింతవరకు ప్రయత్నించినాను. ఈ ఆనుకూల్యములో తరతమ భేదము లున్నవి నాయికా, నాయకుల స్వవచనములైన పదములు ఎక్కువగ అభినయింప అనుకూలములు. సఖి వాక్యములు అంతగా అనుకూలపడవు. కొన్ని పదములు వర్ణచిత్రణకు, చదివి భావమును అనుభవించుటకు ఎక్కువగా బాగుండును. కొన్ని పదములలో నర్తకియొక్క ప్రతిభను చూపించుటకు వీలైన చోట్లుండును. 'మువ్వగోపాలు డెన్ని నేర్చి నాడమ్మా' తళుకు, జెళుకు, వగలు మొదలైనవి.

సాహిత్యమందు, సంగీత, నాట్య, అలంకారశాస్త్రములయందు అసామాన్యమైన గొప్పతనముగల క్షేత్రయ్యపదములకు క్రమముగా క్షీణదశ ఏలవచ్చినది ? సంగీత, నాట్యములయందు ప్రచారమేల కొఱవడినది అను విషయమును విమర్శించుట ఎంతయు అవసరము పండితులు, పండిత రసికహృదయము కలవారు అలంకార శాస్త్రవేత్తలు మాత్రము కూడిన విద్వత్సభలో అన్ని పదములును అభినయింప వచ్చును. ఏమన, వారందరు విమర్శనాదృష్టితోను, రసాత్మక దృష్టితోను ఉందురుగనుక క్షేత్రయ్య పదములలో స్వీయ నాయికకు సంబంధించిన పదములలో దివ్యమైనవి చాల కలవు. కొన్ని పరకీయకు, సామాన్యకు సంబంధించినవి కూడ సభ్యమైనవి కలవు; కాని క్షేత్రయ్య తరువాత శృంగారము అతిగా ఉన్న, పచ్చిగా వున్న పరకీయ, సామాన్యనాయికలకు సంబంధించిన పదములనే ఎక్కువగా శృంగారలోలురగు సంపన్నులు, వారి కిష్టురాలైన నర్తకిచేత అభినయింపజేసి ఓలలాడునట్టి దుస్థితి తటస్థించినది. దానినిబట్టి క్షేత్రయ్య పదములకు చెడ్డపేరువచ్చినది అవి నోట ఉచ్చరింపరానివని, ఆడిన చూడ అర్హతలేనివని, మర్యాద కుటుంబములవారు, పెద్దలు, వాటిని గర్హించుట తటస్థించినది' నాకు తెలిసినంత వరకు— ఒక్కసారికే, దొంతరవిడెముతో, ఇటివంటివాడు రానేలే, వెదకితేరాపోయి, సమర్తాడి, ఎవ్వడే ఎవ్వడే మొదలగు పదములు అభినయములో ప్రచారములగుచున్నవి. ఇప్పటి నట్టువులు నేర్పునట్టి పదములు కొన్ని ఇటువంటివే; చాలవరకు ఈ కారణములచేతనే క్షేత్రయ్య పదములకు క్షీణదశవచ్చినది!

కొన్నేండ్లనుండి నృత్యకళ పునరుద్ధరింపబడవలెనని ప్రయత్నములు సాగుచున్నవి తల్లిదండ్రులు వారి వారి పిల్లలకు నేర్పచూచు చున్నారు. ఇట్టి ఆదరాభిమానములు కళోన్నతికి తోడ్పడవలెను. తలిదండ్రులు, బంధువులు, స్నేహితులు మొదలైనవారి సమక్షమున తమబాలికలు నేర్చిన అభినయ విద్య ప్రదర్శించునప్పుడు వారందరు ఆ పదములందలి అర్థమును, దాని అభినయమును సామాన్యదృష్టితో జూచుదురు గనుక, వారి మనస్సులకు కష్టము తోచకుండ, సభ్యమై నాగరకమై పదాభినయ ముండవలెను కానిచో నేర్చుకొను పిల్లలకుగాని, సంఘమునకుగాని శ్రేయస్కరముకాదు కళనేర్పింపవలెనను ఆత్రముచేత తలిదండ్రులు ఈ వివక్షణ అంతగా చేయుటలేదు! కొందరట్టివారున్నను, వారికి నచ్చినట్టి పదములనే అభినయము చెప్పువారును లేరు! ఇది గొప్ప సమస్య. దీనిని నాట్యము చెప్పునట్టివారు, నేర్చుకొనునట్టివారు, పెద్దలు పాటించినగాని సాధ్యపడదు; కాని నాడు క్షేత్రయ్య పదములకు పూర్వపుస్థితే పట్టగలదు.



# క్షేత్రయ్య : పదకవిత్వము

—శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

రాగము తాళము రెండును సమాన బలముగల మూల ద్రవ్యములు పదకవితకు. ఇట్టి రచనకు "పదము" అను పేరు తెలుగులో చాలా ప్రాతది. పాల్కురికి సోమనాథుని కాలమునకే ఆ సంకేత నామము స్థిరమైనట్లు అతడు పేర్కొన్న "నివాళి పదములు గొబ్బిపదములు" మొదలైన ఎన్నో వివిధ రచనలు స్పష్టముగా తెలుపుచున్నవి.

కాని 'పదము' అనగా పాదము-కాలు అన్నదే మూలార్థమని చెప్ప వచ్చును తాత్పర్య వృత్తిచేత రెండింటి, లేక నాల్గింటి, ఒక భాగము అను నర్థము రావచ్చును. సంస్కృత భాషయందు పదశబ్దమునకు ఎన్నో అర్థములు ఇట్లు తాత్పర్య సిద్ధములైనవి కలవు ఈ 'భాగము' అను నర్థముగల 'పద' శబ్దము 'పద్యము' అను పేరిలోనే అంతర్గామిగా నున్నది 'పద్యం చతుష్పదం' అన్నారు లాక్షణికులు. కాని ద్విపదలో రెండవభాగవమని, షట్పదిలో ఆరవ భాగమని, అర్థమును ఈ పదశబ్ద మిచ్చుచున్నది. కాని ప్రాయికముగా అన్ని భాషలందును పద్యమునకు నాలుగు భాగములే యుండును. నాలుగు మూలల చౌకమందే-చతురశ్రమందే-మన దృష్టికి అందము సహజముగా స్పష్టముగా అనుభవమునకు వచ్చును గదా! జయదేవుని గీతగోవిందమునకు "అష్టపది" అను పేరుండుట సుప్రసిద్ధమే. దానిలో ఒక్కొక్క పాటకు ఎనిమిది పదములు, నుడుగులు, కలుగుట అందుకు కారణము. కాని తెలుగు నందును కన్నడము నందును భాగము అను అర్థము పోయి "పదము" అనగా నిండు పాట అనియే అర్థము నిలిచినది. తాళ్ళపాక బయకారులు పదము అను సంకేతము నెరిగియున్నను తమ రచనలకు "సంకీర్తనములు" అనియే పేరు పెట్టుకొన్నారు. ఆ రచనల ప్రధానోద్దేశము భవగవద్గుణానుభవము గనుక.

కాని యీవల శృంగార రసమయమై రాగతాళ నిబద్ధమైన రచనకు "పదము" అను సంకేతనామము వాడుట సంగీత రసికుల సంప్రదాయమైనది. క్షేత్రయ్య కాలమునకే ఈ వాడుక వచ్చినట్లున్నది. ఒక నాయిక మువ్వగోపాలుని "పదము పాడగా వినేవో చదరంగమే చూచేవో!" అని ప్రలోభనము చేసినది. ("ఏమనేవానతీరా"-అను పదము) శృంగారమయమైన రచనకాకపోయినచో మువ్వగోపాలుడు మొగమిచ్చి వినువాడేనా? కాని నేనిక్కడ పాట అను సామాన్యార్థమందే పదము అను మాటను వాడుచున్నాను.

మనుష్యులకు రాగతాళముల ఆకర్షణము ప్రకృతి సిద్ధమైన ధర్మము. ప్రాణి సామాన్యమునకే ఈ న్యాయమును అంటగట్ట వచ్చునేమో! అఖండమైన నాదమును ఖండమైన సరళరేఖలుగా తీర్చి, ఆ రేఖలను పరస్పరముగా చేర్చినపుడు సృష్టిసిద్ధముగా వాటికి గల సంవాద సౌందర్యమును మనము గ్రహించుచు పరవశముగా ఆ నడక వెంటనే నడచి ఆ లయానందమును అనుభవింతుము.

కాలము ఇంకను అఖండమైనది అనిర్వచనీయమైనది దానిని ఖండములుగా చేసి, ఆ ముక్కలను ఎచ్చు తక్కువలు లేకుండ నికరముగా ఏర్పరచి జోడించి ఆ నాదఖండములతో పెనచిపేడి, ఆ లయానుభవమున కానందింతుము. ఈ రెండు సంగీత మూలద్రవ్యములలో నాదము చెవితో గ్రహింపగలిగిన ఐంద్రియికమైన బహిరంగము. కనుక చిన్ననాటి నుండి గూడ సహజముగా సులభముగా దానిని మనము పట్టుకొనగలము. కాలము అటువంటిదిగాదు. బుద్ధికి గోచరింపవలసినది అది. చిటికలు మొదలైన శబ్దములు ఆకాశఖండములను సూచింపగలవు కాని, వ్యక్తము చేయలేవు. ఆ కారణముచేత కాల ఖండముల బన్నసరమైన తాళము అంతరంగమైనది; నెమ్మదిగా గ్రహించి అనుభవింపవలసినది. కనుక మనుష్యజాతి సంస్కృతిలో మొదలు రాగము, తరువాత తాళము అనుభవమున కందియుండవలెను. మన దేశములో చాలా ప్రాతపాటలు వేదసూక్తములు. మనుష్యజాతికే అవి మొదటి రచనలు అని

యూహింపవలసినవి. వాటి గానమందు తాళములేదు అన్నది మనమిక్కడ గమనింపవలసిన తత్త్వము. సప్తస్వరములతోగానము చేయు సామపారాయణమందు గూడా తాళలయ విన్యాసము కానరాదు. కనుక నాటినుండియు వేద గానము "వైతాళిక" గానముగానే తాళములేని పాటగానే — మిగిలిపోయినది. నేటికిని తెలుగులో పరమ ప్రాచీన పద్ధతి యని చెప్పదగిన పల్లెపాటలు-కపిలె పాటలు మొదలగునవి - కొన్ని తాళ నియమము లేకుండనే పాడబడుచున్నవి. ఈ రాగ - తాళములు రెంటిని కలిపి, హృదయంగమములైన భావములను వెలువరుచు భాషను అలంకరించుటయే పదరచనకు పూర్ణస్వరూపము. దాని పూర్ణానుభవమును మన కప్పుడే సతాళముగానో వితాళముగానో, కావ్యకళా రసానుభవమును ప్రాచీన మనుష్యజాతి పాటరూపముననే అనుభవించి రసించి నదని పండితులూహింతురు మన పద్యము లన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మదృష్టి అక్కరలేదు.

'అన్ని' అనగా సంస్కృత సారస్వతమునందు ఇటీవల వాడుకకు వచ్చిన అక్షరగణవృత్తములు తప్ప- అని చెప్పుకోవలయును. శార్దూలము, చంపకమాల మొదలైన ఆ వృత్తాలన్నియు రాగదృష్టిగాని, తాళలయముల చూపుగాని లేక, వట్టి గురులఘువుల ప్రస్తారముచే ఏర్పడినవి. వాటియం దుపయోగించు గురులఘువులకు నిర్ణాయకమైన పరస్పర సంబంధము లేదు కొన్ని అక్షరములు లఘువులు, మరికొన్ని గురువులు అని పంచినారు కాని, ఆ రెంటికిని అడుగు నెలవైన కాలప్రమాణమును ఛందశ్శాస్త్రకారులు చెప్ప లేదు. లఘువుకు రెండింతలు గురువు, గురువునందు సగము లఘువు అని చెప్పియున్నను, ఆ గురు లఘువిన్యాసమును కొంచెమైనను మీరక పద్యము లను కూర్చియున్నను, వానిని చదువునప్పుడు మనమంతా అర్ధభావములకు పరవశులమై, స్వతంత్రముగా అక్షరములను కుదించి, యీడ్చి, నడపుదుము. ఇది విధిలేక వచ్చిన పరిణామమే కాని అజ్ఞానము కాదు. కనుక వృత్తము లలో కాలలయము లేదనుట సత్యము. నాలుగు పాదములందును అక్షరముల లెక్క, గురులఘువుల విన్యాసము నికరముగా ఒక విధముగానే యుండుటచేత

ఆ పాదములకొక సామాన్య స్వరూపమునిచ్చు వలయమొకటి అందు గలదు. కాని లయదృష్టితో చూచువారికి ఆ వలయము అవలయముగానే స్ఫురించును. ఇదొక లెక్కల లయము అనవచ్చును, అంతే. ఇక వృత్తముల పారాయణ మున కుపయోగించు రాగము చదువువారి స్వాధీనము, వారికి వచ్చినంత, తోచినంత, ఏ వృత్తమునుగాని యే రాగముతోనైనా చదువవచ్చును. చెప్పవచ్చినదేమనగా; వృత్తములు పాట పరిణమించిన రూపములు గావనుట; ఎట్లును వాటికి మూలమైన రాగతాళములు మనమిప్పుడూహింపలేమనుట.

తాళ నిబంధనకు మూలమైనవి మాత్రాగణములు. ఒక్కొక్క గణము నకు ఇన్నె మాత్రలు, మాత్రకు ఇంతే కాలము- అను నికరముండును. ఆ నిర్ణయమును అక్షరములు కొంతవరకు సూచింపగలవేకాని నియమింపజాలవు. పాట ఆరంభించునప్పుడు గ్రహించిన కాలఖండముల కొలతకు సరిగా, లఘువును ఒక మాత్రకు తక్కువలేక, గురువును రెంటికి తక్కువలేక, సాగునట్లేర్పరిచి, అక్షరములనంటియున్న స్వరాలను నడపుదుము ఆ మాత్రలను మూడుగా, నాల్గుగా, ఐదుగా, ఏడుగా వింగడించి గణములను గూర్చుకొందుము త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్రములని ఆ నాల్గింటికి సంగీతలాక్షణికుల సంకేతము తొమ్మిది మాత్రల గణముగూడా గమనించి దానికి 'సంకీర్ణము' అని పేర్కొనిరిగాని అది గాయకులకే రుచింపక వదలి నారు పాటపాద మొక్కొక్కటికి సమముగా నియతముగా ఆ నాల్గురకముల గణాలను పంచిపెట్టి, ఆ సంఖ్యానియమము కాలప్రమాణమును తప్పక, పల్లవి, అనుపల్లవి, చరణములు- వీటికి ఉత్తరోత్తర ద్విగుణముగా పాదముల నేర్పరచుకొందుము. ఇదే 'పదము'. ఈ స్వరూపము సుమారు 11 వ శతాబ్ది నాటికే మనలో ఏర్పడినదని జయదేవుని గీతగోవింద రచన వెలువరుచు చున్నది.

కవితా శిల్పదృష్టితో చూచునప్పుడు ఈ పదరచన చాలా చిక్కైన పనిగా తోచును. ఒక పంక్తికి మూడు మూడు మాత్రలుగల గణములు

నాల్గింటిని ఏర్పరచుకొంటిమేని వాటి తాళలయమును స్పష్టముగా ఒత్తిచూప వలసియుండును. అప్పుడు ఆ గణవిభాగమునకు సరిగా అక్షరములను జోడింపవలయును. కనీసము రెండురెండు గణాలకైనను పదములు విరుగ వలసియుండును. ఆ విరుపుకు సరిసమముగా వాక్యము, అర్థము, తెగవల యును. పాదముల పూర్వోత్తరార్ధముల సంబంధమును సామ్యమును స్పష్ట పరుచుటకై యతియో ప్రాసయో అమర్చవలెను. పాదార్ధములందు, రెండు పాదాల తుదలో, అంత్యప్రాసముగూడా వచ్చినచో ఇంకను అందము. ఈ క్రింది అన్నమయ్య శృంగారపదము ఉదాహరణము కాగలదు. ఇందు ప్రతి పాదమునకును ఏడేడు మాత్రల నాల్గుగణము లున్నవి అట్టి పాదములు పల్లవికి రెండు, నాల్గు ప్రతిచరణమందును గలవు. అట్టి చరణములు మూడు.——

శంకరాభరణము - మిశ్ర చాపు తాళము

(ప) జవ్వాది - మెత్తిన - ది అ - ది తన,
జవ్వన - మే - జన్నె వ - ట్టినది॥

(1) ముద్దుల - మాటల - ది అ - ది చెక్కు-
టద్దము - ల కాంతి - యలరిన - ది;
గద్దరి - చూపుల - ది అ - ది తన
వొద్ది చె - లియ మీద - నొరగియు - న్నది॥ (జవ్వాది)

(2) పుత్తడి - బోలిన - ది అ - ది తన
చిత్తము - నీ సొమ్ము - చేసిన - ది
గుత్తపు - గుబ్బల - ది అ - ది యల
చిత్తజు - ని లెక్క - సేయని - ది॥ (జవ్వాది)

(3) ఎమ్మెలు - యెఱుగని - ది అ - ది తన
కెమ్మోవిఁ - జిఱునవ్వు - కెరలున్న - ది
కమ్మకొ-నఁగ వేం-కటరాయ - నీ
కమ్మని - కౌఁగిటఁ - గలసి యు - న్నది॥ (జవ్వాది)

ఇట్లు యతిప్రాసలను అర్థవాక్యములను నికరముగా నిర్వహించినప్పుడే పద కవితయందలి లయానుభవము కమ్మనై యుండును.

కాని కావ్యకళ ఇంతటితో ముగియునదిగాదు. దానిలో విషయమునకు విషయికి సంబంధించిన వివిధ శబ్దార్థభావముల రచన రసానుభవమునకు సాధనము గావలసియున్నది. వాటిని పై కొలతలకు లోబరిచి కత్తిరించి నిలుపుట అన్ని సందర్భము లందును సాధ్యమైన పనిగాదు. కవితాదృష్టికి ఈ తాళలయము కేవల బహిరంగమైన అనుభవము. దీనికై అంతరంగపు స్వతంత్ర విశాలభావనలను బంధించుటగాని, వదలుకొనుటగాని, యుక్తముగా తోపదు; సాధ్యమును గాదు.

రాగముగూడ తాళమువంటిదే. వాటిలో స్వరముల రచన, రాగవిన్యాసము, ముక్తాయింపు - అన్నియు అన్యోన్య సంబంధముగల ఒక ప్రణాళిక ప్రకారముగా ఏర్పరుపబడును. మరి రాగము అర్థములేని అనుభవము నిచ్చు విచిత్ర పదార్థము. భాష అట్లుగాక ప్రతిశబ్దమునకును నిర్ణీతమైన అర్థ సంకేతము కలది దీనిని దానికి లోపరిచి నడపుట కాళ్ళుచేతులు కట్టి యీడ్చినట్లు

కనుక స్వతంత్రమైన ఉదాత్త కావ్యరచనకు ఆ రాగతాళములు రెంటి బిగువునుగూడ ఎంతో సడలింపవలసి యుండును అట్టి పరిణామమే వాఙ్మయ మందు పెరిగి వచ్చుచున్నది. శ్రావ్యముగా నుండుటకు మాత్రము స్వతంత్ర మైన స్వల్పరాగము, - నియమమే లేని మానవ ప్రవృత్తి యేదిగాని 'రచన' కాజాలదు గనుక, అందుకై స్థూలమైన మాత్రానియమముగల గణముల

నడక - ఈ రెండే కవితాకళ కైవాటమునకు వలసిన యిటుకగారలై మిగిలినవి దేశ్యపద్యములైన సీసము, గీతములు, ద్విపద, రగడ, అక్కర మొదలైన వన్నియు పదముల యీ పరిణామమును స్పష్టముగా సూచించు చున్నవి ఆ యింత రాగమును ఈ యింత గణమాత్రానియమమును గూడ సహింపలేక రెంటినిగూడ కవితా ప్రపంచము నుండి బైటికిత్రోయు ప్రయత్నముగూడ నేడున్నదిగదా అది విషయాంతరము. ప్రత్యేకముగా విమర్శింప దగినది

పదకవితయందు ఇంత చిక్కున్నది; అందుచే దాని వలయము మిత మైనది; ఆబుడమునుండి పగిలి పద్యకవిత స్వతంత్రమై గంభీర-విశాలముగా పెరిగి వచ్చుచున్నది. అయినా జనసామాన్యముగా పండిత పామరులందు గూడ పదకవితయందలి అభిరుచి తగ్గలేదు. కావ్యపథమున స్వతంత్ర విహారముచేయు నుత్సాహముతో ఎందరో అక్షరగణ వృత్తములనే త్యాగము చేసినారు అట్టివారిలో గూడ అనేకులకు గేయరచన చేయవలెనను ఉత్సాహము ఆశ ప్రబలముగానే యున్నది. కారణమును స్పష్టమే నాదమందలి ఆ హిత మదురత, మనలను నిలిపి నడపించు తాళలయముల అచ్చుకట్టు - వీని సహా ముతో ఆడిన మాటకొక అందమేర్పడును, భావమునకు బలము హెచ్చును; సామాన్యమైన విషయమునకు గూడా ఒక విశిష్టత వచ్చును; స్వతంత్రమున కంటె పరతంత్రమునం దెక్కువ ఆనందము కలదు అను విచిత్రహృదయ తత్వము ఇచ్చట మనకు గోచరించును! ఆత్మ స్వచ్ఛందము వదలి పరమాత్మ పారతంత్ర్యమందు ఆనంద మనుభవించు భక్తుల చిత్తవృత్తి రహస్యమిదే. పరమాత్ముడు నాదస్వరూపుడు, కాలాత్మకుడుగదా మరి యీ నాదకాలములు రెండేకదా పదకవితకు పాదపీఠములు '

కాని ఆ పీటలమీద వేంచేపు చేయించి మనము చూచి సంతోషించు మూర్తి భాషారచన - అన్న విషయము మనము మరవరాదు. నాద-కాల లయ ములనే ప్రత్యేకముగా ఆరాధించునప్పుడు అట్లు మరవవచ్చును; మరవ

వలయునుగూడ ఎందుకనగా పరమేశ్వరుని లీలా విభూతులను లోతుకు దిగి యనుభవించుటకు ఆ నాద-కాల లయములు రెండును స్వతంత్రమైన సాధనములుకాగలవు. అప్పుడది సంగీతకళ యగును. దానిలో భాష అది ఇది అను చర్చకే అవకాశముండరాదు, ఉండరాదు. భాషయెంత కొంచెముగానున్న అంత క్షేమ మక్కడ పదకవితా శిల్పమందు అట్లుగాదు. ఇందు భాషారచన ప్రధానమైనది రాగ తాళ లయలు ఆ మూర్తికి అలంకారములు మాత్రమే ఆ రెండును దీనిని ఎత్తి చూపగలవు; చూపవలసినవి, అంతే పద్యకవితలో ఆ రెండును దుర్బలముగా శూన్యప్రాయముగా ఉండును పదరచనలో వాటి స్వరూపము ప్రభావము కొంత స్పష్టముగా ఎక్కువగా మనచెవి కందును రెంటి భేదమునకు మూలమింతే కనుక పద్యకవితను చూచిన చూపుతో పదకవితను చూడరాదు. దీనితో దానిని చూడదగదు పద్యకావ్యము పెద్ద అడవివంటిది. అందు పెద్దవి చిన్నవి చెట్టుచేమలు, పలువిధములవి, స్వచ్ఛందముగా పెరుగును. పదకావ్యము తోటవంటిది అందు కొన్ని రకములైన వృక్షలతలు మాత్రము ఏర్పాటుగా, అచ్చుకట్టుగా వాదిగి యుండును ఈ పోలిక ఆకారమునకు మాత్రమే సంబంధించినది దీని నెక్కువ సాగదీయరాదని మనవి.

ప్రకృత విషయమైన క్షేత్రయ్య పదము, కవిత్వము రాగతాళములును పరస్పర సౌహార్దముతో కలిసి తయారైన నిండురచన పల్లవి అనుధ్రువ పదము, అనుపల్లవి, చరణములు మూడు - ఇన్ని కలిసిన పూర్ణరూపము దీనిది కవితకు సంబంధించినంతలో దీని స్వరూపమును తాళ్ళపాకవారి సంకీర్తన లక్షణము ఇట్లు నిర్ణయించినది

పదముల యర్థము పల్లవి
వదలక యన్నిటికి నేకవాక్యత సేయన్
గుది గ్రుచ్చినట్లు తగులై
పదము తుదిన్ మరియు మరియుఁ బల్లవి యలరున్.

పల్లవి యందలి భావమునే అనుపల్లవి కొంచెముగా విశేషించును. అనుపల్లవి లేకపోవుటగూడ కలదు. చరణములు మూటికెక్కువగా గూడ ఉండవచ్చును ఎన్నియైనను పల్లవిభావమును పోషించి పల్లవితోనే ముగియుట వాటిపని

పదముయొక్క సంగీత స్వరూపమును ఇట్టిదే. పల్లవి స్వరరచన యొక రాగవాక్యము దానికి పోషకమైనది అనుపల్లవి స్వరవిస్తరణ. చరణము లన్నిటను ఒకటే విధమైన రచన, రాగస్వరూపమును ఆరోహణావరోహణములందు విస్తరించి, పల్లవి-రాగవాక్యము నందుకొని ముగియవలసినదిగా రచింపబడును తాళము లయము కచ్చితముగా, ఆద్యంతములందును ఒకేవిధముగా, ప్రతిపంక్తికిని గణముల సంఖ్య చతురస్రముగా, ఏర్పడవలెను. ఏకాగ్రమైన సముదాయ ధర్మము నిర్వహించుట ప్రధానతత్త్వము గనుక ఒక పదరచనలో భిన్నసందర్భములకు చెందిన అర్థభావములుగాని, భిన్న రాగ తాళ లయములుగాని యుండవు దేనికదే స్వతంత్రమై ఏకతంత్రమైన కూర్పు

పదముల కబ్బిన యీ నిండురూపము సుమారు 14వ క్రిస్తుశతకము నాటికి సిద్ధమైనట్లూహింప వచ్చును. తెలుగు-కన్నడ వాఙ్మయములలో 15వ శతాబ్దిలో ఈ పదరచన విస్తరముగా సాగినది తెలుగులో ఇప్పటికి మనకు తెలిసినంతలో తాళ్ళపాక అన్నమాచార్యులు ప్రాచీన పదకవి గదా అతని కాలమందే అతడున్న సాళ్వనరసింగరాయని ఆస్థానమందే ఉన్న శ్రీపాదరాయస్వామి కన్నడ పదకర్తలలో ఇప్పటికి ప్రాచీనుడు ఆయన శిష్యుడు శ్రీవ్యాసరాయస్వామి, అతనికి శిష్యుడు శ్రీపురందరవిఠలుడు శ్రీపాదరాయలది వైష్ణవ పరంపర. అతనికన్న కొంతమొదలే కన్నడమున పదముల రచన సాగినట్లున్నది ఆ కాలమువాడే అని పండితులూహించు నిజగుణ శివయోగి రచించిన శివాద్వైత పదములు చాలా చక్కని కన్నడ రచనలు తెలుగులో అన్నమయ్యకు ముందు పదములుండెనో లేవో తెలియదు.

గీతప్రబంధముల రచనలో ఆకాలమున-సుమారు 13-14వ శతకములలో - ఒక పెద్ద విప్లావకమైన మార్పు వచ్చినది. అప్పటికి గానవిద్యలో వైణికులు గాయకులును ప్రబంధము లనుపేరుగల రచనలను వ్యాప్తికి దెచ్చుకొని యుండిరి లాక్షణికులు వాని ననుగ్రహించి, రాగ తాళ రస భేదములను, తాళముల ప్రబంధముల అంగభేదములను సవిస్తరముగా ప్రస్తరించి శాస్త్రము సిద్ధపరిచి యుండిరి. మతంగుడు, పార్శ్వనాదుడు, శార్ఙ్గదేవుడు మొదలగువారి గ్రంథములం దీవివరములు చూడవచ్చును తక్కిన వన్నియు అట్లుండగా ఆ రచనలలో తాళము చాలా ప్రధానాంగమై యుండినదనవచ్చును. మార్గ-దేశి భేదములతో ఎన్నో తాళములు పండితలోకమందు గౌరవమును సంపాదించి యుండినవి. స్వర-రాగముల వలె తాళముగూడ ఉపాస్యదేవతలు, ఉపాసనా క్రమము మొదలగు ఆధ్యాత్మిక స్వరూపములతో గోప్యమైన రహస్యమై విద్వాంసుల జయపరాజయములకు సాధనమై యుండెనన వచ్చును. ఆ విభేదములేని విభాగముల నన్నిటికిని స్వస్తిచెప్పి ఆకాలపు దీర్ఘదర్శులు 'సూడాది' అనుపేర అందరికిని సుగ్రహమైన యేడు తాళములను గ్రహించిరి 'సూడ' అనగా పాట 'సూడ ఇత్యేష దేశీయశబ్దో గీతక వాచకః' అని వెంకట దీక్షితుని నిర్వచనము ఏ భాషలోనిదో తెలియదు. సూడకు ఆది-అనగా మూలమైనది-సూడాది. పాట యేదైనా ఆ యేడుతాళములలో ఒక్కటికి లోగియుండక తీరదు అన్నమాట ఇది అనావశ్యకమైన చిక్కును తొలగించి పాట నడకను సులభీకరించుకొనుట మాత్రమే కాదు తాళసామాన్యపు అంతస్తత్వమును అందరికిని తెలిపిన మహాకార్యము గూడ అన్ని పాటలకును ఆధారమైన 'గతి' చతురశ్ర, త్ర్యశ్ర, మిశ్ర, ఖండములను నాల్గేవిధములని, అవి యీ యేడుతాళములలో - ధ్రువ, మఠ్య, రూపక, జంప, త్రిపుట, అట్ట, ఏకతాళములలో — అడగి యున్నవని, యీ విప్లవము చాటినది. ఈ యేడింటి జతకు సర్వచతురస్రమైన 'ఆది' తాళమొకటి ప్రాతది చేరినది. ఈ విప్లవమును లేవదీయుటతో తృప్తిపడక, ఆ తాళములు గూడ ఒక్క పాటలోనే అడగియుండునట్లు 'సూళాది' రచనలను తాళమాలికలుగా

ఆ కాలమువారు ఎన్నింటినోచేసి, ఆమూలమున సామాన్య జనులకు ప్రధాన తాళ లయజ్ఞానమును, ధర్మ నీతి భక్తి తత్త్వముల తెలివిడిని గలిగించిరి కన్నడమువారు రచించిన అట్టి 'సుళాదులు' ఇప్పటికిని ఎన్నో లభించు చున్నవి. తెలుగువారు గూడ ఈ ప్రయత్నమునకు చేయూతనిచ్చి యుండి రనుకొనుటకు అన్నమయ్య వ్రాసిన ఒక సూళాది నేడు మనకు లభించుచున్నది అది వట్టి తాళమాలికమాత్రమే కాక రాగమాలికగా గూడ నిబద్ధమైనది. అతడిట్టివి ఇంకెన్ని రచించినాడో లేదో మనకు తెలియదు ఆ ఒక సూళాది గూడా ఇంకా ఇప్పటికి వెలుతురు చూడలేదు.

కాని ఆ సూళాదులు జనులలో వ్యాపింపలేదు. కారణము స్పష్టమే. ఒకపాటలో ఏడు తాళముల విన్యాసమునకు తగినట్లు శబ్దార్థ భావములను కూర్చుట సులభముకాదు. వానిని సాధించి పాడుట అంతకంటె కష్టము ఆ పాట సముదిత స్వరూపమును అనుభవించి ఆనందించుట మరియు శ్రమము. కనుక ఆ రచనలు ఆ తాళముల విభేదము తెలుపు అభ్యాసపార ములుగానే కొంతపనిచేసి అంతరించి యుండును. తెలుగు కన్నడ సీమల గాయకులలో వాటిని చూపగలవా రొక్కరుగాని నాకు కానరాలేదు. పరస్పర ముగా పొందికలేని భాగములను కలిపి ఒక మొత్తముగా అనుభవించుట మానవుల ప్రకృతికి విరుద్ధము.

ఇట్లు ఎనిమిది తాళములు మాత్రమే గ్రహించి రచన సాగించుటచేత పదములలో ఎనిమిది విధములైన మెట్టులు మాత్రము స్థూలముగా ఏర్పడినవి. పద్యకవితకు కందము సీసము వంటి ఛందస్సులవలె పదకవితకు తాళము ఆకారభేదమునిచ్చినది. కనుక రాగముకంటె తాళము పద్య స్వరూపము నెక్కు వగా నిర్ణయించును కవితకు భాషవంటిది పాటకు రాగము తీసుకొన్న భాషలో ఎన్ని వివిధ కల్పనలు చేసినా కవిత్వమున ఛందస్సును మార్చు కోము. పదములో రాగమును అట్లే. దానిలో నిబంధించు భాషా రచన తాళమును బట్టియే నడచును. కనుక పదాలరాగాలు మార్చినంత సులభముగా

తాళాలు మార్చలేము ఈ కారణముచేత ఆ రచనలలో ఛందో భేదము చాలా తక్కువ. రాగభేదముండినా స్వరూపమైన నడకలో భేదము చాలకుండును.

కనుక ఈ పద్ధతి నాశ్రయించిన వారు భాషా రచనకు ప్రాముఖ్యమియ్యక తీరదు తమచేతనైన శిల్పవైవిధ్యమును శబ్దార్థభావాదులందే వారెక్కువగా చూపప్రయత్నించుట స్వాభావికము. తమ భావనాశక్తికందిన, తాము నమ్మి అనుభవించిన, భక్తి శృంగార వైరాగ్య నీతిధర్మాది తత్త్వములను ప్రజల హృదయములందు ఉద్బోధింప జేయుపని వారిది కాబట్టి సంగీత కళకు మూల ప్రకృతులైన రాగ - తాళ - లయములలో క్రొత్త క్రొత్త కల్పనా కౌశలమును చూపవలయునని మన పదకవులు ప్రత్యేకముగా భావించి పరిశ్రమించినవారని నేడు మన మనుకొనుటకు ఆధారముచాలదు. ఈ ధర్మము తెలుగు కన్నడ పదరచన లన్నిటియందునుగానవచ్చును. అవేతాళములు, ఇంచుమించు అవే రాగాలు. రాగ రచనలో గూడ ఎత్తుగడలు ముక్తాయింపులును ఒకటే తీరుగానుండునవి వేరువేరు పదకర్తల రచనలో ఎన్నియో కలవు ఉన్న అల్పభేదములంత ప్రబలమైనవి గావు. రాగతాళ విన్యాసములందు ఎంత తెలివిలో పనిచేసినను అవి ప్రధానమైన భాషాభావములకు ఉపస్కారకములుగా అలంకారములుగా మాత్రమే ఉండవలసినవి. అట్లుగాక ప్రాతరాగములలో క్రొత్త పోకడలు పోవుట, క్రొత్తరాగములను కల్పించి రచించుట, తాళములలో విషమగ్రహములతో సంచరించుట, గతిభేదములతో నడచుట - మొదలైన స్వతంత్రగానకళాకార్యములందు శక్తియుక్తులు దక్షిణదేశమున 18 వ శతాబ్దిలో శ్రీ త్యాగరాజ దీక్షితాది మహామహుల కాలమందే ప్రచారమునకు వచ్చినవనవలసి యున్నది. అనగా సాహిత్యమును కొంత వెనుకకు పెట్టి సంగీతమందే భావనాశక్తిని సంచరింపజేసిన కాలము ఇంచుమించు అప్పుడే. కాని అప్పటికిని ఇప్పటికిని ఆ సూళాది తాళముల యావరణమునందే రచనా క్రమము ప్రాయశః సాగుచున్నది ఆ సూళాది సప్తతాళములు గూడ ఇంకను సులభకరణమునకులోనై 'చాపుతాళములు' అనుపేర నాలుగురూపములతో నేడు నిలిచినవనుట గమనింప వలసిన విషయము.

క్షేత్రయ్య కర్ణాటక వాగ్గేయకారులలో ఈ పరంపరలోని వాడు పై వివరించిన పదస్వరూపమే తన శిల్పమున కుపకరణముగా తీసికొన్న వాడు. ఇతనికి పదకవితా పితామహుడైన అన్నమయ్య వరవడి లభించినది. అన్నమయ్య కాలముననే కళలకు రాజుల ఉదారహస్తమే అభ్యుదయ సాధన మైనది. వేంకటేశ్వరుడే పరాయణముగా స్వీకరించినను అన్నమయ్యకు రాజా శ్రయము తప్పలేదు దాని ఫలముగా మహాభోగభాగ్యము లనుభవించినాడు. ఒకమారు చెరసాలవాసము గూడ చవిచూచినా తనపారమైకాంత్యము కోలుపోక నెగ్గినాడు వీరశృంగార కరుణాద్భుతాది రసములకన్నిటికిని శ్రీనివాసుడే కేంద్రరత్నముగా అసాధారణ రచనలు వివిధముగా సాగించినాడు. కాని వానిలో శృంగారమే ప్రబలరసముగా ప్రతిఫలించినది కన్నడపదములు భక్తి విరక్తి ప్రధానములుగా వేలకువేలు సాగివచ్చినవి శృంగారము వానిలో క్వాచిత్కము. కాని తెలుగులో అన్నమయ్య వరవడిగా శృంగారమే సార్వభౌమముగా పదప్రపంచమందు వెలసినది. ఆ తరువాత ఎందరు రాజుల యాశ్రయములో ఎందరు ఎన్ని పదముల నచ్చుగొట్టిరో తెలియదు. ఆయా రాజులతో ఆ వాఙ్మయముగూడ సహజముగా అంతరించినది. సంగీతకళా రహస్యనిధి రామరాజభూషణుడు అళియరామరాయలను 'పల్మారు మెప్పించి' రచించిన 'బహుసంస్కృతాంధ్రకృతులు' నేడేవి? ఆ రాయని మంత్రియైన బయకార రామామాత్యుడు రచించి ప్రభువుకు వినిపించిన ప్రబంధము లిప్పుడెక్కడ? క్షేత్రయ్య ఒక్కడే ఈ ప్రవాహములో ద్వీపమువలె నిలిచి నెలకొన్న కవి అతని రచనలలోను మధురతిరుమలేంద్రునికి 'ఎంచుకొమ్మని' ఇచ్చిన 'రెండువేల పదములు' గాని, గోలకొండ పాదుషాకు వినిపించిన 'వెయ్యిన్నూరు' పదములు గాని, మనలో నిలువలేదు. తంజావూరి విట రాయడు విజయరాఘవనాయకుని మీది వేయి పదములలో ఏ అయిదారో ఇప్పుడచ్చు కెక్కినవి. అది గూడ సర్తకప్రపంచమున తంజావూరి సంప్ర దాయపు ప్రాబల్యమును సూచించు గుర్తుమాత్రమే కాబోలు. అతని మువ్వ గోపాలాంకిత పదములు మాత్రము నాలుగు నూర్లకు పైబడి శ్రీ విస్సా అప్పా రావుగారి, శ్రీగిడుతు సీతాపతిగారి, పరిశ్రమపుణ్యాన నేటికి బయలుపడినవి.

ఇంతగా అవి నిలద్రొక్కుకొనియుండుటకు ముఖ్యహేతువు వాటికి తన ముద్రనిచ్చిన మువ్వగోపాలుడే విజయరాఘవనాయకుడు, తిరుమలనాయకుడు మొదలైన వారి శృంగారముతో ఇతరులకేమి పని? ఇక 'గోపాలు'డు విశ్వశృంగారనాయకుడు. అతని శృంగారము అందరి శృంగారములకును బీజమైన పరతత్త్వము ఆంధ్రరసికులలో అగ్రగణ్యుడయిన జగన్నాథపండితరాయడు 'కృష్ణ' అను రెండక్షరములందే అసాధారణమైన తీపున్నదన్నాడు.

"మృద్వీకా రసితా, సితా సమశితా, స్ఫీతం నిపీతం పయః,
స్వర్యాతేన సుధాప్యధాయి, కతిధా రంభాధరః ఖండితః ?
సత్యం బ్రూహి మదీయజీవ భవతా భూయో భవే భ్రామ్యతా
కృష్ణేత్యక్షరయోరయం మధురిమోద్గారః క్వచిల్లక్షితః ?"

కృష్ణ శబ్దముకంటె 'గోపాల' శబ్దము అర్థమందు గొప్పది నాలుకకు చెవికి అందమైనది. దానికితోడు గోపాలబాలుని కాలి 'మువ్వ' కింకిణీనాదము తరితీపులుగా ఆధారశ్రుతియై యున్నది. మీదుమిక్కిలి కవుడులేని పలుకులదేసి భావముల స్నిగ్ధత, "వాక్చనారీణాం" అని గీతాచార్యుడే పొగడిన స్త్రీ హృదయ మార్దవము, రాగతాళముల సాంప్రదాయికరక్తి, క్రమపరిణతమై నిలిచిన క్షేత్రయ్య యొక్క ఆధ్యాత్మికమైన అవధూతభక్తి- ఇన్నియు కలిసి మెదిగి ఆయన పదములు తెలుగు తెలిసినవారికి అలౌకిక శృంగారానుభవము నియ్యగలిగి అజరామరములై యున్నవి.

పై పదముల రచనలో క్షేత్రయ్య ప్రతిభ సాహిత్యమందు ప్రకాశించినంతగా సంగీతమందున్నట్లు తోపదని నా వినీతాభిప్రాయము దానికై నాకు స్ఫురించిన కారణములు వివరించితిని. క్షేత్రయ్య పదములను సంగీత విద్వాంసులు ఎక్కువగా ఆదరించినారు. అందలి రాగములు చాలా రక్తిగలవి; పదముల తాళలయ విశ్వాసము చతురస్రముగా సర్వాంగణ సౌరభ్యముగలది, గాయకులును వాదకులు వానిని అనూచానముగా బ్రహ్మానందముగా పాడి వాయించి వెలయించినారు. వెలయించుచున్నారు; వెలయింపగలరు. నిజమే.

కాని తెలుగు, కన్నడము, అరవము- వీనియందున్న 'పదములు' అన్నియు ఇంచుమించుగా ఒక మితమైన ఛందస్సుకు లోగినవని, వానిని గాయకులు తమ మనోధర్మముకొలది ఎంత ఆకర్షకముగా పాడగలిగినా సిద్ధమైన ఛందో రూపమున నవ్యత తేజాలకున్నారని, రాగ - తాళ రచనకు సంబంధించినంత వరకు పై మూడు భాషల పదములన్నియు సమానమైన అందముగలవని, సాహిత్య ప్రధానముగానే వాని సంగీతము సాగినదని, సాగవలసియున్నదని, నాకు గలిగిన యభిప్రాయమును మరలించుకో లేకున్నాను.

పదములను పాడునట్టి పద్ధతిని గూర్చి ఒక విషయము మనవిచేసి ఈ యుపన్యాసము ముగింతును —

ఈవల కొందరు గాయక విద్వాంసులు పదగానము విళంబకాలమందే పాడవలయునని శాసించుచున్నారు. తాళలయ ప్రమాణమును ఎంత యీడ్చి పాడుదుమో అంత రాగరచనకు, గమకముల స్ఫురణకు, అవకాశమెక్కువ లభించునని వారి యాశయము. నిజమే. కాని ఆ యీడ్పులో ప్రధానమైన సాహిత్య రచన చాలాభాగము తెగసాగి, తునిగి, అక్షరవాక్యముల పరస్పర సాపేక్షత అంతరించును. విలంబము, పాడేవారికన్న నర్తకులకెక్కువ యావశ్యకము. నర్తకులు ఒక్కొక్క శబ్దమునకును లయబద్ధమైన ముద్రతో అర్థము నభినయించి భావమును ప్రదర్శింపవలసినవారు కనుక సాత్వికముగా ఆంగికముగా వారు స్పష్టముగా అభినయమును సాగించుటకు వాచికమునకు కొంత విళంబిత విన్యాసము ముఖ్యసాధనము. పదవాక్యముల యర్థము విలంబముచేత కొంత స్పష్టత పోగొట్టుకొన్నను ఆ లోపమును అభినయము చేత తీర్చ అవకాశము వారికున్నది. కనుక సభ్యులకు రసభావాస్వాదమునకు కొరత యుండదు. మరి వాద్యము వాయించువారికి సాహిత్యపు జోలి చాలా దుర్బలముగదా. పాడేవారి గొడవవేరు. పదముల సాహిత్యరచనయే వారికి జీవాతువు కనుక పదములకు వాక్యములకును గల సంబంధము చెడనీయక సభ్యులకు భావములందిచ్చుటకు విళంబకాలము గాయకులకంతగా ప్రయోజన

పడదు. విలంబితము, మధ్యము, ద్రుతము అను మూడు కాలభేదములను గూడ లక్షణకర్తలు అనుగ్రహించినారుగదా. అందు విలంబితమునకు తత్వమని, మధ్యమునకు ఘనమని, ద్రుతమునకు ఓఘము (ప్రవాహము) అని, వారిచ్చిన సార్ధక నామములు. విలంబమునందు ఆధారతత్వములైన స్వర - శ్రుతి - లయముల సూక్ష్మ స్వరూపము గోచరించును. మధ్యకాలమందు పై విషయములు దృఢముగా ఘనముగా మనమందుకోగలము ద్రుతము ప్రవాహము దానివెంట కొట్టుకొని పోవలసినదేకాని నడుమ ఎక్కడను మనకు పట్టు దొరకదు. కనుక సామాన్యమైన శారీరగతికి మధ్యలయమే తగినదని చెప్పబనిలేదు సాహిత్య భావములకన్ననో అదే జీవమని భావింతును మన నేటి గాయకప్రపంచమందు ఈ అమితమైన విలంబాభిమానము కలిగించినది- నా దృష్టిలో - కీ. శే. వీణ ధనమ్మ. ఆమెదొక అసాధారణమైన మేధ చేతితో నొకటి, నోటితో ఇంకొకటిగా రెండు వీణలను ఏకకాలమున భేదము తెలియనీక మేళగించి, వట్టి రాగసముద్రములో మనలను ముంచు ప్రతిభ ఆమెది ఆలాపనకాని, కీర్తనకాని, పదముగాని, జావడులుగాని ఆమె చేతిలో ఒక్కటే రక్తిముద్దగా నెమ్మదిగా సాగుచుండినవి సాహిత్యము స్పష్టతగాని, తాళపు బిగువుగాని గానవాదనములు రెంటను ఆమెచేత - నోట, నలిగి పోవుచుండెడివి కాని ఆ పద్ధతి సాహిత్యబలమెక్కువగా గలిగిన కీర్తన - పదములవంటి రచనల కుపయోగించునని నేను నమ్మలేను.



# క్షేత్రయ్య : శృంగారము

—డాక్టర్ దివాకర్ల వేంకటావధాని

ఏ వాఙ్మయమందైనను గద్య పద్యములకంటె గేయమే ముం దవతరించునని విమర్శకుల యభిప్రాయము ఆంధ్రవాఙ్మయ విషయమునఁ గూడ నది యథార్థమే. నన్నయకుఁ బూర్వము దేశికవితా మార్గమునకుఁజెందిన పలు విధములైన పదములు గీతములు వ్రాయఁబడుచుండెనని యూహించుట కాధారములున్నవి పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్యచరితమున తుమ్మెద పదములు, వెన్నెల పదములు, వాలేశు పదములు మున్నగు పదములను బేర్కొని యుండుటయు, బసవపురాణమును "ఆతత బసవపురాతన భక్తగీతార్థ సమితియే మాతృక గాఁగ" రచించితినని చెప్పుటయు నిందుకు నిదర్శనము. కాని యా పదములును గీతములును ఇప్పుడేమియు లభ్యములగుటలేదు. అయినను, వాని కాలము కాని కర్తృత్వము కాని మనకుఁ దెలియవు శివ కవులు పాడుట కనువైన గద్యలు, రగడలు, వచనములు కొన్ని రచించియుండుట నిజమేకాని యవి మతప్రచార ప్రధానములే కాని రసప్రధానములు కావు. కాఁగా మనకిప్పుడు లభించుచున్న రసవద్గేయ సముదాయమున తాళ్లపాక అన్నమాచార్యులు రచించిన సంకీర్తనలే యాద్యములని చెప్పఁదగియున్నవి. అతఁడధ్యాత్మశృంగార సంకీర్తనలు పెక్కువేలు రచించుటయే కాక సంస్కృతమున సంకీర్తన లక్షణమను పేర నొక లక్షణ గ్రంథమును గూడ వెలయించి యా జాతి వాఙ్మయమున కొక స్థిరత్వము చేకూర్చెను. దక్షిణాంధ్రయుగము పద వాఙ్మయమునకు స్వర్ణయుగమని చెప్పఁదగినట్టిది. అసంఖ్యాకములైన పదములు కృతులు రచించి యొకవంక సాహిత్యమునకును వేఱొకవంక సంగీతమునకును అపార గౌరవప్రతిష్ఠలు కలిగించిన క్షేత్రయ్య త్యాగయ్య లీ యుగమున నవతరించుటయే యందుకుఁ గారణము. మఱియు

నా కాలమున తండోపతండములుగా వెలసిన యక్షగానములలోఁ దత్కర్తలు పద్యముల కంటెఁ బదములకే యెక్కువ ప్రాధాన్యము నొసంగియుండిరి. త్యాగయ్యకృతులు కేవలము శ్రవ్యములైనవి. క్షేత్రయ్య పదములట్లుగాక యభినయానుకూలములగుటచే దృశ్యతా గౌరవమును గూడఁ బొందినట్టివి. సంగీతము, సాహిత్యము, అభినయము అను మూఁడు కళలకును కూడలియైన త్రివేణీసంగమ మాతని పదసముదాయము.

ఆంధ్రమునందలి గేయములను కృతులు, పదములు, జావళీలు, కీర్తనలు, తత్త్వములు, పాటలు అని యాఱు విధములుగా విభజింప వచ్చును. అందు కృతులు రాగ తాళ ప్రధానములై సంగీతపుకచేరీ కనువైన గేయములు పదము లభినయానుకూలములైన శృంగార గేయములు ఇవి స్వరకళాసౌష్ఠవముతోడను. తాళవిలంబముతోడను గూడి మిక్కిలి ప్రౌఢముగానుండును. జావళీలు కూడ పదముల వంటివే కాని, యిందు ప్రౌఢతకంటె శృంగార మెక్కువ. మఱియు పదములందుండునంత తాళవిలంబ మిందుండదు. తాళ విలంబము వలన పాత్ర వివిధ శరీరభంగిమలచే వివిధ భావములను స్పష్టముగా వ్యక్తముచేయుట కవకాశము కలుగును కీర్తనలు భజనల కుపయుక్తములగు గేయములు. తత్త్వము లాధ్యాత్మిక భావప్రచారమున కనువగు గేయములు పాటలు స్త్రీ బాలాదులు పాడుకొనుట కక్కఱకువచ్చు గేయములు. ఈ గేయములన్నింటిలో గానాంశ కొంత గోచరించును. సలక్షణములైన రాగ తాళాదులతోఁ గూడియున్నప్పుడవి సంగీత ప్రపంచమున చేరును. రాగ తాళాది ప్రాధాన్యము లేక కేవల కవిత్వాంశముతోనే కూడియుండు పదములు కొన్ని యుండవచ్చును అవి గేయములు కాని కారణమున కేవల సారస్వత ప్రపంచమునకే చెందును. క్షేత్రయ్య పదములట్టివి కావు. అవి సంగీత సాహిత్యములనే కాక యభినయమును కూడ వానితో జతచేసి తమజాతి వాఙ్మయమున కొక విశిష్టతను సమగ్రరూప సౌష్ఠవమును జేకూర్చినట్టివి. క్షేత్రయ్య తరువాతకూడ నట్టి పదములు వెలయించిన పదకర్తలు కొందఱున్నను ఆ ప్రపంచమున చక్రవర్తిత్వము సాధించిన వాఁడతఁడే. ఊరక చదువునప్పుడు

కంటె పాడునప్పుడు, పాడునప్పుడు కంటె నభినయించునప్పుడు, ఆతని పదము లధికాధిక సౌందర్యానందములను జూఱయిచ్చును. సంగీత సాహిత్యాభినయ ప్రపంచములు మూఁడింటిని దమ చరణ విన్యాసములచే నావరింపఁ జాలిన త్రివిక్రమ మూర్తులు క్షేత్రయ్య పదములు

క్షేత్రయ్య నివాసము కృష్ణామండల మందలి కూచిపూడికి సమీప మందలి మొవ్వ గ్రామము. దీనికి మవ్వయనియు నామాంతరము. ఇందు సుమారైదువందల యేండ్లకుఁ బూర్వమే వేణుగోపాలస్వామి యాలయము నిర్మింపఁబడి యుండెనఁట క్షేత్రయ్య కుపాస్యదైవ మీ గోపాలస్వామియే అతఁడు తాను రచించిన పెక్కు గేయముల నీ గోపాలస్వామికే యంకితము కావించి యుండెను అతనికి తల్లి దండ్రులు పెట్టిన పేరు వరదయ్య యనియు నతఁడు పెక్కు క్షేత్రములను దర్శించి వానిని గూర్చి విశేష పరిచయము సంపాదించిన వాఁడగుటచే క్షేత్రజ్ఞుఁడని, క్షేత్రయ్యయని, తరువాత ప్రసిద్ధి గాంచెననియుఁ జెప్పుదురు. అతఁడు తాను దర్శించిన క్షేత్రములందలి అధి దైవములనందఱిని గూర్చియు పదములు రచించియున్నాఁడు అట్లే యతఁడు తన్ను సత్కరించిన కళాపోషకులైన రాజుల కంకితముగా రచించిన పదము లును గొన్ని యున్నవి అతఁడు దర్శించిన యితర దైవములలో కంచి వరదుఁడు, తిల్లగోవిందుఁడు, ఆదివరాహుఁడు, కడప వేంకటేశ్వరుఁడు, తిరు వళ్లూరి వీరరాఘవుఁడు, పాలగిరి చెన్నుఁడు, శ్రీరంగేశుఁడు మున్నగువారును, రాజులలో తంజావూరి విజయరాఘవుఁడు, మధురతిరుమలేంద్రుఁగు, తుపాకుల వేంకట కృష్ణుఁడు మున్నగు వారును ముఖ్యులు అతఁ డితరదైవములను గూర్చి రచించిన పదములలో పెక్కుచోట్ల వారికిని మొవ్వగోపాలస్వామికిని అభేదాధ్యవసాయము కల్పించినాఁడు.

క్షేత్రయ్య "వేడుకతో నడచుకొన్న విటరాయఁడు" అను పదమున తాను జూచిన రాజులను గొందఱిని బేర్కొని, తాను రచించిన పదముల సంఖ్యను గూడ సూచించియున్నాఁడు. ఆ రాజుల కాలమునుబట్టియు, మండ

నరసింహకవి ఆంధ్ర కౌముదిలో క్షేత్రయ్యాదిగా నుదాహరించిన "తముఁ దామె వత్తురర్థులు" అను పద్యము వలన నతఁడు తంజావూరి రఘునాథభూపాలునిఁ గూడ దర్శించినట్లు తెలియుచుండుటను బట్టియు, నాతఁడు క్రీ. శ 17వ శతాబ్ది ఆరంభమున జన్మించి ఆ శతాబ్ది చరమ పాదము వఱకును జీవించినట్లు నిశ్చయింపవచ్చును. ఈ కాల మాంధ్రవాఙ్మయమున దక్షిణాంధ్రయుగమని చెప్పఁబడు నాయకరాజ యుగమునకుఁ జెందినది ఈ యుగమున పెక్కు యక్షగానములు, వచనైకరచనలు, ప్రబంధములు, గేయములు రచింపఁబడినవి. వీనిలో శృంగారరసము విచ్చలవిడిగా వర్ణింపఁబడినది ఆంధ్రమున నన్నయ తిక్కనాదులు కూడ శృంగారరసము నచ్చటచ్చట వర్ణించి యుండిరి కాని, తద్వర్ణనమున వారౌచిత్య దృష్టితో నెక్కువ నిగ్రహమును బ్రదర్శించిరి. తరువాత శ్రీనాథయుగమునను, శ్రీనాథయుగముకంటె ప్రబంధయుగమునను శృంగారరసమునకు ప్రాధాన్యము హెచ్చినది. అందుకా కాలమునందలి పరిస్థితులును, అప్పుడు వాఙ్మయమును బోషించిన రాజుల యభిరుచులును గారణములై యుండును విజయనగర సామ్రాజ్య పతనానంతర మాంధ్ర సరస్వతి తంజావూరు, మధుర, మైసూరు, పుదుచ్చేరి మున్నగు దక్షిణప్రాంతములకు వలస పోయినది అచ్చటి రాజులు కళాసాహిత్యములం దభిమానము వహించి కవులను, గాయకులను, నాట్యకర్తలను ఆహ్వానించి, వారి ననేక విధముల సత్కరించి యుండిరి అప్పటి కవులు కవిత్వమునకు ముఖ్యప్రయోజనములని చెప్పఁబడు నానందోపదేశములు రెండింటిలో నుపదేశముకంటె నానందమునకే యెక్కువ ప్రాధాన్య మొసంగినట్లు కనిపించును అసలు లాక్షణికుల దృష్టిలోఁ గూడఁ గావ్యమున కుపదేశ మానుషంగిక ప్రయోజనమేకాని పరమ ప్రయోజనముకాదు ఆనందముతోపా టుపదేశమును గూడ నొసంగఁ జాలినచోఁ గావ్యము పరిమళముతోఁ గూడిన బంగారమువలె నెక్కువ ప్రశస్తి వహించునని వారు భావించిరి. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" మున్నగు నియమములు సర్వకావ్య సాధారణములు కావు అవి కేవలేంద్రియోద్రేజకములైన అల్ప శృంగారాదులను వర్ణించి పరితలను బెడత్రోవలకుఁ

బట్టించు సధమ కావ్యములకు సంబంధించినట్టివి. ఇట్టి నియమములు కొన్ని యున్నను ప్రజలలోఁ బలువురట్టి శృంగార కావ్యములను బఠించుట కువ్విళు లూరుచునే యుండిరి. అందుచే వారియభిరుచుల తృప్తినొందించుటకై కొందఱు కవులట్టి కావ్యములను రచించుటయు సంభవించుచుండెను. దక్షిణాంధ్రయుగ మున నట్టి కావ్యములు పెక్కవతరించి యుండెను. తత్కర్తలందు శృంగార మును విశృంఖలముగా వర్ణించుటయే కాక తద్వర్ణనమున కవలంబముగా నీతి దూరములైన యితివృత్తములను గూడ గ్రహించియుండిరి తారాశశాంక విజయము, సారంగధర చరిత్రము, అహల్యా సంక్రందనము మున్నగు ప్రబంధము లిందుకు నిదర్శనము నీతిబాహ్యములు, అసభ్య శృంగారమున కాలవాలములునైన యేతాదృశ కావ్యములను జూచియే కొందఱీ యుగమును క్షీణయుగముగాఁ బరిగణించిరి కాని ప్రక్రియా వైవిధ్యమునుబట్టి చూచినచోఁ దత్పూర్వ యుగములకంటె నీయుగ మాంధ్రవాఙ్మయమునకుఁ గలిగించిన పుష్టి యధికతరమని తోఁపకమానదు మఱి యప్పటి కవులంత శృంగార ప్రియులగుటకుఁ గాలప్రభావమే కారణము క్షేత్రయ్య వేణుగోపాలస్వామికిఁ బరమ భక్తుఁడయ్యును ఆ కాలము ప్రభావమునుండి పూర్తిగాఁ దప్పించు కొనలేకపోయెను. అతని పదములన్నియు శృంగారరస ప్రధానములై కొన్ని పట్టుల సభ్యతా మర్యాద నతిక్రమించునట్లు కానవచ్చుటయే యిట్లు చెప్పుటకుఁ గారణము

క్షేత్రయ్య మనఃప్రవృత్తిని శృంగారైక ప్రవణముగా నొనర్చిన పరిస్థితులు కొన్ని యాతని జీవితమునఁ గలిగినట్లు శ్రీ విస్సా అప్పారావు పం తులుగా రొనర్చిన పరిశోధనల వలనఁ దెలియవచ్చినది వరదయ్య మొదట సం గీత సాహిత్య నాట్యాలంకారాది విద్యల నభ్యసించుచున్న కాలములోఁ దనసహా ధ్యాయియైన యొక దేవదాసిని ప్రేమించి యుండెననియు, నామె యౌవన సౌందర్యముల కాటపట్టై యుండుటే కాక ప్రతిభావంతురాలుకూడనై యతఁడు చెప్పు కవితనువ్రాయుచు, నా పదముల నప్పుడప్పుడు పాడుచు, నభినయించుచు నతని పదరచనకుఁ బ్రేరేపించుచుండెననియు వారి పరిశోధన వలనఁ దేలిన

ముఖ్యాంశములు. ఈ యంశములకు లభ్యములగుచున్న క్షేత్రయ్య పదములే యాధారములు. "ఎమ్మెకాఁడు నేను నెనసిన చిన్ననాఁడే, సమ్మతిగా నొక చోట చదువుచుండఁగ, పమ్మిన వేడుకతో భామ నీవు ప్రౌఢవైతే, కమ్మ విల్తునికేళి కలసే మన్నది నిజమై" "నన్నే పెండ్లాడుసుమీ నా యాన మువ్వ గోపాలా, అన్నన మావారు వరాలడుగకుండఁ జేసేగాని" మున్నగు చరణము లాయంశములను వెల్లడించుచున్నవి క్షేత్రయ్య పేర్కొన్న వేల్పు లలో కంచివరదరాజస్వామి యొకఁడు. మువ్వగోపాలుని తరువాత నతఁడీ దేవుని స్తుతించిన పదములసంఖ్యయే హెచ్చు. క్షేత్రయ్యకు తల్లి దండ్రులిడిన తొలుతటిపేరు వరదయ్య యగుటచే కంచివరదాంకిత పదాలలో నతని యాత్మీయాంశ కొంతదాగియున్నదని యనుమానించుట కవకాశమున్నది ఆపద ములను మఱికొన్ని యితర పదములను పురస్కరించుకొని శ్రీ అప్పారావు పంతులుగారు క్షేత్రయ్య ప్రేయసిని విడిచి దూరదేశమున కరుగ నామె ప్రియ విరహమును భరింపలేక దూతిచే రాయబార మంపెననియు, నామెవలన నతఁడు కూడ తన విరహము నోర్వలేక కుందుచున్నాఁడని యెఱింగి తానే స్వయముగా బయలుదేఱి యాతనిఁ గలసికొనె ననియు, క్షేత్రయ్య జీవిత వృత్తాంతమును మఱికొంత యూహింపఁజాలినారు. ఆ పదములందలి యర్థ మిట్లూహించుట కవకాశము కన్పించుచున్నను ఇట్లే జరిగియుండునని నిశ్చ యించుట కితరాధారములు కూడ కొన్ని కావలయును కాని యతఁడా దేవ దాసినో మఱి యెవరినో ప్రేమించి యామెతో రసమయ జీవితము పుచ్చు చుండఁగా సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో శ్రీ సుబ్బరామ దీక్షితులుగారు చెప్పినట్లే యోగివలననో గోపాలమంత్రోపదేశము పొంది రక్తిమయమైన తన జీవితములో భక్తికిఁ గూడ సమానమైన స్థానమొసంగి యుండవచ్చును మానవ మనోవృత్తి తరంగిణిలో భక్తిరక్తులు రెండును రెండుపాయలయ్యు జతగా ప్రవహించుచుండుట పెక్కుచోట్లఁ గానవచ్చుచుండును క్షేత్రయ్య యెంత రక్తుఁడో అంత భక్తుఁడు ఆ రక్తిరక్తులు రెండు నాతని పదములలోఁ బెక్కుచోట్ల ప్రత్యక్షమగుచునే యుండును

క్షేత్రయ్య పట్టి పదకర్త మాత్రము కాఁడు. అతని లక్షణ పరిజ్ఞాన మపారమైనది. క్రీ. శ 15వ శతాబ్దిలో భానుదత్తుఁడను మహాపండితుఁ డొకఁడు సంస్కృతమున రసతరంగిణి, రసమంజరియను నలంకార గ్రంథములను రచించి యందుఁ దనకుఁ బూర్వులైన యాలంకారికులు చూపని కొన్ని నాయికా నాయక భేదము లధికముగాఁ జూపి, వానికి లక్షణములు చెప్పి, కృష్ణ వర్ణన పరములైన శ్లోకములను లక్ష్యములుగా రచించెను. నాట్యకళా నిష్ణాతులలో నగ్రేసరులైన కూచిపూడి భాగవతులకు, తత్సంప్రదాయానుసారులైన యితర నాట్యకారులకు, భానుదత్తుని రసమంజరియే ప్రధాన పాఠ్యగ్రంథము. వారేకాక కాశివంటి దూరదేశముల కరిగి యలంకార శాస్త్రము పఠించువారు కూడ దానిని ముఖ్యముగా నభ్యసింతురఁట. అందుచే క్షేత్రయ్య కూడ భానుదత్తుని లక్షణ గ్రంథములు శ్రద్ధతోఁ జదివి యావిషయమునఁ గొంత కృషిచేసి యుండుటలో వింతలేదు. సాధారణముగా సంస్కృతాలంకారికు లొసంగు లక్ష్య శ్లోకములు వారిచ్చిన లక్షణముల కనుగుణములయ్యు లోకమునుండియు స్వానుభవమునుండియు గ్రహించినవి కాకపోవుటచే సహజత్వమునకు దూరములై ప్రయత్నపూర్వకముగా నా లక్షణముల సమర్థించుటకొఱకే రచింపఁబడినట్లు గోచరించును. అనఁగా వారి లక్ష్యములలో ననుభవముకంటె భావనయే యెక్కువ ప్రాభవము వహించునన్నమాట. భానుదత్తుని లక్ష్య శ్లోకములందుఁ గూడ నీ స్వభావము కొంతవఱకుఁ గానిపించును. క్షేత్రయ్య లక్షణముల విషయమున భానుదత్తునే యనుసరించినను లక్ష్య విషయమునఁ గొంత వైశిష్ట్యము ప్రదర్శించుటకు యత్నించి యందు కృతకృత్యుఁడు కాఁజాలినాఁడు. అతని పదములు పెక్కు భానుదత్తుని లక్షణముల కుచితతరములైన లక్ష్యములుగాఁ గనిపించునఁట. క్షేత్రయ్య తరువాత వర్తించిన యాంధ్రకవి యొకఁడు భానుదత్తుని రసమంజరిని శృంగార రసమంజరియను పేర నాంధ్రీకరించి వివిధ నాయికలకు లక్షణములు వివరించి లక్ష్యములుగా క్షేత్రయ్య పదముల నుదాహరించియుండెను. దీనికి కారణము మూల శ్లోకములకంటెను క్షేత్రయ్యపదములే ప్రశస్తతరములైన లక్ష్యములుగా

నుండునని యాతఁడు భావించుటచే క్షేత్రయ్యపదములలోఁ గొంచెమించు భానుదత్తుని లక్షణములన్నిటికిఁ దగిన లక్ష్యములు గోచరించుచుండుటచే నతఁడు భానుదత్తుని లక్ష్యములకంటె మే_త్తరములైన లక్ష్యములను రచింప వలెనను నుద్దేశముతోడనే యా పదములను రచించెనేమోయని తోఁపక మానదు ఆతని పదముల ప్రాశస్త్యమున కవి కేవల భావనాజనితములుకాక స్వానుభవమునందును లోకజీవితమునందును గనవచ్చు సన్నివేశములకు సహజ ప్రతిబింబములగుటయే కారణము. క్షేత్రయ్యపదములలో నతని కలంకార శాస్త్రగ్రంథములతోడనే కాక కొక్కోకము, వాత్స్యాయనుని కామ సూత్రములు మున్నగు నితర శాస్త్రగ్రంథములతోఁ గూడఁగల గాఢమైన పరిచయము వ్యక్తమగుచుండును.

క్షేత్రయ్యపదము లన్నిటియందును రసము శృంగారమే. కొన్నిచోట్ల హాస్యమును, వియోగవేదన అతిమాత్రమైనప్పుడు కరుణమును అంగములుగా గోచరించుచున్నవి కాని యట్టిపట్టులు చాల తక్కువ. పదములన్నియు క్షేత్రయ్యయే రచించినను వెల్లడించు పాత్రభేదమునుబట్టి వానిని నాలుగైదు విధములుగా విభజింపవచ్చును. అందుఁ గొన్ని నాయికా వాక్యములు, కొన్ని నాయక వాక్యములు, కొన్ని నాయికానాయక సంభాషణాత్మకములు; కొన్ని దూతీ వాక్యములు, కొన్ని కేవల వర్ణనాత్మకములగుటచేఁ గవి వాక్యములు. వీనిలో శృంగారము వివిధ ముఖములతో గోచరించును కొన్ని పదములు వియోగమును వర్ణించును, కొన్ని రతి, ఉపరతి మున్నగు విలాస విశేషము లను వర్ణించుచు సంయోగ శృంగారమున కాలవాలములై యుండును కొన్ని నాయికల యీర్ష్యామానములను వెల్లడించుచు నుపాలంభ పూర్వకములై యుండును. కొన్ని నాయికలు దూతికలచేఁ బంపు రాయబారములకు, కొన్ని దూతికలుతెచ్చు ప్రతి సందేశములకు, కొన్ని నాయికలు తమ విరహవేదనను దూతికలతోఁ జెప్పుకొని పొందు వలవంతలకు నిలయములై యుండును. కొన్ని నాయకులు వైముఖ్యము వహించియుండ నాయికలు దీనలై యొనర్చు ప్రార్థనలను, కొన్ని నాయకులు పొందు విరహాతిశయమును, సూచించును.

కొన్ని పదములు నాయికలు దూతికలయెడఁ జూపు కృతజ్ఞతను, కొన్ని వారొనర్చిన మోసమునకు నాయికలు కావించు నిరసనమును ప్రదర్శించును. కొన్ని నాయికానాయకుల నిర్మలమైన యనురాగ సంపదను ప్రకటించు చుండును ఇందు శృంగార మిన్ని విధములుగానున్నను పరానురక్తుఁడై వచ్చిన నాయకునిఁగాంచి యాతని యంగమునఁ గానిపించు సంభోగ చిహ్నములఁ బరిశీలించి నాయికలు వారి నుపాలంభించు ఘట్టములును, నాయికలు విరహవేదన సైఁపలేక విలపించు ఘట్టములును ఎక్కువ. సరస హృదయులైన నాయికానాయకు లన్యోన్య ప్రీతచేతస్కులై ప్రేమ వ్యవహార మును సాగించుచుండ వైముఖ్య సౌముఖ్యములకు, కోపప్రసాదములకు, సంయోగ వియోగములకు సంబంధించిన వివిధ సన్నివేశము లుప్పతిల్లు చుండును ఆ సన్నివేశములను, అవస్థలను అన్నిటిని ఊహించి, వానియందు నాయికానాయకులు పొందు భావపరంపరను భావనచేసి, స్వానుభవమునో లోకపరిశీలన జన్య జ్ఞానమునో పురస్కరించుకొని క్షేత్రయ్య వానిని పదము లందు వ్యక్తముచేసినట్లు కనిపించును. అట్టి యవస్థా సన్నివేశముల కన్నిటికి నీ పదములందుచితములైన లక్ష్యములు గోచరించును. ఈ పదముల కూర్పులో నే విధమైన పరిపాటియు కానిపింపదు కవి తన కే భావము స్ఫురించినప్పు డా యవస్థ నూహించి దానిని రమ్యమైన పదముగా రూపొందించెను. అందుచే నొక పదమున విరహము, వేఱొకపదమున రాయ బారము, ఇంకొక పదమున విలాసము, మఱొక పదమున నీర్ష్యామానములు క్రమమైన సంబంధమేమియులేక వర్ణితములగుచుండును. ఏ పదమున కా పదము భావ విషయమున స్వయం సంపూర్ణమై రమణీయముగా నుండును. ఈ విధముగా శాలివాహన సప్తశతియందలి గాధలను ముక్తకగాథలను నట్లు వీనిని ముక్తక పదములనవచ్చును. ఈ పదములనన్నిటిని ఏకసూత్రమున బంధించు విశేషములు రెండు; ఒకటి వానియన్నిటియం దంతర్వాహినిగాఁ బ్రసరించు శృంగారము; రెండవది యన్నియుఁగాకపోయినను బెక్కు మువ్వ గోపాలస్వామి కంకితములై యుండుట. శాలివాహన సప్తశత్యాదిముక్తక

గ్రంథములలోఁ బరితల సుఖబోధమునకై వ్యాఖ్యాతలు ప్రతిగాధ ముందది యెవ్వరే సందర్భమున నెవ్వరితోఁ జెప్పనట్టిదో సూచించి యుండిరి. అట్లే యీ పదములను కూడ నుచితములైన యవతారికలతో ముద్రించుట పరిత లందలి భావములను సులభముగా గ్రహింపఁజాలుట కెంతయో తోడ్పడును లేనిచో సామాన్యులు కొన్ని పదముల నిజమైన యాంతర్యమును గ్రహించుట కష్టసాధ్యమగును

ఈ పదములందలి నాయికా నాయకులు దేవదాసీ క్షేత్రయ్యలు కావచ్చును; లోకమునందలి వారెవ్వరైనను గావచ్చును, లేక కవి భావనాజనితులు కావచ్చును నాయకులందు తఱుచు గోపాలత్వమును, ఎడనెడ క్షేత్రయ్య దర్శించిన ఆదివరాహుఁడు, కంచివరదుఁడు, తిల్లగోవిందుఁడు, కడప వెంకట రమణుఁడు, విజయరాఘవుఁడు, తుపాకుల వేంకట కృష్ణుఁడు మున్నగు వేల్పులయో రాజులయో భావములును ఆరోపింపఁ బడుచుండును. నాయకుని యొకానొక యవస్థనో, భావమునో వర్ణింపఁ జూచుటయే క్షేత్రయ్య యుద్దేశము. అతఁడు మువ్వగోపాలుఁడైనను, కంచివరదుఁడైనను, మఱి యెవ్వరైనను ఆతని కొక్కటియే అతఁడు దర్శించిన దైవములలోఁ బలువురు వైష్ణవాంశ సంశోభితులే వారి కందఱికి నతఁడభేదాధ్యవసాయము కల్పించెను "పడఁతిరో మువ్వగోపాలుఁడైన కడప వేంకటేశునిఁ గూడి" "చెలువ మువ్వ గోపాలుఁడైన శ్రీవేంకటరమణాయని" "వల్లభుడు మువ్వగోపాలుఁడగు కంచి వరదుఁడు చేసిన మచ్చిక" మున్నగు వాక్యములిందుకుఁ దార్కాణములు ఆ వేల్పులందఱియందు నాతఁడు తన యిలువేల్పైన మువ్వ గోపాలునే దర్శించెను. ఆతఁడు కొల్చిన దేవతలలో శ్రీశైల మల్లికార్జునుఁడు కూడ నుండుట యతని శివకేశవాద్వైత భావమును, సమదర్శిత్వమును కూడ సూచించుచున్నది. పదములలో నే దేవునినామము నంకితము చేసినను నాయకుఁడితఁడతఁడను భేదభావమాతనికి లేదు. నాయకసాధారణీకృతియే యాతని పరమాదర్శము నాయకుని నామమువలె నాయిక పేరెచ్చటను అతఁడు సూచించియుండలేదు. ఒక్క పదములో మాత్రము పేరుందేవి నామము

నతఁడు సూచించినట్లు జ్ఞాపకము. నాయికల విషయమునను తదవస్థాభేదము లను రమ్యముగా వర్ణించుటయందే యాతఁడు దృష్టిసారించెను గాని యా నాయిక యెవ్వరో ప్రత్యేకముగా గుర్తించుటకై యాతఁడు యత్నించినట్లు కానఁబడదు. ఆయాయవస్థలందున్న నాయికానాయకులు తదనుగుణములైన పదములను బఠింపునప్పుడందు తమ భావములే వర్ణితములైనవని భ్రమించు నట్లుగా నవి రచింపఁబడినవి ఇందు క్షేత్రయ్య ప్రదర్శించిన నేర్పు, లోక పరిశీలన పాటవము "శ్లాఘాలంఘన జాంఘికము" లైనట్టివి

శృంగారము సంభోగ విప్రలంభరూపములచేఁ బ్రధానముగా రెండు తెఱఁగులు ఇందు సంభోగము సురత రూపముననే కాక యన్యోన్యదర్శన, చుంబనా, లింగన, విహారాద్యనంత ప్రకారములనుండును. అనంతములైన యా విధములనన్నిటిని జెప్పఁజాలక యాలంకారికులది యేకైక రూపమనియే నుడివియుండిరి విప్రలంభమభిలాషమాన విరహ ప్రవాసభేదములచే నలు తెఱఁగులుగా నుండును. అభిలాష విప్రలంభమునకే పూర్వ రాగ విప్రలంభ మని నామాంతరము నాయికానాయకులు కలిసికొనుటకు ముందే వారి మాన సములం దుదయించుకోరిక కభిలాషయని పేరు మానము ప్రణయమానమని, ఈర్ష్యామానమని రెండు రకములు. బలవత్తరమైన కారణము లేకయే ప్రేమాతిశయముచే నాయికానాయకులందుఁగలుగు కోపము ప్రణయమానము దీనినే ప్రణయకోపమందురు నాయకుఁడన్యకాంతా సక్తుఁడైనపుడు దానిని గుర్తించి నాయికపొందు కోప మీర్ష్యామానము. సంయోగానంతర మే కారణ ముచేనైన నాయికా నాయకుల కెడఁబాటు సంభవించినచో వారు పొందు నుత్కంఠ విరహ విప్రలంభము కార్యగతిచేఁగాని శాపహేతువుచేఁగాని సం భ్రమముచేఁగాని నాయికా నాయకులు భిన్నదేశ గతులగుట సంభవించినచో నది ప్రవాసవిప్రలంభము ఇది భావి, భవ, ద్భూత విప్రలంభములని మూఁడు రకములు సాహిత్యదర్పణకారుఁడు కరుణ విప్రలంభమను మఱొక శృంగార భేదమును గూడ సూచించెను ఆనందవర్ధనుఁడు దానిని బేర్కొని యుండ లేదు లోచనమునందలి "కరుణ విప్రలంభాది భూమికాంగృహ్ణా" అనుచోటఁ

గల కరుణ విప్రలంభాది పదము నేకపదముగా గ్రహించుటచేఁ గలిగిన పొరపాటు వలన కరుణ విప్రలంభమను శృంగార భేదము కల్పింపఁబడినద నియు, నిజమున కట్టిది యుండదనియు విమర్శకుల యభిప్రాయము క్షేత్రయ్య పదములలోఁ బైని పేర్కొనఁబడిన శృంగార భేదములన్నియు గోచరించును.

"ఏల తెల్లవారెనయ్యో, యింతవేగమె" "ఒక్క సారికె యీలాగైన నోహోయిదేటి రతిరా" "ఒద్దఁదరలరైతిరేమే ఓ చెలులార" "నిదుర వచ్చునా కంటికి చక్కని సామి" "నేరమా? కొమ్మా వాడెందుకే చేర రాఁడమ్మా" "గిలిగింతలయ్యీర నాసామి చక్కిలిగింతలయ్యీర" "ఎన్నటికో నేనా కొమ్మను జూచేది" "అమ్మమ్మ వీఁడెంత నెఱజాణఁడైనాఁడె" "ఇంతే చాలునే యెవరేమి ముట్టుకొన్నారు" ఏమమ్మా యీవింతలు చూడవే యిది యేటి వగలే" "కలికిరో యింకొకసారి యుపరతి కలియకనే తాళఁ జాలనే" మున్నగు పదములు సంభోగ శృంగారమున కునికిపట్టులు ఇందు కవి యాలింగన చుంబన కుచగ్రహణాధర పానాదులను, రతిక్రీడను, ఉపరతిని విశదముగా వర్ణించియున్నాడు "మగువ తనకేళికా మందిరము వెడలెࣇ" అను పదము రత్యనంతర నాయికా స్వరూపమును బ్రత్యక్షము చేయుచున్నది. "ఒక్క గడియకే యీలాగైతే యిదేటి ఘనమే" యనుగేయమున శృంగారసాత్త్వికభావములు చక్కగా వర్ణింపఁబడినవి. ఇట్టి పదములలో సంభోగ శృంగారముతోపాటు క్షేత్రయ్య వర్ణన వైశారద్యముకూడఁ దేటతెల్ల మగుచున్నది.

క్షేత్రయ్య పదములలోఁ జతుర్విధములైన విప్రలంభ శృంగారమును వర్ణించునట్టి వెన్నో యున్నవి. కాళిదాసాది మహాకవులవలెనే యాతఁడును విప్రలంభమును వర్ణించుట యందెంతో యభినివేశము ప్రదర్శించెను. "వినావిప్రలంభేన సంయోగః పుష్టిమశ్నుతే" యని యుండుటయు, సంభోగ వర్ణన మెంత నిగ్రహముతోఁ జేయఁబడినను అశ్లీలత కాకరమౌట కవకాశ ముండుటయు, విప్రలంభమున హృదయావర్జనశక్తి యెక్కువగా నుండుటయుఁ

గవులే తద్వర్ణనమున నెక్కువ మక్కువ చూపుటకుఁ గారణము. "ఎటువంటి వాఁడేవాఁడూ-ఓయమ్మా వాఁడెన్నఁడు నీ వీధినిరాఁడూ" ఏమిసేతు కన్నె ప్రాయము నెడసేసె దైవము" మున్నగు పదములు పూర్వరాగమును సూచించుచున్నవి ఇందు నాయకునిఁ గలసికొనకముందే నాయిక పొందు విరహము వర్ణింపఁబడినది క్షేత్రయ్య ప్రణయమానమును కంటె నీర్ష్యా మానము నెక్కువ పదములలో వర్ణించెను. నాయికయేకాక నాయకుఁడును ప్రణయ కోపమును ప్రదర్శింప వచ్చును నాయకుఁ డలుకవెంది విముఖుఁడు కాఁగా నాయిక యతని ననునయించు సన్నివేశములను వర్ణించు పదములు కొన్ని యున్నవి. "దక్కితినంటే దయసేయవు" "ఊరకే చలము చేసేరా మొక్కేరా" మున్నగు పదము లిందుకు నిదర్శనములు. ఇంక నీర్ష్యామాన మును వర్ణించు పదము లసంఖ్యాకములుగ నున్నవి వీని యన్నింట ఖండితా నాయిక గోచరించును "అడుగరమ్మా ' యతనిపై నూరక యలిగినానటరే" "ఇంతన పొరుగింటన తావులేసట్లు" "నాదోవకు రాకు నాతోనవ్వకు మువ్వ గోపాల" "సరసము గాదిక సకియా" "ఈ తనువుతో నిన్నునేఁ దలఁతునా యింక నీయాజ్ఞకు వెఱతునా"యను పదము లిందుకు నిదర్శనములు నాయిక యీర్ష్యామాన పరవశయై నాయకు నుపాలంభించుటయుఁ బెక్కు పదములందు గోచరించును నాయికా నాయకులొండొరుల విరహమున కోర్వక విలపించు టయుఁ దమగోడు దూతికలతోడనో చెలికత్తెలతోడనో చెప్పుకొనుటయు పలుపదములందు వస్తువుగానున్నది ఈ విరహమునకును ప్రబంధములందలి విరహమునకును జాల సామ్యము గోచరించును. నాయిక "పండువెన్నెల కాకాయ, భావజుడమ్ములనేయ, గండుగోయిల రవళి మెండాయ నిపుడు, కండచక్కెర మోవిచ్చి కౌగిలించడాయ, నిండువేడుకలవాని నెనయని తను వేమిసేయ"నని చెలితోఁ జెప్పి విలపించును. "ఆఱు నెలలైనను అతఁడు నేనొకచోట హాయిగాఁ గూడి యుంటిమా—చక్కగా విభుఁడు నేనొక్కనాఁడైనను సరసము లాడుకొంటిమా" యని నాయకునితో నెడఁబాటు కలిగించి నందుకు దైవమును దూరి తన పూజాఫలమును నిందించుకొనును. కొన్ని

పదములలో చెలికత్తెలు "కోడె గుబ్బలపైని కొంగుపచరింపక తోడి వారిజాక్షులతో మాటలాడక, ఆడికలకులోనై యలమట నొందుచు, చేడె యేల చెక్కిటఁ జెయ్యి వేర్చుకొన్న" దని యడుగుచు నాయిక విరహావస్థను సూచింతురు. ఇట్లు విరహవేదనా దోదూయమానలైన నాయికలను చెలికత్తెలు గతకాలమున కొందఱింతులు పతులఁబాసి మరలఁ గూడిన వృత్తాంతములను జెప్పుచు, నాయకు లచిరకాలముననే వత్తురని యాశ కలిగించుచు, నోదార్చుచుందురు. ఎంత యోదార్చినను నాయిక లాహారము చవిచూడక, శీతలోపచారముల నైనఁ బడఁజాలక నిలుపరాని మోహముచే నిట్టూర్పులు పుచ్చుచు క్షణమొక యుగముగాఁ గడుపుచుందురు కొందఱు నాయికలు కాయజుబారికిఁ దాళఁజాలక నాయకులఁ దోడితెమ్మని చెలికత్తెల వేవిధముల వేఁడుకొనుచుందురు. వారి విరహము తీవ్రత నెఱుంగుటకీ క్రింది యుదాహరణము కొంత తోడ్పడవచ్చును.

"గండ మెండిన గందవొడి కుచకలశముల కన్నీటి వెల్లువ
చింది కళపెళలుడికి చెలిపై చింది మీనై మిట్టిపడెను"

ఇంత వెచ్చఁదనమునకుఁ గారణమైన విరహమును వారు భరింపఁజాలకపోవుటలో వింతయేమి? దానిని తెలుపుటకుఁ జెలికత్తెలకును వినుటకు మనకును వెఱపుకలుగు ననుటలోఁ గూడ నచ్చెరువులేదు. నాయికలు లతాతన్వులగుటచే దుర్భరమైన యా విరహాగ్నిని భరింపలేకపోయిరని మన మనుకొనవచ్చుచు. ధీరులైన నాయకులును ప్రియావిరహవేదన విషయమున నాడువారితో సమానులు కావలసినదే. వారి విరహబాధను స్వయముగాఁ జూచి, వారి మాటలు ప్రత్యక్షముగా విని వచ్చిన దూతికలు "ఇంతదయగలవాని నేలరావద్దంటి వెంతనిర్దయురాలవే"యని మొగమోటమిలేక నాయికలనే యెదురు నిందింప నారంభింతురు. "చక్కని యాచెలిని గూడని జన్మమేటికి? పడతి యుండుండి నేనేమి పాపము చేసితిని; తడవు నిన్నెడఁబాసి తాళలేను"

అని దుఃఖితులై వారు పల్కు దీనవాక్యములు విని దూతికలు వారికి తమ చెలులపైఁగల మోహమున కచ్చెరువు పొందుచుందురు వారు నిరంతర నాయికాధ్యాన తత్పరులై

"సొలసి నేనేమైన ప్రాయనీయాకార-శోభనమె కనిపించునే
పిలిచిపేరున నొకటిఁ బిలువఁబోయిన నీదుపేరు ముందుగఁ దోఁచునే
అతివ నీ యధరామృతముఁ దలఁచినంతనే యాహారమింపుగాదే
సతి నీదు కౌఁగిటను బ్రతిదినము నెనసినగతిఁ దెలుప నిదురరాదే

యని పలువిధముల వలవంత వంతచెందుచుందురు. అను ధూయమాన మగు చున్న విరహవేదనా తీవ్రతను దలంచివారు 'రామరామ' ప్రాణసఖి నెడఁ బాసి రాముఁడెటువలెఁ దాళెనో ముం"దని జాలివహింతురు. విరహవిప్రలంభ మునకు వలెనే క్షేత్రయ్య పదములలో ప్రవాస విప్రలంభమునకును మంచి నిదర్శనములున్నవి "ఏమని తెల్పుదు నేలాగు తాళుదు నేమిసేతునే చెలియ, భామరో యూరికి బయలుదేఱెడివేళ ప్రేమమీరనాసామి పిలిచి చెప్పినమాట" మున్నగు పదములు ప్రియుఁడు పొరుగూరి కరిగినపుడు ప్రోషిత భర్తృకయైన నాయిక పొందు విరహవేదనను వ్యక్తము చేయుచున్నవి "అట్టే యుండేవు సుమీ నా ప్రాణనాథ" యను పదమున నాయిక "యింతలో నీవీడ రాకుంటే కన్నీరు కావేరి కాలువ సుమీ, ఇంతింత నీకెమ్మోవి తేనెలానకుంటే యిదిగో నోరెండేని సుమీ" యని భవిష్యద్విరహమును సూచించుచున్నది. ఈ విధ ముగా క్షేత్రయ్య తన పదములలో నన్నిరకముల విప్రలంభశృంగారమునకును తావు కల్పించినాఁడు.

కొందఱు లాక్షణికులు నాయికలలోఁ బదునాఱు భేదములు సూచించి నారు- అందు స్వీయ, పరకీయ, సామాన్య అనువారు ప్రధానలు. వీరిలో స్వీయ ముగ్ధామధ్యా ప్రౌఢా భేదములచే త్రివిధములు. ఇందు ముగ్ధకాక మిగిలిన మధ్యా ప్రౌఢలొక్కొక్కరు ధీరాధీరాధీరా ధీరా భేదముల త్రివిధ ములు. వారు మరల జ్యేష్ఠా కనిష్ఠా భేదములచే నిరుతెఱఁగులు. ఇట్లు స్వీయ

పదుమూఁడు విధములు. పరకీయ కన్య, అన్యోఢయని రెండు విధములు. ఈ పదునైదుగురును సామాన్యతోఁగలసి పదునార్గురగుదురు వీరిలో నవాంతర భేదములింకను బెక్కు గలవు. వీరుగాక యష్టవిధ నాయికలు వేఱుగానున్నారు అట్లే నాయకులందును దక్షిణానుకూల ధృష్టశఠ భేదములు నాలుగున్నవి సూక్ష్మముగాఁ బరిశీలించినచో క్షేత్రయ్య పదములందీ నాయికానాయక భేదములన్నిటికిని రమ్యములైన లక్ష్యములు గోచరించును. "ఎంతలేదు నాతో నీడు సేతుర- వింతలాయ కనుకాయ మధురమౌన వినరా మువ్వగోపాల స్వామి" "చిన్నదాన నేనేమెఱుఁగ సిగ్గయ్యీనమ్మా" ఇత్యాది పదములలో ముగ్ధా లక్షణములు సూచింపఁబడినవి." "కమలాక్షిపేర నన్ను ఘనుఁడు పిల్వఁగా కోపశమనములేక జడకొద్ది గొంటినమ్మా" "పట్టు వడితివి నాచే పడకింటిలో నిన్ను కట్టివేసికొంటే నిన్ను విడిపించేదిక్కు గలదా" "చక్కని రొమ్మున రొమ్ము చేర్తువుగాని చనుల గ్రుమ్మేవు సుమీ, ఎక్కువ ప్రౌఢ గనుక చెప్ప తగినదేమి యిప్పుడే తెలుసుకోవలెను. లలనరోనీవు" మున్నగునవి ప్రౌఢా నాయికకు సంబంధించిన వాక్యములు "అత్తవారూరికి పంపేరు మా వారు అయ్యో నే నేమి సేతుర" "నీ పొందు సేయకమాన మువ్వగోపాల నీ పాదమాన" "మగువ యింత దుడుకుతగునె వానికి నేను మగనాలఁ గాదటవే" "రేపు వత్తువుగాని పోరా నేఁటికిఁ దాళి" మున్నగు పదములలో అన్యోఢయైన పరకీయా నాయిక వర్ణింపఁబడినది. ఒక పరకీయ "పురుషుఁడూరలేని ప్రొద్దు మాపటివేళ సుద్దులఁ దేలించి ముద్దుపెట్టుకపోయె నాతఁడెవ్వరే" యని చెలికత్తె నడుగుచున్నది. మఱియొకతె "మగని కౌఁగిలి బాసివచ్చితి నేఁడు నీ మాట తప్పక నేను బిగువైన గుబ్బల కొనగోరులుంచఁ జూచేవు వెలజాతిదానఁ గా"నని ప్రియునికి కర్తవ్యోపదేశము చేయుచున్నది. ఇంకొకతె "ఊరక నాపైని నేరమెంచక పోరుచు మా బావగారున్నారు- కూరిమి నా తోడికోడలీ పడకింటి చేరికయందుండ మేరగాదోయి- వేళ గాదుర- గడియతాళురసామి" యని ప్రియుని ప్రార్థించుచున్నది. "ఏమిసేతు కన్నెప్రాయము నెడజేసెదైవము ఆముకొన్న రతి సుఖము అనుభవించే

దెన్నటికో'' అను పదము ముగ్ధయు కన్యయునైన పరకీయకు లక్ష్యముగా నున్నది "మఱచితివా నన్ను మగువా'' యను పదమున నాయకుఁడు కన్నెరికమునకు కంఠసరులిచ్చినది మొన్ననేకదాయని యడుగుటవలన నామె సామాన్యయని వ్యక్తమగుచున్నది "సామికి సరియెవ్వరె'' "సరసిజాక్షి నీ జన్మము సఫలమాయెను'' అను పదములలో స్వాధీనపతికా లక్షణములు గోచరించుచున్నవి "ఇంత మేలుదానవా యో చెలియ నీ వింత మేలుదానవా- ఇంతి మువ్వగోపాలు నింటికేల పొమ్మంటివె'' యని చెలి యొక కలహాంతరిత నడుగుచున్నది మఱొక కలహాంతరిత "బలిమినేమంటినో నా సామిని తెలియక పొమ్మంటినో'' యని పశ్చాత్తప్తురాలగు చున్నది ఇంకొకతె తన కోపమునకు గుఱియై వెడలిపోయిన ప్రియుని యెడ బాటు సైఁపలేక యాతనిఁ గొనిరమ్మని చెలికత్తెను వేఁడుకొన నామె "ఏమైన నే నందుఁబోను వేఱొక్క- యింతిని బంపవే- రామ నీ వాడిన మాటలకు వాఁడు రాఁడు మనసునొచ్చె'' నని బదులు పల్కుచున్నది. "నా కోపమే నన్నింత చేసెనమ్మా'' యనియు, "తెలివి యొకరి సొమ్మా యెందుకె విభుని తిరిగి పొమ్మంటినమ్మా'' యనియు కలహాంతరితలైన యితర నాయికలు వాపోవుచున్నారు క్షేత్రయ్య తన పదములలో ఖండితా నాయికలను బలువురిని ప్రదర్శించియున్నాఁడు. అన్యకాంతాసక్తుఁడై వచ్చిన నాయకునిఁ జూచి "గంధము చాటున ఘనమైన జడవేటు కందియున్న సొగసు గనుగొంటినోయి- సందిటనున్న యీ చందురు పిల్లలు అందమాయెనోయి అందుకేమోయి తగిలితివిఁక నిన్నుఁ దరలనీయ నోయి'' యని యొక ఖండిత కుపితయై నిందించుచున్నది. మఱియొకతె "చక్కెరకెమ్మోవి పచ్చి నీ పలుకెంపు- సామి నీ కన్నుల నిద్దురమంపు, చెక్కుటద్దముపైఁ గ్రొన్నెలగుంపు- దక్కిన నలినాక్ష దానిపై సొంపు- తెలియ వచ్చెనురా నీ వగలెల్ల దృష్టిదాకేనిరా'' యని పరకాంత యింటినుండి వచ్చిన ప్రియుని తర్జించుచున్నది. "చల్లనాయెనా మనస్సు చల్లనాయె నేఁడు'' "చాలుచాలు ఈ చిన్నెలతో నాదుసరసకుఁ జేరకుర'' "ఇందెందు వచ్చితివిరా అలదాని యిల్లు ఈ వీధిగాదు పో పోరా'' మున్నగు పదములలోఁ గూడ

ఖండితానాయికా స్వరూపము విశదీకరింపఁ బడినది "ఇంత ప్రొద్దాయెనింక వాఁడేమి వచ్చేని" అను పదములో "పమ్మిన వేడుకతోను పడకిల్లు శృంగారించి యెమ్మెకాఁడు వచ్చునని యెదురుచూచు" వాసక సజ్జిక సాక్షాత్కరించుచున్నది "ఇందు రాఁదగదు నే నేలవచ్చితినమ్మ" యను పదమున నొక విప్రలబ్ధానాయిక ప్రియుఁడు సంకేత స్థలమునఁ గానరాకపోవుటచే "ఎలమి సఖులఁగూడి మా యింటనుండక" యేల వచ్చితినని వగ చెందుచున్నది. ఒక విరహోత్కంఠిత "వచ్చేనని రాకపోయేనే ఓయమ్మ నాపై వానికింత దయలేకపోయెనే" యని చెలికత్తెతోఁ జెప్పుకొని విరహబాధ నొందుచున్నది. "ఏమని తెలుపుదు నేలాగు తాళుదు" నను పదమున నొక ప్రోషిత భర్తృక పొరుగూరికి పోవువేళ ప్రియుఁడుచేసిన చేఁతలు, చెప్పిన పలుకులు పదేపదే తలంచుకొని దుఃఖించుచున్నది.

నాయికాభేదములకు వలెనే నాయక భేదములకును క్షేత్రయ్య తన పదములలో లక్ష్యములు ప్రదర్శించినాఁడు "వచ్చేమననో రానిమననోవనిత నీవేదెలుసుకోవె" యను పదమున దూతినాయకుఁడు పరకాంత యింట నున్న సమయమున నాయిక పంపిన ముద్దుటుంగరమును, వలపు జాబును దానొసఁగ నతఁ డుసురుసురనుటయు, దయమఱవకుమని ప్రార్థింప వేఁడుటయుఁ దెల్పి యాతని దాక్షిణ్యమును బ్రకటించుచున్నది "సామికి సరియెవ్వరె" యను పదమునందలి నాయకుఁడనుకూలుఁడు నాయిక కేళీసమయమున "నేమగువ వద్దనైన యీలా గుందువా యంటె" యతఁ "డీమాటెట్లంటివని యెంతో" యుస్సురనును. ఇందాతని యేక కాంతా ప్రియత్వము వెల్లడియగుచున్నది. "ఇంక నిన్నుఁ బోనిత్తునా" యను పదమున నాయిక "జవ్వన మెల్లనీ పాలు చేసి చాలనమ్మియున్నందు కెవ్వతెనో కూడి వచ్చితివా" యని కోపింప నాయకుఁడు లేదు లేదని బొంకును. ఇతఁడు ధృష్టనాయకుఁడు. "ఇంతకు నేఁదాళఁ గలనాయను పదమున" నాయిక విజయరాఘవుని పరకాంతాసక్తిని దెగడి "దగ్గర నిలువకు పదరా, దానికేను తాళఁగదరా" యని యీసడింప నాతఁడు ధృష్టుఁడై తనకేమియుఁ దెలియదని యసత్యములాడి తప్పించు

కొనఁ జూచును. "కందువ తెలియక నాపై మేలు వాఁడను కొందురితరు లెల్లను" అను పదమున నాయకుఁడు గూఢ విప్రియకారియైన శఠుఁడు. అతఁడు నాయిక యింటికి వచ్చియు మాటాడక నిద్రించును ఘనమైన తమి నిలుప లేక యామెపై కొనఁగా గ్రక్కున వాలించును ఇంకొక నాయకుఁడు "తియ్య బొల్లివగలఁ దేలించి సోలించి చెయ్యని పనులెల్లఁ జేసి భ్రమియించి, శయ్యపైఁ బవళించి సద్దుచేయక లేచి తొయ్యలిపై దుమ్ముదులిపి" పోవుచు శాఠ్యము ప్రకటించును క్షేత్రయ్య పదములలో మొట్ట మొదటిదను గౌరవము పొందిన "శ్రీసుతుబారికి నేనోపలేక నినువేఁడితే" యను పదమును నాయిక తనతో లేని కలాపాలు చేయు నాయకుని శఠత్వము చూచి "నా పొందెల్ల దాని కబ్బె యే పొందులేక యుసురనుచే నాపాలా" యని వాపోవును మఱి యొక పదమున మువ్వగోపాలుఁడు చిత్త మొక్కరి మీఁద నుండ చిఱునవ్వు నవ్వుచుండుననియు, నడకవేఱు విధముగా నున్నను నాలుకచే నమృతము నొలికించుననియు శఠుఁడుగా వర్ణింపఁ బడియున్నాఁడు తిల్లగోవిందుని కంకితమైన యొక పదములో "విభుఁడు పాంచాల దేశాధిపతి—వెలది పద్మిని వంశజాతి" యని పద్మినీ పాంచాలురు పేర్కొనఁబడి యున్నారు.

సాధారణముగా శృంగార కావ్యములందు నాయిక ప్రణయ కోపము చెంద నాయకుఁడనునయించు ఘట్టములు కానిపించును క్షేత్రయ్య నాయకుల పొలయల్కనే పెక్కుచోట్ల వర్ణించెను ఊరక యలుక వహించుటే కాక వార దక్షిణులై నాయికల నిరాకరించుటయుఁ గన్పించును. ఒక నాయకుఁడు నాయిక తమితోఁ గౌఁగిలింపఁబోవ దూరముగా నుండుమని యదలించును అప్పటికిని కోపము వహింపక యామె మోవితేనె లీరాయని వేఁడుకొన నెంగిలగునని నిరాకరించును నోటి విడె మిమ్మని యాచింప కసరి లేదని పరాఙ్ముఖుఁడగును ఇట్లని యాతఁడు పరకాంతా పరాఙ్ముఖుఁడైన ప్రవ రాఖ్యుఁడు కాఁడు. అదను చిక్కినప్పుడెల్ల నన్యకాంతలతో నసహ్య విలాసము లొనరించు రసికశిఖామణియే. ఇట్లే యీ పదములలోఁ గోపమునకుఁ గారణ ముండియుఁ గోపపడకుండుటయే కాక నాయకుఁడే దిక్కని నమ్మియుండు

ప్రేమ పరిపూర్ణలు, సాధుశీలలునైన నాయికలు కొల్లలుగాఁ గని పింతురు పరకాంతాసక్తుఁడైన ప్రియుని గూర్చి యొక నాయిక "వెలికత్తె వైననీవె చెలువుఁడవైన నీవె తలఁచిచూడ నా పాలిదైవము నీవె, అంత రంగమైన నీవె యాదరించిన నీవె చింతించిచూడ నా జీవనము నీవె" యని తన పత్యేక పరాయణత్వమును సూచించును. ఇంకొక నాయిక "నినుఁబాసి తాళలేను, నీ సొమ్ముఁజేసితి నామేను, తనరఁగ నీవు నాదైవముగాను మనసున నెంచితి మక్కువతోను" అని తన సర్వస్వమును ప్రియుని కర్పించును వేఱొకతె "నీకే దయరావలెఁ గాక లేక దిక్కెవ్వరు" యని యనన్యగతికయై నాయకునే నమ్ముకొని యుండును. వీనియందలి యాత్మార్పణము చూడ నిం దలి యనురక్తిలౌకిక ప్రేమ సీమలను దాఁటి యమల ప్రపత్తి ప్రపంచమును సమీపించునట్లు తోఁచును కొందఱు నాయిక లెంత భోగము ననుభవించియుఁ దనివిచెందక యసంతుష్టలుగా నుందురు. ఒకతె నాయకుఁడు "ప్రేమతో సొక్కినా చెక్కిలి వేమాఱునొక్కి కామించినను బిగియఁ గౌఁగిలించెనె" కాని మోము మోము మోమునఁ జేర్చి ముద్దు పెట్టఁడనియు, కులుకు గుబ్బల పై నిగోరులుంచఁడనియు, చిరుదొడలపైఁ దనచే సోకనీఁడనియు నింకను ఏమేమో చేయఁడనియు విచారించును. వేఱొకతె రాత్రి దైర్ఘ్యము చాలక "చెల్లఁబోయెంత వేగమె తెల్లవాఱెరా" యని కొంప మునిఁగి పోయినట్లు దుఃఖించును. ఇంకొకతె "ముచ్చట తీరదు మువ్వగోపాల" యని పలికి రేయును బగలు గ్రుచ్చి యక్కునఁ జేర్చుకొనుమని యాతని ప్రార్థించును. సామాన్య నాయకుల కౌఁగిలింతలే యొక్కొక్కప్పుడానంద సామ్రాజ్యము నధిరోహింపఁజేయ మువ్వ గోపాలునిది మైమఱవఁజేసి మోక్షము చూఱ యిచ్చుటలో నాశ్చర్యమేమి ?

ఈ పదములలోఁ బెక్కుచోట్ల నాయికలు నాయకుల కన్యకాంతలు మందు మ్రాకులు పెట్టిరేమో యనియు, వారిపై చొక్కు మందులు చల్లిరేమో యనియు భావించి యదియే వారు తమ చెంతకు రామికిఁ గారణమని దుఃఖిం తురు ఆ కాలమున నిట్టివశీకరణౌషధములకుఁ బ్రచార మెక్కువగా నుండెను

కాఁబోలును. కొందఱు దూతికలు నాయకులఁ దోడితెచ్చెదమని యేగి వారితోఁ దామేకూడి నాయికలకోపములకు గుఱియగుటయుఁ గానిపించును. ''ఈలాగు నేతురా'' యను పదమున నాయిక దూతికను "తోడి తెచ్చెదనని యందుఁజేరి వానిఁ గూడుదురచే దోసకారి'' యని కోపముతో నిందించుచున్నది రెండు మూఁడు పదములలో గోత్రస్ఖలనము గోచరించుచున్నది. "ఉన్నబోటి చెలువైతే ఓర్చుకొందురా'' యను పదమున శాంతురాలైన యొక నాయిక "కలువరించినీవల్ల చెలిపేరఁ బిలువఁగ నానెలఁతం గాను భ్రమయకు నేనంటేఁగా'' అని నాయకుని యన్యకాంతాసక్తిని దానితో పాటు తన సమరసభావమును గూడ సూచించుచున్నది కొందఱు నాయికలు విరహవేదన భరింపలేక తెగువచేసి మరణించుటకై యత్నించుటయుఁ గలదు కాని యిట్టి వానికి నిదర్శనములు చాల స్వల్పముగా నున్నవి.

క్షేత్రయ్య పదములు పెక్కు నాయకుని వాక్యములుగనో నాయిక వాక్యములుగనో దూతీవాక్యములుగనో యున్నను రెండుమూఁడు నాయికా నాయకుల చమత్కార సంభాషణముతోఁ గూడి యింపుగొలుపుచున్నవి. "సకియ నీ చన్గవలు సంగటికొండ లందురుగాని కొండలైతే కోటతలుపులేవే- యిక నేమిసేయుదును మువ్వగోపాల యిదిగో పాలిండ్లపై తర్కింప రవిక ముడి తలుపుగాద'' మున్నగున వందుకు నిదర్శనములు ఇవి ప్రశ్నోత్తర రూపమున నున్నవి ఇట్టివి తాళ్ళపాక అన్నమాచార్యుల రచనలోఁ గూడఁ గలవఁట ! కొన్నిపదములు చక్కని వ్యంగ్యముతోఁగూడి యర్థగంభీరములై యున్నవి. ఒకనాయకుఁ డింతినిఁ దన్నుఁ గూర్చుమని దేవుని ప్రార్థించుచు "కన్నెమోము నేను గనుఁగొనఁ గలిగిన పున్నమొక్క ప్రొద్దుండేరసామి, కన్నులు ముద్దాడఁ గలిగిననే జంటకలువ పువ్వులఁ బూజించేరసామి, సన్న నూగారంటఁ గలిగిన నాగుల చౌత్రివతములుండేర సామి, చన్నులంటఁ గలిగిన బంగరు కలశము శిఖరముపై నుంచేర సామి'' యనుచున్నాఁడు కన్నె మోమునకు పున్నమ చందురునికి, కన్నులకు జంటకలువలకు, నూగారునకు నాగములకు, స్తనములకు సువర్ణ కలశములకుగల సాదృశ్యమును దృష్టియం

దుంచుకొని చూచిన నిందలి చమత్కారము వ్యక్తమగును ఇంకొక పదమున నాయిక నాయకునితో "కలపముఁ బన్నీరు కదంబము నీమేన నలఁదుకొన్నావేమో అందముతోను, కులుకు గుబ్బల నిన్ను గ్రుచ్చి కౌఁగిలించుకొన్న చలువ వాసనలు వెదఁజల్లెరాసామి"యని యాతని యన్యకాంతా సంగమమును ధ్వనింపఁజేయుచున్నది. 'గజరాజ గమనరో యీ కపటము నేనేమెఱుఁగ'నను పదమునందు నాయిక చెలికత్తెను నాయకుఁడు "జీని గజనిమ్మపండ్లు చిలుకముక్కు నొక్కులచే కానుక చేసిన కారణమేమొ"యని యడుగ నామె "కానుకగాదే నీ గుబ్బలూనిపట్టి చందమామ కూనల నుంచేనందుకు గురుతులాగింతే" యనిసమాధానము చెప్పుచున్నది

శృంగారరసమునకు స్థాయిభావము రతి యువతీయువకుల యన్యోన్య విషయకమగు నిచ్ఛయే రతియని కొందఱును, తరుణీ తరుణులకు మనస్సునఁ బొడమిన సంభోగ విషయకమగు నభిలాషయే రతి యని కొందఱును నిర్వచించి యుండిరి రసగంగాధరకారుఁడు దానిని సంభోగేచ్ఛ యనక "స్త్రీ పుంసయోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్య శ్చిత్తవృత్తి విశేషః" అని దానిని ప్రేమ రూపమగు చిత్తవృత్తి విశేషమని పేర్కొనెను. ఈ ప్రేమయే విభావాదులచే లెస్సగాఁ బరిపుష్టమై శృంగారరసముగాఁ బరిణమించును. క్షేత్రయ్య పెక్కు పదములలో శృంగారమునకు బీజభూతమైన నాయికా నాయకుల నిర్మలమైన యనురాగమును జక్కగా వర్ణించెను. ఒక నాయిక "అక్కరో, సరసుఁడు గాఁడని యాడుకొంటే యాడుకొనేరు" అను పదమున మువ్వగోపాలునిపైఁ దనకుఁగల గాఢమైన యనురాగమును వ్యక్తము చేయుచు "రామ వానిఁ దలఁచినపుడే అవిక క్రిక్కిరిసి గుబ్బలేమో ఔమ్మెల్ల నిండునే-వానిమాటంటే నామనసు పై పై నుండునే-వానిఁ జూచితే నవనిధు లబ్బినట్లుండునే"యనిచెప్పుచున్నది ఇంకొకనాయిక తేటిపారఁ జూచినచో మువ్వగోపాలునికి దృష్టితగులునని భావించు చున్నది. ఇది తిక్కనగారి 'సుదతి నీమై చక్కఁజూడంగ నోడెదఁ గనుబాటు వారయునో యని తలంచి'యను పద్యపాదమందలి భావమును దలపించుచున్నది. మఱొకనాయిక చెలికత్తెలు నాయకుని గూర్చి చెప్పిన

పాడీలు విని "దూరమెంచక యిటులు సామిపై దూరుదేల పలికేరా" యని మందలించుచు నాతని సుగుణపరంపరలను వర్ణించి చెప్పుచున్నది. ఇంకొక నాయిక "ప్రాణేశ్వరుని మనసెటువచ్చునోయని కొఱికి కెమ్మోవి చవిచూచునే కాని గుబ్బలు కొన నొక్కుటకు" వెఱచునఁట ! నాయకుల యనురాగము కూడ నాయికల యనురాగమున కెందును దీసిపోవునది కాదు. ఒకనాయకుఁడు ప్రేయసి యెడఁబాటు సైఁపఁజాలక "తనువు తనసొమ్మే యిచ్చకముగా దీమాట తన చిత్తమెఱుంగుననెనే' యని చెలికత్తె నాయికతోఁ జెప్పుచున్నది "ఇంతిరో వరదునికి నీపై నెంతమోహమే" యను పదమున నాయకునికి నాయిక యెడఁగల ప్రేమవెల్లడిచేయఁ బడినది ఒకనాయకుఁడు విరహవేద నోపశమనార్థమై నాయిక చిత్రము లిఖించుచు 'వెలయు నీదుముఖారవిందంబు లిఖియించి అలరువాసనలు వ్రాయఁగ నేరనైతి, కళలొల్కు నీమోవి గడసి వ్రాసితిఁగాని నెలఁత తేనియలుంచ నేనేరనైతి"నని విలపించుచున్నాడు. నాయికా నాయకులు తాము దుర్భరమైన విరహవేదన ననుభవించుచునే తమ ప్రియుడును ప్రియురాలును ఆ బాధనెట్లు సైఁపఁజాలుచున్నారో గదాయని దుఃఖించుట వారి యనురాగ విశేషమునకుఁ బరాకాష్ఠ ఇది తాను విరహము ననుభవించుచునే మేఘసందేశము నందలి యక్షుఁడు దయితా జీవితావలంబ నార్థియై మేఘునిచే సందేశము పంపించుటతో సాదృశ్యము వహించుచున్నది. "తాళఁగలవా కంచివరదా ! నే నిన్ను నెడఁబాయ" మున్నగు పదములిందుకు నిదర్శనములు. తుచ్ఛము దైహికమునైన కేవల కామము కాక నిర్మలము హార్దమునైన యనురాగము కొన్నిచోట్లనైన నిందలి శృంగారమునకు స్థాయి యగుట గమనింపఁ దగియున్నది.

క్షేత్రయ్య వర్ణించిన శృంగారమునఁ గొంత యాత్మీయాంశ కూడఁ గానవచ్చును అప్పుడిందలి నాయకులతో వరదపూర్వాభిధుఁడైన క్షేత్రయ్య కును నాయికలతో నాతఁడు వలచిన దేవదాసికిని అభేదము చెప్పవలయును "పిలువనంపె నన్నీవేళ" "నన్నే పెండ్లాడుసుమీ" మున్నగు పదములా యభేదమును స్పష్టముగా సూచించుటయు, వరదనామాంకితములైన పదము

లందలి వరదుఁడు వరదయ్యయే యని యనుమానించుట కవకాశముండుటయు నితరపదము లందలి భావావేశ నైశిత్యములును ఈ యాత్మీయాంశ విషయ మును మఱింత బలపఱుచుచున్నవి. ఆత్మప్రణయ పరిస్థితుల నుండియే యాతఁడు కొన్ని సన్నివేశములు గ్రహించి లక్షణజ్ఞుఁడు కావున వానికి లక్షణానుగుణముగాఁ గొంత వన్నెయు పెంపకమును గలిగించి యీ పదము లను రచించి యుండవచ్చును అందుచేతనే యవి స్వానుభవమునే వర్ణించు నవివలె నిశితములును, సహజములును నగుట సంభవించినది. "ఇంతిరో వర దునికి నీపై నెంతమోహమే" "తరుణిరో నేనందాక జీవముబట్టుక తాళి యుండేనమ్మా" "కంచివరదునితో పొందుకద్దో లేదో" ఊరికిపోక నేఁడిం దుండేది మేరరా" యను పదములను బరికించిన నీ విషయము తేటతెల్ల మగును.

ఒక్కొక్కప్పుడు శృంగారము భక్తితో సమ్మిశితమై యుండును. అప్పుడు రతి దేవాది విషయమై కానవచ్చును. కాని "రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః భావః ప్రోక్తః" అని పలువురు దానిని కేవల భావము గనే పరిగణించిరి. రూపగోస్వామి యుజ్జ్వలనీలమణి యందును, మధుసూదన సరస్వతి భగవద్భక్తి రసాయనమునందును భక్తిరసమేయని నిరూపించిరి మధుసూదన సరస్వతి ప్రమాణప్రమేయోపన్యాస పూర్వకముగా దానికి రసత్వమును స్థాపించెను. పరమాత్మ స్వరూప శ్రీకృష్ణ రతి రసమేయనియు నది రసాంతరములకన్న శ్రేష్ఠతరమనియు నాతని భావము. భక్తిరసమునకు భగవంతుఁ డాలంబన విభావము, తచ్చరిత్రలుద్దీపనములు; భగవదాకార చిత్త వృత్తి స్థాయిభావము ఇదే భగవద్రతి. ఇది తత్కాలజనితములైన నేత్రాది వికారములను ననుభావములచేతను, నిర్వేద శంకాహర్షాదులగు వ్యభిచారుల చేతను బోషితమై పరమానంద స్వరూపమగు భక్తిరసముగాఁ బరిణమించును. భరతుఁడు నాట్యశాస్త్రమున కామము ధర్మార్థ కామమోక్షములతో సంబంధించి చతుర్విధములుగా నుండునని వచించియుండెను ఇందు మోక్షకామమే [illegible]దతి. మహాభారత శాంతిపర్వమున కాముఁడు చెప్పినట్లుగా నొక శ్లోక

మున్నది "తస్య మోక్షరతిస్థస్య నృత్యామిచహసామిచ" యని యాతఁడందు మోక్షరతిని బేర్కొనెను మోక్షకామము, భగవద్రతి, మోక్షరతియను మూఁడును సమానములే ఏతత్పరిణామ రూపమైన రసమే మధురభక్తి లేక యుజ్జ్వల శృంగారము అని చెప్పఁబడును. మహాభాగవత దశమస్కంధములో గోపీకృష్ణుల సంబంధమున స్త్రీపుంస సంయోగసంజనితమైన శృంగారము ప్రసంగముకూడ నున్నను బెక్కుతావులనది దైహిక కామసీమలను దాఁటి మోక్ష సంబంధిరతిగాఁ గానవచ్చుచున్నది అచ్చటనది యుజ్జ్వల శృంగారమే. అందు చివరి యవస్థను జేరినపుడు భక్తుఁడు భగవంతుని వియోగము నొక్క క్షణకాలమైన భరింపఁజాలక బాధపడును భాగవతమునందలి గోపీవిరహ సన్నివేశములట్టివే క్షేత్రయ్యపదములను స్థూలముగాఁ బరిశీలించినఁ బెక్కు చోట్ల దైహికము స్త్రీపుంస యోగోద్భవమునైన లౌకిక శృంగారమే కానవచ్చును. ఆ సందర్భములందలి రత్యుపరతి కుచపీడనాధర పానాదులను గూడ భక్తి భావములుగాఁ బరిగణించినచో శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారన్నట్లు *"మనము మోక్షానందమును దుచ్ఛమైన యింద్రియానందముతో సమీకరించి దాని యౌదార్త్యమునకు లాఘవము కలిగించినవార మగుదుము" కాని యందు కొన్నికొన్ని ఘట్టములం దాధ్యాత్మిక భావముతోఁ గూడిన మోక్షరతిచ్ఛాయలు గోచరింపకపోవుట లేదు ఇట్టియెడ క్షేత్రయ్యయే నాయిక, గోపాలుఁడాతని ప్రాణేశ్వరుఁడు నాయిక నాయకుని గూర్చి "అన్యథాశరణంనాస్తిత్వమేవశరణంమమ" అని యాతఁడే తన సర్వస్వముగా భావించి, తన్నాతనికి సంపూర్ణముగా సమర్పించుకొనునట్లున్న పదములం దీ భావము గోచరించును మఱియు "పరమాత్ముఁడే మువ్వగోపాలుతో విన్నవించవే" "పరమాత్ముఁడౌ మువ్వగోపాలుఁడైన వరదుఁడు" పరమాత్ముఁడైన మువ్వగోపాలుని హస్తము

---

*We try to defend this by the aid of allegory and uneasy theories that all these represent the love of Gopis symbalising individual souls, to Krishna, the symbol of the Heavenly absolute It is doubtful whether we are spiritualising sex or sexualising spirit, whether we are sublimating earth to heaven or bringing down the heaven to our muddy levels and depths."

సోకినంతనె'' "పరమాత్మ' మువ్వగోపాల తెల్లవాఱెననుచు'' మున్నగువోట్లఁ గల పరమాత్మ శబ్దప్రయోగము మువ్వగోపాలుఁడు సామాన్య నాయకునికి ప్రతినిధి మాత్రుఁడు కాఁడనియు, పరబ్రహ్మ మూర్తియనియు సుస్పష్టము చేయుచున్నది క్షేత్రయ్య వట్టి విటరాయఁడే కాక భక్తశిఖామణి యగుటయు నీ విషయమును బలపఱచుచున్నది. ఇద్దఱిసందున పవ్వళించియున్న యింతి పేరేమిరా, అను గీతమునందలి యిద్దరు జీవాత్మ పరమాత్మలనియు, నా యింతి మాయయనియుఁ గొందఱు గూఢార్థమును వివరించుచున్నారు లలనామణిరో యీ భావము తెలుపవే లలితముగానిపుడు'' అను పదము కూడ గూఢార్థ భూయిష్ఠమై యున్నది. దీనియందును దార్త్వికార్థమును వెలయింపవచ్చు నేమో! ఇట్టి యర్థముల నొక్కొక్కచో సమన్వయించుట కవకాశమున్నను అంతట నా యర్థమును గొనసాగించుట క్లేశకరమగును. ఇట్టివానిలోఁ దత్త్వార్థమిమిడియుండుటే నిజమైనచో క్షేత్రయ్య పదములందు మధురభక్తి యున్నదని మఱింత నిశ్చయముగాఁ జెప్పవచ్చును

క్షేత్రయ్య పదములలోఁ గొన్ని యుజ్జ్వల శృంగారనిలయములని చెప్పుట కవకాశమున్నను బెక్కింట సామాన్య నాయికా నాయక ప్రవృత్తుల కనుగుణమగు లౌకిక శృంగారమే విస్పష్టముగా గోచరించుచున్నది కొన్నిటిలో నది మితిమీరి యౌచిత్య మర్యాదను గూడ నతిక్రమించి వానిని జావళీల జాతిలోనికి దింపుచున్నది. అందలి "చౌశీతిబంధములు, పైటలో చేయివేయుట, కులుకుగుబ్బల ఱొమ్ముఁ గ్రుమ్ముట, సమరతి, ఉపరతి, చను మొనలంటు, మోవివిందారగించుట, ముద్దుమీఁద ముద్దులు, పావురంపుఁ బలుకులు, పడకిల్లు శృంగారించుట, మోవిపానకమిచ్చు, వింతరతులఁ గూడు, తొడతొడ సోకియుండు, మందుమాకులిడుట, కుసుమాస్త్రగృహముపైఁ గొసరి చేయివేయుట, పోకముడివీడుట, మరునిల్లు చెమ్మగిలుట, చొక్కు పొడి చల్లినట్లాయె, కిలకిలనగవుల నా యెదగుబ్బల గుమ్ముచు, బంగారు బంతులవంటి చిన్న చన్నులు, మోవిగంటి చేయుట, మువ్వగోపాలుఁ డందు మీఁద చే వేసెనే, చందురుపిల్లలు, క్రొన్నెలగుంపు, పచ్చి యొడలిదానసురా,

పట్టకురా బొమ్మ పాలింటుఁ జేతులు, ఊరికిఁ బోయిన మగఁడు ఉట్టిపడ్డట్టు వచ్చి యీ రేయి ననుఁగూడె నింక దూరుబాసె, నీ రూపమున నేను నీకే కందు మగవాని, సమర్తాడి నెలపూటలాయెరా, అల తావెల్లఁ దమిఁ దడిసెఁ గదరా, చందమామ కూనలు, మక్కువ మీర మదనమందిరరాయు నా మరు నిల్లు చేర్చి, మగనికన్న దొంగ మగనిపొందే మేలు'', మున్నగు ప్రయోగము లెంత లలితములో యంత యశ్లీలములు ఉదాత్తకళా స్వరూపమున నశ్లీలతకు జోటు లేదని కొందఱందురు కళయొక్క యౌదాత్త్య మశ్లీలతను గొంత వఱకుఁ గప్పి పుచ్చుమాట సత్యమే, కాని యసభ్యత యతిమాత్రమైనచో కళయొక్క యౌదాత్త్యమును గూడఁ జెఱచును. మఱి భక్తుఁడైన క్షేత్రయ్యే యీ యసభ్య శృంగారము పొంతకేల పోయెనని సందేహము రావచ్చును. దానికి రెండే సమాధానములు. భక్తి శృంగారము లొకే యొరలో నిముడని కత్తులు కాకపోవుట, కాలప్రభావ మెంతటివారికైన దురతి క్రమణీయమగుట.



# క్షేత్రయ్య: సంగీతము

— శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు

పైడాల గురుమూర్తిశాస్త్రి గీతం, వీణకుప్పయ్య వర్ణం, క్షేత్రయ్య పదం, త్యాగయ్య కృతి, ధర్మపురి సుబ్బారావు జావళీ కర్ణాటక సంగీతానికి సుస్థిరస్వరూపమునిచ్చిన మేటికల్పనలు అని సంగీతజ్ఞులు తరచు వక్కాణి స్తూంటారు క్షేత్రయ్య సంగీతం అనే యీ నా వ్యాసంలో క్షేత్రయ్యా-పదమూ అవినాభావసంబంధం పొందాయి. క్షేత్రయ్య కృషిచేసిన సంగీత ప్రక్రియలలో మిగిలినవేమైనా ఉండేవో లేదో మనకు తెలియదు. 40,000 కు పైగా పదాలు మాత్రం రచించినట్లు ఆయనే ఒక పదంలో చెప్పుకొన్నాడు.

విషయం తెలియని వారు చాలామంది పదమూ, జావళీ ఒకటే అనుకుంటూంటారు అందులో శృంగారమూ, ఆ శృంగారంలో కొంత పచ్చిదనంతో కూడిన వలపూ, సైగా, కౌగిలి, యెడబాటు, మరుని విరిశరాలు వచ్చాయంటే అది జావళీయే అని అనుకుంటారు సామాన్యశ్రోతలు. కొందరు పండితులు కూడా, సరిగా వివక్షచేయకుండా పదాన్ని జావళీతోపాటు (Light Music) లలిత సంగీతంగా జమకట్టారు. నిజానికి పదానికీ జావళీకి ఉన్న సామ్యం అల్లా వాటిలోని రసం శృంగారం కావడం మాత్రమే. జావళీలో ఇతివృత్తం, సంఘటన (Flippant) తేలికగా ఉంటుంది. పదంలో గురువుగా బరువుగా వుంటుంది. జావళీ మధ్యమ ద్రుతకాలాలలో చిందులు తొక్కుతూ పాడడానికి అనువుగా ఉంటుంది పదం కూర్చునో, సగంలేచో, నుంచునో ముఖవిన్యాసాలతో హస్తవిన్యాసాలతో అభినయానికి అనువుగా బరువుగా, అడుగులకు చిందులు తొక్కే అవసరం చాలా తక్కువగా ఉంటూ సాగుతుంది. లలిత సంగీతం ప్రౌఢసంగీతం అనే విభజనలో జావళీ లలితమనీ, పదం ప్రౌఢమనీ చెప్పి తీరాలి. ఈ పదం అనే ప్రక్రియను విశిష్టమైన పరిపక్వతను పొందినది

క్షేత్రయ్య సాధనలోనే. అది 16వ శతాబ్ది చివరిపాదము. అందులో చివరి దశకంలో క్షేత్రయ్య జన్మించి ఉంటాడనుకుంటాను. గీతగోవింద కర్తయైన మహావాగ్గేయకారుడు జయదేవుడు వెలిసి అప్పటికప్పుడే 500 ఏళ్ళు కావచ్చింది. ఆతని గేయకావ్యం మన ఆంధ్రదేశంలో కూడా సంగీత సాహిత్యపరులకు అప్పటికి నూరేళ్ళకు ముందటి నుండి ప్రమాణ గ్రంధము అయినట్లు తెలుస్తోంది.

ఘనత మీరంగ జయదేవ కవివరేణ్యు
డందమైనట్టి గీతగోవింద మందు
అంచితాష్ట పదులు పల్కె; నట్ల పదము
పరగునెనిమిది పదములు పల్లవియును—

అని, అన్నమాచార్యులు (1408-1502) తన సంకీర్తన లక్షణంలో పేర్కొన్నాడు 13 వ శతాబ్దిలో కాకతిగణపతి చక్రవర్తి ఆస్థానంలో గజసాహిణిగా (గజ సైన్యాధ్యక్షుడుగా) మాత్రమే కాకుండా సంగీత నాట్యశాస్త్ర కోవిదుడుగా ప్రతిభాశాలిగా పేరుపడిన జాయపసేనాని నృత్తరత్నావళి, అనే నాట్యశాస్త్ర గ్రంథాన్నీ గీతరత్నావళి అనే సంగీతశాస్త్ర గ్రంథాన్నీ రచించాడు. ఇతడు జన్మించిన కృష్ణాజిల్లాలోని దివి సీమలోనిదే క్షేత్రయ్య జన్మించిన మువ్వ గ్రామం కూడాను. గణపతిదేవచక్రవర్తికి సమకాలికుడూ రాజకీయ ప్రతిస్పర్థి అయిన దేవగిరి యాదవరాజు సింఘణుడి కొలువులోని శార్ఙ్గదేవుడు 'సంగీత రత్నాకరం' అనే సంగీత లక్షణగ్రంథాన్ని రచించాడు. ఎందుచేతనో జాయప సేనాని గ్రంథాలు ఇప్పటికి 10,15 ఏళ్ళ క్రితం వరకూ దేశంలో బైటపడ లేదుకాని, శార్ఙ్గదేవుని రత్నాకరానికి మాత్రము క్షేత్రయ్య జన్మించేనాటికే (15 వ శతాబ్దిలోనే) మనదేశంలో రెండు ప్రసిద్ధ వ్యాఖ్యానాలు బైలుదేరాయి. అందులో ఒకటి రాచకొండ వెలమప్రభువైన సర్వజ్ఞ సింగభూపాలుని 'సంగీత సుధా,' మరొకటి విద్యానగర ప్రౌఢదేవరాజుల కొలువులోని చతురకల్లి నాథ పండితుడు వ్రాసిన 'కళానిధి'. శార్ఙ్గదేవుడు తన గ్రంథంలో ఆంధ్రి,

గౌడి, లాటి మొదలైన జాతులనబడే ప్రాచీన రాగాలకు మాత్రమే కాకుండా, రాగవివేకాధ్యాయంలో గౌడరాగభేదాలు, ఛోట, మాళవరాగ భేదాలు, టక్క, బాంగాలీ, వరాటికా రాగభేదాలు, సౌవీర, భైరవ, నట్ట, రామకృతి, తోడికా మొదలైన 100 రాగాలకు పైగా లక్షణం, రాగాంగ, ఉపాంగ, భాషాంగ క్రియాంగములుగా రాగవిభజనము వివరంగా చెప్పాడు. అంతేకాక, ఆంధ్రైలా కర్ణాటైలా, ద్రావిడైలా మొదలైన ఏలపాటల రీతులను, 100 కి పైగా దేశి గేయరీతులను ప్రబంధాధ్యాయంలో సలక్షణంగా వివరించాడు శార్ఙ్గదేవుడు.

15వ శతాబ్ది మొదటి దశకంలో జన్మించిన అన్నమాచార్యుడు సాహితీ పరులయిన దేశిగేయకారులలో ఆదికవి అనదగిన వాడు. సాహిత్యానికి ఆది కవియైన నన్నయభట్టు ఆంధ్రశబ్ద చింతామణి అనే వ్యాకరణాన్ని కూడా రచించినట్లు, అన్నమాచార్యుడు–సంకీర్తన లక్షణము అని సంస్కృతంలో ఒక లక్షణగ్రంథం రచించాడు. ఆయన సంకీర్తనాచార్యుడు, పదకవితా మార్గదర్శి అని పేరు పొందినవాడు. పదకర్తలలో మకుటాయమానుడైన క్షేత్రయ్య సంగీతమును గూర్చి వివరించేముందు అన్నమాచార్యుడు తన లక్ష్యలక్షణముల ద్వారా పదకవితా మార్గదర్శి ఎట్లయినాడో తెలిసికోవడం అప్రస్తుతం కాబోదు. ఈ ప్రశంసతోబాటు 'పదం' అనే సంగీత రచన పుట్టు పూర్వోత్తరాలు బయ ల్పడతాయి. అన్నమాచార్యుల సంకీర్తనలక్షణాన్ని సంస్కృతంనుంచి ఆయన మనుమడు చిన తిరుమలయ్య తెనిగించాడు. పదాన్ని గురించి ఆ సంకీర్తన లక్షణంలో అన్నమయ్యగా రేమన్నాడో వినండి "మహనీయంబగు సంకీర్తన నామక పద సంప్రదాయం బెట్టిదనిన——"

"రమణీయ సంగీత రత్నాకర ప్రబంధాధ్యాయమున ఉక్తమయ్యేపదము,
సముచిత సంగీత చంద్రికాదేశైశయందు మిక్కిలి తేటయయ్యేపదము,
అతులతత్వంవాదమైనట్టి సంగీత చూడామణికి పల్కుచోటు పదము,
ధన్య సంగీత సుధాకర గ్రంథంబునందు మిక్కిలి చెలువొందు పదము,

తానె యిన్నిటికిని మూలమైన భరత
మందు పంచదశాధ్యాయమందు విమల
వృత్తచూర్ణ నిబంధకవివిధానామ
భవ్యలక్షణములకు నాస్పదము పదము।''

అంటే, అన్నమాచార్యుల నాడేకాదు, భరతముని నాటినుండి (క్రీ. పూ. 4 వ శతాబ్ది।) పదము, సంకీర్తనా ఒకదాని కొకటి పర్యాయపదాలనీ, పదం అంటే పాట అనీ తేటపడుతోంది.

“పదము సంస్కృతమున ప్రాకృతమున దేశ
భాషనైన పొసగ పలుక వలయు;
ప్రాసములును యతులు పద్యభంగినె చెల్లు
అనిరి భరతదత్తి లాదిమునులు''

బంధురవృత్తపదంబు ని
బంధపదము చూర్ణపదము భరతాగమ సం
బంధంబున పదవిజ్ఞా
నాంధులకును తాళ్ళపాక అన్నయ తెలిపెన్

అందములై షడ్వింశ
చ్ఛందోగణ యుక్త వృత్త జాతుల పదముల్
కుందనమునకుం బరిమళ
మందిన క్రియవృత్త పదము లమరుచు నుండున్.

అన్నమాచార్యులకు ముందు సంస్కృత ప్రాకృతపదాలనే పండితులు గౌరవించే వారు దేశభాషలో కూడ పదాలు ఉండవచ్చునని, ఇతి వృత్తాన్ని బట్టీ పాత్రలనుబట్టీ పదాలలోని భాషలో గ్రామ్యోక్తులు, ఇతర భాషోక్తులు కూడా ఉండవచ్చని నిర్వచించాడు.

యతులుఁ బ్రాసములుఁ బదంబులును మాత్రానీకముల్ తాళ సం
గతులుఁ గల్గి నిబంధనామపద మాఖ్యాతార్థసంయుక్త, స
త్కృతియై తాళ్లపాక అన్నయ గురూక్తిఁ లోకవిఖ్యాతమై.......
(జితమాధ్వీక సితాసుధారస రుచిస్ఫీతంబు నై చెన్నగుఁ)

నిబంధ పదంలోని అవయవాలు :—

1. ఉద్గ్రాహము = ఎత్తుగడ పంక్తి (అరవంలో ఎడుప్పు)
2. మేళాపము = రెండూ కలిసి అనుపల్లవి రెండుపంక్తులు.
3. ధ్రువము = పల్లవి (రెండుపంక్తులు)
4. అంతరము = ఒకటవచరణము
5. ఆభోగము = రెండవ(తుది)చరణము. ఇందులో అంకితపుముద్ర

పదముల యర్థముఁ బల్లవి
వదలక అన్నిటికి నేకవాక్యత జేయఁ
గుదిగ్రుచ్చినట్లు తగులై
పదము తుదిని మరియు మరియు పల్లవి యలరుఁ.

పదసమానమాన పాదయుగ్మము తుది
నలరి పల్లవాఖ్య నతిశయిల్లు
అందులోన అర్థమైన శిఖాపద
మనిరి లక్షణజ్ఞులయిన మునులు.

చతుర్ధాతుక నిబంధపదం. (1. ఉద్గ్రా, 2 మేళా. 3. ధ్రు, 4 ఆభో.)

2 పంక్తుల అనుపల్లవి, పల్లవి-ఒకచరణం = ఆరుపంక్తుల పదం.

త్రిధాతుక (1. ఉద్గ్రా. 2. ధ్రు. 3. ఆభో) అనుపల్లవి ఒకపంక్తి పల్లవి రెండు, చరణం రెండుపంక్తులు. (ద్విధాతుక. ఏకధాతుకాలు.)

ఎనిమిది పాదముల పదము శరభపదము—ఇదే అష్టపది.

ము_క్తకంబు, కుళకంబు నాగదగి పద్య
జాతి పరగునట్లు జగతి నొకటి
దరువనంగ చెల్లదగు కుళకంబెల్ల
పదము నాగ అతులభంగి నలరు.

పరగుఁ వృ_త్తము జాతియంతయు చతుష్పాద ద్విపాదాకృతిఁ
వరసంకీ_ర్తనముల్ తదాకృతులనే వ_ర్తించు మానంబుతో
దరువుల్ జక్కు_ల రేకులేలలును నిద్దంబైన గొబ్బిళ్ళ భా
సురవాక్యంబులు చందమామ పదముల్ శోభిల్లు నందంబులై.

నిబంధపదములోని భాగాలను వివరించి, యక్షగాన దరువులు, జక్కు_లరేకులు, ఏలలు, గొబ్బిళ్ళు, చందమామపదాలు మొదలయిన దేశిగేయాలన్నీ నిబంధ పదాలుగా పరిగణించాలన్నాడు ఆ తర్వాత వీటిలోని భాషాప్రయోగం ఎలా ఉండాలో చెపుతున్నాడు.

పదములు శృంగార వధూ
మృదు మధుర మనోజ్ఞ వాక్యమిశ్రములైనఁ
విదితార్థ గ్రామ్యో_క్తులు
పదిలముగా పొంకమెరిగి పలుకగజెల్లుఁ.

పురుషో_క్తి సంస్కృతంబును
తరుణీ వాక్యమున ప్రాకృతము నీచవధూ
పరిభాష నితరభాషలు
పరగిన క్రియ నుచితభాష పదముల జెల్లుఁ.

వల్లవనారీ మ్లేచ్ఛా
ద్యుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యములైనను
హల్లీసక ముఖ్యానాటకాధిక పణితిన్.

ఇంతవరకు చెప్పిన విషయాలనుబట్టి, క్షేత్రయ్యపదములు అని మనం వ్యవహరించే పదాలు అవతరించేనాటికి పదం అనే శబ్దానికి అర్థం-అన్నమాచార్యులనాటి అర్థం కాదని తేలుతున్నది. అన్నమాచార్యులనాడు ప్రతీపాటా పదమే—శృంగార పదములు, వైరాగ్యపదములు అన్నాడాయన. వాటికే శృంగార సంకీర్తనలు వైరాగ్య సంకీర్తనలు అనికూడా వ్యవహారం ఉండేది. అన్నమాచార్యులనాటి పురందరదాసు కీర్తనలకు పదగళు-పదాలు అనే వాడుక ఇప్పటికీ ఉంది క్షేత్రయ్యకు ఇంచుమించు సమకాలికుడైన భద్రాచలరామదాసు గానం చేసిన భక్తిరసపూర్వకమైన పాటలను రామదాసుకీర్తన లంటున్నాము. రామదాసు పదాలనము — క్షేత్రయ్య కీర్తనలనము క్షేత్రయ్య పదాలంటాము. ఈ కాలంలోనే శృంగారరసంగల పాటలకు పదాలనీ, భక్తివైరాగ్యాలుండేపాటలు కీర్తనలూ సంకీర్తనలూఅనీ వ్యవహరించడం ఆరంభమైంది. క్షేత్రయ్యకు సుమారు 50 ఏళ్ళు పూర్వికుడైన ఒక మహావాగ్గేయకారుడు ఇదే కృష్ణాజిల్లా, దివిసీమకు చెందినవాడే ఆయన స్వామి శివనారాయణతీర్థయతి. ఆయన కృష్ణలీలా తరంగిణి ఒక మహాయక్షగానం. క్షేత్రయ్య బాల్యంనాటికి ఆ తరంగాలు కృష్ణానదీ తీరంలో, ఆలయ మంటపాలలో భక్తజనసంకీర్తన గోష్ఠులలో మారుమ్రోగుతూ ఉండి ఉండాలి. అన్నమాచార్యుల పదాలతో పాటు, సిద్ధేంద్రుని యక్షగాన దరువులతో సహా, నారాయణతీర్థుల తరంగాలను కూడా క్షేత్రయ్య బాల్యంనాడు దేవదాసీ లోకప్రక్కా కూచిపూడివా రింకొకప్రక్కా నృత్యగానాభినయముల ద్వారా ప్రచారంచేస్తూ ఉండక తప్పదు. నారాయణ తీర్థులూ, కొందరు కూచిపూడి భాగవతకుటుంబాలవారూ, దక్షిణాదికి వెళ్ళిపోయింది క్షేత్రయ్య, పసివాడుగా ఉండినప్పుడే-అని ఊహించవచ్చును అచ్యుతప్ప నాయకుడు తంజావూరు ఏలుతూండగా మనభాగవతులు మేలటూరు

అరణం పుచ్చుకొన్నారు. ఆయన కుమారుడైన రఘునాథనాయకుని కొలువు క్షేత్రయ్య సుమారు 25 ఏళ్ళ వయస్సులో ఉండగా దర్శించాడు ఏ కూచిపూడి అయ్యవారి యొద్దనో కావ్యనాటకాలంకారాదులను ఏ కొన్నాళ్ళ పాటో శుశ్రూషచేసిన క్షేత్రయ్యలో నిబిడీకృతమై ఉండిన వాగ్గేయకారాంశ పైకి పొంగడానికి కారణములు ఉద్బోధకములు అయిన విశిష్టకళా ప్రదర్శనము లేవై ఉంటాయో మీ ఊహకు అందజేయడానికే - క్షేత్రయ్యసంగీతమనే నా ప్రసంగానికి ఇంత పూర్వరంగం ప్రదర్శించవలసి వచ్చింది.

17వ శతాబ్దిలో నారాయణతీర్థులు, రామదాసు, క్షేత్రయ్య ఈ ముగ్గురి చేతులలోను మన సంగీతము మూడుమార్గములను తొక్కినది నారాయణ తీర్థుల కృషిలో సంకీర్తనము ప్రధానముగా ఆధ్యాత్మికబోధను ఆదర్శముగా ఉంచుకొని, శృంగారమును ఔపచారికము చేసికొని, ఒకప్రక్క నాట్యాభినయ యుక్తములైన యక్షగానములకు ఉపాంగమౌతూ ఇంకొకపక్క భజనపద్ధతి ప్రాచుర్యానికి దారితీసింది. రామదాసు కీర్తనలు భక్తిరస పరమావధినిపొంది, పామరజనం కూడ భక్తిమార్గాన సాధనచేయదాని కనువైన భజనగోష్ఠుల వ్యాప్తికి కారణమైనాయి. క్షేత్రయ్య మార్గము శృంగారమును ప్రధానముగా స్వీకరించి, అధ్యాత్మబోద అంతర్గర్భితముగా సాగుతూ నాట్యమునకు అభినయమునకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది. క్షేత్రయ్య మిగిలినవారి కంటె ఒక అడుగు ముందువేసినది ధాతుకల్పనములో—అంటే సంగీత రచనలో! ఇది తరువాతి వాగ్గేయకారుల కెందరికో క్షేత్రయ్యను మార్గదర్శిని చేసింది. నేటి కర్ణాటక సంగీతపు రాగాల స్పష్టస్వరూపం కావలెనంటే మనకు తొట్టతొలుతగా క్షేత్రయ్య పదాలలో దొరుకుతాయి.

ఆయనకు పూర్వ వాగ్గేయకారుల రచనలతో, పోల్చి చూసినప్పుడు క్షేత్రయ్య పదాలలో ప్రత్యేకంగా కనబడే ఒక లక్షణాన్ని ముందు వివరిస్తాను ఇది ధాతుమాతు సమన్వయానికి సంబంధించిన లక్షణం ధాతువు అంటే సంగీతాత్మకమైన నాదబంధం (melodic structure) మాతువు అంటే సాహిత్యాత్మకమైన శబ్దబంధం జయదేవుని అష్టపది ఒకటి తీసికొందాం.

లలిత లవంగలతా పరిశీలన కోమల మలయ సమీరే –
మదుకర నికర కరంచిత కోకిల కూజిత కుంజకుటీరే,
విరహతి హరిరిహ సరసవసంతే
నృత్యతి యువతిజనేన సమంసఖి విరహిజనస్య దురంతే".

ఇందులో శబ్దబంధం ఏ గురులఘువుల క్రమంలో సాగిందో నాదబంధంకూడా సరిగ్గా అదే గురులఘువుల క్రమంలో సాగేటట్లు పాడేపద్ధతిని మాతుప్రధాన గానపద్ధతి అనుకొందాము (లేక సాహిత్యప్రధాన గానపద్ధతి) మాత్రల గుణకభాగహారముల ద్వారా ఒకతాళంలోని పాటను తాళగతులు మార్చి పాడడం నాట్యకళాకారులకు అనుభవైకవేద్యము అప్పుడు గురులఘువుల స్వభావాలు కొద్దిగా మారతాయి అప్పుడది ధాతుప్రధానమవుతుంది. మాతుప్రధానగేయాలు పాటరానివారు చదువుకునే టప్పుడు కూడా వాటిలో లయ స్పష్టంగా తెలుస్తుంది ధాతుప్రధానమైన గేయాలు నాదబంధం లేకుండా చదువుకొంటే వాటిలోని లయ స్పష్టంగా గోచరింపదు. యతిప్రాస నియమాలూ, యమకాలూ, అనుప్రాసలూగల వచన కవితలలాగా ఉంటాయి. అన్నమాచార్యుల గేయాలలో ఈ రెండువిధాల పద్ధతులూ కనిపిస్తాంటాయి తీర్థులవారి తరంగాలలోనూ అంతే క్షేత్రయ్య పదాలలో లయ స్పష్టంగా కనబడే మాతుప్రధాన గేయాలు చాలా తక్కువ. ధాతుప్రధాన గేయాలే ఎక్కువ. మచ్చుకి సాహిత్యలయ కనబడే, గేయాలు రెండుమూడు వినండి.

1. ఎటువంటి మోహమో కాని ఓ యెలనాగ
యింతంత యనగరాదే
మటుమాయ దైవమా మనసు తెలియగలేక
మనలనెడబాపెనయ్యో – ఓ మగువ॥

కలికి నిన్నెడబాసి నదిమొదలు నీరూపు కనుల కట్టినట్లుండునె
(చదువుకోడానికి లయ సళ్ళిపోయింది)
చెలియ నేనొకటి తలచెదనన్న నీనేయు చెలిమి తలపై యుండునె.

2 గడియ గడియకు మనవి కలదటవె కొమ్మా
పడతిరో నామనోభావమెరిగిన దొరకు॥
కలనైన కలవరింతలనైన తననామములెగాని
వేరొకటి తలచదని తెలిసి
కలకాలమును నన్ను గారవించిన విభుడు
తలిరుబోణిరొ తానె దయజూడవలెగాక

3. ఈమేను జీవునకు నెంతప్రియమాయె॥
భామ మామువ్వగోపాలు కౌగిట లేని ॥ఈమేను॥

పడతి నేనొకచోట ప్రాణేశు డొకచోట
ఎడబాసి మరునిచే ఇడుమలకులోనై
కడలేని విరహాగ్ని క్రాగియున్నదిచాల
పుడమిలో వేరెజన్మములేదె సుదతి॥

4. మగువ తన కేళీకామందిరము వెడలె-
వగకాడ మా కంచి వరద తెల్లవారె ననుచు ?

విడజారు గొజ్జంగి విరిదండ జడతోను
కడుచిక్కుబడి పెనగు కంటసరితోను
నిడుద కన్నులదేరు నిదుర మబ్బులతోను
తొడరి పదయుగమున - తడబడెడు నడతోను॥

ఇప్పుడు చదివిన ఈ నాలుగు పదాలలోను, ఒకటి రెండుచోట్ల తప్ప అంతటా పద్యంలోలాగ లయ స్పష్టంగా కనబడుతూ వుంటుంది లయ స్పష్టత సడలినచోట్లు-

1. కలికి నిన్నెడబాసినది మొదలు నీరూపు కనులకట్టి నట్లుండునె

2 వగకాడ మా కంచి వరద తెల్లవారె ననుచు.

ఈనాలుగు పదాలూ కాకమిగిలిన క్షేత్రయ్య పదాలలో ఏదితీసుకొన్నా దానిలోని లయ పద్యంలోలాగ స్పష్టంగా ఉండక–గద్యంలోలాగా సాగుతూ వుంటుంది. యతిప్రాసలూ, యమకాలూ, అనుప్రాసలూ వీటి సహాయంతో ప్రతిపదానికి నాదబంధంలో లయ ఎలా సాగుతుందో ఊహించవచ్చు

ధాతుప్రధాన గేయాలు ధాతుప్రధానమైన అంటే సంగీత ప్రధానమైన గేయరచన ఈలాగే ఉంటుంది. ఈలాగే ఉండాలి. అంటే ఇందులోని మాతువు అనగా సాహిత్యం అప్రధానమని కాదు. ఆ సాహిత్యపు తునకల ద్వారాను వాటి నడుమనూ సాగే రాగబంధపు చేరికతోనే ఆ గేయం పరిపూర్ణ మన్నమాట. అన్నమాచార్యులు సంకీర్తన లక్షణంలో నిర్వచించిన నిబంధ పదాలకు దృష్టాంతాలు అన్నమాచార్యుల పదాలూ క్షేత్రయ్య పదాలూనూ, జయదేవుని అష్టపదులలోని ధాతుమాతు సమాన ప్రాధాన్య మునుబట్టి అవి వృత్తపదాలకు సన్నిహితములని భావించ వచ్చును

గిడుగు సీతాపతిగారు ఇంతకుముందు గేయంలోని ధాతుమాతు ప్రాధాన్యమును గూర్చి చెప్పిన విషయమునే ఒకవ్యాసంలో ఇలా వివరించారు·

"పాటల రచనకున్ను పద్యాల రచనకున్ను భేదమేమి? పాట చదివి చూచినా, పద్యము రాగముతో మాత్రమేకాక తాళము పాటిస్తూ పాడిచూచినా రెంటినిగల భేదము కొంతవరకు స్పష్టము కాగలదు మాటల వర్ణక్రమము ననుసరించి పద్యాలు వ్రాసి చదువుకొంటాము అదే పాడినప్పుడు లఘువు గురువుగా పొడిగిస్తాము. గురువు లఘువుగా కుదిస్తాము ఈ పని . ... త్యాగరాజువంటి మహావాగ్గేయకారుల రచనలలో కూడా చేయక తప్పదు"

"గణములు నిండుగాగల సాహిత్యరచన పాటలకు ప్రతిబంధకము కూడా అవుతుంది చరణమంతా సాహిత్యముతో నిండియుంటే రాగాలాపానికి అవకాశము తక్కువగుతుంది. ఈ రాగాలాపానికి తగిన అవకాశము చరణ పాదాలలోను అంతకంటె ఎక్కువగా పల్లవిలోను కావలెను కనుకనే పల్లవి లోని సాహిత్యము సాధారణముగా తక్కువగా ఉంటుంది" ..

సుమారు 380 క్షేత్రయ్య పదాలలో 140 త్రిపుటతాళంలోను 118 ఆది తాళంలోను, 59 చాపులోను, 24 అటతాళం, 22 జంపె, 13 రూపకం, 2 మఠ్య, 1 మిశ్ర, 1 ఏక తాళంలోను నడిచాయి

ముందుపదం అని క్షేత్రయ్య కాలంనుంచీ స్థిరపడిపోయిన గేయరచన ప్రధానంగా అభినయాని కోసమనీ, ఇందులో అడుగుల చిందుకు అవకాశము తక్కువనీ, లయ చూపడానికి ముంగాలితోనో పాదాల కదలిక లలో లేచేటప్పుడు కూర్చుండే టప్పుడూ తగుమాత్రంగా గజ్జెలమ్రోత ఉంటుందని సూచించాను అన్ని తాళాలలోను త్రిపుట, ఆది, చాపు, ఈ విధ మైన ప్రదర్శనకు ఎక్కువ అనువైనవి అందుకే త్రిపుటలో ఎక్కువ పదా లున్నాయి

రసవంతమైన సంగీత నాటకంలో అత్యంత రసశిఖరాలను అందిచ్చే నాటకీయ సంఘటనలు ఇతివృత్తముగా ఆ నాటక నాయికా నాయకులు దూతి కాదులు, ససంగీతముగా సనాట్యముగా పలికే నాటక సంభాషణలే - ఈ పదాలు అని మనం గుర్తుంచుకోవాలి

మాటలలోని భావాలకు అనుగుణమైన రాగవిన్యాసమూ రాగస్వరూ పాన్ని పరిపూర్ణంగా స్ఫురింపజేసే మాటలకూర్పూ క్షేత్రయ్యకు అలవడినట్లు వేరే వాగ్గేయకారునకూ అలవడి ఉండలేదంటే అతిశయోక్తి కాబోదు రాగము లందు భావోద్రేకం కలిగింపగల, స్వరవిన్యాసాలు తెలిసిన ప్రౌఢుడూ, అనుభవశాలీ, కనుక దానికి తగిన సాహిత్యం అప్రయత్నంగా రాగభావంలోని ఆవేశంతో కలిసి తీగలుసాగి పూవులు పూచింది. ఆయా రసభావాల తీవ్రతల లోని వ్యత్యాసాలు, ఆ వ్యత్యాసాలకు అనుసరించిన రాగవైవిధ్య ప్రయోగ

సాధించిన పదములనే అపూర్వ కళాఖండములతోను మమైక్యమును అద్వైత సిద్ధినిగాంచిన మనీషి క్షేత్రయ్య ఒకవిలక్షణుడైన మహాపురుషుడు ఆయనకివే నా జోహారులు

క్షేత్రయ్య జీవితవిశేషాలు, ఆయనకృషి తెలిసికోవాలంటే మనకు సంగీతాత్మకములైన ఆయన పదాల ద్వారానే ఊహించుకోవలసి వస్తున్నది ఆయన తన పదాలలో అక్షరుడై పోయినాడు, ఆ పదాలతో మమైక్యము చెందాడు

కేవల భక్తివైరాగ్యాల ద్వారానే కైవల్యమును సాధించిన ముముక్షువులు మనదేశ చరిత్రలో అరుదుకాదు కాని, కేవల శృంగారమార్గంద్వారానే మువ్వగోపాలుని, తన అమూల్య పదకుసుమాలతో అర్చించి, అక్షరములైన తన పదాలతోను, తాను జీవితంలో ప్రేమించిన నాయికతోను, భక్తిపూర్వకముగా తాను కొలిచిన దేవునితోను మమైక్యమును, అద్వైతసిద్ధిని పొందిన క్షేత్రయ్య ఒక విలక్షణుఁడైన మహాపురుషుడు ' ఆయన కివే నా జోహారులు

ఎంతధన్య మయ్యోనొగదయ్యా క్షేత్రయ్యా '
అంతటి మువ్వగోపాలు డాత్మేశ్వరుడైన జన్మ॥ ॥ఎంత॥
చెంతచేరి నీ తంబుర చేతమోసి నీపాటకు
వంత పాడుచుండగానె అంతలోనె తీరుజన్మ॥ ॥ఎంత॥
బ్రదుకులోన పాటలోన కొదలులేని యనుభవమ్ము
కదిసిప్తాడు నీ పదాల నెదుట నాలకించుజన్మ॥ ॥ఎంత॥
ఆగరాని యమృతధార నీగళగంగోత్రిజార
రాగభావలయలకు సరితూగ నభినయించు జన్మ॥ ॥ఎంత॥
వలచి నిన్ను వలగొనంగ గలుగు భాగ్యరాశినోచు
పొలయల్కల కలిగియు వెన్నెలలో నిను కలియుజన్మ॥ ॥ఎంత॥

---

శ్రీ

# సాహిత్యోపన్యాసములు

ఠ

## స్వర్గీయ గిడుగు రామమూర్తి పంతులు

[29 ఆగష్టు 1963 నాడు హైదరాబాదు నగరములో జరిగిన ఉపన్యాసాలు]

ప్రచురణ

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి

ఆబిడ్ రోడ్డు

హైదరాబాదు

శ్రీ

# సాహిత్యోపన్యాసములు

## స్వర్గీయ గిడుగు రామమూర్తి పంతులు

[ 29 ఆగష్టు 1963 నాడు హైదరాబాదు నగరములో జరిగిన ఉపన్యాసాలు ]




ప్రచురణ:

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి

తిలక్ రోడ్డు :: హైదరాబాదు

# వి ష య సూ చి క:

# కళాప్రపూర్ణ
# గిడుగు వెంకటరామమూర్తి పంతులు
## (జీవితచరిత్ర; వారు రచించిన గ్రంథములు)

శాఖోపశాఖలుగా వృద్ధిపొందియున్న గిడుగు వంశమునందు ఇప్పుడు సజీవులయి ఉన్నవారిలో నేనే వయస్సునుబట్టి పెద్దవాడను గనుక, రావు సాహెబు కళాప్రపూర్ణాది బిరుదాంకితులయిన గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి కుమారులలో నేనే జ్యేష్ఠుడను గనుకను, వారి ఆంధ్రసాహిత్య విద్యావ్యాసంగములందు అనుచరుడుగాను, సహాయుడుగాను పాల్గొన్నవాడను గనుకను వారి జీవితచరిత్ర గూర్చిన్ని, వారు రచించిన గ్రంథములను గూర్చిన్ని నాకు తెలిసినంత విపులముగా ఇతరులకు తెలియడానికి అవకాశము తక్కువ గనుకను మిత్రులకోరిక ననుసరించి మా తండ్రిగారి జీవితచరిత్రను గూర్చిన్ని, వారి గ్రంథములను గూర్చిన్ని నేను వ్రాస్తున్నాను ఇందులో మా తండ్రిగారు స్వయముగా నాకు తెలియజేసిన అంశములున్ను, నాకు ప్రాజ్ఞత వచ్చిన తర్వాత నేను స్వయముగా తెలిసికొన్న విషయములున్ను, మా తండ్రిగారికి సమకాలికులయిన వారి మిత్రులు తెలియజెప్పిన విశేషములున్ను సంప్రతించి వ్రాస్తున్నాను.

మా పూర్వులు ఎప్పటివారో ఎక్కడివారో ఏ యే ప్రాంతములందు నివాసములు మార్చుకొంటూ వచ్చినవారో తెలిసికొనుటకు ఆధారములు లేవు. కాని ఏడుతరములనుండి తూర్పు గోదావరిజిల్లా అమలాపురము తాలూకా ఇందుపల్లి గ్రామములో గిడుగువారు భూవసతులుగలిగి ఉన్నవారని చెప్పుటకు ఆధారములు గలవు అక్కడి కొబ్బరితోటలు, నివేశనస్థలము కొద్దిగా మా అనుభవములో ఉండేవి. ఇటీవలనే పదునెనిమిది సంవత్సరముల క్రిందట అమ్మివేసినాము మాకు తెలిసిన పూర్వులలో మొదటివాడు గిడుగు నూకరాజు

గారు వీరు నా తాతగారి తాతగారి తాతగారు బహుశా క్రీ శ 1700 నాటివారు కావచ్చును. వీరి కుమారుడు జోగిరాజు ఇతనికి ఏడుగురు కుమారులు. వీరు పదేసి ఎకరముల చొప్పున డెబ్బది ఎకరముల కొబ్బరితోటలున్ను పంచుకొన్నారు వీరిలో మూడవవాడు అంతర్వేది; ఇతని ఏకైక పుత్రుడు సుబ్బయ్య. ఈ సుబ్బయ్యకు ముగ్గురు పుత్రులు — వెంకయ్య, వీరరాజు, మాణిక్యము. వీరిలో వీరరాజుగారి ఏకైకపుత్రులే మా తండ్రిగారు. వెంకయ్యగారి పెద్ద మనుమని పేరుకూడా వేంకటరామమూర్తే, ఇతడు నాకంటె సుమారు ఒక సంవత్సరము పెద్ద, 1884 లో పుట్టి 1943 లో స్వర్గస్థుడైనాడు 1907 లో నాతో ఎల్. టి. ట్రెయినింగ్ అయినవాడు, డెప్యూటీ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సుగా పనిచేసి 1940 లో రిటైరయినాడు. పైని చెప్పిన జోగిరాజుగారి ఏడుగురు కొడుకులలోను ముగ్గురి వంశములు రెండవ తరములోనే నిస్సంతయునది. మొదటి కుమారుని వంశమువారే ఇందుపల్లి గ్రామ కరణాలుగా ఉంటున్నారు అతని మనుమని మనుమలలో నాలుగవ వాడైన శ్రీరామమూర్తి ఇప్పుడు అనంతపురం జిల్లా కదిరిలో ఇండియాస్టేట్ బ్యాంకు ఏజెంటుగా పనిచేస్తున్నాడు. జోగిరాజుగారి రెండవ కుమారుని మనుమని మనుమలయిన వారిలో గిడుగు సూర్యనారాయణ, వెంకటరత్నము అమలాపురములో ఎడ్వకేట్లుగా ఉన్నారు. గిడుగు వంశమువారు నేటికి సుమారిన్నూరుగురు కనబడుతున్నారు

గోదావరీ నదికి ఆనకట్టకట్టి కాలువల ఏర్పాటు చేయకమునుపు అనగా 1830 కి పూర్వము వర్షములు తక్కువయిన సంవత్సరములలో కోనసీమ వారికి క్షామబాధ దుర్భరముగా ఉండేది మా తాతగారు వీరరాజుగారు కొంత వఱకు తెలుగు సాహిత్య మలవఱచుకొన్నారు వారు చదువుకొన్న వసుచరిత్ర-గుజిలీ ప్రతి నేనుకూడా చూచినాను. 1914 లో ఒకరు మా తండ్రిగారిని అడిగి తీసికొని వెళ్ళి మరి ఇవ్వలేదు; "పరహస్తం గతం గతమ్" అయినది. వీరరాజుగారికి కడుకొద్దిగా ఆంగ్లభాషకూడా అలవడినది అందుచేత జీవనోపాధికి ఏదో ఒక ఉద్యోగము చేయవలెనన్న సంకల్పము గలిగి ఇందుపల్లి

విడిచి విశాఖపట్టణము చేరుకొన్నారు అక్కడ కొత్తగా ఏర్పడ్డ కలెక్టరు కచ్చేరీలో ఏదైన నొక ఉద్యోగము సంపాదించుటకు ప్రయత్నించారు కాని, లభించలేదు అయినా వీరి ఉద్యోగప్రయత్నము నిష్ఫలము కాలేదు. మా ఆరువేల నియోగకుటుంబముల వారిలో కొందరు కాదంబరివారు, ఎఱ్ఱమిల్లి వారు, గొడవర్తివారు, మొదలయినవారు ఉద్యోగాలలో ఉండేవారు వారిలో కొందరు వీరిని ఆదరించి విజయనగర సంస్థానములో సముద్దారుపనిలో ప్రవేశింపజేశారు సముద్దారు అనగా రెవిన్యూ ఇన్స్పెక్టరు అన్నమాట జీతము నెలకు ముప్పది రూపాయలే అయినా ఆ కాలములో ఉద్యోగానికి హోదా, రూపాయకు విలువ ఎక్కువగానే ఉండేవి. 1860 నుండి 1875 వరకును వీరు విజయనగరము సంస్థానమువారి ఉత్తరమండలము సముద్దారుండవలసిన రాణాలో పర్వతాలపేట అనే అగ్రహారమం దుండేవారు ఈ అగ్రహారము శ్రీకాకుళమునకు ఉత్తరమున ఇరువదిమైళ్ళ దూరాన వంశధారానదీ తీరమున ఉన్నది. ఆ నదికి ఆవలి ఒడ్డున ఉన్నగ్రామమునకు నగరికటకము అనిపేరు. అది ప్రాచీన ముఖలింగ నగరమునకు కటకము అనగా రాజసైనికుల నివాసము. ఆ కాలమందే ఇటీవల జయపుర సంస్థానాధీశులయిన విక్రమదేవవర్మ గారి తండ్రిగారు ఆ నగరి కటకములో నివసిస్తూ ఉండేవారు. అది వారికి నిర్బంధముగా ఏర్పడిన ప్రవాసము వారు జయపురాధీశుల వంశములోనివారే; మొదట జయపురములోనే ఉండేవారు అప్పుడు జయపుర సంస్థానాధీశు లయినవారు తమపై వీరు కుట్ర పన్నుతున్నారని బ్రిటిషు ప్రభుత్వము వారికి అభియోగము తెలియజేసినందున వీరిని నగరి కటకములో నుండవలసి నదిగా విశాఖపట్టణము జిల్లాకలెక్టరు ఆజ్ఞాపించుటవల్ల అక్కడ ఉండవలసి వచ్చినది ఆ కలెక్టరుగారే వీరి చర్యలు కనిపెట్టి తమకు తెలియజేస్తూ ఉండ వలసినదని మా తాతగారిని కోరినారు ఆ విధముగా విక్రమదేవు తండ్రిగారికిని మా తాతగారికిని పరస్పర పరిచయము మైత్రి ఏర్పడినవి

మా తాతగారికి 1856 కు పూర్వమే వివాహమైనది వారి భార్యపేరు వెంకమ్మ; పోడూరి సీతాపతిగారి కూతురు. 1863 లో మా తండ్రిగారున్ను

1866 లో మా పెద్దమేనత్త, 1872 లో మా చిన్నమేనత్త పర్వతాలపేటలోనే జన్మించారు. 1867 లో విక్రమదేవవర్మగారు నగరికటకములో జన్మించారు. అందుచేత మా తండ్రిగారున్ను విక్రమదేవవర్మగారున్ను బాల్యమిత్రులై పర్వతాలపేటలోను నగరికటకములోను కలిసిమెలసి ఆడుకొంటూ ఉండేవారు. వారిమైత్రి వారి ఆమరణాంతము స్థిరముగా నిలచినది. భాషావాదములో వారు గ్రాంధికభాషా వాదులున్ను వీరు వ్యావహారిక భాషావాదులున్ను అయి వాదములు తీవ్రముగా జరుపుకొన్నా వారి పరస్పర మైత్రి చెడలేదు. 1874 లో మాతండ్రిగారి ఉపనయనమున్ను మా పెద్దమేనత్త వివాహమున్ను విజయనగరములో జరిగినవి. ఉపనయనము అయిన దినమునుండి 15 దినములు మధుకర న్యాయముననుసరించి నాలుగయిదిండ్లు తిరిగి భోజన పదార్థములు భిక్షగా జోలిలో వేసికొని మా తండ్రిగారు భోజనము చేయవలసినదిగా మా తాతగారు సంప్రదాయ ధర్మముగా కట్టడిచేసినారట ! అప్పటినుండిన్ని మా తండ్రిగారు యధావిధిగా సంధ్యావందనము చేస్తూ వచ్చినారు. వారికి వారి ఐదవ సంవత్సరము ఐదవ మాసము ఐదవ దినమున అక్షరాభ్యాసము జరిగినది. వారణాసి గున్నయ్య అనే యువకుడు వీరికి గురువుగా నియమితుడయి చదువు, వ్రాత, చిన్నచిన్న లెక్కలు నేర్పినవాడు. ఇతడు 1917 లో పర్లాకిమిడికి వచ్చినప్పుడు మా యింటికి కూడా వచ్చి మా తండ్రిగారిని చూడడము జరిగినది "వీరే నాకు అక్షరాభ్యాసముచేసి చదువు చెప్పిన మొదటి గురువు" అని మా తండ్రిగారు నాకు వారి పరిచయము కలిగించారు. అప్పటికి వారు అరువదియైదేండ్లు దాటిన వృద్ధు అప్పుడు వారికి పంచలచాపు అయిదురూపాయలు దక్షిణ మా తండ్రిగారిచ్చి నమస్కరించడము నాకు జ్ఞప్తి యున్నది. బాల్యములో మా తండ్రిగారికి మా నాయనమ్మా మా తాతగారూ రామాయణ భాగవత భారత కథలు చెప్తూ ఉండేవారు. నగరికటకములో వీధిభాగోతాలు, తోలుబొమ్మలాటలు మొదలయిన వేడుకలు జరుగుతూ ఉండేవి అప్పుడు మా తండ్రిగారు అక్కడికి వెళ్ళి చూస్తూ ఉండేవారు. ఒకొక్కప్పుడు అక్కడే విక్రమవర్మదేవుగారి శయ్య ప్రక్కనే రాత్రులందు పడుకొంటూ ఉండేవారు.

1875 లో మా తాతగారిని విశాఖపట్టణం జిల్లా చోడవరమునకు బదలాయించడము జరిగినది. అప్పుడు మా తాతగారి కుటుంబము పర్వతాల పేట విడిచిపెట్టవలసి వచ్చినది కాని, చోడవరములో మా తాతగారు కాపురము పెట్టలేదు, కుటుంబాన్ని విజయనగరములోనే ఉంచివేసి తామొక్కరే చోడవరములో ఉండేవారు వారయినా అక్కడ కొద్ది మాసాలే ఉండిరి. ఏదో విషజ్వరము వచ్చి 1875 లోనే వారు స్వర్గస్థులయినారు అప్పటికి మా తండ్రి గారికి 12 సంవత్సరములు వయస్సు, తెలుగులో నలోపాఖ్యానము, వామన చరిత్రము, గజేంద్రమోక్షమున్ను; సంస్కృతములో శబ్దమంజరి, బాలరామా యణమున్ను, లెక్కలలో త్రైరాశికము, బజారు లెక్కలున్ను మాత్రమే వారు నేర్చుకొన్నారు, ఆంగ్లభాష అభ్యసించుట కింకా మొదలు పెట్టలేదు. విజయ నగరములో మా బంధువులే కాళ్ళకూరివారి కుటుంబముండేది కాళ్ళకూరి విశ్వనాథముగారు (అనగా 1940 వరకున్నూ మద్రాసులో పచ్చైప్ప కళా శాలలో రసాయనశాస్త్ర ఆచార్యులుగా పనిచేసిన సూర్యనారాయణ తండ్రిగారు) మా తండ్రిగారికి తమ ఇంటి వద్దనే ఆంగ్లభాష బోధించినారు. ఆ మరుసటి సంవత్సరము గురుజాడ అప్పారావుగారితోపాటు విజయనగరము మహారాజా వారి కళాశాలలో లోవర్ ఫోర్తు తరగతిలో ప్రవేశించినారు. బడిలో కట్టవల సిన నెల జీతము ఒకరూపాయిన్నర మాత్రమే అయినా అది కట్టడానికి మా నాయనమ్మ కష్టపడేది 1879 లో మా తండ్రిగారున్ను గురుజాడ అప్పారావు గారున్ను మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణులయినారు. అప్పారావుగారి ఆర్థిక పరిస్థితులు కాస్త నయముగా ఉండడముచేత, వారు కాలేజీ చదువులు సాగింప గలిగినారు వీరికి ఆ అదృష్టము లేకపోయినది.

మా తాతగారు చనిపోయిన తర్వాత మా నాయనమ్మ కష్టపడి తన ముగ్గురు పిల్లలను పోషిస్తూ జీవించవలసి వచ్చినది. ఆమె తన ఆభరణములను ఒక్కొక్కటి అమ్ముతూ అయిదేండ్లు కాలక్షేపము చేసినది. అందుచేత మా తండ్రిగారు మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణులయిన తర్వాత ఏదో ఉద్యోగ ములో, ప్రవేశించవలసి వచ్చినది. ఆ కాలములోనే వారికి 1879 లో

వివాహము జరిగినది. మా తల్లి కందికొండ రామదాసు పంతులుగారి రెండవ కూతురు. ఆ రామదాసుగారు భీమునిపట్టణములో ఉండేవారు. వారి జీవిత చరిత్ర కూడా చాలా అద్భుతమయినది. 1850 లో గోదావరీ తీరము కొవ్వూరి నుండి జీవనోపాధి కోసము భీమునిపట్టణము వచ్చి నెలకు నాలుగు రూపాయల జీతముపైని ఒక ఓడ వర్తకుని వద్ద గుమాస్తాగా పనిచేస్తూ నాలుగుగైదు సంవత్సరములలో ఓడ వాణిజ్య వ్యాపారములో వంతుదారుడై సుమారు ఇరువదివేల రూపాయ లార్జించి మేడ కట్టుకొని పెద్ద హోదాతో ముప్పది యేండ్లు జీవనము గడపి వ్యాపారములో నష్టము వచ్చుట వలన దివాలా తీసి 1888 నాటికి స్వర్గస్థులైనారు. వారు సజీవులయి ఉన్న కాలములోనే 1885 లో నేను వారింటనే జన్మించినాను. నా జాతకచక్రము వారే స్వయముగా వ్రాసినారు. వారు దివాలాతీసినా అక్కడి పెద్దల తోడ్పాటు వలన వారి మేడా 1500 రూపాయలు దక్కినవి. దానితో వారి కుటుంబము జీవించవలసి వచ్చినది. అది సరిపోయేది కాదు. అందుచేత 1894 నుండి 1900 వఱకున్ను నా మేనమామలిద్దరు, వారి తల్లీ నాయనమ్మా ఈ నలుగురున్ను పర్లాకిమిడిలో మా యింట కాలక్షేపము చేయవలసి వచ్చినది. ఆ కాలములో మా నాయనగారి నెల జీతము నూరు రూపాయలకు తక్కువగానే ఉండేది. అయినా వారు ఈ భారము ఓర్మితో వహిస్తూ ఉండేవారు.

1880 లో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయిన తర్వాత ఉద్యోగము కోసము మా తండ్రిగారు కొద్దిగా కష్టపడవలసి వచ్చినది విశాఖపట్టణము వెళ్ళి కలెక్టరు కచ్చేరీలో ఒక ఉద్యోగము (గుమాస్తాపని) దొరికినది గాని అది ప్రొబేషను పని, నెలకు 15 రూపాయలు వేతనము అది వారికి నచ్చలేదు. బడిపంతులు పని అయితే నెలకు ముప్పది రూపాయలు దొరక వచ్చును గనుక దానికోసము ప్రయత్నించారు. రెండు చోట్ల ఖాళీలుండెను. ఒకటి విజయనగరమునకు దగ్గరగా నున్న కోనాడ అనే గ్రామములో మిడిల్ స్కూలునందు ఫస్టుఫార్మ్ ఉపాధ్యాయుని పని; నెల జీతము ఇరువది రూపాయలు; రెండవది పర్లాకిమిడి జిల్లా హైస్కూలులో ఫస్టుఫార్మ్ ఉపాధ్యాయుని

పని, నెల జీతము 35 రూపాయలు. కోనాడ సముద్రతీరమున నున్నది. ఆరోగ్యప్రదమయిన స్థలము. పర్లాకిమిడి కొండలనడుమ నున్నది, మలేరియా జ్వరాలకు పేరుపడ్డది మా నాయనమ్మ కోనాడలోని ఉద్యోగమే చేయవలెనని పట్టుపట్టినది అయిదు రూపాయలు ఎక్కువ దొరుకును గనుకను, అక్కడ ప్రైవేటు ట్యూషన్లు దొరకవచ్చును గనుకను మా తండ్రిగారికి పర్లాకిమిడి ఉద్యోగమే నచ్చినది. అందుచేత, వీరు తమ తల్లికి కోపము వచ్చినా లెక్క సేయక పర్లాకిమిడి ఉద్యోగమే నిశ్చయించినారు. అప్పటికింకా మా తల్లి కాపురానికి రాలేదు; కనుక వారితో వారి తల్లీ ఇంకా కాపురానికి వెళ్ళని రెండవ చెల్లెలు మాత్రమే ఉండేవారు ఆ కాలములో మా తండ్రిగారి పినతల్లి కుమారుడు వసంతాడ సుబ్బారావు అనే ఆయన రెండు మూడు సంవత్సరాలు వారివద్దనే ఉండి చదువుకొని స్వగ్రామమునకు వెడలిపోయి తుని రాజావారి ఎస్టేటులో కచ్చేరీ గుమాస్తాగా ప్రవేశించాడు.

మా తండ్రిగారు 1882 లో ఎఫ్. ఏ. పరీక్షకున్ను, 1884లో ఇంగ్లీషు, సంస్కృత భాగముల బి ఏ. పరీక్షకున్నూ ప్రైవేటు కాండిడేటుగానే విజయనగరము వెళ్ళి ఉత్తీర్ణులయినారు 1884 లోనే మా తల్లి కాపురమునకు వచ్చినది. 1885 జనవరి నెల 28 వ తేదీని నేను మా మాతామహుల ఇంట జన్మించినాను. 1886 లో బి ఏ మూడవ భాగము (చరిత్ర) పరీక్షకు వెళ్ళవలెనని వారు సంకల్పించారు కాని కొన్నికారణాలవల్ల ఆ ప్రయత్నము సాగలేదు. 1882 లో వీరు ఎఫ్ ఏ కాగానే వీరికి మూడవ ఫార్మ్ ఉపాధ్యాయ పని దొరికినది. 1884 లో బి. ఏ ఇంగ్లీషు సంస్కృత భాగముల పరీక్షలో ఉత్తీర్ణులు కాగానే నాల్గవ ఫార్మ్ ఉపాధ్యాయుని పని వీరికి దొరికినది. పాఠాలుచెప్పే బాధ్యత ఎక్కువయినది 5 వ, 6 వ ఫార్మ్‌లకు ఇండియాదేశ చరిత్ర, ఆంగ్లదేశ చరిత్ర చెప్పవలసి వచ్చినది. బి. ఏ చరిత్ర భాగ పరీక్షకు ఇవి తోడ్పడ గలదే కాని, ఆ పరీక్షకు కావలసిన అర్ధశాస్త్రము, రాజనీతి శాస్త్రము వీరికి చెప్పగలవారు ఎవరూ కనబడలేదు. విజయనగరములో ఈ చరిత్ర భాగము కాలేజీలో పెట్టలేదు కనుక, అక్కడనైనా ఎవరూ వీరికి చెప్ప

గలవారు లేకుండిరి; స్వయంకృషి మీదనే వీరు ఆధారపడవలసి వచ్చినది. అదిగాక మెట్రిక్యులేషనుకు చరిత్ర చెప్పే యోగ్యత కలిగినది. నెల జీతము 65 రూపాయలు బి ఏ పూర్తిగా అయినా అంతకంటె అక్కడ ఎక్కువ లభించేది ఏమీ లేదు కనుక దాని యెడల అభిలాష అంతగా లేకపోయినది. అంతేగాక, 1890-1909 లో వీరు అనేక సాంస్కృతిక విషయములకు సంబంధించిన కృషిలో నిమగ్నులయి యుండేవారు.

1. ఆ దినములలో కందుకూరి వీరేశలింగము పంతులుగారి సంఘ సంస్కార ప్రచారము తెలుగుదేశ మందంతటను సాగుతూఉండేది అందుకు కావలసిన శిక్షణము వారివద్ద పొందిన ప్రచారకులు తెలుగు జిల్లాలలోగల పెద్ద పట్టణములకు పోయి సభలు జరిపించుకొని ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవారు పర్లాకిమిడికి వస్తూ ఉండిన ప్రచారకులకు వీరున్నూ అక్కడి హైస్కూలులో రెండవ ఉపాధ్యాయుడుగా ఉండిన శిమనపల్లి రామయ్య పంతులుగారున్ను తోడుపడుతూ ఉండేవారు. అక్కడి సనాతుల ఆక్షేపణలకు సమాధానము చెప్పే బాధ్యత మా తండ్రిగారు వహించి ధర్మశాస్త్ర గ్రంధములు-సంస్కృతములో ఉన్నవే చదువుతూ ఉండేవారు. పండితులతో వాదములు జరుపుతూ ఉండేవారు. ఆ రోజులలో అక్కడ రీడింగ్‌రూమ్ అనేపేర నొక సమాజ ముండేది. దానికి మాతండ్రిగారు—1908 లో నేను కార్యదర్శి అయినవఱకున్ను-కార్యదర్శిగా ఉండేవారు. ఆసమాజములోని సభ్యులు వార్తాపత్రికలు చదువుటయే కాక ప్రతినెలలోను సభలు ఏర్పరచి తగిన వారిచే ఉపన్యాసము లిప్పిస్తూ ఉండేవారు. వారిలో మా తండ్రిగారే ఎక్కువ శ్రద్ధతీసికొని పనిచేస్తూ ఉండేవారు. 1895 లో సర్ ఆర్ వేంకటరత్నమునాయడుగారువచ్చి బ్రహ్మసమాజమును గూర్చిన్ని, సంఘ సంస్కారమును గూర్చిన్ని అక్కడి విద్యాలయములో ఉపన్యాసము లిచ్చినప్పుడు ఆ విద్యాలయమునకు ప్రధానోపాధ్యాయులుగా ఉండిన మంగు శ్రీనివాసరావుగారు అధ్యక్షులయినా మా తండ్రిగారే నాయడు గారిని సభాసదులకు పరిచయము చేయడమున్ను, ఉపన్యాసములయిన తర్వాత వారిని అభినందించి కృతజ్ఞతాభివందనము లర్పించడము జరిగినది. నాయడు

గారి ఉపన్యాసములు నాకు బోధపడక పోయినా వారి ఉపన్యాసధోరణి నా కిప్పటికిని స్మృతి పథములో ఉన్నది.

2. పర్లాకిమిడి తాలూకాలోను అంతకంటె ఎక్కువగా పర్లాకిమిడికి ఉత్తరమునగల ఎత్తైన కొండలలోను సవర (శబర) జాతి ఆదివాసులున్నారు. వారి భాష, జీవితము, ఆచార వ్యవహారములు మా తండ్రిగారిని ఎక్కువగా ఆకర్షించినవి. అవి అన్నీ తెలిసికోవలెనన్న కోరిక వీరికి పుట్టినది. అందుచేత వారి భాష నేర్చుకొనుటకు పూనుకొన్నారు. అందుకు తగిన ఆధారములేవీ అచ్చులో లేవు. సవర భాష, ఒరియా తెలుగు భాషలు తెలిసిన ఒక పానోను మునిషీగా పెట్టుకొని సవరభాష నేర్చుకొంటూ ఉండేవారు. 1894 సరికి వీరికి కొంత భాష అలవడినది. 1894 లో జరిగిన ఒక సంఘటనవల్ల వీరి కృషిలో జరిగిన పెద్ద లోపమొకటి వీరికి గోచరించినది. పర్లాకిమిడిలో నాడేకాదు నేడున్ను ప్రతి శనివారమున్ను ఉత్తరపు పొలిమేర ఒక సంత కూడుతూ ఉంటుంది. అక్కడ ఆహారమునకు కావలసిన వస్తువులు, కుండలు, గాజులు, పూసలు, సూదులు, అద్దాలు మొదలయిన వస్తువులు అమ్ముతూ ఉంటారు. ఆనాడు కొండలమీద నున్న సవరలు, వంటచెరకు కట్టెలు, కొండచీపురులు, కందులు, పసపు, కంద దుంపలు, ఇప్ప పువ్వు, తేనె మొదలయిన కొండ దినుసు వస్తువులు తెచ్చి పర్లాకిమిడిలో అమ్మి, ఆ సంతలో తమకు కావలసిన వస్తువులు, ముఖ్యముగా కొండల మీద దొరకని ఉప్పు, ముతక నూలుబట్టలు, కంచుకంచాలు, పాత్రలు మొదలయినవి కొని తమ కొండ గ్రామాలకు వెళ్తూ ఉంటారు. అట్టి సవరలు ఇద్దరు ఒక శనివారము నాడు పానోసవర గురువు మా తండ్రిగారికి సవరభాష చెప్తూ ఉండే సమయములో మా యింటికి కట్టెలు, కొండ చీపురులు పట్టుకొని వచ్చారు. అవి మేము కొని డబ్బులిచ్చిన తర్వాత, మా తండ్రిగారి కోరికను మన్నించి వారు కొంతసేపు వీరివద్ద కూర్చున్నారు. అప్పుడు వీరు ఆ సవరలతో సవరభాష మాటలాడుటకు సాహసించినప్పుడు వీరి సవరభాషకు ఆ సవర లిద్దరు మాటమాటకు నవ్వుతూ వచ్చారు వారిద్దరిలోను ఒకడికి కాస్త తెలుగు, కాస్త ఒరియా తెలుసును.

గలవారు లేకుండిరి, స్వయంకృషి మీదనే వీరు ఆధారపడవలసి వచ్చినది. అదిగాక మెట్రిక్యులేషనుకు చరిత్ర చెప్పే యోగ్యత కలిగినది. నెల జీతము 65 రూపాయలు. బి. ఏ పూర్తిగా అయినా అంతకంటె అక్కడ ఎక్కువ లభించేది ఏమీ లేదు. కనుక దాని యెడల అభిలాష అంతగా లేకపోయినది. అంతేగాక, 1890-1909 లో వీరు అనేక సాంస్కృతిక విషయములకు సంబంధించిన కృషిలో నిమగ్నులయి యుండేవారు.

1. ఆ దినములలో కందుకూరి వీరేశలింగము పంతులుగారి సంఘ సంస్కార ప్రచారము తెలుగుదేశ మందంతటను సాగుతూఉండేది అందుకు కావలసిన శిక్షణము వారివద్ద పొందిన ప్రచారకులు తెలుగు జిల్లాలలోగల పెద్ద పట్టణములకు పోయి సభలు జరిపించుకొని ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవారు పర్లాకిమిడికి వస్తూ ఉండిన ప్రచారకులకు వీరున్నూ అక్కడి హైస్కూలులో రెండవ ఉపాధ్యాయుడుగా ఉండిన శిమనపల్లి రామయ్య పంతులుగారున్ను తోడుపడుతూ ఉండేవారు. అక్కడి సనాతుల ఆక్షేపణలకు సమాధానము చెప్పే బాధ్యత మా తండ్రిగారు వహించి ధర్మశాస్త్ర గ్రంధములు-సంస్కృతములో ఉన్నవే చదువుతూ ఉండేవారు. పండితులతో వాదములు జరుపుతూ ఉండేవారు. ఆ రోజులలో అక్కడ రీడింగ్‌రూమ్ అనేపేర నొక సమాజ ముండేది. దానికి మాతండ్రిగారు—1908 లో నేను కార్యదర్శి అయినవఱకున్ను-కార్యదర్శిగా ఉండేవారు. ఆసమాజములోని సభ్యులు వార్తాపత్రికలు చదువుటయే కాక ప్రతినెలలోను సభలు ఏర్పరచి తగిన వారిచే ఉపన్యాసము లిప్పిస్తూ ఉండేవారు. వారిలో మా తండ్రిగారే ఎక్కువ శ్రద్ధతీసికొని పనిచేస్తూ ఉండేవారు. 1895 లో సర్ ఆర్ వేంకటరత్నమునాయడుగారువచ్చి బ్రహ్మసమాజమును గూర్చిన్ని, సంఘ సంస్కారమును గూర్చిన్ని అక్కడి విద్యాలయములో ఉపన్యాసము లిచ్చినప్పుడు ఆ విద్యాలయమునకు ప్రధానోపాధ్యాయులుగా ఉండిన మంగు శ్రీనివాసరావుగారు అధ్యక్షులయినా మా తండ్రిగారే నాయడు గారిని సభాసదులకు పరిచయము చేయడమున్ను, ఉపన్యాసములయిన తర్వాత వారిని అభినందించి కృతజ్ఞతాభివందనము లర్పించడము జరిగినది. నాయడు

గారి ఉపన్యాసములు నాకు బోధపడక పోయినా వారి ఉపన్యాసధోరణి నా కిప్పటికిని స్మృతి పథములో ఉన్నది.

2. పర్లాకిమిడి తాలూకాలోను అంతకంటె ఎక్కువగా పర్లాకిమిడికి ఉత్తరమునగల ఎత్తైన కొండలలోను సవర (శబర) జాతి ఆదివాసులున్నారు. వారి భాష, జీవితము, ఆచార వ్యవహారములు మా తండ్రిగారిని ఎక్కువగా ఆకర్షించినవి. అవి అన్నీ తెలిసికోవలెనన్న కోరిక వీరికి పుట్టినది. అందుచేత వారి భాష నేర్చుకొనుటకు పూనుకొన్నారు. అందుకు తగిన ఆధారములేవీ అచ్చులో లేవు. సవర భాష, ఒరియా తెలుగు భాషలు తెలిసిన ఒక పానోను మునిషీగా పెట్టుకొని సవరభాష నేర్చుకొంటూ ఉండేవారు. 1894 సరికి వీరికి కొంత భాష అలవడినది. 1894 లో జరిగిన ఒక సంఘటనవల్ల వీరి కృషిలో జరిగిన పెద్ద లోపమొకటి వీరికి గోచరించినది. పర్లాకిమిడిలో నాడేకాదు నేడున్ను ప్రతి శనివారమున్ను ఉత్తరపు పొలిమేర ఒక సంత కూడుతూ ఉంటుంది. అక్కడ ఆహారమునకు కావలసిన వస్తువులు, కుండలు, గాజులు, పూసలు, సూదులు, అద్దాలు మొదలయిన వస్తువులు అమ్ముతూ ఉంటారు. ఆనాడు కొండలమీద నున్న సవరలు, వంటచెరకు కట్టెలు, కొండచీపురులు, కందులు, పసపు, కంద దుంపలు, ఇప్ప పువ్వు, తేనె మొదలయిన కొండ దినుసు వస్తువులు తెచ్చి పర్లాకిమిడిలో అమ్మి, ఆ సంతలో తమకు కావలసిన వస్తువులు, ముఖ్యముగా కొండల మీద దొరకని ఉప్పు, ముతక నూలుబట్టలు, కంచుకంచాలు, పాత్రలు మొదలయినవి కొని తమ కొండ గ్రామాలకు వెళ్తూ ఉంటారు. అట్టి సవరలు ఇద్దరు ఒక శనివారము నాడు పానోసవర గురువు మా తండ్రిగారికి సవరభాష చెప్తూ ఉండే సమయములో మా యింటికి కట్టెలు, కొండ చీపురులు పట్టుకొని వచ్చారు. అవి మేము కొని డబ్బులిచ్చిన తర్వాత, మా తండ్రిగారి కోరికను మన్నించి వారు కొంతసేపు వీరివద్ద కూర్చున్నారు. అప్పుడు వీరు ఆ సవరలతో సవరభాష మాటలాడుటకు సాహసించినప్పుడు వీరి సవరభాషకు ఆ సవర లిద్దరు మాటమాటకు నవ్వుతూ వచ్చారు వారిద్దరిలోను ఒకడికి కాస్త తెలుగు, కాస్త ఒరియా తెలుసును.

ఛీ! ఛీ! ఇవి అసలయిన సవరమాటలు కావు' కాపు సవర (అనగా తెలుగు కలిసిన పదాలు) ఒరియా సవర పదాలు కలిసిన భాష అని పరిహసించారు అప్పుడు మా తండ్రిగారికి భాషల విషయములో నూతన ప్రబోధము కలిగినది భాషకు సాంకర్యము, మాండలిక భేదాలు తప్పవన్న విషయము తెలిసినది తాము మూడు సంవత్సరములై (దినమున కొక్కగంట చొప్పున) నేర్చుకొంటూ ఉండిన సవరభాష, సాంకర్యముగల భాష అన్న విషయము తెలియగానే తమ పరిశ్రమ వృథా అయినట్టుగా భావించి చాలా బాధ పడ్డారు. ఆ పానో గురువు వద్ద చదువు చాలించారు మరికొన్ని కారణములవల్ల కూడా ఈ కృషి ఆగిపోయినది.

3 ఈ కాలములోనే వీరొకసారి 1893 లో పర్లాకిమిడికి ఇరువది మైళ్ళ దూరమున ఉన్న ముఖలింగమునకు వెళ్ళుట సంభవించినది. దానికి చేరువగానే ఉన్న నగరి కటకమునకు దానికి ఎదురుగా వంశధారానదికి ఆవల నున్న పర్వతాల పేటకు వెళ్ళి ఆ పేటలో తాము పుట్టిన గృహము సందర్శించి తమ చిన్ననాటి ముచ్చటలు జ్ఞప్తికి తెచ్చుకొన్నారు. ముఖలింగములోనున్న దేవాలయముల రాతిగోడలపై గల 740-1040 నాటి ప్రాచీన లిపి వీరిని ఆకర్షించినది. అప్పటి కింకా ప్రాచీన లిపి చదువగల తెలుగువారుగాని, ఆ లిపిని గూర్చి గ్రంథాలుగాని తమకు కనబడకపోవుటవల్ల ఆ లిపి ఎట్లు తెలిసికోగలమా ? అన్న చింత పట్టుకొన్నది. కొన్నాళ్ళు ఈ విషయమును గూర్చి తెలిసికొనుటకు ప్రయత్నించగా ఇండియన్ ఆంటిక్వరీ ఎపిగ్రాఫియా ఇండికా అనే జర్నలు గ్రంథాలున్నూ పాలియోగ్రఫీ ఎపిగ్రఫీ అనే గ్రంథాలు ఒకటి రెండుగలవనిన్ని వీరికి తెలిసినది. కాని, అవి తెప్పించుకొనుటకు వీరికి ఆర్థిక సమర్థత లేదాయెను; ఎట్లు తెప్పించుకోగలరు ? అదృష్టవశమున వీరు పర్లాకిమిడీ రాజావారి తమ్మునికి 1892 లో ట్యూటరుగా పనిచేసినందున ఆ చిన్న రాజుగారి ఆదరము కలిగినది. అందువల్ల వీరికి కావలసిన గ్రంథములు వారు తెప్పించి తమ గ్రంథాలయములో పెట్టుకొన్నా వీరి ఉపయోగమున కిచ్చినారు. ఆ గ్రంథములలో 800-1040 నాటి శాసనములు కొన్ని కనబడినవి. వాటిలో

కొన్ని దేవనాగరి లిపిలోను, కొన్ని ఇంగ్లీషు లిపిలోను పరివర్తనము పొందినవి. వాటిని ఆధారముగా పెట్టుకొని ప్రాచీన లిపి కొంత అలవరచుకొని మరల మరియొకసారి ముఖలింగమునకు పోయి అక్కడ గోడలపైనున్న శాసనములు చదువుట ప్రారంభించి "ముఖలింగ ప్రాచీన చరిత్ర విశేషములను గూర్చి (Antiquities of Mukhalingam) అనే పేర ఇంగ్లీషులో ఒక వ్యాసము రచించి మద్రాసు క్రిస్టియన్ లిటరేచర్ సొసయిటీ వారి జర్నలుకు పంపించారు. అది 1894 లో అందు ముద్రితమయినది. ఆ వ్యాసములో వీరు కొత్తగా తెలియజేసిన విషయము ఏమంటే ద్వితీయ కామార్ణవుని కాలము నుండి అనంతవర్మ చోడగంగ కాలమువరకున్ను (అనగా 800-1100 లో) మధ్య కళింగదేశమును పరిపాలించిన తూర్పు గాంగవంశపు రాజులకు ముఖలింగము రాజధాని నగరముగా ఉండేదనిన్ని, ఆ నగరమునకు దక్షిణపు సరిహద్దున నగరి కటకము అను పేరను సైనికుల నివాసముండేదనిన్ని, కళింగ పట్టణము ఈ రాజ్యమునకు రేవుపట్టణమే కాని కొందరనుకొంటూ ఉండినట్లు రాజధానినగరము కాదనిన్ని తెలియజేసినారు. వీరి నిరూపణము యుక్తియుక్తముగా ఉన్నదని ప్రసిద్ధులైన చరిత్ర నిర్మాతలు తమ అభిప్రాయము తెలియజేసినారు ఈ వ్యాసము వ్రాయుటకు పూర్వమే వజ్రహస్తుని తామ్ర శాసనము ప్రకటించినప్పుడు ఈ ముఖలింగ నగరము మధ్య కళింగ రాజ్యమునకు రాజధానినగరమన్న విషయము తెలియజేస్తూ ఎపిగ్రాఫియా ఇండికా నాలుగవ సంపుటమందు తమ వ్యాసములో తెలియజేసినారు. దీని ప్రమాణమును సూచిస్తూ విన్సెంట్ స్మిత్ తన హిందూదేశ చరిత్రలో ఈ విషయము తెలియజేసినాడు మరి ముప్పది సంవత్సరముల తర్వాత అనంతవర్మ చోడగంగ దాన శాసనములు రెండు నేను భారతిలో ప్రకటించినాను. వాటిలో పెద్ద శాసనములోని వాక్య ప్రమాణమును బట్టి మరియొక క్రొత్త విషయము నేను ప్రకటించినాను. ఈ గంగవంశ రాజులు ఆ ముఖలింగ నగరము, దేవాలయములు కట్టకమునుపు సవరలు (శబరులు) ఆ ప్రాంతమందు ఎక్కువగా నివసిస్తూ ఉండేవారనిన్ని, రాజ్యము కూడా చేస్తూ ఉండేవారనిన్ని 720 లో

శబరాదిత్యుడనే సవరరాజును కామార్ణవుడనే గంగవంశపు రాజు యుద్ధములో ఓడించి ఆ రాజ్యమును సంపాదించి దంతాపురమనే (దంత లేక దంతవక్త్రుని కోట - శ్రీకాకుళము తాలూకాలోనున్నదే) ప్రదేశమున రాజధానినగరముగా రాజ్యమేలెననిన్నీ ఆ తర్వాత ముఖలింగమునకు రాజధాని మార్చుకొనుట జరిగినదనిన్నీ తెలియజేసినాను. అది చూచి మా తండ్రిగారు చాలా ఆనందించారు. వీరి ప్రోత్సాహముతోనే నేనే కాక చిలుకూరి నారాయణరావు, మండా నరసింగరావు, భావరాజు కృష్ణారావు, రాళ్ళబండి సుబ్బారావు మొదలయిన వారు ప్రాచీన లిపి చదువుట అలవరచుకొని శాసనములు ప్రకటిస్తూ వచ్చిరి. అందరికంటెను ఎక్కువగా శాసనములు చదివి వ్యాసములు రచించినవారు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. ఈ విద్యలో వీరికి ఎక్కువగా ప్రోత్సాహము కలిగించిన వారిలో మొదటి వారు కొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావుగార్లు. 1900 కు పూర్వము మన తెలుగువారిలో ప్రాచీన లిపిలో ఉండిన శాసనములు చదువగల సమర్థత మా తండ్రిగారికిన్నీ, గురుజాడ అప్పారావు గారికిని, జయంతి రామయ్య పంతులుగారికిన్నీ మాత్రమే ఉండేది వీరికి ఇతర వ్యాపకములు బాధ్యతలు ఉండుటవలన ఈ పని ఎక్కువగా సాగించలేదు వీరిలో గురుజాడ అప్పారావుగారు రెండు చిన్న శాసనములు మాత్రమే చదివి ఎపిగ్రాఫియా ఇండికాలో వ్యాసములు ప్రకటించారు. ఆ తర్వాత ఈ పని యెడల వారికి విసువుపుట్టినది శాసనము పూర్తిగా చదివి వ్యాసము వ్రాయుటకు వెచ్చించిన కాలములో ఒక చక్కని గేయమో, కథో, నవలో, నాటకమో రచించవచ్చుననే వారు. కాని చరిత్ర పరిశోధనము వారి కిష్టమయిన విషయమే. శాసనముల వలన తేలిన విషయములను ఆధారముగా పెట్టుకొని కళింగచరిత్ర వ్రాయవలెనన్న అభిలాష ఎక్కువగా ఉండేది. 1908 నుండిన్నీ వ్యావహారిక భాషా వాదమునకు సంబంధించిన కృషి చేయవలసి వచ్చుటచేత ఆంధ్ర సాహిత్యగ్రంథములు, వ్యాకరణములు,భాషాతత్వ గ్రంథములు చదువుటలో నిమగ్నులయి ఉండుటవల్ల మా తండ్రిగారికి ఇతర విషయముల పరిశోధన సాగించుట కవకాశము లేకపోయినది; తమశిష్యులు ఈ శాసనముల

పని సాగిస్తూ ఉంటే ఆనందించేవారు 1909 నుండి నేనున్ను, 1914 నుండి (బి.ఏ. పూర్తిచేసి ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించిన) చిలుకూరి నారాయణరావున్ను వీరి కృషికి సహాయులుగా ఉండి వీరు నియమించిన పని చేస్తూ ఉండేవారము వీరు చిన్నచిన్న కాగితముల మీద చిందర వందరగా భాషకు సంబంధించిన విషయములు వ్రాసి పెట్టుకొని నా మీద పడవేసేవారు అవి అన్నీ జాగ్రత్తగా చదివి వారు తెలియజేసిన క్రమములో ఏర్పరచి సాఫు వ్రాయడం నా పని. అది వారు చూచి సవరించిన తర్వాత మరియొక ప్రతి సాఫుగా వ్రాస్తూ ఉండేవాడను.

4. 1908 లో నేను బి. ఎల్. టి. అయి పర్లాకిమిడి కాలేజీలో హైస్కూలు భాగమందు ఉపాధ్యాయుడుగా పనిలో ప్రవేశించేసరికి ఇంగ్లీషు భాష ప్రారంభదశలో ఉన్నవారికినేర్పే పద్ధతులు క్రొత్తగా (Direct method of Teaching foreign languages) తెలియజేసే గ్రంథములు ప్రకటితము లయినవి అది నేను 1907 లో ఎల్. టీ. పరీక్షకు పాఠ్యగ్రంథములుగా చదువుచున్నాను ఆ గ్రంథములు మా తండ్రిగారు కూడా చదివినారు ఆ నూతన పద్ధతుల ననుసరించి మా పర్లాకిమిడి విద్యాలయములో ఇంగ్లీషు భాష పిల్లలకు నేర్పించవలెనన్న కోరిక పుట్టినది అప్పుడు వారు ఆ కాలేజీలో ఎఫ్ ఏ తరగతికి చరిత్రాధ్యాపకులుగా ఉండేవారు. నేను 5-వ ఫారముకు మెట్రిక్యులేషను తరగతికి చరిత్రబోధకుడుగా నియమితుడనైనాను అప్పుడు ఆ కాలేజీ ప్రిన్సిపల్‌గా నుండిన మంగు శ్రీనివాసరావుగారికి ఈ నూతన పద్ధతుల వలన కలిగేమేలు నచ్చజెప్పి ఇంగ్లీషు నేర్చుకొనే మొదటి తరగతికి ఈ నూతన పద్ధతుల ప్రకారము బోధించే బాధ్యత నాకు అప్పగింపజేసినారు నా పని మా తండ్రిగారి పర్యవేక్షణములో జరిగే ఏర్పాటుకూడా జరిగినది. ఈ నూతన పద్ధతులలో ముఖ్యమైన అంశములు రెండు. తెలుగుమాటలు దొర్లించకుండా తెలుగులోనికి అనువాదము చేయకుండా ప్రారంభమునుండిన్ని చిన్నచిన్న ఇంగ్లీషు వాక్యములు అలవర్చడము, అభినయముతోనే అర్థమయ్యేటట్టు ఇంగ్లీషు పదములు, వాక్యములు బోధించడము; రెండవది

ఇంగ్లీషు పదములను మామూలు ఇంగ్లీషు స్పెలింగ్‌తో కాక ఫొనెటిక్ లిపిలో చదివించడము వ్రాయించడమున్ను ఈ పద్ధతివలన టంగ్, మెషీన్, ప్లౌ, రోగ్ మొదలయిన మాటలు స్పెలింగ్ చిక్కులేకుండా బోధించుట సాధ్యమయినది. తొమ్మిది మాసములలో రెండువేల ఆంగ్ల పదములు ఈ శిక్షణము పొందిన బాలవిద్యార్థులకు బోధపడినవి-కేవలము అర్థము చేసికొనుటకే కాదు. తాము స్వతంత్రించి ప్రయోగించుటకు కూడా సాధ్యమైనవి ఆ సంవత్సరమే కడపటి మాసములో యూనివర్సిటి కమీషన్ సభ్యులు మా కాలేజీకి రావడము జరిగినది అప్పుడా సభ్యులు నేను బోధిస్తూ ఉండిన తరగతికి కూడ వచ్చి ఈ కొత్త పద్ధతులు తెలిసికొని విద్యార్థులు నేర్చుకొన్న పదముల పట్టిక చూచి ఆశ్చర్యపడి ఈ పదములన్ని విద్యార్థులు ఎట్లునేర్చుకొని ప్రయోగింపగలరో తెలిసికోగోరినారు. ఈ మాటలు ప్రయోగిస్తూ మీరేదైనా ఒక కథగాని, ఒక నూతన విషయముగాని ఇంగ్లీషున చెప్పండి అది మా విద్యార్థులు మరల తెలుగులోగాని ఆంగ్లభాషలోగాని-ఎందులో చెప్పవలసినదని కోరినా అనువదించగల రన్నాను ఈ మాటలే వాడుకచేస్తూ చెప్పవలసిన దంటే మాకు పరీక్షగా ఉంటుంది కనుక నీవేచెప్పు ఏదైన ఒక కొత్తకద అన్నారు సరే కథపేరు చెప్పండి నేనే చెప్తానన్నాను. మైడస్‌రాజు తాకినదెల్లా బంగారమైపోయేకథ ఇదివరకు చెప్పకుండా ఉంటే ఇప్పుడు చెప్పు ఇంగ్లీషులో వారికి వచ్చినమాటలతో అన్నారు ఇరవది వాక్యములలో చెప్పినాను ఏవో రెండు మూడుమాటలు వారికి తెలియనివి ప్రయోగించవలసి వచ్చినప్పుడు మాత్రము వాటిని బోధించినాను. చెప్పినంతసేపున్ను అభినయముచేస్తూ వచ్చినాను సంతోషము, దుఃఖము మొదలయినభావములు స్వరభేదములతో సూచించినాను ఇద్దరు పిల్లలు తెలుగులోను, ఇద్దరు పిల్లలు ఇంగ్లీషులోను కథ మరల చెప్పగలిగినారు. ఆ సమయమున కాలేజీ ప్రిన్సిపాలు, ఇంగ్లీషు లెక్చరరుగా ఉండిన ఆర్గిల్ దొర, మా తండ్రిగారు, యూనివర్సిటీ కమీషను సభ్యులు బాఖా మొదలయిన వారున్ను ఆ గదిలో ఉండిరి ఈ నూతన పద్ధతిని అందరూ హర్షించారు దాని విషయము అంతా ఆ సభ్యులకు మాతండ్రిగారు సంగ్రహించి తెలియజేసినారు.

5 1909 నుండి 1920 వరకున్ను వీరు వ్యావహారిక భాషావాదము సాగించుటకు కావలసిన కృషిలో నిమగ్నులై యుండిరి అది తలపని తలంపుగా సంభవించినది 1906 లో జె ఏ యెట్సుదొర అంతకు పూర్వము పచ్చైయప్ప కాలేజీకి ప్రిన్సిపలుగా ఉండిన వాడు. గంజాం, విశాఖపట్టణము, గోదావరి జిల్లాలకు విద్యాధికారిగా నియమితుడైనాడు విశాఖపట్టణములో అతని కచ్చేరిస్థానము నెలకొల్పబడినది తెలుగు జిల్లాలలో పనిచేయవలెను గదా అని తెలుగు నేర్చుకొనుటకు మొదలుపెట్టి లాంగ్-మన్స్ తెలుగువాచకములు చదువుటకు ప్రారంభించాడు అంతేకాక బైసికిల్ ఎక్కిన్ని, కాలినడకను వీధులలోను తిరుగుతూ వచ్చీరానీ తెలుగులో కొందరితో ప్రసంగిస్తూ ఉండేవాడు అతడు పుస్తకాలలోఉండే కావ్యభాషను మాటలాడుతూ ఉంటే విన్నవారు నవ్వుతూ వ్యావహారిక భాషలో మాటలాడుతూ ఉండేవారు అతనికి ఇదంతా విచిత్రముగా కనబడేది అతనికి తెలుగుచెప్తూ ఉండిన మున్షీమాత్రము కావ్యభాషలోనే ప్రసంగిస్తూ వీధిలో అతడు విన్నభాష గ్రామ్యమనిన్ని, పుస్తకములలోని భాష సలక్షణమైనదనిన్ని తెలియబరవాడు ఆ సంవత్సరమే విశాఖపట్టణము కాలేజీవెళ్ళి మెట్రిక్యులేషన్ తరగతి విద్యార్థులకు తెలుగు పద్యపాఠ్య గ్రంథము పండితుడు బోధిస్తూ ఉన్నసమయములో, ఆ గదికివెళ్ళి చూచాడు స్కూలు తెరచి రెండుమాసములయినా ఆ గ్రంథములో మొదటి పుటలోని కడపటి పద్యమే పండితుడు బోధిస్తూ ఉండెను అందుకు కారణమేమని అతడు ప్రశ్నించాడు గ్రంథము కావ్యబాషలో సంస్కృత సమాసములతో ఉన్నదనిన్ని, పదవిభాగం, ప్రతిపదార్థము, అన్వయము, తాత్పర్యము, అందులోగల శబ్దాలంకారములు, అర్థాలంకారములు మొదలయిన వన్నీ చెప్పడానికి సుమారు గంటపడుతుం దనిన్నీ, ఆ పండితుడు తెలియజేసినాడు ఇంగ్లీషులో గోల్డ్‌స్మిత్ రచించిన ట్రావెలర్ (బాటసారి) అనే పద్యకావ్యమందు గంటకు సుమారు ముప్పది నలుబది పంక్తులు ఈ తరగతి విద్యార్థులకే బోధిస్తాము అది పరభాష, ఇది మాతృబాష, నాలుగు చరణములుగల ఒక పద్యము మాత్రమేనా మీరు ఒక గంటకు బోధింపగలది, చిత్రముగా

ఉన్నదే అని ఆశ్చర్యపడి కాలేజీ ప్రిన్సిపల్‌తో ప్రసంగించి అందుకుగల కారణము తెలిసికో గోరినాడు. పీ టీ. శ్రీనివాస అయ్యంగారు అప్పుడు ప్రిన్సిపలుగా ఉండేవారు వారేదో కొద్దిగా తెలియజేసి "నేను తమిళుడను; మీరు ఈ మాసములోనే విజయనగరము వెళ్తున్నారు కనుక అక్కడ గురుజాడ అప్పారావుగారిని, పర్లాకిమిడి వెళ్తున్నారు కనక అక్కడ గిడుగురామమూర్తి గారిని కలిసికొని ప్రసంగించండి వారు మీ ప్రశ్నలకు తృప్తికరముగా సమాధానములు తెలియజేయగల ర"న్నారు

యేట్సుదొర వారు చెప్పినట్లే చేసినాడు. "వాడుకలో ఉన్న జీవద్భాష కున్ను, పుస్తకాలలో ఉన్న కావ్యభాషకున్ను చాలా తారతమ్య మున్నది పండితులున్ను, విద్యాధికారులున్ను, యూనివర్సిటి వారున్ను వ్యావహారిక భాష బడులలోను, కాలేజీలలోను చదువరానిదన్న అభిప్రాయము గలవారు. సంఘసంస్కర్తయైన కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఆ మతము గలవారే కాని వ్యావహారిక భాషలో జీవకళలు, భావప్రకటనకు గల సత్తువ, ఝటితిస్ఫూర్తి మొదలయిన లక్షణములు గలవని తెలిసికొని ప్రహసనములు రచించారు; నేను 1897లో కన్యాశుల్క నాటకము జీవద్భాషలో రచించాను కాని అవి ఇంటివద్దను చదువుకొనుటకే కాని బడులలో చదివించుటకు ఉపయోగ పడుటలేదు" అని అప్పారావుగారు తెలియజేశారు "వ్యావహారిక భాషలో గ్రంథములు వ్రాయించి పాఠ్యగ్రంథములుగా బడులలో పెట్టుటకు అవకాశము లేదా?" అన్నాడు యేట్సు "మీ ప్రభుత్వ విద్యాశాఖవారు పూనుకొంటే ఉంటుంది. నేనిప్పుడు ఉపాధ్యాయ వృత్తిలో లేను. నా మిత్రుడు గిడుగు రామమూర్తి పర్లాకిమిడిలో ఉన్నాడు. భాషాతత్వ పరిశోధనలు చేసినవాడు; సవరభాష నేర్చుకొని ఆ భాషకు వ్యాకరణము రచిస్తున్నాడు; అతనిని కలిసి కొని ప్రసంగించండి" అని సలహాచేశారు అప్పారావుగారు పర్లాకిమిడిలో యేట్సుదొర మా తండ్రిగారిని కలిసికొని ప్రసంగించాడు నేనప్పుడు బి. ఏ అయి ఆక్టింగ్ ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నాను వారి ప్రసంగము జరుగుతూ ఉన్నప్పుడు నేను వారివద్దనే ఉంటిని "వాడుక భాషకున్ను గ్రంథములందలి

భాషకున్ను ఏ భాషలోనైనా తేడా ఉంటుంది. అయితే తెలుగులో ఉన్నంత తేడా నాకు తెలిసిన ఇతర భాషలలో అంతగా కనబడలేదు మీ ఇంగ్లీషు భాషా పండితులు, కవులు, వివేకము గలవారు గనుక ఎప్పటికప్పుడు గ్రంథములలోని భాష వాడుకభాషను అనుసరించి సరిచేసుకుంటూ వచ్చారు. ఏ భాషలోనైనా పద్యములందలి భాషకున్ను వచనములందలి భాషకున్ను కొద్దిగాతేడా ఉంటుంది. పద్యములలోని భాష కాస్త ప్రాచీన రూపాలతో ఉంటుంది వచనములో అట్టి రూపాలుండవు; ఉండకూడదన్న నియమము మీ ఇంగ్లీషు రచయితలు పాటిస్తారు మా తెలుగు కవులు అట్లుకాదు పద్య కావ్యములలో ప్రాచీనతను పదములు ప్రయోగించిన గొప్పగా ఎంచుకొంటారు. వచనములోని భాష మరింత ఎక్కువగా ప్రాచీనరూపాలతోను, సంస్కృత సమాసములతోను, శబ్దాడంబరముతోను ఉండేటట్టు రచిస్తారు. అరువది సంవత్సరముల క్రిందట పరవస్తు చిన్నయసూరిగారు అట్టి క్లిష్టమైన తెలుగు భాషలో నీతిచంద్రిక రచించినారు అది ప్రతిసంవత్సరము పాఠ్యగ్రంథముగా నిర్ణయించి బడులలో విద్యార్థులచేత చదివిస్తున్నారు. విద్యార్థులు పరీక్షలలో వ్రాయవలసిన వ్యాసములు మొదలయిన వ్రాతలలో కూడా వాడుకభాషకాక కావ్యభాషలోనే ఉండవలెనన్న నియమ మున్నది. పాఠములుచెప్పే ఉపాధ్యాయులు పద్యాలకు అర్థము చెప్తూ ఉన్నప్పుడు వాడుకభాష ఉపయోగించినా విద్యార్థులుమాత్రము పరీక్షలో కావ్యభాషలోనే అర్థవివరణము చేయవలెను. ఈ విషయమంతా నేను ఇదివరకే తెలిసికొన్నాను. కాని నేనేమి చేయగలను నేను బడులలోను, పరీక్షలకున్ను చదువుకొన్నది సంస్కృతమే కాని తెలుగు కాదు కనుక తెలుగు పాండిత్యము నాకులేదు. నేనేమైనా అంటే నీకు తెలుగు సాహిత్యము తెలియదు, కావ్యభాషరాదు, ఊరుకో అంటారు'' అన్నారు మా తండ్రిగారు ''సరే, ఈ విషయము మనము మరియొకసారి కలిసికొని చర్చించి ఏమిచేయవలెనో నిశ్చయించుకొందాము''అని యేట్సుదొర అన్నాడు.

1907 లో మా తండ్రిగారు పర్లాకిమిడి కాలేజీలో హిస్టరీ లెక్చరరుగా పనిచేస్తూ ఉండిరి. నేను రాజమహేంద్రవరములో ఎల్. టి ట్రెయినింగు

పొందుతున్నాను. ఆ సంవత్సరము వేసవి సెలవులలో మే మాసములో విశాఖ పట్టణమందు యేట్సుదొర గంజాం, విశాఖపట్టణము. గోదావరి జిల్లాలలోని ఉపాధ్యాయుల కోసము ఉపాధ్యాయ పరిషత్తు సమావేశము జరిపించాడు రెండవ దినమున అతని కోరిక ననుసరించి మా తండ్రిగారు భాషాతత్వమును గూర్చి ఒక గంటసేపు ఇంగ్లీషున ప్రసంగించారు వారి ఉపన్యాసములో ఎక్కడా తెలుగు వ్యావహారిక భాషావాద ప్రసక్తిలేదు, కాని ఆ వాదమునకు నాందివంటి ప్రసంగము లేకపోలేదు; ఆ విషయము అక్కడివారిలో కొలది మందికే తెలిసినది అది యేదో భాషాశాస్త్ర ప్రసంగ మనుకొన్నారు తక్కిన వారందరున్ను 1908 లో కూడా మేనెలలో విశాఖపట్టణమందే ఉపాధ్యాయ పరిషత్తు సమావేశము రెండవసారి జరిగినది. ఆ సమావేశమందు "భాషాచరిత్రలు—తెలుగుభాషా చరిత్ర" అనే విషయమును గూర్చి మా తండ్రిగారు ప్రసంగించారు. అందులో ఇంగ్లీషు మొదలయిన ఐరోపా భాషలచరిత్ర విషయములు ఎక్కువగాను తెలుగు భాషా చరిత్ర విషయములు అత్యల్పముగాను ఉండెను. అప్పుడు మరికొంతమందికి వీరి ఉపన్యాసముల ధోరణి ఏ ప్రయోజనము సాధించుటకు ఉద్దిష్టమయినదో బోధపడినది. కాని వారుచెప్పిన అంశములు ఖండించుటకు అవకాశము ఏదీలేదు. ఖండించుటకుగల శక్తిసామర్థ్యాలు పండితులకుగాని, పాండిత్యాభిమానముగల విద్యాధికులకుగాని లేదాయెను. కనుక వారి ఉపన్యాసమును మెచ్చుకొన్నవారే ఎక్కువగా ఉండిరి

1909-1910 లో ప్రభుత్వమువారు విద్యావిధానములో పెద్ద మార్పులు తెచ్చిపెట్టే ప్రయత్నములో ఉండిరి అందుకు గల కారణములు క్లుప్తముగా తెలియజేస్తాను. 1905 లో ఇండియా దేశమందలి విద్యా పరిస్థితులను గూర్చి వైసరాయిగా ఉండిన కర్జన్ ప్రభువు ఆదేశము ననుసరించి ఒక పెద్ద నివేదిక ప్రకటితమయినది అందులో 1830 నుండి 1900 వఱకున్ను గల విద్యావిధానము వలన కలిగిన మంచిచెడ్డల వివరణము ఎక్కువగా ఉన్నది. దేశమందు అక్షరాస్యులసంఖ్య నూటికి పది మాత్రమే అనిన్ని, ఉన్నతవిద్య అభ్యసించిన వారు వేయింట పదిమందైనా లేరనిన్ని, ఆంగ్లభాష ద్వారా ఉన్నత విద్యలు,

ఆధునిక పాశ్చాత్య విద్యలు అభ్యసించిన వారగుట వలన మాతృభాషలు నేర్చుకొనుటలో అశ్రద్ధ చూపుతున్నారనిన్ని, అట్టివారు తమ దేశమందలి ప్రజలకు నూతన విద్యావిషయములు మాతృభాషలో తెలియజాలకుండా ఉన్నారనిన్ని, దేశములో ఆధునిక విద్యావిషయ పరిజ్ఞానము లెస్సగా దేశస్థులకు వ్యాపిస్తేనే కాని దేశము బాగుపడదనిన్ని మెట్రిక్యులేషను; ఎఫ్ ఏ విద్యార్థులకు అభిరుచి ఉన్నా లేక పోయినా హిస్టరీ జియాగ్రఫీ, ఫిజిక్స్, కెమిస్ట్రీ, గణితము, బీజగణితము, రేఖాగణితము, భూగర్భశాస్త్ర దేహశాస్త్రము మొదలయిన వన్నీ నేర్పుట వలన వారికి ఏదిన్నీ లెస్సగా అలవడడము లేదనిన్ని ఇట్టి లోపము లింకా ఎక్కువగా అనిన్ని వీటిని సరిదిద్దుకొనుటకు విద్యావిధానములో పెద్ద మార్పులు చేయవలసి ఉన్నదనిన్ని ఆ నివేదికలో తెలియజేయబడినది. దాని ననుసరించి ఎట్టి మార్పులు చేయవలెనో తెలిసికొనగోరి ప్రభుత్వమువారు విద్యాసంస్థల వారికిని, విద్యాధికులకును పెద్ద ప్రశ్నావళి పంపించి సమాధానములు తెలియజేయ వలసినదని కోరినారు. ప్రతి మండలమందును ఆ కాలమున సంచలనము కలిగినది. అందులో మా తండ్రిగారి ఉద్యమమునకు సంబంధించిన విషయమొక్కటి మాత్రమే ఇక్కడ వివరిస్తాను. 1910 మే నెలలో మూడవసారి ఉపాధ్యాయ పరిషత్తు సమావేశము జరిగినది. ఆ సందర్భమున యేట్సుదొర ఉన్నత విద్యాలయ ప్రధానోపాధ్యాయుల సమావేశము కూడా జరిపినాడు సరిగా ఆ సమయమందే నేను జయపురము బోర్డు హైస్కూలుకు ప్రధానోపాధ్యాయుడుగా నియమితుడ నగుటచేత నన్ను కూడా ఆ సమావేశమునకు ఆహ్వానించారు. కాలేజీ ప్రిన్సిపలుగాని ఉన్నత విద్యాలయ ప్రధానోపాధ్యాయులుగాని కాకపోయినా మా తండ్రిగారిని కూడా యేట్సుదొర ఆహ్వానించాడు. బి. ఏ. అయినా తాను ఆంగ్లభాష ద్వారా తాను నేర్చుకొన్న ఆధునిక శాస్త్ర విషయము తెలుగులో అనువదించుటకుగాని, ప్రసంగించుటకుగాని అసమర్థు డగుతున్నాడు గదా, సమర్థుడగుటకు విద్యావిధానములో ఎట్టి మార్పు తేవలెనో తెలియ వలసినదిగా మా తండ్రిగారిని కోరినారు. సంస్కృతము రెండవ భాషగా అభ్యసిస్తున్నవారు కూడా తెలుగులో అనువాద పరీక్షకు

వ్యాసరచన పరీక్షకు హాజరు అయేటట్టు విద్యావిధానము సవరించవలసి యున్నదని అప్పటి సమావేశములో ఎక్కువ మంది అభిప్రాయపడినారు. ఆ అనువాద విషయమున్నూ, వ్యాస విషయమున్నూ ఆధునిక శాస్త్రమునకు సంబంధించి యుండవలెనని కూడా పెక్కుమంది అన్నారు అప్పుడు మా తండ్రిగారు నొక్కి చెప్పిన అంశములు సంగ్రహించి తెలిజేస్తాను. అంతా బాగానే ఉన్నది కాని, అనువాదములోగాని వ్యాసములోగాని ఉండవలసిన తెలుగుభాష కావ్యములలోని గ్రాంధిక భాషయై యుండవలెనంటే అది విద్యార్థులకు ఎక్కువ కష్టమగుటే కాక ఏ ప్రయోజనము సాధించుట కుద్దేశించి ఈ అనువాదము, ఈ వ్యాసరచన ప్రణాళికలో ప్రవేశ పెడుతున్నారో ఆ ప్రయోజనము నెరవేరదు. దేశములో జనసామాన్యమునకు గ్రాడ్యుయేట్స్ విద్యాధికుల ద్వారా విద్యావ్యాప్తి కలిగించే ప్రయోజనము గదా మీరపేక్షిస్తున్నారు? అది నెరవేరదు. ఎందుచేతనంటే గ్రాంథిక భాషలో గ్రాడ్యుయేట్సయినా పండితులయినా ఎంత శ్రమపడి అభ్యసించినా సమర్ధులు కాలేరు. నూటికొక్కరు సమర్థుడయినా గ్రాంధిక భాషలో ఉపన్యాసము సాగినప్పుడు జనసామాన్యము సరిగా అర్థము చేసికోలేదు. అట్టి ఉపన్యాసములు హాస్యాస్పదములుగా ఉంటవే కాని వాటి వలన ప్రయోజన మేమీ ఉండ"దని మా తండ్రిగారు అక్కడి వారికి నచ్చజెప్పినారు విన్నవారెవ్వరున్ను వారి ప్రసంగమును ఖండించలేదు ఆ మరునాడు పరిషత్ సభలో వ్యావహారిక భాషా ప్రయోజనమును గూర్చి ఒక గంటసేపు ఉపన్యసించినారు. బహిరంగముగా ఎవరును వారి వాదమును ఖడింమటకు సాహసించలేదు కాని చాలా మంది కొంపమునిగి పోయినట్లు భయపడినారు ఆనాడు విజయనగరము మహారాజా వారి కాలేజీ ప్రిన్సిపలుగా ఉండిన కిళాంబి రామానుజాచార్యులుగారు కూడా సభకు వచ్చి మా తండ్రిగారి ప్రసంగము విన్నారు. వారీవాదమును అంగీకరించ లేమన్నరే కాని అందుకు కారణము తెలియజేయలేదు మా తండ్రిగారు చెప్పిన అంశమేదీ సహేతుకముగా ఖండించలేదు "మీరు తెలుగు భాషా మాధుర్యమును చెడగొట్ట దలచినారా ?" అని మాత్రము వారన్నారు. "ఆ మాధుర్యము కాగితము మీద

ఉండగా కంటికి కనబడేదో? మాటలాడు నప్పుడు చెవులకు వినబడేదో ఆలోచించండి మీకే తెలుస్తుంది'' అన్నారు మా తండ్రిగారు. ఇంతకంటె ఎక్కువగా వారిద్దరికి ప్రసంగము సాగలేదు. అప్పుడు సభ్యులలో కలిగిన కలవరము ఆ తర్వాత దేశములో వ్యాపించినది

1911 లో మా తండ్రిగారు రిటైరయినారు. వారి పని నాకు లభించుట వలన జయపురము ఉన్నత పాఠశాలా ప్రధానోపాధ్యాయుడుగా పనిచేస్తూ ఉండిన నేను ఆ పని విడిచి పర్లాకిమిడి రాజావారి కళాశాలలో చరిత్రాధ్యాపకుడ నైనాను 1911-1912 లో ఉద్యోగబాధ్యత లేనందున మా తండ్రిగారు రాత్రిం బవళ్ళు పరీక్ష కోసము చదివినట్లుగా తెలుగు సాహిత్య గ్రంధములు, వ్యాకర ణములు దీక్షవహించి చదివి నోట్సు వ్రాసిపెట్టుకొన్నారు

ప్రభుత్వమువారు మెట్రిక్యులేషన్ పరీక్షకు మారుగా స్కూల్ ఫైనలు పరీక్ష. ఎఫ్ ఏ. కు మారుగా ఇంటర్ మీడియేటు పరీక్ష పెట్టారు చదువుల సంవత్సర ప్రారంభము జనవరిలో కాక జూన్-జూలై నెలలకు మారినది. పరీక్షల మాసము డిసెంబరులో కాక మార్చి - ఏప్రిల్ నెలలకు మారినది. స్కూలుఫైనలు పరీక్షకు ద్వితీయ భాగముగా నిర్ణీతమైన అనువాదమునకు వ్యాసమునకు కావలసిన భాష గ్రాంధిక భాష అయినా కావచ్చును వ్యావహారిక భాష అయినా కావచ్చునన్న నియమము ఏర్పడినది. దీనిని అనుసరించి ఇంటర్ మీడియెటుకు కావలసిన తెలుగు వ్యాసరచన ఏ భాషలో ఉండవలెను? అనగా గ్రాంథిక భాషలోనా? వ్యావహారిక భాషలోనా? అనే విషయము నిర్ణయించవలసి వచ్చినది స్కూల్ ఫైనల్ విషయములో వ్యావహారిక భాషకు ప్రవేశము కలిగినందుకు తల్లడిల్లిన పండితులు, పండితుల నాదరించినవారు తెలుగు దేశమందంతటా సంక్షోభ సభలు గావిస్తూ వచ్చారు అందుకు కావల సిన ఆర్ధికసాహాయ్యము పిఠాపురము మహారాజావారు అందజేస్తూ ఉండేవారు. ఆ సమయములో మా తండ్రిగారు మెమోరాండమ్ ఆన్ మోడర్న్ తెలుగు అనే గ్రంథము ప్రకటించి 1913 లో ప్రభుత్వము వారికి యూనివెర్సిటీ వారికి అందజేసినారు

1913 జనవరిలో మా తండ్రిగారి జీవితములో ఒక సంఘటన తలవని తలంపుగా ఒక మార్పు కలిగించినది. విజయనగరము మహారాజావారి రెండవ కుమారునికి (ఇప్పటి సర్ విజీ) కుమారికి ట్యూటరుపదవి వారికి లభించినది. అది ఎట్లు లభించినదో కొద్దిగా తెలియజేయవలసి యున్నది. 1911లో వీరు పర్లాకిమిడి కాలేజీ హిస్టరీ లెక్చరరుపదవి నుండి *రిటైరయినప్పుడు వీరి వయస్సు 48 సంవత్సరములకు లోపుగానే ఉండెను; ఇంకా ఏడు సంవత్సరములు పనిలో ఉండవచ్చును అయినా అంత వేగముగా పనినుండి విరమించుకొనుటకు కారణము లేకపోలేదు. వీరు 1880 లో తమ 18 ఏండ్ల ప్రాయమున పనిలో ప్రవేశించుట వలన 1911 నాటికి 30 ఏండ్ల సెర్వీసు పూర్తియయినది కనుక, రిటైరగుటకు హక్కు గలదు. 1910-1911 లో పర్లాకిమిడి రాజావారు (ఇప్పటి మహారాజా తండ్రి) చనిపోవుటవలన ఎస్టేటు కోర్ట్ ఆఫ్ వార్డ్జ హయాములో ఉండెను. ఆ కాలములోనే విద్యావిధానములో మార్పులు (స్కూల్ ఫైనల్, ఇంటర్ మీడియేటు కోర్సుల ప్రారంభము) జరిగినవి; ఉపాధ్యాయులకు గ్రాట్యూఇటీ ఇచ్చే పద్దతి ఏర్పడినది మా తండ్రిగారికి ఎనిమిదివేల రూపాయల గ్రాట్యూఇటీ లభించగలదు. 1912 లో ఆ రాజావారి పుత్రుడు (ఇప్పటి మహారాజా) మేజరయి తన ఎస్టేటు వ్యవహారములు చూచుకొనుటకు అర్హుడు కాగలడు అతడీ గ్రాట్యూఇటీ పద్ధతి ఉంచునో ఉంచడో అన్న సందేహము కలిగినది. ఆ పద్ధతికి మారుగా పెన్షన్ పద్ధతి పెట్టిన యెడల అది ఆయుః ప్రమాణమునకు లోబడి ఉంటుంది. ఒక్కసారిగా 8 వేలు వచ్చిన యెడల భూమయినా కొనవచ్చును భూమినుండి వచ్చే ఫల సాయము వలన తాను తన తదనంతరము తన కుటుంబమువారున్ను జీవనోపాధి కలిగించుకోవచ్చునుగదా అనే ఆలోచనతో మా తండ్రిగారున్ను ఇంకా మరి ఇద్దరు ముగ్గురు ఉపాధ్యాయులున్ను ఆ సంవత్సరమే రిటయిరయినారు 1912 డిసెంబరులో మద్రాసు యూనివెర్సిటీవారు లండన్ యూనివెర్సిటీ ఫొనెటిక్స్ ప్రొఫెసరుగా నుండిన డేన్యల్ జోన్జ్‌చేత 16 ఉపన్యాసములు ఫొనెటిక్స్ గూర్చి ఇప్పించినారు. ఆ ఉపన్యాసములకు మా తండ్రిగారున్ను

నేనున్ను వెళ్ళి ఆ ఉపన్యాసములయిన తర్వాత పర్లాకిమిడికి తిరిగివస్తూ నాలుగు దినములు విజయనగరములో ఆగినాము అప్పుడు గురుజాడ అప్పారావుగారు మా బసకు వచ్చి ఈ ట్యూటరు పనిలో ప్రవేశించవలెనని నన్ను ప్రోత్స హించినారు నా కా పని అంతగా ఇష్టము కాలేదు. నేను చదువుకొన్న కాలేజీలో మా తండ్రిగారి పదవిలో నేను హిస్టరీ లెక్చరరుగా నియమితుడ నయినానను సంతోషముతో ఉంటిని గనుక, ఆ పదవి విడిచిపెట్టి ఈ ట్యూటరు పనిలో ప్రవేశించుట వలన నా భావి జీవనమునకు నష్టము కలుగునన్న భయము కలిగినది. ఈ పిల్లలు పెద్దవారయిన తర్వాత ఈ ట్యూటరు పని ఉండదుగదా అప్పుడు నే నేమి కావలెను ? అన్న ఆలోచన వలన ఆ ట్యూటరు పని మా తండ్రిగారికి ఇప్పించండి. దాని వలన ఇద్దరమున్ను ఏదో ఆర్జించు కొంటున్న వారము కాగలము అని అప్పారావుగారికి తెలియజెప్పినాను విజయనగర సంస్థాన సంప్రదాయము ఉదారమయినది. పనిలో ఉన్నవారిని తీసివేయడమంటూ ఉండదు ఆ పని కాకపోతే మరియొక పనిలో ఉంచుతారు అని వారెంత చెప్పినా, అది నిజమని మా తండ్రిగారు కూడా నచ్చజెప్పినా నాకు సమ్మతము కాలేదు చరిత్రలో నేను చదువుకొన్న విషయము ఒకటి నాకు జ్ఞప్తికి వచ్చినది. గ్రీస్ దేశము రోమన్ సామ్రాజ్యమునకు వశపడిన తర్వాత గ్రీక్ విద్వాంసులు కొందరు జీవనోపాధికోసము రోమ్ నగరమునకు పోయి అక్కడి సంపన్న కుటుంబములలోని పిల్లలకు ట్యూటర్లుగా కుదురు కొన్నారు. ఆ పిల్లలు భాగ్యవంతులు గనుక పేదలయిన ఆ ట్యూటర్లను తమ సేవకులుగా చూచి వినయ విధేయతలు లేక వర్తించేవారట అట్టి దుర్దశ నాకు పట్టునన్న భయము కలిగినది మా తండ్రిగారు పెద్దవారు కనుకను, ఈ ఉద్యోగము పులగము మీది పప్పువంటిది కనుకను ఎప్పుడు కష్టముగా తోస్తే అప్పుడే మానుకోవచ్చును. నా ఆలోచనలు సరియైనవే అని మా తండ్రిగారికి తోచినది అప్పటికీ మా తండ్రిగారు ఏమన్నారంటే : "సరే నేను ఒక సంవత్సరము మాత్రమే ఈ పనిలో ఉంటాను; మంచి చెడ్డలు కనిపెడతాను; పిల్లలు వినయ విధేయతలు గలవారు, మన గౌరవమునకు భంగము కలుగదు

అని తోచినయెడల నేను విరమిస్తాను. ఆ పనిలో నీవు ప్రవేశించు. నీవు యువకుడవు కనుక నీవే ఈ పని చేయదగినవాడవని అప్పారావు అంటున్నాడు ఈ పిల్లల విద్యాభివృద్ధి విషయమై ఎక్కువ శ్రద్ధ వహిస్తూ ఉన్న రాణిగారి అభిప్రాయము కూడా అందుకు అనుకూలముగా ఉన్నది. పిల్లలతో కూడా ట్యూటరుగా ఉన్నవారు వ్యాయామ క్రీడలలోను, గుఱ్ఱపుస్వారీ చేస్తూ షికార్లు వెళ్ళడములోను సమర్థులయి ఉండాలి నేను వృద్ధుడను నే నా పనులు చేయలేను; నీవు 28 ఏండ్ల యువకుడవు కసరత్తుచేసిన వాడవు కనుక, నీవా పనులు కూడా చేయగలవు'' అన్నారు మా తండ్రిగారు. ''సరే కొన్నాళ్ళు మీరు ఈ పనిలో ఉండి మంచిచెడ్డలు గ్రహించిన తర్వాత ప్రోత్సహిస్తే మీరు చెప్పినట్లే చేస్తాను'' అన్నాను. నేనే ఆ ఉద్యోగమునకు స్థిరముగా రాబోతున్నానని రాణిగారు, పిల్లలు, కోటలో కొందరు అనుకొన్నారు. మూడు నాలుగు దినములు వరసగా సెలవు దినములైనప్పుడు నేను పర్లాకిమిడి నుండి విజయనగరము వెళ్ళి ఉంటూ ఉండేవాడను నేను వచ్చినట్లు తెలియగానే రాణిగారు కోటలోనికివచ్చి పిల్లలను భీమునిపట్టణము మొదలయిన స్థలాలకు మోటారుకారులో తీసికొనివెళ్ళి చూడదగిన దృశ్యాలు చూపిస్తూ వాటిని గూర్చి ముచ్చటిస్తూ ఉండవలసినదని కోరేవారు ఆ పనిచేస్తూ ఉండేవాడను ఆ దినములలో నాకడపటితమ్ముడు చి. సూర్యనారాయణ 11 ఏండ్లవాడు తరుచుగా మా తండ్రిగారితోకలిసి కోటలోనికివెళ్ళి మా తండ్రిగారు పిల్లలకు పాఠములు చెప్తూ ఉంటే వారి దగ్గరగా కూర్చుంటూ ఉండేవాడు. అప్పటికి ఇంగ్లీషులో చిన్నచిన్న ప్రసంగాలు చేయగలుగుతూ ఉండేవాడు. అతనిని కూడా తన పిల్లలవలెనే ఆదరించి రాణిగారు తమవద్ద కూర్చుండబెట్టుకొని ఇంగ్లీషుభాషను గూడా ప్రసంగిస్తూ ఉండేవారు ఆ అబ్బాయిని రాణిగారు చేరదీయడము, నే నెప్పుడు ట్యూటరుగా రాగలనో అడుగుతూ ఉండడము, మా తండ్రిగారిని ఎక్కువగా ఆదరిస్తూ ఉండడము చూచి కొందరు ఓర్వలేక పోయినారు ఆమెకు మా తండ్రిగారి మీద కోపమో అనిష్టతో కలిగించడానికి తగిన సమయము కోసము ఎదురుచూస్తూ ఉండేవారు. రాజావారు అప్పుడప్పుడు

రాత్రులందు కోటలో సంగీతము కచ్చేరీలు సమావేశపరస్తూ ఉండేవారు. ఆ కచ్చేరీలకు నలుగురితోపాటు మా తండ్రిగారిని కూడా ఆహ్వానిస్తూ ఉండే వారు వీరు ఏదోసాకు చెప్పి తప్పించుకొంటూ ఉండేవారు. ఒకసారి వెళ్ళక తప్పినది కాదు. సభాసదులందరును నేలపై పరచిన తివాచీలపై కూర్చున్న తర్వాత రాజావారు వేంచేసి ఒక సోఫాలో కూర్చున్నారు వారితో వచ్చిన వారి వేశ్య వారి ప్రక్కను సోఫాలో కూర్చున్నది మా తండ్రిగారు ముప్ప దేండ్ల నుండి సానిమేళాలు చూడరాదన్న దీక్ష వహించినవారు, కనుక ఈ దృశ్యము చూచి అక్కడ కూర్చుండకు ఇష్టముకాక అప్పారావుగారి వైపు తిరిగి నేను వెడలిపోతానన్నట్లు అభినయించారు. అప్పారావుగారు వారి ఉద్దేశము తెలిసికొని ఒక్క క్షణము ఆగు నేను కూడా వస్తాను ఇద్దరం కలిసే వెళ్దామన్నట్లు అభినయముతోనే తెలియజేసి, నిలువబడి ''మహారాజా ' మొన్న తమరు సెలవిచ్చిన రాచకార్యము ఇప్పుడు చేయవలసివచ్చినది ఆ విషయ ములో మా గిడుగురామమూర్తి కూడా తోడ్పడవలసి యున్నది; కనుక మా యిద్దరికి ఏలినవారు అనుజ్ఞ దయచేసిన యెడల మేము వెళ్తున్నాము'' అన్నారు. సరే అన్నారు మహారాజావారు ఆ మరునాడే నేను విజయనగరము వెళ్ళినప్పుడు మా తండ్రిగారీ ముచ్చటచెప్తూ'' రాజుల తృప్తికోసము ఇటువంటి అబద్ధాలు ఆడవలసి వస్తుందిరా, అదే మనకు కష్టముగా కనబడుతున్నది'' అన్నారు. ఈ సంఘటన ఆధారముగా పెట్టుకొని జరిగినది జరిగినట్లు కాకుండా దానికి చిలువలు పలువలుచేర్చి కొందరు రాణిగారికి తెలియజేశారు ''రామ మూర్తి పంతులు విద్వాంసుడే కాని రాజులను లక్ష్యపెట్టడు చాలా గర్వము గలవాడు మహారాజా వారు ఆహ్వానము పంపినా గానకచ్చేరీలకు వెళ్ళడు; వెళ్ళినా ఏదోసాకు చెప్పి సభనుండి వెళ్ళిపోతూ ఉంటాడు అని తెలియజేశారు అంతకుముందుగానే నా తమ్ముడు చి॥ సూర్యనారాయణ రాణిగారితో ప్రసం గిస్తూ చనువుకొద్దీ ఆ రాత్రి జరిగినది ఉన్నది ఉన్నట్లుగా అమాయకముగా తెలియజేశాడు. అందుచేత పెద్దలు కొందరు చాడీలుగా చెప్పిన మాటలు ఆమెకు కోపము కలిగించలేదు సరికదా, ''మంచి చెడ్డలు తెలిసిన విద్వాంసులు

ఆ దృశ్యమును చూచి సహించలేరు. మంచిపని చేసినారు'' అని మా తండ్రిగారు చేసిన పని మెచ్చుకొన్నారు అంతటితో ఊరుకోక అసూయాపరులు కొందరు మా తండ్రిగారు చెవిటి వారనిన్ని, అందరూ నోరుపెట్టి మాటలాడుతూ ఉండిన చెవి గొట్టములో నోరుపెట్టి మాటలాడవలసి వచ్చుటచేత రాణిగారి బిడ్డలకు ఆరోగ్యము చెడిపోవుననిన్ని, వీరు ఇంగ్లీషు చెప్పుటకు అవలంబించిన పద్ధతులు (Direct method of teaching foriegn languages, phonetic Script) మంచివి కావనిన్ని పెద్దలచేత చెప్పించారు ఫొనెటిక్ స్క్రిప్టు ద్వారా ఇంగ్లీషు మాటలు నేర్పుట వలన పిల్లలు పెద్దవారయినప్పుడు ఎటిమలాజికల్ స్పెలింగ్ లోపాలు వారికి తప్పవన్న విషయము మాత్రము ఆమెకు నచ్చినది మామూలు పద్ధతుల ననుసరించి రామమూర్తిగారు ఎందుకు ఇంగ్లీషు బోధించరాదో తెలిసికొని తమకు నివేదించవలసినదిగా రాణిగారు అప్పారావుగారిని కోరినారు. ఆ విషయము అప్పారావుగారు మా తండ్రిగారికి తెలియజేసినారు "నేనవలంబించిన పద్ధతి శ్రేష్ఠమయినది; స్పెలింగ్ నిర్దుష్టముగా వచ్చే మార్గము కూడా నాకున్ను సీతాపతికున్ను తెలుసును ఈ పద్ధతుల ననుసరించే మేము మా చిట్టిబాబుకు (అనగా నా కడపటి తమ్ముడు చి॥ సూర్యనారాయణకు) తక్కిన పిల్లలకు ఇంగ్లీషు నేర్పినాము. కనుక ఎవరేమి చెప్పినాసరే నేను పాతపద్ధతులలో చెప్పను'' అని మా తండ్రిగారు స్పష్టముగా తెలియజేసినారు అప్పారావుగారు వీరిమాటలు మృదువుగా మార్చి రాణిగారికి తెలియజేసినా అసూయాపరులు నా పద్ధతులకు ఎవరును ఎదురు చెప్పుటకు వీలులేదని సగర్వముగా మా తండ్రిగారు పలికినట్లు రాణిగారికి తెలియజేసినారు. సహజముగా ఆమెకు కోపమువచ్చినది. అప్పుడు ఏ మాసమో జ్ఞప్తికి రావడంలేదు గాని 20వ తేదీ అని మాత్రము జ్ఞప్తికి వస్తూఉన్నది "వారు పాత పద్ధతులలో చెప్పవలెనని నా యాజ్ఞ; అది పాటించకపోతే ఈ మాసాంతము నుండిన్ని వారి ఉద్యోగము మా కక్కరలేదు'' అని రాణిగారు 21వ తేదీని తెలియజేశారు. అది విని మా తండ్రిగారు "అంతవరకూ వేచి ఉండనక్కర లేదు, నే నీనాడే పని విడిచిపెట్టుకొంటున్నాను. మరి కోటలోనికి

వెడలను" అని మా తండ్రిగారు తెలియజేశారు అప్పటి సన్నివేశములు నాటకములో జరిగినట్లు వడివడిగా నడిచినవి 17-వ తేదీని మా తండ్రిగారు నాకు వ్రాసిన లేఖ 19-వ తేదీని అందుకొన్నాను. అందులో అంతా అనుకూలముగా ఉన్నది. పిల్లలకు మన యెడల గౌరవము, వినయ విధేయతలు ఎక్కువయినవి రాణిగారికి కూడా మన కుటుంబముయెడల ఆదరాభిమానములు కలిగినవి కనుక మూడు మాసములు జీతము నష్టముపైనైనా సెలవుపెట్టి ఈ పనిలో ప్రవేశించు, నీ కీ పని నచ్చకపోతే మానుకొని వెళ్ళిపోవచ్చును" అని వ్రాసినారు, నే నింకా ఏమిచేతునా అని ఆలోచిస్తున్నాను 21-వ తేదీని నాకు తంతివార్త వచ్చినది "సెలవు దరఖాస్తు పెట్టకు వెంటనే రా ప్రతికూల సంఘటనలు" అని ఆ వార్తలో ఉన్నది. నా కేమీ సరిగా బోధపడలేదు. వెంటనే విజయనగరము వెళ్ళి జరిగినదంతా తెలిసికొన్నాను "నీవు తొందర పడక శాంతముగా ఆలోచించి ఈ ఉద్యోగములోనికి రాకపోవడము మంచిదైనది" అని మా తండ్రిగారు సంతోషించారు " రాజుల కొలువులో కుమ్మరి పురుగువలె వ్యవహరించడమునకు నే నలవాటు పడ్డాను, మీ తండ్రి అలవాటు పడలేదు; నీ విషయము నా కంతగా తెలియదు; కాని, అసలీ ఉద్యోగమే నీకు నచ్చలేదు; సరే." అన్నారు అప్పారావుగారు

ఉద్యోగము విడిచిపెట్టినా మా తండ్రిగారు విజయనగరము వెంటనే విడిచి పెట్టలేదు ఒక సంవత్సరముపాటు అక్కడనే ఉండిరి. ముగ్గురు నలుగురు పిల్లలకు ఇంగ్లీషు ఈ కొత్తపద్ధతుల ననుసరించి చెప్తూ ఉండిరి. అప్పారావుగారు వీరు అనునిత్యము కలిసికొంటూ వ్యావహారిక భాషావాదము వ్యాప్తిచెందుటకు తగిన మార్గములు ఆలోచిస్తూ ఉండేవారు. ఆ కాలములో వఝుల చినసీతారామశాస్త్రులుగారు అప్పారావుగారి ఆశ్రయములో ఉండి తోడ్పడుతూ ఉండేవారు. నా మిత్రుడున్ను మా తండ్రిగారి శిష్యుడున్ను అయిన బుర్రా శేషగిరిరావు కాలేజీలో ఇంగ్లీషు లెక్చరరుగా ఉండినవాడు. తరచుగా మా తండ్రిగారివద్దకు వచ్చి భాషవిషయమై అనేక అంశములు నేర్చుకొంటూ ఉండేవాడు. అప్పారావుగారు ఆ కాలములో Fellow of the Madras

University గా ఉండేవారు. ఆ సమయములోనే యూనివర్సిటీలో ఒకొక్క భాషకు ఒకొక్క పరిశోధకుని నియమించే పద్ధతి అమలులోనికి వచ్చినది మా తండ్రిగారిని తెలుగుభాషా పరిశోధకునిగా నియమించవలసినదని అప్పారావుగారు యూనివెర్సిటీలో వారిని కోరినారు కాని, కట్టమంచి రామలింగారెడ్డిగారు అడ్డు తగిలినారు. "రామమూర్తి పంతులు 50 ఏళ్ళు దాటినవారు, ఈ ఉద్యోగమునకు 30 ఏండ్లకు మించనివాళ్ళు కావలెను ఎందుకంటే పరిశోధన ఎట్లు చేయవలెనో శిక్షణ పొందుటకు ఈ ఉద్యోగాలలో ప్రవేశించిన వారు జర్మనీ మొదలయిన దేశాల విశ్వవిద్యాలయాలకు వెళ్ళవలసి వస్తుంది" అన్నారు రెడ్డిగారు అందుచేత, ఆ ఉద్యోగము బుర్రా శేషగిరిరావుకు లభించినది. ఆ సంవత్సరమే వ్యావహారిక భాషావాదమునకు సంబంధించిన సభలు దేశమందు ఎక్కువగా వ్యాపించినవి. ఇంటర్ మీడియేటు విద్యార్థుల వ్యాస రచన గ్రాంథికభాషలో ఉండవలెనా? వ్యావహారిక భాషలో ఉండవలెనా? అనే విషయము పరిశీలించి తమ అభిప్రాయము తెలియజేయ వలసినదిగా కోరుతూ యూనివెర్సిటీలో సిండికేటువారు రెండుపక్షముల ప్రతినిధులను - చెరినలుగురు చొప్పున చేర్చి ప్రెసిడెన్సీకాలేజి సంస్కృత ప్రథమాచార్యులుగా నుండిన రంగాచార్యుల వారిని అధ్యక్షుడుగా నియమించి యూనివెర్సిటీలో ఇంటర్ మీడియేట్ తెలుగు కాంపొజిషన్ కమిటి ఏర్పరచినారు ఆ కమిటీలో వ్యావహారిక భాషావాద ప్రతినిధులుగా గురుజాడ అప్పారావుగారు, మా తండ్రిగారు, బుర్రా శేషగిరిరావుగారు, పి టి. శ్రీనివాస అయ్యంగారు నియమితులయినారు. ఈ విషయమును గూర్చి శ్రీ తాపీ ధర్మారావుగారు తమ వ్యాసములో సవిస్తరముగా వ్రాస్తారన్న ఉద్దేశముతో నేనిక్కడ చెప్పనక్కరలేదుగదా?

914 లో ఆంధ్రసాహిత్య పరిషత్తు వారి నాల్గవ సాంవత్సరిక సమావేశము కాకినాడలో జరిగినది కిళాంబి రామానుజాచార్యులవారు దానికి అధ్యక్షత వహించారు. ఆ సమావేశమునకు అప్పారావుగారు, మా తండ్రిగారు వేదుల చినసీతారామశాస్త్రిగారు, బుర్రా శేషగిరిరావుగారు, నేను వెళ్ళి పోల

వరము జమీందారులుగా ఉండిన కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావుగారి భవనములో బసచేసినాము. అక్కడ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు, ఆ జమీందారుగారి ఆస్థానములో పండితులుగాను కవులుగాను ఉండేవారు. ఆ ఆంధ్ర సాహిత్య పరిషత్తు సమావేశములో అప్పారావుగారిని గాని మా తండ్రిగారిని గాని, చినసీతారామశాస్త్రిగారిని గాని ప్రసంగింపనీయలేదు. "గ్రామ్య"వాదులు ఇందు పాల్గొనుటకు అవకాశము లేదన్నారు, జయంతి రామయ్యపంతులు గారు; "ఈ పరిషత్తు సమావేశములు ఈ మూడుదినములున్ను జరుగనీయండి. ఆ మరుసటి దినము టౌనుహాలులో నే నొకసభ ఏర్పాటుచేస్తాను, అదికూడా మూడు దినములు సాగిస్తాను, మొదటి దినమున అప్పారావుగారు, రామమూర్తిగారు ప్రసంగిస్తారు రెండవ దినము వఝల చినసీతారామశాస్త్రి గారొక్కరే తెలుగు వ్యాకరణములను గూర్చి సవిస్తరముగా ప్రసంగించి వ్యావహారికభాష ఎట్లు ఎంతవరకు గ్రంథరచనకు గ్రాహ్యమో పండిత దృష్టితో నచ్చజెప్తారు. మూడవదినము బుర్రా శేషగిరిరావున్ను సీతాపతిగారున్ను యువక రచయితల ప్రతినిధులుగా ప్రసంగిస్తారు" అని పోలవరము జమీందారుగారు తెలియజేశారు అందుచేత మేము వారముదినములు జమీందారుగారి భవనములో ఉంటిమి ప్రతిదినము అప్పారావుగారితోనో మా తండ్రిగారితోనో వఝల వారితోనో ఈ భాషావాదమునకు సంబంధించిన చర్చలు జరుపుటకు చాలామంది పండితులు, కవులు, వచనరచయితలు వస్తూ ఉండేవారు. వారి ప్రసంగములు బహు విధములుగా ఉండేవి. మా తండ్రిగారే ఎక్కువగా ప్రసంగిస్తూ ఉండేవారు ఎవరూ రాని సమయములో తిరుపతిశాస్త్రిగారితో మా తండ్రిగారు ప్రసంగిస్తూ ఉండేవారు ఆ యేడుదినములున్ను ఆ మందిరము సందడిగా ఉండేదని చాలా కాలము చెప్పుకొంటూ ఉండేవారు

1915 లో మా తండ్రిగారు పర్లాకిమిడికి వచ్చివేశారు అప్పటికి యూనివెర్సిటీ తెలుగు కాంపొజిషన్ కమిటీ రిపోర్టు, అప్పారావుగారి మినిట్ ఆఫ్ డిసెంటు సిండికేటుకు చేరడము, ఇప్పట్లో వ్యావహారిక భాషావాదము యూనివెర్సిటీ ఆమోదింపజాలదన్న తీర్పు ప్రకటించడము, 1914 లోనే జరిగి

నవి దేశస్థులు గ్రాంధికభాషావాదుల ప్రాభవమువలన తప్పుదారిలో పడినారు; కనుక దేశములో ప్రబోధము కలిగిస్తేనేకాని వ్యావహారిక భాషావాదము నెగ్గ నేరదన్న విషయము గ్రహించి మా తండ్రిగారు దేశసంచారముచేసి మిత్రుల తోడ్పాటుతో వివిధ స్థలములందు సభలు గావించి ఉపన్యాసము లిచ్చుటకు మొదలు పెట్టినారు పర్లాకిమిడి, బరంపురము, విజయనగరము, విశాఖపట్ట ణము, కాకినాడ, రాజమహేంద్రవరము, గుంటూరు, మచిలీపట్టణము, నెల్లూరు, మద్రాసు, అనంతపురము, పట్టణములలో మాత్రమే కాలేజీలుండేవి అవి అన్నీ మద్రాసు యూనివర్సిటీకి సంబంధించినవే ఆ కాలేజీలకుపోయి ప్రిన్సి పల్‌గా ఉండినవారిని కలిసికొని వారియాజమాన్యమున తమవాదము పూర్తిగా విని పరిశీలించి అభిప్రాయము చెప్పగల పండితులు కవులు, విద్యాధికులు గల సంఘము నియమింప జేసికొని వ్యావహారిక భాషావాదాంశములను తెలియ జేస్తూ అందుకుతగిన ప్రమాణములను ప్రదర్శిస్తూ ప్రసంగించేవారు ఆ సంఘ ములవారు సమర్పించిన నివేదికలు 1919-1920 లో వారి సంపాదకత్వమున ప్రకటితము లయిన తెలుగు పత్రిక సంచికలలో ముద్రితము లయినవి.

1915 లోనే రాజమహేంద్రవరములో ఒక పెద్ద బహిరంగసభ జరిగి నది. అక్కడ వారు ఉపన్యసిస్తూ ఉండగా అక్కడి పెద్దలే-గ్రాంథిక భాషా వాదులు సభ్యులలో దుష్టులయినవారిని కొందరిని ప్రోత్సహించి కేకలపెట్టించే వారు, వీరికి చెవుడు ఎక్కువగా ఉండేది కనుక, వీరిని ఆ కేకలు నిరుత్సాహ పరచలేదుగాని వీరి ప్రసంగము వినగోరిన వారికి వినిపించకుండా చేసినవి

1916 లో పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరిలో ఆంధ్రమహాపరిషత్తు వారి ద్వితీయ వార్షికసభ జరిగినది దానికి శ్రీ కౌనా వేంకటరాయశర్మగారు ప్రధాన కార్యదర్శులు. వారికి గ్రాంథిక భాషలో గ్రంథాలు రచించడమే ఇష్టము; అయినా వ్యావహారిక భాషావాదమునకు విముఖులుగారు; అంతే కాక మా తండ్రిగారి యెడలను, వారి పాండిత్య ప్రకర్ష యెడలను ఆదరాభి మానములుగలవారు గనుక, ఆ మహాసభలో వారి ఉపన్యాసము యధేచ్ఛగా సాగుటకు అవకాశము కలిగించినారు. మాతండ్రిగారి ఉపన్యాసము జరుగుతూ

ఉన్నప్పుడు, వేరే తమ సొంతపని యుండి వచ్చిన కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఆ సభాస్థలమునకు కొంచెము దూరముగా నిలబడి మా తండ్రి గారి ప్రసంగము వింటూ ఉండిరి వారు వచ్చినట్లు మా తండ్రిగారికి తెలియదు. పంతులుగారిని చూచినవారు కొందరు సభలోనికి రావనసినదని వారిని కోరినారు "రామమూర్తి పంతులు వేయిమంది సభ్యులకైనా చక్కగావినబడు నట్లు మాటలాడగల సమర్థుడు అతని మాటలు నాకు వినబడుతున్నవి" అన్నారట పంతులుగారు. అరగంటసేపు వీరి ఉపన్యాసము విని "రామమూర్తి చెప్పినదానిలో మనము ఒప్పుకోక తప్పని అంశము లున్నవి; అతని వాదము నేడు కాకపోయినా కొలదికాలములో జనసమ్మతము కాక మానదు" అన్నారట ఈ విషయము పంతులుగారు వెడలిపోయిన తర్వాత, సభముగిసిన తర్వాత మా తండ్రిగారికి తెలిసినది. రాజమహేంద్రవరములో వారిని కలిసికొందా మని వీరు సంకల్పించినారుగాని, అప్పట్లో అది సాధ్యపడలేదు. మరికొంత కాలమునకు వారిని వారిబసలో కలిసికొని వీరు చాలాసేపు ప్రసంగించారు వీరి వాదమును వారంగీకరించారు. ఆ తర్వాత 28-2-1919 వ తేదీని పంతులు గారి ఆనందాశ్రమములో ఒక విద్వత్సభ జరిగినది. దానికి పంతులుగారే అధ్యక్షత వహించారు ఆ సభవారే "వర్తమానాంధ్రభాషా ప్రవర్తక సమాజము" అనేపేర నొక సమాజమును స్థాపించారు దానికి పంతులుగారే అధ్యక్షులుగాను, మా తండ్రిగారున్ను, జయంతి గంగన్నగారున్ను, కార్యదర్శులుగా నియమితులయినారు. ఆ సమాజముయొక్క ముఖ్యోద్దేశములను ఆ సభవారే నిర్వచించారు --

1 వ్యవహార భాషకున్ను గ్రాంధిక భాషకున్ను ఇప్పుడున్న వ్యత్యాసము సాధ్యమైనంతవరకు తగ్గించి భాష సులభము చేయుట.

2 జ్ఞానాభివృద్ధికై వ్రాయుగ్రంథములలో సాధ్యమైనంతవరకు వ్యవహారములోనున్న రూపములే ఉపయోగించి వ్యవహారములో లేనివి విడిచి పెట్టుట.

3 వ్యవహారములో ఆవశ్యకము కాకుండ ఉపయోగించుచున్న అన్యదేశ్యపదములను విడిచిపెట్టి ఆవశ్యకములైన పదములనే చేర్చుకొనుట.

4. పై ఉద్దేశ్యములను అనుసరించి గ్రంథములను వ్రాయుట.

ఈ సమాజ మేర్పడ్డ వెంటనే మా తండ్రిగారు పర్లాకిమిడికి వచ్చి ఈ శుభవార్తయేకాక "పంతులుగారు వ్యావహారికభాషా వ్యాకరణము రచించుటకు కూడా పూనుకొన్నా"రనిన్ని, "మనము వ్రాసిపెట్టుకొన్న కవి ప్రయోగముల పట్టికనుండి ముఖ్యమైన ప్రయోగముల వివరణము పంపించ వలసినదని కోరినా"రనిన్ని తెలియజేసినారు వారికి పంపవలసిన ప్రయోగముల పట్టిక వెంటనే తయారు చేయవలసిన పని నా కప్పగించినారు రెండు దినములలో పది పుటలుగల పట్టిక తయారుచేశాను ఎందుకైనా మంచిదని కొన్ని ప్రతులు సైక్లోస్టైలు కూడా చేసి ఉంచాను. పంతులుగారికి ఒక ప్రతి రెజిస్టర్డ్ పోస్టులో పంపించాము వారు దానిని అందుకొని వ్యాకరణము వ్రాయుటకు ప్రారంభించినట్టు తెలిసికొని సంతోషించాము కాని ఏమిలాభము ? 27-5-1919 వ తేదీని పంతులుగారు కాలధర్మము నొందినారు

"ఈ వ్యాకరణము మనమే వ్రాయరాదా ?" అని నేనన్నాను "ఈ మాట పంతులుగారన్నారు. పెద్దలు, పండితులు అయిన మీబోటివారు వ్రాస్తే ఆ వ్యాకరణమునకు విలువ ఎక్కువగా ఉంటుంది గాని నాబోటివాడు వ్రాస్తే పండితులు దానిని ఆదరించరు ఎవరో గ్రామ్యవాది రచించిన గ్రామ్యభాషా వ్యాకరణము అని నిరసిస్తారని చెప్పినాను అప్పుడు పంతులుగారు సరే అని అంగీకరించారు వారి మరణము వలన మన ఉద్యమమునకు గొప్ప నష్టము కలిగినది" అని మా తండ్రిగారు కంటనీరు పెట్టుకొని వగచినారు. కొంత సేపు ఆలోచించి. సరే; నీవు చెప్పినట్లు ఏదో చేదాము వ్యాకరణ ఫక్కీనిగాక ప్రసంగముల రూపమున "బాలకవి శరణ్యము" అనే పేరను వ్రాస్తే మంచిది అన్నారు.

పంతులుగారు కాలధర్మము నొందినా, వారి అధ్యక్షతను నెలకొన్న సంస్థవల్ల కొంతపని నెరవేరక పోలేదు. ఆ సమాజమేర్పడ్డ సమయమందే 50 మంది అందులో సభ్యులుగా చేరినారు శీఘ్రకాలములో సభ్యుల సంఖ్య రెండువంద లయినది. ఆ సంవత్సరమే మా తండ్రిగారి సంపాదకత్వమున "తెలుగు" అనే పేరను ఒక మాసపత్రిక నెలకొల్పడము జరిగినది అది ఒక సంవత్సరము నడచినది 12 సంచికలు వెల్వడినవి వాటిలో విద్వాంసుల వ్యాసములు, మా తండ్రిగారి వ్యాసములు, బాలకవి శరణ్య మందలి రెండు ప్రసంగములు సవిస్తరముగాను, "ఆంధ్ర పండితభిషక్కుల భాషాభేషజము" అనే పేరను ఒక పెద్ద గ్రంధమున్ను ప్రకటితము లయినవి.

1920 - 1925 లో మా తండ్రిగారు మద్రాసు యూనివెర్సిటీ తెలుగు బోర్డ్వ్ స్టడీజు సభ్యులుగా నుండేవారు అప్పుడు మద్రాసునుండి వచ్చివేస్తూ ఉన్నప్పుడు బందర్ (మచిలీ పట్టణము), గుంటూరు, రాజమహేంద్రవరము విశాఖపట్టణము మొదలయిన స్థలములలో ఆగి ఈ వ్యావహారిక భాషాప్రయోజనమును గూర్చి ఉపన్యాసాలిస్తూ ఉండేవారు. ఈ ఉపన్యాసాల ఫలితముగా అనేకులు, అదివరకువారి వాదమునకు విముఖులుగా ఉన్నవారు వీరి వాదమును అంగీకరించి వీరికి సహచరులుగాను అనుచరులుగాను ఉండేవారు.

1925 లో తణుకులో రామభద్రచయనులుగారి ప్రోత్సాహమున ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షికోత్సవము మూడు దినములు జరిగినది. ఆచంట సాంఖ్యాయనశర్మగారు ఆ సభలకు అధ్యక్షత వహించారు రెండవ దినము మధ్యాహ్నము కేవలము మా తండ్రిగారి ఉపన్యాసము కోసమే ప్రత్యేకింప బడినది ఆ ఉపన్యాసము వినడానికి అనేకులు ఎక్కువగా వచ్చారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఇంకా ఇతర మహాపండితులు త్రిపురాన సూర్యప్రసాదరావు దొరగారు, కవులు, వచన రచయితలు సభలో ఉన్నారు. వేదికపైని తెలుగు ప్రబంధాలు, చిన్నయసూరికి ముందు ప్రకటితములైన వచన గ్రంథాలు, పత్రికలలోని కాగితాలు మొదలయినవి మా

తండ్రిగారి ఆసనము వెనుకను వరసగా పేర్చిపెట్టినాము. వీరు ఉపన్యసిస్తూ ఉన్నప్పుడు ఏ సమయమున ఏ గ్రంథ భాగము ప్రమాణముగానో నిదర్శన ముగానో ప్రదర్శించుటకు వీరికి కావలెనో ముందుగానే గ్రహిస్తూ కావలసినది చేతనుంచుకొని అందిస్తూ ఉండేవాడను. వీరి ఉపన్యాసము మధ్యాహ్నము రెండున్నర గంటలనుండి సుమారు ఆరు గంటల వరకు సాగినది సభాసదులు నిశ్శబ్దముగా వింటూఉండిరి. ఒకసారి పూర్వలక్షణమునకు విరుద్ధముగాను వ్యవహారమునకు అనుకూలముగానుఉండే ప్రయోగములు దుష్టప్రయోగములని ఆక్షేపిస్తూ ఉన్న కవిసమ్రాట్టుల కావ్యములందే ఉన్నవి చూపిస్తానని నా వైపు మా తండ్రిగారు తిరుగగానే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి గ్రంథ మొకటి ఆ పుటవద్ద మడిచి అందించాను ఆ ప్రయోగముగల పద్యము వీరు చదివినారు. అప్పుడు కృష్ణమూర్తి శాస్త్రిగారు అది మొదటి ముద్రణము. రెండవ ముద్రణము చూడుడు'' అన్నారు "ఊరుకోవయ్యా ' అదికాకపోతే ఇదిగో ' అని మరి నాలుగిటువంటి ప్రయోగాలుచూపి మనబండారము బయటపెడతా డీ పిడుగు'' అన్నారు చెళ్ళపిళ్ళవారు. ఆ విషయము చిన్న కాగితముమీద వ్రాసి మాతండ్రి గారి యెదుట పెట్టినాను "అలాగునా ' వారిని గూర్చి నేను వ్రాసిన వ్యాసాంశాలు ఇమ్మన్నారు. ఆ వెంటనే ఆ కాగితాలు మా తండ్రిగారి కందించాను నేను చూపించిన ప్రయోగము అచ్చు తప్పయితే, ఇటీవల ప్రకటితము లయిన ఈ పూర్వలాక్షణ విరుద్ధ ప్రయోగాల కేమంటారు? ఇవి మీ పండితులు దుష్ట ప్రయోగాలంటారు; పొరపాట్లంటారు ప్రమాదోధీమతామపి అంటారు నేనా లాగనను. సాధువులే అంటాను ఎట్లు అంటారా ' నేటి జీవద్భాషలో ఉన్నవి కనుక, ఇవి లక్ష్యములుగా పెట్టుకొని ఇకముందు లక్షణము రచించేవారు. ఈ ప్రయోగములను ఆధారముగా పెట్టుకొని లక్షణము సరిదిద్దుకోవాలంటాను. ఇవి పొరపాట్లను కోవడము పొరపాటు అంటాను. జీవద్భాషా ప్రభావమునకు కవిసమ్రాట్టు లయినా లోబడక తప్పదు. పూర్వ లక్షణమునకున్ను పూర్వకవి ప్రయోగములకున్ను లోబడక నేటి వాడుకలోను లేక చేసే ప్రయోగాలే "మీరు వచ్చిరి; చేసితివి కాదు; ఏమి చెప్పము! నేను వెళ్ళెదనా'' మొదలయి

నవి తప్పులంటాను'' అని ఆవేశముతో నొక్కి చెప్పారు. చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు నిజము నిజమని చిరునవ్వు నవ్వుతు మా తండ్రిగారి వైపు తిరిగి సమస్కరించారు" నా ఆగ్రహము విమర్శించే విషయము మీదనే కాని వ్యక్తి మీదను కాదు" అన్నారు మా తండ్రిగారు.

వీరి ఉపన్యాసము సుమారు నాలుగు గంటల సేపు సాగినది. ఉపన్యాసము చేస్తూ ఉన్నంత సేపు నిలబడే ఉండిరిగాని కుర్చీవేసి కూర్చోమన్నా కూర్చోలేదు. వారి వయస్సు 62 సంవత్సరాలు, అలసిపోయినారు. ఉపన్యాస మైన వెంటనే మా కిచ్చిన గదిలోనికిపోయి, నేలమీద నడుము చేరవేసి, కళ్లు మూసుకొని కాళ్ళు చాపి పడుకొన్నారు. ఆ దృశ్యమును చూచినవారు కొందరు భయపడ్డారు; చన్నీరు తెచ్చి కన్నులకు అద్ది; ఉపచారము చేయబోయినారు. అప్పుడు వారు చిరునవ్వు నవ్వుతూ కనులు విప్పి "సీతాపతీ ! నీవు స్వయంగా చేసి కాఫీ పట్టుకొనిరా'' అన్నారు. అయిదు నిముషములలో కాఫీ తెచ్చి యిచ్చాను. లేచి కూర్చుండి కాఫీ త్రాగుతూ, "మరేమీ భయము లేదు, అలసి పోయినాను, అంతే'' అని కాఫీ త్రాగిన తర్వాత రాయసము వేంకటశివుడుగారి వైపు తిరిగి ''ఏమంటారు ఇప్పుడు?'' అన్నారు, వారు నమస్కరించి ''మీరు చెప్పినది కాదనగలనా ! ఇప్పుడేమీ మీరు ప్రసంగించవద్దు; విశ్రాంతి తీసికొం''డన్నారు. మా తండ్రిగారి ఉపన్యాసముల తీరు ఎట్లుండేదో తెలియ జేయడానికి ఇది మంచి నిదర్శనము గనుక, కాస్త ఎక్కువగా వివరించి వ్రాశాను.

1927 లో మద్రాసు ప్రభుత్వమువారు ఇంగ్లీషున సవరవ్యాకరణము, సవర-ఇంగ్లీషు; ఇంగ్లీషు-సవర నిఘంటువులు కావలెనని కోరినారు. అప్పుడు నన్ను పిలిచి, "ఏదో కడు కొద్దిగా మాత్రమే సవరభాష నేర్చుకొన్నావు; అది చాలదు; ఈ వేసవి సెలవులలో శ్రద్ధవహించి సవరభాష లెస్సగా నేర్చు కొని నాకు సహాయుడుగా పని చేస్తానని త్రికరణ శుద్ధిగా అంటే, నే నీ పనికి పూనుకొంటాను; లేదంటే నేను వృద్ధుడనయినాను, ఈ పని చేయజాలను అని ప్రభుత్వము వారికి తెలియజేస్తాను'' అని తీవ్రము నావైపుచూస్తూ మాటలాడి

నారు. "తప్పకుండా నేర్చుకొని మీకు తోడ్పడుతా''నన్నాను. మూడు నాలుగు మాసములలో వారు నేర్చుకొన్న భాష-ఇంచుమించు అంతా నేర్చుకోగలిగి నాను. అందుకు కారణము నా గొప్పతనము కాదు, వారు నేర్పేపద్ధతిలోనుండే నిపుణత. మరియొక కారణమేమంటే వారికి చెవుడు ఎక్కువగా ఉండేది కనుక, సవరలతో మాటలాడేఅదృష్టము వారికి లేకపోయినది; నాకు కలిగినది 1928 సరికి నేను సవరలతో ధారాళముగా మాటలాడే సమర్థత సంపాదించు కొని మా తండ్రిగారికి సహాయుడుగా పనిచేయగలిగినాను 1930-1934 లో ప్రభుత్వమువారు కోరినగ్రంధములు ప్రకటితములైనవి పీఠికలలో మా కృషి విశేషములు వివరింపబడినవి

అంతకు పూర్వము 1911 లో మద్రాసు ప్రభుత్వమువారు వీరిచేతను తెలుగు భాషను సవర వాచకములు, సవర-తెలుగు, తెలుగు-సవర నిఘంటువులు, కొద్దిగా సవర కథలు పాటలు మొదలయిన గ్రంథాలు నాలుగైదు వ్రాయించుకొని ప్రకటించినారు. అందుకు ప్రతిఫలము ఏమికోరుతావు'' అని ప్రభుత్వము వారడిగి నప్పుడు నేనేమీ కోరదలచుకోలేదు నా గ్రంథములు మీరు ప్రకటిస్తే చాలు సవరల క్షేమము కోసము మాత్రము నేను కోరేదేమంటే; చదువురాక, లోకజ్ఞానము లేక, అడవి మృగములవలె కొండలమీద తిరుగుతున్నారు వారి విద్యాభివృద్ధి కోసము నా కందుబాటులో ఉన్న సవర గ్రామాలలో చిన్నచిన్న బడులు పెట్టి నా ధనముతోను, ప్రభుత్వ విద్యాశాఖ వారిస్తూ ఉన్న గ్రాంటులతోను ఆ బడులు నడుపుతున్నాను. నేను ధనవంతుడను కాని కేవలము ఆ ఉద్యమము వృద్ధిపొంద వలెనన్న అభిలాషతో నా శక్తికి మించిన పనికి సాహసించాను కనుక సవరలవిద్యాభివృద్ధికి ప్రభుత్వము వారు కొండల మీదనే బడులు పెట్టి వారి విద్యాభివృద్ధికి తోడ్పడ వలెనని ప్రార్థిస్తున్నాను. అయిదు సంవత్సరముల క్రిందటనే ఈ విషయమును గూర్చి ప్రభుత్వము వారికి ఒక నివేదిక పంపినాను దానిని ప్రభుత్వమువారు ఆదరించకపోలేదు. నేను పెట్టిన బడులకు గ్రాంటు లిస్తున్నారు కొండలపై పనిచేసే ప్రభుత్వోద్యోగులు సవరభాష నేర్చుకోవలెనని న్ని, సవర టెస్టులో ఉత్తీర్ణులై

బహుమతులే కాక ప్రమోషన్లు కూడా ఇస్తామని ప్రకటించారు ఇప్పుడు వెల్ష్‌మన్ అనే ఆంగ్లేయుడు ఫారెస్టు ఆఫీసరుగా నియమితుడైనవాడు సవర భాష నేర్చుకొంటానని నావద్దకు వచ్చాడు సవరభాష నేర్పడానికి ఎంత ఇచ్చేది? అని అడిగినాడు "నీవేమీ ఇవ్వనక్కరలేదు ఇంకా మూడు మాసాలు నేను కాలేజీ ఉద్యోగము చేస్తాను ఆ తర్వాత రిటైరవుతాను. ఈ మూడు మాసాలున్ను మధ్యాహ్నము సరిగా ఒంటిగంటకువచ్చి రెండు గంటల వరకున్ను నీకు సవరపాఠాలు నేర్పుతాను. ఆ తర్వాత మా ఇంటికివచ్చి నేర్చుకో ఏదో ఆషామాషాగా నీవు చదువుతూ ఉన్నట్లు తోచితే నేను మరిచెప్పను". అన్నాను. అతడు శ్రద్ధగా చదువుతానన్నాడు. రెండు మాసములయి శ్రద్ధగానే చతువుతున్నాడు" అని మా తండ్రిగారు ప్రభుత్వము వారికి తెలియజేశారు 1913 లో ప్రభుత్వమువారు వీరికి రావుసాహెబు బిరుద మిచ్చి ఆదరించారు అంతేకాక మేక్‌మైకెల్ అనే జిల్లా కలెక్టరుతోను ఈ వెల్షమన్‌తోను సంప్రతించి పర్లాకిమిడికి ఉత్తరముగా కొండల మీద నున్న సెరంగ్ అనే ఒక గ్రామము వద్ద సవర విద్యాభివృద్ధి కోసము ఒక ట్రెయినింగు స్కూలు, ప్రాథమిక బడి పెట్టుటకు నిశ్చయించినారు. 1914 డిసెంబరులో వెల్షమన్ మొదటి మహాసంగ్రామములో పనిచేయుటకు రిక్రూటుకాగానే వెళ్ళి మరి నాలుగు మాసములకు యుద్ధములో చనిపోయినాడు 1928-1923 ప్రభుత్వము వారు సెరంగులో స్థాపించిన ట్రెయినింగు స్కూలు ప్రాదమిక పాఠశాల సక్రమముగా నడుచుటకు మొదలు పెట్టినవి ఆ ట్రెయినింగు స్కూలుకు వెల్షమన్ గౌరవార్థము మా తండ్రిగారి సలహా ఆదరించి వెల్షమన్ సవరా ట్రెయినింగు స్కూలు అనే పేరు పెట్టినారు

1930 లో ఆంధ్ర యూనివెర్సిటీ వారిచ్చిన రిసెర్చి స్కాలర్‌షిప్ పుచ్చుకొని సవరల చరిత్ర, సంస్కృతి మొదలయిన పరిశోధనలు చేయడానికి ప్రారంభించాను ఆ విషయములో మా తండ్రిగారి తోడ్పాటు ఉండేది. ఈ పరిశ్రమలో ఉండవలసి వచ్చుట వలన 1930-1932 లో నేను నా కాలేజీ లెక్చరర్ పనికి సెలవు పెట్టి సవరదేశములో పర్యటనముచేస్తూ ఉండేవాడను.

ప్రభుత్వోద్యోగులు సవర భాషా పరీక్షలకు వచ్చినప్పుడు 1930 వరకున్నూ మా తండ్రిగారు పరీక్షాధికారిగా ఉండేవారు; వారికి చెవుడు గనుక 1928-30లో నా తోడ్పాటు అపేక్షిస్తూ ఉండేవారు. నేను వారికి తోడ్పడుటకు ప్రభుత్వము వారు అంగీకరించారు 1930 నుండి 1936 లో ఒరిస్సా రాష్ట్రము ఏర్పడిన వరకున్నూ నేనే పరీక్షాధికారిగా ఉండేవాడను.

1931 లో ఒరిస్సా రాష్ట్రము ఏర్పరచుటకు ప్రయత్నములు సాగుతూ ఉండెను పర్లాకిమిడి రాజావారు తమ పర్లాకిమిడి తాలూకా అంతా - అందు నూటికి 60 మందిపైగా తెలుగువారే ఉన్నా ఏర్పడబోయే ఒరిస్సారాష్ట్రములో చేర్పించుటకు సంకల్పించి ప్రయత్నములు సాగిస్తూ ఉండిరి. అందువలన తెలుగువారికి చాలా బాధగా ఉండెను సమర్థుడైన తెలుగు నాయకుడు మా తండ్రిగారు తప్ప మరి యెవ్వరూ కనబడలేదు వారి వయస్సు 67 సంవత్సరములు, నేను సెలవులో ఉండినా రాజావారి కొలువులోనే ఉన్నట్లే కదా ? తెలుగువారికి నాయకుడుగా నిలిచి రాజావారి కోరికకు విరుద్ధముగా పనిచేసిన యెడల రాజావారికి కోపము వచ్చి నీ ఉద్యోగమునకు భంగము కలిగిస్తారేమో అని సందేహించి నా అభిప్రాయ మెట్లున్నదో తెలిసికో గోరినారు ఈ కారణముచేత వారు నన్ను ఉద్యోగమునుండి తొలిగిస్తే అట్టివారి కొలువు తప్పినందుకు సంతోషిస్తాను. ఏదో ఒక విధముగా జీవనము చేయలేక పోనన్నాను. సరే అని సంతోషించారు. ఏయే ప్రాంతములు ఒరిస్సాలో చేరవలెనో నిర్ణయించుటకు ఓడొనెల్ అధ్యక్షుడుగా ముగ్గురు సభ్యులుగల జాండరీ కమీషన్ ఏర్పడినది వారి ముందు సాక్ష్యం సంపన్నాలుగల రికార్డు చూపిస్తూ మా తండ్రిగారు పర్లాకిమిడి తాలూకా తెలుగువారిదే కాని, ఒరిస్సాలో చేరదగినది కాదని నచ్చజెప్పినారు. అప్పుడు పర్లాకిమిడి రాజావారు నలుగురితో పాటు అక్కడ ఉండి వీరి ప్రసంగమంతా విన్నారు. ఆ మా తండ్రిగారి ప్రసంగము రాజావారికి బాధ కలిగించింది మేము అనుకొనినట్లే ఏదో సాకు కల్పించి 1932 లో రాజావారు నన్ను ఉద్యోగము నుండి తొలగించారు. ఆ తర్వాత వృద్ధులయిన మా తండ్రిగారిని శ్రమ పెట్టడము ధర్మముకాదని

తెలుగు మహాజనులు నన్ను నాయకునిగా పెట్టుకొని పర్లాకిమిడి తాలూకా ఒరిస్సాలో చేరకుండా ఉండేటందుకు తీవ్రముగా కృషిచేశారు ఆ సంవత్సరమే తెలుగువారి ప్రతినిధులుగా వైసరాయి వద్దకు ఒక డెప్యుటేషన్ ఏర్పరచుకొని వెళ్ళినాము మా డెప్యుటేషనుకు అధ్యక్షునిగా బొబ్బిలి రాజావారిని పెట్టుకొన్నాము ఢిల్లీలో మేము వైసరాయిని సందర్శించిన నాడే మద్రాసు లెజిస్లేచరుకు ప్రధాన మంత్రిగా ఉండిన మునుసామి నాయడుగారు చనిపోయినట్లును బొబ్బిలి రాజావారు ఆ పనిలో నియమితులైనట్లును తంతి వార్త వచ్చుట వలన ఢిల్లీలో మరి రెండుదినము లుండదలచుకొన్న బొబ్బిలి రాజావారు ఆ రాత్రే ఢిల్లీ విడిచి మద్రాసుకు ప్రయాణమైనారు.

నేను పర్లాకిమిడి చేరుకొనే సరికి ప్రభుత్వము వారు క్రొత్తగా ఏర్పాటు చేసిన పర్లాకిమిడి తాలూకా బోర్డు సభ్యుల ఎన్నికల సమయ మాసన్నమైనది. పర్లాకిమిడి రాజావారు బోర్డు తమ ఆధీనములో పెట్టుకొని పర్లాకిమిడి తాలూకా అంతా ఒరిస్సాలో చేరుటకు మేము సమ్మతిస్తున్నామనే తీర్మానము బోర్డువారి చేతను చేయించుకొందామని ఆలోచించి 16 సీట్లకు తమ వారిని నిలబెట్టారు. వారికి ప్రతికూలముగా ఒరిస్సాలో చేరుటకు సమ్మతించని వారిని మేము నిలబెట్టుకొన్నాము ఎన్నికల తగవులాట తీవ్రముగా జరిగినది. మొత్తానికి విజయము పొందినాము. ఏడు రూపాయల ఖర్చుతో నేను సభ్యుడనే కాక బోర్డు ప్రెసిడెంటును కూడా కాగలిగినాను. మా పార్టీ 9 గురు, రాజావారి పార్టీ 7 గురు

1933 లో పర్లాకిమిడి తాలూకాలో నూటికి 60 మంది పైగా తెలుగు వారున్నారు కనుకను 35 గురు మాత్రమే ఓఢ్రులు కనుకను తక్కినవారు సవరలు కనుకను ఒరిస్సా రాష్ట్రములో ఇది చేర్చకూడదన్న తీర్మానముచేసి ప్రభుత్వము వారికి పంపించినాము.

ఈ ఉద్యమకలాపమంతా మా తండ్రిగారి పలుకుబడి సాహాయ్యము ఎక్కువగా ఉండబట్టి మా కనుకూలముగా సాగుతూ వచ్చినది. ఓడొనెల్

కమీషన్ ముగ్గురు సభ్యులలోను ఇద్దరు రాజావారికి అనుకూలముగా వ్రాశారు. వారు వ్రాసినదంతా ఖండిస్తూ అధ్యక్షుడయిన ఓడొనెల్ మాకు అనుకూలముగా వ్రాశాడు. అంతేకాదు అధర్మముగా రాజావారికి మేలుచేదామన్న ఉద్దేశముతో ఈ పర్లాకిమిడి తాలూకాలో ఏ మాత్రము ఒరిస్సాలో కలిపినా అల్లరులు పుట్ట వచ్చునని కూడా తెలియజేశాడు.

మరికొద్ది మాసములలో లండన్‌లో జాయింటు పార్లమెంటరీ కమిటీ వారి ఉపసంఘమందు మొఱపెట్టుకొనుటకు ఒక ఒరియా ప్రతినిధుల డెప్యూటేషను ఒక తెలుగు ప్రతినిధుల డెప్యూటేషను సిద్ధమయినవి. మా డెప్యూటేషనుకు అధ్యక్షుడు సర్ కూర్మా వెంకటరెడ్డినాయడు. పర్లాకిమిడి ఒరిస్సాలో చేరదన్న నిండు నమ్మకముతో పర్లాకిమిడి ప్రతినిధిగా ఎవరూ ఆ డెప్యూటేషనులో లేరు. కాని, పరిస్థితులు వక్రించవచ్చునన్న సందేహము కలిగి రెడ్డి నాయడుగారు మాకు కేబిల్‌వార్త పంపించారు; పర్లాకిమిడి తెలుగు ప్రతినిధిని వెంటనే పంపవలసినదని కోరినారు అప్పుడు మా పర్లాకిమిడి తెలుగువారు నా ఖర్చులకు కావలసిన పైకము నలుగురివద్ద నుండిన్ని జమచేసి నన్ను లండన్ నగరమునకు పంపించారు. మా తండ్రిగారు నన్ను పంపుటకు సమ్మతించారు. అక్కడ నా వాదన సెక్రటరీ ఆఫ్ స్టేట్‌పర్ ఇండియాగా నుండిన సర్ శామ్యుఅల్‌హోరు అధ్యక్షుడుగా ఏడుగురి సభ్యుల ఉపసంఘము వారి యెదట 40 మినిట్లు సాగినది. అంతకుముందు ఒరియా ప్రతినిధులలో పర్లాకిమిడి రాజావారు చెప్పిన అంశములనుగూర్చి హోరుగారున్ను సభ్యులుగా ఉండిన అట్లీ, జెట్రుల్లాగారును ప్రశ్న పరంపరలు కురిపించారు అన్నిటికీ సమాధానము ప్రమాణములు ప్రదర్శిస్తూ ప్రసంగించాను. అప్పట్లో పర్లాకిమిడి తాలూకాలో ఏ భాగమున్ను ఒరిస్సాలో చేర్చుటకు వీలుకాదన్న విషయమే వ్రాసిపెట్టుకొన్నారు కాని దేశరాజకీయ సంస్థా విధాన సమస్యలముందు ఇది అత్యల్పమైన విషయము గనుక, సరే చూదామన్నట్లు ఈ సమస్యకు సంబంధించిన కాగితాలు ఒకమూల పెట్టి ఉంచారు. 1934 లో పర్లాకిమిడి రాజావారు హితాళులై నారు గవర్నరు గంజాం జిల్లాలో పర్యటనము చేసినప్పుడు వారు

నిరుత్సాహముతో నుండిరి నేను రెండుసార్లు వారిని క్రాంబే (మిలటరీ ఏడిగాంక్)ను కలుసుకొన్నాను. ఛత్రపురంలో మహాసభ సమావేశము జరిగినది. అక్కడ మా తండ్రిగారికి కెయిజర్ హింద్ బంగారు పతకము గవర్నరుగారు సమర్పించారు, సవరభాషకు, సవరల విద్యాభివృద్ధికి, తోడ్పడి ఎక్కువగా కృషిచేసిన విద్వాంసులనిన్ని ఉదారులనిన్ని తమ ప్రసంగంలో మెచ్చుకొన్నారు ఆ సభకు పర్లాకిమిడి రాజావారు రాలేదు అంతకుముందు బరంపురములో సర్ ఏ. సీ పాత్రోగారు చేసిన విందులో నాతో ప్రసంగిస్తూ పర్లాకిమిడి ఒరిస్సాలో చేరదన్నారు అయితే నేమి పర్లాకిమిడి రాజావారు మరల లండన్ నగరమునకు వెళ్ళి అన్ని పార్టీల నాయకులను మంచి చేసికొని తాను బ్రిటిష్ ప్రభుత్వము వారికి కాంగ్రెస్ ఉద్యమము అణచివేయుటలో తోడ్పడుతూ ఉన్న ఘనకార్యము నివేదించుకొని పర్లాకిమిడి తాలూకా అంతా కాకపోయినా పర్లాకిమిడి బస్తీని దాన్ని అంటుపెట్టుకొనున్న ఏజెన్సీ ప్రాంతాల వరకున్ను గల గ్రామాలయినా కలపవలసినదని నివేదించుకొనుటచేత వారి కోరిక నెరవేర్చుటకు జేస్తున్నామని బహిరంగపరుస్తూ పర్లాకిమిడి బస్తీ 200 గ్రామాలు ఒరిస్సాలో కలిపినారు 400 గ్రామాలు ఇప్పుడు ఆంధ్రప్రదేశ రాష్ట్రమునకు దక్కినవి. ఈ మాత్రమైనా మా తండ్రిగారి కృషివల్లను, నేను లండన్ వెళ్ళి వాదించుటచేతను దక్కినదన్ను నమ్మకముతో అక్కడి తెలుగు వారు మా గిడుగువారిని ఎక్కువగా ఆదరిస్తూ ఉంటారు.

సరే దీనికేమిగాని మా తండ్రిగారికిన్ని నాకున్ను రెండు విషయము లలో బాధ కలిగినది. ఈ సంఘటనలవల్ల మా కుటుంబము ఆర్థికముగా దెబ్బతిన్నది. అయితే దానికంతగా మేము ఖేదపడలేదు, ఏదో గౌరవముతోనే జీవించగలమన్న ధైర్యముండెను అంతకంటె ఎక్కువ ఖేదము కలిగించిన విషయ మేమంటే, మా విద్యా పరిశ్రమకు పెద్ద దెబ్బ తగిలినది. పండితా రాధ్య చరిత్ర, భారతము నన్నయ రచించిన భాగము వ్రాతప్రతులు పెట్టుకొని 1925-1929 లో సరియైన పాఠములు గుర్తిస్తూ ఉండేవారము ఈ పని సగములో ఆగిపోయినది. 1930 లో చిలుకూరి నారాయణరావు (మా నాయన

గారి శిష్యుడు, ప్రతి సంవత్సరము నెలవులలో వస్తూ మా గోష్ఠిలో పాల్గొంటూ ఉన్నవాడు)పర్లాకిమిడి వచ్చి మీరు ఇతర కార్యములలో నిమగ్ను లయి ఉన్నారు గనుక, నేనీ రికార్డు అంతా తీసికొని పనిచేస్తానని చెప్పి తనకు కావలసిన గ్రంథ సామగ్రి అంతా అనంతపురము తీసికొని వెళ్ళి ఏదో తనకు సాధ్యమయినంత వరకు పండితారాధ్య చరిత్ర వ్రాత ప్రతి అచ్చుకు సిద్ధముచేశాడు అది చూచుటకయినా మాకు తీరుబడి లేకపోయినది. అతడు చేసిన పని చాలా మెచ్చుకోదగినదే కాని మా తండ్రిగారికితృప్తి లేకపోయినది కొన్ని సరియైన పాఠాలు పుట అడుగున చూపి అవపాఠములు మూలములో ఉంచివేశాడనిన్ని, అచ్చు తప్పులు చాలా దొర్లినవనిన్ని ఇట్లే మరికొన్ని అంశములున్ను చెడినవనిన్ని చింతించారు. భారతము పని ఉండిపోయింది. ఇంతలో నవ్యసాహిత్య పరిషత్తు కార్యదర్శులయిన శ్రీ తెలికిచెర్ల వేంకట రత్నముగారి నుండి మా తండ్రిగారికి లేఖ వచ్చినది "మీ సప్తతితమ వార్షికోత్సవము రాజమహేంద్రవరములో డిసెంబరు నెలలో జరుపుటకు నిశ్చయించినాము; ఆనాటికి మీ రచనలు - వ్యాసములు, బాల కవిశరణ్యము మొదలయినవి వేర్వేరు గ్రంథములుగా ప్రకటింప సంకల్పించినాము అంతే కాక మిమ్మును, మీ గ్రంథములను, మీ సంస్కృతిని, మీరు చేసిన పనిని కొనియాడుతూ ఇతరులు వ్రాసిన వ్యాసములున్ను, సాంస్కృతిక విషయము లను గూర్చి పండితులు, కవులు మొదలయిన వారు రచించిన వ్యాసములున్ను చేర్చి (Miscellany of Papers - Commemoration Volume) అనే పేర నొక గ్రంథము కూడా ప్రకటించి మీ బహుమానముగా ఇవ్వదలచినాము. కనుక, ముందుగా బాలకవి శరణ్యము వ్రాత ప్రతి అచ్చుకోసము సిద్ధపరచి శీఘ్రముగా పంపవలసినదని కోరినారు. నేను ఆగష్టు మాసము చివరివారములో లండన్ నుండి తిరిగి వచ్చి పర్లాకిమిడి చేరుకొన్నాను. మరికొద్ది దినములకే ఈ లేఖ వచ్చినది. అప్పటికి తెలుగు పత్రికలో ప్రకటితములయిన రెండు ప్రసంగములు మాత్రమే మా తండ్రిగారు వివరించి వ్రాసినారు. అట్లే తక్కిన సుమారు 100 ప్రసంగములును వారు వ్రాయవలెనంటే అయిదు మాసములైనా

పట్టును "సరే; నా నోట్సు ఆధారముగా పెట్టుకొని నీవే వ్రాయాలి. నీ కీ ప్రసంగములన్నీ తెలిసినవే కదా; నేను వ్రాయడానికి పూనుకొంటే నా చాదస్త మెక్కువ ఎంత వ్రాసినా నాకు తృప్తి ఉండదు పని ఎప్పటికీ పూర్తికాదు. నీ వయితే క్లుప్తముగా వ్రాయగలవు; నీవే వ్రాయవలె' నన్నారు సరే అని గ్రంధము పూర్తిచేసి మా తండ్రిగారికి చూపించాను. కొన్ని భాగములు ఎప్పటికప్పుడే చూపిస్తూ వచ్చాను వారి దిద్దుబాట్లవల్ల చిత్తయిన కాగితాలు చించివేసి మరల వ్రాస్తూ వన్నాను. మొత్తానికి మాట దక్కించుకొన్నాము. నవ్యసాహిత్యము వారు ప్రకటించిన గ్రంధముల విషయము వేంకటరత్నము గారు వివరించి చెప్తారన్న నమ్మకముతో ఈ విషయము ఇంతటితో చాలిస్తాను.

వీరు రచించిన గ్రంథాలలో ముఖలింగమునకు సంబంధించినది, సవర లకు సంబంధించినవి, నవ్యసాహిత్య పరిషత్తువారు ప్రకటించినవి ఇవిగాక ఆంగ్లభాషలోనున్న (Memorandum of Telugu) అనే పేర నున్నది. 1913 లో మద్రాసు యూనివెర్సిటీ వారికి సమర్పించినది. దాని ప్రతులు ఇప్పు డెక్కడా కనబడటములేదు నీ వద్ద నున్నదా? అని క్రిందటి సంవత్స రము వేంకటరత్నముగారిని అడిగినప్పుడు ఒక ప్రతి ఉన్నదని చెప్పి నా కోరికను ఆదరించి పంపించారు అదే ఈ ప్రతి. దీనిని మరల ముద్రించుట వలన ఈ తరము వారికి అనేక విషయములు తెలియగలవని నా నమ్మకము. ఆ పని ఈ అకాడెమీ వారి వలననే కావలెనని నా కోరిక.

ఇంతవరకును బహిర్గతములయిన వారి సాహిత్య విద్యాది పరిశ్రమలను గూర్చి మాత్రమే కొంతవరకు వివరించి చెప్పినానుగాని, వారి గార్హస్థ్య జీవితమునకు, కుటుంబ పరిస్థితులకు సంబంధించిన విషయములలో చెప్పదగి నవిగాని, వారి వ్యక్తిగతములయిన గుణగణములను గూర్చిగాని, వారిశీలము, హృదయము, సంఘ సంస్కార విషయములోను మతవిషయములోను, ఆధ్యా త్మిక విషయములోను వారి అభిప్రాయములను గూర్చిగాని ఏదో అక్కడక్కడ సూచనగా మాత్రమే పేర్కొనుట జరిగినదిగాని, వివరించి చెప్పలేదు. కొన్ని

సంకీర్ణ వర్గమునకు చెందిన ఛలోక్తులు, ప్రసంగములు నాకు తెలిసినవి. నేను విన్నవి కూడా చెప్పదగినవి కలవు వీటిలో కొన్ని కృష్ణా పత్రికలో పెక్కు వారముల పాటు ప్రకటిస్తూ వచ్చాను అవి అన్నీ చేర్చి ఒక గ్రంథముగా శ్రీ ముదికొండ సుబ్రహ్మణ్యశర్మగారు (ఆ పత్రికా సంపాదకులు కనుక) ప్రకటిస్తామన్నారు వారికి నా కృతజ్ఞతాభివందనములు

# ఆధునికాంధ్ర సాహిత్యముపై
# గిడుగు రామమూర్తి పంతులుగారి ప్రభావము

—తెలికిచర్ల వెంకటరత్నం

రామమూర్తి పంతులుగారు నాడు వ్యావహారికభాషా పునః ప్రతిష్ఠాపనోద్యమము అంత దక్షతతో నడిపి ఉండకపోతే నేడు మనవాడుకభాష సమస్త నాగరిక వ్యాపారాలకూ ఇంత చక్కగా ఉపయోగపడుతూ ఉండడమున్ను, నేటి మన సాహిత్యము ఇతర భారతీయ సాహిత్యాలతో నీవా నేనా అని తులతూగుతూ ఇట్లు తలఎత్తుకోగలిగి ఉండడమున్ను సంభవమయి ఉండదని గట్టిగా చెప్పగలము ఎందువల్లనంటే నాటికీ నేటికీ మరొకరెరీ ఆపని ఆరీతిగా నిర్వహింప గలిగిన సమర్థులు ? మహోద్యమము నడపడానికి ఆవశ్యకమైన లక్షణాలన్నీ, శక్తియుక్తులన్నీ, వారిలో ఇమిడి ఉన్నట్లు వ్యావహారికభాషా రంగములో కృషిచేసిన వారి సమకాలికులలో గాని, తరువాతి తరమువారిలో గాని ఏ ఇతరులలో ఉన్నవి ? ఆదిలో రామమూర్తి పంతులుగారు చేసిన కృషిని బాగాఎరిగిన సమకాలిక వ్యక్తి, వారితో కలిసిపనిచేసినవాడు, నిష్పాక్షికముగా నిజాయితీగా చెప్పగల సమర్థుడు J. A. Yates దొర.

రామమూర్తి పంతులుగారి రచనలున్ను, వారి గౌరవార్థము ప్రకటించిన Commemoration Volume, వ్యాస సంగ్రహమున్ను 1934 లో నేను పంపగా అవి అందుకొని వ్రాసిన జాబులో రామమూర్తి పంతులుగారినిగూర్చి ఏమని పేర్కొన్నారో వినండి —

I shall treasure them as a moments of one than whom, whether in India, or in any other land no finer character, nor more profound and ardent scholar can be foundఅని ఆయన ఆ జాబులోనే ఇంకా ఇలాగ వ్రాశారు I think apart from the logic of his appeal, it was the call to libeity in it and the humanity of it, since it meant freedom to the poor and the outcast,

that took me from the beginning But if he had not been able to back his appeal with a wonderful carry of incontrovertible facts perhaps his appeal would have been of less efficacy with the educated Who after all were the people that had to be converted His industry and learning are as amazing as his sincerity and he had also the gift of speech He could convince by argument and persuade by warmth of rhetoric, and not mere rhetoric but emotional speech I do not know of any man who could so combine in himself the scientist and the ardent propagandist అని చూనారా ! ఈ మహాకార్య నిర్వాహణకు వారొక అవతార పురుషునివలె మనలో వెలిగారు తమకార్యము ఎన్ని కష్ట నిష్ఠురాలకయినా సహించి నెరవేర్చుకొని మరీ తనువు చాలించారు.

రామమూర్తి పంతులుగారు ఏకార్యము చేపట్టినా వారిది ఛల్లూకపుపట్టు Be thorough, fight to the finish-ఇవీ ఆయన యెదుట ఎల్లప్పుడూ ఉన్న-అంతేకాదు ఆయన అందుకొన్న ఆదర్శములు. ఒకవంక ఉద్యోగము శ్రద్ధతో చేస్తూనే దేశచరిత్రలో బి. ఏ. పరీక్షకు ప్రయివేటుగా హాజరయి మద్రాసు యూనివర్సిటీలో ఆ యేడు ఉత్తీర్ణులయిన వారిలో రెండవవాడుగా వచ్చారు. ప్రథముడుగా రాజాలకపోయినందుకు ఎంతో కించపడ్డారు. కళాశాలలో పాఠం చెప్పితే అంత క్షుణ్ణంగా పాఠం చెప్పడము ఇంకెవరికీ సాధ్య పడదు అనిపించేవారు ఆయనవద్ద చదువుకొన్న విద్యార్థులెవ్వరూ ఆయన సబ్జక్టులో పరీక్ష తప్పడము ఎప్పుడూ ఉండేదికాదు సవరభాష అభ్యసించి అది మాతృభాషగా గలవారికంటె చక్కగా మాట్లాడగలిగి దాని స్వరూపము, స్వభావము, తత్త్వము, ఆ భాష ఏ కుటుంబానికిచెందినదో, దానిపుట్టుపూర్వోత్తరాలేవో సర్వవిషయాలూ అవగాహన చేసుకొని, ఆ బాషనేర్చుకోదలచిన వారికి అత్యంతోపయోగకరముగా ఉండేటట్లు వాచకములు, వ్యాకరణము, నిఘంటువులు వ్రాశారు తనకు తెలుగుభాష గురించి తెలిసినదానికంటె సవర భాషగురించే ఎక్కువ సమగ్రముగ తెలుసునని సగర్వంగా చెప్పేవారు. సవర బాషగురించి ఆయన వ్రాసిన గ్రంథాలు తెలుగుభాష గురించి Aiden,

Brown, Campbell మొదలయినవారు వ్రాసిన గ్రంథాలను, తమిళ, కన్నడ, మలయాళములను గురించి Pope Kittle, Gundart వ్రాసిన వ్యాకరణ నిఘంటువులను తలపించడమేకాదు అతిక్రమించినవని అభిజ్ఞుల అభిప్రాయము. శబరభాషా వాగనుశాసను డనేబిరుదము వారికి వచ్చింది తెలుగు భాషా పరిశోధనము ఆయన ఆరంభించడము ఇంచుమించు 50 వ పడిలో. పండితులను పాండిత్యముతోనే జయించడము సాధ్యమని నిర్ణయించుకొని భారతభాష-అందులోనూ ముఖ్యముగానూ యీభాష బహుపరిశీలనతో అభ్యసించి ప్రాచీనభాషమీద మోజుపడేవారికి తల దిమ్మెక్కేటట్లు అత్యంత ప్రాచీన భాషలో "ప్రాదెనుగుం గమ్మ" అంటే పాత తెలుగులో వ్రాసినజాబు-అనే రచనచేసి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో 1914 లో అనుకొంటాను ప్రకటించారు. అది అనన్యసాధ్యమైన విపరీత రచన. ఏ గ్రంధసాహాయ్యముగాని ఏ విద్వాంసుని సాహాయ్యముగాని లేకుండానే ఆయన ముఖలింగదేవాలయములోని శాసనాక్షరాలొక టొకటే పోల్చి కూడబలుకుకొని చదివి పరిశోధించి నూతన చరిత్రాంశాలు సిద్ధాంతీకరించి ఆరంగములో ప్రజ్ఞావంతు డనిపించుకొన్నారు ఆయన అవసానకాలములో సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదటి సంపుటము ప్రకటితమయి ఒకప్రతి విమర్శనార్థము నావద్దకు నవ్యసాహిత్య పరిషత్కార్యాలయానికి వచ్చింది. ఆ ప్రతి రామమూర్తి పంతులుగారికి పంపి ప్రతిభలో ప్రకటించే నిమిత్తము దాని విమర్శవ్రాసి పంపమని కోరినాను 118 పుటల గ్రంధము-కూలంకష విమర్శవ్రాసి ఆయన పంపారు అదేవారి చివరి రచన ఇంతపట్టుదలతో, ఇన్ని రంగాలలో పనిచేసిన రామమూర్తి పంతులుగారు వ్యావహారికభాషా సమస్య చేపట్టినారంటే దాని అంతు కనుక్కొని జయావహము చేశారన్నమాటే.

రామమూర్తి పంతులుగారి జీవితములో ఎన్నెన్నో ఘట్టములు ఆయన స్వార్థము కించిత్తయినా గణింపక అత్యంతోదార సంకల్పముతో ప్రజోపయోగకరములైన కార్యములలోనే కృషిచేశారని నిరూపిస్తవి తెలుగువారిలో అక్షరాస్యుల సంఖ్య ఆనాడు చాలా తక్కువ. 1901, 1911 జనాభాలెక్కల

ప్రకారం అక్షరాస్యులు నూటికి 8, 9 మందిమాత్రమే పాశ్చాత్య దేశాలలో కనీసం నూటికి తొంభై మంది అక్షరాస్యులు. ఇది తెలుసుకొని తెలుగువారిలో బాలబాలికలకేకాదు వయోజనులలో సహితము విద్య బాగా వ్యాపించాలని వారభిలషించారు. పాశ్చాత్య దేశాలలో బాలబాలికలకూ, వయోజనులకూ స్త్రీలకూ, కర్షక కార్మికులకూ అందరికీ పనికివచ్చే వివిధతరగతుల గ్రంథాలూ గ్రంథాలయాలు ఉన్నవని తెలుసుకొని మనదేశములో కూడా అట్టివి ఉండ వలెనని వాంఛించారు. స్త్రీలు తమంతటతాము చదువుకొనే గ్రంథముల అవస రము గ్రహించారు ఏ స్కూలులోనూ ప్రవేశించడానికిగాని ఇంకేవిధముగాను చదువుకొనడానికి గాని అవకాశములేని పంచములకోసం వారు స్వంతఖర్చుతో ఒకబడి నెలకొల్పారు. హరిజనాభ్యుదయము ఎవ్వరూ తలపెట్టక పూర్వమే ఈ బడి పెట్టడమూ—తెలుగు అనే మాసపత్రిక ప్రకటించడము ఆరంభిస్తూ 1919 లో దాని తొలిసంచిక తొలివ్యాసములో—Introductionలో తెలుగులో సుబోధమైన సాహిత్యము అవతరించడము అవసరమని ఆ విషయమై ఇట్లు వ్రాశారు.

Is it not right to hope that the school of light, more light will find its justification in a splendid rebirth of Telugu writing-tales - poems, essays, dramas, instinct with reality, reflecting consciously the life of the people written in a tongue that all may read and readily understand ?—అనిన్ని We believe in the uplift of the mases Is there not here this reform of language the surist means of spreading light among the poor and needy ? Is not our beautiful living tongue a true vehicle for our message? Our little ones are starved for good literature. Our women hunger for pure imaginative books Education is not limited to the school room. Good literature which inspires good thoughts is needed beyond in the world."

ఆయన తరుచు అంటూ ఉండేవారు భాష కేవలము ఒకసాధనము మాత్రమే. ఆ సాధనము ఎంత సులభముగా వాడుకోదగిన దయితే దానివల్ల

అంత అధిక ప్రయోజనము నెరవేరుతుంది. అట్టి మంచిసాధనము వాడుక భాషేగదా ' దేశములో ప్రజలందరికీ అందుబడిలో ఉండే సారస్వతము సృష్టి కావలెను ప్రజలందరూ ఆబాలగోపాలము విద్యావంతులై ఇతర ప్రాంతాల జనములతో సరితూగి తలయెత్తుకొని తిరగవలెననేదే నా ఆశయము-అని. అంతటి ప్రజాభిమానమూ లోకోపకారదృష్టికల రామమూర్తి పంతులుగారు భల్లూకపు పట్టుతో వ్యావహారికభాషా పునః ప్రతిష్ఠాపనోద్యమము చేపట్టినా రంటే ఇక దాని సమస్యలన్నీ తీరిపోయినవన్న మాటేకదా '

రామమూర్తి పంతులుగారు I A Yates, P T Srinivasa Iyengar ల తోడ్పాటుతో యూనివర్సిటీ అధికారులకూ విద్యాశాఖాధిపతులకూ విద్యావిజ్ఞానముల వ్యాపకానికి వ్యావహారికభాష అత్యంత సులభసాధనమని నచ్చచెప్పి వాడుకభాషలో వ్రాసిన గ్రంథాలు పాఠ్యపుస్తకాలుగా ఏర్పాటుచేసి, కలకత్తా విశ్వవిద్యాలయములో ఉన్నరీతిని విద్యార్థులు తమవ్యాసము గ్రాంథిక భాషలోగాని వాడుకభాషలోగాని వ్రాయవచ్చుననే స్వేచ్ఛ కల్పించారు ఈ మార్పులు ఎంతమాత్రము గిట్టలేదు. పండితులకూ గ్రాంథికభాషా వాదు లకున్నూ, అంతటవారు పెద్దబ్రహ్మాండమైన ప్రతిఘటనోద్యమము సాగించారు ప్రభుత్వముపైని ఎంతో ఒత్తిడి తెచ్చారు. వ్యావహారిక బాషపై ఆంక్ష విధింపజేశారు ఆంధ్రసాహిత్య పరిషత్తు స్థాపితమై ఈ ప్రతిఘటనోద్యమము యావత్తూ జయప్రదముగా నడవడమువల్ల బలమూ కొంత ప్రతిష్ఠా చేకూర్చు కొని వృద్ధిలోకి వచ్చింది. రాజులు, మహారాజులు, జమీందారులు, ఉన్నతో ద్యోగులు, పండితులు, విద్యావంతులు, గ్రాంథికాంధ్రపక్షమై నిలవగా, రామ మూర్తి పంతులుగారు, గురజాడ అప్పారావుగారు, P T. శ్రీనివాసయ్యం గారు, I A Yates మాత్రము వ్యావహారికభాషా పక్షమున కృషిచేశారు. ఈ ప్రతిఘటనోద్యమము తీవ్రతరమైనకొద్దీ వ్యావహారిక భాషావాదము అంత కంతకు బలము చేకూర్చుకొంది అందులోని బాగోగులు ప్రజలకు బాగా ఎరుకపడుతూ వచ్చాయి సానుభూతికలవారి సంఖ్య పెరుగుతూ వచ్చింది. ఈ ఉద్యమములో తక్కువవారి తోడ్పాటు కొంత ఉన్నా మొత్తముమీద ఆ

భారమంతా రామమూర్తి పంతులుగారే వహించవలసి వచ్చింది. ఒంటిచేతి మీద దానిని నడిపి కృతకృత్యులయి అభినవాంధ్ర వాగనుశాసనులనే బిరుదు గడించుకొన్నారు శబరవాగనుశాసనులని ఒకవిధమైన తిరస్కార భావముతో ప్రతిపక్షులచే పేర్కొనబడే రామమూర్తి పంతులుగారు అభినవాంధ్ర వాగను శాసనులని వారిచేతకూడా అంగీకరింపబడ్డారు రెండు భాషలలో వాగనుశాస నులు వారు.

రామమూర్తి పంతులుగారు ధనవంతులు కాకపోయినా వ్యయప్రయాసల కోర్చి స్వంతఖర్చుతో విశాఖపట్టణం, చిత్రాడ, పిఠాపురం, కాకినాడ, మద్రాసు, తంజావూరు మొదలయిన ఎన్నో స్థలాలకు - ఎక్కడెక్కడ ప్రాచీన తాళపత్ర గ్రంథాలు, ఇతర లిఖిత పుస్తకాలు ఉన్నవని తెలిస్తే ఆ యా చోట్లకు పోయి తెలుగులో వచన రచనా సంప్రదాయము ఎట్టిదో తెలుసుకొన్నారు కవులు, పండితులు తమ కాలములో వ్యవహారములో ఉన్న శిష్టభాషలో-శతాబ్దముల తరబడి - సర్వవిధ వచనమూ - వ్యాఖ్యలు, టీకలు, బడి పుస్తకములు మొదలు వేదాంత గ్రంథాల వరకూ వ్రాశారని రూఢిగా గ్రహించారు. అట్టి గ్రంథాలు కొన్ని సేకరించారు గ్రంథాలు దొరకకపోతే గ్రంథ భాగాల ప్రతులు అక్కడక్కడ వ్రాసిపెట్టుకొన్నారు మాదరికి. గ్రాంథిక వచనమనేది చిన్నయసూరి నీతిచంద్రికతోనే ప్రారంభమయి రాను రాను కృతకపద భూయిష్ఠమై, నిర్జీవమై, విద్యావ్యాప్తికి, సాహిత్య సృష్టికీ ఆటంకము కలిగిస్తూ ఉన్నదని ఆయన స్పష్టపరచుకొన్నారు. భారతభాష క్షుణ్ణముగా అవగాహన చేసుకొని, పూర్వాంధ్రకవుల భాషకూ ఉత్తరాంధ్రకవుల భాషకూగల భేదము నిర్ణయించు కొని ఆ పిమ్మట నేటివరకూ భాషలో కలుగుతూ వచ్చిన మార్పులుకూడా విస్పష్టము చేసుకొని తెలుగుభాష చరిత్ర గురించి కొన్ని కొన్ని సిద్ధాంతాలు చేసుకొన్నారు. భాషాతత్త్వము, Phonetis Philologyఅభ్యసించిన పంతులు గారు తెలుగు భాషా వాఙ్మయాలు శాస్త్రీయ పద్ధతిని పరిశీలించారు. 1913 లో వారు ఇంగ్లీషులో వ్రాసిన Memorandum on Modern Telugu గ్రంథమున్నూ 1914 లో వ్రాసిన "నిజమయిన సంప్రదాయము" అనే చిన్న

తెలుగు పుస్తకమున్నూ ఆయన ఎంత పరిశ్రమ కొద్ది సంవత్సరాల కాలములో చేశారో ఆశ్చర్యము గొల్పేటట్లు రుజువు చేస్తాయి

తాము సేకరించిన సమస్త సామగ్రీసహితంగా ఆయన తెలుగు దేశములోఉన్న అన్ని కళాశాలలకూ, ఇటు బరంపురము మొదలు అటు చెన్నపట్టణము వరకూ, 1914-15 సంవత్సరాలలో వెళ్ళి ప్రతి కళాశాలలోనూ పండితులనూ, అధ్యాపకులనూ ప్రిన్సిపలు తోడ్పాటుతో సమావేశపరచి తాను సేకరించిన సామగ్రి వారియెదుట పెట్టి పూర్వకాలము వచన స్వరూపము ఎట్లున్నదో విశదీకరించి, ఏయే రూపాలు నేటి పండితులు గ్రామ్యములుగా పరిగణిస్తున్నారో అవి శిష్టవ్యవహారాను రూపముగా పూర్వులు తమ రచనలో వాడి ఉన్నారని నిదర్శనములు చూపి ఆ సభవారి వద్ద తాను రుజువు పరచిన విషయానికి సర్టిఫికెట్లు పొందారు. ఆ సర్టిఫికేట్ల వివరమంతా 1919 లో, తమ తెలుగు పత్రిక సంచికలలో ప్రకటించారు. తాము వెళ్ళిన ప్రతిచోటా సభలుచేసి తమ వాద స్వరూపము విశదీకరిస్తూ వచ్చారు. యువకులను యువకవులను ఈ వాదము చాలా ఆకర్షించింది. ఒక వంక తిరుపతి వేంకట కవులు, ఇతర శతావధానులూ ఆశుకవిత్వ ప్రదర్శనములతో పద్యరచనకు సులభ మార్గము చూపి కవులను ప్రోత్సహించగా రామమూర్తి పంతులుగారు బాలకవుల మార్గము ఇంకా సుగమయమయే త్రోవచూపి నవరచనను ప్రోత్సహించారు. వ్యావహారిక భాషలో వచన రచన చేయుమని ఉద్బోధించారు.

రామమూర్తి పంతులుగారు తమ వాదములో నాలుగు ప్రధానమార్గములు అనుసరించారు. వారి వాదము చతుర్ముఖ వ్యూహము ప్రతికక్షులకు అష్టదిగ్బంధనమన్న మాట. ఆ నాలుగు మార్గములేవో రామమూర్తిపంతులుగారి గ్రంథాలు నాలుగూ వారి సప్తతి తమ జన్మదినోత్సవ సమయాన ప్రకటించినప్పుడు వాటికి వ్రాసిన సంపాదకీయ భూమికలో పేర్కొన్నారు. ఆ విషయము ఇప్పుడు తిరిగీ చెప్పుతున్నాడు.

1. భాషా తత్త్వమూ, భాషా శాస్త్రమూ వ్యక్తీకరించి ప్రవాహరూపాన నిత్యమూ మారుతూ ఉండే జీవద్భాషలలో పదస్వరూపము, పదముల అర్థము పదప్రయోగ విధానము అన్నిటిలోనూ కాలక్రమాన మార్పులు సంభవిస్తూ ఉండడము సహజమనీ ఆయా కాలముల కవులూ, రచయితలూ తమ కాలాన ఉన్న ప్రయోగములు ఆదరించడము అన్ని భాషలలోనూ కానవచ్చే సంప్రదాయమనీ, మన పండితులు గ్రామ్యములని నిరసించే కొన్ని రూపములు భాషాశాస్త్ర రీత్యా తమిళ, మలయాళ, కన్నడ భాషలలోని తుల్యప్రయోగముల దృష్ట్యా ప్రయోగార్హములే అని నిరూపించుట ఇది వ్యాసావళి అనే గ్రంథములో ఎత్తుకొన్న మార్గము.

2. గద్య చింతామణి - ఇందులో గత మూడు నాలుగు శతాబ్దముల లోను తెలుగు వచన గ్రంథములు ఎట్టి శైలితో ఉన్నదో నిరూపించడానికి ఆ యా గ్రంథములలోని కొన్ని భాగములు ఉదాహృతములైనవి Specimens of Telugu Prose ఇది వ్యాకరణము వివిధ శాస్త్ర గ్రంథములు, చరిత్ర, కథలు, వేదాంతము, వార్తాపత్రికలు మొదలయిన సమస్త విధ రచనలలోనూ మన పూర్వులు వ్యావహారిక భాషే ప్రయోగించినట్లు ప్రత్యక్ష సాక్ష్యము. చిన్నయసూరి నీతిచంద్రిక పాఠ్యగ్రంథమయే వరకూ బడి పుస్తకాలన్నీ ప్రభుత్వమువారి ఆమోదముద్ర పొందినవే వ్యావహారిక భాషలోనే ఉండేవి

3 గ్రామ్యభాషను నిరసించే మహా మహోపాధ్యాయులు ఒకరు వ్రాసిన గ్రంథములో ఇంకొకరు వేనవేలు తప్పులు లెక్కవేసి చూపి బహు మోటుగా దూషించుకొనడము వల్ల గ్రాంథిక భాష మహాకవులకూ మహా పండితులకూ కూడా చక్కగా అవగాహన కాలేదనే విషయము స్పష్టము ఆ సందర్భములో బాల కవులనూ, విద్యార్థులనూ గ్రాంథికము నేర్చుకోవలెననీ, అందులోనే వ్రాయవలెననీ నిర్బంధించడము అసంగతమని బోధించే గ్రంథము ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజము. వేదము వెంకటరాయ శాస్త్రులుగారి

గ్రాంథికాంధ్ర పాండిత్యము ఈ గ్రంథములో తీవ్ర విమర్శకు వచ్చింది సాధుప్రయోగమును అసాధువని దూషించడము పతివ్రతను కులట అని దూషించడము వంటిది మహా మహోపాధ్య కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులుగారు తెలుగు రానివారనీ, సంస్కృతము తెలియనివారనీ; వ్యాకరణము ముఖమే ఎరుగని వారనీ ఆయన చూపిన ప్రతి తప్పు విమర్శిస్తూ ఎగతాళి చేశారు కొన్నిచోట్ల మరీ అట్టహాసము చేశారు వారు తప్పులన్నవాట్లో ఇంచుమించు సగము వాస్తవంగా ఒప్పులే తప్పులేవో, ఒప్పులేవో తెలుసుకోలేని గ్రాంథికాంధ్ర పాండిత్యము వారిదని ఆ గ్రంథములో రుజువు చేయడములో ప్రధానోద్దేశము గ్రాంథికాంధ్రము ఎవరూ నిర్దుష్టముగా వ్రాయలేరనీ, స్వభాషలో సుపరిచితమైన భాషలో వ్రాయదగుననీ చెప్పడమే ఈ గ్రంథోద్దేశము.

4. రామమూర్తి పంతులుగారి నాలుగో గ్రంథము బాలకవి శరణ్యము. ఇందులో పూర్వకవుల ప్రయోగములు, వందల కొద్దీ ఉదాహరణములు పేర్కొని, అవి గ్రామ్యములు కావనీ, ప్రయోగార్హములే అనీ వ్యాకరణము లలో వాటికి గతి కల్పించకపోతే వ్యాకరణములదే దోషమనీ, బాలకవులు కవి సంప్రదాయాను సారముగా వాటిని యథేచ్ఛముగా వాడవచ్చుననీ ఉద్బోధించారు ఆ వాదానికిక తిరుగులేదు

బహుభాషా పరిజ్ఞానము. తెలుగు సంస్కృతాలలో అపార పాండిత్యము, ఎదురులేని తార్కికప్రజ్ఞ, సర్వతోముఖ వాదాపటిష్ఠత వారి గ్రంథాలలో ఏ పుట తిరగవేసినా కనబడతవి. ఈ గుణాలన్నీ వారి ఉపన్యాసాలలోనూ కానవచ్చేవి వాటికి తోడు గంభీర కంఠధ్వనీ తీవ్రావేశమూ కూడా ఉండేవి. వారికిమోమోటమిలేదు. కవులనూ పండితులనూ వారి యెట్టయెదుటనే తీవ్రముగా విమర్శించేవారు. అది వ్యక్తి దూషణము కాదు. తన వాదము నిలబెట్టుకోడానికీ ప్రతిపక్షులను తనపక్షానికి తిప్పుకోడానికీచేసిన వాదము మాత్రమే రామమూర్తి పంతులుగారు తమ వాదపటిమతో తమ పక్షానికి త్రిప్పుకొన్న వారిలో మొట్ట

మొదటి వారు. విజయనగరాస్థానములోనూ, కళాశాలలోనూ పనిచేసిన యనమండ్ర నారాయణమూర్తిగారు తెలుగుబాగా చదువుకొని కవిత్వముచెప్పిన వారు. అది ఒక ఘన విజయముగా భావించి తరుచు ఆ విషయము చెప్పుతూ ఉండేవారు పర్లాకిమిడిలోఉన్న పండితులనూ రచయితలనూఆయన వ్యావహారిక భాషావాదులునుగా మార్చారు. వారిలో ముఖ్యులు వాసా సూర్యనారాయణశాస్త్రి బంకపల్లి మల్లయ్యశాస్త్రి, పారనంది జగన్నాధస్వామిగారు కాటమూరి వైకుంఠరావు, యల్లాపంతుల జగన్నాధంగారు మున్నగువారు రామమూర్తి పంతులుగారి వల్లా, గురజాడ అప్పారావుగారి వల్లా ఈ వాదము అంగీకరించిన విజయనగర వాస్తవ్యులు తాతా సుబ్బారాయశాస్త్రి, వఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారు బుర్రా శేషగిరిరావు, బాలకవి భోగరాజు నారాయణమూర్తి మున్నగువారు. విశాఖపట్నంలోని P. T. శ్రీనివాసయ్యంగారు, ఆదినుంచీ వ్యావహారిక భాషావాదులే - గురజాడ వారివలె. విశాఖపట్నం కళాశాలలో అధ్యాపకులు శెట్టి లక్ష్మీనరసింహంగారు వ్యావహారిక భాషలో వచన రచన చేసిన తొలుతటి ఆధునికులలో ఒకరు దూరస్థులలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో, మద్రాసులో, ఉద్యోగస్థులై ఉండి ప్రాచీన గ్రంథాలలో వందలూ వేలూ వ్యావహారిక భాషలో వ్రాసినవి ఉన్నవని స్వయముగాఎరిగి స్వతస్సిద్ధముగా సంస్కార ప్రియులు గనుక రామమూర్తి పంతులుగారి వాదము నూటికి నూరుపాళ్ళూ ఆమోదించి ఆదినుంచీ తోడ్పడుతూ వచ్చినవారు. అక్కిరాజు ఉమాకాంతంగారు గురజాడవారి ప్రభావంవల్ల ఈ వాదానికి సుముఖులయినారు విద్యాశాఖలో ప్రముఖ స్థానలలో ఉన్న దొరలు తెలుగుభాష గురించి తెలిసినవారు ఈ వాదాన్ని ఆమోదించారు వారిలో I A, Yates రామమూర్తి పంతులుగారికిచ్చిన తోడ్పాటు ఇంతా అంతా కాదు.

ఇంతటి సాహాయ్య సంపద సంపాదించుకొన్న రామమూర్తి పంతులుగారికి 1916 లో కొవ్వూరులో జరిగిన పండిత సభవారి వాదము ఆమోదిస్తూ ఒక తీర్మానము చేసి ఎంతో ఉత్తేజితులను చేసింది. ఆ సందర్భములో భాషా

పోషకులు పోలవరం జమీందారులూ, వారి సన్నిధానమున అప్పుడున్న తిరుపతి వేంకట కవులున్నూ రామమూర్తి పంతులుగారి వాదాన్ని, ఆయన పూనికను శ్లాఘించారు తిరుపతి వెంకటకవులు ఆ పిమ్మట ఒక మహాసభలో చేసిన సవాలు ఇది—

కాలముఁబట్టి దేశమునుగాంచి ప్రభుత్వమునెంచి దేశ భా
షా లలితాంగి మాఱుటది సత్కవి సమ్మతమౌట, నవ్య దే
శ్యాలును నాంధ్రభాష గలపౌటను నౌచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటిమని పండితులేగతి నొప్పకుందురో—అని.

కవికి లోకమే ప్రమాణమనీ, తమ అంతఃకరణ ప్రవృత్తే తమ కత్యంత ప్రమాణమనీ, తెలుగులో వ్యాకరణాలు, కోశాలు పరస్పర విరుద్ధములై కనబడుతున్నందున కవులప్రయోగాలే, రామమూర్తి పంతులుగారు చెప్పినట్లు పరమ ప్రమాణములనన్ని వారు పేర్కొన్నారు.

1919 వ సంవత్సరము రామమూర్తి పంతులుగారి ఉద్యమ చరిత్రలో ఒక ప్రధాన ఘట్టము ఆ యేడు కందుకూరి వీరేశలింగం పంతులుగారిని వ్యావహారిక భాషా వాదానికి సుముఖులనుగా మాత్రమే కాక నాయకత్వము వహించే వారినిగా చేశారు వీరేశలింగం పంతులుగారు రామమూర్తి పంతులు గారి కోరిక ననుసరించి తమ ఆనందోద్యానములో ఒక పండిత సభను కూర్చి, అందులో వర్తమానాంధ్రభాషా ప్రవర్తక సమాజ మనే పేరిట ఒక నూతన సంస్థకు అంకురార్పణము చేశారు. నాటి సభ వీరేశలింగం పంతులుగారిని అధ్యక్షులుగాను, రామమూర్తి పంతులుగారినీ, జయంతి గంగన్నగారినీ కార్యదర్శులుగాను ఎన్నుకొన్నది ఇతర సభ్యులనూ ఎన్నుకొన్నది. ఆ సమాజ స్థాపనము రామమూర్తి పంతులుగారికి కొండంతబలము చేకూర్చింది. అదివరకు తమ వాదమును ఎదిరించి "ప్రాఁదెనుఁగుం గమ్మపై" అంపగమి ప్రయోగించిన మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారి నదే సమయాన తమ పక్షానికి త్రిప్పుకొన్నారు. అది మొదలు వారు శిష్యశ్రేణిలో చేరి వీలు

చిక్కినప్పుడల్లా పర్లాకిమిడి వెళ్ళి, రామమూర్తి పంతులుగారి వద్ద అనేక నూతన విషయాలు తెలుసుకొంటూ ఉండేవారు. ఆ యేడే వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజ పక్షాన "తెలుగు" అనే మాసపత్రిక ప్రకటించడము ప్రారంభించారు రామమూర్తి పంతులుగారు ఆ పత్రిక ఒక సంవత్సర కాలము మాత్రమే నడచినా దాని ద్వారా వారు సాగించిన ప్రచారము ఇంతా అంతా కాదు. ఆ యేడే సాహితీ సమితి నెలకొల్పబడింది. సమితి సభ్యులలో చాలామంది శ్రీ శివశంకర శాస్త్రి, శ్రీ నోరి నరసింహశాస్త్రి, మున్నగు వారు రామమూర్తి పంతులుగారితో పరిచయముండి వారి భాషావాదములో సానుభూతి కలిగినవారే, సమితి ప్రకటించే సాహితి అనే పత్రికలో కథలు, వ్యాసాలు, వ్యావహారిక రచనలు పలుభంగులవి చక్కని వాడుక భాషలో వెలువడేవి. క్రొత్త కవిత్వము, క్రొత్త క్రొత్త వచనరచనా ఫణితులు, జీవముతో తొణికిసలాడే నూతన వచనశైలీ వీటితో నిండి అత్యంతాకర్షణముగా ఉండే సాహితీ పత్రిక. రామమూర్తి పంతులుగారి వాద మొకవంక వ్యాపిస్తూ ఉండగా దాని కీ పత్రిక లక్ష్యభూతముగా నిలిచి ఆ వాద ప్రాశస్త్యము రుజువుచేస్తూ ఆదర్శ వాఙ్మయము సృష్టించేది బసవరాజు అప్పారావుగారి గేయాలు హాయిచే ప్రాణాలు పరవశమయేటట్లు గండుగోయిల గానము వినిపించి క్రొత్త గేయ రచనకు కవులను పురికొల్పుతూ వచ్చాయి. సాహిత్యానికి సంకెలలు విడిపోతున్నవనే ఆనందోత్సాహాలు పాఠకలోకములో వెల్లివిరిశాయి. ఈ నూతనాభిరుచి త్వరత్వరగా విస్తరించింది.

గుంటూరు నుండి గుంటూరు పత్రిక, రాజమహేంద్రవరములో భమిడిపాటి సత్యనారాయణగారి సంపాదకత్వాన స్వతంత్ర పత్రికా వ్యావహారిక భాషను ఆదరించాయి బారిష్టరు పార్వతీశము, ఆ పిమ్మటనే కాబోలు ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లిన్ని వచ్చి వాడుక భాషకు ప్రతిష్ఠ చేకూర్చాయి. యెంకి పాటలు వచ్చాయి. అధికార్ల సూర్యనారాయణరావు గారి జానకి పాటలున్ను వచ్చాయి 1922 లో కౌతా శ్రీరామశాస్త్రి గారి సంపాదకత్వాన వెలువడ్డ శారద పత్రిక, రామానంద ఛటర్జీగారి Modern Review పత్రికను

ఆదర్శముగా పెట్టుకొని నవ్యసాహిత్య సృష్టికీ, ప్రచారానికీ అత్యంత దోహద కారి అయింది 1924 లో "భారతి" ని స్థాపించి నాగేశ్వరరావు పంతులుగారు ప్రాచీనాంధ్ర సాహిత్యముతో పాటు నవ్యసాహిత్యానికీ, వ్యావహారిక రచనలకూ కూడ సమాన గౌరవస్థాన మిచ్చి ఆదరించారు కృష్ణా పత్రికలో ముట్నూరి కృష్ణారావు పంతులుగారు సంపాదకీయములు కూడా వ్యావహారిక భాషలో రచించి దానికొక విశిష్ట గౌరవము చేకూర్చారు ఈ రీతిగా 1919 మొదలు 1924 వరకూ వ్యావహారిక భాషోద్యమములో జరిగిన కృషి ఒక పంచవర్ష ప్రణాళిక వేసుకొని తదనుగుణముగా సాధనచేస్తే ఎట్టి ఫలితాలు చేకూరుతవో ఆ రీతిగా అత్యంత ఫలప్రదమైనది సాహితీసమితి వారి రచనలు మెచ్చుకొని ఇతర సమితులూ సమాజాలూ అక్కడక్కడ ఏర్పడి నూతన రచనలు విరివిగా సృష్టించ నారంభించినవి వంగదేశములో రవీంద్రనాధ టాగూరు వ్యావహారిక భాషను తొలుదొల్త తన రచనలలో ప్రవేశపెట్టి సజీవ భాషా మాధుర్యము ప్రజలకు చవిజూపగా యువ రచయితలు పలువురు రవీంద్రుని మార్గము ననుసరించి అత్యంతాకర్షకమయిన తమ వ్యావహారిక రచనలతో దేశములో ఉన్న పత్రికలన్నీ నింపివేసి కొద్ది సంవత్సరాలలోనే గ్రాంధికభాషా రచనల కెక్కడా తావులేకుండా చేసి నూతనాభిరుచిని దేశవ్యాప్తము చేశారు గ్రాంధిక వ్యావహారిక భాషా వాదోపవాదాలతో అక్కడ అంతగా పనిలేకపోయింది తెలుగు దేశములో వాదోపవాదాల తీవ్రత తగ్గిన తరువాత 1924 నాటికి వంగదేశములో నెలకొన్న పరిస్థితుల వంటివి ఏర్పడ్డవి. పత్రికలలో వ్యావహారిక భాషా రచనలే ఎక్కువౌతున్నవి

1924 అక్టోబరు నెలలో 9 వ తేదీ మొదలు 13 వ తేదీ వరకూ తణుకులో (పశ్చిమ గోదావరి జిల్లా) ఆంధ్ర సాహిత్య పరిషత్తు 13 వ వార్షికోత్సవము జరిగింది. ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగా రధ్యక్షులు ఆ సభకు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు, తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, త్రిపురాన సూర్యప్రసాదరావు గారు, కురుగంటి సీతారామయ్యగారు, చింతా దీక్షితులుగారు, కొడారు

ఆంజనేయులుగారు, శ్రీ సీతాపతి పంతులుగారు మొదలయిన పలువురు ప్రసిద్ధ కవులు, పండితులు వచ్చారు నేనున్ను రామమూర్తి పంతులుగారితో వెళ్లాను. ఆ సభలో ఒకనాడు రామమూర్తి పంతులుగారు ఒక్కబిగిని 5 గంటలసేపు గంభీరోపన్యాసము చేసి తమ వాదము సమగ్రంగా వినిపించారు. వారి ఉదారాశయము, సంస్కరణాభిలాష, సాహిత్య పురోగమన కాంక్ష, దేశభాషాభ్యుదయ వాంచ ఎల్లవారినీ ముగ్ధులనుచేశాయి వారి పాండిత్య ప్రదర్శనము ఒక జడివానవలె ఎల్లరినీ ముంచెత్తింది. ప్రతిపక్షులు ఆ వాదబలిమికి లోబడి ఎదురాడలేక ఆయన ప్రవేశపెట్టిన తీర్మానము ''గ్రామ్యము కాని వ్యావహారికాంధ్ర భాషలో పూర్వ సంప్రదాయము ననుసరించి గ్రంథములు రచింపవచ్చును '' అనేది హర్షధ్వానాలతో ఆమోదించారు. దిగ్విజయము సాధించినంత సంతోషముతో ఉప్పొంగిపోయారు. రామమూర్తి పంతులుగారు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు నాడు తన వాదము ఆమోదించింది. అప్పుడన్నారు మాలో అప్పారావు (అంటే గురజాడ) లేడు. వాడుంటే ఇప్పుడు సంతోషము పట్టలేక గంతులువేసేవాడు అని ఈ విజయము తనది మాత్రమే కాదు వ్యావహారిక భాషావాదు లందరిదీ అని ఆయన అభిప్రాయము.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తణుకు సభనుంచి తిరిగిరాగానే గ్రామ్యభాషను చీల్చి చెండాడడానికి వజ్రాయుధ మనే పత్రిక చేపట్టారు. అదివరకే రాజమహేంద్రవరములో సుప్రతిష్ఠితమై నెలకొన్న "సుజనరంజని" అనే వార పత్రిక డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి సహకారముతో సంప్రతింపులతో వజ్రాయుధాన్ని ఎదుర్కొని దానిని నిర్వీర్యము చేసింది వజ్రాయుధ ప్రభావమువల్ల వ్యావహారిక భాషోద్యమానికి పెంపు పుష్టి కలిగినవే కాని హాని కలుగలేదు.

1926 లో రామమూర్తి పంతులుగారు కొన్నాళ్ళు నావద్ద గుంటూరిలో ఉన్నారు. అనేక సభలలో ప్రసంగించారు. ఆ సమయములోనే సాహితీసమితి వారిని గౌరవ సభ్యులనుగా చేర్చుకొని వారిపట్లా, వారి ఉద్యమము పట్లా

గౌరవము ప్రదర్శించి వ్యావహారికభాషా వ్యాపనానికి కంకణము కట్టుకొన్నది. తరువాత సఖి అనే త్రైమాసిక సాహిత్య పత్రిక నెలకొల్పి అత్యుత్తమ రచనలలో అభినవాంధ్ర సరస్వతికి మధురోపాయసము లందిచ్చింది. క్రమంగా వ్యావహారిక భాషలో వ్రాయడము ఒక ఫాషను అయిపోయి పలువురు రచయితలు దానిని చేపట్టారు 1926 లో మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రభాషాను శాసనమనే కొత్త వ్యాకరణము వ్రాశారు. ఒకప్పుడు ఆంధ్ర సాహిత్యపరిషత్ కార్యకర్తలుగా పనిచేసిన శాస్త్రిగారు వ్యావహారిక భాషా పక్షపాతము పూని ఆ గ్రంథము రచించారు. ఆ వ్యాకరణములో రామమూర్తి పంతులుగారి ప్రభావము చాలా గోచరిస్తుంది. దాని రచనకు ముఖ్యముగా అవ్యయ ప్రకరణ, ప్రయోగ విశేష ప్రకరణములకు రామమూర్తి పంతులు గారు సేకరించిన కవి ప్రయోగములున్ను వారి సిద్ధాంతములున్ను విరివిగా వినియోగింపబడ్డాయి

చాలామంది రచయితలతో రామమూర్తిపంతులుగారు ఉత్తర ప్రత్యుత్త రాలు సాగిస్తూ ఉండేవారు వారికి దిశదిశలూ గ్రంథకర్తల దగ్గరనుంచి కొత్తకొత్త పుస్తకాలు అందుతూ ఉండేవి. అవి అన్నీ ఆ మూలాగ్రముగా చదివి రచయితలకు సూచనలు చేస్తూ, అభివందనములందిస్తూ, ప్రోత్సాహము కల్పిస్తూ జాబులు వ్రాసేవారు. గుడిపాటి వెంకటాచలముగారు చిత్రాంగి ప్రతిని పంపి దానికి ఉపోద్ఘాతము వ్రాయమని కోరితే సుదీర్ఘమయిన చక్కని పీఠిక వ్రాసి పంపారు. భారతిలో "యెనక జల్మములోన యెవరమోనంటి అనే యెంకిపాట ప్రకటితమైంది. అది చదివి ఆనందము పట్టలేక margin లో A gem అని వ్రాసుకొని వెంటనే నండూరి సుబ్బారావుగారికి అభినందన సందేశము పంపారు. ఇట్టి జాబులు వందలూ వేలూ వ్రాసి నవ్యసాహిత్య ప్రపంచములో సన్నిహిత సంబంధము ఎల్లప్పుడూ ఆయన నిలుపుకొనేవారు.

1933 వ సంవత్సరములో రాజమహేంద్రవరములో రామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవము వైభవోపేతముగా జరిగింది.

ఆ సందర్భములో వారి గౌరవార్థము అభినవాంధ్ర కవి పండిత సభ ద్వితీయ సమావేశము ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు అధ్యక్షులుగా జరిగింది. దేశము నలుమూలల నుంచీ కవులు, రచయితలు, పండితులు, పత్రికా సంపాదకులు, వివిధ సాహిత్య సంస్థల ప్రతినిధులు రెండువందల మందిదాకా సమావిష్టులై రామమూర్తి పంతులుగారిని అభినందించి వారి కృషిపట్ల తమ గౌరవము ప్రకటించారు రామమూర్తి పంతులుగారు అప్పటి వరకూ ప్రకటితమైన నవ్యసాహిత్య గ్రంథాల ప్రతులు వేదికమీద రమణీయముగా పేర్చి నీ నవ్యసాహిత్య సరస్వతికి పూజచేసి నీరాజన మిచ్చారు. ఆనాడు కూడిన పెద్ద బహిరంగసభలో రామమూర్తి పంతులుగారి కొరక (Commemoration Volume) వ్యాస సంగ్రహము సమర్పితమైన వారి రచనలు నాలుగు గ్రంథాలు వ్యాసావళి, గద్య చింతామణి, ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము, బాలకవి శరణ్యము ఆనాడే ప్రకటింపబడ్డాయి వ్యాససంగ్రహ సంపుటములో ఇంగ్లీషులో 13 వ్యాసములు తెలుగులో 33 వ్యాసాలున్నూ కూర్చబడ్డాయి ఆయా వ్యాసకర్తలు తమతమ రచనలను రామమూర్తి పంతులుగారికి అంకితమిచ్చారన్న మాట. పంతులుగారు ఏయే విషయాలలో పరిశోధన చేశారో, పరిశ్రమచేశారో వాటికి సంబంధించేటట్లు మానవజాతి శాస్త్రము, పురావస్తు శాస్త్రము, శాసనపరిశోధనము, సవరభాష, ఆంధ్రభాషా చరిత్రము, (Dravidian Philology, Phonetics) నవ్యసాహిత్యము మొదలయిన విషయాలను గురించి ప్రతిభావంతులైన పరిశోధకులు విద్వాంసులు, కవులు వ్రాసిన వ్యాసము లందులో ఉన్నవి ఈ సంపుటము (Bhandarkar Commcmoration Volume)ని తలపిస్తుంది. తెలుగులో ఇది అపూర్వ గ్రంథము. రామమూర్తి పంతులుగారు రజితపేటికలో పెట్టి సమర్పించిన ఆ గ్రంథము అందుకొని సమావిష్టులైన సభ్యులను చూచి ఉత్తేజితులై అన్నారు — 20 ఏండ్ల క్రిందట నేను వాడుకభాష గురించి ప్రజలకు నచ్చజెప్పవలెనని ఈ నగరములో ప్రయత్నిస్తే అప్పుడు నాకు ఉపన్యసించే అవకాశమే— అందుకు తగిన స్థలమే దొరకలేదు అట్టి

రాజమహేంద్రవరములో పూర్వము నాకు ప్రతిపక్షులుగా ఉండే పలువురు కవి పండితుల సమక్షములో నే డింతటి అపూర్వ సత్కారము జరగడము నా వ్యావహారిక భాషావాదము ప్రజాదరమూ పండితాదరమూ పొందిన దనడానికి ప్రబల తార్కాణము ఈ సంపుటములోని వ్యాసములు వ్రాసిన వారంతా నా వాదము ఆమోదించారని గర్విస్తున్నాను నా కృషి ఫలించింది అని ఆయనకు కలిగిన సంతృప్తి, సంతోషము వర్ణనాతీతములు నాటి కవిపండిత సభలో ఆ సంస్థ పేరు నవ్యసాహిత్య పరిషత్తుగా మార్చారు రామమూర్తి పంతులుగారు గౌరవాధ్యక్షులుగా, ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు అధ్యక్షులుగా పలువురు ప్రముఖ కవి పండితులు కార్యనిర్వాహక సభ్యులుగా నవ్యసాహిత్య పరిషత్తు అవతరించింది. నన్ను కార్యదర్శిగా ఎన్నుకొన్నారు, వ్యావహారిక భాషోద్యమము నవ్యసాహిత్య మహోద్యమములో అంతర్భూతమయింది. పిమ్మట నవ్యసాహిత్య పరిషత్తు ప్రతిభ పత్రిక ద్వారా, నవ్య గ్రంథమాల నవ్య సాహిత్య విక్రయశాల ద్వారా, పలుతావులలో జరిగిన వార్షికోత్సవాల ద్వారా, ఇతర కార్యకలాపాల ద్వారా చేసిన కృషి అందరికీ తెలిసినదే. ఇక్కడ అవి వివరించడము అనవసరము.

ఆ పిదప కొద్ది సంవత్సరాలలో తాపీ ధర్మారావుగారివంటి సిద్ధహస్తులైన పలువురు ప్రముఖ రచయితలు అంతవరకూ తమ్ము అంటిపెట్టుకొన్న పాతపాళీలు పరిత్యజించి, కొత్త పాళీలు కలాలకు తగిలించి సరస వ్యావహారిక భాషా రచనలకు పూనుకొన్నారు. శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు తమ వ్యాసాలు వివిధ సమస్యలను గూర్చి వ్రాసినవి శరపరంపరగా వర్షించి పత్రికా లోకాన్ని ముంచెత్తారు. వారి వ్యాసాలు పలువురు ప్రాచీనులకు మార్గదర్శకాలై వ్యావహారిక భాష విస్తరిల్లినది ఇంతలో సినీమా కళ తలయెత్తి అనతి కాలంలో వృద్ధిలోనికి వచ్చింది నాటికా రచన, ప్రదర్శనము బాగా వ్యాప్తిలోనికి వచ్చాయి. అనేక వార పత్రికలు, మాస పత్రికలు–పాఠకుల సంఖ్య వృద్ధి కాగా కొత్తగా ప్రారంభమయినాయి సాహిత్య, సాంస్కృతిక సభలూ సమావేశాలూ, ఉత్సవాలూ ఊరూరా జరపబడుతూ

నవ్యసాహిత్య ప్రచారానికి దోహదమిచ్చాయి ఢిల్లీ రేడియో కేంద్రమునుంచి తెలుగు వార్తలు ప్రసారము కావడమూ, ఆ తరువాత మద్రాసులో రేడియో స్టేషను నెలకొల్పడమూ, ఢిల్లీలో శ్రీ కపిల కాశీపతిరావు మున్నగువారు, మద్రాసులో శ్రీ ఆచంట జానకిరామ ప్రభృతులూ చక్కని వ్యావహారిక భాషకు వార్తా ప్రసారాలలోను, వివిధ సాహిత్యాధి కార్యక్రమాలలోనూ, ప్రవేశ పెట్టడమూ జరిగాయి సినీమాకు, రేడియోకు రంగస్థలానికి వడ్డించిన విస్తరిలోని పంచ భక్ష్యపరమాన్నములవలె సర్వాంగ సుందరమై, సజీవమై, ఆ పాతమధురమై జాతీయమై తేట తెల్లమైన తెలుగు శైలి రామమూర్తి పంతులుగారు నడిపిన ఉద్యమమువల్లా, దానిని ఆమోదించి రచయితలు సమాయత్తముచేసి ప్రచారములోనికి తెచ్చిన వ్యావహారిక భాషవల్లా అప్పటికి సిద్ధముగా ఉంది — ఆస్వాదించడానికి అట్టి తెలుగుశైలి సిద్ధముగా ఉండి ఉండకపోతే ఆయా కళలూ పరిశ్రమలూ ఎట్టి భాష తమకు యోగ్యమో తామే ఏర్పాటు చేసుకోవలసి వచ్చేది. ఎందుకంటె సినీమాకిగాని రేడియోకి గాని, రంగస్థలానికిగాని, పత్రికారచనకుగాని ఎంత మాత్రమూ పనికిరాదు గదా గ్రాంధిక భాష '

ఆంధ్రభాషాభిమానే కాక ఆంధ్రదేశాభిమాని కూడా అయిన రామమూర్తిపంతులుగారు తమ నివాసస్థలమైన పర్లాకిమిడిని, తెలుగువారు అధిక సంఖ్యాకులుగా ఉన్న ఆ పట్టణాన్ని సబబయిన తన వాదాన్ని త్రోసిపుచ్చి ప్రభుత్వమువారు అక్రమంగా ఉత్కళరాష్ట్రములో చేర్చినందుకు నిరసనగా విడిచివేసి రాజమహేంద్రవరానికి తమ నివాసము మార్చుకొన్నారు ఆంధ్ర దేశము నడిబొడ్డున ఉన్నందుకు భాషాసారస్వత రంగాలలో కృషిచేస్తున్న యువకులను చాలామందిని చేరదీస్తూ, తమ నివాసమే సరస్వతీపీఠము చేసి తమ ప్రసంగాలతో, ఉపదేశాలతో వారికి తగిన ప్రోత్సాహము కల్పిస్తూ వచ్చారు ఇంతలో ఆరోగ్యముచెడి వైద్యము నిమిత్తము మద్రాసువెళ్ళి అక్కడ 1940 జనవరి 15 వ, తేదీని తుదివిన్నపమనే శీర్షికతో పత్రికలలో ప్రకటితమైన తమ చివరి ఉపన్యాసము చేశారు. వ్యావహారిక భాషకు కలిగిన

వ్యాప్తికి తమ సంతృప్తి వెల్లడించారు పత్రికలే-ఇంటింటికీ విద్యావిజ్ఞానములు మోసుకుపోయి బోధిస్తాయి కనుక ఒక యూనివర్సిటీ అని ఈ యూనివర్సిటీ వ్యావహారికభాషనే వాడుకచేస్తూ ఉన్నట్లు మన విశ్వవిద్యాలయాలు కూడా వాడుకభాషకు ప్రవేశము కల్పిస్తే తమ ఉద్యమము నూటికినూరు పాళ్ళు సఫలమౌతుందనీ ఆకార్యసాధన దేశీయులకు ఒప్పగించి వెళ్ళితున్నామనీ ఆయన అన్నారు. ఇంకొకవారము దినములలో 22-1-40 తేదీని దేహయాత్ర చాలించారు

రామమూర్తి పంతులుగారు మొట్టమొదట వ్యావహారిక భాషోద్యమము ప్రారంభించినపుడు విద్యాబోధన సుకరము కావలెననీ బాలబాలికలకూ స్త్రీలకూ తమంతట తాము చదువుకొని ఆనందించడానికి యోగ్యముగాఉండే పుస్తకాలు రావలెననీ వాంఛించారు అప్పుడు బాలబాలికలకు బాలల పత్రికలు, బాల వాఙ్మయము. బాలల రేడియో కార్యక్రమాలు. బాలల సినీమాలు, బాలల సంఘాలు మొదలయినవన్నీ వచ్చాయి స్త్రీలకున్ను ఇట్టివన్నీ వచ్చాయి. రామమూర్తి పంతులుగారికి తీరని కోరికగా ఒక్కటే ఒక్క విషయము నిలిచిపోయింది. విశ్వవిద్యాలయాలలోనూ విద్యాశాఖలోనూ వ్యావహారికభాషకు ప్రవేశము చిక్కలేదు.

మన యూనివర్సిటీల శాస్త్రసాంకేతిక విద్యలలో ఎంత ముందడుగువేసి uptodateగా ఉంటున్నదో తెలుగుభాషా సాహిత్యముల విషయములో అంత వెనకడుగువేస్తున్నది దేశములో ఇంతగా వ్యావహారికభాష వ్యాప్తమైవాడుకలో ఉంటే ఎంతగాఅంటారా:రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారివంటి మహాపండితులు వ్యావహారికభాషలో వ్రాయడము యోగ్యముగా అంగీకరించే టంతగా, ఇంకా మొన్న జనవరి నెలలో గౌరవనీయ కేంద్రప్రభుత్వ రేడియో సమాచార శాఖామాత్యులు, మన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ అధ్యక్షులు, విద్యావేత్తలు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు రాజమహేంద్రవరములో జరిగిన అఖిలభారత తెలుగు రచయితల ద్వితీయ మహాసభ వేదికపై నిలిచి 70 ఏళ్ళుదాటిన ఏ

కొద్దిమంది పూర్వాచార పరాయణులైన పండితులో తప్ప - విశాఖపట్టణము పిచ్చి ఆసుపత్రికి వెళ్లేయోగ్యతగలవారు తప్ప నేటిరచయితలు ఇంకెవ్వరూ గ్రాంథికభాషలో వచనము వ్రాయడములేదు అని గంభీరముగా పలకడానికి తావిచ్చేటంతగా - వ్యాప్తమై వాడుకలో ఉంటే యూనివర్సిటీలు ఇంకా వ్యావహారిక భాషలో ఆమోదించలేదు మాన్య శ్రీ గోపాలరెడ్డిగారే అదే వేదిక మీద ప్రసంగిస్తూ - వేదికమీద ఆసీనులమైన కొందరివైపు తిరిగి ప్రశ్నించారు వ్యావహారికభాష యూనివర్సిటీవారు ఆమోదించారా లేదా అని లేదని మేము చెప్పవలసి వచ్చింది.

యూనివర్సిటీలకు కళ్ళులేవా ? చెవులు లేవా ? దేశములో ఏమి జరుగుతున్నదో కూడా పెద్దలేమంటున్నారో కూడా, ఇంకా గ్రాంథికభాషనే పట్టుకొని ప్రాకులాడుతున్నది, పాఠ్యపుస్తకాలు తానే కూర్పించి అచ్చువేయించుకొని అమ్ముకొంటున్నది? తనకు కావలసిన నవలలు నాటకాలు ప్రైజులిచ్చి గ్రాంథిక భాషలో వ్రాయించుకొని ప్రకటించుకొని తిరగామరగావేసి ఆ కొద్ది పుస్తకాలనే ఏటేటా పాఠ్యపుస్తకాలుగా నిర్ణయించుతున్నది. విద్యాశాఖ చేస్తున్న పనికూడా ఇట్టిదే ఒక కొత్తతరగతి రచయితలను అట్టిపెట్టుకొని వారిని పోషిస్తున్నది. దేశములో ఉత్పన్నమౌతున్న సాహిత్యమువేరు. విద్యాశాఖవారి గ్రంథాలువేరు యూనివర్సిటీలో ఆ గ్రంథాలే చదివినా పట్టభద్రులై బయటపడినవారు స్వేచ్ఛగా ఆ పిమ్మట వ్రాసేది వ్యావహారికమే కాని గ్రాంథికభాష కాదుగదా' ఈ సంగతికూడా యూనివర్సిటీ గమనించదా ?

ఈ పరిస్థితులు తప్పించేమార్గము ప్రధానముగా మన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ మీదా ఈ సదస్సుల మీద ఉన్నది. రామమూర్తి పంతులు గారియెడల మనము చూపదలచిన గౌరవము-మరి అందుకేకదా మనమిక్కడ సమావేశమైనాము - ఈకార్యము సాధించడము మూలముగా చూపించుదాము.

---

# సాహిత్యోపన్యాసములు

## ౧




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము - హైదరాబాదు - 4.

# విషయానుక్రమణిక

'ఏకాగ్రప్రపూర్ణ' చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి

# జీవితము : కార్యకలాపములు

— శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఆంధ్రవాఙ్మయ చరిత్రలో పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధము ఒక విలక్షణ మైన కాలము. ఆ కాలమున ఉదయించిన సారస్వతవేత్తలు పదిమంది యున్నా రన్నచో, వారిలో తొమ్మండుగురు వాచాస్వతంత్రులు, తాము తలపెట్టిన కార్యములందు పరమాభినివేశము కలవారు, తరతరాల నుండి వచ్చు సంప్రదాయములలో ఆచారములలో అభినవార్థములు తీసినవారు, దార్శనికము తార్కికము నైన పలుకుబడి కలవారు, నా దేశము నా ప్రజ నా భాష యనువానియందు అభినివిష్టబుద్ధికలవారు, ఆంగ్లవంగాది సంఘసారస్వతములం దాచార్యభావము పెట్టుకొన్నవారు, ఆంధ్ర జాతిలో ఆంధ్ర కవిత్వములో క్రొత్తదనము రావలయునని మోహ పెట్టినవారు, సంస్కరణములకు మాన ధనప్రాణము లిచ్చినవారు

గత శతాబ్ది సగపాలులో ఎందఱో ధీమంతుల పేళ్లు మన మెఱుఁగుదుము కందుకూరి వీరేశలింగముగారు, తిరుపతి వేంకటకవులు, పానుగంటివారు, గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, కట్టమంచి రామలింగారెడ్డిగారు, దర్మవరము రామకృష్ణమాచార్యులుగారు... ఈ నక్షత్రమండలిలో చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి స్థానము దీప్తిమంత మైనది

నిజమునకు, సారస్వతమునకు లక్ష్మీనరసింహముగా రెంత చేసిరో అంతకంటె అధికాధిక మైన సపర్య తెనుఁగు జాతికిని వారు చేసి రన వచ్చును ఏకాంతమున భావనాతపోనిష్ఠలోనుండి రచన సాగింత మన్న దృష్టిని మించి, తెనుఁగు జాతిలో ఒక చైతన్యము ప్రబుద్ధ మగుటకు

గ్రంథరచన చేయవలె నన్న తహతహ చిలకమర్తివారికి మిక్కుటము ఆనాటివారిలో ఒక్కొక్కఁడు ఒక్కొక్క సవ్యసాచిగా, కార్యములు నిర్వహించిరి కావ్యములు రచించిరి పనిచేసి చనిపోయియు ప్రజా సమాజములో నేఁడు జీవించియున్నవారైరి అప్పటి యశశ్శేషులలో నూఱేండ్లనాఁడు పుట్టిన చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి జీవితమెట్టిది ? ఆయన కార్యకలాపము లెట్టివి ?

1832 సంవత్సరములో తెనుఁగునాఁట గొప్ప కఱవు వచ్చెను నందనసంవత్సరపుఁ గఱవని దానికిఁ బ్రసిద్ధి ఆ రోజులలో గుంటూరు మండలమునుండి పెక్కు కుటుంబములు గోదావరీ మండలమునకు వలస వచ్చినవి ఆ విధముగా వచ్చిన కుటుంబములలో చిలకమర్తివారి దొకటి లక్ష్మీనరసింహముగారి తాతగారి నివాసము మొగలితుర్రు తండ్రిగారి నివాసము వీరవాసరము

ప్రభవ సంవత్సర భాద్రపద బహుళ చతుర్దశి – అనగా 1867 సెప్టెంబరు 26 వ తేదీని లక్ష్మీనరసింహముగారు ప్రభవించినారు తల్లి పేరు రత్నమ్మ తండ్రి పేరు వెంకయ్య మాతామహస్థానము విద్వత్తా మహితమైనది బ్రహ్మసూత్ర భాష్యము నాంధ్రీకరించి ప్రభావతీప్రద్యుమ్నాది కావ్యములకు వ్యాఖ్యలు వ్రాసి పిఠాపురము మహారాజావారిచే సత్కారము పొందిన పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు లక్ష్మీనరసింహము గారి మేనమామ మాతామహుఁడు భద్రయ్యశాస్త్రిగారు శిష్టులైన సంస్కృత విద్వాంసులు ఆ సంప్రదాయములోఁ బెరిగిన లక్ష్మీనరసింహముగారికి చిననాట ఉపనయనసంస్కారము జరిగెను గురువునొద్ద సంధ్యావందనము చెప్పుకొనుచుండఁగా నొక విశేషము జరిగెను. సాయంకాల మసివాఱునకుఁ బోయినపుడు తన ప్రియమిత్రుఁడైన యొక మంగలి కుఱ్ఱవానికి గాయత్రీ మంత్రమును గూర్చి చిలకమర్తి యేదో చెప్పుచుండెను అది గురువు కంట బడినది మఱునాఁ డాయన లక్ష్మీనరసింహము పాఠమునకు రాఁగా, కోపముతో మఱి చెప్పను బొమ్మ

నెను తండ్రి వెంకయ్యగారికి తన కొడుకు కర్మిష్ఠి కావలెనని ఆశ యుండెను కాని సాగినదికాదు.

లక్ష్మీనరసింహముగారు మేనమామ మల్లయ్యశాస్త్రి యొద్ద సంస్కృత కావ్యపాఠము చేసెను ఇంగ్లీషు బడిలోఁ జేరెను ఆంగ్లములో, భూగోళములో, చరిత్రలో మంచి చుఱుకుఁదనము గణితములో వెనుదీఁత కారణము గణితములో అభిరుచి లేమి యొకటి దృష్టిలోప మొకటి మూఁడవ తరగతిలో లెక్క తప్పుచేసి యిర్వదికంటె హెచ్చు దెబ్బలు తిన్న ఘట్ట మున్నది చిలకమర్తికి చిననాఁటినుండియు పాటలు వినుటలో ఆసక్తి గోవిందనామము, కుశలవ కద, ధర్మరాజు జూదము, లక్ష్మణదేవర నవ్వు మున్నుగా స్త్రీలు పాడుచుండు పాటలు ఆయన సాహిత్య జిజ్ఞాసను పల్లవింప జేసిన వనుట మనము మఱవిపోరాదు ఆయన ఏకసంధాగ్రాహి యగుటచే బడిలో విన్న పాఠముగాని, ఇంటి యొద్ద విన్న పాటలు గాని పద్యములు గాని ముఖస్థము కావలసినదే

నరసాపురము టైలరు హైస్కూలులో చదువుచున్న 'చిలకమర్తి' తన మేనమామతో 1881 సంవత్సరమున రాజమహేంద్రవరమునకు రావలసివచ్చెను అప్పటి కాయన వయస్సు పదునాల్గు సంవత్సరాలు. ఆనాఁడు రాజమహేంద్రవరమున లక్ష్మీనరసింహముగారికి తన తలంపులకు మెఱుఁగులు దిద్దగల మహామహుల సందర్శనము లభించెను. క్రొత్త గొంతులు వినిపించెను, ఆ యేఁడు వంగదేశమునుండి పండిత శివనాధశాస్త్రి రాజమహేంద్రవరము వచ్చి యేకేశ్వరారాధనము — బ్రహ్మసమాజము అను నంశమును గూర్చి సోద్వేగముగా ప్రసంగించెను ఆ ప్రసంగముచేఁ బెక్కుమంది సమాకృష్టులైరనుట అత్యుక్తి కాదు. 'ఆస్తికపాఠశాలా' స్థాపనమునకు పురికొల్పినది ఆ ప్రసంగమే పెక్కుమంది యువకులలో దేశభక్తి దైవభక్తిని మించి మల్లడిగొన్న రోజులవి చిలకమర్తి ఆనాఁటి ప్రబోధములకు వశుఁ డాయెను సంఘ సంస్కరణోద్యమ నిర్వాహకులలో అగ్రేసరు డైన వీరేశలింగముగారి

యొద్ద తెనుఁగుపాఠము, పాఠశాలలలోఁ గళాశాలలలో మహామహు లుద్యోగములు చేయుదురు. వారి పాఠప్రవచనములు నిర్ణీతకాలమునకు నిర్ణీత పాఠ్యమునకు పరిమితములై యుండవు. ఏమంతు లైన శిష్యులకు మాత్రమే తాదృశప్రవచనములపై సదభిప్రాయ మేర్పడును. వీరేశ లింగముగారి పాఠమును గుఱించి చిలకమర్తివారి యభిప్రాయము వినుఁడు.

"విశేషకాలము వారియొద్ద సంఘసంస్కరణము మొదలైన విషయములే వచ్చుచుండెను. దీనినిబట్టి పాఠములు చెప్పుచుండుటలే దని యభిప్రాయపడఁగూడదు. ఆయన పాఠములు సరిగాఁ జెప్పుచుండెడి వారు". 1887 లో, మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణుఁ డైన లక్ష్మీనరసింహము గారు సంఘసంస్కరణోద్యమమునందును వీరేశలింగముగారి వెంట దంటగా నడయాడసాగెను. వీరేశలింగముగారికి నాఁడు బసవరాజు గవర్రాజుగారు సంస్కరణోద్యమములో నైదోడు. సమాజములో ఒకప్పుడు వా రిరువురు వెలివేయఁబడిరి. అటులుండ గవర్రాజుగారు మరణించిరి. దహనకర్మకు సభాపతులు చిక్కులు పెట్టిరి. ఎవ్వరును బోరైరి. అపుడు అసహాయశూరు డైన వీరేశలింగముపంతులుగారు శవము వెంట వెళ్లి పుస్తకము చూచి మంత్రములు చదివి కర్మ చేయించెను. అట్టి క్లిష్ట ఘట్టమున 'చిలకమర్తి' కందుకూరివారికి బాసటగా సమాజమును గాదని నిలఁబడెను.

మఱియు, లక్ష్మీనరసింహముగారికి నాటకము లన్నచో అపరిమిత మైన ఆసక్తి. 1888 లో ఏలూరు కంపెనీ, ధార్వాడ నాటక సమాజము రాజమహేంద్రవరములో నాటకము లాడినవి. ఆ నాటకము లాయన ఎంతోప్రీతితోఁ జూచెను. ఆదిలో, ఏలూరు కంపెనీ హిందీనాటకములు కూడ ఆడినపుడు లక్ష్మీనరసింహముగారు 'హిందూస్థానీ' అభ్యాసము చేసెను. ఏ భాష యైనను ఒకసారి విన్నచోఁ జాలును. అది పట్టుబడవలసి నదే. ఆ మేధావిశేష మట్టిది. అప్పటికి ఇరువదిరెండు సంవత్సరాలలోపు

వయస్సు సందర్భము ననుసరించి కొన్ని పద్యములు చెప్పుట తప్ప, 'చిలకమర్తి' యిందాఁక గ్రంధ రచయిత కాలేదు తన గురువు వేదము వేంకటాచలముగారు రాజమహేంద్రవరము కళాశాలనుండి బదిలీ అయి, మదరాసు వెళ్లుచుండగా వీడ్కోలు సభ యొకటి జరిగెను ఆ సభలో గురుభక్తి ప్రేరితుడై లక్ష్మీనరసింహముగారు వ్రాసి చదివిన అయిదు పద్యములతో ఆయన తీయని తొలి గొంతు నగరవాసులైన రసజ్ఞులకు వినిపించెను పుటపుటనైన ఆయన నాటకప్రీతినిగూర్చి మన మను కొన్నాము కీచకవధ నాటకముగా వ్రాయవలెనని సంకల్పము అంకు రించెను తిక్కనగారి విరాటపర్వము చదివించుకొని విని, 'కీచకవధ' కుపక్రమించెను ఆ నాటకము చిలకమర్తి సర్వరచనలకు శ్రీకార మాయెను రాజమహేంద్రవరమునఁ గ్రొత్తగా హిందూనాటక సమాజ మేర్పడెను 'కీచకవధ' ప్రదర్శనము ప్రేక్షకులను రంజింపఁ జేసినది ఆ నాటకములో నాఁడు ద్రౌపదీపాత్ర వహించి నటించిన టంగుటూరి ప్రకాశముగారు చిలకమర్తివారి ప్రశంసకుఁ బాత్రులైరి తరువాత, ద్రౌపదీ పరిణయ రచన ఇవి రెండును వచన నాటకములే

ఏనాటకము తన చిరప్రతిష్ఠకు హేతువయ్యెనో, ఏనాటకము ప్రతులు లక్షకు పైబడి సెనగపప్పువలె మనదేశమున అమ్ముడువడెనో, ఏనాటకములోని పద్యములు పండిత పామరులనోళ్లలో నాని గానము చేయఁబడెనో, అట్టి గయోపాఖ్యానమున కంకురార్పణము జరిగిన సంవ త్సరము 1889. రామకవి యనునతఁడు పద్యకావ్యముగా వ్రాసిన గయోపాఖ్యానమును చదివించుకొని విని లక్ష్మీనరసింహముగారా నాట కము వ్రాసిరి ఆయనకు గయోపాఖ్యాన రచననాఁటికి హెచ్చుగా దృష్టిలోపము లేదు గయోపాఖ్యాన ప్రదర్శనములతో చిలకమర్తివారి పేరు విననివాఁడు తెనుఁగునాఁట లేఁడు

వీరేశలింగముగారి తెనుఁగు శాకుంతలము, తిరుపతివేంకటకవుల పాండవోద్యోగ విజయములు, వడ్డాది సుబ్బారాయుడుగారి వేణీ సంహా

రము, శ్రీపాదవారి బొబ్బిలియుద్ధము, ధర్మవరమువారి చిత్రనళీయము, వేదమువారి ప్రతాపరుద్రీయము, బలిజేపల్లివారి హరిశ్చంద్ర, చిలకమర్తివారి గయోపాఖ్యానము ఇత్యాది ప్రదర్శనములతో ఒకనాఁడు ఆంధ్రదేశము శరన్నిశా వికసితోత్పల కాసారమువలె ఎంత శోభాయమానముగా నుండెడిదో !

1990 సంవత్సరము నాఁటికి 'లోకల్ షేక్స్పియరు'గా చిలకమర్తి పేరు గడించెను ఆ రోజులలో అష్టావధానము చేయవలె నన్న తలంపు కూడ లక్ష్మీనరసింహముగారికిఁ గలిగెను అవధాన కవితా సామ్రాజ్యము నేలిన తిరుపతి వేంకట కవులు ధవళేశ్వరములో చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గారి సన్నిధిని వ్యాకరణశాస్త్ర మధ్యయ నించుచున్న రోజు లవి చిలకమర్తి కవి 1891 లో ధవళేశ్వరమునఁ దొలిసారి యష్టావధానము చేసెను దానికి తిరుపతి వేంకటకవులుకూడ హాజరైరి తరువాత, రాజమహేంద్రవర కళాశాలలో మలిసారి యవధానము చేసెను అంతే అవధానముల వలన మెదడు పాడగు నని పెద్దలు చెప్పఁగా నది మానుకొనెను

ఇర్వదియేడేండ్ల వయస్సు వచ్చినది నాటక రచన తప్ప ఇందాఁక నవల వ్రాయుటకు చిలకమర్తికిఁ గోర్కి కలుగలేదు. 1894 లో న్యాపతి సుబ్బారావుపంతులుగారు హిందూ సమాజపక్షమున నవలల పోటీ నిర్వహించెను ఆ పోటీలో నిలఁబడఁగల నవల తాను వ్రాయవలయునన్న దీక్షతో రామచంద్ర విజయము వ్రాసెను వీరేశలింగముగారి రాజశేఖర చరిత్రము ఉదాహరణముగాఁ జూచుకొని యీ రచన చేసెను నాఁటి పోటీలో బహూకృత మైన 'రామచంద్రవిజయము' చిలకమర్తివారి నవలలలో ప్రథమావతారము ఒకవంక రచనలు. మఱొకవంక సభలలోఁ బాల్గొని ప్రసంగములు రాజకీయములలోఁ బ్రవేశము లేకపోయినను, రాజకీయ సభలలోఁ బాల్గొనుట లక్ష్మీనరసింహముగారి కొక వేడుక విననాఁటినుండి టంగుటూరి ప్రకాశముపంతులు గారితోఁ జెలికార ముండనే యున్నదికదా ! 1894 లో మదరాసులో

జరిగిన కాంగ్రెసు మహాసభకుఁ బోయి చూచెను సురేంద్రనాథ బెనర్జి, మదనమోహన మాలవ్యా ఇత్యాదుల యుపన్యాసములు శ్రవణానందముగా వినెను ఆ యేఁడు గోదావరీమండల సభకుఁ బోయి, ఆ సభలో చదివిన పదునాల్గు పద్యములు నాఁడు బహుప్రజారంజనము చేసి కీర్తి నార్జించుకొన్నవి వానినుండి రెండు పద్యములు .

సీ. తుహినాద్రి మొదలు సేతువుదాఁక రాజ్యంబు
జరిపె నీయాంగ్లేయ దొరతనంబె
జాతి మతాచార సర్వస్వతంత్రముల్
నెఱపె నీ యాంగ్లేయ దొరతనంబె
పిండారి దండుల పేరైన లేకుండ
దోలె నీ యాంగ్లేయ దొరతనంబె
నేర్పుతోఁ జట్టముల్ నిర్మించి క్లేశముల్
తొలఁచె నీయాంగ్లేయ దొరతనంబె
ప్రజలు లోపముల్ చూప నాగ్రహము లేక
కరుణఁ జూపు నీ యాంగ్లేయ దొరతనంబె
ఇట్టి యాంగ్లేయ దొరతనం బెలుఁగాక
ధర్మమతితోడ నాచంద్ర తారకంబు,

సీ నేల దున్నుద మన్నఁ జాలభమము పన్ను
నీరు గావలె నన్న నీటిపన్ను
వాణిజ్య మొనరింప వచ్చుబడికి పన్ను
సరకు లమ్ముద మన్న సంతపన్ను
కల్లు లమ్ముద మన్నఁ గలప కింకొక పన్ను
పట్టణంబుల మున్సిపాలు పన్ను
పాటిపోవుద మన్న బండిహాసీల్ పన్ను
కొంప పమ్ముకొన్నచో స్టాంపు పన్ను

ఉన్నమట్టుకుఁ దినపిండ సున్నపన్ను
ననెడి పన్నులె దిగఁదీసె జనుల నెల్ల
కటకటా! యెట్టు లున్నదో కాపులచెళ
సుగుణధనులార! జనులార! చూడరయ్య!

న్యాపతి సుబ్బారావు పంతులుగారు ఆనాటి పద్యములు విని పరమానంద పడి విజయనగరము పంపి గురుజాడ అప్పారావుగారిచేత ఆంగ్లభాషా పద్యములుగా అనువదింపఁ జేసి రన్నచో మఱి తత్పద్యముల వ్యాప్తిని గుఱించి వేఱే చెప్పనక్కఱ యుండదు

చిలకమర్తివారి నవలలలో రామచంద్ర విజయము తరువాత హేమలత వచ్చెను అది చారిత్రకమైన నవల మెడోసు టెయిలరు దొర వ్రాసిన టిప్పుసుల్తాను, చాందుబీబి, తార మున్నగు నవలలు చూచి అది వ్రాసెను హేమలతకూడ రామచంద్ర విజయమువలె బహుమానము సంపాదించెను పోలవరము జమీందారు కొచ్చెర్లకోట వేంకట కృష్ణారావుగారు కాకినాడలో నెలకొల్పిన 'సరస్వతి' మాస పత్రికకు చిలకమర్తివారి సహాయసంపాదకత్వము శోభ తెచ్చినది 'సరస్వతి'తో పాటు లక్ష్మీనరసింహముగారి భార్య కాపురమునకు రాఁగా జమీందారుగారు నెలకు ముప్పది రూకలు జీత మిచ్చుచు ఆయనను గౌరవించెను నిషధయోగ్యమైన చిలకమర్తివారి శీలము, కీర్తనీయమైన వారి స్వాతంత్ర్యము పెద్దల ప్రశంసలకు పాత్రమైనవి పోలవరము జమీందారుగారి శీలములో గొన్ని ఆక్షేపణీయాంశములు చూచి మొగమోటమి లేకుండ వారికవి చెప్పి, క్రమముగా ఆయన స్నేహమునుండి తొలఁగెనని చెప్పినచో లక్ష్మీనరసింహముగారి స్వతంత్ర భావమునకు మఱొక యుదాహరణ మవసరము కాదు. అయన భోగము మేళములకుఁగాని, వేశ్యల పాటకచ్చేరీలకుఁగాని, నాట్యములకుఁగాని జీవితములో వెళ్ల లేదు వెళ్లనని వీరేశలింగముగారికి ప్రమాణపత్రము వ్రాసి యిచ్చి ఆ మాటపై నిలఁబడెను సత్యనిష్ఠ తాదృశమైనది

1899 లో హితకారిణీ పాఠశాలా స్థాపనోద్దేశము ఫల మయ్యెను రెండువందలు ఎక్కడనో బదులు పుచ్చుకొని కుర్చీలు బల్లలు కొని పాఠశాల నెలకొల్పెను అది రెండేండ్లలో మూడవఫారమువఱకు పెంపు గాంచెను ఆదిలో హిందూ లోయరు సెకండరీ పాఠశాల యని దానిపేరు క్రమముగా నాల్గవఫారముకూడ ఆ పాఠశాలలో బెట్టించెను. పాఠశాల నిర్వహణములో సాధారణ మైన యెన్ని కష్టములు సహింపవలయునో అన్నియు ఆయన సహించెను

హిందూ నాటక సమాజమునకు సత్యవోలు గున్నేశ్వరరావుగారు లక్ష్మీపతిగారు, రెండు నేత్రములు కాఁగా లక్ష్మీనరసింహముగారి స్థానము దానికిఁ బ్రాణము ఒక యుద్యమము కాదు 1906 లో 'మనోరమ' యను మాసపత్రిక నారంభము చేసెను శ్రీ పిఠాపురము మహారాజా వారితో దగ్గఱి పరిచయము ఆయన మనస్సును రంజింపఁజేసి తన యుద్యమముల నిర్వహణమునకు చాల ద్రవ్యము వారివలనఁ బడసెను. పేదఱికమునకు విద్యాహీనతకు లోనైన నిమ్నజాతులయెడ నాఁడు పెక్కుమంది రాజకీయవేత్తలకు సానుభూతి యుండెను కొందఱు ప్రదర్శించెడి సానుభూతియందు తెచ్చికోలుతన మున్నదేమోకాని, లక్ష్మీనరసింహముగారికి హరిజనులయెడల అవ్యాజ దయాభిమానములు కల వనుటకు స్పష్టసాక్ష్యము 1909 లో ఆయన స్థాపించిన రామమోహన పాఠశాల యొకటి చాలును అది ప్రత్యేకముగ, హరిజనబాలురకొఱ కేర్పఱిచినది పిఠాపురము మహారాజావారి సహకారము ఈ పాఠశాల కెంతయో లభించినది. మొదట పదిమందితో ఆరంభము చేసిన ఆ పాఠశాల క్రమముగా నూటయేఁబదిమంది విద్యార్థులతో, ఏడుగురు ఉపాధ్యాయులతోఁ గలకలలాడినది లక్ష్మీనరసింహముగారే చెప్పినట్లుగా, "ఈ పాఠశాల యారంభింపకముందు మన యాంధ్రదేశమున మఱి యెవ్వరును నిమ్నజాతుల నిమిత్తమై ప్రత్యేకముగా పాఠశాలను పెట్టలేదు భాగ్యవంతులు తమ ధనమును ఈ సమస్యను తీసికొని నిమ్న

జాత్యుద్ధరణమునకు వినియోగించిన మనదేశమునకు మన జాతికి ఎంతో మేలు కలుగును ఆ జాతులవారు క్రైస్తవ, మహమ్మదీయులలో కలియకుందురు గనుక సనాతన మైన యతి పవిత్ర మైన మన హిందూ మతము వృద్ధిపొందును"

నిష్కలుష మైన దేశభక్తికి చిలకమర్తివారిని తార్కాణగాఁ జెప్ప వచ్చును 1909 లో మింటోమార్లే రాజకీయ సంస్కరణలు మనదేశ మునకు వచ్చినపుడు చెన్నరాష్ట్ర పక్షమున న్యాపతి సుబ్బారావు పంతులు గారికి శాసనసభా సభ్యత్వము నిచ్చినవార్త విని, టవునుహాలులో నుండఁగా సంతోషము పట్టలేక తన జేబులో నున్న రెండు రూపాయలు తీసి మిఠాయి తెప్పించి మిత్రులకు పంచియిచ్చెను. తాను ప్రకటించు చున్న 'దేశమాత' పత్రికను దొరతనమువారు వేల ధన మిచ్చి పుచ్చు కొందు మన్నను, పరతంత్ర భావమున కిష్టపడక నిరాకరించెను మఱి యొక చిత్రము నాఁడు మాక్మిలన్ కంపెనీ యేజంటు దొరస్వామయ్య గారు నాల్గు అయిదు ఫారములకు తెనుఁగు వాచకములు వ్రాసి కంపెనీకి ఇచ్చినచో చాల ప్రతిఫల మిత్తు మని కోరినపుడు లక్ష్మీనరసింహముగా రిచ్చిన జవాబు ఈ విధముగా నున్నది "ఆంగ్లేయులు మన దేశములోని గనుల వలనను టీ కాఫీల వలనను రైలుబండ్ల వలనను, మఱి యితర స్థానముల వల్లను ధనమంతయు పట్టుకొనిపోవుచున్నారు తెనుఁగుదేశ ములో పుట్టి తెనుఁగు ముక్కలు నాల్గు నేర్చిన మనము తెనుఁగుపుస్తక ముల వలన వచ్చు లాభ మనుభవింపకుండ అదికూడ ఆంగ్లేయులకే యీయవలెనా ? నే నెన్నఁడు ఇంగ్లీషు కంపెనీలకు గ్రంథములు వ్రాసి యివ్వను స్వదేశీయు లెవరేని చేరి యొక కంపెనీ పెట్టిన పక్షమున వారికి వ్రాసియిచ్చెదను లేదా, నాకు నేనే వ్రాసికొనెదను"

ఇది యటుండ, ఆ రోజులలో లాలాలజపతిరాయ్‌గారిని అహే తుకముగా మాండలే జెయిలులోఁ బెట్టినపుడు చిలకమర్తివారు చెప్పిన పద్య మెంత దేశభక్తి మేదురముగా నున్నదో విన్నారుకదా !

మ. చెరసాలల్ పృథు చంద్రశాలలె యగున్ జేదోయి గీలించు న
య్యురిదండల్ విరిదండ లయ్యెడును హేయంబైన యోడంబలే
పరమాన్నం బగు మోటకంబళులు తాల్పన్ బట్టుశెల్లా లగున్
స్థిరుఁడై యే నరుఁ డాత్మదేశమును భక్తిం గొల్చు నవ్వానికిన్

లక్ష్మీనరసింహముగారికి జాతీయతయందు మిక్కుటమైన యభినివేశము మతముల యందు బ్రహ్మసమాజ మతముపై ఆయన విశ్వాసము కలవారు విద్య పురుషుల కెంత యవసరమో స్త్రీలకుఁగూడ నంత యవసర మన్న యభిప్రాయము కలవా రాయన ధనవంతులు దేశమున గానపాఠశాలలను నెలకొల్పి సంగీత కళను మిక్కిలి యభివృద్ధి చేయవలె నని యభిలషించినవా రాయన నాట్యాభినయమునం దభిరుచిగల యాంధ్రులా కళను తమ చిన్నపిల్లలకు నేర్పించవలెనని బోధించినవారాయన వ్యావహారిక భాష యను మాఱుపేరు పెట్టి గ్రామ్యమునే గ్రంధములలో వాడుట భాషను నాశనము చేయుట గాని వృద్ధిచేయుట కాదన్న దృఢవిశ్వాసము కలవారాయన ప్రతి గృహము దేశ మాతృదేవత యాలయముగా నుండవలె నని తలంచినవా రాయన 'ఐకమత్యము' అను పంచాక్షరీ మహామంత్రము ప్రతి మానవుఁడు పునశ్చరణము చేసి యాచరింపవలె నని ఘోషించినవా రాయన. స్వదేశము కొఱకు స్వభాష కొఱకు సహస్రమాస జీవితము అంకితము చేసి, లక్ష లార్జించి సర్వస్వము ఆశ్రితాధీనము చేసి నిర్లిప్తుడైన ఆ మహామహుఁడు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు 1942 లో రాజమహేంద్రవరము విడిచి కాకరపర్రు చేరుకొనిరి ఆది వారి యత్తవారి యూరు ఆయన రాకకు గ్రామవాసులు పరమానందపడిరి అక్కడ నివసించి యుండగా, ఆ వృద్ధమూర్తి యొనరించిన యఖండ భాషాసేవకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు కళాప్రపూర్ణ బిరుదప్రదానము చేయుట జరిగెను మహితానుభవములతోఁ గూడిన డెబ్బదియెనిమిది సంవత్సరముల చిలకమర్తి 'స్వీయచరిత్రము' విద్యాపీఠమైన కాకరపర్రునుండి ఆవిష్కృతి మయ్యెను ఖండవల్లి

ఉదయాద్రిగా, కాకిపర్రు అస్తాద్రిగా, రాజమహేంద్రవరము విహారాంబరముగా యావదాంధ్రదేశమును తన రచనాసహస్రముచే దీప్తిమంతము చేసిన మహారచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు కృపాంభోనిధియైన పరమేశ్వరుని సన్నిధిలో నిలఁబడి, అంజలిబంధముతోఁ జేసిన అభ్యర్థన మిట్లున్నది.

శా. అన్నా! నీదగు మూర్తి యెట్టిదియొ జాత్యంధుండ కాలావ్యవ
చ్ఛిన్నం బై జగదేకపూర్ణమగు నీ చిన్మాత్ర దివ్యాకృతిన్
గన్నారం గనుఁ, బుండరీక దళ సంకాశస్ఫురన్నేత్రుఁడున్
నిన్నున్ జూడఁగలేఁడు చిత్ర మిది తండ్రీ! సత్కృపాంభోనిధీ!

శా. తోలుం గన్నులు చూడలేవుగద విద్యుత్కోటి భాస్వత్ప్రభా
జాలాతీతగుణ ప్రపూర్ణ ఘనతేజోరాశి నీ మూర్తినిన్
నా లోఁగన్నయినం గనుంగొను నటన్నన్ జ్ఞాననేత్రంబు లే
నేలే, దేగతి నిన్నుఁ గన్గొనెదఁ దండ్రీ! సత్కృపాంభోనిధీ!



# చిలకమర్తివారి నాటకములు

— శ్రీ బందా కనకలింగేశ్వరరావు

అది 1933 వ సంవత్సరం, ఏలూరులోని మా యింటి ప్రక్కన తిల్లాప్రగడ నరసింహారావు అను ప్లీడరుగారు వుండేవారు. వారి యింటికి చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు దయచేశారని, ఒకమారు నన్ను అక్కడకు రావలసిన దని ప్లీడరుగారు వర్తమానం చేశారు. అప్పటికే నాకు నాటకరంగంలో అక్షరారంభ మైనది. ఆ ప్లీడరుగారు నావి ఒకటి రెండు నాటకములు కూడ చూడడం జరిగింది. చిలకమర్తి వారికి నన్ను పరిచయం చేయాలని ప్లీడరుగారి అభిలాష. అందుకు అనుగుణంగా, నేను వెళ్లి పంతులుగారికి కేల్మోడ్చి నమస్కరించాను. నా పుట్టుపూర్వాలు, చదువుసంధ్యలు, ఉద్యోగప్రవృత్తులు మొదలగువాని గురించి యిష్టాగోష్ఠి ప్రశ్నించి తెలిసికొన్నారు. వారి ప్రసంగంలో 1881 లో ధార్వాడా నాటక కంపెనీ రాజమండ్రి వచ్చిన దని, అందు "పుత్రకామేష్టి" వారాడిన మొదటి నాటక మని, సుమారు 25 నాటకములు ప్రదర్శించి రనీ, ఆ యా నాటకముల పేర్లు, అందందు పాల్గొన్న నటుల పేర్లు కూడ చెప్పారు. ఆ ధార్వాడావారి పెండాలులోనే కందుకూరి వీరేశలింగం పంతులుగారి అధ్వర్యాన సోమంచి శంకరం, అడివికొల్లు కనకరాజు యింకా మరికొందరు విద్యార్థులు కలసి శకుంతల, రత్నావళి, చమత్కార రత్నావళి నాటకాలను ప్రదర్శించా రని, 1884-87 సంవత్సరాల మధ్య వడ్డాది సుబ్బారాయుడుగారు 'హిందూనాటకోజ్జీవకసమాజం' అను వ్యవస్థను స్థాపించి 'వేణీసంహారం' నాటకాన్ని ప్రదర్శింపించినారనీ, అందు సుబ్బారాయుడుగారు 'అశ్వత్థామ' పాత్రను 'ధర్మజు' పాత్రను పోషించారనీ, ఆ రోజులలోనే పచ్చియప్పాకాలేజి పండితులగు కొండుబొట్లు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు గుంటూరు సామాజికుల కోసం

పండ్రెండు నాటకాలను వ్రాసినా రనీ, అందు 'యుగంధర విజయం' ఒకటనీ సెలవిచ్చారు ఆ రోజులలో డెప్యూటీకలెక్టరుగా ఉన్న ముడుంబై రామానుజాచార్యులవారు "బాలాత్రిపురసుందరీ" నాటకసమాజమును స్థాపించి 'హరిశ్చంద్ర' నాటకమును వ్రాసి, తామే 'హరిశ్చంద్ర' పాత్రను (భూమికను) నిర్వహించా రనీ చెప్పినారు దినవహి హనుమంత రావుగారు 1885 సంవత్సరంలో కాకినాడ ఫస్టు కంపెనీని స్థాపించి వైజరసు అప్పారావుగారు, వల్లూరు సూర్యప్రకాశరావుగారు, కంచి ఆనందరావుగార్ల తోనూ నాటకముల నాడించి నట్లు చెప్పారు సుసర్ల హనుమంతరావుగారు, సుసర్ల శ్రీనివాసరావుగారు వగైరాలు 'పాండవా జ్ఞాతవాస చరిత్ర' అను నాటకమును ప్రదర్శించినట్లున్నూ చెప్పగా విని వారి జ్ఞాపకశక్తిని అభినందించక తప్పలేదు పంతులుగారు తాము 1889 సంవత్సరంలో ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారి కోసం 'కీచక వధ' యను గద్య నాటకమును వ్రాసినా మనీ, అది పద్యరహిత మైన నాటక మనీ దానిని ఆ సంవత్సరంలోనే జూన్ నెల 15 వ తేదీ శనివారంనాడు ప్రదర్శించినా మనీ, తరువాత "హిందూ నాటక సమాజ మును" స్థాపించి, ఆ సంవత్సరమే జూలై నెలలో 'ద్రౌపదీపరిణయం', సెప్టెంబరు నెలలో 'శ్రీరామజననం' గద్య నాటకములుగా వ్రాసినా మనీ, వాటిని హనుమంతరావు నాయుడుగారు, టంగుటూరు ప్రకాశంగారూ ప్రదర్శించినా రనీ చెప్పిరి 1890 సంవత్సరములో నాయుడుగారి కోరికపై మే నెలలో 'గయోపాఖ్యానం', 'పారిజాతాపహరణం', మార్చిలో 'సీతా కల్యాణం', ఆగస్టు నెలలో 'నలచరిత్ర' నాటకములను వ్రాసియిచ్చి నామనీ చెప్పినారు ఆ నాటకములన్నింటినీ మొదట గద్యాత్మకంగా వ్రాసి, తరువాత నటులు పద్యములు పాడగలిగి, అందుకు ఉత్సహించుట చేత పద్యములను గూడా అందందు చేర్చామన్నారు నటులు పద్యములను పాడేవారు కారట కవులు చదివినట్లు శ్రావ్యంగా భావయుక్తంగా, అర్థ వంతంగా ఔచితీభంగం కాకుండ చదివేవారట సంగీతమునకు ఏలాటి

ప్రత్యేక ప్రాధాన్యత యివ్వబడలే దని చెప్పినారు పద్యం సంగీత యుక్తంగా పాడబడుట, అక్కడక్కడ కీర్తనలు గూడ ప్రవేశపెట్ట బడుట 1900-1901 సంవత్సరముల మధ్య కాలంలో ఒక బళ్లారి "సరసవినోదినీ", 'సుమనోరమ" సమాజములలో మాత్రం వుండేది బళ్లారివారు అనగా ధర్మవరం రామకృష్ణమాచార్యులవారు మద్రాసు నగ రంలో కొన్ని నాటకప్రదర్శన లిచ్చారు అక్కడ గూడ పద్యమును సంగీతం మేళవించి పాడుచుండు పద్ధతి ప్రవేశపెట్టబడింది గుంటూరు నుండి హరిప్రసాదరావుగారు బళ్లారి వెళ్లి, రెండు మాసము లుండి, పద్యమును సంగీతాత్మకంగా పాడుట నభ్యసించి, ఆ ఫక్కీని సర్కారు జిల్లాలలో ప్రవేశపెట్టిరి దానితో "బాలీవాలా" కంపెనీవారి సంచార నాటకముల ప్రభావం వలన హార్మోనియం - తబ్లా తెలుగునాట అడుగు పెట్టినవి దానితో పద్యములపై పాటలపై తెలుగు ప్రేక్షకులకు మోజు ఎక్కువ కాజొచ్చినది లక్ష్మీనరసింహం పంతులుగారు అదిమొదలు తమ నాటకములలో పద్యములు జొప్పించినారు కేవల గద్యాత్మకంగా రచింపబడిన 'గయోపాఖ్యానం' నాటకంలో ఉమారమి 190 పద్యములు వ్రాయబడినవి గద్యమునకన్న పద్యమునకు ప్రాధాన్యత హెచ్చు నారం భించినది ఈ పద్యములు ఆ యా నాటకములలో తరువాత ప్రవేశ పెట్టబడినందున ఒకే విషయం ఒక్కొక్క చోట పద్యంలోనూ, గద్యం లోనూ కూడ రూపొందినవి యీ విధంగా చిలకమర్తివారి నాటకములలో గద్యమునకు ప్రాధాన్యత తగ్గి, క్రమంగా పద్య ప్రాధాన్యత హెచ్చింది

చిలకమర్తివారు రచించిన నాటకములు—— కీచకవధ, ద్రౌపదీ పరిణయం, శ్రీరామజననం, గయోపాఖ్యానం, పారిజాతాపహరణం, నలచరిత్ర, సీతాకల్యాణం, చతుర చంద్రహాస, ప్రహ్లాద, తిలోత్తమ, బమ్మెఱ పోతన, ప్రసన్నయాదవ ఇవిగాక భాస నాటకములను తెలిగించారు అభినవబాణభట్టు రచించిన 'పార్వతీపరిణయా' న్ని తెలిగించారు

1906 వ సంవత్సరంలో సత్యవోలు గున్నేశ్వరరావుగారు, ధరణీప్రగ్గడ సూరయ్యగారు కలసి వేతనముల నిచ్చి సమాజమును స్థాపించినారు అందుండి విడిపోయి గున్నేశ్వరరావుగారు, కృత్తివెంటి నాగేశ్వరరావుగారలు వేరొక సమాజమును స్థాపించిరి తరువాత గున్నే శ్వరరావుగారు "చింతామణి" యను నాటకసమాజమును స్థాపించినారు అప్పటికే చిలకమర్తివారి గయోపాఖ్యానం, పారిజాతాపహరణం బహుళ ప్రచారాన్ని పొందియున్నవి ఇంటింట. వాడవాడల, గొడ్లకాపరుల మొదలు గొప్పయింటి పెద్దల వఱకు ఆ పద్యాలను రాగయుక్తంగా పాడుకొనేవారు దానిని గమనించి ఆంధ్రదేశం నలుమూలలనుండి వారి నాటకప్రతులు కోరబడినందున 1906 వ సంవత్సరంలో గున్నేశ్వరరావు గారు పంతులుగారి నాటకాలను ముద్రింపించినారు ముద్రిత ప్రతులు శీఘ్రంగా అమ్ముడుపోయినందున 1909 లో పునర్ముద్రణ పొందినది ఇప్పటికి గయోపాఖ్యానం నాటక ప్రతులు రమారమి లక్షయాబదివేలు అమ్ముడుపోయినట్లు అంచనా ఇన్ని ప్రతులు ఖర్చయినా, యిన్నిపర్యాయ ములు ప్రదర్శింపబడినా ఆర్థికంగా వారికేమీ లాభించలేదనీ, సమయం కనిపెట్టి ఒక పుస్తక విక్రేత ఒక బియ్యపు బస్తాకు ఒక్కసారి ముద్రణ హక్కును పొందినట్లు పంతులుగారే ఆనాడు నాతో తెలవిచ్చారు కొందరు పుస్తక ప్రచారకులు వారిని పొగడి ఏ కొలదిపాటి ద్రవ్యమో నామ మాత్రంగా యిచ్చి కాపీ రైటు హక్కును పొంది లక్షలు ఆర్జించడం నాకు తెలుసు గయోపాఖ్యానం కథను చలనచిత్రంగా తీసినను పంతులు గారికి ఒక్క పైస అయినా చేకబడలేదు వారెప్పుడూ ఆర్థికంగా చిక్కులలోనే వుండేవారు అయినప్పటికి తామరాకుపై నీటిబొట్టువలె నిశ్చింతగా ఉండేవారు 1913 వ సంవత్సరంలో బెజవాడలో 'గయో పాఖ్యానం' నాటకపోటీలు నిర్వహింపబడినవి. ఎన్నో సమాజములవారు పాల్గొన్నారు ఎంతగానో ద్రవ్యలాభం వచ్చింది మద్దాలి శేషగిరిరావు, వెల్లంకి వెంకటేశ్వర్లు, బ్రహ్మవిరోస్యుల సుబ్బారావు, నిడసనమెట్ల

కొండలరావు ప్రభృతులకు ఆ పోటీలలో ఎంతో ప్రఖ్యాతి వచ్చింది గాని, పంతులుగారికి పైస ముట్టకపోయినా, కీర్తికాంత మాత్రం మనసా వరించింది వారిని 1944 సంవత్సరంలో పంతులుగారు అస్వస్థులై యున్నారని విని రాజమహేంద్రవరంలో 'గయోపాఖ్యానం' నాటకమును బెనిఫిట్‌గా వారికోసం ఆడించారు ప్రసిద్ధ నటులు పాల్గొనకపోయినా నేను, నా బృందం పాల్గొని వేయిన్నూటపదహారులను పంతులుగారికి సమర్పించుకోగలిగినాము గయోపాఖ్యానం నాటకమందు "కృష్ణ" పాత్రధారణం నాకు అప్పుడే ఆ నాటకంతోనే ప్రారంభం

ఇక, లక్ష్మీనరసింహం పంతులుగారి కీచకవధ నాటకప్రతి నాకు లభ్యంకాలేదు ఎంతగా ప్రయత్నించినా శ్రీరామజననం, ద్రౌపదీ పరిణయం, నలచరిత్ర ఆదిగా గల ప్రతులు నా కందలేదుగాని మిగిలిన నాటకములను గూర్చి, అందందు నే నెఱిగినంతవరకు మనవిచేస్తాను. పంతులుగారి నాటక కాలమును బట్టి వారి నాటక రచనా సంవిధానం, శైలి, పాత్ర పోషణ క్రమశః మారుతూ వచ్చినవి 1900 సంవత్సరమునకు పూర్వం రచింపబడిన నాటక రచన ఒక విధముగాను, తరువాత రచింపబడు నాటకము లొక విధమగు మార్పుతోనూ కన్పిస్తవి 19 వ శతాబ్ది ఉత్తరార్ధ రచనలు గయోపాఖ్యానం, పారిజాతాపహరణం, యిత్యాదులు. 20వ శతాబ్ది రచనలో ప్రహ్లాద, తిలోత్తమేత్యాదులు, గయోపాఖ్యానంలోనూ, పారిజాతాపహరణం, చంద్రహాస, నాటకములందలి శైలి ప్రబంధ శైలి, గద్యము సున్నాలు అఱసున్నాలతో ప్రబంధ ఫణితిలోనే నడుస్తుంది. అప్పటికే వడ్డాది సుబ్బారాయుడుగారు తమ "వేణీ సంహార" నాటకమునందు యినుప గుగ్గిళ్ళవంటి పదజాలంతో పద్యములు వ్రాశారు అవి పండితాస్వాదయోగ్యంగా మాత్రమే వుండేవి పామరులకు శబ్దార్ధం అవగతం గాకపోయినా, భావార్ధంతో వుండడం చేతనూ, పెద్దలు తల లూపుట చేతను తాము తలలాడించేవారు ఈ ప్రభావం ఆనాటి నాటక రచయిత లందరిపై యించుమించుగా ప్రస

రించింది ఆరోజులలోనే గ్రాంధిక - గ్రామ్యభాషా వివాదం గూడా బయలుదేరింది ఆనాటి నాటక రచయితలందరు యించుమించు గ్రాంధిక భాషా వాదులే, ఒక్క గురజాడ అప్పారావు పంతులుగారు తప్ప. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు గ్రాంధికభాషా వాది అయినా ఆ భాషనే సరళీకృతం చేసి సామాన్యునకు అందుబాటులో నుండు లాగున వ్రాయవలె నని వారి ఆశయం. ఇనుప గుగ్గెళ్ళవంటి పదజాలాన్ని నాటకములలో ప్రవేశపెట్టడం వారికి యిష్టంలేదు. గద్య రచనలలో మాత్రం, గయోపాఖ్యానంలో ముఖ్యముగా వారి శైలి యించుక జటిలంగానే ఉంటుంది. కాని, పాత్రనుబట్టి, పరిస్థితులను బట్టి హెచ్చు, తగ్గు స్థాయిలు ఉంటూ వుంటవి. గయుని చంపెద నని శ్రీకృష్ణుడు ప్రతినబూనునప్పుడు "శ్రీ మచ్చతురానన షడానన"తో మొదలిడిన గద్య బహు జటిలంగా వుంటుంది, అలాగే గయుని రక్షించెద నని అర్జునుడు అభయమిచ్చునప్పుడు గూడ "దీనాజనావన దీక్షా పరతంత్రుడు" - అని ఆరంభించిన వచనం దిట్టంగానే వుంటుంది తదితర చోటులందు గూడ వచనం సామాన్య స్థాయికి తగ్గి యుండదు వారి రచనా శైలిలో గద్యమునకు - పద్యమునకు చాల భేద మున్నది. దీనికి కారణం మొదట యీ నాటకములు గద్యాత్మకంగా రచింపబడుట నటులయొక్క నటనకు ఉదాత్తంగా ఉండుటకు గాను నారికేళ పాకమందే చేయబడెను పద్యములు తరువాత పదేండ్లకు వ్రాయబడినందునకు, అప్పటికే కందుకూరి వీరేశలింగం పంతులుగారి రచనా ప్రభావం పంతులు గారిపై ప్రసరింప బడినందుననూ, కవిగారిలో ఉత్పన్న మైన పరిణతాశయముల వలనను, ప్రేక్షక జనాభిరుచి మారి, పండితులతోబాటు, సామాన్యులయందు సైతం నాటక దర్శనోత్సుకత పెరిగినందునకు చిలకమర్తివారి నాటక పద్యరచన ద్రాక్షాపాకంలో సాగినదని చెప్పవచ్చును దానికి తోడు చిలకమర్తివారు బ్రహ్మసమాజ సభ్యులైనారు. అందరకు తేలికగా అర్థమగుటకు గాను సరళ శైలి వారి నాటకములలో ప్రవేశించినది వారి నాంది

పద్యములం దొకచో "బ్రహ్మాంబ మిమ్మేలు గాత" యన్నారు. వారి నాటక ప్రయోగ పలితాన్ని గురించి ప్రస్తావిస్తూ 'ధర్మములు లోకులకు సుబోధకములుగా నుండవలె' నంటారు చతుర చంద్రహాసం నాటక ప్రస్తావనములో—

తే గీ అతివినోద మిశ్రితము లై నపుడె గాక
మదికి నెక్కవు అట్టి ధర్మములు ప్రజకు
తేనె బూసిన మ్రింగింప నౌను గాదె
చేదుమందుల నేనియు స్వాదులట్లు"

అన్నారు వారికి కాళిదాసాది మహాకవుల నాటకములపై అమితమైన భక్తి యుండెడిది వేణీ సంహారాది నాటకములు పండితరంజన కొఱకే యని వా రెఱుగుదురు. ఇక పంతులుగారు అదే ప్రస్తావనలో ఆ విషయ మును గూర్చియే యిలా సెలవిచ్చారు—

తే. గీ అధికమతి మంతు లాకృతు లధిగమింత్రు
అల్పమేధావు లీకృతు లాదరింత్రు
అంటు మామిళ్ళ ధనవంతు లారగింప
జీడిమామిళ్ళ పేద భక్షించు గాదె"

అంటారు దీనిని బట్టి పంతులుగారి నాటకము లన్నియూ సామాన్యునకు నైతం అందుబాటులో నుండునట్లుగ వ్రాయ ప్రయత్నించినారు సఫల మనోరథు లైనారు ఇంకొకమాట కవికులగురు వైన కాళిదాసు మన పంతులుగారికి ఆరాధనీయులు, అంతేకాదు మహా గురువులు కూడ కాళిదాసుని కవితా ప్రభావం పంతులుగారి రచనలో బాగా ద్యోతకం అవు తుంది ఉపమాన యుక్తంగా పద్యరచన మొనర్చుట ఆ ప్రభావ జనిత మైన యొకలక్షణం ప్రహ్లాద చరిత్రం నాటక ప్రస్తావనలో దోషము లుజ్జగించి, గుణస్వీకారం చేయవలసినదిగా ప్రేక్షకులను సూత్రధారుడు అభ్యర్థిస్తూ "లలిత మైనట్టి శీతాఫలమ్ములోని గింజ లుమియరే తీయని

గుజ్జు మెసవి" అంటారు యింకా ఎన్నో యిట్టివి ఏ పద్యం లో చూచినా యిలాగే కన్పిస్తవి "ప్రసన్న యాదవ" నాటకంలో బృహస్పతి చేత అధములకు సామవాక్యములు మరింత అలుక గొల్పుత వని చెప్పు సందర్భంలో "నెఱయఁ గ్రాగిన చమురుపై నీరు జల్ల పొగయు మంటయు బుస్సన నెగయు గాదె" యీ విధంగా ప్రతి పద్యమును ఉపమానయుతంగా చెప్పుకు వచ్చారు ఈ చెప్పుటలో ఔచిత్యాన్ని గూడ వింతగనే పాటించారు, ఇది కాళిదాసుని సంప్రదాయ మనీ, దానిని పాటించి తీరవలె నని, అదిగాక యీ విధానము ననుసరించి సామాన్యునకు సైతం విషయం పరిగ్రాహ్యం అవుతుం దని వారి ఆశయం ఇక 20 వ శతాబ్ద్యారంభంలో వ్రాయబడిన నాటకములందు బ్రహ్మసమాజ సభ్యత్వ ప్రభావం వారిపై శాశ్వతమైన ముద్ర వేసినది వారి రచన లన్నింటిలోననూ ఆ ప్రభావం వున్నది ప్రహ్లాద చరిత్రంలోనూ తిలోత్తమ యందును జ్ఞానము ముఖ్య మని, భక్తి ముఖ్య మని, "బ్రహ్మంబు మిమ్మోముతన్" అని ప్రస్తావనలలో పెక్కుసార్లు వాకొన్నారు ఆనాడు బ్రహ్మ సమాజ ప్రగతికి చేయూత నొసగిన పీఠికాపురాధీశ్వరు లగు శ్రీ రాజారావు సూర్యారావు బహద్దరు వారికే తమ ప్రహ్లాద నాటకమును కృతి నిచ్చారు

పద్య రచనమున బమ్మెర పోతనామాత్యులు వీరికి ఆదర్శం, శైలి గూడ భాగవత రచనను అనుసరించి, పోలిఉంటుంది. ఒక్కొక్కపుడు తేట తెనుగు వాక్యాలలో అనంతమైన భావమును జొప్పించుట యొక నేర్పరితనము భక్తిభావ ప్రస్తావన వచ్చినపుడు పంతులుగారు ఒక యోగియయి ఆయా భక్తులయందు తాదాత్మ్యం చెందుతూ పరవశించి వ్రాస్తారు పంతులుగారు బ్రహ్మ మతావలంబులై కూడ వారి నాటకములందు శ్రీ కృష్ణస్తుతి వచ్చినప్పుడు అచంచల మైన, నిరవధిక మైన భక్తి విశ్వాసములతో శ్రీకృష్ణుని భగవంతునిగా ఆరాధిస్తారు అంతకూ తనివి తీఱక ఆ దేవదేవుని గుణగణాలను పునరుక్తిని గూడ

వాటింపక పదేపదే ప్రశంసిస్తారు. ప్రసన్న యాదవ నాటకమునందు ఇంద్రుడు శ్రీకృష్ణునకు తన యవస్థ నెఱిగించుతూ సందేశం పంపుతాడు, అందు——

సీ కాళీయ ఫణి ఫణాగ్రముల తాండవ మాడు
అడుగు దమ్ములకు జోహారు లనుము

అని అన్నారు అదే పాద భావములను అర్జునుడు – గయోపాఖ్యానము నందు——కృష్ణుని పాదముల బట్టి "గజ్జెలందియలు గల్లుగల్లని మ్రోయ సహిమౌళి దాండవం బాడె నిద్ది" అంటాడు యింకను ఇటువంటి సందేశమునే గయోపాఖ్యానంలో ధర్మరాజు అక్రూరునితో కృష్ణునకు పంపుతూ "నళిన గర్భుని గన్న నారాయణుడు తాను బాంధవుం డగుట మా భాగ్యమనుము" అని అనిపిస్తారు ఈ విధంగా కృష్ణుని ఎన్నిమారులు ఎన్ని విలాస వర్ణనలతో నుతియించినా పంతులుగారికి తనివి తీరినట్లు గనపడదు వారి కృష్ణపాత్ర శిల్పము మానవునిగ కాదు, కేవల పరమాత్మ స్వరూప మనియే, అర్జునునిచేత, మహర్షులచేత, అక్రూరునిచేత మహేంద్రునిచేత యిట్లెందరిచేతనో ఎన్నిమారులో, ఎన్ని విధములుగానో ఆ నళినగర్భుని గన్న నారాయణుని వినుతించారు ప్రహ్లాద చరిత్ర నాటకమందు వారి రచన ద్రాక్షా పాకమునందు పరాకాష్ట నందిన దని చెప్పవచ్చును ఉదాహరణకు——

ఆ వె "పంచదార కన్న, పనసతొనల కన్న
ఇక్షురసము కన్న ద్రాక్ష కన్న
కమ్మ తేనె కన్న ఖర్జూరమున కన్న
దేవదేవు పేరు తీపి తండ్రి"

తే. గీ నిండు వెన్నెల కన్న పన్నీటి కన్న
మంచి గంధమ్ము కన్నను మంచు కన్న"

అంటూ యీ విధంగా చల్లగా, తీయగా, వారి కవితా స్రవంతి ఇక్షురస వార్ధి యనిపించుకొంటుంది వారి నాటకము లన్నింటిలో భక్తి యొక్క

వగా ప్రాధాన్యత నంది యుంటుంది తరువాతి శృంగారము, పిమ్మట కరుణము అటుపైన జగుప్స వీరము యిత్యాదులు యెడనెడ కన్పిస్తవి వారి వీరరసము నందు గూడ మనకు మధురిమ గోచరిస్తుంది ప్రసన్న యాదవంలో సత్యభామ నఱకునితో సంగర మొనరించు పట్టునకృష్ణు డామెను వర్ణిస్తూ

"శ్రమమున బొడమిన చెమట చిత్తడిచేత
కస్తూరి తిలకంబు కఱగిపోవ
నృత్యముం బొనరించు నెమలి పింఛము నట్లు
వెడద వేనలి జారి వెన్ను నిండ
తీయవిల్తుం డూగు తీగయుయ్యల యట్లు
ఆణి ముత్తెపు సరు లల్ల లాడ"

ఎంతమధుర మైన వర్ణనయో గమనించండి ఆ సందర్భంలోనే స్త్రీలు యే పనికైనను అర్హు లని వక్కాణిస్తూ—

మ చదువ న్నేర్తురు పూరుషుల్ బలెనె శాస్త్రమ్ముల్ పఠింపించుచో
నదుమ న్నేర్తురు శత్రుసేనల ధనుర్వ్యాపారము ల్నేర్చుచో
నుదితోత్సాహముతోడ నేల గల రీ యుర్విన్ ప్రతిష్ఠించుచో
ముదిత ల్నేర్వగ రాని విద్య గలదే? ముద్దాఱ నేర్పించినన్

నరసింహం పంతులుగారికి స్త్రీవిద్య పట్ల అభిమానం మెండు. సంఘ సంస్కరణలో పురుషునితో బాటు స్త్రీకినీ సమాన హక్కు లుండా లని వారి వాదం పైపద్యంలోని చివరిపాదమును అనేకులు తమ గ్రంథా లలో నుటంకించినారు వారి సంఘ సంస్కరణాభిలాష కిది పరాకాష్ఠ

పంతులుగారి హాస్యం, అప్రయత్నంగా కడుపుబ్బ నవ్విస్తుంది. ప్రతి నాటకమునందును వారు హాస్యాన్ని అంగిరసంగా తీసుకున్నాడు. వారి హాస్యం మొఱటుగా నుండక చతురోక్తులతో ఎంతో సహజంగా వుంటుంది ప్రత్యేకముగా యీ ప్రయోజన సాధనకై కొన్ని పాత్రలను సృష్టించుకొన్నారు 'గయోపాఖ్యాన' నాటకంలో కౌశికుని హాస్యం

ప్రసన్న యాదవ నాటకంలో 'మందపాలుడు - వజ్రకంఠుల' హాస్యం, తిలోత్తమలో 'జంబుక - శౌనకుల' హాస్యమూ, చతుర చంద్రహాసలో పాములవాని హాస్యము, మందరుడు - శౌనకుని హాస్యము, పారిజాతాప హరణంలో 'రంభకొరకై తాళులాడు సోమయాజి కావలె నని సంగర మృతుడైన రాజుయొక్క హాస్యము, ప్రహ్లాద నాటకంలో దేవాంతక - నరాంతకుల హాస్యమూ మనలను తనివిదీర నవ్విస్తుంది "తిలోత్తమ" లో ఆమెకొఱకై సుందోప సుందులు పొందు విరహవ్యథ మనలను నవ్విస్తుంది ఇంక వారి ప్రహసనముల విషయమై చెప్పవలసిన పనియే లేదు వారి పూర్వ రచనలో ఒక్కొక్కచో కొంచెం మొఱటుగా కూడ వుంటుంది వారి ప్రసన్న యాదవ నాటకంలో నరకునిచే "ప్రాతలంజె లిప్పుడు లోకమాత లైరి" అని ఊర్వశిని అన్పిస్తారు. వేశ్యలను గూర్చి వారి విసరులు కొంచెం జోఱుగానే వుంఎవి మరికొంచెం దురుసుగానూ వుంటవి ఇంద్రుణ్ణి వా రెప్పుడు వేయి కన్నుల వాడనే వాడుతూ వుంటారు ఆ ప్రయోగం వెనుక ఎంతో గాథ దాగి వున్నది యీ విధంగా వారి హస్యం పూర్వ నాటకములలో కొంచెం మొఱటుగా నున్నా ఉత్తర రచనలలో సొంపుగా వుంటుంది

వారి నాటక భూమిక లన్నీ రాజులైనా - రాక్షసులైనా - దివ్యులైనా - మానవులైనా మధ్యమ తరగతి కుటుంబాల యందలి వారి మనస్తత్వాలకు చేరువుగా వుంటవి సంప్రదాయాలు, ఆచార వ్యవహారములు, యిచ్చిపుచ్చుకొనుటలు, దెప్పి పొడుపులు అన్నీ తదనుగుణంగానే వుంటవి ఇది కేవలం సామాన్య ప్రేక్షకునకు అందించుట కనే ఆశయంతోనే అని చెప్పాలి గయోపాఖ్యానంలో ఆడుపడుచుల అవస్థ యెంతగానో వర్ణిస్తారు సుభద్రను అటు అర్జునుడు—

తే గీ. మగువ మీదను పతి కెంత మక్కువైన
మగనిమీదను సతి కెంత మమత యున్న

ఉవిదకు కాపురం బెంత యొప్పి యున్న
పుట్టినింటికె యిచ గూర్చు పొలతి యెపుడు"
అనీ, నెలతలా రాజనీతులు నేర్పువారు అని దెప్పుతాడు.

అటు కృష్ణుడు ఆమెను——
"సారె చీఱలు నగలును చాల గొనుచు
పుట్టినిండ్లు గుల్లలు చేసిపోయి సతులు
తుదకు మగని పక్షము జేరి యెదు రగుదురు
మగనిపై కూర్మి యధికము మగువ కెపుడు"

యింకనూ "కాంతలు, మధ్య వచ్చిన మగం డనినన్ పడి చత్తు రెంతయున్" అంటాడు యీ పరిస్థితులు మధ్య తరగతి కుటుంబాలలో నాటికీ నేటికీ వుంటూనే వున్నవి

పంతులుగారి రచనలలో లోకోక్తులు కుప్ప తెప్పలు జాతీయమైన తెలుగు నుడికారం వారి రచనలో ప్రసన్నత వహించింది "పాతదయ్యును బంగారు వన్నె చెడునె', తన తండ్రియె మంచివాడు చనయున కెపుడున్, చన్నవారితో పోదురే ఉన్నవారు," నిన్నేడాట లాడించెదన్, యీ విధంగా వేనకు వేలుగ చెప్పవచ్చును నిందా స్తుతి, వ్యాజస్తుతియందు వారికి పెట్టినది పేరు నరకునిచే కృష్ణుని నిందింపజేసినప్పుడు, రాక్షసుల చేత తిట్టించినప్పుడు - ఉదాహరణకు మందపాల - వ్రజ కంరులు కృష్ణుని దూషించినప్పటి నిందలలోని స్తుతి కడు రమ్యంగా వుంటుంది ఇక పాత్రోచిత భాషా ప్రయోగంలో - అమాయకులగు మహర్షులు తమ కడగండ్లను వర్ణించి కృష్ణునితో మొఱ నిడునప్పుడు వారి ఛాందస సంభాషణ ఔచిత్యమును మరింత పోషింప జేస్తుంది ఉదా రాక్షసులు బిఱుసు గడ్డముల నూడ బెఱికి నారని, జడలూని హుమ్మని ఊయెల లూగి రనీ, నారగోచులు దిగ లాగి నవ్వినారనీ, రక్కసి ముండకొడుకులను శపించుటకేనియూ మా కోపిక

లేకున్నదని, దుంపతెగి ఎన్నడు పోవుదురో యని" యీ విధంగా వారిచే మాటాడిస్తారు సుందోప సుందులు తిలోత్తమయందు విరహబాధితులై యున్నప్పటి పరిస్థితిని వర్ణిస్తూ కాఱుదున్నపోతులు బుఱదలో పొరలినట్లు పొరలినారట, రంభను కామించిన రక్కసులను చిత్తకార్తె కుక్కలతో పోల్చినారు ఈ పద్ధతిలో సాధువచనాలు సరళంగానూ, కృష్ణార్జునుల ప్రగల్భములు పరుషంగాను, రక్కసుల విరహాలు అమానుషంగానూ వర్ణిస్తారు

పంతులుగారి నాటకములు దిగ్విజయము నందుటకు ముఖ్య కారణం వారి పద్యములు రసగుళికలగుటయే కథా వస్తువు అందరికి నందుబాటులో నుండుట, కడుపుబ్బ నవ్వించెడు హాస్యం, సామాన్యులకందుబాటులో నుండు భావ ప్రకటన, మృదుమధురములైన భక్తి ప్రపత్తులు వీని నన్నింటిని మించిన వారి చమత్కృతి ఈ చమత్కృతి వారి రచనల్లో రసరూపం దాల్చినది వారి నాటకములలోని పాత్రధారణ వలన నటులు ప్రఖ్యాతి వహించినారు యడవల్లి సూర్యనారాయణ రామనాథశాస్త్రి, బెల్లంకొండ సుబ్బారావు, మాదవపెద్ది వెంకట్రామయ్య, బ్రహ్మజోస్యుల సుబ్బారావు, మద్దాలి శేషగిరిరావు, ముంజులూరి కృష్ణారావు, యింకా పులిపాటి, నిడుముక్కల, అద్దంకి, పంచాంగం అస్మదాదులు సైతం చిలకమర్తి వారి కెంతయు ఋణపడి యున్నాము, ఆయన కాయనే సాటి. ఆయన రచనల కవే సాటి

# చిలకమర్తివారి ప్రహసనములు

— శ్రీ బందా కనకలింగేశ్వరరావు

భరతముని తన నాట్య శాస్త్రంలో నాటక ప్రయోజనాన్ని గూర్చి నిర్వచించారు ఉన్నతం అయిన ప్రయోజనం ఏమంటే ప్రేక్షకుణ్ణి రస స్ఫూర్తి ద్వారా ఒక యోగంలోకి తీసుకుపోయి అత్మయొక్క స్వస్వ రూప సాక్షాత్కారాన్ని కలిగించడం ఇది ఆధ్యాత్మిక పరమైన ఒక ప్రయోజనం నిర్వచమున్నూ, ఆది భౌతిక మైన నిర్వచనం మరో టుంది. ప్రజలలో వైదిక ధర్మం క్షీణించి గ్రామ్య విధానం అభివృద్ధి అయి నప్పుడు ప్రజానీతి కలుషిత మైనప్పుడు, ప్రజా బాహుళ్యం ధర్మచ్యుత మైనప్పుడు వారిని మేల్కొల్పి, తీయని శిక్షణ గఱపి, ధర్మంయొక్క వాస్తవిక స్వరూపాన్ని వారికి ప్రతి బింబిత మగునట్లు చేయడం ఈ ప్రయోజనాల ననుసరించి నాటకాన్ని దశరూపకములుగా విభజించాడు ధనంజయుడు, ఆ వైవిధ్యములలో నొకటి యీ ప్రహసనం దీని ఆశ యం వినోదం రూపేణా సంస్కారాన్ని కలిగించి విజ్ఞానాన్ని అందించ డం. గిలిగింతతో యేడ్పించడం

ఈ ప్రహసన సాధనాన్ని 2400 సంవత్సరాల క్రితం గ్రీసు దేశంలో 'ఎరిష్టో ఫెన్స్' అను ఆయన బహుళంగా చమత్కారంగా ప్రయోగించాడు ఆనాడు గ్రీస్ దేశంలో రాజకీయాల్లోను, సాహిత్యం లోను కుక్క గొడుగులు మొలవటం ప్రారంభించాయి దంభము, దర్పము, అల్పాభిరుచులు మిక్కుటంగా ప్రబలినవి. 'ఎస్కైలస్' సోఫోక్లీస్, యురుఫిడీజ్ గారలు ఆనాడు విషాదాంత నాటకాలనే వున్నత స్థాయికి గొంపోయినారు కుకవులు, అల్పజ్ఞాను లయిన రచ యితలు ప్రయోజన రహితము లైన నాటకాలను రచించి సంఘాన్ని దిగ జారునట్లు చేయ నారంభించారు, రాజకీయాలలో ఆశ్రితులకు, భట్టు పొగ

_ర్తలు చేయువారికి స్థానం లభించ నారంభించింది, చక్రవర్తి తనవినోద కాలక్షేపంకోసం ప్రజల ఉసురులను బలిగొనడానికి గూడ వెనుకాడే వాడు కాడు అప్పుడు 'ఎరిస్టొ ఫేన్సు' అను మహాకవి "మేఘాలు కప్పలు" అను ప్రహసనాలను రచించి కుకవులకు, నీచ రాజనీతిజ్ఞులకు సాహిత్య సాధనంతో కొరడా చురక లంటించి బుద్ధి గలుగునట్లు చేశాడు ఒక్కొక్కప్పుడు మెఱటుగా గూడ వ్రాశాడు, ఇలా ఎన్నో ప్రహసనా లను రచించాడు వాటిని 'కామెడీ' అనేవారు ఈవిధంగా ప్రాక్పశ్చిమ ఖండాలలో వినోద రూపకాలు విస్తారంగా వెలిసినవి

ప్రాకృతం లోనూ సంస్కృతంలోనూ కూడా అనేకములగు ప్రహసనాలు వెలువడినవి బౌద్ధ గాథలను అపార్థం చేసుకొని పైకి మాత్రం కాషాయవస్త్రం ధరించి అంతఃపురాలలో అత్యాచారాలకు అల వడిన బౌద్ధ భిక్షువులను, బౌద్ధారామాలలో భిక్షుణి అనీచోపాసనను "తలలు బోడులైనా తలపులు బోడులు కాలేదు," అని వెక్కిరిస్తూ, విమర్శిస్తూ పలు ప్రహసనాలు వెలువడినవి కొన్ని కాలగర్భాన కలిసినా భగవతజ్జుకం వంటివి మనకు లభించిన కొన్ని ప్రహసనములు మనకు తార్కాణం.

1880 సంవత్సరంలో కందుకూరు వీరేశలింగం పంతులుగారు, ఆనాటి సాంఘిక దురాచారాలను తెగడుతూ చాల ప్రహసనములను విర చించారు, పెక్కు దురాచారాల మీద, మూఢ విశ్వాసాల మీద ఛాంద సుల మీద తూర్పార బట్టుతూ ప్రహసనాలను రచించారు వీరి ఏకలవ్య శిష్యు లనదగు చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు ఏబది ప్రహ సనాలను, ఏబది వ్యంగ్య వ్యాసాలను రచించారు తరువాత పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు వారి సహజ హాస్య రచనా విధానంలో ఎన్నో ప్రహసనాలను రూపొందించారు, వీరిఅనంతరం అధునాతనులలో భమిడిపాటి కామేశ్వరరావు గారు ప్రహసన కర్తగా ప్రఖ్యాతి గాంచారు కామేశ్వరరావు గారి రచనలు ఫ్రెంచి ప్రహసనకర్త అయిన 'మోలి

యర్ కు ఆంగ్ల ప్రహసన కర్తలు, 'గోల్డు స్మిత్, షెరిడెన్,, లకు కొన్ని అనువాదాలు, మరికొన్ని అనుసరిచములు, అనుకరణములున్నూ, ఆ రోజులో బ్రహ్మ సమాజానికి ఆంధ్రలో నిలువ చోటు దొరికింది వెంకటరత్నం నాయుడు గారు, వీరేశలింగం పంతులుగారు ఆ వ్యవస్థకు యిక్కడి నాయకులు, వారికి అనేకమంది అనుయాయులు లభించారు. వారిలో చిలకమర్తివారు ముఖ్యులు, ప్రతి రచయిత సంఘ సంస్కారానికి పూనుకొన్నాడు తమ తమ రచనా పాటవం ద్వారా ఆ పూనిక తమ విధిగా భావించారు ఆ ఉద్యమ పలితంగానే చిలకమర్తి ప్రహసనాలు ఆవిర్భవించాయి, వీరేశలింగం పంతులుగారి ప్రహసనాలు సూటిగా, మొఱటుగా లారీ దెబ్బలవలె తగుల్తవి పైకి గాయం కన్పించకుండా పోలీసు వారి దెబ్బలవలె డొక్కలో క్రుమ్మిన ట్లుంటవి వారి సందేశంలో, వారి సంస్కరణ విధానంతో ఉద్వేగం అతి తీవ్ర రూపం దాలుస్తుంది పానుగంటి వారి ప్రహసనాలు పచ్చిగా వీపు చఱచి నట్లుంటవి బూతు వంటి పదానైనా ప్రయోగించడానికి వారు వెనుదీయరు, వారి శైలి కొఱడా దెబ్బలా చురుక్కు మంటుంది, భమిడిపాటి వారి ప్రహసనాలు కేవలం నవ్వించడానికే ప్రయత్నిస్తున ట్లుంటాయి. నవ్వించ లేకపోతే వాటిదారి వాటిదే మాండలిక పద ప్రయోగంతో నవ్వించడానికి ఆయ నెక్కువగా ప్రయత్నించినట్లు కనబడుతుంది ఉదాహరణకు వాజెమ్మ, చచ్చుపీనుగు, పుట్టుకుంక వంటి పదాలు విశేషంగా కనబడతాయి, చిలకమర్తి వారి ప్రహసనాలలో ఒక విశిష్టత వున్నది ఆయన యెంత ఆర్ద్ర హృదయులో, వారి ప్రహసనాలలో నేరస్థుణ్ణి గూడ అంత మృదువుగానూ క్షమించి, మందలించి సంస్కరించి విడుస్తారు వారి నేరస్థుడు తన అపరాధాన్ని ఒప్పకుని, తప్పు సవరించు కొంటాడు, శిక్ష మాత్రం లేదు ఉదాహరణకు "మహా రసిక ప్రహసనంలో" పేరంటానికి వచ్చిన ముత్తైదువు సుందరమ్మను మదన గోపాలరావు పంతులు కామించి తన దాసి యైన 'గంగి'తో దౌత్యం నెఱపుతాడు గంగి యీ

విషయాన్ని పంతులు భార్య అయిన రుక్మిణమ్మకు వెల్లడిస్తుంది. రుక్మిణమ్మ సుందరమ్మ వేషంతో చీకట్లో సంకేత స్థలానికి వెళ్తుంది. పంతులు ఆమెను సుందరమ్మగానే భావించి తన భార్య నెన్నో నింది స్తాడు, నగ లిస్తాడు చివరకు నిజం బయట పడుతుంది. తాను సిగ్గుపడి అపరాధాన్ని ఒప్పుకొని, తప్పు దిద్దు కుంటాడు, ఇదేవిధంగా ప్రతి ప్రహసనం లోనూ చిలకమర్తివారు నేరస్థుణ్ణి క్షమా పూర్వకంగా సంస్కరిస్తారు దానికితోడు చిలకమర్తి వారి భాష చిలుక పలుకులు, ఎంతో మెత్తగా, తేనె లాగున వుంటుంది వారి శైలి. అందువలన వారి ప్రహసనా లన్నీ గిలిగింతలతోనే సమాజాన్ని సంస్కరింప జాలినవిగా వుంటాయి పంతులుగారు ఏబది ప్రహసనాలకు పైగా వ్రాశారు ఇవన్నీ 'చింతామణి' పత్రికలోను, 'దేశమాత' పత్రికలోను, 'మనోరమ' పత్రికలోను 1889 నుండి ప్రకటింపబడుతూ వచ్చినవి అందుచేత ఆ పత్రికలకు ఆనాడు మంచి ప్రచారం ఉండేది వారి ఆశయం నింద ప్రధానంకాదు సంస్కార ప్రధాన మైనది కనక - శునక ప్రహసనంతో ధర్మ శాస్త్రజ్ఞు డొకడు తాను చెప్పిన దెల్ల శాస్త్రమే నని లేనిపోని కల్పిత గ్రంధ నామములతో 'గండాయన స్మృతి, శాకటాయన స్మృతి' అంటూ తన వాదనము సమర్థించు కొంటూ వుండేవాడు, ఒక యజమాని తన కొడుకు కుక్కపాలు త్రాగినాడని యీ శాస్త్రజ్ఞునితో చెప్పి పరిహారం చెప్పమని కోరగా, యీయన వాడి నాలుక కాల్చడమో, లేక బంగరు శునకాన్ని దానం చేయడమో - పరిహారంగా సెలవిస్తాడు అప్పుడా ఆగంతుకు డాయనతో, మా పిల్లవాడు మీ పిల్లవాడు కలిసి చేసిన పని యిది అని చెప్పగా, అప్పు డా శాస్త్రజ్ఞుడు ఏదో సమయం లెక్క గట్టి ఆ ముహూర్తాన ఏ దోషం లే దని సమర్థిస్తాడు, ఇలాగే తన వరకు వచ్చునప్పటికి గండాయనస్మృతిగా - మారింది "గయ్యాళి గంగమ్మ" ప్రహసనంలో గయ్యాళి భార్య నొకామెను చిత్రిస్తారు, ఇది కేవలం నవ్వించడానికే, ఇక "ఆత్మగౌరవం" ప్రహసనంలో మధ్య

తరగతి కుటుంబాలలో మిధ్యా గౌరవం కోసం పాటుబడుతూ "వస్తువులు నగలు ఎఱువు తెచ్చుకోవడం, ముసలి తలిదండ్రులను తమ వంట మనుష్యులుగా చెప్పడం వంటి వెన్నో ఉన్నాయి అతిధిగా వచ్చిన ఒక జమీందారు, తన తలిదండ్రులను చూచి ఏవగించు కొంటాడని యీ మిధ్యా గౌరవాభిలాషి వాండ్లను పిడుకలగూటిలోకి పొమ్మంటాడు అందులో తల్లికి తేలు కుడుతుంది ఆమె యేడ్పులు, పెడ బొబ్బలతో వెలికి వస్తుంది జమిందారుతో వారిని తమ వంట వాండ్రుగా చెప్తాడు వాండ్లు జమీందారునితో యధార్ధం చెప్తారు యీ మిధ్యా గౌరవం కోసం, దర్జా కోసం కాని పను లొనరించి, లేని పరువు నాశించి ఎన్నో నియోగి బ్రాహ్మణ కుటుంబాలు ఆర్ధికంగా సర్వనాశనం గావడం నేటికీ చూస్తూనే వున్నాం

"వరదక్షిణ ప్రహాసనం" వరశుల్క దురాచారాన్ని ఖండిస్తూ వ్రాయబడినది ఒకాయన కట్నానికి ఆశపడి ఒక క్షయవ్యాధి పీడిత యైన కన్యను తన కుమారునికి చేసుకుంటాడు, కాని, బహిరంగంగా ఆయన వరకట్నాలను ఖండిస్తూ ఉపన్యసిస్తూ వుంటాడు. ఈ దురాచారం యీ నాటికి గూడా సమసిపోలేదు. యీ వరకట్నం అంటే చిలకమర్తి వారికి యెంత ద్వేషమో దానినొక ఉపమానంలో చెప్తూ "మాలమాదిగెలు చచ్చిన జంతు చర్మాలతో వ్యాపారం చేస్తారు గాని ఉన్నత కుటుంబాలలోని కొందరు పెద్దలు కట్నాలను స్వీకరించడం సజీవ జంతు చర్మ వ్యాపారం వంటి" దని ఉపమిస్తారు వీరి ప్రహాసనము లన్నింటిలో పరుషమై, తీవ్రమైన భాష యీ వొక్క చోట మాత్రం ప్రయోగింపబడినది ఈ వరశుల్కం చెల్లించ లేక మధ్య తరగతి కుటుంబీకులు ఎంతటి బాధా వ్యధలకు లోనౌతున్నారో యీ "వరశుల్క" ప్రహాసనంలో నేర్పుగా నిరూపించారు "బధిర చతుష్టయం" అనే ప్రహాసనంలో నలుగురు చెవిటి వాళ్ళు ఒకరి మాటను మరొకరు అపార్ధం చేసుకొంటారు ఒక ఖిలాడి దీని నవకాశంగా

తీసుకొని లాభం పొందుతాడు, ఇది పైకి మాత్రం వినోదార్థం వ్రాసినట్లు అగపడుతుంది కాని ఆలోచించగా లోకంలో అందరూ చెవిటివారే. అందరూ గుడ్డివారే ఎదుటి సత్యాన్ని గమనించని వారు గ్రుడ్డివారి క్రిందే జమకదా ? ఎదుటివాని సవ్యమైన భావాన్ని అవగతం చేసుకోలేని వారు బధిరులే కదా ? ఈ లోకంలో ఒకరి నొకరు, ఒకరి మతాన్ని మరొకరు అపార్థం చేసుకుంటున్నారు నిజాయితీ, నిలుకడ శూన్యం "బలవంత బ్రాహ్మణార్థం" ప్రహసనంలో ఒక నియోగి పంతులుకు తల్లి తిధి యెప్పుడో తెలియదు పురోహితుడు గుర్తు చేయగా భోక్తలను పిలువడానికి తన వెట్టివాణ్ణి పంపిస్తాడు, పురోహితుని మెడలోని యజ్ఞోప వీతం ఆయన వుంపుడుకత్తె యింట్లో చిలుక కొయ్యకు తగలించి మరచినాడు అప్పుడా పురోహితుడు "ఈనాడు స్త్రీ తిధి గావున, స్త్రీలకు యజ్ఞోపవీతం వుండదు గావున, భోక్తలకు గూడ అవి ఉండనక్కర లేదంటాడు, పంతులుగారు - చిలకమర్తి - యీ కర్మ కాండలో జరిపే అత్యాచారాలు, అశ్రద్ధలు, ఆడంబరాలు, మొదలగు వాటిని నిశితంగా విమర్శించారు బాహ్య శౌచంకన్నా అంతశ్శౌచం ముఖ్యమంటారు బ్రాహ్మ సిద్ధాంతంలోని ప్రధాన సూక్తి యిది "అద్భుత శ్రాద్ధ" ప్రహసనంలో పిండాలను కాకులు ముట్టకపోగా "ప్రేతకు" లోగడగల కోరిక నూహించి "ఉప్మా" తో పిండాలు, "కాఫీ"తో తిలోదకాలు యిస్తారు ప్రేతపురోహితుణ్ణి ఆవహించి ఆ విధంగా కోరిందట ఇంతకూ ఉన్న రహస్యం యేమంటే తద్దినం పెట్టించే పురోహితుడికి ఉప్మా, కాఫీలు లేందే క్షణం గడవదు "కైలాస దూత" ప్రహసనంలో పిసినిగొట్టు భర్త ఊరికి పోగా ఒక ఖిలాడీ పితృదేవతలకు యిల్లూ, బట్టలు కావా లని, వారు తనను కైలాసం నుండి అందుకు గాను పంపా రని ఆ అమాయకురాలైన యిల్లాలిని మోసగించి వస్తువులూ, వస్త్రాలు అపహరిస్తాడు మూఢ విశ్వాసాల మీద యిది చెంప పెట్టు "శవ వాహన" ప్రహసనంలో శవ వాహనానికి ఎవ్వరూ

రాకపోగా కిరాయి వాహకులు బేరాలాడి మరో మారు తగ్గిస్తాం లెండి అంటారు పురోహితుడు మందలించగా ఆయనకు "నీ విషయంలో తగ్గిస్తాంలె" మ్మంటారు "కాండూరి జానకిరామయ్య పెండ్లి" ప్రహసనంలో వృద్ధునికి చిన్న పిల్లను కన్యాదానం చేస్తుండగా వరుడు మూర్ఛపోతే వధువును వంటవాడికి అప్పగిస్తారు "కలియుగ యక్ష ప్రశ్నలు అనే ప్రహసనంలో సంఘంలోని పీడ పురుగులను వ్రేలెత్తి చూపించారు మనుష్యులలో పశువులు, పశువులలో మనుష్యులు, బ్రాహ్మణులలో అంత్యజులు, అంత్యజులలో ఉత్తములను వివరించారు చివరకు నవ్వించడానికి గాను 'మగవానికి మగడు మాట వినని మగువే' నన్నారు. అలాగే 'ఆడుదానికి అర్ధాంగి అప్రయోజకుడైన భర్తే' నన్నారు. "శామాలమ్మ దర్బారు"లో జాతర్లను, జంతు బలులను ఖండించారు "శ్రీరామనవమి పందిరి" ప్రహసనంలో కార్యకర్తలకు సీతారాములమీది భక్తికన్న, భోగం మేళాలు పెట్టించడంలో అనురక్తి నెక్కువగా చెప్పారు ఒకనికి పూనకం వచ్చి భోగంమేళం లేకపోతే రామున కెంత మాత్రం నచ్చ' దని చెప్తాడు ఈనాటికీ శ్రీరామనవమి పందిళ్ళలో సినిమా ప్రేమ గీతాల ఘుంఝుమారుతాన్ని వింటున్నాంగా ?– "ఆనంద సమాజం"లో గొప్పవారి క్లబ్బులు దుర్వ్యసనాలకు నిలయాలుగా అభివర్ణించారు "ప్లీడరు తమాషా" ప్రహసనములో ప్లీడర్లు టౌట్లకు వాటాలివ్వడం, స్టాంపుడ్యూటీలు వగైరా పెరిగా యని పార్టీలను వేధించడం, మేజీస్ట్రీట్లకు లంచాలు చూపడం, ప్రాక్టీసు లేకపోయినా పరువుకోసం ఆదాయం పన్ను కోరి వేయించుకోవడం వంటివి వర్ణిస్తారు పంతులుగారు లంచాలకు 'హిరణ్య శ్రార్ధం, అని చక్కని నామకరణం చేశారు "ఓట్లు" ప్రహసనంలో రాజకీయ వాదుల బూటకపు వాగ్దానాలు, కుల తత్వ వైషమ్యాల ప్రయోగాలను వెలిబుచ్చారు "యమధర్మరాజు కచ్చేరీ" ప్రహసనంలో ఓటర్ల మోసాలను బయటపెట్టారు "దంభ సన్యాసి" ప్రహసనంలో దొంగ సన్యాసులను తూర్పార బట్టారు.

భార్యతో కలహించి జందెం త్రెంపుకొన్న సన్యాసి ఒకడు "నరసింహ భారతి" అని నామకరణం చేసుకుంటాడు. "ముష్టి" ప్రహసనంలో ధర్మం చేయడానికి యిష్టంలేక వికలాంగు లందరు దేవుని ఆగ్రహకారణ జన్మ లని, వారికి ముష్టివేయడం దేవునికి అయిష్ట మని ఒక లోభివాదన, "చిత్ర సంభాషణ" అని ఒక ప్రహసనం "ఈ రోడ్డు ఎక్కడికి వెళ్తుంది" అని ఒక డడుగగా, 'నే నెరిగి నంతవరకు యీ రోడ్డు ఎక్కడకీ, ఎప్పుడూ వెళ్ళలేదని జవాబు. "జనాభా" నాటకంలో ఎన్యూమరేటర్సు బాధలు " మీ భర్త పేరేమి" యని అడుగగా ఏదో ఒకటి వ్రాసికొ మ్మంటుంది అర్ధరాత్రివేళ ఒక ప్లీడరు సానియింట నున్నట్లు వ్రాసుకొంటారు ఒక తురక ఎన్యూమరేటరు బొట్టులేని స్త్రీ లందరూ వితంతువు లని వ్రాసుకుంటాడు "మరొక ప్రహసనంలో" బ్రహ్మదేవునికి పూజ్యత ఎందుకు లేకపోయిందో చెప్తూ "ఆయన కల్లు సముద్రం తాను అట్టె పెట్టుకొని ఉప్పు సముద్రాన్ని మన కిచ్చి నందుకు అంటాడట "దంపతుల ముచ్చట్లు" ప్రహసనంలో నాటకానికి ఉచిత ప్రవేశ పత్రాలు పంపలే దని డెప్యూటీ కలెక్టరు గారి భార్య భర్తతో తగవులాడుతుంది ఈ ప్రహసనంలో సమాజముల వారు నాటకములను ప్రదర్శించడానికి పూనుకోగా ఆ నాటి ఉద్యోగులు వారిని పెట్టే యిబ్బందులు, సమాజాలకు ధనం సమకూరినా లేకున్నా, ఉచిత ప్రవేశము మాత్రం హాలంతా ఆక్రమించుకు కూర్చోవడం, డబ్బిచ్చి టిక్కెట్లు కొన్నవారికి స్థలాభావం మొదలైన వానిని బాగా నిరూపించారు ఆనాడు ఒక్క మెజిస్ట్రేరియల్ డిపార్టుమెంటు వారేఅలా ఆచరించేవారు గాని యీనాడు కమ్మర్షియల్ టాక్సు డిపార్టుమెంటు, ఆరోగ్య శాఖ, పోలీసు శాఖ, అగ్నిమాపకశాఖ యింకా యింకా యిలాటి వారికే సగం టిక్కట్లు కాంప్లిమెంటరీలుగా చెల్లుతున్నవి పంతులుగారే యీ నాడు యింకా బ్రతికివుంటే యిలాంటి సంఘటలను గూర్చి యింకెలా వ్రాసి వుండే వారో "అపూర్వ యాచకుడు" ప్రహసనంలో యజ్ఞం చేస్తా మని, గుడి

గోపురాలు కట్టిస్తా మని సందారం చేసి, యాచించి, ఆ ద్రవ్యాన్ని స్వాహా చేసే వారిని ఏరి చూపారు "అపూర్వ స్వయంవరంలో" ఆడ పిల్లను అమ్ముకొనే తల్లి తండ్రులను విమర్శించారు "స్వ గౌరవ రక్షణ" ప్రహసనంలో ఆనాడు, నియోగులైన వారి నెవరినైనా భోజనానికి పిలిస్తే నిక్కి నీలిగి చివరకు ఒక బ్రాహ్మడి చేత వెండిచెంబు, కూలి యిచ్చి ఒక చాకలివాని చేత లాంతరుతో ముందు వెనుకల బరా బరులతో వేంచేసే వారట అందుకై చాకలిని పట్టుకు రావడానికి జేవుకు వెళ్ళడం, తీరా వెళ్ళి వచ్చేసరికి విందు పూర్తిగావడం జరిగేది. ఈ నీటు గల నియోగులకు ఒక చురక వేశారు పంతులుగారు. "చమత్కార సంభాషణ" ప్రహసనంలో యాత్రికులు కాశిలో పండ్లు, కూరలు, దుంపలు వదలి వేయడాన్ని గురించి ఆ సంభాషణలలో ఒకడు లజ్జాభి మానాలను, పరువు మర్యాదలను, దయాదాక్షిణ్యాలను వదలివేయ డాన్ని గురించిన్నీ, అట్టివాని తల్లి తన ప్రాణాలనే వదలడాన్ని గురించీ చెప్పారు "చిత్రమైన తంతివార్త" ప్రహసనంలో - ఆ రోజులలో తంతివార్త వస్తే ఎవరో మరణించినట్లే నిశ్చయం ముందుగానే యేడ్పులు మొదలుపెట్టేవారు "యమలోక వర్ణనం" లో ఆనాటి పాపా లకు అప్పటి కున్న నరకం చాలదనీ, క్రొత్తదాన్ని సృష్టించాలనీ— "అపూర్వ నరకం" లో - ఒక పిసినిగొట్టునకు నగలు కడిగి ఆ నీళ్ళు నోట బోస్తేనే గాని ప్రాణం పోలేదట. "అతని కొడుకులు సొమ్ము నంతా ఖర్చుపెట్టేస్తూ వుంటే ఆ లుబ్ధుడు చూచి సరియైన నరకం అప్పుడే అనుభ విస్తా"డని యముడు వాణ్ణి తిరిగి భూలోకానికి పంపివేశాడు. "విచిత్ర గోదానం" ప్రహసనంలో - గ్రామ కరణం చావ సిద్ధమైన గోవును దానం యిస్తాడు అది చావగానే ఆ బ్రాహ్మణి దగ్గర దాన్ని అవతలకు యీడ్చివేయించడానికిగాను ఒక రూపాయి వసూలు చేస్తాడు. ఆ కరణం యమలోకానికి వెళ్లినప్పుడు యముణ్ణి చూచి 'నీవు పాత యముడవో కొత్త యముడవో సాక్ష్యాధారాల్తో రుజువు చేసుకో మంటాడు. యముడు

అప్పుడు త్రిమూర్తులనే సాక్ష్యానికి తీసుకువస్తాడు యుక్తిశాలి అయిన కరణం 'నాకు త్రిమూర్తుల దర్శనం అయింది గనుక యీ నఱక లోకంలో ఉండే పని లే' దన్నాడు. యీ ప్రహసనంలో ఆనాటి కరణాల యుక్తిప్రయుక్తులు, చమత్కారాలను సున్నితంగా విమర్శించారు. మరొక ప్రహసనములో, కనకయ్య పంతులు కంతి పెద్దదా చిన్నదా అని తగవుపడి కోర్టు కెక్కుతారు మేజిస్ట్రేటుకు లంచం చూపుతారు చెరి పది రూపాయలూ జరిమానా వేయించుకుంటారు అల్పాతిఅల్ప విషయాలకోసం సైతం కోర్టుల కెక్కడంవల్ల యిరువురకూ నష్టమేనని నిరూపించారు ఈ చెప్పబడిన ప్రహసనాలన్నీ పెద్దవి తరువాత పదునైదు చిన్న ప్రహసనాలను గూడా వ్రాశారు "అద్భుత సంతర్పణ" ప్రహసనంలో గోదావరి దగ్గర 'గయావళీలు, గంగాపుత్రులూ' అని చెప్పుకొనే బ్రాహ్మణులను ఎత్తిపొడిచారు "వింత విందు" ప్రహసనంలో యిద్దరు హోటలు యజమానులు ఒక ప్రయాణీకుని రెక్కలుపట్టుకు లాగుకొని పోవడం వాడు తృప్తిగా తిని డబ్బు ఎగనాం పెట్టడం గురించి చెప్తారు "పిశాచవిలాసం" లో దయ్యాలు లేవనీ, అదంతా భ్రమ అనీ చెప్తారు. "తుంబుర-నారద" ప్రహసనంలో త్రాగుదు, లంచం, అసత్యాలాపన, వ్యభిచారం యింకా ఆనాటి సంఘంలో వున్న కుళ్లునంతా తూర్పార పట్టారు. "పన్నెండుపండ్ల" ప్రహసనంలో - రోగిష్టి యైన భర్తకోసం పండ్లు తెప్పించి భార్య తింటుంది అదేమి? అంటే, తనకు అంతకన్నా జబ్బుగా వున్నట్లు దెబ్బలాడుతుంది "నాగరికత" ప్రహసనంలో - ఎన్నిరకాల మాంసభక్షణ చేస్తే అంత నాగరికమని చెప్పుకునేవాళ్ళను దుయ్యబట్టి శాకాహారే వాస్తవమైన నాగరికుడుగా నిరూపిస్తారు "మహా మంత్రకేసరి" ప్రహసనంలో-భేషజవంతుడైన బ్రాహ్మణుడు 'మంత్రోప దేశం చేస్తానంటూ బూటకము నాటకం ఆడతాడు "అపూర్వయజ్ఞం" ప్రహసనంలో - వంటబ్రాహ్మడు యజ్ఞం చేస్తానంటూ ఉన్న కొంపను అమ్ముకుంటాడు. "నారదవిలాపం" లో నారదుడు తాను మాత్రమే

కలహాభోక్తసనీ, కాగా యిప్పుడు పూరూరా తనవంటివారు బయలుదేర డంతో తన ఆకలి తీరె మార్గం కనబడడంలేదంటూ విలపిస్తాడు వేశ్య మాతను సృష్టించడం బ్రహ్మదేవుని తెలివితక్కువ పనులలో నొకటి యని మరో ప్రహసనంలో అంటారు 'జామాతా దశమగ్రహం' అంటూ మరోదానిలో; "లోభిపిశాచం" లో లోభుల మీద, "అద్భుతకవిత్వం" లో కుకవులను ఖండించారు "పడకగది ముచ్చట్లు" ప్రహసనంలో - ఆడ వారి నగల మోజును గూర్చి చిత్రంగా వ్రాశారు చివరిది "కవిగీత" అనబడే ప్రహసనం ఇది చాలా విస్తృతం అయినది ఇందులో లోకంలో కనబడే దుర్నీతి, కాలుష్యాలను గురించి విపులంగా వర్ణిస్తూ పాఠకుల మనస్సులను సంస్కరించడానికి ప్రయత్నించారు

పంతులుగారు వ్రాసిన ఏబది ప్రహసనాలు కవ్వించి నవ్వించేవి మృదులంగా సంస్కరింపజాలినవి ఆనాడు నాటకములలో మధ్యన ఒక వినోద ప్రహసనాన్ని ప్రదర్శించడం మామూలు ఈ పద్ధతి పార్సీ నాటకములలోను, ధార్వాడా కంపెనీ నాటకములలోను ఉండేది నాటక మధ్యంలో ప్రేక్షకులను నవ్వించడానికి యీ పద్ధతి కల్పించబడింది. సావిత్రీ నాటకంలో పిసినిగొట్టు బ్రాహ్మడి ప్రహసనం, మోతే కంపెనీ వారి నాటకాలలో 'జింటాన్' అనునాతని మొఅటు హాస్యప్రదర్శనలు మొదలగునవి సర్వసాధారణంగా ఉండేవి పంతులుగారి ప్రహసనాలలో ఎక్కువభాగం ప్రదర్శింపబడినవి విద్యార్థులు, ఔత్సాహిక నటులు వీటిని ప్రదర్శిస్తుండగా నేనుకూడ చూచాను పంతులుగారికి ముఖ్యంగా ఆనాటి ఛాందసుల మీద, దాంభికుల మీద, ఆడంబరభూయిష్ఠములైన వారి కార్యకలాపాల పైన, వరశుల్క కన్యాశుల్కములమీద వనితాపాన వ్యసనాల మీద, మూఢవిశ్వాసాలపైనా జోరుగా దాడిచేశారు ఛాంద సులను దుయ్యబట్టారు. నియోగి సీటును వెక్కిరించారు ద్రావిడప్రాణా యామాన్ని పరిహసించారు ఈ విధంగా సంఘ సంస్కారం కోసం మెత్తగా మందలిస్తూ, ప్రేక్షకులకు పాఠకులకు ఆత్మావలోకనం కలిగించి ప్రహసన రూపక ప్రయోజనాన్ని చక్కగా సాధించారు. వారి రచనలు వాటికవే సాటి.

# చిలకమర్తివారి వచన రచనలు

— శ్రీ రావూరు సత్యానారాయణరావు

కళాప్రపూర్ణులు, స్వర్గీయ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి వచన రచనా వైదుష్యాన్ని కొద్ది పుటలలో వర్ణించబూనడం సాహసమే అవుతుంది

కాని ఆ మహనీయుడు తెలుగు వచన, రచనా ప్రపంచములో ఒక వెన్నెల అధ్యాయం సృష్టించా రని చెప్పడంలో ఆశ్చర్యం లేదు.

ఎత్తైన కొండపై నుంచి ఉరికి, ఎన్నెన్నో పాయలుగా చీలి, దారులు చేసుకొని, దవ్వు దవ్వులకు పసిడిమువ్వల సందడితో పరువెత్తు సెలయేటి పాటలను వీరి రచనలతో పోల్చవచ్చు

ఆదికవినుండి నేటివరకూ గల వచన రచనా శిల్పానికి ఆధునిక యుగంలో మెరుగులు దిద్దిన మహనీయులు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు. వారి అడుగుజాడలలో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరశింహం గారు నడిచి, వచన రచనకు నవ్యతను, భవ్యతను కల్పించ గలిగారు

చంపువులే, మన కాదికావ్య మగుటవలన గద్యము మనకు ఆది నుండియూ గలదు. సులభ సంస్కృత సమాస భూయిష్టమైన నన్నయ్య గద్యమును చిన్నయసూరి అందుకొని, ఆ వెలుగుకు మరింత జిలుగు కల్పించె నందురు. తిక్కనార్యుని గద్యము ప్రౌఢదశ నందుకొన్నది శంభుదాసుని వచన మొక క్రొత్తబాట త్రొక్కి, సొగసులు మూట గట్టుకొన్నది

నాచనసోముని వచనములు నాతిదీర్ఘములు బమ్మెరవారి వచనములు సైతము దీర్ఘములే యైనను అలంకారభూయిష్టములు. ఈ మహా

కవుల గంటములనుండి గద్యరచన, బంగారుపంటలు పండినవి. తర్వాత అనేకు లీ ఒరవడిలో తమ శైలులను పరవళ్లు త్రొక్కించి, భాషాయోషామ తల్లికి వెలలేని వచన భూషణము లలంకరించి మురిసిపోయిరి.

వచన రచనలో - కావ్యము, వివర్శనము, వ్యాసము, శాస్త్రము, కథ, చరిత్ర, నవల, ప్రహసనము, సామాన్య వచన మను తొమ్మిది శాఖలు గలవు ఇవి యన్నియు గత శతాబ్దములోనే మొలక లెత్తినవి తొలుత వెలువడిన వచనకావ్యము చిన్నయసూరి నీతిచంద్రిక ఇందు భారతకవుల పోలిక లున్న వందురు.

శ్రీ కోతా శేషాచలపతిగారి "నీలగిరియాత్రాచరిత్ర", శ్రీ ముదిగొండ బ్రహ్మయలింగారాధ్యకవి "శివరహస్యఖండ" అనువాదము, శ్రీ చదలవాడ సీతారామశాస్త్రిగారి "యాత్రాచరిత్ర", శ్రీ సంజీవరాయ శాస్త్రి "దశకుమారచరిత్రానువాదము", బ్రౌనుదొర తాతాచార్యుల కథలు మొదలైనవి యీ సందర్భమున పేర్కొన దగిన వచనరచనలు

విమర్శనకు "అముద్రితగ్రంధచింతామణి" పత్రికకు సంపాదకులుగా నుండిన శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారిని పితామహు డందురు

తర్వాత వచనరచన శాఖ లన్నిటినీ మహనీయులు శ్రీ కందుకూరివారు, వ్యాసరచనకు వీరినే ప్రథములుగా గుర్తింప నగును పంతులుగారు స్వీయచరిత్ర రచనకు పునాది వేసిరి. ప్రకృతిశాస్త్రాదులు, ప్రహసనములు, నవలలు మొదలైన ప్రక్రియలకు శ్రీ కందుకూరివారు పూనుకొనుటలో వారి వచనరచనా ప్రావీణ్యత గోచరించినది. "గద్యకవి బ్రహ్మ" బిరుదు నందిన ప్రసిద్ధ సారస్వతవేత్త శ్రీ వీరేశలింగంపంతులుగారు. అంద రనుసరింప తగిన అద్భుతశైలిని ఆంధ్రభాషకు కానుకగా సమర్పించి ధన్యులైనారు.

చిలకమర్తివారు కందుకూరివారివలెనే రచనలు సాగించినారు వీ రిద్దరు తెలుగు వచన రచనా క్షేత్రమందు జంటకాపులా, పంటకాపులా

చారిత్రాత్మక నవల లనేకము రచించుట కుపక్రమించి ఆ నవలలకు వీ రాదిభిక్ష పెట్టినారు "హేమలత, అహల్యాబాయి, కర్పూరమంజరి" దీనికి నిదర్శనము

నవలారచనకు శ్రీ కందుకూరివారు ఒరవడి దిద్దారు శ్రీ చిలకమర్తివారు ఆ కళను కాణాచిగా చేసుకొన్నారు వీరి నవలారచన ఎక్కువగా సరళ గ్రాంధిక శైలిలో నడిచినది విషయానుగుణ్యముతో నడుపు రసాత్మక వాగ్విధానమే శైలి. శ్రీ చిలకమర్తివారి రచనలలో అతి సుందరమైన శైలి గోచరించును ఏ సన్నివేశము చదివినను, వెన్నెల పసలు దులిపిన ట్లుండును. భాష మలుపులో వారికి గెలుపు లభించిన దనిపించును

ఏదో ఇతివృత్తము నందుకొని ఈతబుట్టవలె అల్లుకొనిపోయి ఒక రూపము కల్పించుట నవల లక్షణముగా ముందుకాలమువారు భావించి ఆ కళకు హాని కల్పింతు రను భయముతో కాబోలు శ్రీ చిలుకమర్తివారు నవలా శిల్పమును ఇంద్రధనస్సు రంగులలో వెలయించి అందించినారు

వీరి నవల లన్నియూ మణిదీపముల వంటివి వీరు చరిత్ర నుండియే చాల నవలలకు ఇతివృత్తములు స్వీకరించినారు మహారాష్ట్రి చరిత్రకు సంబంధించిన అహల్యాబాయి చరిత్ర నాధారముగా తీసుకొని ఒక నవల రచించిరి. వీరత్వము ప్రదర్శించుటలో, దేశభక్తిని వెలార్చుటలో, దేశద్రోహుల, రాజద్రోహుల పన్నాగములకు బదులు చెప్పించుటలో వీరి చిత్రణ మద్భుతము మహారాణి అహల్యాబాయి రాజకీయ చతురత, వీరనారీత్వము చిత్రించుటయే ఈ నవల ముఖ్యోద్దేశము పాఠకులకు చరిత్రయందు, దేశభక్తియందు ఎనలేని భక్తిభావములు కల్పించు ఘట్టము లనేకము లీ నవల యందు గలవు పూర్వచరిత్రను కథారూపమున చిత్రించి, ఆ వైభవమును చిరస్థాయి గావింపవలె నను

ఉత్కంఠ చిలకమర్తివారిలో కలుగుటవలన ఇట్టి ఉత్తమ గ్రంథములు మనకు లభించిన వని గర్వింపవచ్చును

ఇతివృత్తమును స్వీకరించి కథను వర్ణించుచు పోవు పద్ధతిగాక, కథా సంవిధానమును పాఠకుని ఉద్ఘాత లూగించు ఘట్టములుగా విభజించి ముందు జరుగనున్నదానికై ఉత్సుకత, ఉద్వేగము కల్పించుచు వీరు రచన సాగించిరి కొన్నిచోట్ల నాటకములలోవలె పాత్రల ప్రవేశ, నిష్క్రమణలు కల్పించి పాఠకులలో ఆసక్తి నెక్కువ చేయగలిగిరి ప్రథమదశలో నున్న నవలారచనలో వీరు చూపిన ప్రతిభ కొనియాడ దగినది హేమలత యందు సైతము వీరు అలనాటి శౌర్య సంపదను కూర్చుటలో కృతకృత్యులైరి ఈ రెండు నవలలు ప్రాచీన చరిత్రకు పసిడిపూతలు

"సౌందర్యతిలక" పురాణగాథకు చెందిన నవల ఇందలి రచనా సౌలభ్యము, పాత్ర పోషణము వర్ణింప నలవిగానివి నవల ప్రారంభము నుండి పాఠకుని హృదయమును వెంటబెట్టుకొని నడిపించు సన్నివేశము లిందు గలవు "పూలమాల" ద్వారా వీరు కల్పించిన చమత్కృతి అద్భుతము జరాసంధుడు, పాండవులు, యాదవకులచంద్రుడు యిందలి పాత్రలు ఒక పౌరాణిక ఘట్టము నింత సుందరముగా వర్ణించ గలుగుట శ్రీ చిలకమర్తివారికే సాధ్యమగునేమో ననిపించును పాఠకుని హృదయము నమస్కార ముద్రగా మారిపోవును

సౌందర్యతిలక కర్పూరమంజరి తర్వాత చెప్పుకొనతగ్గ స్థానము లలంకరించినవి శ్రీ చిలకమర్తివారి నవలలలో "కర్పూరమంజరి" కి ప్రథమ స్థాన మందురు మరికొందరు "సౌందర్యతిలక" కే ఆ పదవి నందింతురు. అభిప్రాయ భేద మెట్లున్నను ఈ రెండునూ నవలాలోకమున అత్యుత్తమ స్థాన మలంకరించి రచయితకు కర్పూరనీరాంజనము లందించినవి

నవలలను చిత్రించుటలో దేశ చరిత్రను తనివితీర వర్ణించుట వీరి కెంతయో ఇష్టము అహల్యాబాయిలో పేష్వాల కాలమును శాంతము నవలలో వేములవాడ భీమకవి చరిత్రను, తత్కాలాంధ్రకళింగ దేశ చరిత్రలను వీరు చక్కగా చిత్రించినారు అట్లే కృష్ణవేణి నవలలో ఓరుగల్లు సామ్రాజ్య వైభవమును ఆనాటి నాయకుల చరిత్రను విపులముగ వివరించినారు కృష్ణవేణి మనలను గోల్కొండ, ఓరుగల్లు, విజయవాడ నగరములకు కొనిపోయి అచ్చట సాంఘిక, రాజకీయ జీవితములను వివరించి చెప్పును నవల రూపమున దేశ చరిత్రను, చరిత్ర నెపమున సాంఘిక స్థితిని వర్ణించి పాఠకులకు ప్రాచీన వైభవములను విస్మరింపవల దని హెచ్చరించుట జరిగినది

శ్రీ చిలకమర్తివారి "మణిమంజరి" చిన్న నవల కాని ఇందలి ఇతివృత్తము, శైలి పేర్కొన తగినవి విక్రమాదిత్యుని కాలమునకు సంబంధించిన ఒక గాథ నాధారమును చేసుకొని శ్రీ చిలకమర్తివారు "మణిమంజరి" రచించిరి ఇందు అత్యుత్తమ మైన నవలా శిల్పమును ప్రదర్శింప గలిగిరి.

విక్రమాదిత్యుని కొలువునందు ఒకనాడు లాటరాజగు చంద్రకేతుడు దేశమున పతివ్రతలు లేరని వాదించుటయు, విదర్భ నరపాలుడు, మకరందుడు ఆ వాదన ఖండించుటయు, ఇరువురును ప్రాణములు పణముగా పెట్టుటయు ఇందలి ఇతివృత్తము సత్యహరిశ్చంద్ర చరిత్రయందు విశ్వామిత్ర వశిష్ఠుల ప్రతిజ్ఞను జ్ఞాపకము చేయు ప్రారంభమీ నవల యందు గానవచ్చును.

పాత్ర పోషణలో, శాస్త్ర చర్చలో, ధర్మనిరూపణలో—— మణిమంజరి మధుర వీణగా నిలువ గలిగినది మగువల సౌశీల్యమును శంకించు చంద్రకేతుని వంటి హీనులకు గుణపాఠము మణిమంజరి ఇట్టి నవలలు మనకు అరుదు. మణిమంజరి పార్యగ్రంథము వంటిది

సాంఘిక ప్రమాణ గ్రంథము వంటిది మహిళాలోకమున కా మహాకవి అందించిన అద్భుతమైన కానుక

వీరు ఒకటి రెండు అనువాదములు కూడా వ్రాసినారు Colonal Tod రచించిన 'Annals of Rajasthan'' అను గ్రంథమును "రాజస్థాన కథావళి" అను పేర ననువదించిరి ఇది వీరరసపూరితమైన గ్రంథము జాతి, దేశాభిమానములను పురికొల్పు ఘట్టములతో నిండియున్నది రాజస్థాన కథావళి పాఠకుని హృదయములో ఉడుకు రక్తము ప్రవహింప జేసి దేశమునకై సర్వత్యాగము చేయుటకు సంసిద్ధత కల్పించు ఈ గాథలను చిలకమర్తివారు ఉద్రేకముతో వ్రాసి పాఠకులకు ఉడుగరగ సమర్పించినారు

రమేశ్‌చంద్రదత్తు వంగ, ఆంగ్ల భాషలలో రచించిన 'Lake of Palms'' అను నవలను చిలకమర్తివారు 'సుధాశరచ్చంద్రీయ"మను పేర అనువదించి మూలమున కెంతో ఖ్యాతి నందించిరి

వీరు జీవిత చిత్రములు చిత్రించుటలో కూడా సిద్ధహస్తులు మహాపురుషుల జీవిత చిత్రములు కొన్నిటిని శ్రీ చిలకమర్తివారు రచించిరి ఇందు మహాభక్తుడైన నందచరిత్ర పేర్కొన దగినది వీరిలో గల ఆధ్యాత్మిక చింతనా పారవశ్యమున కీ చిన్న గ్రంథము తార్కాణముగ పేర్కొనవచ్చును కొందరు అభిమానుల కోరికపై తమ స్వీయచరిత్రను కూడా వెలువరించినారు ఇది ఆచర్యప్రాయ మైన గ్రంథము.

మన ప్రాచీన సంపదను, సంస్కృతిని వెలార్చు ఘట్టములను చూచి, మురిసి, వాటిని మణిహారములుగా మార్చి, ప్రజల కందీయవలెనను ఉత్సుకత చిలకమర్తివారిలో కొల్లలు ఎంత చిన్ని ఇతివృత్తమైనను వారి చిత్రణలో అతి సుందరరూపము దాల్చి పాఠక హృదయములకు ఉత్తేజము కల్పించుట చిలకమర్తివారి ప్రత్యేకత విక్రమాదిత్యుని కాలమునకు చెందిన ఒక విచిత్రసంఘటనతో చిత్రించిన "సువర్ణగుప్తుడు" అను చిన్ని పొత్తము దీనికి ఉదాహరణము.

వీరీ ఆశయముతోనే భారత కథామంజరి వ్రాసి పాఠకులకు అందించిరి ఇందలి కథ లన్నియూ అనంద మను పేరిటి దారమునకు చుట్టి విడువగల పసిడి బొంగరములు.

వీరు రచించిన విష్ణువర్ధను డను చిన్న గ్రంథము చాళుక్యరాజులకు విష్ణువర్ధనులను నామ మెట్లు వచ్చినదో తెలియజేయు చక్కటి గాధ ఆ రాజ వంశమునకు మేలుచేసిన విష్ణుభట్ట సోమయాజి త్యాగ మహిమను వర్ణించుటలో చిలమర్తివారు ఎంతో తన్మయు లైరి

భారతము నంతయు వచనరూపమున చిత్రించవలయు నను మహా సంకల్పమును కలిగినది వీరికి దానికి మచ్చుతునకగా విరాట పర్వమును తేటతెలుగు వచనమున ముత్యాలమూట కట్టినారు పురాణేతిహాసముల నుండియు, చరిత్ర నుండియు కొన్ని చమత్కార ఘట్టములను స్వీకరించి "చమత్కారమంజరి" అను పేర రెండు సంపుటములను వ్రాసినారు ఈ రచనలో వ్యక్తుల మేధస్సంపన్నత సమయస్ఫూర్తి విజ్ఞానము కొల్లలుగా కనిపించును పిల్లలకు ఈ గ్రంథములు ఎంతయో పఠనాసక్తిని కల్పించగలవు

చిలకమర్తివారు అనేక ఏకాంకికలు వ్రాసిరి అప్పటి కింకను ఏకాంకికలు తలయెత్తలేదు కాని కందుకూరితో పాటు చిలకమర్తివారు కూడా ఏకాంకికలు కొన్నిటిని రచించిరి. సంఘమున పాతుకుపోయిన దురాచారములను, దుస్తంత్రములను ఏకరువు పెట్టుట కొరకే ఈ రచనలు సాగింపబడినవి. వీరి ఏకాంకికలలో ఆత్మగౌరవము, గయ్యాళి గంగమ్మ, బధిరచతుష్టయము, బలవంత బ్రాహ్మణార్థం మొదలయినవి చమత్కార రచనాస్ఫూర్తికి నిదర్శనములు

వీరు నవ్వులు కురిపించే హాస్యచిత్రణలు కొన్నిటిని కలిపి నవ్వులగని అను పేరున ముద్రించిరి వీరిలో ఎంతటి వ్యాఖ్యానము ఉన్నదో అంత వ్యంగ్యోక్తి ఉన్నది. ఎంతటి భావగంభీరత కలదో అంతటి హాస్య మున్నది. నిజమునకు హాస్యము కూడ మరి ఒక మూసలో

కరగబోసిన పాండితీప్రకర్షయే గదా! వీరిలో గల ఈ ప్రత్యేకతను ఆనవాలుగా గణపతి పేర్కొనవచ్చును గణపతిలో వీరు ప్రదర్శించిన వ్యంగ్యము, హాస్యము మిత్రపోషణ పటవరుల నెంతగనో ఆకర్షించి నవి ఆంధ్రసారస్వతములోని హాస్యరస ప్రకరణ మందు గణపతికి గణనీయమైన స్థానము గలదు

చిలకమర్తివారి బహుముఖ సారస్వత సేవకు ఆనవాలుగా కళా ప్రపూర్ణ బిరుదు నందుకొన గలిగిరి. ఇది వారికి అందించిన కనీస గౌరవము శ్రీ నరసింహముగారు సరళగ్రంథశైలిని ప్రోత్సహించుటలో అగ్రగాములైనారు.

ఆంధ్రసారస్వతపరిషత్తు అధ్యక్షపీఠమునుండి వీరీ శైలిని గూర్చి వేసిన శంఖారావము మరువరానిది కేవలము ప్రచారము చేయుటే కాదు - తమ కలము ఈ శైలిని పన్నీటి నెలవేళ్లగా ప్రవహింపచేసిన సార్థక జీవులు చిలకమర్తివారు వచనరచనా ప్రావీణ్యతను వివిధ రీతులుగా వివరించి సాహిత్య లోకాన్ని మేల్కొలిపిన దివ్య వైతాళికులు శ్రీ చిలకమర్తివారు

భారత సాంస్కృతిక సంప్రదాయములను శౌర్యపరాక్రమ సంపదలను వెలువరించి వెలుగుతోరణము అల్లిన తెలుగుతల్లి ముద్దుబిడ్డలు చిలకమర్తివారు.

అంధు లయ్యును తమ రచనచే దేశమునం దలముకొన్న గాఢాంధకారమును తొలగించి, వెన్నెలరేఖలు ప్రసరింపజేసిన నెలరాజువంటివారు చిలకమర్తివారు

పున్నయ నామధేయమున చెలువొంది లక్ష్మీనరసింహముగా మారిన ఈ మహనీయుని భాషాసేవ ఎన్నటికిని మరువరానిది ఎవరునూ గెలువజాలనిది వారి వచనరచనా విపంచిని కదలించి వినిపించిన రాగ లేశ మీ వ్యాసము.

—*—